అంతర భారతీయ పుస్తకమాల

# చిక్కవీర రాజేంద్ర


మూలం:

శ్రీనివాస
(మాస్తి వెంకటేశ అయ్యంగార్)

అనువాదము:

అయాచితుల హనుమచ్ఛాస్త్రి





నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ప్రథమ ముద్రణ : 1973 (శక 1895)
ద్వితీయ ముద్రణ : 1990 (శక 1912)



**రూ. 28.00**

*Original Title in Kannada* Chikkaveera Rajendra
*by 'Sreenivasa'*

*Telugu Translation* Chikkaveera Rajendra

డైరక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
ఎ-5, గ్రీన్ పార్కు, కొత్త ఢిల్లీ-110 016 చే ప్రచురింపబడినది

# పీ ఠి క

ఆధునికమైన కన్నడ 'నవలా' సాహిత్యం సుమారు డెబ్బైఅయిదు సంవత్సరాల చరిత్ర కలిగివుంది. కెం. వు. నారాయణకవి రచించిన 'ముద్రా మంజూష' (1823 క్రీ. శ.) తో ఓవిధంగా 'నవలా' ఛాయలు కానవస్తున్నా, నిజానికి కన్నడంలో మొదటినవలగా మనం గుల్వాడి వెంకటరాయలుగారి 'ఇందిరాబాయి' లేక 'సద్ధర్మవిజయ' అను కృతిని, (1899 క్రీ. శ.) పరిగణించాలిసివుంటుంది. రచయిత తాను ఈ కృతిని 'సత్యమూ, హృదయనైర్మల్యమూ, ఇవి రెండే మనకు ఇహపరముల రెంటనూ, సార్థకమైన సాధనలు' అని ప్రమాణీకరించడానికి రచిస్తున్నట్లు పుస్తకం పీఠికలో వ్రాసివున్నారు. ఈ కృతిలో కళావక్షం వెనక బడిపోయింది. దీనిలో ప్రతిపాదితమైనవస్తువు సాంఘికమనీ దీనిలో సంఘాన్ని సంస్కరించాలనే తహతహ ఉత్కటంగా కానవస్తోందనీ మనం ప్రధానంగా గమనించాల్సిన అంశాలు.

అప్పటికప్పటికే కన్నడిగులు 'నవలా' రూపపరిచయాన్ని అనువాదాలమూలంగా సంపాదించివున్నారు.

బి. వెంకటాచార్యగారు బంకించంద్రుల 'దుర్గేశనందిని' అను నవలను కన్నడించివున్నారు (1885 క్రీ. శ.) ఆచార్యులవారిశైలి సంస్కృతజటిలమైన క్లిష్టశైలి. మరాఠీభాష నుండి హరినారాయణ ఆప్టేగారి నవలలను కన్నడమునకు అనువదించిన గళగనాథుల శైలి సరళమూ, వ్యావహారికభాషకు సన్నిహితమూ అయివుంది. అయితే శైలిలో వైవిధ్యమంటూలేదు. దేశంయొక్క ప్రాచీనవైభవప్రాభవాల్ని, వీరుల సాహసగాథల్ని త్రవ్విపోసి, దేశాభిమానాన్ని పఠితలలో రేకెత్తింపజేయడమే ముఖ్యోద్దేశంగా గలవారు బంకించంద్రులూ, ఆప్టేగారూకూడా: ఇటీవల చారిత్రకనవలలను రచించిన అ. న. కృ: త. రా. సు. మొదలైనవారు తాదృశాభిమాన ప్రేరితులే.

నవలగా మనం నిరాటంకంగా గుర్తింపదగిన తొలిరచన ఎం. ఎస్. పుట్టణ్ణగారి 'మాడిద్దుండో మహారాయ, (1915) అనేది. ఇందులోనూ మితిమీరిన ఆదర్శవాదం, ఉపదేశధోరణీ కనబడుతున్నా పెక్కు సంఘటనలను పెనవేసికొనివున్న జటిలమైన కథావస్తువు ఉంది. రాజాస్థానంమొదలు దొంగలు, లఫంగులు మొదలైనవారి జీవితాలతోసహా, వైవిధ్యమయమైన సాంఘికజీవితం ఇందులో చిత్రితమైంది. ఆధునిక కన్నడ 'నవలా' వాఙ్మయంలో, ప్రారంభంలోనే పల్లెటూరిజీవితాన్ని ప్రతిబింబింపజేసే రచన రావడం విస్మయావహమైన అంశం: 1915 క్రీ. శ—1947 క్రీ. శ. ల మధ్యకాలంలో సుమారు ఒక వంద నవలలు వెలుగు చూశాయి అని చెప్పవచ్చు.

నవోదయకాలం (1918-1945 క్రి. శ.) లోని 'నవలా' రచయితలు అందరూ సామాన్యంగా నగరవాసులైన విద్యావంతులు. చదువరులుకూడా చాలవరకు ఆ శ్రేణికి చెందినవాళ్లే. పత్రికలు చాలతక్కువ. అవి సాధారణంగా నవలలను ధారావాహికంగా ప్రకటించే గోడుకు పోవడంలేదు. ఈ కాలమందలి నవలారచయితలు ఇంగ్లీషులోని, సంస్కృతంలోని సాహిత్య విమర్శతో అలంకారశాస్త్రాలతో పరిచయమున్నవాళ్లే. గాంధీగారి కీర్తిప్రభావాలు దేశం నలుమూలలా వ్యాపిస్తున్నకాలం. రచయితకూ, పఠితకూ సమానమైన పృష్ఠభూమి (Background) ఏర్పడి, ఉండడంచేత, ఇద్దరికీ అంగీకృతంగావున్న జీవనమూల్యాలు వుండడంచేత, రచయితల పని సులభమైంది. ఈ యుగంలో పుట్టిననవలల్లో - జీవితం సార్థకం ఎలా చేసుకోవడం, వ్యక్తిసంఘంలో ఓ భాగంగావుంటూ తన వ్యక్తిత్వాన్ని ఎలా వికసింపజేసికోవడం, తోటి సమాజానికి తాను ఏవిధంగా ఉపయోగపడడం, అనే మౌలికములైన ప్రశ్నలు అంతర్గతంగా వుంటూ, చర్చింపబడుతూ వచ్చాయి. వీనిలో వాస్తవికజీవితం అసంపూర్ణంగామాత్రమే చిత్రితం. భారతదేశంలోని పరంపరాగతంగా వస్తూవున్న మూల్యాలను (Values) ఒప్పుకొని, దాని సంస్కృతి అనే చొకట్టు (frame) లో, వ్యక్తికీ సంఘానికీ వుండే సంబంధబాంధవ్యాన్ని, రెండింటి సార్థక్యాన్ని దర్శించినవాళ్ళు ఈ యుగరచయితలు. అందుచే ఈ యుగంలో పుట్టిననవలల్లో ఆ వేగోద్వేగాలు గాని, క్రాంతి కోలాహలాలుగాని లేవు. రచనా తంత్రానికి (technique) కూడా వాళ్ళు హెచ్చుప్రాధాన్యాన్ని ఇవ్వలేదు. భాషాప్రయోగంలో గూడా పెనకటిప్రభావాన్ని తప్పించుకోవాలనేసమస్య నవోదయరచయితల్ని ఎదుర్కోలేదు.

నవోదయకాలంలోని నవలలు, మనలను ఆశ్చర్యముగ్ధుల్ని చేసేటంత వైవిధ్యం, ఔన్నత్యం సాధించుకొన్నాయి. ఆధునిక కన్నడ గద్య సాహిత్యప్రారంభంలోనే 'శ్రీనివాస' గారు (డా॥ మాస్తి వెంకటేశ అయ్యంగారు) వ్యావహారికభాషకు సన్నిహితమై, సరళమై, అట్లాయినా గాంభీర్యం సముపార్జించుకొన్న శైలిని, నిర్వహించివుండడం మనల్ని విస్మయావిష్టులనుజేసే విషయం. శివరామ కారంతగారు వ్రాసిన నవలలు కళాప్రామాణ్యానికి నిదర్శనాలు. జీవితం స్వీకరించదగింది, జీవితం సార్థకమైంది, జీవితాన్ని అంతకంతకూ మెఱుగులు పెట్టుకుంటూపోవాలి అనే నమ్మకంతో నవోదయకాలానికిచెందిన కారంతగారు అనుభవాన్ని రంగరించి, పరీక్షించి, నిగ్గు తేల్చడంలో, సారాన్ని వడపోయడంలో నవ్యయుగానికే పన్నులైన రచయితలయ్యారు.

[1] 'దేవుడు' వ్రాసినది స్వల్పం. అయినా వారు రాసిన ఒక్కొక్కకృతీ పాఠకునిలో ఔత్సుక్యం రేకెత్తింప సమర్థమైవుంది. 'మయూర' కన్నడంలోని ఆరంభదశకు చెందిన చారిత్రకనవలల్లో ఒకటి. 'అంతరంగ' అనే నవల మనోవిశ్లేషణానికి దారితీసింది. 'మహా

1 దేవుడు నరసింహశాస్త్రిగారు అని పూర్తిపేరు. ఆంధ్రభాషీయులై కన్నడభాషా సేవ చేసినవారు—అనువాదకుడు.

బ్రాహ్మణ' 'మహాక్షత్రియ' 'మహాదర్శన' అనే కృతుల్లో దేవుడుగారు తమ అగాథపాండి త్యానికి అపూర్వమైన తేజస్సు చేకూర్చారు. ఉపనిషత్తులను, పురాణాల్ని, భారతాన్ని పునా రచన చేసారు. కారంతగారు, దేవుడు, 'శ్రీరంగ'—వీరిలోని బౌద్ధికప్రతిభ వేరువేరు విధాలుగా ప్రకటితమైంది. 'శ్రీరంగ'లో వైచారికతకు ప్రాధాన్యం హెచ్చు. [1] కు. వెం. పు. మరో గొప్ప నవలారచయిత. 'కానూరు సుబ్బమ్మ హెగ్గడితి' (1936 క్రీ. శ.)లో యథార్థ వాదం, ఆదర్శవాదం, సంపూర్ణంగా మిశ్రితంగాక నాయకుడైన హూవయ్యపాత్ర పేలవంగా వుండిపోయింది.

'మలెగళల్లి మదుమగళు' అనే నవల (1966 క్రీ. శ.)లో, జీవితానుభవాన్ని నలువైపుల నుంచీ స్వీకరించి, సంతులితంగా కానవచ్చే వాస్తవికత వుంది. ఒకగ్రామాన్నే నాయక పదవిలోవుంచి, విస్మయంగొలిపే కళాత్మకతతో, దాని అదృష్టంలోని ఆటుపోట్లను చిత్రించిన నవల రావుబహద్దూరిగారి 'గ్రామాయణ' అనేది.

నవోదయయుగానికి చెందిన నవలారచయితలవలెనే తమ కలాల్నిసాగించి మంచి నవల లను అందించినరచయితలు ఇంకా పలువురున్నారు. కడంగోడ్లు శంకరభట్టు, ఎం. ఆర్. శ్రీనివాసమూర్తి, ఆనందకంద, రం. శ్రీ. ముగళి, కృష్ణమూర్తి పురాణిక, ఎం. ఎ. సీతా రామయ్య, నాడిగేర కృష్ణరావు, మర్జా అణ్ణారావు, భారతీసుత 'నారాయణరావు' వీరిలో కొందరు. వి ఎం. ఇనాందారు రాసిననవలలు బౌద్ధికతతోబాటు హృదయానుకంపాన్ని పంచి పెడుతున్నాయి.

1934 క్రీ. శ. లోనే రెండు నవలలను 'జీవనయాత్ర' 'ఉదయరాగ' ప్రకటించిన అ. న. కృ. (అ. న. కృష్ణరావు) ముప్పైఏడు సంవత్సరాలలో నూటపన్నెండు నవలలు వ్రాశారు. అభ్యుదయవాదాన్ని ప్రవర్తింపచేసినవారూ వీరే. 1940 క్రీ. శ. తర్వాత ఇంగ్లీషు కుంచికను వాడి కన్నడరచయితలు పలు సాహిత్యభాండారములకు కవాటాన్ని తెరిచారు. ఫ్లేబేర్, మొపాసా, ఇబ్సన్ మొదలైన ఐరోపారచయితలదేగాక, కమ్యూనిష్టురష్యాకుచెందిన మ్యాక్సిం గోర్కీ మయకోవిస్కీల ప్రభావముద్ర ఈ రచయితలపైన ఎంతైనా కద్దు. అఖిల భారత ప్రగతిశీలరచయితల సంఘంఒకటి స్థాపింపబడిన సమయం ఇది. స్వాతంత్ర్యం దగ్గర వద్దకొద్దీ వ్రాయసగాండ్రదృష్టి అచ్చితంగా సంఘంయొక్క స్థితిగతులవైపు తిరిగింది. సాహిత్యసృష్టి, పల్లెటూరి జీవితంగడిపే రచయితల్ని ఆకర్షించింది. కుటుంబజీవిత వాతా వరణం మారి, రచయితలకూ, చదువరులకూ, శాస్త్రపురాణాలకూ మధ్య దూరం పెరిగి పోయింది. భారతీయ జీవితమౌల్యాల్ని చాలవరకు ఈ రచయితలు గాంధీజీవంటి పెద్దల జీవితంలోనూ, సంప్రదాయాలలోనూ దర్శించారు. ఈ యుగంలో వరితలసంఖ్య పెరిగి

---

1 కు. వెం. పు = కె. వి. పుట్టప్పగారు. వీరు రచించిన 'శ్రీ రామాయణదర్శనం' అను కావ్యంపై భారతీయజ్ఞానపీఠంవారి పారితోషికం వీరికి లభించింది.

పోయింది. ఈ ఎల్ల అంశాల ప్రభావం ప్రగతిశీలురైన రచయితలపై పడింది. సాహిత్యం జీవితాన్ని సృష్టించేశక్తిగా రాణించాలి, సౌందర్యసృష్టి రసానుభవాలపేరిట జీవితంలోని కుళ్ళునూ, అషాఢభూతితనాన్ని తక్కువచూపు చూడకూడదు. నిస్సంకోచమైనట్టివీ, నిష్ఠురమైనట్టివీ వాస్తవికతను ప్రతిపాదించడమే సాహిత్యానికి సరైన పునాది అని అభ్యుదయవాదుల వాదం. దీర్ఘాలైన తొలిపలుకులూ, ఎక్కువపుటలను కలిగివుండేటటువంటి నవలలను పుంఖానుపుంఖంగా వ్రాసే సంప్రదాయాన్ని అ. న. కృ. ప్రారంభించారు. ఎన్నోసార్లు అభ్యుదయపంథాకుచెందిన నవలల్లో కళ వెనకంజవేయడం, శైలి ఉపన్యాసధోరణి బట్టడం, పాత్రలు ప్రాతినిధ్యంవహించి మాట్లాడడం, నవలారచయిత వకీలుగా మనముందు నిలబడడం లాంటివి జరిగాయి. కాని ఈ పంథాకుచెందిన వాళ్ళుకూడా 'సంధ్యారాగ' ([1]అ. న. కృ.) 'చందవళ్ళియ తోట' 'బిడుగడెయ బేడి' (త. రా. సు.[2]) 'జ్వాలాముఖియమేలె' (బసవరాజ కట్టిమని) 'సర్వమంగళ' (చదురంగ)—వంటి ఎన్నో గమనార్హాలైన నవలలను మనకందిచ్చారు.

అభ్యుదయాందోళనం ప్రారంభంలో, రేగిన ఉద్వేగపూర్ణమైన చర్చలలో, పరిస్థితియొక్క యథార్థస్థితిని గమనించడం కష్టమైంది. అభ్యుదయరచయితలు వెనకటితరంవారిని సంప్రదాయబద్ధులనీ, మడికట్టుకొన్నవారనీ, ఛాందసులనీ విమర్శించినా, నిజానికి తామైనా ఆ వెనకటివారికంటె, సుతరాం, భిన్నమార్గాన్ని అవలంబించినవారు కారు. జీవితాన్ని బాగుపఱచుకోవాలి అనేవిషయంలో, వెనకటితరంవారికీ, ఈ అభ్యుదయవాదులకీ ఎట్టి అభిప్రాయభేదమూ లేదు. అభ్యుదయవాదులు, సమాజసంస్కరణనుగురించి సాహిత్యం సాక్షాత్తు మాటిగా సాధింపదగివున్న పరిణామాల్నిగురించి ఒత్తి చెబుతారు. నవోదయకాలంలోని నవలాకారులకుగానీ, అభ్యుదయరచయితలకుగానీ, మూల్యాన్వేషణం అవసరం కాలేదు. స్వీకరింపదగిన, అసంపూర్ణంగావున్న సామాజికజీవితాన్ని ప్రశస్తం చేసుకోవాలనడంలో ఎటువంటిసందేహమూలేదు. వారికీ చదువరులకూమధ్య సంవహనసమస్య (Comunication Problem) తలెత్తలేదు. ఈ రెండుయుగాల నవలాకారులూ, చారిత్రకనవలా మాధ్యమాన్ని (Medium) మొత్తంమీద భారతదేశ వైభవదర్శనానికి, మహావ్యక్తులచరిత్ర చిత్రణానికి అనువుగా ప్రయోగించివుండడం, మనం గమనించవలసిన అంశం.

1952-53 క్రి. శ. నాటికి కన్నడసాహిత్యంలో నవ్యమార్గం ఒకటి ప్రారంభమైంది. స్వాతంత్ర్యంవచ్చిన కొద్దిఏండ్లకే - గాంధీ మరణానంతరం - దేశంలో కానవచ్చే నైతిక పతనం, వివేకవంతులకు దిగ్భ్రమ కలుగజేసింది. పనివాండ్రబస్తీలు పెరిగి పారిశ్రామికుల సమస్యలు తల చూపిందీకాలంలో. విద్యకోసమై, ఉద్యోగులకోసమై వెదకుకుంటూ కుటుంబం

1 అ. న. కృ = అ. న. కృష్ణరావు.

2 త. రా. సు = త. రా. సుబ్బారావు.

-లోనివారు నలుమైపులా చెల్లాచెదరైపోవడమూ, ఈకాలంలో ఎక్కువైంది. విజ్ఞానం, యంత్రజ్ఞానం, మనస్తత్వశాస్త్రం, వీటిప్రభావం ఈకాలంలో హెచ్చైంది. టి. యస్. ఇలియట్ ఒక్కడేగాక శామ్యూల్ బెకెట్, స్ట్రిండ్‌బర్గ్, కామూ మొదలైన పాశ్చాత్యరచయితల ప్రభావముద్ర అంకితమౌతూవున్నకాలం. అనుపూర్విగా వస్తూవున్న జీవనమూల్యాల్ని స్వీక రించడం, విచారశీలి అయినవ్యక్తికి కఠినసమస్యగా పరిణమించింది. తనకుతానై తన జీవిత మూల్యాల్ని వాటిఅర్థాన్ని నిర్ధరించుకోవాల్సినస్థితి ఏర్పడింది. వెనకటియుగానికి చెందిన నవలాకారులలో గోచరమయ్యే ఆదర్శవాదం వీరిలో లేదు. మనుష్యస్వభావంలో కామం ప్రధానప్రవృత్తి అవడంచేత, నవ్యరచయితలు మాటిమాటికి దాన్ని విశ్లేషించడానికి పూను కొన్నారు. సాహిత్యకృతి అనుభవాన్ని అంతర్లీనంచేసికొని, అర్థం చేసికోవడానికి తోడ్పడే సాధనమాత్రమే అతనిదృష్టిలో. తన అనుభవవైశిష్ట్యం, భాషాపరిమితి ఈ రెండుకారణాల చేతా నవ్యరచయిత అనివార్యంగా సంకేతపదాల్ని వాడుకొంటూవచ్చాడు. అంచేత నూత్న 'నవలా' రచనలో కథపైకంటె రచనావిధానంపై మోజు ఎక్కువ. 'నవ్యయుగం'లో ఆధునిక కన్నడసాహిత్యంలో తొలిసారిగా, జీవితం గందరగోళమయం అనే భావం కనబడు తుంది. సాహిత్యం చదవడం కష్టం. కృతులూ, కావ్యాలూ అర్థంకావడం అంత తేలికకాదు అనేమాటా వినవచ్చింది.

శాంతినాథ దేసాయిగారి 'ముక్తి' యశవంతచిత్తాలగారి 'మూరుదార్లు' (స్ట్రిండ్‌బర్గ్‌గారి 'క్యాజిల్స్ ఇన్ ది స్కై' అనేకృతిని జ్ఞప్తికిదెచ్చే) లంకేశగారి 'బిరుకు' (ఇటీవల వివాద గ్రస్తమైన) అనంతమూర్తిగారి 'సంస్కారం' నవ్యనవలల్లో ముఖ్యంగా పేర్కొదగ్గవి.

ఈ యుగాన్ని 'నవ్యయుగం' అని పిలిచినా, ఈ నవ్యపంథాకు చెందని ఎందరో రచ యితలు, ఉత్తమశ్రేణికిచెందిన నవలల్ని ఇటీవలికాలంలో వెలయించారనేసంగతి మరచిపో దగ్గదికాదు. ఉదాహరణకు బల్లాళ, మోకాశిగారలు ఏ వర్గానికీ చెందనివాళ్లు. ఇటీవలి నవలా కారులలో అతి సమర్థులనిపించుకొన్న ఎస్. ఎల్. భైరప్పగారి 'వంశవృక్షం' 'సాయనెరళు' 'గృహభంగ' వంటి నవలలో కారంతగారిలో గోచరించే గట్టిఅనుభవం, నిర్లిప్తత, ప్రామాణి కత్వం కానవస్తాయి. దివంగతురాలైన 'త్రివేణి' మనస్తత్వశాస్త్రాన్ని నవలల్లో చొప్పించి కొత్తదారి త్రొక్కారు. ఎం. కె. ఇందిరా, అనుపమా నిరంజన మొదలైన పలువురు మహి ళలు చాల చక్కని నవలాసాహిత్యం ప్రసాదించివున్నారు.

ఏవిధంగాచూసినా నవోదయ రచయితలలో ప్రథమశ్రేణికి, ప్రథమపంక్తికి చేరినవారు, నేడు ఎనభై ఒక్కటవఏట కాలిడిన 'శ్రీనివాస' గారు (మాస్తి వేంకటేశయ్యంగారు). చిన్న కథ అనే రచనాతంత్రం వీరికోసమే ఎదురుచూసిందా అన్నట్లు దాన్ని బహువిధాలుగా ప్రయోగించి కన్నడంలో చిన్నకథకు జనకులు అనిపించుకొన్నారు. సుందరములైన కథా కవిత లల్లివున్నారు. 'సునీత'లోనూ పరళ రగళ వృత్తంలోనూ నూత్నప్రయోగాలుచేసిన

మొదటికవుల్లో ఒక్కరు. 'యశోధర' 'కాకనకోట' వంటి సొగసైన నాటకసృష్టి చేసారు. విమర్శవ్యాసా లెన్నో వ్రాశారు. కన్నడసాహిత్య సమ్మేళనాధ్యక్షులూ, కన్నడసాహిత్య పరిష దధ్యక్షులూ అయివున్న 'మాస్తి' సాహిత్య అకాడమీవారి పారితోషికాన్ని పొందివున్నారు.

గద్యంలోని కల్పనాసాహిత్యం (fiction) లో చిన్నకథకంటె విస్తారమైన అయామాన్ని (Canvass) 'శ్రీనివాస' మూడుసార్లు వాడారు. సుబ్బణ్ణ (1926 క్రి. శ.) ఒక నవలిక. చెన్న బసవనాయక (1949 క్రి. శ.) 'చిక్క వీరరాజేంద్ర' (1956 క్రి. శ.) ఈ రెండూ చారిత్రక నవలలు.

సుబ్బణ్ణకథ నడిచింది చాలామట్టుకు వెనకటి మైసూరుసంస్థానానికి సంబంధపడి, పంథొమ్మిదవశతాబ్దం పూర్వార్ధంలో. సుబ్బణ్ణ సంగీతంచేతనే జీవితపరమార్థాన్ని దర్శించి స్థితప్రజ్ఞను సాధించినవాడు. ఆయనజీవితంలో కలిసిపోయినపత్ని లలిత; కృతిపూర్వార్ధంలో వ్యష్టమైన ఘర్షణమూలకంగా కథ ముందుకు సాగుతుంది. కొడుకునకు సంగీతమంటే వ్యసనం. సంస్కృతంలో గట్టి పండితుడైన తండ్రికి సంగీతమంటే తిరస్కారభావం. అంచేత తండ్రికొడుకులు పరస్పరం దూరమౌతూపోతారు. సుబ్బణ్ణతల్లి చెడ్డదేమోకాదు. అయితే ఆమెలో మొండికితిరిగిన స్వాభిమానం, అత్త అనే అహంభావం పెనగొనివున్నాయి. పారిజాతంలాంటి పిల్ల లలితమ్మ కాలుపెట్టిననాటినుంచీ తల్లీకొడుకులమధ్యకూడా పొరపులు బైలుదేరతాయి. సుబ్బణ్ణతండ్రి ఇంటిని విడిచిపెట్టేదాకా కథావ్యాపారం బాహ్యజగత్తు మానసికజగత్తూ రెండింటిమధ్య సాగుతుంది. బైటిసంఘటనలమేరకూ ఆసక్తి ప్రేరేపిస్తూ నడుస్తుంది. ఆ పిమ్మట అంత స్పష్టంగా గోచరించేసంఘర్షణ ఏమీలేదు. సుబ్బణ్ణగారినుండి సాంసారికబంధాలు పెక్కులు తమకు తామై నశించిపోవడం (కొడుకుమరణం, కూతురు మృతి, పెండ్లాం కన్నుమూయటం, తల్లీ, తండ్రీ అందరూ గతించినసంగతి తెలియడం) కావి తాము బంధనాలనుండి విముక్తి చెందాలనుకొనేవేళకు కొత్తబంధాలు సృష్టికావడం, క్రమంగా ఆయనమనస్సు క్రుంగిపోవడం, దీన్ని ఉత్తరార్ధంలో చూడవచ్చు. సంఘర్షణకు మారుగా ఆయన చేతస్సుకూ, ఆవరణకూ సంబంధం మారుతూవుండటం మనం చూస్తాం.

సుబ్బణ్ణ సాధించినసిద్ధికీ, లలితమ్మసిద్ధికీ గల వ్యత్యాసం సూచితమౌతూవుంటుంది. 'సుబ్బణ్ణ' ద్వారా కన్నడకథ సాహిత్యం చరిత్ర ప్రారంభంలోనే బైటిజగత్తులోని ఘటనలకూ, అట్టే ప్రాధాన్యం లేకుండాపోయి, పాత్రకూ అంతర్జగత్తులోని పరిణామాలకూ ప్రాధాన్యం ఏరడ్పినట్లైంది. కథావ్యాపారంతోబాటు పెరిగేపాత్రను చిత్రించడమైంది. తేట్తో, నిరాడంబర మయినా గంభీరమైన గద్యశైలి కన్నడభాషకు లభించింది.

చెన్నబసవనాయక గురించిన ఆలోచన 1920-21 క్రి. శ. లోనే 'శ్రీనివాస' గారికి వచ్చింది. దక్షిణభారతంలో మైసూరుసంస్థానానికి దగ్గిరగావున్న బిదనూరు అనే చిన్న సంస్థా నానికి ఉత్తరాధికారియైన యువకుడు చెన్నబసవనాయకుడు ఈ నవలలోని కేంద్రవ్యక్తి.

కథావ్యాపారం నడిచింది పద్దెనిమిదవశతాబ్దం మధ్యభాగంలో. పెద్దనాయకుడు గతించాడు. చెన్నబసవనాయకుని తల్లి వీరమ్మాజీ, రాజభవనంపై పెత్తనంవహించిన నంబయ్య అనే వానికి ఎక్కువ చనువిచ్చింది. లోకులు కాకులై అనేకవిధాలుగా చెప్పుకోవడం ఆరంభించారు. నాయకునికి మనోవ్యాకులం. ఊరిపెద్ద నేమయ్య తమ్మునికూతురు శాంతవ్వ నాయకునిభార్య. రాజ్యసూత్రాలు వైయక్తికజీవితాల ఆటుపోటులతోచేరి విడరాని ముళ్ళుగా ఏర్పడిపోయాయి. గర్భిణీస్త్రీని భైరవదేవునికి బలిఇస్తే అంతా శుభంకాగలదనిచెప్పి శాంతవ్వ తానే బలిఔతుంది. నాయకుడు చచ్చిపోతాడు. బిదరి మైసూరు సర్వాధికారి హైదరాలి కైవసమౌతుంది. నాయకుడు ఇంకా వస్తాడనేనమ్మకం నేటికీ లోకం పాడుకొనేపాటల్లో వ్యక్తమౌతుందనేమాటతో నవల ముగింపుకు వస్తుంది.

ఈ నవలలో వీరమ్మాజీ, చెన్నబసవనాయకుడు, హైదరాలి, ముమ్మడి కృష్ణరాజా, నంబయ్య మొదలైనవాళ్లు చారిత్రకవ్యక్తులు. నేమయ్య, శాంతవ్వ మొదలైనవాళ్లు కల్పిత వ్యక్తులు. బిదనూరు మైసూరురాజ్యాల ఉత్థానపతనాలకు సంబంధించినంతవరకు కథ చాల వరకు చరిత్రపైనే ఆధారపడివుంది. జనులనోట్లోపడి వస్తూవున్న జనశ్రుతులూ, వదంతులూ, పుక్కిటిపురాణాలూ మొదలైనవాటిని వాడుకోటం జరిగింది.

'చిక్కవీర రాజేంద్ర' దక్షిణభారతంలో మైసూరుసంస్థానానికి సమీపంగా, చిన్న భూఖండమైన కొడగునకు సంబంధించినది. (1956 క్రీ. శ. లో కొడగు నవ్యమైసూరురాష్ట్రంలో విలీనమైంది) వీరరాజేంద్రునికాలంలో ఆంగ్లేయులు కొడగును తమకైవసం చేసికోవడానికి ముందు నడిచిన చారిత్రకసంఘటన లనేమండపాన్ని 'శ్రీనివాస' గారు తమ 'నవలా' నిర్మాణంలో ఉపయోగించుకొన్నారు. రాణి గౌరమ్మాజీ, రాజుగారి చెల్లెలు దేవమ్మాజీ, రాజుగారి కూతురు, మంత్రి బోపణ్ణ, బావగారు చెన్నబసవన్న, స్నేహితుడు కుంటిబసవన్న వీరందరూ చారిత్రకవ్యక్తులు. (రాజుగారి స్వభావాన్నిగురించి చరిత్రకర్తలలో అభిప్రాయభేదం కద్దు). రాజుగారిచెల్లెలూ, బావగారూ కంపెనీవారిని శరణుజొచ్చినసంగతి, రాజుగారు అడిగినమేరకు వాళ్లను వదిలిపెట్టకుండా కంపెనీవారు వాళ్ళను బెంగుళూరులో పెట్టివుంచడం, వీరరాజేంద్రునిక్రౌర్యం, అన్యాయం వీటినిగురించి ఫిర్యాదులు వస్తున్నాయి అని మదరాసు గవర్నరుకు ఉత్తరం వ్రాయడం, కంపెనీ ప్రతినిధులలో ఒకరైన కరుణాకర మేనన్ను రాజు బంధించడం, కంపెనీసైన్యం కొడగును ముట్టడించినప్పుడు మంత్రి బోపణ్ణ, కర్నల్ ఫ్రేసరును కలుసుకోవడం, రాజు ఖైదీకావడం, ఇంగ్లండుకుపోవడం, ఆయనకూతురు క్రైస్తవమతాన్ని స్వీకరించడం, ఇవన్నీ చారిత్రక అంశాలే. చరిత్రలో మసకమసకగావున్న గౌరమ్మాజీ, లక్ష్మీనారాయణయ్యలు నవలలో స్పష్టంగా కానవస్తారు. 'శ్రీనివాస' గారు ఇందులో సృష్టించిన పాత్రల్లో చాల ముఖ్యమైనవి భగవతిపాత్ర ఒకటి. దీక్షితపాత్ర రెండు.

ఇతర కన్నడ 'నవలా' కర్తలూ, దేశగరిమనూ, చరిత్రలోని మహనీయవ్యక్తుల్ని సృష్టించడానికి చారిత్రకసామగ్రిని వాడినమాట నిజమేకాని 'శ్రీనివాస' గారు, వతనోమ్ము

మైన రాజ్యాలకథల్నే స్వీకరించడం గమనార్హమైన విషయం. 'చెన్నబసవనాయక' అజ్ఞాన తిమిరావృతమైన జగత్తును చిత్రిస్తుంది. పెద్దనాయకుడు చనిపోయి విషాదం మొత్తం రాజ్యాన్నే ముంచెత్తేటంతగా భాసిస్తుంది. బిదరు, సమీపంలోని వస్తారె, మైసూరు మూడు ప్రాంతాల్లోనూ, రాజ్యవంశాలు సోమరితనాన్ని భజిస్తూవున్నాయి. చెన్నబసవన్న అయినా కార్యశూరుడై నపిమ్మట సామాన్యంగా మారుపేరుతో వేషం మెరిపించి శక్తిని ప్రకాశింప చేస్తే బాగుండేది. ఇట్లా వున్నప్పటికీ ఇందులో కొంచెం వెలుగుచిన్నెలు, సంతోషపు తెర టాలు కనిపిస్తాయి. నవ్వు మువ్వలరవళి వినబడుతూవుంటుంది. శాంతవ్వ, నాయకుడు మైసూరు ఆస్థానానికి దర్శనార్థం వెళ్ళినప్పుడు ఉల్లాసం ఉరకలువేస్తున్నట్లనిపిస్తుంది. ఈ కాదంబరిలో మల్లికఅనే సేవకురాలు మించుతీగఅంటే మించుతీగే. ఆమె నుట్లతిరిగే మన స్సులో నవ్వూ, చిలిపితనమూ చిందులు త్రొక్కుతాయి. 'చిక్కవీర రాజేంద్ర' లో ఇటువంటి ఉల్లాసరేఖలు కానరావు. కథావ్యాపార ప్రారంభమే చెఱసాలలో అవుతుంది. మొత్తం నవలలో అందరూ అన్నివిధాలా బందీలు; మొత్తం కొడగురాజ్యమే ఓ పెద్ద చెఱసాల. రాజభవనాన్నే, రాజ్యాన్నే, చెఱసాలగాచేసిపెట్టిన రాజుచుట్టూ అతని పాపకర్మలే అతనికై చెఱసాల నిర్మిస్తూవున్న దురంతదృశ్యం నవలలో కంటికి కొట్టవస్తూ కనబడుతుంది.

ఏం చెప్పినా, చారిత్రకనవలల్లో 'శ్రీనివాస' గారి ఆసక్తి గతరాజ్యాల వైభవప్రాభవాల గురించిన్నీ వాటి ఆటుపోట్లగురించిన్నీ ఏదో ఒకకాలంలోని సంఘటనలూ, వ్యక్తులూ - వీటిపైకన్నా ఆయనకు సంఘటనలకూ, వ్యక్తులకూ మధ్యవున్న కార్యకారణసంబంధంపై మమత హెచ్చు.

'శ్రీనివాస' గారికి మనుష్యస్వభావ ,పరిశీలనపైవున్న మక్కువచేత, పాత్రలు ఛాయా మాత్రంగా వుండిపోక, సజీవంగా మూర్తికట్టి మనముందు నిలబడతాయి. తోడ్తో, వారు చారిత్రకసంఘటనల అర్థాన్ని అన్వేషించేప్రక్రియలో పాత్రలు కేవలం సాంకేతికాలై (Symbols) నిలిచిపోతాయి. అందుమూలంగా కథావ్యాపారానికి గాంభీర్యం వస్తుంది. ఉదా హరణకు, చరిత్రప్రకారం మంగలివానికొడుకు కుంటి బసవన్న వీరరాజేంద్రుని కాప్త మిత్రుడు. ఇదెట్లా సంభవమో, వీరరాజు తండ్రిఅయినా ఈ మైత్రికి అవకాశ మెట్లాఇచ్చాడో చెప్పబడివుండలేదు. ఈ నవలలో ఎప్పుడూ వీరరాజుజతలో, అంటిపెట్టుకొనివున్న కుంటి బసవన్న రాజవంశానికి మూర్తీభవించిన పాపపు ముద్దలాగా రాజును వెన్నాడి వుంటాడు. లింగరాజు భగవతికి, తన తదనంతరం ఆమెబిడ్డే రాజు అనే నమ్మకంపుట్టించి, ద్రోహబుద్ధితో బిడ్డ కాలు మెలిపెట్టడంతో విషబీజాలు నాటినట్లైంది. రాజభవనం పాపాలకు బలి అయిపోయి భగవతి మడకేరిలో నిలిచిపోతుంది. పాపఫలమైన బసవన్న వీరరాజును పాపప్రుతోవల్లోనే నడిపించుకొనిపోతాడు.

'శ్రీనివాస' గారు ఒకసన్నివేశం, దానికి లోబడ్డపాత్రలు వీటిని ప్రారంభంలో మన ఎదుట బెట్టారు. ఆ సన్నివేశానికి ఆ పాత్రల ప్రతిక్రియ ప్రవహించే నీటిమూలంగా తటరూపం, ఒడ్డువల్ల ప్రవాహంకట్టే నీటిజాలు, పరివర్తనం చెందుతూవున్నట్లే, సన్నివేశం నుండి పాత్ర, పాత్రనుండి సన్నివేశం పరివర్తనంచెందడం చిత్రిస్తారు.

మనస్సులో ప్రగాఢముద్రాంకితాలై పదికాలాలపాటు నిలచిపోయే మహాదృశ్యాలు 'శ్రీనివాస' గారి నవలల్లో తిరాచూస్తే తక్కువే. కాని ఒక్కొక్కసంభాషణలో పాత్రల మానసికవ్యాపారాల్ని, ఆ వ్యాపారం రూపించుశబ్దాలు, ఆ శబ్దాలు ఇతరులమీద కలగజేసే పరిణామం - వీటన్నింటిజ్ఞానం కలగజేస్తూ మనలను కృతికి అంతర్జగత్తులో నిలబడి, దానికి వెలపలనూ నిలబడి పాత్రలనూ కథావ్యాపారాన్నీ చూసేటట్టు చేయగలసమర్థులు 'శ్రీనివాస' గారు. ఈ ప్రపంచంలో మనుష్యులదౌర్బల్యాలు, ఆ దౌర్బల్యాల్ని వారే నిరీక్షింపలేని రీతిగా వాళ్ళజీవితాన్నీ రాష్ట్రజీవితాన్నీ గందరగోళపఱచి దురంతాలకు దారితీసేవిధం, ఇవి స్పష్టమౌతాయి. వాళ్ళదౌర్బల్యాలు చేయించినకృత్యాలే, ఆడించినమాటలే, తీగలుచుట్టుకొని వాళ్ళ కాళ్లకు బందాలౌతాయి. 'చెన్నబసవనాయక'లో నేమయ్య, 'చిక్కవీరరాజేంద్ర'లో లక్ష్మీనారాయణయ్య వీళ్లు రాజ్యంపనిలో, తాము తమది అనేదాన్ని సంపూర్ణంగా నిరాకరించిన వాళ్ళు. అతిమానుషమైనశక్తి లేకపోయినప్పటికీ, స్వార్థదూషితం కాని వివేకంతో రాబోయే దాన్ని ముందుగా పసిగట్టగల సమర్థులు. వీరితో ప్రారంభమై వీరమ్మాజి, నంబయ్య, వీరరాజేంద్రులు, కుంటి బసవన్నవరకూ ఒక కేంద్రసన్నివేశానికి ప్రతిక్రియ సూచించుపాత్రలను ప్రక్కప్రక్కల పెట్టుకుంటూపోతారు నవలాకర్తలు. కథాగమనాన్ని-పాత్రలనూ అన్నింటినీ మించిన ఓ పరమశక్తి వుంది అనేది సూచితమౌతుంది. సుఖదుఃఖాలనుంచి-ఇష్టానిష్టాలనుంచి ఉద్విగ్నులై ఆందోళనపడే పాత్రలమధ్యలో స్థిరమైనిలిచిన 'చెన్నబసవనాయకు'లోని అయ్య, 'చిక్కవీర రాజేంద్ర'లోని దీక్షితులు అనేవారు ఈ సత్యాన్ని ప్రమాణీకరించే ప్రతినిధి పాత్రలు. కాని ఈ పరమశక్తి ఉనికి, ఎంతసూక్ష్మంగా కళాత్మకంగా సూచింపబడుతుంది అంటే దీనిని మనం కొద్ది పాత్రలవిశ్వాసం అనిమాత్రమే భావించనూవచ్చు. సంసారంనుంచి దూరంగానిలబడి స్థితప్రజ్ఞను సాధించిన పెద్దలతోబాటు, సంసారంలో తంతదఘ్నంగా నిలబడి తమ్ము తాము పతియొక్క పిల్లలయొక్క క్షేమానికి బలిచేసికొనే పరిపక్వమతులైన స్త్రీమూర్తుల్ని సృష్టిస్తారు 'శ్రీనివాస' గారు. (సుబ్బణ్ణభార్య లలిత, నాయకునిభార్య శాంతవ్వ, వీరరాజుభార్య గౌరమ్మాజి, వీరిలోని సాదృశ్యాన్ని గమనించాలి) రాజ్యాల ఉత్థానపతనాలూ రాజు మొదలు సామాన్యునివరకూ ఘటిల్లే జీవితంలోని ఒడుదుడుకులూ, వీటికితోడు ఆత్మయొక్క మహాయాత్రలో పలుఘట్టాల నెదుర్కొని, పారంగతులైన అనేకపాత్రల చిత్రణం చేరి, కృతికి ఓ విలక్షణమైన సౌందర్యాన్ని చేకూరుస్తాయి. 'శ్రీనివాస' గారు పాత్రనుండి దూరంగానిలబడి, దాని సాధనను గమనించగలరు. దానితోబాటు అనుకంపాకంపితులు కాగలరు. వీరమ్మాజి-వీరరాజేంద్రులూ ఈ అనుకంపకు వెలి అయినవారుకారు.

చారిత్రక 'నవలా' నిర్మాణంలో 'శ్రీనివాస'గారి విశిష్టసాధన ఇట్టిది—పాత్రలు తమ యుగధర్మాన్ని, నాటి జీవితమూల్యాల్నివీడి చరించవు, ఆచరించవూను. కాని ఈ పాత్రలు యుగ ప్రాతినిధ్యంవహిస్తూ, వస్తు సంగ్రహాలయంలోని నిర్జీవవిగ్రహాలు కాకుండా ఉండడానికి కారణం జీవితంలో మంచివైపుగాని, చెడ్డవైపుగాని సజీవంగా నడిచినవై వుండడమే. ఈ పాత్రలు భాషను వాడివున్న విధానంచూస్తే, అవి తమలోపలి ప్రపంచంలో చేసేయాత్రలో చేరుకొన్న ఘట్టాలు తెలియజేస్తాయి. (వీరరాజేంద్రులు ఓసారి కోపంతో లక్ష్మీనారాయణయ్యతో 'అయ్యవారు మీరు. ప్రాణం పోయినాసరే, వ్యాఖ్యానం మానం అంటారుకదా అయ్యవారూ!' అంటాడు. ఇది కేవలం వ్యాఖ్యానం ప్రశ్నకాదు. మూల్యాల-మానవసంబంధాల ప్రశ్నఅని అతడు ఎరుగడు) 'శ్రీనివాస'గారి నవలల్లో చాలా సందర్భాల్లో అనేకప్రయోజనాలను సాధించేభాషను వాడివుండడం విశ్లేషించిచూస్తే, అది ఒక సఫలప్రదమైన సాహిత్య కృషి ఔతుంది.

—ఎల్. ఎస్. శేషగిరిరావు.

# ప్రాస్తావికం

# 1

భరతవర్షానికి ఉన్న అనేకసౌభాగ్యాల్లో ఒక ముఖ్యమైంది ఏమిటంటే ఓ దేశానికుండవలసిన లోభాగరిమలతోబాటు, ఓ మహాఖండానికుండవలసినవిస్తారమూ, వైవిధ్యమూ కలిగి యుండడమనేది. 'గంగేచ యమునేచైవ గోదావరీ సరస్వతీ, నర్మదే సింధుకావేరి జలేస్మిన్ సన్నిధిం కురు' అని మన పెద్దవాళ్లు దేశంలోని ఏడు పుణ్యనదుల్ని ప్రతిదినం, ఓసారైనా స్మరిస్తూవుంటారు. కాని అట్లా స్మరించేవాళ్లల్లో గంగను చూచినవాడు కావేరిని చూడడం, కావేరిని దర్శించినవాడు, గంగాదర్శనం చేయడం, వేయింట ఒకసారికూడా వుండదు. ఇంత విశాలమైన ఈ భూమి మతం, రీతి, సంస్కృతి - వీటి ఆధారంగా ఎంతోకాలంనుంచీ, ఒక్కటిగా వుంటూవచ్చినా, ప్రభుత్వపద్ధతిని రాజకీయంగా ఒకే భూఖండంగా ఏర్పడడం, నిజానికి ఇటీవలిమాటే. భిన్నభిన్నప్రాంతాలు భిన్నభిన్న జీవితవిధానాలతో పెరుగుతూవచ్చాయి. అనేకసమయాల్లో వివిధప్రాంతాలలోనూ, ఒక్కొక్కప్పుడు ఒకేప్రాంతంలోని భిన్నభూభాగాల్లో, వేరువేరు రాజవంశాలు వర్ధిల్లి ఒక్కొక్కప్రాంత చరిత్రకూ, ఒకొక్కదేశచరిత్ర అంతటిమహత్తును సంపాదించిపెట్టాయి. ఆ ఒక్కొక్కచరిత్ర ఒకొక్కదేశచరిత్ర అంత విపులమై, విశాలమై, మహిమాన్వితమై ఒప్పింది. దీనికి ఉజ్జ్వలమైన ఉదాహరణం రాజస్థానం. రాజపుత్రుల ఆ భూమి, భరతభూమిలో ఓ చిన్నభూభాగం. కానైతే అందులో ఇరవై చిన్నభూభాగాలున్నాయి. ఆ ఒక్కొక్కభాగంయొక్క చరిత్రా, ఒకొక్క రాష్ట్ర చరిత్ర అంతవిస్తారమై, కీర్తిమంతమై కానవస్తుంది. ఆ శౌర్యం, ఆ ధర్మనిష్ఠ, ఆ క్షాత్ర తేజస్సు, ఆ శ్రద్ధ, ఆ నేలపై ఎంత సొంపుగా వర్ధిల్లాయి! మరోవైపు ఆ ధార్ష్ట్యం, ఆ అవివేకం, ఆ స్వార్థం, ఆ లోభం, అవెంతగా పెచ్చుపెరిగి పోయినాయి! 'బహురత్నా వసుంధరా' అనేది నిజమైనమాట. భారతదేశసందర్భంలోకూడా ఇదెంతో యథార్థం మూటగట్టు కొన్నమాట. ఏ ప్రాంతంచూసినా, అందులో ఏ భాగం పరికించినా, వాటివాటిచరిత్ర కీర్తి మంతంగా, గమనార్హంగా, మార్గదర్శకంగా వెలసింది.

పై మూడుగుణాలతో పెంపారి పెద్దదనిపించుకోదగ్గచరిత్ర కలిగివున్న ఓ చిన్నభూభాగం కొడగు. బొంబాయినుంచి ప్రారంభమైన సహ్యాపర్వతపంక్తి, దక్షిణాభిముఖంగా సాగి దారి పొడుగునా, పశ్చిమసముద్రాన్ని చూస్తూ చాల ఎత్తైనశిఖరాలతో ఒప్పారింది. నీలగిరి పంక్తుల నుండి ఇంకా ముందుకుపోయేముందు కొడగుభూమిలో వాయవ్యదిశలోని పుష్పగిరిమంచి తావళగేరి, మూడునాటి బ్రహ్మగిరివరకూ ఐదుయోజనాలమేరకు శిఖరపంక్తులు వరుసగా నిల

బడివున్నాయి. ఇంతపొడుగునా పర్వతాలు అడ్డంగా రెండుయోజనాలు, మూడుయోజనాల దూరం, భూమిలో కానవస్తూ ఈ ప్రదేశంలో, ఓచోట పల్లంగా, ఓచోట మెట్టగా ఏర్పడి గుట్టల గుంపుగా చేసేసింది. వీటిల్లో ప్రసిద్ధికెక్కిన కొండకొమ్ములనేకంగా వున్నాయి. పుష్పగిరిలోనే రెండుశిఖరాలు; మడకేరిదగ్గిర 'కోటబెట్ట', అన్నింటికంటె ఎత్తైన 'తడియండ మోళ'. బ్రహ్మగిరిలోని 'హుయ్యాలెమలె', 'దేవసిమలె' నాల్కునాటి 'తుంబెమలె' 'ఇగ్గు తప్పనబెట్ట' కడియత్తునాడులోని 'సోమనమలె'. ఇవన్నీ ఈప్రాంతంలోని ఉన్నతశిఖర పంక్తులు. ఏదో పోటీపడి ఒకదాన్నిమీరి ఒకటి వుండాలన్నట్లు, ఒకదాన్ని మరోటిచూస్తూ పైపైకి పోతూన్నట్లు కానవస్తాయి.

కొడగు కావేరికి పుట్టిల్లు. నది బ్రహ్మగిరిలోపుట్టి, ఆగ్నేయంగా 'సిద్దాపురం'వరకూ, అక్కడినుంచి ఈశాన్యంగా 'సిరియంగళ'వరకూ, కొడగుభూమిపై ప్రవహిస్తుంది. మధ్యలో 'తడియండమోళ'నుండి పరుగెత్తుకొనివచ్చే 'కక్కబె', సోమనమలెనుంచి ప్రవహించివచ్చే 'కరడ' 'హిగ్గళ' నుంచివచ్చే 'కదనూరుకాల్వ' బెప్పునాడులోని 'మగ్గుల'నుంచివచ్చే 'కుమ్మె కాల్వ', ఎడనాల్గునాడులోని 'కగ్గోడు' నాడులోని 'ముత్తారముడి' 'హోరూరు' 'నూరొక్కలి' నుండి 'చికలి' 'కక్కచోరు' వాగులూ, మూదాపురం వాగులూ, చేరి పెంపొందిన 'హారంగి' కుశాలనగరానికి ఉత్తరంగానూ; ఈవిధంగా పదిమూలలనుంచీ పద్దెనిమిది సన్న చిన్నకాల్వ లన్నీ కలిసి దీనిలో సంగమించి దీన్ని పోషిస్తున్నాయి. హేమావతీనది ఈనాటిజలంతో పెరిగి ప్రవహిస్తూ దేశానికి ఉత్తరసీమగా వుంది. దేశంలోని కొండలమీదపుట్టి 'లక్ష్మణతీర్థ' ఈశాన్యంగా అడవుల్లో, కొండల్లో ప్రవహిస్తూ దేశానికి ఎల్లగావుంటూ కావేరికి ఉపనదులై అందులో కలిసిపోతున్నాయి.

అయిదుయోజనాలు నిడివి, మూడుయోజనాలు వెడల్పుఉన్న ఈ కొండసీమ ఓ విలక్షణ మైన మనుష్యసముదాయానికి నివాసభూమిగా వుంది. వీళ్లే కొడగలు. ఈ ప్రజలు ఒక సము దాయంగాపెరిగి, ఓవిధమైన జీవితసరణిలో నడుచుకోవడంచేత, వాళ్ల నివాసభూమి ఓ విల క్షణమైన ప్రత్యేకదేశమే అనిపించుకొంటుంది. దేశంలో ప్రత్యేకస్థానం ఉన్నప్పటికీ కొడ గలు, ఈ దేశాన్నీ ఎన్నడూ పాలించినజాడ కనబడదు. కొడగలుకాని అనేక రాజకుటుం బాలు, ఇక్కడ పాలిస్తూవచ్చాయి. కదంబులు, గాంగులు, చోళులూ, చాళుక్యులూ, హొయ్స లలు, ఈ నేల ఏలిన రాజవంశాలు. చివరిలో ఇక్కేరి రాజవంశంలోని ఒకయోధుడు ఇక్క డికివచ్చి వెనకటి రాజవంశాన్ని నిర్మూలించి జనులకోరికపై తానే రాజయ్యాడు. ఆయన వంశం రెండువందల ఏండ్లకు పైబడి ఏల్బడి సాగించింది.

ఓ వైపు మైసూరు, ఇంకోవైపు మలయాళం, మరోవైపు మంగుళూరు ప్రభుత్వా లుంటూవుంటే, వాటిమధ్య నిలబడ్డ కొడగు రాజులు తమ స్వాతంత్ర్యం కాపాడుకోవడానికే యుద్ధాలు చేయాల్సివచ్చేది. పర్వతప్రాంతం కావడంచేత బైటివాళ్లు ఆ దేశాన్ని గెలవడం

ఏమంత సులభంకాదు. దొడ్డ వీరరాజేంద్రులు అనే ఈ వంశంలోనిరాజు చాల చాకచక్యంతో రాజ్యం పాలించి తన సమకాలిక రాజబృందంలో గౌరవప్రతిష్ఠలు సంపాదించాడు.

దొడ్డ వీరరాజుకు తన కూతురు దేవమ్మాజి రాజ్యం పాలించాలని కోరిక. దేవమ్మాజి సింహాసనం ఎక్కింది. కాని ఆయనతమ్ముడు లింగరాజు అది పనికిరాదని హఠంపట్టి, మొదట తాను దివానుగావుండి ఆపైని దేవమ్మాజిని గద్దెనుంచి దింపి తానే రాజ్యానికివచ్చాడు. తొమ్మిదేళ్లు రాజ్యంచేసి దివంగతుడయ్యాడు. అప్పుడు ఆయనకుమారుడు ఇరవైఏళ్ళ ప్రాయమువాడు, చిక్కవీరరాజు ప్రభువయ్యాడు.

కొడగు నేలిన ఈ రాజకుటుంబంలో ఈయన చివరి రాజు. ఇతనిపరిపాలనలో వద్మా లుగోఏట కొడగు ఆంగ్లేయుల కైవసమైంది. చిక్క వీరరాజు తనవంశానికి కీర్తి తెచ్చిన దొర కాడు. ఆయన చివరిసంవత్సరం ఏల్బడి మన కథావస్తువు.

## కథాముఖం

## 2

శాలివాహనశకం పదిహేడువందల యాభై విజయనామసంవత్సరం. మడికేరి రాజభవనం లోపలివరాండాలో ఓ ప్రక్కన మూడుగదులు. వాటికో వాకిలి. ఆ వాకిలికి తాళం వేసివుంది. ఒక సేవకుడు మధ్యాహ్నవేళకు వసతినుంచి, భోజనం పళ్లెం ఒకటి తీసికొని ఆ వాకిలిదగ్గరకువచ్చి నిలబడ్డాడు. సరిగ్గా ఆసమయానికి, ఓ కుంటి ఓ తాళంచేతులగుత్తి పట్టుకొని అక్కడికి వచ్చాడు. గుత్తిలోంచి ఓ తాళంచెవితీసి దానితో తాళం తీశాడు.

గదిలోకిపోయి అతడు, వాకిట్లో నిలబడ్డ సేవకునికి సైగచేసి అతన్ని లోపలికి పిలిచాడు. సేవకుడు తాను తెచ్చిన పళ్ళాలతోసహా లోపలికిపోయి నిలబడ్డాడు.

'కుంటి' ఓవిధమైన రూక్ష కంఠధ్వనితో 'భోజనం వచ్చింది అమ్మా తీసుకోండి' అని చెప్పాడు. మూల ఒదిగి కూచున్న యువతి 'నీకూ, నీ భోజనానికి నిప్పు పెట్టనూ! పో అతలికి, నువ్వు ఇక్కడకువచ్చే పనిలేదు' అంది.

'అట్లాగయితే ఈపూట మీరు భోంచెయ్యరా ఏమిటి?'

'మేము తింటాం, తినం, మెడకు కట్టుకొంటాం, నీకెందుకు? నీపని నువ్వు చూసుకో.'

'తిరిగి అన్నమంటే లేకుండాపోవచ్చు.'

'ఒరేయి! నువ్వు వెళ్ళిపో. నోటికివచ్చినట్లు పేలకు. అన్నం లేదంటాడుట ఈ మొద్దు!'

ఇంతలోపల సుమారు పద్నాలుగేళ్ల పిల్ల ఒకత్తె వాకిలిదగ్గరకు వచ్చింది. వీళ్ల మాట్లాడు కొనే మాటలువిని మొగం ముడుచుకొని తటాలుమని లోపలికి చక్కాపోయింది.

కుంటి ఈ బిడ్డ అక్కడకు వస్తుందనుకోలే దల్లేవుంది. 'అయ్యో! తల్లీ! మిమ్మల్ని ఎవరు విడిచిపెట్టారు ఇక్కడికి? పదండి పదండి [1]అప్పాజీ చూస్తే మా కందరికి చిక్కే' అన్నాడు.

పిల్ల 'కావాలంటే పట్టుకోపీ. నేను మా అత్తయ్యదగ్గిర వుంటాను' అంది.

కుంటి సేవకుడిని 'ఒరేయి, వచ్చేటప్పుడు ఈ వాకిలి వేసిరా అని చెబుతున్నా, తెఱచి పెట్టివస్తే నా పీకెలమీదికి వస్తుంది. ముండమోపీ' అని తిట్టి పిల్లతో 'అమ్మా! మీకు చెయ్యెత్తి దణ్ణంపెడతా ఇహ పదండి. కావాలంటే అమ్మగారికి ఓమాట చెప్పండి. చాలసేపు వద్దు. అప్పాజిచూస్తే నిండా కష్టమైపోతుంది.' అన్నాడు.

'కుంటి' మాటలధోరణిలో బందీనిగురించి కొంచెం గౌరవ మిశ్రితమైన దాక్షిణ్యం, పిల్ల యెడల చనవుతోకూడిన వాత్సల్యం, సేవకునియెడల మదమెక్కిన ఔద్ధత్యం, క్రౌర్యం గోచరించాయి.

పిల్ల 'అప్పాజి రావాలనే నే నిక్కడికి వచ్చివున్నది. అప్పాజి రావాలి. అవ్వాజి రావాలి. నేను అత్తనువదలి వెళ్లేదిలేదు.' అంది.

కుంటికి కోపం తలలోంచి వెళ్ళిపోయింది. ఆయన సేవకుని మళ్ళీ తిట్టి అతన్ని చెంప మీద ఛడేలుమని కొట్టాడు. 'దెయ్యంముండా! వాకిలి వేసేసిరమ్మంటే అట్లాగే వచ్చేసావా? గాడిదవెధవా! ఉండు నిన్నేం చేస్తానో' అని అరిచాడు. పిల్లతో సగం బెదిరింపు ధోరణిలో 'అట్లా అయితే అప్పాజిని పిలిచి తెచ్చేదా?' అని అడిగాడు.

సేవకుడు 'చూడవ్వ[2] మీరు చేసింది. నేను వద్దంటుంటేనే నన్ను గదిమి వాకిలి వేయకుండా చేసారు. మీమాటవిన్నందుకు నాకు చచ్చినంత పనైంది' అన్నాడు.

పిల్ల 'సరే, నువ్వు అవతలనిలబడు. తిరిగి 'కుంటి' చేతిలో చిక్కబోకు. ఆయన నిన్ను చేయి చేసుకోకుండా నేను చూసుకొంటానులే' అని అతనికిచెప్పి కుంటితో 'పో. అప్పాజీని పిలిచి తీసుకొనిరా' అంది.

మాటలన్నింటిమధ్య కుంటికి ఈ బొడ్డూడ నామె నన్ను 'కుంటి' అని పిలుస్తుంది అని మా చెడ్డకోపం. అతడు ఆమెవైపు చురచురా చూశాడు. ఓ క్షణం అటూ, ఓ క్షణం ఇటూ ఏమో ఆలోచించాడు. ఇష్టంలేనిపని చేస్తున్నవాడిలా బైటికి అడుగుపెట్టాడు.

---

1. అప్పాజి = తండ్రిగారు. అప్పాజి, అవ్వాజి, పుట్టవ్వ మొదలైనశబ్దాలు కన్నడవాతావరణపరిరక్షణకై యథాతథంగా తీసికోబడ్డాయి - అనువాదకుడు.

2. అవ్వ = అమ్మ. గౌరవసూచకమైనశబ్దం. కుంటి = కుంటివాడు.

అక్కడ మరో స్త్రీ మూర్తి అతనిఎదుట గోచరించింది. ఆమెనుచూడగానే 'కుంటి' తల వంచి చేతులు ముకుళించాడు.

'ఇక్కడికి ఎవరినీ రానీవద్దని దొరగారు నియమించారు. [1]చిక్కవ్వ రావడమే పెద్ద గండం. ఇంక అవ్వాజి లోపలికివస్తే ముందేమిగతి?' అన్నాడు.

'రాజభవనంలో మేము ఇక్కడికి వెళ్లవచ్చు, అక్కడికి వెళ్లరాదు అని చెప్పేపాటి వాడివా బసవయ్య నీవు?' అని ఆమె ప్రసన్నగంభీరమైన ముఖముద్రతో, దృఢమైన కంఠ ధ్వనితో అడిగింది.

ఆమె కొడగు రాణి గౌరమ్మాజి. ఆమె ముఖముద్రముందు, కంఠధ్వనిముందు అతడు గతుక్కుమన్నాడు.

'దొరగారు నియమించారు అంటున్నాను అవ్వాజి. వారు కోపగిస్తే ఎవరు ఆపగలరు?'

'ఔననుకో. వారికి సమాధానం చెప్పాలి. చెప్పుతాం. ఇప్పుడు ఈవిషయమూ చూడాల్సి వుంది.'

'చిత్తం అమ్మా!'

గౌరమ్మాజి ముందుకునడిచి గదిలోకి జొరబడింది. బసవన్న ఆమెవెనక తానూ లోపలికిపోయాడు. వాకిలిదగ్గర నిలబడ్డాడు.

రాణి లోపలికిపోగానే కుమార్తె పరుగెత్తుకొనివచ్చి, ఆమెచేయి పట్టుకొంది. 'అవ్వాజి, అత్త భోంచెయ్యనందోంది. నువ్వైనా చెప్పు తినమని' అంది.

మూలలో కూచున్నయువతి ఏడుస్తూ ముఖం చాటుజేసికొని కూచున్నది. రాణి దగ్గరకు పోయి 'ఇదేమిటక్కా[2] ఈ పొద్దు? బసవయ్య ఏమన్నా అన్నాడా?' అని అడిగింది.

యువతి ఏడుస్తూనే 'చూడువదినా! అన్నయ్య, నువ్వెవరికి కడుపుతో వున్నావు? అని నన్ను అనరాదంటుంటే ఈ మొద్దు తొడమీద కూచోబెట్టుతానంటాడు రాత్రి. నెలరోజులు చెఱలో గడిచిపోయినాయి. ఎందుకీ బ్రదకడం? చస్తే అందరిపీడా విరగడైపోతుంది అని పిస్తుంది. నేను ఇహ అన్నం తినను' అంది.

కుమారి 'తిననంటే పొట్టలోవున్న పాప ఏమైపోతుంది పాపం?' అంది.

రాణి: 'సరేనమ్మా! నూరన్నా, చేసినా, పుట్టిల్లు అంటూ వుండాలికదూ! సహించుకోవాలి. ఉపాయంగా బైటికి వెళ్లిపోవాలి. వాళ్ళు చెడ్డగా ప్రవర్తించారని మనమూ చెడుదలిస్తే, కుటుంబానికికదూ, ఆడపిల్ల అన్నంతినని పాపం వచ్చేది.'

యువతి:-'ఆడపిల్ల అన్నం తినకపోవడం ఈ ఇంటికి కొత్తేమీ కాదు. పదిమంది ఆడ పిల్లలూ ఇట్లాగే బాధలుపడ్డారు. నేను పడుకొందోదాన్ని.'

---

1. చిక్కవ్వ = చిన్నమ్మగారు.
2. అక్క అని సంబోధించడం గౌరవంకోసం.

కుమార్తె తల్లితో 'అవ్వాజీ! ఇవ్వాళ అత్తయ్యను వాళ్ల పూరికి పంపించెయ్యాలి. లేక పోతే నేను భోంచెయ్యను' అంది.

బసవన్న మొదటే సేవకుణ్ణి దొరదగ్గిరకు పంపించాడు. చెల్లెలుగారి చెఱగదిలో రాణీ, రాజకుమారి ఏమో తర్కవితర్కాలు చేస్తున్నారు. వెంటనే రావాలి అని వేడుతున్నానని విన్నవించు అనిచెప్పి పంపించాడు. వార్త చేరగానే వీరరాజు మహాకోపంతో పెద్దపెద్ద అడుగులు వేసుకుంటూ చకచకా అక్కడికి వచ్చిచేరాడు.

# 3

వీరరాజు ఇంకా యువకుడే. పట్టుమని ముప్పైఅయిదు ఏళ్లయినా, నిండా లేవు. అతగాడు బ్రతుకుబాటపై నడిచినతీరుఫలితంగా స్త్రీమోహంమీద అనారోగ్యం కమ్మిఉన్నలక్షణం కాన వస్తుంది. లేత ఒళ్లు. మదిచూపు. చూడటానికి క్రౌర్యం ముద్దగట్టినట్లుగా వుంటాడు.

కూతురు తండ్రిరావటం దూరంనుంచే చూసింది. కోపంగావుండటంగూడా గమనించింది; అయినా లక్ష్యంచేయకుండా ఎదురువెళ్ళి అతనిచేతిని పట్టుకుంది.

'అప్పాజీ! బసవయ్య ఏమిచెప్పాడోగాని అత్త తిండైనా తినకుండా కూచునిపోయింది. ఆమెగారిని ఆమెఇంటికి పంపివేద్దురూ!' అంది.

వీరరాజు కీ మాటలు చెవిదూరినట్లు లేదు. ఆయనకు ఒకటే కోపం. తన అనుమతి లేకుండా ఈమె ఇక్కడకు ఎందుకురావాలి? 'నీవు ఎందుకు ఇక్కడకు వచ్చావు? నిన్ను రమ్మనమని చెప్పినవా రెవరు?' అని ఆమెను గదమాయించి ముందుకు వెళ్ళాడు. రాణిని ఉద్దేశించి 'ఎవరు మిమ్మల్ని ఇక్కడకు రమ్మనమని చెప్పారు? ఉన్నచోటనేవుండి మర్యాదగా జీవితం వెళ్లబుచ్చాలి. మమ్మల్ని అడగకుండా ఇక్కడ ఎవరూ అడుగుపెట్టరాదు' అని గర్జించాడు.

గౌరమ్మాజి అతనికి జవాబు ఏమీ ఇవ్వలేదు. బసవన్నకు నౌకరుకు 'వాకిలిబైట వుండండి' అనిమాత్రం చెప్పింది.

వీరరాజు 'ఒరేయి! ఇక్కడనే వుండండ్రా' అని వాళ్లకుచెప్పి 'వాకిలిబైటకు మీరు పోవాలి' అన్నాడు.

'నా స్వామి నన్నేమాటైనా అనవచ్చు. అవన్నీ వింటానికి నౌకర్లు ఇక్కడ వుండడం ఏమంత బాగుంటుంది?'

'ఔను, నిజం కావచ్చు. మమ్మల్నిమీరి నడిచేది మాకు భార్యకాదు తొత్తు.'

'చేపట్టిన ఇల్లాలు తొత్తు. మరి కడుపున పుట్టినబిడ్డ ఏమౌతుందో! ఆమెనీ, పనిపాటల వాళ్ల ముందు దండిస్తారా?'

'మేమేం చేస్తామో! చెయ్యమో! అడగాల్సింది నువ్వుకాదు! అవతలికి నడు.'

రాణి దర్పంగా బసవన్నవైపు, సేవకునివైపు దృష్టి సారించింది. సేవకుడు అప్పటికే తలుపుదగ్గిరకు జారుకొన్నాడు. ఈ కనుచూపులకు సంకోచిస్తూ బసవన్న కూడా ఉపాయంగా ద్వారంవైపు జరిగి పెడమొగంపెట్టి నుంచున్నాడు.

రాణి:-'ఇంతకీ జాతకం, యోగం సరిగాలేవు. కంసదేవకియోగం వ్రాయబడివుంది. జాగ్రత్త సుమా! అంటారు దీక్షితులవారు. అందుకోసమే నే నిక్కడికి వచ్చాను. లేకపోతే నాకేమిపని. అన్నా చెల్లెలూ - వాళ్ళఇష్టం అనుకొనేదాన్ని.'

'చాలా కనిపెట్టాడు మీ దీక్షితయ్య! ఆ ముసలాడు చెప్పడం. మీరు వినడం. నామాట కాదని ఈ ఆట ఆడుతున్నారు.'

రాణి:-నేను రావడం తప్పు కావచ్చు. అయినా రాజుగారికీ, కూతురుకీ, శుభం కలగాలి అని వచ్చా. నాతప్పు మన్నించాలి. మీ చెల్లెలుగార్ని ఆమె ఇంటికి ఆమెను పంపించి వేయాలి.'

గౌరమ్మాజి చాలాసార్లు పెనిమిటి ఆడిన పరుషవాక్యాలు వినివుంది. స్వ్రృహతప్పి, ఉద్రిక్తంశమైనవేళల్లో తాగుబోతూ, కోపిష్ఠిఅయిన తన పెనిమిటి ఒకటి రెండుసార్లు ఆమెను చేయెత్తి కొట్టడమూ కద్దు. కానైతే ఆమె తన రాణీతనం హోదాను ఎప్పుడూ మఱచిపోలేదు. ఇప్పుడూ అదేదర్పంతో ఆమె పెనిమిటిని ఎదిరించింది.

వీరరాజు పళ్ళు పటపటా కొరుకుతూ 'ఏమిటి నీ వాగుడు? కావాల్సిందీ, అక్కరలేందీ చెప్పేవాళ్లం మేము. ఓ సంవత్సరంపాటు బందీగా వుంటూవున్న నీ ఆడుబిడ్డ ఎవరికి కడుపు చేసికొన్నది? సిగ్గువిడిచి చెప్పండి. ఆడుబిడ్డకు ఎవరిచేతనో కడుపైతే పెనిమిటి ఇంటికి పంపిస్తారా?' అన్నాడు.

ఇంతవరకూ తనమానాన తాను ఏడుస్తూ ఒకమూల కూచునివున్న దేవమ్మాజి లేచి నిలబడింది. అగ్నివర్షం కురిపించేచూపులతో అన్నవైపుచూస్తూ 'నన్ను చెడ్డగా అన్నావో నాలిక తెగి పడిపోతుంది! ఏదోరకంగా బ్రతుకు వెళ్లబుచ్చుకోడానికి నేను నా అన్నయ్యను కాను' అంది.

'అన్నయ్యమాట ఎత్తవద్దు. ఎవరికి కడుపుతోవున్నావో చెప్పు. చెప్పకుండావుంటే ఎండాలురకు పారేయిస్తా.'

రాణి పెనిమిటితో 'అంత దుర్భరంగా మాటాడకండి. కూతురు పేరు చెల్లెలుపేరూ కాదు. ఇంటి ఆడపడుచైనతర్వాత ఆమెమర్యాద కాపాడవలసినవాళ్లం మనమే. నెలరోజులు ఒంటరిగా ఏకధారగా ఏడుస్తూవుంటే మేమే బావగారిని ఇక్కడకు ఓరోజు కబురుచేసి

తెప్పించాం. ఇందులో తప్పేమిటి? మనపెద్దవాళ్ళు ఈ ఇంట్లో శోభనం చేశారా లేదా? అప్పటి ఆశీర్వాదాలు ఇప్పుడు ఫలించాయి. చెఱసాల అని ఎందుకు పిలవడం? శయ్యాగారం అనండి. మంచిగా మాట్లాడి, చెల్లెల్ని ఆమె పెనిమిటిదగ్గిరకు పంపించండి.'

తన ఆజ్ఞను ఇంతదూరం ఉల్లంఘించడంతో, వీరరాజుకు అరికాలుమంట నెత్తిదాకా వచ్చింది. ఆయన 'ఓసీ మొద్దూ! నన్ను అడగకుండా పెట్టకుండా ఆ దేబెవెధవని లోపలికి రానిచ్చారా? ఇదిగో నీకు తగినశాస్తి' అని చేయెత్తి రాణివైపుకు కొట్టడానికని ఉరికాడు.

అతని ఇష్టానికి అడ్డురాకుండావుంటే, రాణిని ఏం చేసివుండేవాడో చెప్పడం కష్టం. చంపేసివున్నా ఏమీ ఆశ్చర్యంలేదు. అయితే ఆయన పుణ్యమా అని రాజకుమారి మోకరిల్లి కూచుంది. ఆయన్ను వాటువేసికొని కాళ్లకు అడ్డాలుపడింది. ఆయనవైపు మొగంపెట్టి 'అప్పాజీ! వద్దు వద్దు. బావగారిని లోపలికి పంపించింది నేను' అని మొరపెట్టుకొన్నది.

ఈవిధంగా కథ అడ్డం తిరుగుతుందని అనుకోని ఆమెతండ్రి, కొంచెంలో, పడిపోయేటట్లు ముందుకు వంగాడు. రాణి ముందుకువచ్చి ఆయన్ను పట్టుకొన్నది. ఆయన సరిగ్గా నిలుచున్నతర్వాత తిరిగి వేరేవెళ్ళి నిలబడింది.

వీరరాజుకు కూతురిమీదా చాలా పెద్దకోపం. అయినా ఆయన ఆమెను ఏమీ చేయలేదు. అతి కఠినం, అతి క్రూరం, అతి నిర్దాక్షిణ్యంతో కూడివున్న ఆయనస్వభావంలో ఒకే ఒక కొద్దిపాటి మెత్తన వుంది. ఆ మెత్తన తనకూతుర్ని చూసినప్పుడు. ఆయన మోకరిల్లి కూచునివున్నకూతుర్ని బుజాలుపట్టుకొని నిలబెట్టాడు. 'నువ్వెందుకు ఈజోలికి వెళ్ళావు? నీ అత్తయ్య నువ్వు ఉంటూవుండగానే ఆడిపోసికొంటోంది' అన్నాడు.

కుమారి 'అత్తయ్యను వాళ్ళఇంటికి పంపించేస్తే నేను భోంచేస్తాను. పంపరూ, నేను భోంచేసేదిలేదు' అంది.

'ఏం పిల్లవే! నువ్వూ నీ మాటలు! ఏమి అత్త ఈమె నీకు? ఆ దేబె ఏం బావయ్య! సాగుతుందనుకుంటే ఈ నీ అత్త నన్ను చంపి, నిన్నుమింగేసి రేపే రాణి అయి కూచుంటుంది. ఈ పాముకు పాలుపోస్తానంటావు నువ్వు?'

ఓమూలవున్న దేవమ్మాజి 'ఎందుకు కాదంట? నువ్వు రాజ్యం చేయవచ్చు, నేను చేయకూడదేం? ఊరిబైటి మాలపిల్లవాడైనా, నీకంటె బాగా రాజ్యంచేస్తాడు. నేను రాణి అయితే చెడిపోయిందేమిటి?' అంది.

మాట అంతకంతకూ శ్రుతిమించి రాగాన పడుతోంది. వీరరాజు చెల్లెల్ని కొట్టడానికని ఆమెవైపు కురికాడు. రాణీ, కూతురూ, ఇద్దరూ అతన్ని పట్టుకొన్నారు. రాణి 'నీళ్ళు పోసికొన్న ఆడకూతురు; ఇంటి ఆడుపడుచు. మీరేమి అనతలచుకున్నారో అనండి. మేం పడతాం. మా మొహంమీదిర్వాత. కొంచెం నిదానించండి. ఈ ఇంటిలో ఏమైనా ఆమెకు కీడు జరిగితే నిందె మోయాల్సివస్తుంది. అటువంటిదేమీ వద్దు' అని వేడికొన్నది.

రాజకుమారి:-'అత్తా! మీరు మెదలకుండా వుండండి. ఏమీ మాట్లాడకండి.'
దేవమ్మాజి:-'మరి నన్నెందుకు కూడనిమాటలన్నీ అనడం? అన్ననుమింగి, కోడలినిచంపి, రాణీ అవుతానని నేను ఎప్పుడు చెప్పాను. ప్రజలనందరితో విరోధం పెంచుకున్నాడు. ఆయన కూతురికైనా పట్టంగట్టితే బాగుండునని నాడునాడెల్లా ఘోషించిపోతోంది. మేమూ అన్నాం. ప్రజావిరోధం ఉందా లేదా?' అని అడిగింది.
వీరరాజు:-'ప్రజల పగపట్టారుట. ఆ దేబె రాజు, ఈ దేబె రాణీ. కోడలికి పట్టం గట్టించాలి అనేమైనా బెంగుళూరికి ఉత్తరం వ్రాయించావా?'

ఈ వాగ్వాదం ఎప్పటికీ అంతుపట్టేటట్లు లేదు. రాణి రాజును ఏదోవిధంగా అతనిగది లోకి పిలుచుకొనిపోవాలని ఆలోచించింది. అంత స్పష్టమైన తెలివితేటలు లేకపోయినా కూతురి ఆలోచనా అదే. ఆమెతండ్రిని పట్టుకొని 'అప్పాజి! ఇంతట చాలించండి. నావెంట రండి. ఆపైని మనం మాటాడుకోవచ్చు' అంది.

వీరరాజు ఏమనుకున్నాడో ఏమోగాని, ఏమీ మారాడకుండా ఆమెవెంట గదినుండి బైటకు వెళ్లిపోయాడు.

# 4

రాణీ గౌరమ్మాజి సేవకునిపిలిచి 'ఆకు (అరటి)లో అన్నం చల్లారిపోయింది. వేరే తీసుకొని రాపో' అని చెప్పింది. వేడిఅన్నము తెమ్మనమని అతనిని పురమాయించి 'అక్కయ్యా! ఈ రభస ఇంతటితో మరచిపోండి. ఈపొద్దు మిమ్మల్ని మీయింటికి పంపించివేస్తారు. మీపాటికి మీరు సుఖంగా వుండొచ్చు' అని దేవమ్మాజితో అంది.

'నిన్న ఆడినమాటలు చాలు ఈజన్మకి. ఇన్నిమాటలుపడి బ్రతకడంకంటె చచ్చిపోవ డమే మంచిది' అంది దేవమ్మాజి.
రాణి:-తోడబుట్టినవాడిమాటలు - ఒక్కరోజు కోపగించుకొంటేమాత్రం మరోరోజు మంచి కాకూడదా?'
దేవమ్మాజి:-ఇహ ఈపరిస్థితి బాగుపడటమా? అప్పాజి వెళ్లిపోయారు; ఆయనతోపాటే ఇంటిగౌరవంకూడా అడవిపాలైపోయింది. పద్నాలుగుఏళ్లల్లో ఒక్కసారైనా ఓ మంచి మాటన్నా విన నోచలేదు.'
రాణి:-ఇప్పు డల్లా అనిపిస్తోంది. కాని మంచిగామాత్రం ఉండలేదా. అప్పాజి చనిపోయి నప్పుడు, మీరూ బావగారు మీ భవనానికి వెళ్లిపోతున్నామని చెప్పినప్పుడు పాపం!

మీ అన్నగారు మిమ్మల్ని ఇక్క-డేవుండమని, ఈ ఇల్లు మీదేనని, ఎంతో ఆప్యా యంగా చెప్పలేదా ?'

దేవమ్మాజీ:-అప్పాజి, ఇచ్చిన వస్త్రాభరణాలు రాజభవనం వదలిపోకూడదని అన్నయ్య తంటాలుపడ్డారు. అంతేకాని మేం వెళ్లిపోతే ఆయనకుకలిగే దుఃఖం ఏమీలేదు.'

రాణి:-అప్పటిసంగతి అది. ఇప్పటితీరు ఇది. మీ మీ ప్రేమభావాలు మాకు తెలియనివా ? అప్పాజి తొడమీదకూర్చుండే నీవు మీ అన్నయ్యతొడమీద కూర్చుండేదానవు కాదా ?'

దేవమ్మాజి:-వదినా ! అది మీకు కంటగింపే అయిందిగా ! మీరు అప్పట్లో మూతి ముడుచు కునే వుండేవారు.

రాణి:-తగలడ్డ కోపం ! అప్పుడు దానిసంగతి ఎందుకు. మాకడుపున ఓ మగపిల్లడు పుట్టి, పుట్టవ్వ అతనితొడమీదకూచుంటే వద్దంటామా ? దానిఅన్న వాడు, వాడిచెల్లెలు అది అనేవాళ్ళం. మీమాట అంతే.'

దేవమ్మాజి:-మీరు భలేవారే వదినా ! ఇంత గ్రహించారు! అన్నయ్య మీకుమల్లే కాదు; ఆయన ప్రేమ బుగ్గి అయిపోయింది. ఆయన మమ్మల్ని కనిపెట్టి వుండేదేమీలేదు.

రాణి:-మమ్మల్ని కనిపెట్టేదేమీలేదని మోసగించకూడదు. సరిగావున్నాం అనేటట్లు నడచు కోవాలి.

దేవమ్మాజి:-'కుంటి' తొడమీద కూచోబెట్టుకున్నా సరేననాలా ?

రాణి:-ఏమైనా మాట్లాడటానికి పూర్వమే సేవకుడు వేరేభోజనం ఆకులో తెచ్చాడు. రాణి దగ్గరకు తెమ్మనమనిచెప్పి ఓపీట వేయించి దేవమ్మాజితో 'లే అక్క-య్యా ! ఆకులో భోజనం మళ్ళీ చల్లారిపోగూడదు' అంది.

దేవమ్మాజి:-'మీరు యజమానురాలు. నేను మీమాటను కాదనను. అయితే మీరు 'కుంటిని' దండించాలి.' అంది.

రాణి:-'సరే అల్లాగే' అని ఆమెనులేపి చేతులు కడుగుకోడానికి నీళ్లు ఇప్పించి ఆకుముందు కూచోబెట్టింది. దేవమ్మాజి భోజనం ముగిసింతర్వాత సేవకుడు ఆకుతీసికొని బైటికి పోయాడు.

దేవమ్మాజి:-రాణితో 'కుంటికి మళ్ళీ ఓమాటు చెప్పండి. లేకపోతే ఇవ్వాళరాత్రి మళ్ళీ ఏం బలవంతం చేస్తాడో ?' అంది.

రాణి:-సైగద్వారా ఆమాట కొప్పుకొని కుంటినిచూసి 'బసవయ్యా! కొంచెం ఇటు రా' అంది. అంతవరకూ బైట నిలబడ్డ కుంటి లోపలికివచ్చి గుమ్మందగ్గిర నిలబడ్డాడు.

రాణి అతనితో 'నిన్నరాత్రి అక్క-గారికి తొంవరకలగజేసావుట. అట్లా మళ్ళీ ఎప్పు డైనా చేస్తావుగాని! జాగ్రత్త' అని గట్టిగా చెప్పింది.

కుంటి:-'దొరగారు నిన్న కొంచెం హుషారుగా వున్నారవ్వా ! పైపెచ్చు చెల్లెలమ్మనడత సరిగా లేదని తెలుసుకున్నారు. అందుకని అట్లా చేశారు.'

దేవమ్మాజీ:-'ఆయన హుషారుగాక్షేవున్నారూ లేరూ! తప్పు జరిగిందని తెలుసుకొన్నారో లేదో! ఇవన్నీ నీకెందుకు? ఆయన అనడమే ఆలస్యం, తొడమీద కూచోమని నన్ను పిలుస్తావా?'

కుంటి:-'నాకూ కొంచెం బుద్ధి గడ్డితిన్నదమ్మా, మేమేమిచేస్తున్నామో మాకే తెలియలేదు.'

దేవమ్మాజీ:-'నువ్వు తాగివున్నమాట నిజంకాని నీకు బుద్ధి తప్పిపోలేదు. అన్నయ్యగారిమాట నెపంగాపెట్టుకొని నాతో చదురులాడుదామని చూశావు.'

దేవమ్మాజీ రాణిచెవిలో ఇంకేదో వివరంగా చెప్పింది.

రాణిముఖం కోపంతో కందవారింది. ఆమె కుంటితో 'దొరలు, వారి ఇష్టంవచ్చినట్లు మాట్లాడవచ్చు. నౌకర్లు పరిచారకులూ, ఆయన అన్నట్లుగా నడుచుకోగూడదు. బసవయ్యా! తిరిగి ఇటువంటిమాటవింటే నీకు మంచిగాదు జాగ్రత్త' అంది.

కుంటి:-'ఆజ్ఞ అమ్మగారు.'

ఇంకో రెండునిమిషాలపాటు కూచుని, రాణి దేవమ్మాజీకి 'ఇవ్వాళ మీ ఊరికి మీరు పోదురుగాని అక్కా! చింతించకండి' అనిచెప్పి తనపెరటివైపు వెళ్లింది. ఆమె బైలుదేరి వెళ్లగానే కుంటి దేవమ్మాజీకి 'దొరల ఆజ్ఞ అమ్మగారూ! వాకిలి మూసేస్తున్నా. వేయకుండా వుంటే నా ప్రాణం తీసేస్తారు' అనిచెప్పి గదితలుపులు ముందుకులాగి తాళంవేశాడు. ఓ నౌకరును పిలిచి వాకిలిదగ్గిర కావలావుంచాడు. తాను వేరేపనిపై వెళ్ళిపోయాడు.

# 5

రాజభవనంలో సంగతులన్నీ ఈవిధంగా నడుస్తూవుండగా, ఆదేసమయంలో సోమవారపేట నుండి మడకేరికి పోయేమార్గంలో ఇద్దరుప్రయాణీకులు మెల్లిగా మడకేరివైపు వస్తూవున్నారు. వాళ్ళలో పెద్దవాడు సుమారు అరవైఏండ్లవాడు. చిన్నవానికి ముప్ఫైఏళ్ళకంటె కొంచెం ఎక్కువవయస్సు వుండవచ్చు. పెద్దవానిమొగంమీది వెంట్రుకలు చాలభాగం నెరిసివున్నాయి. అంచేత అతనివయస్సు అంచనా కట్టడానికి వీలౌతోంది. ముఖంలోని శేషభాగం అతని వయస్సుపట్టి ఇవ్వడంలేదు. కాని మొగంపై మెఱుస్తూవున్న కన్నుగవ, జీవితంలో బాగా కష్టాలు అనుభవించివున్నట్లు విశదం చేస్తున్నాయి. చిన్నవాని ముఖముద్రావైఖరులన్నీ పెద్ద వానిముఖాన్ని పోలివున్నాయి. వాళ్ళిద్దరినీచూస్తే చాలు, ఎవళ్ళకైనా ఇట్టే తెలిసిపోతుంది, తండ్రీ కొడుకులని.

ఇంకో గుట్టఎక్కితే చాలు మడకేరి. చిన్నవాడు పెద్దవానికి 'ఈ మెట్టఎక్కితే మడకేరి అప్పాజీ' అన్నాడు.

పెద్దతను:-'ఔను అప్పయ్య![1] జ్ఞాపకంవుంది.'

చిన్నతను:-'మడకేరిదగ్గిరకు వచ్చినకొద్దీ నాకు మీరు దానిలోపలికి వెళ్ళరాదనిపిస్తోంది.'

పెద్దతను:-'నాకైనా అట్లాగేవుంది. కాని మన చెన్నవీరుడు ఏమైందీ తెలియవచ్చు. ఈ నేలను మనదిగా నిలుపుకోవాలి. దానికోసం ఇదంతా.'

చిన్న:-'మనదికాక, ఏం కొంపమునిగింది అప్పాజీ! ఈయన లేకుంటే ఈయనచెల్లెలు, ఆమె కాకుండాపోతే, ఈయన కూతురిది. ఇంతేగా, ఇంతకంటే వేరే ఏమైపోతుంది?'

పెద్దతను:-'ఏమౌతుందంటావా? అప్పయ్యా! మైసూరు ఏమైందో చూడు. తెల్లవాళ్ళపాలై పోలా?'

చిన్న:-'ప్రజలను సమాధానపఱచి ప్రభువులకు తిరిగి అప్పగిస్తారుటకదూ?'

పెద్ద:-'మూడేళ్ళయిపోయింది. ఇవ్వాలేదు, పెట్టాలేదు. ఎప్పుడు ఇవ్వడం? ఇస్తాం అంటారు ఒకరు. ఇస్తే ప్రజలకు కష్టమౌతుందంటారు ఇంకోరు. వీళ్ళల్లో ఎవరిమాటనమ్మడం? రాజుగారిసొత్తు తెల్లవాళ్ళచేతుల్లో తిరిగి వచ్చింతర్వాతకదూ వీళ్ళది అవి చెప్పడం?'

చిన్న:-'అక్కడి ప్రభువులకు సంతానంలేదు అప్పాజీ!'

పెద్ద:-'వుంటే వాళ్ళకిస్తారా ఏమిటి? ఇచ్చినా పేరు కివ్వడమే. పెత్తనమంతా వాళ్ళదే. వాళ్ళ చేతులలో వీళ్ళజుత్తు పెట్టుకొని మరీ ఇస్తారు. సేవకుడిబిడ్డ ముద్దు కుక్కనోటిదగ్గిర. ఆబిడ్డ వాడిదంటేనేమి కాక కుక్కదేనంటే నేమి?'

చిన్న:-'మొత్తంమీద ఈ తెల్లవాళ్ళది నిండా ఉపాయం అప్పాజీ!'

పెద్ద:-అది సరే. తంత్రమంటే వీళ్ళదేతంత్రం. తెల్లవారిదగ్గిర్నుంచి నేర్చుకోవాలి తంత్రాల్ని.'

చిన్నతను ఈమాటకు వెంటనే జవాబు ఇవ్వలేదు. నాలిక చివరిదాకా వచ్చినమాటను ఆపేసి, ఏదో ఆలోచిస్తూ ముందుకు అడుగులువేశాడు.

వీళ్ళ ఈ మాటలవల్ల తండ్రీ బిడ్డలనీ, కొడగు రాజకుటుంబానికి చెందినవారని స్పష్టమై వుంటుంది. ఆంగ్లేయులు అంతకు రెండేళ్ల పూర్వమే మైసూరు రాజుగారైన ముమ్మడి కృష్ణ రాయ ప్రభువులనుండి ఆ సంస్థానం పరిపాలనను స్వాయత్తం చేసికొన్నారు. కృష్ణరాజు గారికి చేసినచెఱపు తెల్లవాళ్లు వీరరాజుగారికీ చేయగలరని చిన్నతని సందేహం.

నాలుగడుగులు వేసినమీదట చిన్నతను 'మళ్లీ ఈ తెల్లవారిని మనమైనా ఎట్లా నమ్మడం అప్పాజీ?' అని ప్రశ్నించాడు.

పెద్దతను:'-పాముకూ పాములవాడికీ, వున్నసంబంధమే వారికీ మనకూ అప్పయ్యా! కనుకలిగి వుండాలిసిందే. ఏమరకూడదు.'

చిన్న:-'మనం వారిని పాము అనుకొన్నట్లు వారు మనల్ని పాముగా భావిస్తున్నారా అప్పాజీ!'

---

1. 'అప్పయ్య' ప్రేమసూచకమైన వ్యవహారం. తెలుగులో 'నాయనా' తండ్రీ' అని అన్నట్లు -అనువాదకుడు.

పెద్ద:-'భావిస్తే చేసేదేమిటి? అల్లాగే భావించేవున్నారు. మనల్ని రాజుకు విరోధులుగా తయారు చేసి తాము బ్రతకాలని చూస్తున్నారు. మనం ఆ పన్నాగానికి చిక్కుపడిపోకూడదు. దేశాన్ని వారిచేతులలో పెట్టకూడదు.'

చిన్న:-'వాళ్ల మనల్ని విరోధులుగా చెయ్యాలా వేరే? మనం కామా?'

పెద్ద:-'మనం ప్రతికక్షులం కాము. అప్పయ్య మనమే కక్షిదారులం. వీళ్లే ప్రతికక్షులు. అణ్ణాజీ పోయేముందు చాలా జబ్బుపడ్డాడు. ఆయన నన్నూ, లింగప్పాజీని, పిలిచి చేతిలో చేయివుంచి శపథం చేయించారు. దేవమ్మాజీ రాణి, మీరు ప్రధానులు కావాలి. సత్య ప్రమాణంగా అన్నారు. అన్న నేను, తమ్ముడు లింగప్పాజి, ఇద్దరమూ ప్రమాణం చేశాము. చేసినరోజే ఈ నా తమ్ముడు అట్లా నడుచుకొనేదిలేదు అన్నాడు. నిజం ఆలోచిస్తే ఎవరు ప్రభువుకావాలి? అన్నో, తమ్ముడో? లింగప్పాజి తాను రాజ్యానికి రావాలి అన్నాడు. నేను దీనికి సరేనన్నా. నీకు ఏలే చాకచక్యంలేదు అన్నాడు. 'ఎందుకని' అని ప్రశ్నించాను. ఇచ్చినమాట త్రోసిపుచ్చడం చేతకానివాడు రాజ్యం ఏమిటి చేస్తాడు? అన్నాడు. 'సత్యవంతులకు రాజ్యం తగదు కాదూ!' అని అడిగాను. చివరికి నువ్వే రాజు కా! అన్నాడు. నాకు సమ్మతమే కాలేదు అప్పయ్య! అణ్ణాజి మమ్మల్ని ఇద్దరినీ, సాక్షి పెద్దవారినిచేశారు. మాట ఇవ్వమని అడక్కుండా వుండాల్సింది అడిగారు. ఇష్టంలేకపోతే మేము ఇష్టపడడంలేదని చెప్పివుండాల్సింది. అట్లా చెప్పాంగాదు. అడిగినప్పుడు అణ్ణాజికి మాటఇచ్చి, చచ్చిపోగానే నోరూరితే తల్లిదండ్రులకు మంచిపేరుతెచ్చినట్లా? బిడ్డలకు శుభం కోరినట్లా? తనకోరికకు నేను అడ్డుతగలవచ్చుననే ఉద్దేశంతో, అణ్ణాజీపేరుపెట్టి నన్ను చంపించాలి అనుకొన్నాడు. దాన్ని ఎట్లాగో తప్పించుకొన్నా. ఇహముందు నీవల్ల ఇబ్బంది కలగవచ్చునని నీమీద కన్నువేసివుంచాడు. దేశాలవెంటబడి తిరగడంతో పరదేశి అయిపోయాను. ఊరిలో ఇతడు ఒక్కడే మిగిలాడు. అంతే సంతోషంగా గద్దె ఎక్కాడు. ఎక్కి ఏమంత అనుభవించాడు? పదిరోజులు ఎగిరి గంతులేసాడు. రెక్కలూడి క్రిందపడ్డాడు. ఈ బిడ్డ రాజు అయ్యాడు. అప్పచేత అక్కర్లేదనిపించాడు. దొడ్డప్పకూతుర్ని చంపేశాడు. కన్నతండ్రి బిడ్డను, చెల్లెల్ని చెరలోవుంచాడు. ఈయన బ్రతికి బట్టగట్టి ఇక్కడ రాజ్యంచేస్తే మనం ఇక్కడకు రావాల్సినపని లేదు. పో. వుంచే మర్యాదగావుండి పెద్దల పేరుచాటున పెంపొందాలి. తానూ సరిగా బ్రతికిందిలేదు. ప్రజల్నీ చక్కగా బ్రతకనిచ్చిందిలేదు. రాజవంశం బాధ్యతకదూ! మోసే వెన్నువుండగా పరాయివారి మీద భారం పడకూడదు కదూ! చెన్న వీరయ్యవచ్చి అన్నాడు. నాకొతుందనిపిస్తోంది అని. అందుకే ఎనిమిదినెలల్రక్రితం నిన్ను ఇక్కడికి పంపించిది.

చిన్న:-'మీరు వద్దన్న దొరతనం నాకుమాత్రం ఎందుకు అప్పాజి?'

పెద్ద:-నేను అణ్ణాజికి మాట ఇచ్చివున్నాను. నాకు అది అక్కర్లేకపోయింది. రాజవంశం బిడ్డవు నీకు ఆమాట వర్తించదు.'

'కాని చెన్నవీరయ్య రాకముసుపు నీకు ఈమాట తోచలేదు.'

'ఆమాట నిజమేననుకో. ఇప్పుడు దీసి ఆలోచన ఏమి అని మెదలకుండా వుండి పోయాను. చెన్నవీరయ్యవచ్చి, ప్రజలు చాలా విసిగిపోయారు. తెల్లవాళ్ల మంత్రాంగం ఏదో నడుస్తున్నట్లువుంది అని చెప్పినప్పుడు ఇహ మెదలకుండా వుండకూడదని వూహించాను.'

'అట్లాగంటారా?'

'ఔను. ప్రజలను కూడగట్టుకోవాలనివెళ్ళి చెన్నవీరయ్య అజాగ్రత్తతో రాజుకు పట్టు బడిపోయాడు. బెంగుళూరికి పారిపోయివచ్చిన వాణ్ణి రాజు తెల్లవారికిచెప్పి, పట్టుబట్టి వెనక్కు రప్పించుకొన్నాడు. ఆపైని అతని సమాచారమే ఏమీ తెలియలేదు. ఏమైందీ తెలియంది మనస్సుకు ఊటటరాదు.'

'ఆమాట నిజం అప్పాజి!'

'మనకై పాపం వాడు ప్రాణం అర్పించినా అర్పించినవాడే. మన అదృష్టం అతనికి కొట్టి వుంటుంది.'

'పాపం!'

'అత దేమయ్యాడు అని తెల్లవాళ్ళు ఈపాటికి పదిసార్లు అడిగారు. రాజు వారికి ఓమాటూ, ఒక్కమాటా చెప్పలేదు. ఈయన అతన్ని ఏమిచేసివుండరాదు?'

ఈమాట లంటున్నప్పుడు పెద్దతని కంఠధ్వనిలో గాంభీర్యం పొదివికొన్నది. అది చిన్న వానిమనస్సులోకూడా ఎదో గంభీరమైనభావాన్ని పొదుకొల్పింది. ఏమైనా చెప్పాలి. మాట ముందుకు సాగనివ్వాలి. అనేఊహ ఇతనికి పోలేదు. చిన్నతను ఏమీ మాటాడలేదు.

నడుస్తూనడుస్తూ చిన్నతను తనచేతి సంచిలోంచి రెండు కాషాయవస్త్రాలను పైకి తీశాడు. ఓచోటనిలబడి పైనుంచి కిందిదాకా అంగీధరించి తలకు పాగాచుట్టి ఓ శైవాచార సంపన్నుడైన శివయోగిలాగా భాసించాడు. తండ్రీ కొడుకులిద్దరూ మౌనంగా దారినబడి నడిచి పోయారు.

# 6

ఆదినమే సుమారు అదేసమయంలో మడకేరి బ్రాహ్మణాగ్రహారంలో మంత్రి లక్ష్మీనారాయణయ్య ఇంటిముందు ఓ బ్రాహ్మణయువకుడు నిలబడివున్నాడు. అతన్నిచూసిన పరిచారకుడు లోపలినుంచివచ్చి 'పరదేశివా ? భోజనానికి వచ్చావా ?' అని అడిగాడు.

ఆగంతుకుడు చింతాకులితమైన కంఠధ్వనితో 'లేదు, యజమానుల దర్శనార్థం వచ్చాను' అన్నాడు.

సేవకుడు 'యజమానులు స్నానానికి లేచారు. భోజనవేళ. కూడా కూచోండి. మీరు చెప్పదలచుకొన్నది చెప్పండి' అన్నాడు.

ఆగంతుకుడు ఓ నిమిషం ఆలోచించి 'కానీ అట్లాగే చేస్తాను' అని సేవకునితోబాటు లోపలికి వెళ్ళాడు.

మంత్రిగారిఇల్లయినా అదేమంత భాగ్యవంతుల ఇల్లు అనిపించుకోడంలేదు. ఇల్లయితే కావాలిసినంత పెద్దదే. వరండాలోంచి లోపలగా పెద్దపెరడు. అక్కడ ఓవైపు అరుగుమీద ఐదారుగురు బ్రాహ్మణులు కూచొనివున్నారు. ఒకతను ఆకులు కుట్టుతున్నాడు. ఒకతను జందెం వడుకుతున్నాడు. మరోఅతను ఆసనశుద్ధిగా కూచొని జపం చేస్తున్నాడు. మిగతా వాళ్ళు ఓవైపుకూచొని మెల్లిగా తమలోతాము సంభాషించుకుంటూ వున్నారు.

క్రొత్తవాడు రావడంతోటే ఈ మాట్లాడుతున్నవారిలో ఒకడు 'రండి స్వాములు రండి' అనిచెప్పి లేచినిలబడి ఆయన్ను స్వాగతించి దగ్గిరసా వచ్చాడు.

నవాగంతుకుడు 'యజమానులతో చెప్పుకోవలసినమాట వుంది. అందుకోసం వచ్చాను. మీరు భోజనానికి వుండండి, భోంచేసేసమయంలో చెప్పుకోండి' అన్నారు. సరే అట్లాగేనని వచ్చాను.'

ఎదుటిమనిషి 'దానికేమీ అడ్డులేదు. ఏమైనా అడగాలంటే అదే సరైనసమయం. స్నానమైందా ? చేస్తారా ?' అని అడిగాడు.

నవా:-'మడికట్టుకొని వచ్చాను. ఆహ్నికం అంతా అయింది' అని జవాబు ఇచ్చాడు.

ఆసమయానికి సేవకుడు అక్కడేవున్న ఒక గంగాళంలోంచి నీటితోనిండినచెంబు అతనిదగ్గిరకు తెచ్చాడు. అతడు దాన్ని తీసికొని దొడ్డిలోకిదిగివెళ్ళి కాళ్ళు కడిగికొని చెంబు తిరిగి ఇచ్చేశాడు. ఇతరులు కూచునివున్నచోటికి, అరుగుమీదికిపోయి, తానూ వారిదగ్గర కూచున్నాడు.

ఓ గడియ గడిచివుంటుంది. స్నానం, సంధ్య అన్నీ ముగిశాయి. లోపలినుంచి 'రామ కృష్ణ : బ్రాహ్మణులకు విస్తళ్ళు వేశారా ?' అని అడుగుతూ, నడివయస్సులోవున్న ఓ పెద్దాయన వచ్చాడు.

ఆయనే మంత్రి లక్ష్మీనారాయణయ్య. వారు [1]హవ్యక బ్రాహ్మణులు. లక్ష్మీనారాయణయ్య చాల తేజస్విఅయిన మనిషి. ఆయన వస్తూవుండగానే అక్కడవున్నవారందరూ లేచి నిలబడ్డారు. ఆయనకు నమస్కరించారు.

రామకృష్ణయ్య ఇంతకుముందు పరదేశియువకుణ్ణి స్వాగతించినమనిషి. అతడు యజమానికి 'వేయించాను స్వామీ' అని జవాబుచెప్పి బ్రాహ్మణులను 'అందరూ లోపలికి దయ చెయ్యాలి' అని ఆహ్వానించాడు.

అందరూ లోపలికివెళ్ళారు. లక్ష్మీనారాయణయ్య లోపలికి పోయేముందు 'వేరే ఎవరూ లేరు కదూ?' అని జిజ్ఞాస వెలిబుచ్చాడు రామకృష్ణయ్య 'లేరు, చూశాను' అని జవాబిచ్చాడు.

లోపల భోజనశాల. అది కావలసినంత విశాలంగా వుంది. వేర్వేరుపంక్తులలో సుమారు నలభై మంది కూచోవడానికి వీలుగా వుంది. ఇప్పటికే రెండువరుసలు భోంచేసి లేచినట్లుగా కనబడుతోంది. మూడోపంక్తి ఇంటియజమాని కూచునేపంక్తి. అందులో కొంచెం ఆలస్యంగా వచ్చేవాళ్ళు చేరవచ్చు.

ఆకులు వేసినచోట ఓ ముసలవ్వ నిలబడ్డది. ఆమె లక్ష్మీనారాయణయ్యను, 'అవతల ఎవరూ లేనట్లేనా అప్పా!' అని ప్రశ్నించింది.

ఆయన జవాబివ్వడానికిముందే రామకృష్ణయ్య 'ఎవరూ లేరుతల్లీ! నేను చూశాను' అన్నాడు.

ముసలమ్మ 'చూశావా? మంచిపనైంది' అని లోపలఉన్న ఒకరినిపిలిచి 'లక్ష్మీ! వీధి వైపు అటు చూసిరావమ్మా భోజనానికి ఎవరైనా వుండివుంటారు' అంది.

లోపలినుండి సుమంగలి ఒకర్తుకవచ్చి 'చూస్తాను' అని బైటికిపోయి తిరిగివచ్చి 'ఎవరూ లేరు' అంది.

ముసలమ్మ లక్ష్మీనారాయణయ్యతల్లి. లక్ష్మమ్మ అతనిపత్ని. భోజనానికి వేరేమనుషులు కాచుకొని లేరుకదూ అని విచారించేపద్ధతి వారికి ప్రతినిత్యం ఆచరణలోవున్న అలవాటు.

అందరూ భోజనానికి కూచున్నారు. రామకృష్ణయ్య మంత్రికి ఏమిటోచెప్పాలి అనుకొంటున్నయువకునితో 'మీమాట ఏమిటో చెప్పుకోవాలిసి వుంది అన్నారుకదూ! చెప్పుకొవండి' అన్నాడు.

యువకుడు 'భోజనం చేసింతర్వాత విన్నవం చేసికొంటాను' అన్నాడు.

రామకృష్ణయ్య 'మేము ఇక్కడ ఒకే కుటుంబంలాంటి వారం. ఎవరూ ఏమాట చెప్పుకోవడానికైనా జంకవలసినవసిలేదు. మరీ రహస్యమైన మాటవుంటే మీ ఇష్టం. అట్లాంటి దేమీలేకపోతే ఇప్పుడే చెప్పవచ్చు' అన్నాడు.

---

1. కన్నడ స్మార్తబ్రాహ్మణులలో ఒక శాఖ.

మునలవ్వ అక్కడే తిరుగాడుతూ 'వీరికి మజ్జిగపులుసు తీసుకురా. వీరికి పెసర పచ్చడి చూడు' అని పరివారకునితో చెప్పుతూవుంది. రామకృష్ణయ్యమాటవిని యువకునితో 'ఏమో చాలా దిగాలుపడి కూచున్నావుబాబూ! ఏ ఊరు మీది?' అని ప్రశ్నించింది.

యువకుడు:-మావూరు పాజె అమ్మగారూ! నేను అక్కడి పురోహితులవారి రెండో అబ్బాయిని. సూర్యనారాయణ అని పేరు.

మునలవ్వ:-పాజే పురోహితులవారి రెండోకుమారుడివా బాబూ నువ్వు? అదేదో కథ విన్నామే!'

సూర్య:-'ఔను తల్లీ! సరిగా ఇవ్వాల్టికి ఆరురోజులైంది. నా భార్య బావికి వెళ్ళింది. తిరిగి వెనక్కురాలేదు. నీటిలో జారి పడిందేమోనని చూశాం. అదేమీ కాదు. నాల్గువైపులకూ మనుషుల్ని తోలాం. ఒకరు ఇక్కడకువచ్చి చూద్దాం మంచిదని బైలుదేరి వచ్చాను. దారిలో ప్రశ్నిస్తూవచ్చాను. అదే ఎవరో తమకు చెప్పివుంటారు.'

మునలవ్వ:-'అవును. మొగుడు వెదకుతున్నారు. బసవన్న దొంగతనంగా కాజేసి తెచ్చాడు అని ప్రజలు గుసగుసలు పోతున్నారు' అంది.

సూర్య:-'ఔను తల్లీ! జనం నాకూ చెప్పారు. ఇక్కడ మెల్లిగా విచారించాను. ఇక్కడికి తెచ్చివుంచారు. కావలాపెట్టి వుంచారు. యజమానులకు చెప్పుకొంటే అంతా సరిదిద్దుతారు అన్నారు. ఆ పైని మీ కాళ్ళపైబడుదాం అని వచ్చాను తల్లీ!

'మంచిపని అప్పా: మంచిపని! అవశ్యం చేస్తారు. ఓ సంసారాన్ని నిలబెట్టడంకంటె పుణ్యమైనపని ఏమిటివుంటుంది మంత్రి అయినవానికి! శాంతంగా, నిదానంగా భోంచెయ్యి. ఆపైని అన్నిసంగతులూ చెప్పు. సరిచేసి పంపిస్తారు. చింతించకు నాయనా!'

మునలవ్వ ఇట్లా అంటూనే పరివారకునితో 'చూడు శంభూ వీరికి పచ్చడి వడ్డించు' అంది.

సంగతి చాలా దుఃఖకరమైంది, అవమానకరమైంది. అందరిమనస్సులూ వికలమై పోయాయి. ఎవరూ మాటాడలేదు. భోజనం మౌనంగా సాగింది.

పాణే సూర్యనారాయణమంత్రి లక్ష్మినారాయణయ్య ఇంటిముందు వచ్చినవేళకు సుమారుగా మంత్రి బోవణ్ణ ఇంటిముందు కొడగ ముసలివాడు ఒకడు నిలబడి సేవకునితో 'ఒరే అప్పా' [1]తక్కరున్నారేమో?' అని కేకవేశాడు.

బోవణ్ణ అక్కడ లోపలగా వున్నాడు. ముసలివానిమాట చెవిలో పడింది. ఆయన వాకిలి దగ్గరకువచ్చి 'రండి తాతగారు, లోపలికి రండి. ఎప్పుడు వచ్చారు? అందరూ కులాసా?' అని కుశలప్రశ్నం చేసాడు.

ముసలివాడు 'నమస్కారం తక్కరూ! మీరందరూ కుశలమా?' అన్నాడు.

ముసలివానిపేరు ఉత్తయ్యతక్క. ఆయన్ను కొడగుదేశంలో అందరూ ఎరుగుదురు. ఇంతటి ప్రసిద్ధికి ఓ కారణముంది. టిప్పుసుల్తానుపక్షాన ముసల్మానులు [2]భాగమండలాన్ని ఆక్రమించిన రోజుల్లో, ఆయన ఓ బ్రాహ్మణబాలకుని ప్రతిదినమూ మోసికొనితెచ్చి భాగ మండలంలోని దేవునికి పూజాభంగం వాటిల్లకుండా చూసేవాడు. ఇది నలభైఏళ్ల క్రిండి మాట. దొడ్డ వీరరాజు శాసనకాలంలో. శత్రువులు తొలగిపోయినతరువాత ఈసంగతి తెలిసి దొడ్డ వీరరాజు ఆయనకు గౌరవసూచకంగా రాజభవనంనుంచి [3]'పడి' నిత్యం వచ్చేలా ఏర్పాటు చేసాడు.

దొడ్డ వీరరాజు నవరాత్రి పర్వదినాల్లో ఓ పెద్ద సభచేసి అతన్ని పొగడినమీదట, అతని దర్పం మితిమీరిపోయింది. కొడగల సంతోషానికి మేరలేకుండాపోయింది. ఆరోజు లింగ రాజు అతన్ని వెన్నుతట్టి మెచ్చుకొన్నాడు. అతనితో స్నేహం పెంచాడు. ఉత్తయ్య తన రోజుల్లో మూడుపులుల్ని చంపిన మగధీరుడు. కొడగలలో పులిని చంపినవాళ్ళు అదో విలక్షణంగా మీసంపెంచే రివాజు వుంది. ఇతరులు మీసాల్ని ఆవిధంగా పెంచకూడదు. దొడ్డ వీరరాజు హయాంలో నవరాత్రి పర్వదినాల్లో ఈ మీసం పెంచుకొని, ముఖాన్ని అలంకరించుకొని కనబడే కొద్దిమంది మనుష్యల్లో ఉత్తయ్య ఒక్కడు. ఒకటి రెండుసార్లు లింగరాజు అతనివెంట వేటకుపోవడం జరిగింది. అతడు లింగరాజుగారి ఇతరవిషయాల్లోనూ చాలా చనవు తీసికొనేవాడని ఆ రోజుల్లో అనుకునేమాట. అందుచేత లింగరాజు కుమారుని,

1. 'తక్క' = యోగ్యుడు తగినవాడు. ఈ 'తక్క' శబ్దమును కొడగజాతివారు తమ పేర్లకు చివర తగిలించుకొందురు. 'తక్కలు' గౌరవ బహువచనరూపం.

2. భాగమండలము:-మడకేరికి పడమరగా 24 మైళ్లదూరంలో వుంది. ఇక్కడ భాగం డేశ్వరస్వామి ఆలయం కలదు. కన్నిక, కావేరీనదులు సంగమించుచోటు. తులామాసంలో యాత్రికులు వేలాదిగా వత్తురు. భాగండేశ్వరక్షేత్రమనికూడ పిలుతురు.

3. పడి = స్వయంపాక సామగ్రి. అర్ధశేరు బియ్యం అనిక్కిపెలు. 1½ సేర్లు అని బ్రాణ్యం.

చిన్నతనంనుంచీ చూశాడు. అతన్ని ఆత్మీయంగా [1]'పుట్టప్పాజి' అని పిలుస్తూవచ్చాడు. లింగరాజు రాజు కావడానికి అతనెంతో ప్రోత్సాహమిచ్చాడు. ఆయనకొడుకు రాజవడం కూడా ఉత్తయ్యకు ఇష్టమే. బోపణ్ణకు అతన్నిచూస్తే చాల గౌరవం చాలా ఆదరం.

లోపలికి పోవడమేమిటి బోపణ్ణ 'సాపాటు అయిందా? నేను ఇంకా చేయలేదు' అన్నాడు.

ముసలి: 'ఠక్కురు ఇంటికివస్తూ భోంచేసివస్తావా? పదండి భోంచేద్దాం' అన్నాడు.

ఇల్లు లక్ష్మీనారాయణయ్య ఇల్లంతే వుంది. లోపల మండువా. అక్కడలాగానే ఇక్కడా నలుగురుమనుషులు కూచునివున్నారు. బోపణ్ణ నౌకరునుపిలిచి 'తాతగారికి చేతికి నీళ్ళు తే' అన్నాడు. నౌకరు నీళ్ళు తెచ్చినాక 'పైన ఓ చోట పెట్టు' అన్నాడు.

ముసలివాడు ఉత్తయ్య కాలుసేతులు కడుక్కొన్నతర్వాత అందరూ లోపలికిపోయి భోజనానికి కూచున్నారు.

భోంచేస్తూ బోపణ్ణ ఉత్తయ్యనుచూసి 'ఊరినుంచి ఇప్పుడేనా వచ్చింది? ఏమిటి సంగతులు?' అని అడిగాడు.

'రాజభవనంలో నాకు 'పడి' ఇచ్చేవాళ్ళు కదూ! దాన్ని తెమ్మనమని పిల్లనౌకరును పంపాను. ఇహ మీదట ఇవ్వడం నిలిపేసాం అన్నాడుట బసవయ్య.'

'అరే!'

'ఊ! అల్లాగే అన్నాడుట' రాజుగారిచేతికి అడ్డు వస్తూవుంటాడు. మీ ఠక్కు అతనికి ఇంక బియ్యం ఎట్లా ఇస్తారు? ఇటు మొహం చూపించడానికి వీలులేదని చెప్పు. మీసం గొరిగించేస్తాం తెలిసిందా?' అని.

'ఏమి ఇతగాడి కొవ్వు! ఎంత ధైర్యం? ఎన్నిగుండెలు?'

'చూడండి ఠక్కురూ! ఏం ధైర్యం అనడానికి మా నౌకరు చెప్పినట్లు 'దొడ్డరాజుగారు భుజంమీది చేయివైచి తామగా యిచ్చిన మర్యాద, అది ఎవరు నిలిపేయగలరు' అని బసవయ్య అన్నాడుట 'ఒక రాజుగారుచేసింది ఇంకోరాజుగారు నిలిపేశారు' అని 'ఎందుకని?' అంటే రాజుగారిచేతికి అడ్డం వచ్చాడు అని.'

'అడ్డం రావడం అంటే?'

'అది విందురుగాని అనేవద్దా ఠక్కురూ! వినండి. దేశం తురకలపాలైంది. భాగమండలం బ్రాహ్మలు ఊరువిడిచి ఊడని పారిపోయారు. దేవుడినెత్తిమీద నీళ్ళ చల్లేవాళ్ళు లేరు. మిగతా వాళ్ళ యుద్ధం చేస్తూవుంటే నేను నాలుగునెలలు, ఒకరోజైనా విడిచిపెట్టకుండా కొడపాల్యం నుండి బావనపిల్లగారిని బుజాలమీద మోసికొని మూడుమైళ్ళునడిచి తెచ్చి అతన్ని స్నానం చేయించి ఆతని చేతిమీదుగా పూజచేయించేవాణ్ణి. దేవునెదుట పెట్టినదీపం కొండెక్కకుండా చూసేవాణ్ణి. దొడ్డరాజుగారు, వారి జీవం ఎక్కడైనా చల్లాగావుండని, అనుకోకుండా ఈ సంగతి

1. పుట్టప్పాజి = చిన్నతాతగారు.

ఫిన్నారు, విన్నుపోయారు' యుద్ధంలో పోట్లాడింది గొప్పకాదు. గుడి కనిపెట్టికొనివున్నది కొంచెంకాదు. రా తమ్ముడూ ఈ మర్యాద అందుకో అన్నారు. దాన్ని నిలిపివేయడానికి పీ రెవరు ?

'రాజుగారు యిచ్చారు, రాజుగారు తీసేశారు అంటున్నాడు కదూ! ఎందుకో తెలుసు కోవాలి !'

'అనేదేమీలేదు పొండి. అయితే గియితే ఓ మాట అయివుండాలి. మా మేనగోడలు పెళ్ళికి వచ్చివుంది. కంటి కింపుగా వుంటుంది.

ఆమె ఆ పిల్లను తన మేనల్లుడికి ఇవ్వాలి అంటుంది. పెళ్ళికావాలి: మధ్యలో రాజ భవనంనుంచి వార్తాహరుడు వచ్చాడు. రాణిగారి కైవారానికి ఈ పిల్లను పిలుస్తున్నారు అన్నారు. ' పెళ్ళి ఆపేసెయ్యండి అన్నాడు. కోడలు తికమక పడిపోయింది. 'ఎట్లా మామా ?' అంది. నేనుపోయి వార్తాహరునితో అన్నా, 'పెళ్లి చేస్తారు. పిల్లను అల్లుణ్ణి ఇద్దరినీ పంపిస్తారు. పిలుచుకొనిపోండి' అని. అదేమి కుదరదు అన్నాడు. మేము ఇదీ అవడానికి వీలులేదన్నాం. ఇది రాజుగారిమాట అంటారా ? అననీ. అది,చూస్తాం.'

'సరిపోయింది. చూద్దాం. ; ఇది ఎవరిచాతుర్యమో, బైటపడాలి. బసవన్న చేసిందంతా రాజుకు తెలియదు. అయితే అతనికాలు ఇంకోటికూడా విఱుగగొట్టాలి. రాజుగారు కోరుతూ వున్నారు- బసవన్న చేసాడు అంటే ఆయనబుద్ధిని సరిచెయ్యాల్సి.వుంటుంది. రాణి కైవారాని కని పేరుపెట్టి కొడగపిల్లను వేటాడుదామనుకొంటున్నారా వీళ్ళు ?'

బోపణ్ణకు బాగా కోపం వచ్చింది. అతని కంఠధ్వనికూడ పరుషంగావుంది. ముసలివాడు బదులు చెప్పలేదు. చెప్పాల్సిందీ లేదు.

మౌనంగా మూడుముద్దలు తిన్నతర్వాత బోపణ్ణ సేవకునిపిలిచి 'ఏరా బిద్దయ్యా ! 'తెల్లవారి గానే అయ్యవారి ఇంటికిపోయి మేము పొద్దుకుంకేవేళకు అక్కడకు వస్తామని విన్నపం చేయి' అన్నాడు.

సేవకుడు బిద్దయ్య 'చిత్తం తక్కరూ' అన్నాడు.

## 8

ఈ సంఘటనలు నడిచిన ఆరోజే సాయంసమయంలో మడకేరిలోని ఓంకారేశ్వరుని దేవా లయంప్రక్కన, అగ్రహారంమధ్య ఓ విశాలగృహం ముందుప్రక్క, అరుగుమీద ఇంటి యజమాని దీక్షితులు కూచుని ఒక తాటాకులపుస్తకం ఎదురుగ్గాపెట్టుకొని ఏమిటో చూస్తూ

వున్నాడు. ఆయన ఓంకారేశ్వరుని దేవాలయంలో స్థానికుడైన ముఖ్యమైన అర్చకుడు. అట్లాగే రాజభవనంలో జ్యోతిష్కుడు. రాజుగారి జాతకంలో ఆయనకూ, ఆయన చెల్లెలికీ మధ్య బాగా విరోధం పెరిగేలక్షణాలు కానవస్తున్నాయి అని చెప్పింది ఆయనే. ముసలివాడు నిమిషం రెండునిమిషాలే అవిషయమై ఆలోచిస్తూ, లెక్కలువేస్తూ మెదలకుండా కూచుని వున్నాడు. ఆలోచిస్తూ ఆకులుత్రిప్పుతూ, గ్రంథాన్ని చూస్తూవున్నాడు. ఈ గ్రంథపరిశీలనలో, ఈ ఆలోచనలో ఆయనకు బైటిప్రపంచం ఏమైపోతోందో ఏమీ పట్టినట్లు లేదు.

వ్యాసంగంలో మునిగి తేలుతూవున్న ముసలివాని ఎదురుగ్గా తెల్లని శుభ్రమైన చీర మల యాళపద్ధతిలో ధరించి, ఓ మహిళవచ్చి నిలబడింది. ఆ మూర్తి, ఎదుటవచ్చి నిలబడేదాకా, దీక్షితులకు తన వ్యాసంగం మినహాయించి వేరేగొడవే పట్టలేదు. అపరిచితమైన స్త్రీ వ్యక్తి. అసాధారణమైన వేషం - చూసి దీక్షితులు మొదట కొంచెం విస్మయావిష్టు డయ్యాడు. వ్యాసంగాన్ని వదిలేసి ఆ మహిళవైపు చూశాడు.

మొదటిక్షణంలో ఆయనకు ఈమె ఎవరో జ్యోతిషం అడగడానికి వచ్చివుండొచ్చు అను కొన్నాడు.

మహిళ దీక్షితులకు ముకుళితహస్తయై నమస్కరించింది. 'శరణు ! అణ్ణయ్యా ! గుర్తు పట్టారా ?' అని ప్రశ్నించింది.

తన్ను అణ్ణయ్య అని పిలిచే ఈ మహిళ ఎవరై వుండొచ్చా అనేది, దీక్షితునికి వెంటనే స్ఫురించలేదు. ఆయన మహిళవైపు దృష్టి నిగుడించి చూశాడు. వయస్సు పశ్చిమాభి ముఖంగావున్న మహిళ ముఖంపై ముసలితెన్నులు ఇంకా స్పష్టంగా లేవు. అయినా ఏమంత లాలిత్యమూ లేదు. తీరు గడుసుగావుంది. నిదానించిచూస్తే ఆయనకు ఆమె మొగం తాను చూసినమొగమల్లేనే కనబడింది. 'కాకపోవచ్చు' అనేభావంతో, అయినా 'గుర్తు రాలేదు' అనిచెప్పడం బాగా వుండదనుకొని ఆయన 'ఏమిటి, మా పాపవా ఏమిటి తల్లీ !' అని అడిగాడు.

'గుర్తు పట్టారు. అవును మీ పాపనే. నేను మీ పావ స్వరూపాన్ని. మీరు మా పుణ్య స్వరూపులు' అంటూ మహిళ నవ్విపోసింది. దీక్షితులకూ నవ్వు ఆగిందికాదు.

'ఇదేమిటి పాపా ! ఎప్పుడు వచ్చావు ? ఎక్కడినుంచి వచ్చావు ? ముప్పైసంవత్స రాలుగా కనబడకుండావుంటూ, వున్నట్లువుండి ఈవిధంగా ఎదురుగ్గావచ్చి నిలబడ్డావుకదూ ! వస్తున్నానని ఓ ముక్క కబురైనా చేయకూడదా ? ఇట్లా వచ్చిందానివి - ఏదో నిన్న ఇంటికి పోయి, ఇవ్వాళ వెనక్కు తిరిగివచ్చినట్లు నేను పాపా అని పిలవగానే హాస్యాలు మొదలు పెట్టావు కదూ ? ఎప్పుడూ నీ చమత్కారం ఇట్లాగే వుంటూవచ్చిందే ?'

'వరదేశగతురాలైవున్న ఆడపిల్లను వెనక్కుతిరిగి వచ్చాను. తప్పెట్లతో చాటించి రావాలిసిందంటారా ? 'నువ్వు' అని పిలిచేవారు మీరుతప్ప నాకు ఇంకెవ్వరూ లేరు. ఎవరిని పిలిచి ఏమని కబురుపెట్టేది. నేనే వచ్చేశాను.'

'సంతోషం. తల్లీ! రా, కూచో. మడికేరికి ఎప్పుడు వచ్చావు?'

మహిళ వేదిక ఓ మూలకు కూచున్నది.

'ఇక్కడికి వచ్చింది ఈ పొద్దే. ఊరికివచ్చి ఆరునెలలు అయింది. మిమ్మల్ని చూడ దగినసమయం రానీలే అని మెదలకుండా వుండిపొయ్యా ఇన్నాళ్లు.'

'ఈ ఊరికివచ్చి ఆరునెల లైందా?'

'వెనక్కు తిరిగివచ్చి ఆరునెలలైంది. ఊరిలో భగవతి ఉపాసకురాలు అని నన్ను పిలుస్తారు. రాజభవనానికిపోయి వున్నా. మీ చెవిదాకా రాలేదా?'

'ఓహో! నువ్వు భగవతమ్మవా? చెవికి పడకపోవడ మెట్లాంటిది? కావలసినన్నిసార్లు విన్నాను. శాంతి పాఠం పూజాపురస్కారాలు చేయించారుకదూ రాణిగారు.'

'ఇంకా కొంచెం పూజా జపాలు నడిపిస్తారా అని అడిగాను. మీరు వద్దన్నారని చెప్పారు.'

'దేవునికి పూజలు చేయిస్తామంటే వద్దని ఎందుకంటాను నేను? కొన్నాళ్ళు ఓపిక పట్టండి అనిమాత్రం చెప్పాను.'

'సరే, ఇంతకీ మీరు రాజగృహం జ్యోతిష్కులు. రాజభవనాన్ని వేగళ్లతో కాపాడేవారు. ఆగొడవ మాకెందుకు? ఇప్పుడు [1]అణ్ణయ్యా! మీరు కొంచెం నా గోడు, నా గొడవ పట్టించుకోవాల్సిందిగా వేడుకోవటానికి వచ్చాను.'

'ఏం కావాలి తల్లీ!'

'చెబుతాను. అయితే ఇవన్నీ వీధిలోకూచొని మాట్లాడటానికి వీలైనసంగతులు కావు. గుడిలో పూజకుముందో, పూజ తర్వాతనో కొంచెంసేపు కూచుంటే వేరెవ్వరికీ వినబడకుండా కొన్నిమాటలు మాట్లాడాలి.'

'అంతోటి రాచకార్యం ఏమిటి తల్లీ! నువ్వు ఎవరో, ఏమిటో ఊళ్లో ఎవరికీ తెలియదు. అప్పటి మనుషులు, ముసలివాళ్లల్లో, నాబోటివాళ్ళు ఇక్కడొకడు, అక్కడొకడు వ్రేళ్లమీద మిగిలారు. నీకేమిటి భయం?'

'నాకే భయంమాత్రం ఎందుకు? మలయాళ భగవతి పేరుచెబితే ప్రజలే భయపడిచస్తారు. నేను మిమ్మల్ని అడగాలి అనేది నా మర్యాదను నిలబెట్టేమాట. నా కుమారుని రక్షించే మాట!'

'నీ కుమారుడు? నీకో పిల్లవాడు ఉన్నాడా? ఎక్కడ ఏడీ వాడు?'

---

1. దీక్షితులు పెత్తండ్రి అవుతాడు. అయినా 'అన్నయ్యా!' అని పిలవడంలో వింతేమీ లేదు. ఉమ్మడికుటుంబాల్లో పెద్దవాళ్ళు పిలిచే వరసలమట్టే చిన్నవాళ్లు పిలుస్తూవుంటారు. అలవాటు. తనతండ్రీ అన్నయ్య అని పిలిచేవాడు. తానూ అన్నయ్య అని అందుకే పిలుస్తోంది— అనువాదకుడు.

'అదంతా సాయంకాలం గుడిలో చెబుతాను.'

'ఇవ్వాళ్లనే?'

'ఇవ్వాళ రమ్మంటారా లేక మరోవేళ రమ్మంటారా? చెప్పండి.'

'ఇంకోరోజు రా అంటే నువ్వు మందిరానికి వెళ్లాలో ఏమో?'

'అవును.'

'ఇందుకోసంగా తిరిగి మళ్లీ ఏం వస్తావు? ఇవ్వాళనే రా, మాట్లాడుదాం.'

మహిళ లేచి నిలబడ్డది. 'సరే మంచిది' అంది.

'ఇంట్లో పిల్లా జెల్లా అందరూ క్షేమం కదా! ఇంకోసారి వచ్చినప్పుడు అందర్నీ చూస్తాను' అని చెప్పి వీధివైపు వెళ్లిపోయింది.

# 9

నడిచిపోయేటప్పుడు దీక్షితులు ఆమెవంకేచూస్తూ కూచున్నాడు. ఆమె కంటిచాటైనపిమ్మట తన పుస్తకంవైపు తిరిగాడు. చదువు ముందుకు సాగలేదు. పుస్తకాన్ని కట్టిబెట్టాడు. 'అన్నా' అని తన్ను పిలిచిన ఈమె కథంతా జ్ఞాపకానికి తెచ్చుకున్నాడు.

అయిదుసంవత్సరాల క్రిందటిమాట. దీక్షితునికి ఒక్కతమ్ముడు. ఈడొచ్చినవాడు, అందమైనవాడున్నూ. అతన్ని అందరూ అన్నకంటె బుద్ధిమంతుడని చెప్పుకొనేవారు. అతనికి సంగీతం వచ్చు; వైద్యం వచ్చు. జ్యోతిషం చెప్పేవాడు. తండ్రి మెప్పును పొందిన పిల్లాడు. వయస్సు వచ్చిందని అతనికి పెళ్లి చేశారు. ఆ పెళ్లాం తొలిచూలి ప్రసవకాలంలో చనిపోయింది. అతడు తిరిగి పెళ్ళి చేసుకోనని చెప్పేశాడు.

దొడ్డరాజుగారిరోజుల్లో రాజప్రాసాదంలో సంగీతగోష్ఠులు నడుస్తూనే ఉండేవి. ఒకగాయని ఎంచక్కగానో పాడేది. అందానికి లోపంలేదు. రాజసౌధంలోవుండే ఆ స్త్రీని ఆ యువకుడు తన చెలిమికత్తెగా చేసుకొన్నాడు.

పెళ్లంటూ చేసుకోకపోయినప్పటికీ ఈ సంబంధం పెళ్ళికంటె వాళ్ళిద్దరికీ పెళ్ళినిమించిన అనుబంధాన్ని అనురాగాన్ని కూర్చింది. గాయకురాలికి ఒక కూతురు పుట్టింది. ఆమెను తండ్రి ముద్దుగా 'పాపా' అని పిలిచేవాడు. అదే ఆ బిడ్డపేరుగా నిలబడిపోయింది. తల్లీ, కూతురు అడపా తడపా ఈ ఇంటికి వస్తారు. మడికట్టుకోని సమయంలోవస్తే దీక్షితులు పిల్లను ఎత్తుకొనేవాడు, ముద్దులాడేవాడు. మన ఇంటిపిల్ల కాదనేనెపంతో దీక్షితులు పిల్లను త్రోసిపుచ్చలేదు. తండ్రి అన్నగారైన తనకూ ఆపిల్ల 'పాపగానే ముద్దులు కురుస్తోంది. తన

తండ్రి అన్నయ్యను 'అన్నయ్యా!' అని పిలవడం తనకు తెలుసు. అందుచే తానూ అతనిని 'అన్నయ్య' అనే పిలువసాగింది.

పిల్లకు పదహారేళ్లు నిండాయి. మహా చక్కనిచుక్క. తండ్రినుంచి సంస్కృతం నేర్చింది. తల్లీ తండ్రీ, ఇద్దరినుండీ సంగీతం నేర్చుకొంది. రాజసౌధంలోని పిల్లే అయిపోయింది. లింగరాజు అప్పట్లో తరుణుడు. ఈమెపై దృష్టి పడిందో లేదో ఈమెను మోహించాడు. అతనికి రాజ్యమైతే వుందిగాని సంతానం లేదు. ఒకే ఒక బిడ్డ పుట్టి చనిపోయాడు. ఆ రోజుల్లో అతను ఈ చిన్నపిల్లకు ఎంతో గారాబం, ముద్దు మురిపెం చూపించి ఆశలు కల్పించి తనదానిగా చేసికొన్నాడు.

ఏదో అనుబంధం కావచ్చునని వీరందరికీ అనుమానం. కాని ఈవిషయం బైటపడింది పిల్ల గర్భవతిఅయినపిమ్మట. దీక్షితుని తమ్మునికి తన పెళ్లాం వేశ్య అనిగాని, గాయకురాలు అనిగాని ఏవిధమైన హీనభావమూ ఏర్పడలేదు. కానైతే తనపిల్ల, వేశ్యగాగాని, గాయకురాలుగాగాని వుండటం అతను సహించుకోలేకపోయాడు. అందు లింగరాజుని బలవంతపెట్టి ఈపిల్లను అతనికి రెండవభార్యగా చేయాలని ప్రయత్నంచేసాడు. లింగరాజు ఒప్పలేదు తండ్రి దొడ్డరాజుకు నింద వస్తుందని భయపెట్టాడు. లింగరాజు ఏదో ఉపాయంతో మొత్తం మీద దీనిని నిలుపుదలచేశాడు. ఇది అయిన నెలా రెండునెలలకు దీక్షితుల తమ్ముడు ఏదో జబ్బుచేసి దివంగతుడయ్యాడు. లింగరాజు అతనికి విషంపెట్టించి, అతనిని చంపించాడని దగ్గరివాళ్లు చెప్పుకొన్నారు. పిల్ల ఒక పసిపాపను కన్నది.

మరోసంవత్సరం గడవలేదు. ఏమి జరిగిందో ఏమిటో దీక్షితులకు తెలియదు. రాజప్రాసాదం కుటుంబంనుంచి ఆ పిల్ల తల్లి, పసిపాప, అందరూ కనుమరుగైపోయారు వీళ్ళంతా ఏమయ్యారు? ఎక్కడికి పోయారు, అని విచారించే తీరులోకూడా దీక్షితులు లేదు ఆపిల్ల అక్క ఒక్కతె రాజసౌధంలో వుంది. అడిగితే ఆమెను అడిగి సంగతిసందర్భాలు తెలుసుకోవాలిసి వుంటుంది. ఏమని అడగడం? అడిగిమాత్రం ఏమిటి చేయడం? అటువంటి తమ్ముడే గతించిపోయాడు. తాను అతని ఈ కుటుంబాన్ని ఏతీరుగా నిలబెట్టడాని కౌతుంది! కొద్దిరోజులు గడిచినమీదట దీక్షితులు ఈసంగతే మఱచిపోయాడు. పాప ఏమైందో! ఆమె పసిబిడ్డ ఏమైపోయిందో! అతనికి అంతా అయోమయం!

దొడ్డరాజుగారు చనిపోయి ఆయనగారికూతురు రాణి అవడం, లింగరాజు ఆమెను గద్దె నుండి తొలగించి తాను రాజవడం, లింగరాజు మృతిచెంది, అతనికుమారుడు నేటికి సింహాసన మధిష్ఠించడం - ఇదంతా కొడగుచరిత్రలో దాదాపుగా నలభై సంవత్సరాలు పట్టింది. రాజసౌధం నలువదేండ్లుగా వృద్ధిపొందింది. దానిలో దీక్షితులు తమ్మునికూతురు పొడ ఒక్కసారికూడ ఎదురైంది లేదు. ఇప్పటికి ఆపిల్ల ఇంతటి ప్రౌఢగా తయారై వుంది. తనబిడ్డను కాపాడు బాధ్యతనుగురించి మాట ఎత్తింది. ఈమె ఈవిషయం ఎంతదూరం తీసుకొనిపోతుందో? ఏమి కానుందో?

ఆరోజు రాజసౌధంనుండి కనుమొదగిపోయిన 'పాప' ఈరోజు ఈ భగవతిగా వచ్చి వుండటం ముమ్మాటికీ నిజం ; ముఖం అదే ముఖం. తమ్ముని ముఖకవళికే ; కాని ఆ ముఖంలో కేవలం అందమేకాదు చిందులాడుతున్నది, గడుసుతనంకూడా కొట్టవస్తోంది. ఆరోజు లింగరాజు ఏంచేశాడో ఏమో భయపడి దేశాన్నివిడిచి చక్కాపోయింది. ఇప్పుడో ; వెనక్కు తిరిగివచ్చిన ఈమె ఎవరికీ భయపడే ఘటంకాదు.

ఈమె తననుంచి ఏమి వాంఛిస్తుందో ; ఈమె రాజుకు మంచి చేకూర్చేది వట్టిదే ; ఏదైనా చెడ్డ చేయదలిస్తే తాను ఆమెను వారించాల్సివుంటుంది. వారించడం ; ఈ వంశం కర్మ ఇదేమిటో ; తండ్రి చేసినతప్పు పెరిగి పెద్దదై గడుసైన ఆడపిల్లగామారి నేటికి బిడ్డప్రాణానికి ఉరిత్రాడై వచ్చిందా ఏమి చెప్మా ; తాను చెఱచినపిల్లను నలభైసంవత్సరాల్కింద ఊరినుండి వెళ్ళగొట్టితే లింగరాజు నలభైఏళ్ళ తరువాత తనపాపం తనబిడ్డను కట్టి కుడుపుతోందని తెలిసికోగలిగాడా ; తెలిసికొంటే ఆ తీరుగా నడచుకొంటాడా ;

ఏమిటి చెప్పడం ; తప్పుచేస్తే బెట్ట కలుగుతుందనేసంగతి మనుష్యులకు తెలియదా ; 'అథకేన ప్రయుక్తేన పాపం చరతి పూరుషః అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః' అని అర్జునుడు వెనుక అడుగలేదా ; మనుష్యుడైనవాడు ఎప్పుడు ఏ సందర్భంలో ఎందుకుగా తప్పుద్రోవలో నడుస్తాడో, తానే చెప్పలేనిస్థితిగా వుంటుంది.

ఈవిధంగా ఇంతదూరం ఆలోచించి దీక్షితులు గీతాచార్యుల ఉపదేశసారాన్ని స్మృతిపథానికి తెచ్చుకోవడం మొదలుపెట్టాడు.

ఆ స్మృతిమార్గంలో అతనిసమక్షంలో అతని తమ్మునిమొగం కనబడింది. అది కొంచెం మారి అతని కూతురిమొగంగా తయారైంది. తమ్మునికై అతని ఈ కూతురికై దీక్షితుని ఎద జాలి కురిసింది.

# 10

ఆరోజుమధ్యాహ్నం వీరరాజుగారికి మంగుళూరినుంచి ఓ ఉత్తరం వచ్చింది. దాన్ని వ్రాసింది మంగుళూరులో ఇంగ్లీషుపాలకుల ఈస్టిండియా కంపెనీకిచెందిన కలెక్టరుగారి ఏజంటుగారు ఆ ఉత్తరంలోని అంశము లివి:—కొడగుప్రభువులు ఈ చిక్క వీరరాజేంద్రుల సన్నిధానమున మంగుళూరునందలి మహా ఘనతవహించిన ఈస్టిండియా కంపెనీ ఏజెంటు చెల్లించు గౌరవపురస్సరములైన అనేకప్రణామాలు. తరువాత సన్నిధానమున ప్రభువులే తెలుసుకోదగ్గ

హంశమై వుంటచేసి నేనే ఈ ఉత్తరాన్ని వ్రాసే స్వాతంత్ర్యాన్ని వహించాను. విషయాన్ని పూజనీయులైన మదరాసు గవర్నరు మహోదయులకుకూడ రిపోర్టుమూలంగా తెలియజేసి వున్నాను. వారినుంచికూడ తమకు పత్రం సకాలంలో రావచ్చు. మంగుళూరిలోని మా ఏలుబడిలోవున్న ఒకరి ఇంటికోడల్ని దొంగిలించి లేవనెత్తుకపోయినట్లు మాకు ఫిర్యాదువచ్చింది. విచారింపగా ఈపని చేసినవారు కొడగుకుచెందినవారు అని తెలిసింది. దొంగిలించిన ఆడ కూతుర్ని మడకేరికి తీసుకపోయినట్లున్నూ తెలిసింది. ఈసంగతి తెలిసినవారు ఇంకా కొన్ని విషయాలుకూడ మాకు తెలిపారు. దానిలో నిజమైనహంశాల్ని దృఢంచేసికొని సన్నిధానానికి తిరిగి ఉత్తరం వ్రాయడమౌతుంది. ఇప్పటికి, తమ సన్నిధిని నివేదించేది ఏమనగా దొంగిలించిన మీ దేశపు మనిషి మీ మంత్రులైన బసవన్నగారిపేరు చెప్తున్నట్లు మా చెవిదాకా వచ్చింది. అయితే దీనిని మేము నమ్మడం లేదనుకోండి. అయితే ఇటువంటిమాట పుట్టిన పిమ్మట ఆంగ్లేయప్రభువులలో ఏకదేహన్యాయంగా వర్తిస్తూ ఘనమైన కుంపిణీవారికి ఆచంద్ర తారార్కం మిత్రులుగావుంటూవున్న మీకు తెలుపకుండావుండటం సరికాదు. అందుకని ఈవిషయం మీకు తెలివిడిచేయడమైంది. మదరాసునుండి ఉత్తరం రాకమునుపే ఈ విషయమంతా పరిశీలింపబడి, ఇందులో మీ శాసనమందున్న మంత్రులచేయి ఏమీ లేదని ధ్రువపడుతుందని నేను నమ్ముతున్నాను. ఇలైన మీయొక్కయు మా ప్రభువులయొక్కయు పరస్పరస్నేహానికి సాధకమౌతుంది. అందుచే ఈ విచారణయందు తాము అవసరమని తోచినచర్యలు తీసికొంటారని మా విశ్వాసం. విశ్వాసం అకుంఠితంగా, అచంచలంగా, ఏక రీతిగా వుండుగాక. ఇట్లు సన్నిధానమందలి వినమ్రసేవకుడు;' ఉత్తరంచివర ఏజంటు చేవ్రాలు ఉంది.

# 11

## పూర్వ కథ

సంధ్యాసమయాన నలువైపులా క్రమ్మివచ్చు చీకట్లవలె వీరరాజును చుట్టుముట్టుతున్న ఈ అపాయాలస్వరూపం విశదంకావడానికి ఇంతకుముందరికథ కొంచెం తెలియవలసి వుంది.

వీరరాజు నిజానికి పుట్టుకనుంచీ దుర్మార్గుడేమో కాడు. అతడు పెరిగిన సుమారు ముప్పై ఏళ్ళల్లోనూ తనంతదుష్టుడు ఇంకో డుండటానికి వీలులేదన్నట్లుగా సంచరించాడు. ఓ వేళ,

అటువంటి దుష్టుడెవడైనావుంటే, వాడు ఈ రాజుకు చెడ్డపనులంతటా చేదోడువాదోడుగా వుంటూవున్న కుంటి బసవన్న మంత్రితప్ప మరోడు ఎవడూ కాడు.

ఇంతకీ ప్రధానంగా, వీరరాజు అదృష్టం మంచిదికాదు. రాజవంశంలో పెద్దవాడైపుట్టితే రాజు నౌతాననే సంబరంతో పెరుగుతూవస్తాడు. వీరరాజు పాలించేరోజులు. అతనితమ్ముడు లింగరాజు అన్నగారిదయవల్ల తానూ ఓపాటిమనిషి కాగలిగాడు. తాను ఆ తమ్ముని బిడ్డ. అన్న ఈ శిశువును దత్తత స్వీకారంచేస్తే బావుండునని లింగరాజు ఎదలో కోరికలు ఊరిక లెత్తుతూవుండేవి. కాని అతడేమీ చేసికొన్నవాడు కాడు.

నాడు వీరరాజు వైభవప్రాభవాలు కలిగియున్న మేటిమన్నీడు. అతనిపరాక్రమము, శాసనపటిష్ఠత, జనుల ప్రేమగౌరవాలను అతనికి చేకూర్చినాయి. పరరాజులమన్ననలనుకూడ పొందజేసాయి. ఆంగ్లేయులపైన కుంపిణీ అధికారులుసైతము గౌరవప్రపత్తులు చూప సాగారు. అతని కప్పట్లో ఒకకూతురు వుండేది. శిశూత్పాదన వయస్సు ఇంకా మీరిపోలేదు. దత్తత చేసుకోడానికి అతడేమన్నా వెర్రివాడా ? చేసుకోవాలంటే అతని కింకో తమ్ము డున్నాడు. అతను లింగరాజుకంటె పెద్దవాడు. అతనిదగ్గర ఓ మగపిల్లవాడున్నాడు. ఆ పిల్లవానిని దగ్గఱకు తీసుకున్నా తీసుకోవచ్చు. అయిదారు సంవత్సరాలప్రాయమున్న ఈ పిల్ల వానిచెవిలో పడ్డవి పెత్తండ్రినిగురించి. తనతండ్రి ఆడిపోసికొన్న స్పర్ధాపూరితాలైన అస్నిగ్ధ వాక్కులే. ఈవిధంగా మొదటినుంచీ రాజకుమారుని మనస్సు సంకీర్ణవాతావరణంలో పెరుగుతూ వచ్చింది. అది పెద్దగా పెరుగజాలక, పొట్టిగా, కురుచగా గుడుసుళ్లుపడుతూ వుండిపోయింది. పరిస్థితి అట్టిది.

ఇందుకు తగ్గట్లుగానే ఆరేండ్లవాడై కాస్త ఇతరబాలురతో కూడిమాడి ఆడుకోవాల్సిన రోజుల్లో ఇతనికి జతపడింది గుర్రపుసాలలోని బసవయ్య సావాసం. ఈ బసవయ్య ఎవరో, ఎక్కడివాడో ఇది ఎవరికీ తెలిసేవిషయం కాదు. అతడు వీరరాజుకంటె కొలదిఏండ్లు పెద్ద. చాల చురుకైన పిల్లవాడు. కండ్లసోయగమే సోయగం ! వాని చిలిపితనం అట్టిట్టనరానిది. పసితనంలో ఏదో దెబ్బతాకి కుడికాలు కొంచెం మడతపడి విరిగింది. ఆ సంఘటన ఎప్పుడు జరిగిందీ అతనికే జ్ఞాపకంలేదు. దానిఫలితంగా కొంచెం కుంటుతూ నడుస్తాడు. దిక్కులేని పిల్లవాడు కుంటిగానడిస్తే ఊరింతా అతన్ని 'కుంటి' అనే పిలవడం. చివరికి అతని పేరే కుంటి అని ఏర్పడింది. పెద్దవాళ్ళు 'ఏరా ! కుంటీ' అంటే ఏమీ కష్టపెట్టుకోడు మనస్సుకు. తనకంటె చిన్నవాళ్ళు అట్లాపిలిస్తే అతనికి అరికాలికోపం నెత్తికి వస్తుంది. 'మీనాయస నా కేమైనా అట్లా పేరుపెట్టాడా ! నీవు నన్ను అట్లా పిలవడానికి ?' అని అనేవాడు. గుర్రపు సాలలోని పిల్లవాడికోపానికి ఎవరు బెదురుతారు ? అతని కిష్టమున్నా లేకపోయినా పేరు మాత్రం, జనం నాలుకల్లో 'కుంటి' అనే స్థిరపడిపోయింది. ఈ విషయంతెలియని అమాయ కులుకూడ అతనిపేరు ఇదే కాబోలుననుకొని చాల మర్యాదగా పిలుస్తున్నామనేభావంతో

'ఏమప్పా! కుంటప్పా!' అని పిలిచేవారు. మరికొందరు అమాయకత్వమో, హాస్యమో, తెలియనీయకుండా ఇల్లాగే పిలిచేవాళ్ళు! వీటి అన్నిటిమూలాన బసవయ్యకు చిన్ననాటినుండే మనస్సు చాల వికలమై చేదుబారిపోయింది.

చేదుమనస్సు ప్రోదిచేసుకొన్న ఈ పిల్లవాడు సుమారు ఎనిమిదేళ్ళప్పుడు వీరరాజుకు స్నేహితుడయ్యాడు. చిన్నపిల్లలకు సహజంగా ఏనుగన్నా గుర్రం అన్నా కుక్కపిల్ల అన్నా చూడాలనే వుబలాటం వుంటుంది. బసవయ్య దొరకొడుకును, పశువులకు దూడలనుకట్టేసిన కోటికి తీసుకుపోతూవుండేవాడు. తాను మాలిమి చేసుకొన్న జంతువులతో ఇతనికి చెలిమి కూర్చేవాడు. ఈవిధంగా వీరరాజుకు బసవయ్య నిండా కావాల్సిన మిత్రుడయ్యాడు. వీర రాజుతల్లికి ఆరోగ్యం సరియైందికాదు. అందుచే అతడు దాదిచేతుల్లో పెరగవలసివచ్చింది. ఇటుతండ్రి లింగరాజు వ్యవహారవ్యాపారాల్లో మునిగి తేలుతూ వుండేవాడు. కాకపోయినా ఆయన వీరరాజును ఎక్కువగా కనిపెట్టివుండగలస్థితిలో లేడు. పనులతొందరలో తండ్రి పిల్ల వానివిషయం ఏవిధంగానూ గమనించడంలేదు. బసవయ్య పసితనంనుండీ జంతువులజతలో, కుక్కలజతలో పెరిగి పెద్దయ్యాడు. ఫలితంగా, ఆ ప్రాణి పశువులకొట్టంలో పశువుల మనుగడతీరు చూచిచూచి, కొన్ని వింతపుచుల్ని పెంచుకొన్నాడు. సిగ్గు, లజ్జ, సంకోచం అనేవి పోగొట్టుకొన్నాడు. ఇతనిసావాసంలో పెరుగుతూవచ్చిన వీరరాజుకు జంతువులయు, కుక్కలయు మైథునప్రక్రియలు వినోదహేతువులుగా పరిణమించాయి. ఇంతలో కాలచక్రం గిర్రున తిరిగింది. దొడ్డ వీరరాజు గతించడం, దేవమ్మాజి రాణికావడం, దేవమ్మాజి పదవీభ్రంశం చెందడం, ఆ వెనుక లింగరాజు రాజై వీరరాజు యువరాజు అవడం జరిగాయి. అసలే రాజ ప్రాసాదంలోని వైభవవిలాసాలతోకూడిన క్రొత్తజీవితం! దాంతోబాటు వయస్సులోని సుఖం మరగిన దుడుకుపోకడలు! వీరరాజు ఆ పార్థివసుఖాలలో దాగివున్న అపాయాలకు గురి ఔతూ వచ్చాడు.

ఇంతకాలానికి నెలవుగా, లింగరాజుకు తన కుమారునివైపు కొంచెం దృష్టి మరలించడానికి వీలైంది. వీడేగదా ముందు రాచపీఠం వహించవలసినవాడు. వీనికోసమేగా తాను న్యాయాన్యాయవిచారణ పోద్రోలి గద్దెను సంపాదించిపెట్టింది! ఇతనికోసం, ఇతని చెల్లెలి కోసం, లింగరాజు పిల్లల్ని ఇదివరకు చూడకుండావున్నది అతనికి వాళ్ళమీద ప్రేమలేక కాదు. చీట్లపేకఆటలో కూచున్నవాళ్ళు అమ్మ చచ్చిపోయింది అనే దుర్వార్త వినవచ్చినా ఆటవిడచి పోలేరు. సింహాసనం సంపాదించే లోకవ్యవహారక్రీడ చీట్లపేక ఆటకంటె మైమరపించే ఆట. పేకాటలో ఒక్కబచ్చే పోయేది. దీనిలోనంటారా ప్రాణానికే మరి మోసం! ఒక్కనిమిషం ఏమరితేవారి వంశమే నిశ్శేషం కావచ్చు. తాను ఇతరుల కుద్దేశించిన చెట్ట ఎదురుతిరిగి తన్నే ముంచవెయ్యోచ్చు. సింహాసనం చేజిక్కినపిమ్మట కుమారునివైపు ధ్యాస మరలించాడు. వీరరాజు కుంటి బసవయ్య పిడికిటిలో చిక్కుపడటం గమ

వించాడు. ఇది ఏమంత మంచిపనికాదని అందరికీ తెలిసినట్లే తండ్రియైన తనకూ తెలిసే వుంటుంది. కాని అతడే స్నేహానికి అడ్డు తగులలేదు. కుమారుని కోసారి, బసవయ్య కోసారి 'అతి సర్వత్ర వర్జయేత్' అనిమాత్రం హెచ్చరికచేసి వదిలాడు. ఆపైన వాళ్ల పాటుకు వాళ్లను వదిలేశాడు.

హెచ్చరికచేసినట్టి సందర్భంలో 'కుంటి'కి లింగరాజు తనవిషయంలో ఏమో ఒకవిధమైన సంకోచభావంతో నడచుకుంటున్నాడే ఏం చెప్మా అని అనిపించింది. అదిమొదలు లింగరాజు తనను ఏదో ఒకవిధమైన కనికరంతో చూస్తూ వస్తున్నాడనిపించింది. అందుచేత సాధ్య మైనంతమట్టుకు తాను లింగరాజుమనస్సుకు నొప్పి కలుగకుండా, ఒప్పిదమయ్యేటట్లు నడచు కోవాలని ప్రయత్నించేవాడు. కానైతే, వీళ్ళు చేపట్టినదారిలో ఎల్లప్పుడూ మితిమేరలు దాట కుండావుండాలంటే సాధ్యపడేవిషయం కాదు. వీరరాజు పెరిగినతీరే అట్టిది - ఇల్లా అయితే ఎల్లావుంటుందో ? ఆరకంగాచేస్తే ఇంకా ఎల్లావుంటునో - అని వివిధంగా, పరీక్షించిచూసే ప్రవృత్తి ఏర్పడింది. పసిబిడ్డను కుక్క వెంబడిస్తే అది భయపడేరీతిచూసి ముచ్చటపడాలని వుంటుంది. ఆడపిల్లలు ఆడుకొనేటప్పుడు దూరంనుంచి వాళ్లమధ్యకు ఓపామును విసరివేసి వాళ్ళు గాబరాతో కేకలు బొబ్బలు పెడ్తూవుంటే వింటూవుండటం అతని మరోముచ్చట. తోటనుండి ఊళ్లోకి వచ్చేవాళ్లకు ఎదురుగా మొగంమీద రంగుపూసుకొనివెళ్ళి దయ్యంలాగ నిలబడి వాళ్ళు హడలి బెదరుతూవుంటే తాను కిలకిలా నవ్వడం ఇంకో ముచ్చట. ఒకొ్కక్కప్పుడు అటువంటిసమయాల్లో పదిమందికూడి దెయ్యంఅయితే కానీ చూద్దాం అని అతని మీద పడటం కద్దు. ఉత్తయ్య తక్క ఓసారి అల్లాగే చేశాడు. అప్పుడు వీరరాజుపని 'చిక్కాడురా మిడతంభొట్లు' అయింది. లింగరాజుకు ఫిర్యాదు చేరింది. ఆయన కొడుకునూ, అతని స్నేహితునీ, ఇద్దరినీ శిక్షించాడు. ఇంతేకాదు. వీళ్ళిద్దరూ అప్పుడప్పుడూ ఆడపిల్లలు నిద్రపోతూవున్నచోటికివెళ్ళి అల్లరిగా వ్యవహరించేవాళ్ళు. మరో అప్పుడు ఆడపిల్లలను బలాత్కారంగా పట్టుకొని తామున్నచోటికి తెచ్చి చెప్పరాని చిలిపిచేష్టలు చేస్తూవుండేవాళ్లు. ఇటువంటిసందర్భాలన్నీ ఫిర్యాదుకు వచ్చేవికావు. వీటికితోడు ‹రాజకుమారుడు ఊళ్ళోని వుండాకోరులతోకలిసి జూదమాడుతూ వుండేవాడు. రాజకుమారుడుగనుక ఎవరికీలేని అధి కారాలు ఇతగాడికి. ఇతరులకుకలిగే కష్టనష్టాల్లో ఇతను పంచుకోనక్కరలేదు. దీన్ని పోకిరీలందరూ, అన్నివేళలా సమ్మతించేవారుకారు. దీంతో జగడాలు, కేకలు, బొబ్బలూ,- ఒకొ్కక్కప్పుడు దేహశుద్ధి పర్యంతం, కొండ నడిచేది. ఈవిధంగా తండ్రిగతించి, తల్లి సహగమనంచేసి, తాను రాజయ్యేనాటికి వీరరాజు పోకిరీలలో తానూ ఒక పోకిరీగా తయా రయ్యాడు.

# 12

ఇహ ఇతగాడు సొంతం నాశనం గాకుండా, రక్షింపబడటానికి ఒకే ఒక్క ప్రాణి మిగిలింది. ఎవరా ప్రాణి అంటారా? వెనక ఇతనికి రాణిగా వుండాలని లింగరాజు తెచ్చిసాకిన గౌరమ్మ.

గౌరమ్మ కొడగుల ఆడబడుచు. ఆమెతండ్రి 'బెప్పనాడు'కు చేరిన కుంజిలిగేరి గ్రామంలోని ముక్కాటీర పుట్టయ్య అనే ఆయన. తనప్రాంతంలో మంచి పలుకుబడిగల పెద్దమనిషి కావడంచేత రాజుదృష్టికి వచ్చాడతడు. దొడ్డ వీరరాజేంద్రునికి కావలసినవాడు.

తిరిగి లింగరాజు రాచరికం వహించేనాటికి చేదోడువాదోడుగా నిలబడి అతనికీ కావలసినవా డయ్యాడు. లింగరాజు తన కుమారునికి పట్టం కట్టిపెట్టడం ఇతనికి సమ్మతమే. కాగా లింగరాజు కుమారునికై ఓ కన్యను వెదకుతూవుండగా, పుట్టయ్య కూతురును ఎన్నికచేసి తీసుకొనిరావడం సహజమే.

గౌరమ్మ రాణి కాదగిన తరుణి. ఆమెకు పెనిమిటికి మధ్యవయస్సులో అట్టే తేడా లేదు. యువతి రూపసి అనిపించుకోకుండా వుండదు. కాని రూపంకంటెనూ, ఆమెలో చూపే వారి మనస్సును ఆకర్షించే ఒకానొక గంభీరమైన వైఖరి కద్దు. ఆడపిల్లకుమించిన ఒడ్డూ, పొడుగూ ఆమెది. నేటుగా నిలబడి, సూటిగా చూసేతీరు ఆమెది. తూచి మితంగా మాటాడే వక్త్రి. ఆ మనస్సులో ఏ భావపరంపర సాగుతూ, రేగుతూవుంటుందో సులభంగా పైకి కానరాదు. చాల తీవ్రమైనసందర్భాలలోమాత్రం ఆమెనేత్రాలు ఒక వింతసోయగంతో, సంతోషాన్నో, వేసరపాటునో, కోపతాపాలనో లవలేశంగా సూచిస్తాయి. మరుక్షణంలో తిరిగి గాంభీర్యముద్రితా లౌతాయి. గౌరమ్మస్వభావం సహజగంభీరమైనది.

పెళ్ళినాటి కామెకు పదునారేళ్ల పొలపువయసు. పుట్టింట అరమరికలులేకుండా తిరుగాడే పిల్ల రాజసౌధానికి వచ్చింది. సుమారు తన వయస్సేవున్న పెనిమిటిని పెండ్లాడింది. అప్పటికి ఆనోటా ఆనోటా పెనిమిటి చెడ్డపేరు సంపాదించుకోవడం ఆమెకు తెలుసు. మొదటనే తెలిస్తేమాత్రం ఆమె ఏమిచేయడానికౌతుంది? ఇతను మంచివాడు కాదు, ఇతనిని నేను పెళ్లి చేసికోను అని చెప్పడానికుందా? ఆనాటి కొడగుసీమలో అటువంటి ఒప్పమి మాట చెప్పడం ఏమంత సులభంకాదు. లింగరాజు మొండిఘటం. కఠోరకర్కశమైన స్వభావం అతనిది. అన్న కోరికకువిరుద్ధంగా, ఆ అన్నకూతురిని గద్దెమండి క్రిందికిదింపి, తాను రాజై, రాచరికం నెఱపవలెనన్నచో ఎదిరిని ధ్వంసంచేయడమే ఏకైకమార్గమని తెలిసికొన్న క్రూరుడు. నీ కూతురు నా పుత్రునికి అర్ధాంగియై రాణి కావాలి అని అతడు వాంఛించినప్పుడు, ఆ బిడ్డ వలదంటే ఆ బిడ్డకూ, ఆమెతండ్రి విరోధిస్తే, ఆమె తండ్రికీ, తన

ఇష్టంవచ్చిన శిక్ష విధించడానికి అతడెంతమాత్రం వెనుకంజవేసేవాడు కాదు. ఎట్లాగూ పెండ్లాడి పెండ్లామై జీవించడమనేది ఆడదానినుదుట వ్రాయబడ్డదే. అనుకూలదాంపత్యమై సుఖంతోగూడిన సంసారం అయితే చెప్పేదేముంది? పుణ్యం పూచినట్లే. అల్లాకాదో, నొసటివ్రాలు అని చెప్పుకోవడం వుండనేవుంది. సహించుకోవాలిసిందే.

వచ్చిన కొత్తమోజులో కొన్నినాళ్ళు వీరరాజు పెండ్లాన్ని ఒకవిధమైన ముద్దుమురిపెంతోనే చూసుకొన్నాడు. అతనికి 'ఆడది' అనే పదార్థం కొత్తదేమీ కాదు. అయితే వ్యక్తిత్వంలో, చూపులో, మాటలో ఇంతోటి గాంభీర్యం పుణికి పుచ్చుకున్న ఆడుదాన్ని ఇంతకు పూర్వం అతడు అంతగా చూచిందిలేదు. రాజసౌధంలోని కన్యలలో ఒకరిద్దరు తన భార్య వలెనే గంభీరముద్రతో నిలబడేవాళ్ళు, నడిచేవాళ్ళు ఉండకపోలేదు. అయితే తనపత్నిలో వాళ్లల్లో కానరాని ఏదో ఒకానొక వింతసొబగు కొట్టవచ్చినట్లు కానవస్తూవుంది. వీరరాజు దీనికి కారణం ఏమిటి అని బుద్ధి పారించి ఆలోచించలేదు. ఆలోచించవలసిన అగత్యమూ అతనికి లేదు. కాని దానితో జీవితంలో ఏదో చెప్పుటకు వీలులేని సుఖానుభూతి కలుగుతోందనిమాత్రం అతడు గ్రహించాడు. తనపత్నినిగురించి ఒకవిధమైన మెప్పుదల అతనిలో మెదలి కదలింది.

కాని ఈ మృదూహ చాలనాళ్ల పనిచేయలేదు. పదునుతప్పిన జీవితాన్ని వెళ్లించి, జీవితంలోని సినలైన మాధుర్యాన్ని చెడగొట్టుకొన్న అతని మనస్సుకి గౌరమ్మ పరిశుద్ధమై, శుచిపూర్ణమై, సురుచితోకూడిన జీవితవిధానం వలసినంతతృప్తి కలిగించలేకపోతున్నాయి. డోలు మ్రోతలకు కాహళులధ్వనులకు అలవాటుపడ్డ చెవులు, పిల్లనగ్రోవి, వీణ మొదలగువాని నుండి వెలువడు సుకుమారములు, మనోహరములునైన ధ్వనులకు తనియు మెలకువను ఏనాడో పోగొట్టుకొన్నాయి. వేరలకొలది బియ్యాన్ని నోటినిండా తీసికొనిభక్షించి తృప్తిపడే ఏనుగు ఒక చీమ చక్కెర తినేతీరులో, తిండి తినలేదు. బసవయ్య సావాసంతో హద్దు మీరకుండావుంది, మొదటే ఈ తరుణి రాజకుమారుని కంటబడివుంటే, అతడు తన జీవితాన్ని ఏ తపోలోకానికి మరలించేవాడో చెప్పడం కష్టం; కాని అతని దురదృష్టం; రెండు జీవితాలు పెనవైచికొని ఒకటి అయేనాటికి అతడు బురదగుంటలో, నిద్రించుచే మేలు అనుకొనే దున్నపోతువలె దారి తప్పిపోయాడు. తన సాధుస్వచ్ఛమైన రుచిని పోగొట్టుకొన్నాడు.

రాత్రులందు పొద్దుపోయిరావడం, వచ్చినతర్వాత సగంమత్తుతో ప్రవర్తించడం – ఈ పని పడికి ఇల్లాలి కిష్టంలేకపోవడం – అందుమీదట తాను ఆమెను తిట్టడం, కొట్టడం;— ఈవిధంగా కథ సాగించడానికి అతనికి అట్టే రోజులు పట్టలేదు; గౌరమ్మ ఓంప్రథమంగా అతని నడవడికచూచి తనలో తాను వేసటపడ్డమాట నిజం; కోపంకూడా ముంచెత్తుక వచ్చింది; అయితే ఆమె నిభ్బరించుకొన్నది; భర్తతో దెబ్బలాడలేదు. అతనిగదివదలి తాను వేరేగదిలో పడుకొని నిద్రపోయింది; లోపలినుంచి తలుపు గడియపెట్టింది. భర్తవచ్చి

తలుపుతట్టాడు. కేకపెట్టి పిలిచాడు. కుటుంబంలోని వాళ్ళంతా పరుగెత్తుకొని దగ్గిరకు వచ్చారు. ఏమిటోసంగతి అని లింగరాజు తానేవచ్చాడు. కోడలు విసగటపడి వేరేగదిలోకి వచ్చి పడుకోవటం తెలుసుకొని లింగరాజు కొడుకును కోప్పడి 'ఏమైనా మాటాడాలిని వుంటే తెల్లారింతరువాత మాటాడవచ్చులే! మెదలకుండాపోయి పడివుండు. రచ్చచేయకు' అని హెచ్చరించాడు.

మరుసటిరోజు లింగరాజు కోడలుదగ్గిరకువచ్చి 'నీవు ఈ రాజప్రాసాదంలో గృహలక్ష్మిగా మెలగతగ్గదానివని నేనే నిన్ను వెదకి మరీ తీసుకొనివచ్చాను. నీమగనికి బుద్ధిలేదు. మరి కాదు. మీ యిద్దరికీ వుండవలసిన తెలివితేటలు నువ్వొక్కత్తెవే చూపించాలి. నీవు బ్రదికి బట్టగట్టి అతనిచేత కట్టించాలి. పెనిమిటి మంచివాడు కాడుకదా అని పెళ్లాంకూడా మంచిది కాకపోతే రాజభవనం, పాడుపడ్డఇల్లుగాకూడా మిగలదు. రాజసౌధం పెత్తనం నీదేనని తెలిసికో. అది నీదైవుండాలి అంటే, నీ పెనిమిటిని ప్రయోజకుడయ్యేటట్లు తీర్చిదిద్దుకో చెట్టుమిగిల్చి పండుతినడం తెలివి' అన్నాడు.

దేవక్కకూడ కోడలికి బుజ్జగించి చెప్పింది. 'రాజభవనానికివచ్చిన కన్యకు ఇటువంటి అనుభవాలన్నీ వుండనేవుంటాయి తల్లీ! నేను అనుభవించలేదా ఇవన్నీ! మీ మామ నా కండ్లఎదుటే వేరొకరితో సరసమాడుతూ వుండేవారు. ఈ కొడుకే నయం ఆ తండ్రి కంటె! ఎక్కడో సరసాలాడివస్తున్నాడు. ఓపికపట్టు తల్లీ! ఓ రెండుకాయలు నీ కడుపున కాచాయా! వాళ్ళనుచూసికొని వాళ్ళే ప్రపంచంగా బ్రదుకవచ్చు! ఆడజన్మ ఎత్తినతర్వాత ఇంతకుమించి సుఖం లేదు. ఇంకొక్కత్తెనో ఇద్దరినో రాణిగా రాజభవనానికి తేరాదు అని శపథం చేయించాను; తేకుండావుంటే అంతేవాలు మహాబాగు అంటాను.'

గౌరమ్మ ఎంత గడుసో అంత చురుకైన పిల్ల. ఆమెమాట వింది. అత్తమాటలకు చెవి యొగ్గింది. వాళ్ళు తనకు ధైర్యంచెప్పడం తనమీద పనిచేసింది. క్రిందటిరాత్రి నడచిన సమాచారం మరచిపోయి భర్తతో సంధిమార్గంగా నడచుకొన్నది. సాధ్యమైతే- తాను అతనిని తప్పుమార్గంనుంచి తప్పించి మంచిమార్గానికి త్రిప్పాలి అని నిశ్చయం చేసికొన్నది.

మూడుసంవత్సరాలకాపురంలో వాళ్ళిద్దరికీ సంతానం కలిగింది. ఆడపిల్ల. అందరిపిల్లల వలెనే ఆ శిశుకందునూ, తల్లిదండ్రుల ముఖకవళికలు ఎంతగానో కలిసిమెలిసి కొట్టవచ్చినట్లు కనిపిస్తూవున్నాయి. లింగరాజు మగపిల్లడు అయివుంటే ఎంతో బాగుండేది అనుకొన్నాడు. అయినా మనస్సుకు సమాధానం చెప్పుకొని ఆ పిల్లనే అల్లారుముద్దుగా పెంచడం ప్రారంభించాడు. వీరరాజు కూతురు దగ్గిరవుంటే చాలా పెద్దమనిషిగా వుండేవాడు. ఎటువంటి కోపమైనా పిల్లమచూపి మింగేసేవాడు. అంచక్కనిపిల్లను కన్నది అనే ఒకానొక లోయెఱుక అతన్ని గౌరమ్మపట్ల, కొంతకుకొంత దాక్షిణ్యాన్ని వహించవలసేది.

లింగరాజు ఇంకా కొంతకాలం బ్రతికివుంటే, వీరరాజు బహుశా పుండాకోరుతనం, పోకిరీతనం - వీటిరుచి చూసి చూసి పెద్దమనిషిగా మారివుండేవాడేమో! కాని గౌరమ్మ అటువంటిపుణ్యానికి నోచుకోలేదు. ఆ యేడు తండ్రి గతించడంతో, వీరరాజు రాజు అయి నాడు. ఆడింది ఆట, పాడింది పాటగా చలామణీఅయి, అతడు మరింత దౌష్ట్యాన్ని ప్రోది చేసికొన్నాడు.

# 13

లింగరాజు ఏల్బడిలో కొంచెం బెదురుగా, భయం భయంగా ప్రవర్తిస్తూవచ్చిన 'కుంటి' తన స్నేహితుడే రాజవడంతో 'ఎవరెదురు నాకింక?' అనేధోరణిలో పడ్డాడు. నాలుగేళ్ళ లోపల బసవయ్య రాజభవన వ్యవహారాలన్నిటికీ పెద్ద అయ్యాడు. ఆపై మూడేళ్ళల్లో వీరరాజు అతన్ని మంత్రిగా నియమించాడు.

వీరరాజు గద్దె నెక్కేటప్పటికి, బోపణ్ణ, లక్ష్మీనారాయణయ్యలతోబాటు 'నాడతక్క పొన్నప్ప' అనే అతడు మూడవమంత్రిగా వున్నాడు. రాజు చేస్తూవున్న తెలివితక్కువ చేష్టలుచూసి వీలైనంతదూరం సహించుకుంటూవచ్చాడు. కానైతే మూడేళ్ళమీదట ఇహ వుండబట్టలేక తన పదవినుండి వైదొలగాడు. నాకు వంట్లో బాగా వుండటంలేదు. వేరే ఎవరి నన్నా నియమింపవలసిందని రాజుకు చెప్పాడు. మూడవమంత్రిపదవి ఈవిధంగా ఖాళీ అవడంతో, రాజు బసవయ్యను ఒక మంత్రిగా నియమించడానికి అవకాశం చిక్కింది. ఈ నెపం లేకుండావుంటే అతడు నాల్గవమంత్రి అయ్యేవాడేమో! పొన్నప్ప వైరాగ్యంతో, వేరే స్థానం కల్పించాల్సిన అవసరం లేకుండాపోయింది.

కుక్కలను పెంచడం, వాటి మంచిచెడ్డలను చూడడం, వృత్తిగాగలవాడు తమతో సరి సమానంగా, సమస్కంధంగా, మంత్రిగా రావడం మిగిలినమంత్రులకు మింగుడుపడలేదు. కాని దీనికి ప్రతిగా ఏంచేయాలో వారికేమీ తోచిందికాదు. బోపణ్ణ, లక్ష్మీనారాయణయ్య, ఇద్దరూ తమలో తాము మంతనాలాడుకొన్నారు. సరియైన అదనుచూచి రాజుకు బోపణ్ణ తమ అసమ్మతిని విన్నవించుకోవాలని, వాళ్లల్లోవాళ్లు నిశ్చయించుకొన్నారు.

బసవన్నను మంత్రిచేయడం వీళ్లకు ఇష్టముండదని వీరరాజుకు తెలుసు. బసవన్నకు కూడ ఈసంగతి తెలిసిందే. కాని రాజు తనదగ్గిరకు వచ్చినవాళ్లతో 'బసవన్నకూడా ఒక మంత్రే. దేశంలోని అధికారులు అతనిమాటప్రకారం నడచుకోవాలిసివుంటుంది అనిచెప్పి

మెల్లిమెల్లిగా బసవన్న మంత్రిత్వాన్ని దృఢతచేశాడు. సభలలో మాత్రం తక్కినమంత్రులతో సమానశ్రేణిలో బసవన్న కూర్చోవాలి అని తొందరపడలేదు. బసవన్నమంత్రి ఆజ్ఞాపించా రనీ, బోపణ్ణమంత్రి చెప్పనిదే మేం చేయమనీ, ఈవిధంగా అనేకసందర్భాల్లో పనులు మూలా ముక్కలు పడటం ప్రారంభించాయి.

ఒక సంవత్సరం తర్వాత నవరాత్రులల్లో పాడ్యమిరోజు రాజభవనంలో ఓ సభ జరిగింది అందులో మంత్రులవరుసలో కొత్తగా ఒక ఆసనాన్ని ఎక్కువగా వేసివుంచారు. సభ ఏర్పాటు చేయించింది అంతా బసవన్న కావడంతో బోపణ్ణ, లక్ష్మీనారాయణయ్యలు ఈవిషయం గమనించింది సభకు వచ్చినమీదటనే. బోపణ్ణ రెండునిముషాలు ముందువచ్చాడు. ఈసంగతి చూడగానే గ్రహించాడు. లక్ష్మీనారాయణయ్య వచ్చినమీదట అతనితో ఈసంగతి తెచ్చి 'ఈవిషయం నేడు కాదో పేడో తేలాలి' అన్నాడు.

లక్ష్మీనారాయణయ్య 'ఇది అందరిముందర తేగూడదు' అన్నాడు. బోపణ్ణ 'ఇది, అంద రికీ కావలసినవిషయం. అందుచేత అందరిముందర ప్రస్తావిస్తే తప్పేమీ లేదు' అన్నాడు.

క్షణముండి బోపణ్ణ 'అవునండీ! దీనికి వేరే ఉపాయం చేస్తా' అంటూ లక్ష్మీనారాయ ణయ్యతో చెప్పి సేవకుని ఒకణ్ణిపిలిచి 'ఒరే! దీనిలో ఎవరు కూచుంటారు?' అంటూ ఆ మూడవ ఆసనం చూపించాడు.

'నాకు తెలియదు దొరా! రాజభవనంనుండి ఆజ్ఞ అయింది వేశాము' అన్నాడు. బోపణ్ణ [1]'గురికానికి చెప్పు. ఇటు కొంచెం రావాలి' అని చెప్పాడు.

గురికాడు వచ్చాడు. చేతులుజోడించి వినయంగా నిలబడ్డాడు.

'ఈ ఆసనం కొత్తది. దీన్ని తీసేవెయ్యి' అని బోపణ్ణ.

'చిత్తం దొరా!' అని గురికాడు రాజభవనంలోకి వెళ్లాడు. పీఠాన్ని ఎవరూ ఎక్క లేదు. రెండునిముషాల్లో లోపలినుంచి కుంటి బసవన్న వచ్చాడు. మంత్రులదగ్గరకువచ్చి నమస్కరిస్తూ చాల గడుసుగా 'ప్రభువులు ఈ ఆసనాన్ని వేయించు అన్నారు. అందుచే దీన్ని తీసివేయడానికి కాదు' అన్నాడు.

బోపణ్ణకు కోపం వచ్చింది. 'ఈ ఆసనం ఇక్కడనుంచి తీయడానికి కుదురకపోతే మేము మా పీఠాల వదిలేస్తాము. ప్రభువులు ఏ నియం చేసినప్పటికీ రభస కాగూడదు. అంతకుముందే తెలివిగా ప్రవర్తించడం మంచిది' అన్నారు.

'కుంటి' లోపలికిపోయి వెంటనేవచ్చి ఆ మూడోపీఠాన్ని తీయించివేశాడు.

సభ ఎప్పటివలెనే నడిచి ముగిసింది. సభనుంచి లోపలికివెళుతూ వీరరాజు మంత్రి వర్యులు మాతో మాటలాడ కోరుతున్నాం అని ఆజ్ఞచేశారు. లక్ష్మీనారాయణయ్య, బోపణ్ణ లోపలికి వెళ్లారు.

---

1. గురికారు - Marksman; తుపాకీ కాల్చేవాడు; వేట 'బోయీలు'కు పూర్వరూపం కావచ్చు

# 14

వీరరాజు ప్రాంగణంలో నిలబడ్డాడు. మంత్రులు వచ్చినా, వాళ్లనుకూడ అందే నిలిపాడు. కోపంతో కర్కశమైనకంఠంతో బోపణ్ణ నుద్దేశించి 'మా గోష్ఠిలో ఎవరు ఎక్కడ కూర్చో వాలో నిర్ణయించేది మీరా బోపణ్ణ మంత్రిగారూ?' అని ప్రశ్నించాడు.

బోపణ్ణ ఏమో చెప్పాలి అని నోరుతెరిచాడు. అతన్ని మాటాడనివ్వలేదు మధ్యలో లక్ష్మీ నారాయణయ్య. అతడు 'ప్రభువులు చిత్తగిస్తే ఈవిషయం సాయంత్రం మాటాడుకోవచ్చు. ఇప్పుడు ప్రభువులకు శ్రమ కానోపు' అన్నాడు.

వీరరాజు 'మా శ్రమా గిమా ఎవరూ పట్టించుకోనక్కరలేదు. మీనూచే మీకు. ఇప్పుడే చెప్పండి, కొడగురాజ్యానికి ప్రభువు లెవరు? మీరా? నేనా?' అని గద్దించి పల్కాడు.

లక్ష్మీనారాయణయ్య: 'ఇది బోపణ్ణయొక్కగాని నాయొక్కగాని ఇష్టానిష్టాలమీద ఆధారపడ్డ విషయంకాదు. ఊళ్లోనిజనం, ఊరిపెద్దలు అందరూ ఒప్పుకోవాల్సినవిషయం. ప్రజలను విరోధించడం మంచిదికాదని తీసివేయించాడు.'

వీరరాజు : మీరు? మీరుకూడ వద్దన్నారా?

లక్ష్మీనారాయణయ్య : బోపణ్ణ ఇటువంటి ఏ విషయమైనాసరే, నా మనస్సు తెలుసుకో కుండా చేసేవారుకాదు. ప్రజాభిప్రాయానికి విరుద్ధంగా పోరాదని నేనూ చెప్పాను.

బోపణ్ణ వీరరాజుకు మాటాడేసావకాశం లేకుండానే 'మంగలివాడు మావక్క కూర్చొనే మాటకు కొడగుదేశంలోని ఒక్క చంటిపిల్లయినా ఒప్పుకొనేది లేదు' అన్నాడు.

వీరరాజు : మీ ఇంటిలో ఒప్పుకోవద్దు. సరే. రాజభవనంలో? అది ఎవరిది?

లక్ష్మీనారాయణయ్య ఏమో జవాబు ఇవ్వాలని ఉద్యుక్తుడయ్యాడు; బోపణ్ణ అతన్ని వారించాడు. 'నేనే చెప్తాను ప్రభూ!' అంటూ రాజు నుద్దేశించి 'సభ ప్రభువుల ఇల్లు కాదు. శ్రేష్ఠిజనం, అధికారిగణం, మంత్రిగణం, మొదలైన శిష్టులంతాచేరి నిలిచేస్థానం. ఎవరెక్కడ ఉండాలి అనేది పెద్దలైనవారు ఇదివరకే నిర్ణయించివున్నారు. ఇది దేశానికంతటికీ సంబంధించినమాట. ప్రభువులు ఆ పద్ధతిలో మార్పుతేవాలంటే ఒక్కమాటు ప్రజలకు తెలియజెప్ప వలసివుంది' అన్నాడు బోపణ్ణ.

వీరరాజు: తెలుపవలె! ఈ 'వలె' ఎవరిది? ఎవరు ఎక్కడ వుండాలి అనేది చెప్పడానికి రాజు మిమ్మల్ని అడగవలెనా?'

బోపణ్ణ ఒళ్లు పట్టడం: ఇంటివ్యవహారాలు చూడటం; ఇంతవరకూ రాజుల స్వంత విషయాలు. 'కుంటి' మీ ఒళ్లు పట్టవచ్చు; చెవిలో గుసగుసలాడుతూ వుండవచ్చు. అయితే అతడు దేశానికి మంత్రి అవడం మాకు సమ్మతంకాదు. ప్రభువులకు ఏది సమ్మతంగావుంటే

అది చెయ్యొచ్చు. 'కుంటి' మంత్రి అయితే మేం మంత్రులం కాజాలం. మేము మంత్రులుగా వుండాలంటారా? 'కుంటి' మా ప్రక్కన వుండటానికి వీల్లేదు. ప్రభువులు అతన్ని శయ్యాగృహానికి తీసుకొనివెళ్ళండి, పూజామందిరానికి తీసుకొనివెళ్ళండి - మాకేమీ అభ్యంతరం లేదు. సభాభవనంలో మా జతన అతడు కూర్చొనడం, జనం సమ్మతించరు.'

తీరా మాట శ్రుతిమించి రాగాన పడుతూవుండడం, బోపణ్ణ, లక్ష్మీనారాయణయ్య, రాజూ, ముగ్గురూ గ్రహించారు. లక్ష్మీనారాయణయ్య బోపణ్ణతో 'బోపణ్ణగారూ! ఈమాట ఇంతటితో నిలుపుదాం' అనిచెప్పి ప్రభువునుద్దేశించి 'నేను మొదటనే విన్నవించుకున్నాను. ఈసంగతి సాయంకాలం మాటాడుకోవచ్చునని. తిరిగి అదే విన్నపం చేస్తున్నాను. ఇహ ఇప్పుడు ఎవరూ దీన్ని గురించి మాటాడవద్దు. ప్రభువుల కిదే నా ప్రార్థన' అన్నాడు.

వీరరాజు: 'సరే! మీరు దొడ్డవాళ్లు. మంత్రివర్యులు. అంతాసరే. కాని, మమ్మ శాసించే ప్రభువులమాత్రం కారుగదా! సాయంకాలం రండి, మాటాడుకొందాం' అన్నాడు.

లక్ష్మీనారాయణయ్య: 'చిత్తం ప్రభూ!' అనిచెప్పి ఒంగి చేతులుజోడించి నమస్కరించాడు. వీరరాజు ప్రతినమస్కారం చేశాడు. బోపణ్ణ అర్ధాంగీకారంగా కొంచెంగా చేతులు జోడించినట్లే జోడించి మొహంమీద కోపం తాండవిస్తూవుండగానే వెనక్కు తిరిగాడు.

లోపలినుంచి సభామందిరం వాకిలిదగ్గిరకు వచ్చేసమయానికి బసవన్న వాళ్లదగ్గిరకు వచ్చాడు. 'ఏమి బోపణ్ణ మంత్రివర్యా! నన్ను మంగలినిచేసి పారవైచావు!' అని దర్పంగా అడిగాడు. బోపణ్ణ అదేదర్పంతో 'ఓరీ కుంటీ? నీవు నువ్వెవరివో మరిచిపోయి ఊరికే మెట్టెక్కిపోతున్నావా? మెట్టు ముగిసిందనుకో. ప్రతిఘటించబోకు. తెలిసిందా జాగ్రత్త! నువ్వు మంగలాడివికాదా? నీ అమ్మ మంగలిది. నీవు వేరే ఏమౌతావు?' అని జవాబు చెప్పాడు.

'సరి! నాసంగతి చెప్పారు. నా తల్లిసంగతి చెప్పారు. నోటికట్టతెగి ఇంకా ఏమేమి మాటాడారో మీకే తెలుసు. కాని నేను మీ ధార్ష్ట్యానికి బెదిరేవాడినికాను అని తెలుసుకోండి. నా కాలుమాత్రం కుంటి. నా బుద్ధి కుంటిదికాదు.'

'పోరా! కుక్కల కాపలాకాయి. నాతో మాటాడిస్తున్నావా? పో! నీ కుక్కలను కాచుకో. సభలో నిలబడటానికి నీ వెవరు? నీ కుక్కల్ని నువ్వు కాచుకో పో' అని బోపణ్ణ రాజభవనంలోపలిదిక్కుగా తల ఆడించి [illegible] వెళ్ళాడు. లక్ష్మీనారాయణయ్య అతనివెంట నడిచాడు.

అక్కడవున్న పరిచారకులు, ఇలియు [illegible] వాళ్ళిరువురికీ చేతులుజోడించి నమస్కరించారు. వాళ్లు అందరికీ నమస్కరించి సభనుండి బైటకి నిష్క్రమించారు.

# 15

వీరరాజునకు ఒక్కత్తే చెల్లి. లింగరాజు తాను గతించిందిమొదలు కొడగు యువకునికి ఒక్కనికి లింగధారణచేయించి ఆపిల్లను అతనికిచ్చి పెండ్లిచేశారు. పెండ్లికిముందు అల్లుడు కాబోయేవానికి 'చెన్నబసవ' అని పేరుపెట్టడం తన రాజవంశంలోని ఆచారం. ఆవిధంగానే అల్లునికి నామకరణం చేశాడు. తండ్రి, కూతురికై 'అప్పంగొళ' రాజసౌధాన్ని విలక్షణంగా తయారించాడు. దానిలో కావలసినన్ని వస్తువాహనాల్ని నింపేశాడు. కూతురు అల్లుని ఆ రాజసౌధంలోఉంచి సుఖంగా ఉందేటట్లు చూసికొని వారంలో మూడుసార్లు తాను అక్కడికి వెళ్లిగాని లేక వాళ్లను రాజసౌధానికి రప్పించుకొనిగాని సంతోషిస్తూ వుండేవాడు. చనిపోయే టప్పుడు పిల్లవానితో 'చెల్లెల్ని ప్రేమగా చూసుకో నాయనా!' అనిచెప్పి మరీ చనిపోయాడు. కోడలిని దగ్గిరకుపిలిచి 'నేను నీకేమీ లోపంచేయలేదు. నీ ఆడుబిడ్డకు పెట్టిన చిల్లరమల్లర సొమ్ములను నీవు ముట్టుకోకూడదు. ఆమెకు ఇచ్చింది ఆమెకే ఉండనీ' అని చెప్పాడు. కోడలుకూడ 'మీరు చింతింపకండి. మీ అమ్మాయి సుఖంగావుంటే చాలు. అది నాకేమీ కడుపుమంటవిషయం కాదు' అని చెప్పింది.

రాజభవనానికి అల్లుడు కాకుండావుంటే చెన్నబసవన్న ఒక సామాన్య సభ్య గృహస్థుగా బాగానే బ్రదికేవాడేమో అనిపిస్తుంది. కాని అతని దౌర్భాగ్యం లింగరాజుకన్ను అతనిమీద పడింది అల్లునిగా చేసుకోవడానికి! దాంతో అతడు తాను ఏదో ఒక విశేషవస్తువును అనే భ్రమలో పడ్డాడు. మిగతావాళ్లపట్ల ఎంతో కాఠిన్యాన్ని ప్రదర్శించే లింగరాజు కూతుర్నిబట్టి అల్లునిమీద ఒకింత దాక్షిణ్యభావాన్ని వెలార్చేవాడు. అదేసమయంలో అతడు కొడుకు వీర రాజును, అయోగ్యుడని, దుష్టుడని ఘంర అని తిట్టేవాడు. ఒక్కొక్కసారి వీరరాజుతో 'చూడు, అతడేమీ రాజభవనంలో పుట్టినవాడు కాదు. కాకపోతేనేం అల్లుడు ఎంతగంభీరంగా ఎంత ఠీవిగా నడుచుకుంటారో! ఆయనగారి కాళ్లక్రింద దూరిపో. కొంచెం బుద్ధి ఏమైనా వస్తుం దేమో చూడు' అనేవాడు. ఇంతోటిమాట తన గుణాతిశయంచేత ముగ్ధుడైన ఒక మహా పీయుడు చెప్పినమాటగా తోచింది. ఒకొక్కక్కతడవ అతడు మామగారు తన కుమారునకు మారుగా తన్నే రాజుగా ఎన్నుకొంటాడేమో అనికూడ భ్రమపడ్డాడు.

అటువంటిదేమీ జరగలేదు. వీరరాజే సింహాసనమెక్కాడు. సింహాసనమెక్కడానికి అతనికంటె తనకు యోగ్యత హెచ్చని, అధికారప్రాభవం తక్కువేమీలేదని, అనుకొనే మనోధర్మంలో జీవిస్తూ చెన్నబసవయ్య రాజద్రోహంతోకూడిన విషవాయువుల్నిసేవిస్తూ నేడుకాకపోతే పోనీ, రేపైనా తానే దొరకావాలనే నిశ్చయానికి వచ్చాడు. తన అభి ప్రాయాన్ని మధ్యమధ్యమాటల్లో వెళ్లబెట్టుతూవుండేవాడు. లింగరాజు చనిపోయిన సంవ

త్సరంలోవలనే రాజుకు అల్లునికిమధ్య మనోవైకల్యం ఏర్పడింది. రానురాను ఈ వైషమ్యం పెరిగి పెద్దదై, నాలుగేండ్లక్రింద వీరరాజు తన చెల్లెల్ని తన రాజభవనానికి రప్పించి తిరిగి పంపించనంతటిమేరకు పోయింది. అల్లుడైన చెన్నబసవన్నవచ్చి కాళ్ళమీదపడి ప్రతిమా లాడాడు. రాణి అనేకవిధాలుగా వేడుకొన్నది. కూతురు అత్తనుగురించి ఆటమటించింది. కాగా వీరరాజు ఆమెను వెనక్కు అత్తవారింటికి పంపాడు. మైసూరు ఆంగ్లేయులకైవసమై బెంగుళూరులో రాజప్రతినిధి ఆంగ్ల అధికారులు వెలసినపిమ్మట, చెన్నబసవయ్య తన బావ గారిమీద అనేకనిందారోపణలుచేస్తూ మైసూరు సింహాసనంనుండి మైసూరురాజును దింపివేసి నట్లు, అతనినికూడ గద్దెనుంచి ఊడబెరకాల్పిందనిన్నీ, రాజ్యాన్ని తనపత్ని దేవమ్మాజీకైవసం వేయవలసిందనిన్నీ, ఓ అర్జీ పెట్టుకొన్నట్లు వీరరాజుకు తెలుసు. అప్పుడు తానే 'అప్పం గొంకపోయి చెన్నబసవన్నను కొట్టి, రచ్చకీడ్చి, చెల్లెల్ని పట్టుకొని బలాత్కారంగా తీసుక వచ్చి రాజభవనంలోని చెఱసాలలో పెట్టేశాడు. ఈ కథ నడచి దాదాపు రెండేళ్లు పూర్తి అయింది. రాణీ, కూతురు ఎంతో ప్రార్థించారు. రాజు వాళ్ళప్రార్థన అంగీకరింపలేదు. చెన్నబసవన్న ఆంగ్లేయులకు తిరిగి ఫిర్యాదులు పంపించాడు. ఇల్లాచేయడం రాజుమనస్సును మరింత పషాణకఠోరం చేసింది. దేవమ్మాజీ చెఱ కడముట్టేటట్లు లేదు.

# 16

సభామందిరంలో బసవన్నకు సమ్మానార్హమైన స్థానాన్ని కల్పించడంలో, మంత్రులతో జగడం పెట్టుకొన్నట్టే, వీరరాజు తన కాముకప్రవృత్తిచేత కొన్నిచోట్ల, ధనలోభంచేత మరి కొన్నిచోట్ల జనంలో తనపట్ల ద్వేషం సంపాదించుకొన్నాడు. స్త్రీలోలుడైన యువకునికి మోహసంబంధమైనవ్యాధి వచ్చిందంటే ఆశ్చర్యమేమీలేదు. వ్యాధి వచ్చింది. వెంటనే వైద్యం చేయించాల్సివచ్చింది. చూర్ణాలు, అరగదీసిన కుప్పెలు, కరగించినభస్మము పొట్టను నింపేసాయి. శాస్త్రీయమైనవైద్యం చాలదని కనుక్కొన్నతర్వాత కుంటెనకాండ్ర సాంప్ర దాయికమైనవైద్యం నడిచింది. మగవానిదేహంలోని నిస్త్రాణకు సూక్ష్మవధూ కోమలదేహ స్పర్శ ఒక చికిత్స అని ఈ సంప్రదాయజ్ఞుల విశ్వాసం. రాజైనవానికి ఈ చికిత్స చేకూర్చడం ఏమంత కష్టమైనపనికాదు. కావలసినంతగా ఈ చికిత్స చేశాడు. ఈరకమైన ప్రవృత్తిఫలి తంగా ముప్పైఏళ్లనాటికే రాజుశరీరం ఎండుపారిపోయింది; డొల్లపోయింది.

మొట్టమొదట రాజసకు మద్యం, మాంసం, స్త్రీలనుచేకూర్చి అతనిప్రీతిని సంపాదించిన 'కుంటి'కి చివరికి నసకే లతన్ని హెచ్చరింపవలసినపరిస్థితి ఏర్పడింది. కాని చెడటానికి

స్నేహితునిమాట, సాయం, చేపట్టినట్లుగా వీరరాజు బ్రదుకుబాటకై అతడిచ్చిన హెచ్చరికను అంగీకరించేధోరణిలో లేడు.

రాజు జారుబండపై కూచొని జారిపడిపోతున్నాడు. తనస్థానాన్ని వశంలో లేకుండా చేసుకొంటున్నాడని బసవన్నకు కొన్నివేళల్లో అనిపించేది. కాని ఆ దేబండమీద అతనికాలికి తన తుంటకాలికికట్టుకొని తానూ జారి క్రిందకు పడిపోతున్నట్లు అతనికి కానవచ్చేది. జారడం ఆరంభిస్తే దీనికి ఒకటే ఒక నిలుకడ. బండఅడుగున అణగారిపోవడమే. మధ్యలో నిలువరించుకొని నిలవడం తమకు సాధ్యమైనపనికాదనే ఆతడు చాలాసార్లు ఉసూరుమని పోతూవుండేవాడు.

# 17

పరిపాలన నానాటికి తీసికట్టుగావుంటుంటే దేశంలోని జనులనేకులు సహజంగానే వీరరాజును గురించి ఆరాటపడటం మొదలుపెట్టారు. ఇచ్చినపన్నే తిరిగి ఇవ్వాలి అనేసంకటానికి గురియైనవారు, ఇష్టంలేకుండానే ఇంటి ఆడపిల్లల్ని రాజసౌధానికి పంపవలసివచ్చినవారు, ఏదోసందర్భంలో రాజుచేతనో, బసవన్నచేతనో మాటపడ్డవారు, ఈ వెనుకబడ్డజనంలో ముఖ్యులైనవారు. ఇటువంటివారు దేశంలోని అన్నివర్గాలలోను ఉండివున్నారు.

బసవన్న మంత్రియైనరోజుకు ఇటువంటి జనసంఖ్య చాలా పెరిగిపోయింది. మంత్రులూ, ఇతర పెద్దమనుష్యులూ, అయినా రాజును ప్రతిఘటించి గట్టిగా మాటలాడి పరిస్థితిని కొంతవరకైనా చక్కబరచేవారు ఎవరా ఎప్పుడా అని జనం నిరీక్షించడం మొదలుపెట్టారు. అటువంటిదేమీ లేకపోగా బసవన్నకూడా ఒక మంత్రైనని [illegible] అయింతర్వాత జనంలో కొందరైనా, ఆపని తామే చేయాల్సివుంటుందని అనుకున్నారు.

అటువంటివారిలో భాగమండలంలోని చెన్నవీరయ్య అనేవాడొకడు. ఇతనివంశంలోని పెద్దలు రాజభవనంలో సేవ చెల్లించినవారే. అప్పాజీ వారి కావలసివుండగా, అతన్ని తప్పించి లింగరాజు ప్రభువవడం అతడికుటుంబంలో ఒకానొక అసంతృప్తిని కలిగించింది. దొడ్డ వీరరాజు అప్పాజీని చంపించాడనే దేశంలోని జనులందరికీ నమ్మకం. ఇతనికుటుంబంలో పాదుకొన్న దృఢాభిప్రాయం ఏమిటంటే - అప్పాజీ మైసూరుదేశంలో ఉన్నాడు, వారికొమారులూ అక్కడే వుండివున్నారు, కొడగుదేశం ప్రభుత్వం నిజానికి వారిది. నేడు కాకపోయినా, రేపైనా జనులు ఈ దుష్టప్రభువును పైదొలగించి అప్పాజీ కుమారుని పిలిపి

తీసుకొని రావలసివుంది. అల్లాకాదంటే దేశానికి క్షేమం లేదు అని.' చెన్నవీరుడు అర్జీదానికి తరుణ మాసన్నమైందని తలపోశాడు. బెంగుళూరికిపోయి అప్పాజీ అక్కడ పేరు మార్చుకొని జీవిస్తూవుండటం గమనించాడు. గుప్తంగా అతనికుమారుని పేరు వాడుకోవటానికి అనుమతిపొంది వెనక్కు తిరిగివచ్చాడు. అతిరహస్యంగా ఈవిషయాన్ని తన కత్యంతాప్తులైన కొద్దిమందితో హెచ్చరించాడు.

వాళ్లంతా అతనిమాటకు ప్రోత్సాహం ఇచ్చారు. ఇంతటిప్రయత్నం ఇట్లాగే సాగివుంటే చెన్నవీరయ్య తన ధ్యేయాన్ని సాధించివుండేవాడేమో। కాని మధ్యలో ఎవరి అజాగ్రత్త వల్లనో ఈ కుట్ర. భాగమండలంలోని తక్కయ్యచెవిలో పడింది. అతడు 'ఇటువంటివిషయానికి దేశం గొడ్డుపోయిందా? పెద్దలైనవాళ్లు లేరా? పిల్లకుంకలకెందుకు పెద్దపెద్ద ఆర్భాటాలు?' అని కోపం చేశాడు.

గుట్టు రట్టవడంతో చెన్నవీరయ్య ఏర్పాటు భంగమైంది. అంతేకాదు; అతనిఊహలు, యత్నాలు బసవన్నచెవికికూడ ప్రాకాయి. తాను విన్నదాన్ని బసవన్న రాజుచెవిలో ఊదాడు.

రాజు:-'ఎవరీ దొంగలు? వాళ్లనుపట్టి తెప్పించు' అన్నాడు. ఈసమాచారం తెలియగానే చెన్న వీరయ్య మైసూరుకు పారిపోయాడు.

బసవన్న అతడు కన్నుగప్పి పారిపోకుండా అతనిమీద మనుష్యులను నియమించి ప్రభువు ఆజ్ఞపొంది మైసూరు చీఫ్ కమీషనరుకు ఒక ఉత్తరము వ్రాశాడు. దానిలో 'మా దేశంలో రాజద్రోహంచేసి అపరాధిఅయిన చెన్నవీరయ్య అనేవాడు మీదేశానికి తప్పించుకొని వచ్చివున్నాడు. అతన్నిపట్టి మాదగ్గిరకు పంపించగోరుతాం' అని ఆ అధికారిని కోరాడు.

మైసూరు తప్పించుకొని కొడగుకు పారిపోవడం, కొడగునుండి మైసూరుకు పారిపోవడం కొత్తసంగతేమీ కాదు. అటువంటిసందర్భాల్లో ఈ ప్రభుత్వం వారిని, ఆ ప్రభుత్వం, వీరిని సహాయపడవలసిందనికోరడం మామూలుగా వస్తూవున్నఅలవాటే. చీఫ్ కమిషనరు చెన్న వీరయ్యను బంధించాడు. అతన్ని బసవన్న నౌకరులతో కొడగుకు పంపించాడు. పంపిస్తూ ఆచారం ప్రకారం 'ఇతడు చేసిననేరం ఏమిటి? ఇతనికి ఏమి శిక్ష విధింపబడ్డది? యావద్విషయం ఈ వ్యవహారం ముగిసినమీదట తెలియజేయవలసింది' అని కోరాడు. బసవన్న చెన్న వీరయ్యను రాజు సమక్షంలో నిలిపాడు. రాజు 'కొడగుకు వేరేరాజును తెచ్చే మగధీరుడవు నువ్వే కాబోలు?' అని వెటకారంగా అడిగాడు.

చెన్న వీరయ్య:-'నేను ఏమాటా చెప్పేదిలేదు?' అన్నాడు.

రాజు:-'నీ అప్పాజీ ఎక్కడున్నాడు? అతని పిల్లవాడు ఎక్కడ? చెప్పు. చెప్పితే నిన్ను విడిచిపెట్టుతాం.'

చెన్న వీరయ్య:-'నేను మీకు ఏమాటా చెప్పేవాడిని కాను.'

రాజు:-'పోనీ! ఈపనిలో నీతో ఎవరెవరు సాయపడుతామని చెప్పారో అదైనా చెప్పు. నిన్ను విడిచివేస్తాం!' అని ఆశపెట్టాడు.

చెన్న వీరయ్య:-'నే నటువంటి కుక్కనుకాదు' అని సమాధానం చెప్పాడు.

రాజు దగ్గిరనున్న పిస్తోలుతీసుకొని సూటిగా అతనిపై పేల్చాడు. చెన్న వీరయ్య అక్కడే శవమై పడిపోయాడు.

ఈఘటన జరిగింది 'నాల్కునాడు'లోని రాజసౌధందగ్గిరనున్న అడవిలో. చెన్నవీరయ్య మృతిసంగతి జను లూహించుకొనడంతప్ప అక్కడనున్న ఎవరినోటివెంబడి ఎవరి చెవికీ ప్రాకలేదు. ఒకళ్లిద్దరు సేవకులకు బసవన్న 'ఈమాట పైకి పొక్కిందంటే చాలు! వాళ్లకీ ఇదేగతి! జాగ్రత్త!' అని భయపెట్టాడు. రాజు 'శవాన్ని కుక్కకు పారేయించు' అని బస వన్నను ఆజ్ఞాపించాడు.

కొద్దినెలలు తరువాత చీఫ్ కమిషనరు తన వుత్తరంలో నాలుగైదుసంగతులతోబాటు ఈవిషయాన్నికూడా ప్రస్తావించి 'అపరాధి అయిన చెన్న వీరయ్య విచారణ ముగిసిందా? దానిఫలితం ఏమిటి?' అని ప్రశ్నించాడు. బసవన్న వ్రాసినఉత్తరంలో మిగిలినప్రశ్న లన్నిటికీ జవాబు ఉంది. ఈ ఒక్కవిషయాన్నిగురించి ఎట్టిప్రసక్తి లేదు.

చీఫ్ కమిషనరు 'ఈవివరంలో జవాబు ఏమీలేదు. వ్రాసేటప్పుడు మరిచిపోయివుండ వచ్చు. ఈతడపైనా దయచేసి తెలుపగోర్తాను,' అని ఉత్తరం వ్రాశాడు. రాజు దానికి జవాబు వ్రాయవద్దన్నాడు. నాలుగు స్మరణపత్రాలు వచ్చాయి. వాటికీ ఏమీ జవాబులేదు.

చివరికి చీఫ్ కమిషనరు 'మా ఉత్తరాలను ఈవిధంగా నిర్లక్ష్యంచేయడం మా మీమధ్య వున్న మర్యాదను భంగపరుస్తోంది. ఘనతవహించిన మద్రాసుగవర్నరు ఈవిషయంలో చాల అప్రసన్నులై వున్నారు. ఈపాటి చిన్నవిషయానికి వైమనస్యం పెంచుకోవడం తమకు ఇష్టముండదని మే మెరుగుదుము. స్థితిని సరిపరచుకోవడానికి తమరు సమ్మతిస్తారని అను కుంటాను' అని వ్రాశాడు.

వీరరాజు ఈ ఉత్తరానికీ జవాబు ఇవ్వలేదు. ఆంగ్లేయులకూ, అతనికీ మధ్య ఈ సంగతి ఒక అడ్డుగోడగా తయారైంది.

# 18

చిన్న వీరయ్య ఈవిధంగా రాజుకోపానికి బలైపోయినా అతడు మొదలుపెట్టినపని అంత టితో నిలిచిపోలేదు. కిందటిసారి కావేరీయాత్రలో అతడు రాజునుగురించి వేసటపడ్డ పలు వురు యువకులను స్వతఃచూసి ఈ కార్యానికి నడుంబిగించి నిలబడాలని కోరాడు. ఇంతకు

ముందే ఆయన మరి ఆయనవెంటనున్న పదిమందియువకులూ, దేశపరిస్థితినిగురించి ఆలోచించి 'కావేరి యువకకూటం' ఒకదాన్ని స్థాపించుకోవాలి, తా మున్నచోట్ల గుప్తంగా సంగతులు తెలుసుకోవి, రాజువల్ల దివానువల్ల జనులకు కలుగుతూవున్నకష్టాలను సాధ్యమైనంతవరకూ తప్పించాలనీ, ఆలోచనలు చేస్తున్నారు. చెన్న వీరయ్య ప్రయత్నంమూలంగా ఆ యోచనలు కార్యరూపాన్ని దాల్చాయి.

సంఘాన్ని స్థాపించేబాధ్యతను బోపణ్ణ సోదరుని అల్లుడు ఉత్తయ్య చేపట్టాడు. అతడు కొడగుసేనలో ఒక సేనాని. ఇందువిషయమై ఇంతకుముందే నిర్ణయానికి వచ్చినవాడు. స్నేహితులతన్ని తొందరపడవద్దని చెప్పితే ఇన్నాళ్లు జాగుచేశాడు. ఇహ జాగుచేయడం ఆవశ్యకమే అని విశ్వసించి సంఘాన్ని స్థాపించాడు. వర్షఋతువులో అతన్ని మడకేరి కాపలాకై నియమించారు. ఇల్లాచేయడం అతని ఉద్దేశానికి సాయమే అయింది. మడకేరికివచ్చిన ఒకటిరెండురోజుల్లో అతడు సంఘానికి చేరదగిన యువకులను వేరువేరు మనుషులద్వారా, వేరువేరుచోట్లకు వచ్చునట్లు చెప్పిపంపించి, ఒక్కొక్కనికీ దేశానికి వాటిల్లనున్న విపత్తును గురించి నచ్చజెప్పి, ఆ ముప్పును తప్పించడానికి సంఘము అవసరంకదా అని అడిగాడు. అందరూ ఔనన్నారు. 'నీవు ముందు నిలు. నేను కావేరి పుత్రుడను. నీవెనక్క నిలుస్తా. చెప్పిందాన్ని చేస్తా. ప్రాణం ధారపొయ్యి అంటే ధారపోస్తా,' అని ఒకొక్కడు శపథం చేశాడు. ఉత్తయ్య వారికి 'కావేరిబిడ్డలు, 'బిడ్డలతల్లి' అనే గుర్తుమాటలను నేర్పి, ముందు ఏవిధంగా నడచుకోవాలో అదంతా తిరిగి వాళ్లు చెప్పేటట్లు గట్టిచేయించాడు.

ఈవిధంగా ఉత్తయ్యకు బాసటగా శపథమాడి నిల్చినయువకులు - వర్తకపేట యజమాని చిక్కణశెట్టి అన్నకొడుకు రామశెట్టి, దీక్షితుని తమ్మునికొడుకు సూరి, దివాను పొన్నప్పఅల్లుడు ముద్ది, వైద్యునిబిడ్డ విశ్వం, రాజభవనంలోని గురికానిబిడ్డ మాచ. ఒక్కొక్కరూ తమకు ఆప్తులైన వేరొకరిని జతచేసికోవాలి, తాము ఒకరితోఒకరు మాటాడుకోకూడదు. ఏమాటైనా ఉత్తయ్యకుతెలిపి ముందు ఎల్లా నడుచుకొనేది తెలియజెయ్యాలి. ఏపనీ ఉత్తయ్య ఎఱుకమీద జరగాలి.

వీరిలో మాచయ్య రాజభవనంలో గూఢచారిగా ఉంటూవచ్చాడు. మిగిలినవారికి ఏపనీ వంగా లేదు. చెన్న వీరయ్య అజాగ్రత్తతో ప్రభువుకు బందిగా చిక్కినప్పటినుంచీ సంఘంలోని ప్రముఖులు రాజు తమపట్ల ఎట్లా నడుచుకొంటాడో అని చింతించడం మొదలుపెట్టారు. అతడు వీరిపేర్లనుచెప్పితే రాజు వీరిలో ఎవరినిపట్టించినా ఆశ్చర్యంలేదు. అయితే అట్టిదేమీ జరుగలేదు. అయితే అతడుమాత్రం తరువాత ఎవరికీ కంటబడలేదు. బహుశః రాజు అతన్ని చంపించి ఉంటాడనుకున్నారు. చెన్న వీరయ్యస్మృతికి ప్రతీకారం వెలువరించడం తమ కర్తవ్యంగా భావించారు.

చెన్న వీరయ్య మొత్తంమీద కనుమరుగు అయిన కొన్నినెలల్లో మడకేరికి ఒక వీరశైవస్వామి వచ్చెను. అతడు తనపేరు 'అపరంజయ్య' అని చెప్పాడు. అతడు ఊరిలో

రాజుల స్మశానవాటికలో ఉంటూ, వచ్చినవాళ్ళకు ఏవో రెండు మంచిమాటలు చెబుతూ వుండడం, కొంచెమో గొప్పో వైద్యం చేస్తూవుండడంగా కాలం వెళ్లబుచ్చేవాడు. వచ్చిన కొన్నాళ్లకు స్వాములవారు భిక్షకై ఇంటింటికీ తిరుగుతూవుండగా, 'కావేరి తరుణసంఘం' ప్రముఖుల్ని ఒక్కొక్కళ్ళనూ గుర్తుపెట్టుకొన్నాడు. వారితో పరిచయం బాగా ఏర్పడ్డ తర్వాత దేశపరిస్థితినిగురించి మాటాడి తానూ ఒక 'కావేరిబిడ్డ' అని వారికి నమ్మక పుట్టించాడు. ఉత్తయ్య, చిక్కదీక్షితులు, సూరి, రామశెట్టి, వీరందరు అతన్ని తమకు నాయకునిగా అంగీకరించారు.

స్వామి సహాయంతో సంఘంయొక్క ధ్యేయం రానురాను స్పష్టంగా రూపు కట్టింది. మొదటిధ్యేయం, రాజూ, బసవయ్య, జనానికి కలిగిస్తూవున్న ఇక్కట్టులనుండి వాళ్ళను ఉపాయంగా తప్పించడం; రెండవధ్యేయం శాసనంపట్ల విముఖ్యం, వైమనస్యం ఏర్పడ్డ పెద్దల్నిచూసి తమ ఉద్దేశాన్ని సాధించడానికి వారినుండి సాధ్యమైనంత సహాయసంపత్తుల చేకూర్చుకోవడం. మూడవది, ఈవిధంగా విముఖులైనపెద్దల్ని సమావేశపఱచి సాధ్యమైతే రాజునకు బసవన్నకు ప్రతిభటంగా ఒక పార్టీని నెలకొల్పడం. రాజుకు విరోధివర్గం వుందని తెలిస్తేచాలు, మైసూరువలెనే కొడగురాజ్యాన్నికూడ ఆంగ్లేయులు మింగివేయాలని చూస్తారు. అందువేత అట్టి సంకటాన్నితప్పించి రాజ్యం కొడగు రాజవంశంక్రిందనే వుండేటట్లుచూడటం నాల్గవధ్యేయం.

ఈమధ్యలో ఉత్తయ్య ఒక్కసారి 'స్వామీ! మీరనుమతిచెప్పి నేను నాపనికి రాజీనామా చేసేస్తాను. సంఘంపనిమీదనే వుండిపోతాను,' అన్నాడు. స్వామి 'నీవు నీపని వదలివేయ వలసినపని లేదు. అందులో వుంటూవుంటే అనేకులు నీ చేతిలో వుంటారు. అందువలనంగా మనపనికి చాలా వీలు. ఉండు చూద్దాం,' అన్నారు.

# 19

ఈమధ్యలో ఉత్తయ్యజీవితంలో దైవికంగా ఒక ఘట్టం నడిచింది. అది దేశానికి, రాజవంశానికికూడ మార్పు తీసుకొనిరాగల సంఘటన.

మడకేరిని కావలా కాచేవానికి రాజభవనాన్ని కావలా కాయవలసిన బాధ్యతకూడ కద్దు. దానిచేత ఉత్తయ్య రాజభవనంలోని లోపలి ఆవరణలోకూడా తిరుగుతూవుండడం, పనీపాటా చేస్తూవుండడం అవసరమైంది.

ఉత్తయ్య అందమైన యువకుడు. అతడు రాణివైపు చుట్టం కూడా. వరుసచేత అన్న కుమారుడు.

రాజభవనం చుట్టుప్రక్కలకు రాణిగాని, రాజకుమార్తెగాని ఎక్కడకైనా వెళ్లాలంటే వెంట ఎవరైనా వెళ్ళేఏర్పాటు చేయడమో లేక తానే జతగా వుంటూవుండడమో చేస్తూ అతడు రాణిపట్ల, రాజకుమార్తెపట్ల నిజమైన భక్తిగౌరవాలతో సేవలుపచరించేవాడు. కొడగు జాతిబిడ్డేగాక తాను బోపణ్ణకు చుట్టంకూడా. అందుచేత అతనికి ఆత్మగౌరవం మెండు. వంశానికి మంచి పేరు ప్రతిష్ఠలు తేవాలి అనే ఆసక్తి అతనికి సహజంగానే ఏర్పడింది.

రాజకుమార్తెను చాలాసార్లు చూసివున్నాడు. ఆమె రాజకుమార్తె కాకపోతే, ఆమెను అతడు పెళ్లాడాలని ఉబలాటపడేవాడే. కాని ప్రస్తుతసందర్భంలో అది సరికాదు. సరికాదు అంటే అదేమీ అందుబాటులోలేని సంబంధం అని అర్థంకాదు. రాజకుమార్తెను తోటి రాజులువచ్చి తమవంశంలో ఆమెను ఇమ్మనమని అడుగవచ్చు. అంతేకాని రాజవంశానికి చెందనివాళ్లు తామెంత గొప్పవాళ్లైనా రాజకన్యను ఇమ్మనమని అడగడం తప్పు. ఇందులో ప్రధానమైంది రాజవంశం.

మీదుమిక్కిలి రాజవంశం శివాచారసంపత్తికి పేరువడ్డవంశం. ఉత్తయ్య రాజకుమార్తెను పెళ్ళాడాలిఅంటే మొదట లింగధారణచేసి వీరశైవుడు కావాలి. అయితే కొడగు సాంఘికవ్యవస్థలో అట్లా జరగడం అంత సులువేమీకాదు. తాను 'కావేరిబిడ్డల'లో చేరడం చేత తన కటువంటి ఆలోచన కూడదని అనిపించలేదు. ఆ విరోధం రాజుమీద. రాజకుటుంబాన్నిగురించికాదు. రాణి అన్నా, రాజకుమారి అన్నా అతనిలో అనూచానమైన గౌరవప్రపత్తులకు లోటులేదు.

పెండ్లి అయ్యే సావకాశం చాలాతక్కువైనా లేక అసలే లేకపోయినా ఆ వయస్సులో వున్న యువకుడుగాని యువతిగాని, ఎవరో ఒకరివిషయంలో కొంత మమకారం, మక్కువ చూపటం సహజమైనవిషయమే. రాజభవనం రక్షణకుగా [1]పడవాలుగా ఉత్తయ్యవచ్చి మొదటిగా రాణిని చూచినప్పుడు అతని పుట్టుపూర్వోత్తరాలు అన్నీ రాణి విచారించింది. బోపణ్ణ అల్లుడు తనకు దూరబంధువు అని తెలిసినతర్వాత తానే మన చిన్నమ్మకి ఇతన్ని కూరిస్తే చాలా బావుంటుంది అనుకొన్నది.

రాణి ఉత్తయ్యతో మాటాడేటప్పుడు కూతురు ఆమెగారిప్రక్కనే నిలబడి ఆమెను కుడిచేతితో గుండ్రంగా వాటేసికొని తన తలను ఓరగా తల్లి బుజంమీద ఆన్చివుంచింది. ఉత్తయ్య అందమైనవాడు. పిల్లదానికి అతన్ని చూడటంలో ఒకానొకసంతోషం ఒడలు పులకరింపచేసింది. ఉత్తయ్య ఆ విషయాన్ని కనిపెట్టాడు. అతనికి సంతోషమే.

---

1. పడవాలు—దళపతి; దళవాయి; సైన్యాధికారి.

ఆరాత్రి కూతుర్ని నిద్రపోగొట్టుతూ, ప్రక్కని కూచున్నరాణి మెల్లిగా ఆమెచెవిలో 'చిన్నమ్మా, ఉత్తయ్యకు నిన్నిచ్చి పెళ్లిచేసేదా?' అని అడిగింది. కూతురు సంతోషంగా తల్లిగొంతును తన బాహువులతో చుట్టి కౌగిలించుకొని 'అప్పాజి సమ్మతించారా.' అమ్మాజీ! వారు ఒప్పుకోవాలికదా!' అంది.

రాజభవనంలో అల్లారుముద్దుగాపెరిగి పధ్నాలుగేళ్లు వచ్చినపిల్ల, తన చదువడికలో ఇంకా పసిపిల్లలా వ్యవహరిస్తూవచ్చినప్పటికీ, తండ్రి జీవించేతీరు, బసవన్న దాస్యబుద్ధి, బోపణ్ణ నిర్దాక్షిణ్యం, తల్లి వ్యవహారచాతుర్యం, వీని అన్నింటివల్లా తానూ లోకవ్యవహారం లోని ప్రపంచంపోకడలోని మర్మాలను, రహస్యాలనూ, కొంతకుకొంత ఆకళించుకొన్నది. తనకు తన తండ్రిఅంటే పంచప్రాణాలు. బహుశః తనతల్లిని మినహాయిస్తే మిగతా ఎవరిమీద తనకంత ప్రేమలేదు. తండ్రి అన్యాయంగా, ఊరిజనంతో, మంత్రులతో, చివరికి చేసుకొన్న పెండ్లాంతో విరోధం తెచ్చుకుంటారేమో అని ఆమెకు ఎంతో అతనిమీద జాలి, ఎంతో దుఃఖం! అట్లే తల్లి పెద్దకుటుంబానికిచెందిన పిల్ల అనీ, ఆమె ఈవిధంగా కష్టపడటం బాగా లేదని, ఆమెమీద ఎంతో కనికరం! ఎంతో గౌరవం! తనతండ్రికి తనమీద ఎంతో ప్రేమ అని రాజకుమారికి తెలుసు. కాని రాణి ఏంచెప్పినా మొట్టమొదట కాదనడం అతని స్వభావం అనికూడా ఆమెకు తెలుసు. పైపెచ్చు, ఈ పిల్లవాడు బోపణ్ణ కొడుకాయె! రాజుకు బోపణ్ణ, ఆతనిమాట, ఆతనిసంబంధం, ఇవెవ్వీ గిట్టనివిషయాలు!

పసిపిల్ల ఆ క్షణంలో వీటన్నిటినీ ఇంత నిశితంగానూ ఆలోచించింది అనికాదు. ఇదంతా ఆమె మనస్సును ఆవరించివున్న భావసముదాయం. ఈ సంబంధం అంత తేలికగా ముడి పడేదికాదని ఆ భావపరిణామంగా ఏర్పడ్డ నిశ్చయం. తర్కము, ఊహాపోహలు లేకుండానే ఇట్లని ఆమెమనస్సుకు తట్టింది.

కూతురికి తోచినసంగతి రాణికి తోచకపోలేదు. ఆమెకు కావలసింది ముందు పిల్ల పిల్లవాణ్ణిగురించి యిష్టపడిందా లేదా అని. ఆవిషయం తేలితే పైమాట చూడవచ్చు. దైవాను గ్రహముండి కల్యాణం కూడివస్తే మంచిదే - పిల్లమాటకు రాణి 'అది సరే' అంది. ఆమె కురులుదువ్వి వెన్నుతట్టి 'నిద్రపో తల్లీ' అనిచెప్పి పక్కనున్న తన పక్కమీద తాను నిద్ర పోయింది.

ఈసంగతి గడచిన కొద్దిరోజులకు మంత్రి లక్ష్మీనారాయణయ్య వేరే ఏదోపనిగా రాజ సౌధానికి వచ్చినప్పుడు, రాణి అతన్ని దగ్గిరకు రప్పించుకొని 'రాజభవనానికి మీనుండి ఒక ఉపకారం జరగవలసివుంది పంతులుగారూ' అంది. లక్ష్మీనారాయణయ్య 'ఆజ్ఞాపించండి అమ్మాజీ 'శిరసావహించి నడచుకొంటాము' అన్నాడు.

రాణి అతనికి ఉత్తయ్యనుగురించి తనకు లోపలగల ఉద్దేశాన్నిచెప్పి, 'ఇది తొందరపడి చేయవలసిన పనికాదు. మొదట అందరిమనస్సులూ తెలుసుకొని చిట్టచివరికి రాజాగారిని

అడుగవలసివుంటుంది. ఓం ప్రథమం, బోపణ్ణగారు ఒప్పుకోవాలి. మేం ప్రస్తావించామని చెప్పకుండా, నీవే ఈ ప్రస్తావన తెస్తున్నట్లుగా వారిని ఓమాట అడిగి ఏమంటారో తెలుసుకొని చెప్పకోర్తాను' అంది.

లక్ష్మీనారాయణయ్య 'తమ ఆజ్ఞానుసారం అమ్మాజీ' అన్నాడు. తరువాత బోపణ్ణను కలుసుకొన్నప్పుడు అతనితో ఏకాంతంగా 'మీ మేనల్లుడు ఉత్తయ్యకు పెండ్లీడు వచ్చింది. ప్రభువులకన్యను అతనికిచ్చి చేస్తే ఎంతో బాగుంటుంది బోపణ్ణా!' అన్నాడు.

బోపణ్ణ 'ఇది మనం ఎత్తవలసినమాటకాదు.'

'వారే ఎత్తారనుకో కాసేపు. నీమనస్సుకు ఎట్లా తోస్తోంది?'

బోపణ్ణకు లక్ష్మీనారాయణయ్యకు అంతరంగం ఒక్కటే. అతడు లక్ష్మీనారాయణయ్య మాటను గ్రహించాడు.

'రాణీగారికి తెలుపవలెనా?' అన్నాడు.

లక్ష్మీనారాయణయ్య 'ఔను. అట్లాగే అనుకో,' అన్నాడు.

'అనుకో' అనేది వాళ్ళసంభాషణంలో ఒక సంకేతంలాంటిది. రహస్యాన్ని తెలపాలి. కాని ప్రత్యక్షంగా తెలుపకూడదు. అటువంటప్పుడు 'అనుకో' అనేది ఒక సంకేతశబ్దం.

బోపణ్ణ 'దీనిని దేనినీ మా వైపువాళ్ళు ఒప్పరయ్యా! పిల్లవాడు లింగధారి కావడానికి మా చెల్లెలు బావగారే ఒప్పుకోరు. రాజభవనంలో అల్లుడుతనం కోరదగ్గదికాదు. మల్లవ్వ పాటు అట్లా అయింది, చెన్నబసవయ్య పడ్డపాట్లు ఇట్లావున్నాయి. ఇహ మూడవతరంలో మూడోఅల్లుడిపాటు లెట్లావుంటాయో? ఎవరికి కావాలి ఈ అవస్థ అంతా!' అన్నాడు.

లక్ష్మీనారాయణయ్య 'అంతేగదా?' అని ఆమాటను అంతటితో విడిచిపెట్టాడు. నడచిన విషయం అంతా మరుసటిరోజు రాణితో విన్నవించాడు. రాణి ఈ పెండ్లి ఆలోచన ప్రస్తుతానికి వాయిదా వేసింది.

# 20

మడకేరిలోని వర్తకుపేటకుచెందిన చిక్కణ్ణశెట్టి రాజభవనానికి ధాన్యం, పప్పుప్పులు మొదలు ముత్యాలు రత్నాలవరకు సామగ్రినంతటినీ సరఫరాచేసేబాధ్యత నెత్తిమీద వేసికొన్నాడు. తనవంశంలోని పెద్దలందరు నాలుగుతరాలుగా ఇదేపని చేస్తూవచ్చారు. పదిసంవత్సరాలక్రిందట చిక్కణ్ణశెట్టి ఇంటికి పెద్దవాడై రాజమహల్‌కి ఈరకమైనసేవ చేయడానికి పూనుకొన్నాడు.

రాజభవనానికి సామగ్రి అందించే ఈవనిలో లాభం ఎంతోవుంది. అంతకంటె ఎక్కువగా పేరుప్రతిష్ఠలు లభిస్తాయి. అనేకసందర్భాల్లో రాజభవనంలో డబ్బు తక్కువకావచ్చు. అటువంటప్పుడు తను డబ్బు పెట్టుబడి పెట్టాలి. ఈడబ్బు భద్రంగా వెనక్కు వచ్చేదే. దొడ్డ వీరరాజు హయాంలోకూడ వర్తకపేటలోని శెట్టి యజమానులు ఇదేవిధంగా డబ్బు పెట్టుబడిపెడుతూ వుండేవాళ్ళు. దాన్ని వడ్డీతోసహా తిరిగి పొందేవాళ్ళు. లింగరాజురోజుల్లో ఇటువంటిసందర్భాలు అట్టే రాలేదు. అయినా ఒకటి రెండుతడవలు అట్టిపరిస్థితి ఏర్పడ్డది. చిక్కణ్ణశెట్టి రాజభవనంనుండి డబ్బు రావడం ఆలస్యమైనా రాజకుటుంబానికి కావాల్సిన నెలసరి సామాను అంతా నెలవారీలెక్కలు కట్టకుండానే పంపించేవాడు. చిక్కవీరరాజు హయాములో ఇటువంటివైఖరి ఎక్కువైపోయింది.

ఇల్లా అవడానికి కారణాలు బోలెడు. దేశానికిసంబంధించిన కోశాగారం వేరు, రాజభవనానికి సంబంధించిన కోశాగారం వేరు. దేశభాండారానికి బోపణ్ణ యజమానుడై రాజభవనం వ్యవహారాలు చూసుకొంటూ ఆ భాండారానికి అవసరమైన డబ్బును అప్పుడప్పుడు పంపించుతూవుండడం అలవాటు. బసవన్న రాజభవనానికి పెత్తందారు అయినతర్వాత అతడు బోపణ్ణ పంపిస్తున్న డబ్బు చాలదు అనిచెప్పి రాజుపేరువాడి తిన్నగా రాజుగారి ధనాగారానికి మాగాణములనుండి కప్పం సొమ్ము తెప్పించుకొన్నాడు. బోపణ్ణ చేతిక్రింది అధికారులు మాగాణములనుండి కప్పం వసూలుచేయబోతే అదేదీ రాలేదు. రాజభవనానికి ఇచ్చాం అనే జవాబు వచ్చింది. ఇచ్చాం అని చెప్పేవాళ్ళు ఎంత ఇచ్చింది స్పష్టంగా తెలుసుకోవడానికి బోపణ్ణ గుమాస్తాలు రాజగృహంలో లెక్క అడిగారు. అది సరిగా లెక్క తేలిందికాదు. నూరు వచ్చేచోట, ఇరవైమాత్రమేవచ్చి దేశం బొక్కసం రిత్తవోయింది, రాజగృహంలోని బొక్కసమూ శూన్యమైంది. చెల్లాచెదరైన ఈ ఆర్థికవ్యవస్థను ఓ దారికి తేవడానికి బోపణ్ణ రెండుసంవత్సరాలు కష్టపడవలసివచ్చింది. చివరికి రాజగృహానికి కాసు వీసం ఏమి కావాల్సినా, దాన్ని బోపణ్ణద్వారానే, ఆయన అనుమతిమీదనే తెప్పించుకోవాల్సివుంటుంది అని నిశ్చితమైంది.

రాజగృహం ఒక మితమెరిగి పొదుపుగా నడచుకొంటే ఈ ఏర్పాటు చక్కగానే నడిచివుండేది. కాని రాజభవనంలో రాజుగారుచేసే వ్యయమే మితిమీరి పెరిగిపోయింది. ఆయన పెంచే కుక్కలసంఖ్య, గుర్రాలసంఖ్య నాలుగింతలు పెరిగింది. ఆయన తప్పుదారినడతలకు సంబంధించిన స్త్రీలక్రింద, వారికిసంబంధించిన కుటుంబాల పోషణక్రింద ఎంతోసొమ్ము వ్యయమవుతూవచ్చింది. వీటికితోడు రాజు యువతులకై ఒక అశ్వదళాన్ని ఏర్పాటుచేశాడు. అంతేకాదు; రాజు ఆంగ్లేయులతో సావాసంచేసి ఫ్రెంచిదేశంలోని రుచికరమైన మద్యాన్ని సేవించడం అలవాటుపడ్డాడు. తెల్లదొరలను మడికేరికి రప్పించుకోవడం, వాళ్ళకు విందుభోజనాలు పెట్టడం, వాళ్లతోబాటు చాల విలువైన మత్తుపానీయాలు సేవించడం, వాళ్ళననుకరిస్తూ వేష

ధారణం చేయడం, వాళ్ళసంతోషానికి, తన చాపల్యంతీరడానికి, స్త్రీ పురుషులుచేరి కులికే నాట్యాలను ఏర్పాటుచేయడం - ఇవన్నీ వ్యయప్రవాహానికి గండితీసినట్లైనాయి. వచ్చిన తెల్ల దొరల్లో కొందరేమో నిజానికి పెద్దమనిషితరహా గలవాళ్లే. అయితే మరికొందరివిషయంలో అల్లా భావించడానికి వీల్లేదు. వాళ్ళల్లోనూ కొందరుస్త్రీలు, రాజు చాపల్యాన్నిగుర్తించి, ఆయనతో సరసాలాడి ఆయనదగ్గిరనుంచి ఉంగరం, చెవిపోగులు, ముత్యాలహారం, మొదలైన నగలను ఉచితంగా కాజేసినవాళ్ళే !

రాజు దుబారాఖర్చుకు డబ్బు చాలకపోవడానికి మరోకారణంకూడా ప్రస్తుతం తోడైంది. దొడ్డ వీరరాజు తన కూతురిపేర కుంపిణీవారియొద్ద సుమారు ఏడులక్షలరూపాయలను నిధిగా పెట్టిఉంచాడు. దేవమ్మాజిని గద్దెనుండిదింపిన లింగరాజు ఈ నిధిజోలికి పోలేదు. చిక్క వీరరాజు కొద్దిరోజులుమాత్రం మెదలకుండావుండి దానిపైవచ్చిన వడ్డీని తాను వాడుకోవడం ప్రారంభించాడు. దేవమ్మాజి అడ్డంతిరిగేస్థితిలో లేదు. అయినా అడ్డు పెట్టింది. ఒకటి రెండేళ్లలోపల మహమ్మారిరోగంతో చనిపోయింది. ఆమెను రాజే చంపించాడని ప్రజల నమ్మకం. దాంతో నిధిమీద వడ్డీ నిరాటంకంగా రాజుకే వచ్చింది. రెండేండ్లు దాన్ని వాడు కొన్నాడు. మూడోఏట, కుంపిణీ అధికారులు ఏదో సాకుచెప్పి రాజుకు ఆ నిధిమీద ఏవిధమైన అధికారంగాని లేదని వడ్డీ ఇవ్వడం మానేశారు. రాజు 'దొడ్డరాజు కూతురిడబ్బు, ఎవరికీ రాదుగాని, దారినపోయే దానయ్యలు మీకు చేరుతుందా ?' అని వాదించాడు. రోదించాడు, దుమ్మెత్తిపోశాడు. బతిమాలాడు. కుంపిణీవారు ఉలకలేదు, పలకలేదు ; కదలలేదు మెదలలేదు ; పీ అధికారాన్ని కోర్టులో స్థిరపఱచుకో, అప్పుడు నిధి నీదని ఒప్పుకుంటాం అన్నారు. కోర్టు కుంపిణీవారిదే. వ్యాజ్యెం ఆడాలనే ఆలోచనలో చాలరోజులు గడచిపోయాయి. ఈమధ్యలో నిధిమీదవడ్డీ కుంపిణీవారి లెఖ్ఖల్లోనే నిలిచిపోయింది. రాజుచేతికి చిక్కుతూవున్న ధనరాశి చిక్కిపోయింది.

చిక్కణ్ణశెట్టి చాలాసార్లు రాజుకోరికప్రకారం డబ్బు పంపించిచూశాడు. అది తిరిగి వెనక్కు ఓ పద్ధతిప్రకారం తనకు అందడంలేదు. అందుచేత బసవన్న తిరిగి డబ్బు అడిగినప్పుడు నిర్మోహమాటంగా 'ఇదెల్లా బసవన్నా ! డబ్బు ఎక్కడనుంచి ఇచ్చేది ? నాది అనే డబ్బు అంతా ఒక్కపైసాఅన్నా మిగుల్చోకోకుండా ప్రభువులచేతికి అప్పగించాను. ఇహ ఇప్పుడేం చేయగలను ?' అని చెప్పాడు.

బసవన్న : ఇది మీ మాట. నేను చెప్పేది ఏముంది !'

చిక్కణ్ణశెట్టి :-'దొరలతో నా విన్నపముగా చెప్పు. వారివన్నిధికివచ్చి మాటాడుతాను. ఏంచెయ్యాలో విచారించివచ్చి ఆరీతిగా నడచుకొంటాను.'

రాజుకు కోపం వచ్చింది. శెట్టిని రమ్మనమని కబురు పెట్టలేదు.

చిక్కణ్ణశెట్టికి కొంచెం ఆలోచన తట్టింది. రాజగృహంలో గురుగృహంతో జగడ లేకుండా నడచుకోవాలనేది తన కుటుంబాచారం. దాన్ని తాను త్రోసిపుచ్చడం అవుతున్నదే అని కటకటపడ్డాడు. బోపణ్ణవద్దకు కబురుపెట్టాడు.

బోపణ్ణ:-'రాజభవనానికి వాడుకగా పంపిస్తూవున్న ధనాన్ని కోశంనుంచి పంపిస్తూవచ్చాం. నేను డబ్బుపంపడం మానేసినకారణంగా మీనుండి డబ్బు రాబట్టుతున్నారు. మా ధనం అంతా ఖర్చు అయిపోయినమీదట కావలసినదాన్ని మీనుండి తెప్పించుకుంటున్నారు. మీరు ఈడబ్బు తిరిగి రాజభవనంనుంచే వసూలుచేయాల్సి వుంటుంది,' అన్నాడు.

శెట్టిపేటలోని పెద్దలైన పార్శణ్ణ, రామప్ప, సూరప్పలనుపిలిపించి 'ఈతడవకు ఎల్లాగైనా డబ్బు చేకూర్చండి. మరోసారికి మావల్లకాదు అందాం. ఏమంటారు?' అని అడిగాడు.

వాళ్ళందరు తెలివితేటలు కలవాళ్ళు. మడకేరిలోవుంటూ హాసనసీమలో వ్యాపారంచేసి ధనం సంపాదించినవాళ్ళు. తరతరాలుగా మడకేరిలో పెరిగి వేరూనినిల్చిన గడసరులు. రాజుతో జగడం సాధ్యమా? ఎమైనాకానీ పేట అధికారిమాటను కాదనడం ఎట్లా? కానివ్వు,' అన్నారు. ధనం సమకూర్చారు. చిక్కణ్ణశెట్టి పైకం రాజభవనానికి పంపించివేసి అప్పటికి ఆ తొందరనుండి విముక్తుడయ్యాడు.

# 21

అతనిగ్రహచారం బాగాలేదు. రాజభవనంతో అతనిసంబంధం కేవలం నామామ పంపించడం, డబ్బు కూడబెట్టిఇవ్వడం దీంతో ఆగలేదు. ఈసంవత్సరం అతనిప్రాణానికి మరో సంకటం వచ్చిపడింది.

శెట్టికుటుంబం చాలా పెద్దది. చచ్చిపోయిన ఒక అన్నకొడుకు రామశెట్టిమాట లోగడనే చెప్పుకొన్నాం. కుటుంబంఅంతా ఉమ్మడిగా ఒకేఇంటిలో కాపురం చేస్తూవున్నారు. ఒక చెల్లెలికూతుర్ని ఇచ్చి ఈ అన్నకొడుక్కి శెట్టి పెళ్ళిచేశాడు. ఈసారి తలకావేరికి తీర్థస్నానానికి పోయినప్పుడు ఆపిల్ల శెట్టికుటుంబంతోపాటు అక్కడికి వెళ్ళింది.

రాజు ఆమెను అక్కడచూశాడు. పిల్ల పదిహేనుసంవత్సరాలది. బంగారుపోతపోసిన బొమ్మలా వుంది. రాజుకు ఆమెపై మక్కువకలిగింది. ఆమె ఎవరు ఏమిటి అనే కుశల ప్రశ్నలన్నింటినీ విచారించాల్సిందని అతడు బసవన్నకు చెప్పాడు. బసవన్న ఇటువంటి విషయాలలో ముందే కనుగలిగి నడచుకొనేమనిషి. అతడు ఆపిల్లను రాజుకంటె ముందే

చూశారు. ఆమె రాజుకంట బడకుండావుంటే బాగుండునవికూడ అనుకొన్నారు. శెట్టికి ఏదో ఉపాయం చెప్పాలి అని అనుకుంటూవుండేతరుణంలో, గ్రహచారమా అన్నట్లు రాజు ఆమెను చూడనేచూశాడు.

రాజు ఈమాట ఎత్తగానే బసవన్న ఆయనతో 'విచారిస్తాను సంగతి సమాచారాలన్నీ. నాలుగురోజులు ఓపికపట్టడం మంచిది,' అన్నాడు.

రాజు:-'మంచిచెడ్డల వ్యవహారం నీ కెందుకు? చెప్పినసంగతి చెయ్యి. పెచ్చు మాటాడకు' అని మందలించాడు.

'ఆమె సాహుంకారు కోడలు. అతనిదగ్గిర బాకీ మిగిలిపోయి అసలే విసగటగా ఉన్నాడు. ఈమాటకూడ ఎత్తితే చాలా కష్టపడతాడు,' అని బసవన్న.

'రాజభవనంలోకి రాణీగారికై వారానికై పిల్లను పంపు అని చెప్పితే ఏమిటి తప్పు?'

'దొరా! కైవారం మైవారం అని ఏం చెప్పినా వాళ్ళకొక్కటే. దొరలు ఈ ఆభరణాన్ని వాంఛిస్తున్నారని వాళ్ళకు తెలిసేపోతుంది. శెట్టి ఒప్పినా పిల్లవాడు ఒప్పుకోడు. పిల్లవాడొప్పుకొన్నా తల్లి ఇష్టపడదు. రచ్చ, రభస అవుతుంది.'

'డబ్బు అడిగితే శెట్టి మూ డాబులు పోయాడు. తన సాహుంకారుతనాన్ని మనమీద చూపాడు. అప్పుడు వాంఛికాలు పోయినందుకు ఇప్పుడు శిక్ష అనుభవించనీ. ఈమాట చెప్పు. మొహం చిన్నపుచ్చు. బసవన్నహోదా దొరకు బుద్ధిచెప్పి హెచ్చరిక చేసేటంతటిది కాదు.'

'చిత్తం ప్రభూ!' అని బసవన శెట్టిదగ్గిరకు చక్కాపోయాడు.

శెట్టి వీడు తిరిగి డబ్బుకు ప్రాణాలుతీయడానికి వస్తున్నాడే అని వేసటపడ్డాడు. ఈసారి ఎలా గట్టెక్కడం అని ఆలోచించడం సాగించాడు. లోపలివివారాన్ని మింగేసి దాంతో ఓవిధంగా గొంతు జీరపోతూవుంటే ఒక విచిత్రమైన కంఠస్వరంతో 'రా బసవయ్యా! దొరలు ఆరోగ్యంగా వున్నారా?' అని కుశలప్రశ్న చేశాడు.

బసవయ్య: 'ఆరోగ్యంగానే వున్నారు. కాని నేను ఇప్పుడు దొరలదగ్గిరనుండి రాలేదు. రాణియమ్మ పంపించారు. వచ్చాను.'

'రాణియమ్మగారే? ఏమి వారి ఆజ్ఞ?'

'మీ ఇంటికోడలు రాజభవనానికి నాల్గురోజులువచ్చి ప్రభువుగారికుమార్తెతో స్నేహంగా కూడి ఆడనీ అని కోరుతున్నారు.'

శెట్టికి గుండె జల్లుమంది. ఈమాటకు పూర్తి అర్థమేమిటో అతనికి బోధపడింది. రాజూ, అతని ఈ దుర్మంత్రి ఊరిలోని ఏ పిల్లపట్లనైనా దుష్టంగా అడ్డగాడిదలా ప్రవర్తిస్తారనేది ఊరికందరికీ తెలిసినవిషయమే. శెట్టికీ తెలుసు. కాని లోగడ రాజు భవనంతో మైత్రి, లావాదేవీలు, ఉన్న గొప్పకుటుంబాలని, బెణకలేదు. శెట్టి కుటుంబం ఇటువంటి గౌరవ ప్రతిష్ఠలతోకూడిన కుటుంబాలలో ఒకటి. ఆ పెద్దతనము, ఆ మర్యాద ఇప్పుడు తన్ను

రక్షించవలోవడంలేదని శెట్టి గ్రహించాడు. ఈ ఆపద తనను కూడ వెంటాడేదే అని అతనికి సూచనప్రాయంగా తెలియనే తెలుసు. భయం, ఆశ్చర్యం కప్పిపుచ్చుతూ అతడు వెంటనే 'అయ్యో! మంచిపనే! అట్లాగే దానికేం? నేనువచ్చి మాటాడుతాలే,' అన్నాడు.

బసవ: 'రేపు పంపిస్తారు అనేదా!'

శెట్టి:-'ఎందుకు అట్లా వద్దు. వచ్చి తెలుపుతానుగా.'

బసవన్న వెళ్లిపోయాడు. శెట్టి వెంటనే భార్యనుపిలిచి కుమారుడు కోడలు తక్షణం అరకలగూడుగ్రామానికి వెళ్లిపోవాలి అని తెలిపాడు. రెండుగడియలు కాకముందే దంపతులు, ఇరువురు సేవకులు, చిన్న పొట్టి గుర్రాలనెక్కి మడకేరి విడిచిపెట్టి వెడలిపోయారు.

# 22

ఆ సాయంకాలం, చిక్కణ్ణశెట్టి రాజభవనానికి పంపవలసివున్న కొంచెం సామానును తీసికొని రాణి గౌరమ్మాజీని చూడటానికని పోయారు. రాణిగారితోడ మాటాడవలసినప్రమేయముందని చెప్పంపాడు.

రాణి అతన్ని రప్పించుకొని కూచోమనిచెప్పి 'ఏమిటి సంగతి శెట్టిగారూ!' అని అడిగింది.

'కొద్దిరోజుల్లో బెంగుళూరులోని తెల్లదొరలకు విందుభోజనం జరిపించవలసివుంటుందని విన్నాను. దానికి కావాలిసిన సామాను అంతా ఎరుగుదును. అయితే తెల్లదొరల విందుకు కావలసినసామాను బైటినుండి తెప్పించాల్సివుంటుంది. కొంచెం ముందుగాతెలిపితే తెప్పించడానికి అనుకూలంగావుంటుందని వేడుకొందామని వచ్చాను.'

శెట్టి వచ్చింది పై ఉద్దేశంతోకాదు. అతని మాటలధోరణినిబట్టి రాణికి తెలిసిపోయింది. అభిప్రాయం తిన్నగా చెప్పివేయడం మర్యాదకాదని ఆశ్రితులైనవారి ఉద్దేశం. ఒకపనిమీద వచ్చినవాళ్లు ఏవో వేరేమాటలు నాల్గు మాటలాడి మధ్యలోనో లేక చివరికో లోకాభిరామాయణం మధ్యలో ప్రకారాంతరంగా తమకోరికను వెల్లడించడం అలవాటు. రాణి 'అట్లాగే. బసవన్నకు కబురుపెట్టనా?' అంది.

'చిత్తం అమ్మగారు! మరి తమసేవకుగా మీ కుటుంబంలోని ఆడపిల్లలు ఎవరైనా రావాలి అని ఆజ్ఞాపించారుట గదా! ఏంపని! ఎవరిని పంపమంటారు? ఆ విషయంకూడా అడుగవచ్చుగదా అని వచ్చాను.'

రాణి ఆ మాటలలోని అర్థం గ్రహించింది. రాజభవనానికి అగౌరవమైన ప్రసంగం. తన మనస్సులోని బింకం విడిచిపెట్టి భర్తయొక్క మర్యాదను దక్కించుకోడానికిగా తాను ఈ అకృత్యాన్ని నివారించాలి.

'చిన్నమ్మతో ఆడుకోటానికి పిల్లలు ఎవరైనా కావాలి అన్నాం. ఆమాట మీకు చెప్పి వుండవచ్చు. తిరిగి చెప్పంపుతాం. అంతవరకూ, ఎవరినీ పంపవలసిన తొందరలేదు.'

'చిత్తం. అమ్మాణీ!'

ఈవిధంగా తాను తెచ్చిన సామానువిషయం చెప్పడానికనే నెపంతో చెప్పవలసిందిచెప్పి శెట్టి లేచి నమస్కరించి చక్కా వెళ్లాడు.

మరుసటిరోజు ఎవరినీ పంపకుండావుండటంతో బసవన్న అతని ఇంటికివెళ్ళాడు. శెట్టి క్రితంరోజుమాట ఏమీ జ్ఞాపకంలేనట్లుగానటించి విందుసంగతి ఎత్తాడు. బసవన్న అతని మాటకు జవాబుఇచ్చి 'కోడలిని ఎప్పుడు పంపుతున్నారు?' అని ప్రశ్నించాడు

'ఊరినుంచి రాగానే' అని జవాబు.

'ఏ ఊరినుంచి? నిన్న ఇక్కడే వున్నారుగా?'

'ఇంటిలో ఏ ఆడపిల్లలున్నారు, ఎవరులేరు అని ఎవరికివడితే వారికి చెప్పడాని కౌతుందా బసవయ్యా? రాణియమ్మగారు పంపించు అన్నారు. నేను పంపిస్తా. ఎప్పుడంటావా? ఊరి నుంచి వచ్చినమీదట అని చెబుతున్నాగా. ఈవిషయం వారికి చెప్పు

'అట్లా అయితే నేను మాట విప్పిచెప్పనా?' ఆడపిల్లను రాజకుటుంబంలో వుండని అని ఆజ్ఞ ఇచ్చినవారు దొరవారు.'

'అట్లనా! అయితే మరీ శిరసావహించాల్సినమాట. పంపుతామని చెప్పు.'

'ఈ చెప్పింది రాణిగారుకాదని నువ్వు గట్టిచేసికో శెట్టి! ఈవిషయం రాణిగారితో తీసు కొని రాకు.'

'అయ్యా! బసవయ్యా! ఇది నీవు చెప్పలేదేం మరి? నేను అమ్మగారితో ఈసంగతి చెప్పేవున్నా.'

'అట్లాఅయితే ఇది రాజాగారి ఆజ్ఞ అని నీకు తెలియనేలేదంటావా?'

'బసవయ్యా! మాకు కొన్నివిషయాలు తెలుస్తాయి. కొన్ని తెలియవు. ఈ సంగతులు నాకు తెలుసు, ఈ సంగతులు నాకు తెలియవు అని చెప్పుకుంటూపోతే వింటానికి నీకు పొద్దేది? నీకూ ఏదో పనివుంటుంది. రాజసేవచేసే మీబోటివాళ్లకు ఒళ్ళు గోకుకోడానికైనా తీరిక వుండదు. రాజుగారిఆజ్ఞ ఎప్పుడూ శిరసావహిస్తాం, దాన్ని నెరవేర్చేబాధ్యత మాది.'

శెట్టి పిల్లను పంపించలేదు అని రాజు బసవన్నమీద మండిపడ్డాడు. 'నీవేమి మంత్రి వంటావు బసవయ్యా! నీ మంత్రిత్వమే కుంటిదై పోయింది' అన్నాడు. శెట్టి ఈవిధంగా ప్రవర్తించడం బసవన్నకూ ఆశ్చర్యంవేసింది. అతడు 'ఇతని గుండెధైర్యం ఏమి చెప్మా!

దొరమాటను చెల్లించకుండా మడకేరిపేటలోమాట అట్లావుండనీ, కొడగులో ఎక్కడా ఏమూలా బ్రతుకటం సాధ్యంకాదు. ఇది శెట్టికితెలుసు. అయినా మాటప్రకారం నడుచుకో లేదు. శెట్టి గట్టిపిండం! సందేహంలేదు' అనుకొన్నాడు.

వెంటనే బసవన్నకు వేరే ఆలోచన పోయింది. స్వల్పాలకు ఎదురుతిరగని ఈ మనిషి ఎదురుతిరిగాడంటే విజానికి ఇది తమ దౌష్ట్యానికి పరాకాష్ఠ అని అర్థం. ఓర్పుగలవాడు సహించినంతదూరం సహించి ఇహ మనవల్లకాదు అనుకొన్నప్పుడు ఈవిధంగా ఎదురు తిరుగుతాడు. ఇటువంటప్పుడు కొంచెం తాల్మి వహించడం మంచిది. లేకపోతే స్పష్టంగా బైటపడి దెబ్బలాడటానికి సిద్ధంకావాలి! అయేదేదో కానియ్యి చూతాం అని ముందుకు సాగి పోవాలి.

ప్రభువు ఇంతకు అయేదేదో అవనీ అనే అంటాడో ప్రస్తుతానికి కొంచెం ఓపికపట్టుదాం అనే అంటాడో బసవన్నకు స్పష్టంగా ఊహించడం కష్టంగా వుంది. ఈవిషయమంతా చెప్పితే అతడు భగ్గున మండిపడతాడు అని అనుకుంటూ రాజభవనానికి మళ్లాడు.

# 23

బసవన్న వచ్చి శెట్టిచెప్పినమాటలన్నీ నివేదిక చదివినట్లు వీరరాజుకు అప్పజెప్పాడు. వీరరాజు అగ్గిబుగ్గి అయిపోయాడు. అతడు అరిచి బొబ్బరించాడు. 'చూడు గాడిద! రాజభవనానికి నేవకై కావలసినపిల్ల ఊరిలో వుందో లేదో తెలుసుకొనేయోగ్యతైనా నీకు లేదా?' అని గద్దించాడు.

'ఉంది ప్రభూ! శెట్టి కోడలిని వేరేచోటికి పంపించివుంటాడు. నేను అడగ్గానే తరజఇద లాడి ఎక్కడికో పంపించేసివుంటాడు.'

'ఆ గూబమొహం అంతే అనుకో. నువ్వెందుకు వదిలేశావు దేబెలాగ?'

'దేబెనే ప్రభూ! అయితే వాడు అల్లా చేస్తాడని ఊహించుకోలేక పొయ్యాను.'

'అట్లనా? మరి నీ మంత్రిదనం నువ్వూ మంటకల్పనా? పందినితెచ్చి ఏనుగంటే మూతి చూసి తొండం కాదన్నట్లు వుంది. మంత్రి అయితేమాత్రం బుద్ధి పెరుగుతుందా? రాజభవనం తిండి తినితిని నీబుద్ధి మొద్దువారిపోయింది.'

'అవును దొరా! శెట్టి ఇంటికూడే బుద్ధికి తెలివితెస్తుంది?

'అరే కుంటీ! నేను తిట్టితే నీవూ తిట్టుకొని నా స్థానంలో వున్నానని అనుకోకు. పని పాడు చేశావు. సరిదిద్దుతాను చూడు.'

'చూస్తూనేవున్నా ప్రభూ!'

'ఈ శెట్టి బాగా పెచ్చుపెరిగిపోయాడు. రేపు అతన్ని రమ్మనమని చెప్పు. అతనికి రెండుమాటలు చెప్పుదాం.'

'అందుకు రెండురోజులు ఓపిక పట్టాలి దొరా! రేపే కావాలి అంటే పని చెడిపోతుంది.'

'చెప్పింది చేయి. బదులు మాటాడకు. నీబుద్ధి స్థూలమనీ, మందమనీ తెలిసిపోయింది. పిల్ల ఇంతలో జారుకొన్నది. ముసలాడుకూడ జారుకొంటాడు జాగ్రత్త!'

'చిత్తం దొరా!'

బసవన్న అప్పుడే శెట్టికి కబురుపెట్టాడు. 'పరంగులకు (తెల్లదొరలకు) విందు నడిపించడానికి దొరగారు నిన్నుచూసి మాటాడాలిట - తప్పక రేపు రావాలి.' అని రాజసేవకుడు చెప్పినప్పుడు శెట్టి తన కోడలివిషయం పైకి పొక్కివుంటుందని తెలుసుకొన్నాడు. ఇహ రాజభవనంతో ఉపాయంగా నడుచుకోడం సాధ్యమయ్యేవిషయం కాదు. ఏమైనాసరే! తెగేసి మాటాడాలి లేదా సంగతిని సరిదిద్దుకోవాలి. అదీ సాధ్యంకాకపోతే మడకేరినుండి వెల్లగించుకొని వెళ్లిపోవాలి' అని అతడు తనలో తాను నిశ్చయం చేసికొన్నాడు.

# 24

శెట్టి ఊరువదలి ఎటైనా పోతాడేమోనని బసవన్న అతనికి తెలియకుండా అతని ఇంటి చుట్టూ జనాన్ని నిలిపాడు. ఈ జాగ్రత్తలు అనవసరమైనాయి. శెట్టి తప్పించుకొని పారిపోదామనే ఆలోచనచేయలేదు. ఆ రాత్రి పాపణ్ణ, రామప్ప, సూరప్పలతో రహస్యంగా మాటలాడి ముంచుకువస్తున్న ముప్పునుగూర్చి చెప్పాడు. తన పెండ్లానికికూడ సంగతి సందర్భాలన్నీ తేటతెల్లంగా చెప్పాడు. ఇలువేల్పును ఎదురుగానిలబడి 'నీవు సరిగా నడిపి మమ్మల్ని కాపాడుతండ్రీ!' అని ప్రార్థించాడు. మరుసటిదినం ఉదయమే రాజు సన్నిధానానికి వెళ్లాడు.

రాజు వాడుకప్రకారం తాగి మత్తులో కొంచెం మునిగిపోయినట్లుగా కూచునివున్నాడు. శెట్టివచ్చి చేతులుజోడించి నమస్కరించాడు. 'అడ్డం వచ్చా దొరా!' అన్నప్పుడు చేతులు ప్రతిగా జోడించకుండానే 'కూచో శెట్టీ!' అన్నాడు.

'చిత్తం ప్రభూ! పరంగుల విందుకు ఏమో తెప్పించవలసివుంటుందని ఆజ్ఞ అయిందిట. ఏమి తెప్పించాల్సివుంటుందో తెలుసుకోవాలని వచ్చా.'

'ఏం శెట్టీ! నువ్వు మాపై కోమటియుక్తి ప్రయోగిస్తున్నావే! మేం ఎందుకు కబురు పెట్టింది తెలియదా నీకు!'

'తెలిస్తే తెలియవచ్చు ప్రభూ! అయినా చెప్పకూడదు. గొప్పవారిమనస్సులో మాట గొప్పవారే చెప్పితే బాగుంటుంది. మిగిలినవాళ్లు చెప్పితే బాగుండదు.'

'మరి నీ కోడలుపిల్ల ఎక్కడ?'

'అరకలగూడుకు పోయివుంది ప్రభూ!'

'ఎప్పుడు పోయింది!'

'మొన్న.'

'మేము ఇక్కడకు పంపించు అని చెప్పింతర్వాతనే!'

'ఔను.'

'నీకు ఎంతటిధైర్యం! మేం పంపించు అని చెప్పినమీదట ఆమెను మారంగా పంపించి వేయడానికి.'

'పంపించివేయడం దేనికి దొరా! రాజభవనంలోకి అడుగు పెట్టింతరువాత ఎన్నాళ్లు ఉండాల్సివస్తుందో ఏమో! ఓసారి బంధువుల్ని అందర్ని చూచివస్తానంది. సరే! చూసి రావమ్మా అని నేనూ చెప్పాను.'

'నీ కల్లబొల్లి మాటలు నాకు తెలియవనుకుంటున్నావా శెట్టీ!'

'ప్రభువులకు తెలియనిమాట ఏమిటుంటుంది? అమ్మే ధాన్యంలో నూరుపాళ్లు గట్టి రెండుపాళ్ళు పొల్లు వుండటం సహజం. మాటాడేమాటా అంతే. రెండువంతులు అబద్ధా లుంటాయి. కొన్నేప్రభువులు అందుకు ఒప్పుకోవాలిసి వుంటుంది.'

'అల్లా అయితే నీ కోడలుపిల్లని పిలిపిస్తానంటావా?'

'తప్పేమిప్రభూ! ప్రభువులకన్య చిన్నమ్మాజి ఒక్కరేగదా రాజభవనంలో వుంది. ఆమె అక్క ఒక్కతెవస్తే మీ అమ్మాయిగా వుంటుంది. చిన్నమ్మాజి భవనంలో వుండటం లేదా? ఆమెనేమి చేసిపోతారో అని మా కేమన్నా భయమా? చిన్నమ్మాజి అక్కనుకూడ ఇక్కడే వుంచుతాం. అట్లాగే ధైర్యంగా వుంటాం.'

'ఈమాట నిజమేనా?'

'ఈమాట నిజమైతే నేను శెట్టిని. మీరు ప్రభువులు. నిజం కాకుండాపోతే నేను శెట్టినీ కాదు. మీరు మాకు ప్రభువులూ గారు.'

'ఆ! మేం ప్రభువులం కామా!'

'అది కాదు ప్రభూ! రాజభవనానికివచ్చిన పడుచుపిల్ల రాజకుమార్తెవలెనే పెరిగే అవ కాశంవుంటే ఆ వూరు నిజంగా వూరు; ఆ రాజభవనం నిజంగా రాజభవనం ఆవూరుశెట్టి శెట్టి అనిపించుకుంటాడు. ఆ ప్రభువు ఆనాడు నిజమైన ప్రభువు. అట్లా కాకపోతే ఇవి ఏవీ నిజం కావు.'

'చాలా గడుసుగా మాటాడుతున్నావు శెట్టీ! మాతో ఈవిధంగా తలపడి వర్తకపేట శెట్టి అయినవాడు బ్రదుకగలడంటావా?'

'తల్లిచేతిబిడ్డ ప్రభూ! రొమ్ముకాన్పి పాలు తాగిస్తే పాల్లుతాగి పెరుగుతుంది. గొంతు విరిచి కిందపారేస్తే కేకైనా పెట్టకుండా చచ్చిపోతుంది. ఎట్టైనా రాజప్రాసాదం నీడలో బతికి బట్టగట్టినట్టౌతుంది. ఇప్పుడు రాజప్రాసాదం నీడ ప్రసాదించడంలేదు. వెచ్చని వేడిగాడ్పులు విసురుతోంది. దాని ఆశ్రయంలో నిలిచినవాళ్లు మలమలా మాడిపోవడమే.'

'సరే అల్లాగయితే మాడిపోవడానికి సిద్ధపడు.'

'చిత్తం దొరా! అల్లాగే సిద్ధపడతాను. మిగతాజనానికీ సిద్ధపడమని చెప్తాను.'

'అంటే మా మీదికి ప్రజల్ని రెచ్చగొడదామనా?'

'నేను రెచ్చగొట్టడ మేపాటిది దొరా! మీరే దానికి తగ్గఏర్పాట్లు చేస్తూవచ్చారు. నాచేత ఇంత మాటాడించినవాళ్లు మీరు ఎవరిని మరి బ్రదుకనిచ్చేది? నేనెటువంటివాడిని అంటే పదిమందిచచ్చినా నేనొక్కడినీ బ్రతికితే చాలుననుకొనేవాణ్ణి. నాది అనేది పెంచుకొని నూరుగురు ఏమైపోయినా పట్టించుకోనివాణ్ణి. 'తలనొప్పి నీదాకావస్తేగాని నీకు తెలియదు శెట్టీ!' అంటూవుండేవారు దొరలు! అట్లాంటిది ఇప్పుడు నా ఇంటికే చిచ్చుపెట్టినట్లైంది. నీటముంచినా పాలముంచినా నేను మీవాడినే. కానున్నది కాకమానదు. కానున్నది కాకమానదు. నొసట ఎది వ్రాసివుంటే దాన్ని అనుభవిస్తా.'

బసవన్న దొరదగ్గరకువచ్చి 'శెట్టిని తిరిగి పమ్మెయమనండి. ఇప్పుడు వాంలకు వృధా శ్రమ' అన్నాడు.

వీరరాజుకూ, ఇంతవరకు మాటాడింది చాలు అనిపించింది. శెట్టివంటి మెత్తనిమనిషి ఎదిరించడంచూసి ధైర్యం సడలివుండొచ్చు. బసవన్న ఇట్లా చెప్పేటప్పటికి అతని కిది బాగానే వుందనిపించింది. 'అట్లాగే కానియ్యి' అన్నాడు. తన ఎడంచేతిమీద తలవాల్చి మెదలకుండా కూచుండిపోయాడు.

బసవన్న శెట్టికి బైలుదేరిపో అని సైగచేశాడు. శెట్టి లేచి దొరకు చేతులుజోడించి వాకిలిదగ్గరకు వెడలిపోయాడు. దొర అతనివైపు మొగానుకూడా చూడలేదు.

## 25

దొరతో ఇదంతా మాటలాడేటప్పటికి శెట్టి ఇంకా తాను వీరిరాజ్యంలో బ్రదుకవచ్చు అనే ఆశకు నీళ్లు వదిలేడు అని వేరే చెప్పనక్కర్లేదు. ఇచ్చినడబ్బు వెనక్కు వచ్చేదిలేదు. వచ్చేసూచనకూడ లేదు. తిరిగి డబ్బు పెట్టుబడిపెట్టండే సామాను పంపండే పరస్పరం సంబంధం వుండేదిలేదు. కష్ట నిష్ఠురాలకోర్చి అట్లా చేద్దామనిఅనుకున్నా తన మర్యాదైవా

తొలదగ్గిర నిల్చేటట్లు ఏమీలేదు. ఇహామీదట ఈ రాజభవనం సాహంకారితో ఒరిగి వచ్చి పడేదేమిటి?

చిక్కణ్ణశెట్టి ముత్తాత అరవై సంవత్సరాలక్రిందట మడకేరికి అరకలగూడునుండి వచ్చి చేరాడు. అప్పట్లో మైసూరు సురక్షితమైనస్థానంగాలేదు. మడకేరి భద్రమైనచోటు అనిపిం చింది. తెలివైన ఆ ముత్తాత జనంతో చక్కగా మెసలుకొని చుట్టుప్రక్కల మోతుబరి అని పించుకొన్నాడు. వినయంగా బ్రతికి రాజమహలుకు దారితీసినవా డయ్యాడు. కుమారినిచేతికి కొంచెం ఆస్తి గొప్పవరపతి ఇచ్చిపోయాడు. కొడుకు పిల్లవాడు తండ్రిదారిలోపెరిగి లింగ రాజు సమయానికి పేటకు పెద్దమనిషి అయ్యాడు. వ్యవహారమంతా అతనికొడుకుచేతిలో వుండేది. వీరరాజు రాజయ్యేటప్పటికి ఆ తండ్రి, కుమారులు ఇద్దరు తీరిపోయి చిక్కణ్ణశెట్టి అతనిఅన్న పేటకు పెద్దలయ్యారు. నేటికి ఆ అన్నకూడా గతించి ఇంటిపెత్తనం వహించే బాధ్యత చిక్కణ్ణశెట్టి భుజస్కంధాలమీద వచ్చిపడింది.

శెట్టికుటుంబం మడకేరిలో పెరిగిపెద్దదైనా అరకలగూడుతో సంబంధం తెగిపోలేదు. వ్యాపారం పనిమీదనేకాకుండా, ఇచ్చి పుచ్చుకోటాలు, రాకపోకలు మొదలైన చుట్టరికాల మూలంగాకూడా ఈ కుటుంబానికి అరకలగూడు ఇంకొక స్వంతఊరులాగానే అయింది. తాను ఎప్పుడైనా, ఎందుకైనా, మడకేరిని వదలిపెట్టివేయవలసినపరిస్థితి ఏర్పడుతుందని శెట్టికి ఇంతకుపూర్వం మూడురోజులవరకూ అనిపించలేదు. కోడలినీ, పిల్లవానినీ అరకల గూడుకు పంపించివేసినరోజే తనకు మడకేరిని విడిచిపెట్టేసమయం దాపురించేదేమో అని అతనిమనస్సుకు అనిపించింది. ఈరోజు రాజుతో మాటకుమాట పెరిగిపోవడంతో ఆ సందేహం తిరిగి కలిగింది. చివరికి దృఢపడింది.

అయితే ఇట్లా అంతా మాటాడినమీదట రాజు ప్రాణాలతో విడిచిపెట్టాడా? రాజు మనస్సు ఎట్లావున్నా అతనిచెట్ట అంతా కరడుగట్టినమూర్తిలా అతనిప్రక్కనే నిలబడే కుంటి బసవన్న తన్ను విడిచిపెట్టుతాడా? మాట ముదిరేసావకాశమే కనబడుతోందిగానీ మధ్యలో నిలిచిపొయ్యేటట్లు లేదు. అక్కడి అల్లా మాటాడవలసివుంది. మాట్లాడటమయింది. భగ వంతుడు ఎట్లాపలికిస్తే అట్లా పలికాను. ఇహ ఫలితంనుంచి తప్పించుకోడం ఎట్లా. రోటిలో తలదూర్చి రోకటిపోటుకు వెరవడమా? ఇదే ప్రస్తుతం ఆలోచన అంతా. చిక్కులో దూర్చిన దేవుడే చిక్కు విప్పాలి.

ఈవిధంగా ఆలోచించి, తక్షణమే బోపణ్ణనుచూసి ఈసంగతి అంతాచెప్పి తన ముందు దారి నిశ్చయించుకోవాలి అని మనస్సులో అనుకొన్నాడు. ఇంటికడకు పోయినవాడు అట్లాగే ముందుకుసాగి ఒకటిరెండుచుట్లు తప్పించుకొని అడ్డదారిగా బోపణ్ణ ఇంటికిపోయాడు.

బోపణ్ణకూ శెట్టికీ మంచిపరిచితి. బోపణ్ణ ఆస్తిమంతుడు. అతని ధాన్యం వ్యాపారమంతా శెట్టి మూలకంగానే నడుస్తుంది. బోపణ్ణకు చాల బలగముంది. ఆ చుట్టపక్కాల వస్తువాహ

నాలకు సంబంధించిన వ్యవహారమంతా శెట్టిమూలకంగానే నడుస్తూవుంటుంది. శెట్టి, బోపణ్ణ ఇద్దరూ నిజాన్ని నమ్ముకొని కూచొన్నవాళ్లు. నిజమైనమార్గంలోనే పెరిగి అందులోనే చాలినంతసుఖాన్ని చవిగొన్నవాళ్లు. అందుచేత వాళ్లయిద్దరికీ పరస్పరం మిక్కిలి గౌరవం, మిక్కిలి ఆదరం.

శెట్టి వచ్చినసంగతి తెలుసుకొని బోపణ్ణ వాకిలిదగ్గరకు వచ్చాడు. అతన్ని ప్రేమగా పిలుచుకొని లోపలికిపోయి, దగ్గరకూర్చోపెట్టుకొని [1]'స్థళ క్తి' 'కరగుపడి' ఏది ఎక్కువైంది?' అని అడిగాడు. 'నా ధాన్యంలెక్కలో ఎంత విడిచిపెట్టాలో అడగటానికి వచ్చావని అతని హాస్యం.

'ఇల్లువిడచి నెత్తిమీద ముసుగువేసుకొని వెళ్లిపోయే రోజువచ్చింది. ఆపద్బంధువు దగ్గరకువెళ్లి మొరపెట్టుకుందాం. వారిరూపంలో దేవుడు నన్ను కాపాడుతారు అని ఇక్కడకు వచ్చిపడ్డాను.'

'అయ్యో! ఏమిసంగతి? రాజు ఏమైనా చేశాడా? లేక 'కుంటి' ఏమన్నా....?'

'రాజుగారే చేసింది. 'కుంటి' ఆయన పట్టుకొన్న నూరు కుటుంబాలకు అవమానం, అగౌరవం కలిగించారు. మొన్న నాకూ తలవంపులు తేవడానికి చూశారు. నేను దాన్ని ఒప్పుకోను అన్నాను. తనసువచ్చి కలుసుకోమన్నారు. ఓ గడియముందు వెళ్లాను. రా, పో అంటూ నన్ను ఓ కుక్కకంటె హీనంగా చూశారు. మడకేరిలో వుండటానికి ఇహ స్వస్తి అనిపించింది. ప్రాణాలతో బ్రతుకవిస్తాడో లేదో అని నేనూ నాలుగూపెట్టి చక్కావచ్చాను.'

'మీ కుటుంబమర్యాదను స్పృశించడం....అంటే?'

శెట్టికి ఏంమాట చెప్పడానికీ సంకోచం కలగలేదు. నడచినవృత్తాంతంఅంతా అతడు పూసగ్రుచ్చినట్లు సిగ్గువిడిచి చెప్పేశాడు. తామూ గడుసుగామాటాడినట్లు తెలియజేశాడు. 'నేను సరిగా నడచుకొన్నానో లేదో నాకే తెలియదు. సరిగా నడచుకొన్నానంటే సంతోషమే. లేకపోతే నాతప్పు కాపాడు. నన్నుగురించి నాకేమీ పట్టలేదు. ఉన్నా పోయినా అదేమీ గొప్పవిషయం కాదు. కుటుంబంలోని పిల్లలకు కీడు జరుగకూడదు. ఇల్లూ వాకిలీ విడిచి వేయవలసివస్తుందేమో! అయితే అంతలోపల నగలూ నాణ్యాలూ, చీరెలూ, సారెలూ, అయినా మిగిల్చికొని ఇంట్లోవాళ్ళని అరకలగూడుకుపోయే ఏర్పాటుచేస్తేనో! ఆలోచించి చెప్పు అన్నా!' అన్నాడు.

1. 'కరగుపడి' 'స్థలక్తి'.. ధాన్యం కొలతకు సంబంధించిన ప్రయోగవిశేషాలు.

# 26

చిక్కణ్ణశెట్టి కథవింటే బోవణ్ణకడుపు రగిలిపోయింది. దొరనుగురించి అతనికి మొదటి నుంచే అసంతృప్తి. అతడు దొరవడం నిజానికి బోవణ్ణకు ఇష్టంలేదు. కాని పన్నెండు సంవత్సరాలకింద లింగరాజు తాను చనిపోయేదినాలల్లో పెద్దలనందరినీచేర్చి కొడుకు రాజు కావడానికి చాలామందిని ఒప్పించాడు. అధికసంఖ్యాకులకు అడ్డు రాగూడదని బోవణ్ణ అప్పట్లో సమ్మతించాడు. రాజు తన దౌష్ట్యంలో పెరుగుతూవస్తున్నకొలదీ, అతన్ని ఎదిరించి బోవణ్ణ, తనకూ రాజుకు సరిపడదని నలుగురిచేతా అనిపించుకోవలసివచ్చింది. శెట్టి చెప్పిన కథ విన్నమీదట ఈరాజు ఇంక రాజుగావుండటం సరికాదు అనుకొన్నాడు.

ఒక్కక్షణంసేపు మెదలకుండావుండి, అతడు శెట్టికి 'నేను చెప్పేమాట ఓ క్షణమాగి చెప్తాను. నీకు ఎలాతోచితే అలా చెప్పు. తోచిందాన్ని చెప్పడానికి వెనుకాడవద్దు. నేను నా ప్రాణాలొడ్డియినాసరే మిమ్మల్ని అపాయానికి గురికానివ్వను. ఇదిగో చేతిలోచెయ్యి' అని చెయ్యి జాపాడు.

శెట్టి చేయిచాచి అతనిచేతిలో తనచేయివేశాడు.

'నేను ఇక్కడకు వచ్చే తొందరపాటులో ఏమనుకున్నానో అది కావాలంటే చెప్తాను. మీరు ధైర్యం చెప్పింతర్వాత నాకు సందేహందేనికి?' అన్నాడు.

'చెప్పు.'

'నేనేమో శెట్టిని. పేటలోనినలుగురు పెద్దమనుషులొద్ద డబ్బు తీసికొని రాజభవనం నేవను చెల్లించేవాడిని. పార్వణ్ణ, రామప్ప, సూరప్ప లక్షకుపైగా సొమ్ము ఇచ్చివున్నారు. రాజకుటుంబానికనేసంగతి వాళ్లకు తెలుసు. అయినా అది నానమ్మకంపై ఇచ్చినపైకం. దాన్ని వారికి నేను చెల్లించవలసివుంది. ఇంటికిపోతాను. వాళ్ళనుపిలిపించి వున్నసంగతి వున్నది వున్నట్టుగా వాళ్ళకుచెప్పి వున్నంతమట్టుకు వాళ్లకు ఇచ్చివేస్తాను. మిగిలింది పిమ్మట ఇచ్చి ఋణం తీర్చుకొంటాననిచెప్పి పంపిస్తాను. ఇంట్లోవాళ్లను అరకలగూడుకు పోయేటట్లు ఏర్పాటుచేస్తా. సద్యా ఇదీ నా ఆలోచన.'

'మీరు మరి?'

'నేనూ వెళ్లాలిసేవుంది. కాని రాజు ఓ పట్టాన వదలడు. నేను ఇక్కడే వుండాల్సి వస్తుంది. కానున్నదాన్ని అనుభవించాలి. చేసుకొన్నవారికి చేసుకొన్నంత.'

'మీమాట సరే శెట్టిగారు. మీ గతేమి? మీ కుటుంబంగతేమి? వర్తకపేటలోని మారార్ల జనంగతి ఏమి? యజమానులైనవాళ్లు వాళ్లకోదారి చెప్పక్కర్లేదా?'

'ఏం దారి బోపణ్ణగారూ : 'కంచెయే చేనుమేసిన కలదె దిక్కు' అన్నట్లుగావుంది. ఇహ బ్రతకడం ఎలా ?'

'చేను కంచెను పొమ్మనమని చెప్పాలి.'

'ఇంతోటిమాట మీ రనవచ్చు. నేను అనవచ్చా ?'

'అనలేదనుకోండి. మిగిలిందేవిటి ? శెట్టి, పిల్లలు, వర్తకపేట ఏమంటున్నారో అడిగి తెలుసుకోండి. ఈ రాజుండకూడదు అంటే ఆవిషయం తెలుపండి.'

'తెలిపి ?'

'పేట తన మనస్సులోనిమాట తెలిపితే రాజుగారు ఆలోచనలో పడవచ్చు. అప్పుడు పేటకు కోటిమేళ్ళు చేకూరుతాయి. ఇదేమీసాగకుండానే మీరంతా మూటాముల్లు కట్టుకొని అరకలగూడుకు పోవడం నాకు ఇష్టంకాదు. 'పాము ఇంట్లో దూరిందని ఇల్లు పాడుపెడతామా ?' ఇంట్లో ఎలుకలని ఉన్న ఇంటికి చిచ్చుపెట్టి వేరేఇళ్ళు వెదకుతామా ? ఏదో మంత్రం పెట్టి పామును వెళ్లగొట్టాలి. లేదా వేరే ఏదైనా ఉపాయంచూడాలి. పామును తరిమెయ్యాలి లేదా చంపించెయ్యాలి. అంతేగాని భయపడి మనమే పారిపోతే ? మీకు అరకలగూడు ఉంది. మా కేవూరువుంది పోటానికి శెట్టిగారూ ?'

'మిమ్మల్ని బెణకడానికి ఎవరికి ధైర్యం వుంది. నాకు చెప్పినమాట మీకు చెప్పారా రాజుగారు ?'

'గుండెలదాకా పాకినసంజు గొంతుకుమాత్రం పాకదా శెట్టిగారు : గొంతుదాకా వచ్చింది నెత్తికిమాత్రం పాకదా ? వంటిమీద స్పృహ అంటూవుంటే వీరిపిల్ల, వారిపిల్ల అనే యుక్తాయుక్తజ్ఞానం వుంటుంది. మైకంకప్పి ప్రవర్తించేటప్పుడు కన్నతల్లికీ, వేశ్యకూ తేడాలేదు. మతి తప్పిన మహారాజుకు మంత్రి ఏవిటి శెట్టి ఏవిటి? ఇవ్వాళ మీవంతు. రేపు మా వంతు. మేము ఊరు విడిచేదిలేదు. మడకేరి రాజుగారి ఊరెట్లాగో మనవూరూ అట్లాగే. మనమేం చేస్తాం ? మనఊళ్ళోనే మనం బదకాలి. మనకు వేరే దారిలేదు.'

'అల్లాచేయండి అంటే అల్లాగే చేస్తాను. అందరికీ ఈసంగతి చెబుతాను. వాళ్లేమంటారో తిరిగి మీకు చెప్తాను.'

'అట్లాగే చేయండి. ఎవరితోనైనాకలిసి ఆలోచించండి. వాళ్ళమాట నాతో చెప్పండి. ముందుదారి చూద్దాం.'

శెట్టి ఒక్కక్షణం ఆలోచించి 'కానియ్యి. బోపణ్ణగారూ : అల్లాగే చేస్తాను. రేపచెల్లుండి తిరిగి మీదర్శనం చేసుకుంటాను' అన్నాడు.

బోపణ్ణకు ఇది దేశంచరిత్రలో ఒక సంధిసమయమని తోచింది. అతను గంభీరంగా 'మంచిది శెట్టిగారూ!' అని లేచాడు. శెట్టి వీడ్కొని ఇంటికి వెళ్ళాడు.

# 27

ఇంటికిరాగానే శెట్టి పార్శ్వణ్ణకు చెప్పంపించి అసలుసంగతి అంతాచెప్పి 'ముందెట్లా?' అన్నాడు. రామప్పనూ, సూరప్పనూ పిలిపించి సంగతి తెలుపాలనుకొన్నాడు.

వారూ వచ్చారు. నలుగురూకూచొని ఊరిస్థితి, జనుల మనస్సు, రాజుగారి బలాబలాలు, బోవణ్ణగారి బలాబలాలు, ముందు వేయవలసినఅడుగు, దానిలోని ఉపాయం లేక అపాయం, ఈ విషయాలన్నింటినీ మథించి సతమతమయ్యారు. నల్గురుస్నేహితులు ఒకళ్ళొకళ్ళ మనస్సు మరుగుచేసి మాటామంతీ ఆడేవాళ్లుకారు. నాల్గుమనస్సులు నిజానికి ఒకేమనస్సుగా పని చేస్తాయి. పరిస్థితిని నలువైపులనుంచీ అవలోకనచేసి, పరీక్షించి నాల్గుగడియలసేపు తర్జన భర్జనచేసినమీదట పార్శ్వణ్ణ 'బోవణ్ణమంత్రి రాజుగారిని పక్కకునెట్టాలితప్ప వేరేదారి లేద'ని చెప్పినట్లయింది. పేటలో వాళ్ళకు ఇది సమ్మతమంటే వారు ముందడుగువేస్తారు. మన సంగతి ఏమిటో మనం ముందుతెలిపి వాళ్ళసమ్మతిని పొందాలి. మీరంతా సరేనంటే సంధ్య వేళకు ఇంట్లోపూజకు అన్నట్లుగా అందరినీ పిలిపిస్తాను. జనానికి వచ్చినవారికి వచ్చినట్లు ఆసంగతితెలిపి వాళ్లసమ్మతిని పొందాలి. శెట్టిగారు మీరు పేటకుపెద్దలు. మీరు అందరికంటె ముందుగా రావాల్సివుంటుంది' అన్నాడు.

రామప్ప సూరప్ప 'ఈ ఉపాయం బాగుంది' అన్నారు.

చిక్కణ్ణశెట్టి 'అల్లాగే' అన్నాడు.

రాజుదగ్గిరనున్నవాళ్లు ఎల్లవేళల వీళ్ళమీద ఓకన్ను వేసివుంచడం వీళ్ళకు తెలుసు. అందులోనూ రాజభవనంలో మాట ఎగుడుదిగుడు అయినమీదట శెట్టిమీద పూర్తిగా నిఘా వుంచేమాట నిజం. అందుచేత జనంతో మంతనాలాడటానికి వాళ్లను పార్శ్వణ్ణ ఇంటికి రప్పించడం మంచిది. అందుచేతనే పార్శ్వణ్ణ జనులను తనఇంటికి పిలవమని సూచించాడు. మిగిలిన ముగ్గురూ అతని ఉద్దేశాన్ని గ్రహించారు.

సంధ్యాసమయంలో పేటవర్తకులూ, ప్రముఖులూ, సామాన్యులూ, ముగ్గురుముగ్గురుగా నలుగురునలుగురుగా పార్శ్వణ్ణఇంటికి వచ్చారు. పెద్దలనుండి సంగతి గ్రహించారు, వాళ్ళ నిర్ణయానికి తలలూపారు. పార్శ్వనాథుని పూజాప్రసాదం చేతిలోగ్రహించి వేరే ఏమీ మాటాడకుండా తమతమఇండ్లకు వెళ్ళారు. ఇంతటి ప్రాముఖ్యంగలవ్యవహారం నడిచివుంటుందని వాళ్ళమాటలనుండిగాని, నడతనుంచిగాని తెలియడానికి వీల్లేదు. ఒక్కొక్కళ్ళముఖంలో కించిత్ స్వల్పంగా కానవస్తుంది. కాని చాలామంది తమ మనస్సులకు సమాధానం చెప్పుకునే

వున్నారు. సంతకువచ్చినవాళ్లు సందడిని నిందించి లాభమేమిటి? గొంగట్లోతింటూ బొచ్చు ఏరుకొన్నట్లు. రాజు దుష్టుడయితే వర్తకపేట పాట్లు ఇల్లానేవుంటాయి. వచ్చిందాన్ని అనుభవించాల్సిందే. రానిదాన్నిగూర్చి బెదరకూడదు.

శెట్టిఒక్కడే రెండోసారి వెళ్ళడమనేదికూడదు అని రాత్రి బోపణ్ణ ఇంటికి పార్శణ్ణ వెళ్ళాడు. 'తాము ఉదయం మా పేటపెద్దకు చెప్పినమాట పేట అంతా వొప్పుకొంటోంది' అన్నాడు.

బోపణ్ణ: 'మంచిదవి. ఏమేమి ఒప్పుకొన్నారో చెప్పు.'

'రాజుగారు గద్దెనుండి దిగిపోవడం పేటప్రజకు ఇష్టమే.'

'గద్దెపై మరి ఎవరు ఎక్కాలి?'

'ఆమాట మేం చర్చించలేదు. అది మాకు తెలిసినవిషయమూకాదు. మంత్రులైన మీరు ఏమంటే అది మాకు ఇష్టం.'

'మంచిది పార్శణ్ణ! నేను పెద్దలతో సంప్రతించాలి. ఏంచెయ్యాలో ఆలోచించి తేల్చాలి. తేలింతరువాత తెలుపుతా.'

పార్శణ్ణ వెడలిపోయింతర్వాత బోపణ్ణ, లక్ష్మీనారాయణయ్యకు తాను మరునటి ఉదయంవచ్చి అతనితో మాటాడనున్నట్లు కబురుచేశాడు.

## 28

ఉదయం లక్ష్మీనారాయణయ్య ఆహ్నికాలు ముగించేటప్పటికి బోపణ్ణ అతనిఇంటికి వచ్చాడు. క్రిందటిరోజు శెట్టి చెప్పినసంగతిఅంతా, తాను చెప్పినవిషయం, అటుపిమ్మట పార్శణ్ణ తెచ్చిన వార్తలూ అన్నీ అతనికి పూసగ్రుచ్చినట్లు చెప్పాడు.

వాళ్ళఇద్దరికీ ఇటువంటిచర్చలు క్రొత్తగావు. లక్ష్మీనారాయణయ్య 'ఈ అల్లికంతా బాగానేవుంది. కాని దీనిలో రాజద్రోహం అనే నూలుపోగు ఓటి వుంది. అది పెద్దదోషం' అన్నాడు.

'రాజద్రోహం తగిందికాదు నిజమే. అల్లా అనుకునే ఇంతకాలం సహించుకోడం అయింది. దొరతో మొఱ అని చెప్పడం కద్దు. అయితే దొరే తప్పుదారిబట్టితే ఎవరితో మొరబెట్టుకోవడం? ఎవరినో ఆడపిల్లల్ని తెచ్చారే, చెఱచారే, అంటే ఎవరోలే, ఎవరి ఆడపిల్లలో, బలాత్కారంగానే తెచ్చారో లేక వాళ్ళంతటవాళ్ళే వచ్చారేమో మనం దీన్ని ఎందుకు

పట్టించుకోవడం అనేదోరణిలో మొదలకుండా వుండేవాళ్ళం. నేను శెట్టిఇంటికోడలివైపు చేయి సాచాడు దొర! రేపు మాఇంటిమీదికి రావచ్చు. ఎల్లుండి మీ ఇల్లు. ఈ దుండగం వారించడం రాజద్రోహమా?'

'కొడగురాజ్యంలోని పిల్లల్ని బ్రాహ్మణకన్యలను వారేమి ఇప్పుడేనా వెఱగొనడం? కాని దీనికి ఎఱుగుడేమీ కానరావడంలేదు.'

'పురాణంలో చెప్పలేదా అయ్యగారూ! ఊరిలో ఆడపిల్లల్ని నీటిలోముంచిన రాజు యొక్కపిల్లను అడవికి పట్టించారని? దేశంలో జనాన్ని పీడించుకొనితిన్న వేనరాజు తల తతిగేయలేదా? సరిగావుంటే చేతులెత్తి నమస్కరించాలి. సరిగా లేకపోతే, ఇటురా, పై దొలగిపో అనాలి.'

'గద్దెమీద?'

'దాన్నిగురించి ఆలోచించాలి.'

'ఆయన పేరుమీద రాణియమ్మ అధికారం నడిపించవచ్చు.'

'ఆమెవల్ల ఏమౌతుంది? మగడు గట్టిగా ఈవరి వెయ్యి అంటే పెండ్లాం దాన్ని చేయాల్సివుంటుంది. పొర వేరైపోయినట్టు కాదు.'

'ఆమెగారు అక్కర్లేదంటే కూతుర్ని చేయాలి.'

'ఆప్రసక్తి ఇప్పట్లో విడిచివేయి.'

'ఈ ఇద్దరూ కాకపోతే రాజుగారి చెల్లెలు.'

'ఇదేమిటి అయ్యగారూ? మీ చూపుకు ఆడదే కానవస్తోందే? వీళ్లు నిజంగా రాజ్యాన్ని శాసింపగలరా?'

'వీళ్ళెవరూ పనికిరారంటే రాజుగారిబంధువుల్ని అందరినీ ఓచోట సమావేశపఱచాలి.'

'బంధువులే కావాలిఅంటే అప్పాజి అక్కడెక్కడనో తలదాచుకొనివున్నారట వారినో, వారి కుమారుడు అక్కడనే వుండివుండాలి,-అతన్నో పిలిపించవచ్చు.'

'ఎక్కడనో వున్నారంటారే - వున్నారేమో చూడాలి. వస్తారా అని అడగాలి. ఒప్పు కుంటే అప్పుడు ప్రజకు తెలియజేయాలి. ఇదంతా ఎంతకష్టం! ఇదింతరహస్యంగా బైటపడ కుండా నెరవేరుతుందా? బైటకు పొక్కితే మన తలలుంటాయా? ఇవన్నీ ఆలోచింవాల్సిన విషయాలేగదా?'

'ఔను.'

ఈవిధంగా అంతామాట్లాడి చివరికి, వారు సంగతిఅంతా రాణికి వివరించిచెప్పి ఆమెను ప్రస్తుతం రాజ్యభారాన్ని వహించమనికోరడం, ఆమె ఒప్పితే సరేసరి, లేకపోతే అప్పటి ఆలోచనఅప్పుడూ అని వారు నిశ్చయానికి వచ్చారు. విషయాన్ని లక్ష్మీనారాయణయ్య చిక్కణ్ణశెట్టి రాణీసన్నిధిలో విన్నపంచేసేటట్లు నిర్ణయించుకొన్నారు. ఈమాట ఎత్తడానికి

కారణమేమిటంటే 'రాజగృహంనుంచి పేటకు చెల్లవలసినపైకం చాలా నిలిచిపోయింది. దేశభాండారంనుంచి రాజభవనం భాండారానికి చెల్లవలసిందంతా చెల్లివుండడంవల్ల ఇంత పైకం ఇవ్వడం సాధ్యంకాదు. శాసనం వేరుకాకుంటే వీలేలేదు,' అని తెలియజేయాలని ఇద్దరూ కూడబలుక్కొన్నారు.

# 29

లక్ష్మీనారాయణయ్యకు రాణితో ఈమాట అంటానికి తిరాచేసి ఇష్టంలేదు. కాని బోపణ్ణ ఆమెతో ఏవిషయమూ తానుగా ఎత్తిమాటాడడానికి ఒప్పడంలేదు. దీనికి ముఖ్యకారణం బోపణ్ణ గౌరమ్మ ఇద్దరూ కొడగువారవడం బోపణ్ణ గౌరమ్మతో మాటాడితే వీరరాజు 'ఇతడేదో నామీద కుట్ర పన్నుతున్నాడే' అని అనుకుంటాడని సందేహం. చాలాకాలం క్రిందట నడచిన ఒకానొక సందర్భంవల్ల రాజుకు తాను రాణితోమాటాడటం ఇష్టంలేదని బోపణ్ణ గ్రహించాడు. అటుపిమ్మట రాజుకు తనమీద ఏదో అపనమ్మకమని అతని ఊహ.

వీరరాజుకోసం పిల్లను వెదికేరోజుల్లో బోపణ్ణ చిన్నచెల్లెలిని ఓదాన్ని చేసుకొనేమాట వచ్చిందనీ, ఆమెనువిడచి గౌరమ్మను పెండ్లాడటం బోపణ్ణకు ఈపిల్ల తన చెల్లెల్ని రాణి గాకుండాచేసిందనే అసంతృప్తి అనిన్నీ వాళ్ళచుట్టాల్లో ప్రతీతి. గౌరమ్మ తనకూతురు బోపణ్ణ మేనల్లుని పెండ్లాడేసంగతి ఎత్తితె ఇతడు దాన్ని ఒప్పుకోకపోవడం, వేరే ఉండనేవుంది.

ఏదో ఒక కారణంచెప్పి లక్ష్మీనారాయణయ్యకూడ రాణితో ఈ ప్రసక్తి తెచ్చి మాట లాడేఏర్పాటు చేసికొన్నాడు. ఇహ కాలహరణంచేయడానికి లేకపోవడంచేత రాజభవనం వెచ్చం విషయంగురించి మాట్లాడడానికి చూడవలసివుందని ఆమెకు చెప్పంపించి ఓరోజు మధ్యాహ్నం చిక్కణ్ణశెట్టితోకలిసి ఆమెను కలుసుకోవడానికి వెళ్లాడు.

'రాజభవనం ఖర్చుగురించి మాట్లాడాలి అన్నారుట పంతులుగారూ: అంతఃపురం ఖర్చు ఎక్కువౌతోందా ?'

'అంతఃపురంమాట ఒక్కటే కాదు అమ్మాజీ! మొత్తం రాజభవనం ఖర్చుమాట. దీన్నిగురించి ప్రభువుతో మాటాడేదానికంటే అమ్మాజీగారితో మాటాడితే మేలు అని అని పించింది. బోపణ్ణమంత్రి నేనూ కూర్చొని ఆలోచించి సన్నిధానానికి చెప్పంపించాం.'

'మంచిది, నేను చేయదగ్గది ఏమిటి ?

'రాజభవనంనుండి పేటకు ఇప్పటికే లక్షకుపైగా డబ్బు ఇవ్వాలిసింది నిలిచిపోయింది. చిక్కణ్ణశెట్టి 'నాల్గువైపులనుంచి రావాలసింది. ఈవిధంగా రాకుండాపోతే ఇంత వెనకకువిడిచి

పేట వర్తకులచేతులు కట్టివేసినట్లయింది. దేశధనాగారంలోంచి ఈ డబ్బు ముట్టజెప్పితేనే మేం బ్రతికేది' అని అంటాడు.

దేశకోశంలోంచి రాజభవనానికి ఇచ్చేడబ్బు ఏమీ మిగలలేదు. ఇహ ఇప్పుడొక్కటే దారివుంది. రాజభవనంఖర్చును అదుపులోకితెచ్చి, ప్రతియేడాది రాజుకువచ్చే ఆదాయంలో ఓ ఇరవైఐదువేలచొప్పున మిగిల్చి దాన్ని పేటలెక్కకు జమకట్టాలి. ఈ ఏర్పాటు వెంటనే చెయ్యాలి. దీన్ని మీరే నిభాయించాలి.'

'రాణివాసము అంటే దానిమాట మేము చూడగలం. మొత్తం రాజభవనం అంటే మీరు రాజుగారితో మాటాడవలసివుంటుంది.'

'రాజుగారితో వ్యయంవిషయంమాటాడి ప్రయోజనంలేదు అమ్మాజీ: వారిమనస్సు, వారిచేయి, చాలా ధారాళమైనవి. ఇబ్బందిగావున్నప్పుడు ఖర్చు తగ్గించండి అంటారు. ఖర్చు మాటవచ్చినప్పుడు మొదటిలాగానే వ్యవహరిస్తారు.'

'కావచ్చు. కాని మేము చేయగలిగింది ?'

'రాజభవనంలోని పెత్తనం మీరు మీచేతిలోకి తీసుకోవాలి.'

'మీరు చెప్పేమాట మాకేమీ బోధపడటంలేదు. అయ్యవారూ ! రాజభవనంపెత్తనం అంతా రాణి తనచేతిలోకి తీసుకోడంఅంటే అర్థమేమిటి ? రాజుగారిని పైదొలగించమనేగా ?'

'తప్పించేమాటేమీ లేదు. ఏమిచేయాలి. ఏమి విడవాలి. దాక్న ఇప్పుడు రాజుగారు ఆజ్ఞాపిస్తూవస్తున్నారు. ఇహమీదట రాణిగారు ఆపనిచేసేటట్లు ఏర్పాటుచేయడం ?'

'ఇట్లా ఎవరు ఏర్పాటుచేసారు ? మీరు ఏర్పాటుచేసారా ?'

'ఈ బాధ్యత వహించడానికి మీరు ఒప్పుకుంటే, రాజుగారితో ఈవిషయం మంత్రులమైన మేమే విన్నవించుకుంటాం.'

రాణి కొంచెంసేపు తలవంచి ఆలోచిస్తూ కూచుండిపోయింది. అటుపిమ్మట చిక్కణ్ణశెట్టి వైపుతిరిగి 'లక్షకుపైగా నిలిచిపోయింది. మీరు ఇచ్చినసామానుబాపతు అంటున్నారు శెట్టిగారూ ! ఎనిమిది, పది, పదునైదువేలు అయినప్పుడు ఎందుకు రాజుగారికి ఈసంగతి తెలియజేయలేదో ! ఏళ్ళతరబడి ఇంతోటి దయ్యంలాగాపెంచి రాజభవనందారి చెడగొట్టారంతేనా ?' అంది.

చిక్కణ్ణశెట్టి:-'నిలిచిపోయింది అని విన్నవించాను తల్లి. 'ఎక్కడకుపోతుంది. నిదానించు' అన్నారు. ఇంకా మాటాడితే తిడుతారేమోనని భయం. అల్లాగే నడిచిపోయింది. ఇప్పుడు ముందుగతి ఏమీ కనబడటం లేదు. మంత్రులతో చెప్పికొన్నా.'

'మమ్మల్నీ అప్పుడప్పుడూవచ్చి కలుసుకొంటూనే వున్నావుగా : మాతో ఎందుకని చెప్పలేదు ?'

చిక్కణ్ణశెట్టి దీనికి సరైనసమాధానం ఇవ్వలేకపోయాడు.

క్షణంసేపుఉండి గౌరమ్మాజి 'సరే మంచిది. ఇది కేవలం డబ్బుకు సంబంధించిన మాటగా కనబడటంలేదు. సంగతిఏమిటో ఇహ మీదట చూడాలి. బోపణ్ణగారు ఇక్కడకు రేపు రావడానికౌతుందా ? అయ్యవారూ ! మీరూ, ఆయనావచ్చి మాట్లాడండి. శెట్టి రానక్కర్లేదు,' అంది.

రాజును మొత్తం శాసనంనుంచితప్పించి దాన్ని రాణిచేతి కప్పగింపడం తమ ఉద్దేశమని రాణిగ్రహించిందని లక్ష్మీనారాయణయ్య తెలుసుకొన్నాడు. ఆయన 'అమ్మాజీ! ఆజ్ఞ! రేపు నేనూ బోపణ్ణమంత్రి, ఇద్దరం వస్తాం' అని ఆమె ఆజ్ఞపొంది వెళ్లిపొయ్యాడు.

# 30

మరుసటిరోజు రాణికి చెప్పంపి సమయం ఏర్పాటుచేసుకొని లక్ష్మీనారాయణయ్య బోపణ్ణ రాజభవనానికి వెళ్ళారు.

తాను రాణికి చెప్పినమాట రాణి తనతో అన్నమాటలు అన్నీ లక్ష్మీనారాయణయ్య బోపణ్ణకు సవిస్తరంగా చెప్పాడు. అయినా, రాణి తన్ను ఎందుకు రమ్మన్నదా అని బోపణ్ణకు కొంచెం మనస్సులో కలవరం ! గౌరమ్మ చాల అభిమానంగల స్త్రీ. తాను అభిమానంగల వాడే. అటువంటివాళ్లు ఎదురుబదురుగా నిలబడి మాటలాడితే సులభంగా పని పాడౌతుంది. కూతుర్ని తన మేనల్లుడు ఉత్తయ్యకు చేసుకోడంలో అతడు రాణి కోరికను నిరాకరించాడు. ఏమైనా తాను కొంచెం జాగ్రత్తగా మాటలాడితే వ్యవహారం తప్పిపోవాల్సిన పనేమీలేదు.

వాళ్ళు రాజగృహం చేరేసమయానికి రాణి, అంతఃపురంలోని మండువాలో వాళ్ళకొరకు ఎదురుచూస్తూవుంది. వాళ్లను 'రమ్మ'నమనిచెప్పి కూర్చుండబెట్టి తాను ఎదురుగా కొంచెం దూరంలో కూచుంది.

గౌరమ్మ రూపంలో అందకత్తె అయినా కాకపోయినా ఆమెపై ఖరి, వ్యక్తిత్వంతో పిండి తొణికిసలాడే ఆమె గంభీరమూర్తి అందాలుచిమ్ముతూవుంటుందని లోగడనే చెప్పాను. ప్రకృతో ఆమెది దీర్ఘంగా ఆలోచించేస్వభావం. ఏదో సమస్య వచ్చిపడింది అనేఊహలో ఆమె ఆలోచనలు మరింతగా సాగినట్లు కనిపిస్తోంది. అందుచే ఠీవితోకూడిన ఆమెసౌందర్యం మరింత ఠీవి ఒలకబోసింది.,

మంత్రులు కూచున్న మీదట రాణి బోపణ్ణవైపుతిరిగి 'ఇంట్లో అంతా కుశలమా బోపణ్ణ మామా!' అని కుశలప్రశ్న చేసింది.

ఆమె కంఠధ్వని ఇంపితంగా వుంది. జాలి కలిగించేదిగావుంది. బోపణ్ణ దానితోనే సగం చిత్తైపోయాడు. ప్రశ్నతో మిగతాసగంకూడా చల్లబడిపోయాడు. 'మీ నీడలో అంతా సౌఖ్యమే అమ్మాజీ!' అని అతడు జవాబు చెప్పాడు.

'రాజభవనం ఖర్చు మితిమీరి అవుతోంది. ఇంకా పెట్టుబడి పెట్టడం కష్టం. పెత్తనం మేం చేతిలోకితీసుకొంటే బావుంటుంది అని మీరు వాంఛిస్తున్నారు అని అయ్యవారు చెప్పారు. ఆవిషయంలో వివరాలు సరిగా తెలుసుకొందాం అనే ఉద్దేశంతో మేము మిమ్మల్ని ఇద్దరినీ చూడవలసివుందని కోరాము.'

అయ్యవారు అట్లాగే చెప్పారు అమ్మాజీ: 'కానీ అల్లాగే అని వచ్చాను దేవి!'

'నేను మీ ఇంటిపిల్లననిభావించి మీరు నాకు దారి చూపించవలసివుంది. మా సంసారం పరిస్థితులన్నీ మీకు తెలుసును. దానిలో కొత్తగా చెప్పవలసినదేమీ లేదు. మీరు చెప్పినట్లు నేను చేస్తే రాజాగారు తమల్ని వైదొలగించి నేను అధికారాన్ని చే జిక్కించుకుంటున్నానని భావించవచ్చు. సంసారం సాగేది ఎట్లా? మాకుండేది ఓపిల్ల. అది ఇప్పుడిప్పుడే కండ్లుతెఱచి ప్రపంచాన్ని గమనిస్తోంది. దానికీ అమ్మసంగతి ఏమిటి తెలుస్తుంది. తల్లిదండ్రులమధ్య అది ఎవరివక్షం వుండాలి? ఇవన్నీ ఆలోచించాల్సిన సంగతులుగదా మరి?

'తప్పక ఆలోచించాల్సిందే అమ్మాజీ!'

'రాజభవనంమీద ఇప్పటి పెరిగివున్న అప్పు ఏటేటా, ఇంతని తీరుస్తూ ఇహముందు జరిగేవ్యయాన్ని అదుపులోబెట్టుకుంటే ఈ తొందర తప్పుతుంది. సంసారం అవిటి సంసారం కాకుండా వుంటుంది ఏమంటారు?'

'అది నిజం అమ్మాజీ: అంటే ఈ ఋణం తీర్చేదే కష్టం. పై పెచ్చు వ్యయాన్ని అదుపులో పెట్టేమార్గమూ కనబడటంలేదు.'

'మామగారి హయాములో వారు మాకు ఏటా పదివేలుచేసే బంగారుకాసులు ఇచ్చారు. వెనకటి ఆభరణాలుండగా ఇంటికోడలు అని క్రొత్తగా పదినైదువేలుచేసే ముత్యాలు, వజ్రాలు, బంగారంకొని ఆభరణాలు చేయించారు. ఆపైన నాలుగైదుసంవత్సరాలపాటు ఇదే కట్టడి నడిచింది. అదంతాచేరి ఈ ఋణానికి సరిపడుతుంది అనుకుంటాను. ఎంతో కొంత మిగలనూవచ్చు. అంతకంటె ఆ సొమ్ములకు వేరేప్రయోజనమేముంది? నే నేమైనా ప్రతి నిత్యం పెట్టుకోబోతున్నానా ఏమన్నానా? లక్ష్మిని ఊరికే పూజిస్తున్నట్లు అవుతోంది. పూజింపినతల్లి ఇప్పుడు మనలను కాపాడుతుంది. నగలు మీచేతికి అప్పగిస్తాను. ఋణవిముక్తి చేయండి. ముందు అయ్యేఖర్చు అదుపులో పెట్టడానికి ఏర్పాటుచూద్దాం.'

బోపణ్ణకు రాణిమాటవిని ఒకప్రక్క ఆశ్చర్యం, వేరొకప్రక్క మెప్పుదల, మరో ప్రక్క సంకోచం! నివ్వెఱపడి అతడు ఒక్కనిమిషం మూకీభూతుడయ్యాడు. అటుపిమ్మట లక్ష్మినారాయణయ్యవైపు తిరిగి 'విన్నారా? అయ్యవారూ!' అన్నాడు.

లక్ష్మీనారాయణయ్యమనస్సుకూడ రాణిమాటలువిని కరగిపోయింది. అతనికళ్ళు కించి దార్ప్రములు. అతడు మెల్లగా 'విన్నాను' అని జవాబు ఇచ్చాడు.

'ఏమంటారు ?'

'ఇద్దరూ అనేది ఒక్కటే బోపణ్ణ !'

బోపణ్ణ ఒక్కక్షణం మౌనంగా వుండి 'తమ ఆలోచన చాలగొప్పది అమ్మాజీ ! రాణ భవనంలోని స్త్రీలేకాదు, ఏస్త్రీ అయినా తనసొమ్ములు విడిచిపెట్టడానికిముందు తన ప్రాణ మైనా బలి ఇవ్వడానికి సిద్ధమౌతుందని జనుల విశ్వాసం. నిజంకూడా అంతే. ఇట్లావుంటుంటే మీరు సొమ్ములన్నీ ఈవిధంగా ఇచ్చివేస్తామనిచెప్పడం ! ఇది కేవలం ఒక ఆడుది అన్న మాటకాదు ! దేవతయే తానుగా పలికినపలుకు !' అన్నాడు.

'ఏమన్నప్పటికీ మేము మీకంటె చిన్నవాళ్లం ! ఈవిధంగా పొగడకండి అది మాకు మంచిది కాదు' అని రాణి అతనిమాటకు అడ్డువచ్చింది.

'కావచ్చు అమ్మాజీ ! కాని వున్నమాట వున్నట్టు చెప్పుకోవాలి. అది పొగడ్త అని పించుకోదు.'

లక్ష్మీనారాయణయ్య : 'ఔను అమ్మాజీ ! బోపణ్ణ మంత్రిగారు చెప్పేది నిజం.'

రాణి : 'సొమ్మంతా మా ధనాగారం గదిలోనిపెట్టెలో వుంది. ఉదయం దాన్ని తీసుకొని వాల్గుపెట్టెలలో నింపించాను. మీకు సమ్మతమైతే '

రాణి వాక్యాన్ని ముగించేముందే బోపణ్ణ లక్ష్మీనారాయణవైపుచూసి తిరిగి రాణివైపు చూస్తూ 'దీనికైనా రాజాగారి ఒప్పుదల కావాలిగా !' అన్నాడు.

రాణి: మేము అదే చెప్పదలిచాం. మీరు సరే అంటే మేము సంగతిని రాజాగారికి తెలియజేసి నగలను మీ భండారానికి పంపిస్తాం.'

బోపణ్ణ: 'మంచిమాట అమ్మాజీ కాని దీనికి మేము ఒప్పుకోం.'

'ఒప్పుకోరా ?'

'పెద్దవాళ్లు ఇంటి కోడలికిఇచ్చిన ఆభరణాలూ, వస్త్రాలూ, కోడలి స్వంతం. నొసటి కుంకుమ, కంఠంలోని మంగళసూత్రాలతోబాటు నగలూ సొమ్ములూకూడ శరీరంపై కాన వచ్చే మాంగళ్యచిహ్నాలు. వాటిపై చేయివేయడం వంశనాశకులమని. దేశానికి మీరు లక్ష్మీ స్వరూపిణులు వాటిని మేము తీసుకోవడం ఉచితంకాదు.'

# 31

వాళ్లు ఈమాటలు మాటాడేవేళకు రాణికి ప్రక్కవాకిలిదగ్గిర ఎవరో తచ్చాడుతున్నట్లు నీడ కనబడింది.

ఆమె 'ఎవరు అక్కడ వాకిలిప్రక్కన?' అని ప్రశ్నించింది. క్షణంసేపు ఎవరూ రాలేదు. రాణి తిరిగి గద్దించి 'ఎవరు అక్కడ వాకిలిప్రక్కన? ఇటురా!' అని పల్కింది. మొహం చిన్నచేసుకొని తడబడపడుతూ బసవన్న వాకిలియొద్ద కనబడ్డాడు. రాణి 'వాకిలి చాటున ఏం చేస్తున్నావు బసవన్నా? పొంచుని మాటలు వింటున్నావుకదూ?' అంది.

'ప్రభువులు చూచిరమ్మన్నారు. అందుకని వచ్చా'.

జరిగినసంగతి ఇది. క్రిందటిరోజు లక్ష్మీనారాయణయ్య రావడం, ఈరోజు బోపణ్ణ లక్ష్మీనారాయణయ్య ఇద్దరూ రావడం బసవన్న పెట్టివుంచిన మనుష్యులుద్వారా రాజుకు వార్త వెళ్ళింది. పత్నినిగురించి రాజుకు నిశ్చితంగా అవిశ్వాసం లేకపోయినా, ఆమెపై అతని కున్న విశ్వాసం చాలదు. ఏమి పన్నాగం పన్నుతున్నారో అని అతడు ఆలోచించడం మొదలు పెట్టాడు. ఏమైనా మొత్తంమీద తనకు విరోధంగా ఆలోచనలు సాగుతున్నాయి అని అతడు నిశ్చయించుకొన్నాడు. ఏమిటో మాటాడుతున్నారే, ఉపాయంగా వినిరా అని బసవన్నను పంపించాడు.

ఉదయంనుంచీ తాగివున్నాడో ఏమో అతనికి బుద్ధి స్వాధీనం తప్పింది. బసవన్న రావడం కొంచెం ఆలస్యమైంది. అతడు తానే ఇటుప్రక్కకు వచ్చాడు.

బసవన్నమాటకు అసంతృప్తిచెందిన రాణి: ప్రభువులు చూసిరమ్మంటే తిన్నగా రావాలి. మమ్మల్ని చూడాలి. వాకిట్లో పొంచునివుండటం దేనికి?' అంది. ఆమె ఈమాట అనడం ప్రారంభించేటప్పటికి రాజు వాకిలిలోకి వచ్చాడు. 'ఔను ఏమి నాటకం ఆడు తున్నావో తెలుసుకొనిరా అన్నాను. ఏం చేస్తున్నావే బొట్టీ! చుట్టంతోనూ, బాపనయ్యతోనూ కలిసి?' అంటూ ముందుకు వచ్చాడు.

రాణి మంత్రులవైపుచూసి 'ఈమాట ఏమీ మీరు వినకండి. ఇది మా ఇంటిమాట' అని చెప్పి రాజువైపుతిరిగి 'సంగతిఅంతా తెలుసుకుంటున్నాను. తప్పేమీలేదు' అని జవాబు చెప్పింది.

'తప్పేమీ లేదా బొట్టికాన. నీవు తెలుసుకోవడమా; అదేమీ మేం వినేదిలేదు. ఉండు నిన్ను మాదిగాళ్లకు పారేయిస్తాను. బోపణ్ణమామ! గౌరమ్మ కోడలు! వాహ్వా! ఏమిసరసం!

ఏమి చనవు! చూసితీరాలిసిందే! కోడలితో సరసాలు ఆడటానికివచ్చావా నువ్విక్కడికి బోపణ్ణమామా? ఎందుకు వచ్చావు నువ్విక్కడికి?' అని కేకలు పెడుతూ రాజు బోపణ్ణమీదికి పోయాడు;

రాజుకు సారాయముతో మతి తప్పిందని అతని మాటలధోరణిలో కనబడుతూనేవుంది. కోపంమూలాన అతనినోటిలో నురుగు కనబడుతోంది. బోపణ్ణకూ కోపం. ఏమిటంటాడో అని లక్ష్మీనారాయణయ్య అతనిదగ్గిరచేరి 'మెదలకుండా వుండు. నోరుతెరిస్తే ఒట్టే' అని అతనిని నివారించాడు. బోపణ్ణ కోపవీక్షణాలతో లక్ష్మీనారాయణయ్యను ఒక్కసారి చూశాడు. మెల్లిగా తనకోపాన్ని మింగివేశాడు.

రాణి మొహంపై కొంచెమైనా మార్పు కనబడలేదు. ఆమె భర్తదగ్గరకు వచ్చింది. 'మంత్రులను నేనే పిలిపించాను. పనివుంది. ఆవిషయం మళ్ళీ మాటాడుతాను. ప్రస్తుతం మీకు వంట్లో బాగాలేదు. కొంచెం కూచోండి, తిరిగి మాటాడవచ్చును' అని అతనికీ, బోపణ్ణకూ మధ్యగా నిలబడింది.

'ఓసి బొట్టి! రంకుమొగుణ్ణి రక్షిద్దామనా?' అని రాజు రాణిని కొట్టడానికన్నట్లు చేయి పైకెత్తాడు. బోపణ్ణ రాజును వారించడానికని చేయి చాపాడు.

లక్ష్మీనారాయణయ్య అతన్నిపట్టుకొని వెనక్కు నెట్టాడు.

రాజుచేయి రాణి తలమీదకు దిగింది. రాణి దాన్ని తన రెండుచేతుల్తోపట్టుకొని వారించింది. ఇంతలో కోపప్రకోపంతో సొక్కుసొలనివుండొచ్చు. రాజు ఒకప్రక్కకు ఒఱిగాడు. అతని నోటివెంబడిమాట 'త్త త్త త్త' అని తొణకుతూ, రావడం మొదలుపెట్టింది.

రాణి చేతులుచాపి అతన్ని పట్టుకొంది. 'ఇటురా! బసవయ్యా! రాజుగారికి వంట్లో బాగాలేదు. వీరిని పిలుచుకొనిపోయి పడుకోబెట్టు' అంది.

రాణి గౌరమ్మ నడతచూచి బసవన్నకూడ నివ్వెఱపోయాడు. అతడు ఆమె ఆజ్ఞ ప్రకారం దగ్గిరకువచ్చి ఆమె చేతిలోంచి రాజును తనచేతుల్లోకి తీసుకొన్నాడు. రాజుకు వంటిమీద స్పృహ లేదు.

రాణి మంత్రులవైపుతిరిగి 'ఒక్కక్షణం ఉండండి వస్తాం' అనిచెప్పి బసవన్నకు 'వదలు బసవయ్యా!' అని చెబుతూ, రాజును ప్రక్కనున్నమంచంపై చేర్చి కూర్చొబెట్టింది. బసవయ్య వాకిలిదగ్గిరకువెళ్లి సేవకురాలిని పిలిచాడు. ఆమె రావడంతోనే రాణి ఆమెకు రాజును ఎడంభుజం పట్టుకోమనిచెప్పి ఆమెసాయంతో అతన్ని ఎత్తుకొని లోపలికిపోయింది.

రాణి రాజును ఎత్తుకున్నప్పుడు 'కుంటి' తాను సహాయానికివస్తానంటూ ముందుకువచ్చాడు. రాణి 'వద్దు' అని సంకేతం చేసింది. బోపణ్ణకూడ ఒక అడుగువేశాడు. రాణి 'వద్దు, వద్దు' అంది.

ఆమెమాటలో ఈపని తనకు కష్టమైందిగాని, తగవిదికాని, కాదు అన్నధ్వని స్పష్టంగా అందరికీ వినబడింది.

రాణి రాజును పిలుచుకొని లోపల ప్రక్కకుపోగానే బోపణ్ణ, లక్ష్మీనారాయణయ్యతో 'అమ్మాజిగారికి చాలాకష్టం : ఇప్పటికి ఈమాట నిలిపేద్దాం' అన్నాడు. లక్ష్మీనారాయణయ్య 'చాలించడమే మంచిదనిపిస్తోంది' అని బసవన్ననుపిలిచి 'బసవయ్యా : అమ్మాజి మమ్మల్ని పిలువనంపిస్తే ఇప్పుడు రాజుగారిని సంబాళించుకోండి. రేపు మళ్లీ కనబడతామన్నారు అని నివేదించు' అని చెప్పాడు.

బసవన్న 'అల్లాగే : అయ్యవారు' అన్నాడు.

బోపణ్ణ, లక్ష్మీనారాయణయ్య ఇద్దరూ రాజప్రాసాదంవిడిచి బైటికి వెళ్ళారు.

# 32

క్రోధప్రకోపంతో మూర్ఛిల్లిన వీరరాజు పదిహేనురోజులు ప్రక్కవట్టుకొని పడివున్నాడు. మొదటి మూడురోజులూ అతనికి స్పృహ అరకొరగావుంది. అతడు ఏవో కలవరింతపు మాటలు గొణుగుతూవుండేవాడు. రాణి అతనిశుశ్రూషకై ప్రక్కనే వుండేది. వైద్యుణ్ణి పిలిచి ఏమైంది, ఎల్లావుంది? సరిగా చూడాల్సింది అనిచెప్పి అతడు చేసిన పరీక్షలన్నింటినీ తానూ గమనించి చేతనయినంతవరకు మంచిచికిత్స జరిగేటట్లు ఏర్పాటుచేసింది. దీక్షితులు దైవజ్ఞుడు. ఆయననురప్పించి రాజుగారికి నయమయ్యేటట్లు శ్రీదేవుని సన్నిధానంలో పూజా పురస్కారాలు జరిగేఏర్పాటు చేసింది. అతనితో 'గ్రహగతి ఎట్లావుందో చూడండి. శాంతి ఏమైనా అవసరమేమో, చెయ్యండి' అని చెప్పింది.

రాజు కలవరింతలో లూసి అనే ఒక ఆంగ్ల కన్యమాట, హాకర్ అనే ఆంగ్లేయాధికారి ప్రసంగం వినబడ్డాయి. వారికి విందు ఏర్పాటుచేయడం ఆలస్యమైందని అతని కలవరం. రాణి శ్వేతముఖుల్ని చూచేవుంది. రాజువళ్లు కుదుటబడ్డతర్వాత తెల్లదొరలందరినీ ఆహ్వానించి విందుభోజనం నడపాలని నిశ్చయించుకొన్నది.

వైద్యుడు : 'వెనక ఓసారి రాజుగారికి ఈవిధంగానే లక్షణాలు కనబడ్డప్పుడు పాదిరీ మేషలింగదొర ఓ ఔషధాన్ని వాడాడు. దాంతో చాలా గుణం కనబడింది' అన్నాడు. 'మేషలింగ' శబ్దం ఇంగ్లీషునందలి 'మేగ్‌లింగ్'కు దేశీయరూపం. ఫాదర్ మేగ్‌లింగ్ మంగుళూరిలోని క్రైస్తవమిషనరీ. అతడు క్రైస్తవమతాన్ని ప్రచారంచేయడంకోసం వచ్చినమిషనరీ. కొంచెం వైద్యంకూడా ఎరుగు. రాణి మంగుళూరుకు నౌకర్లనుపంపి పాద్రిని రప్పించింది.

వైద్యుడు ఏమిమందు ఇచ్చినా దాన్ని మొదట వేరేఒకరు తాగియో లేక కొంచెం ఓ కుక్కకుపోసో, ఆపిమ్మట రాజాగారికి ఇవ్వడం రాజభవనంలో మొదటినుంచీ వస్తున్న పద్ధతి. ఈసారిజబ్బులో ఔషధాన్ని రాణి ముందు తనమీదనే ప్రయోగించుకుంటూవచ్చింది. పాద్రి తాను ఇస్తున్నమందును ముందు రాణి తాగుతూవుండడం కనిపెట్టి 'ఈ జాగ్రత్త మా విషయంలో అక్కర్లేదు' అని చెప్పాడు. రాణి నవ్వుతూ 'మాకూ శరీరంలో ఆరోగ్యం ఏర్పడాలి అని తాగుతున్నాం' అంది.

రాజు రాణిని ఆట్టే అంత ఏమీ బాగాచూడడు అనేసంగతి పాద్రికి తెలుసు. ఒక్క పాద్రీ ఏవిటి కొడగుకువచ్చిన తెల్లవాళ్ళకందరికీ తెలుసు. ఇల్లావున్నప్పటికీ ఈ స్త్రీ పెనిమిటి విషయంలో ఇంతశ్రద్ధగా నడచుకోవడం ఏమిటా అని పాదరీకి కొంచెం ఆశ్చర్యం. దానికి తోడు హిందూమతంలో ఆడదానికి మర్యాదలేదు, మగడు ఎటువంటివాడైనా పెండ్లాం అతనిని దేవతగా చూడాలి అని నియమించి, ఈమతం ఆడదాన్ని, నిలువులోతు గోతిలో పాతేసింది. రాణి అయినా తానూ ఓ మనిషిననే జ్ఞానం ఈమెకులేదని ఓ చిన్న తిరస్కారభావంకూడా అతనికి వుంది.

రాణి పాదరీకి 'రాజుగారి దేహస్థితి బాగుపడ్డతర్వాత మేము ఆంగ్లేయమిత్రులకు ఇక్కడ ఒక విందుభోజనం ఏర్పాటు చేయవలసివుంది. హోకరుదొర టూసీదొరసాని, మరి పెద్దలైన ఇతరులు అందరూ రావాలని మాకోరిక. మంగుళూరులోని మీ దొరగారుకూడా వచ్చేఏర్పాటు చేయండి. అందరికీ అనుకూలమైన ఏదో ఒకరోజు ఆలోచించి తెలియజేయండి' అంది. పాదరి 'చాల సంతోషం, అల్లాగే చేస్తాను' అన్నాడు. ఈసంగతి తెలుపుతూ బెంగుళూరికి, మంగుళూరికి ఉత్తరాలు వ్రాసిపంపాడు.

# 33

జబ్బులోవున్న మనుష్యులప్రక్క కూచోడం వాళ్ళఆత్మకు శుభాన్నికోరడం క్రైస్తవపాదరీలు ఆచరించే ఓ పద్ధతి. ఇతరమతస్థులప్రక్క కూచునివున్నప్పుడు ఇది వాళ్ళను క్రైస్తవ మతంలో చేర్చేప్రయత్నమౌతుంది. 'క్రీస్తుమాత్రమే రక్షకుడు. క్రైస్తవులకుమాత్రమే దేవుడు దయచూపిస్తాడు' అనేది వీళ్ల నిశ్చలమైన విశ్వాసం. జబ్బులో పడివున్నమనిషి మనస్సు బిగి తప్పుతుంది. నరకవర్ణనంతో అటువంటివానిమనస్సులో భయం పుట్టించడం తేలిక. క్రైస్తవపాదిరిఅయి నతడు ఇటువంటిమాటలతో రోగిని భయపెట్టడానికి వెనకాడేదిలేదు. అంతేకాదు; అతని ఆత్మనురక్షించ క్రీస్తుకుచెందిన అస్తిగా చేయడానికి అది చక్కని

సమయం. దేవుడు మనుష్యుని బుజ్జపడజేసేది - ఈవిధంగా భయంపుట్టించడం జీవుడు దేవునివైపు మళ్లడంకోసమే - అని వాళ్ళభావన. మేగ్‌లింగ్‌పాద్రి ఇట్టి అభిప్రాయాలుగల క్రీస్తుసేవకుడు.

రాజుకు ఔషధమిచ్చేసందర్భంలో పాదరీ రాణికి, రాజుకు క్రీస్తునుగురించి ఎంతగానో చెప్పాడు. అతడు క్రైస్తవుడు అయితే భగవంతుడు అతన్ని ఎంతో కాపాడుతాడు అని ధైర్యం చెప్పాడు. తెల్లదొరలప్పుడు రాజును తమ సోదరునిగా, బంధువుగా చూస్తారని చెప్పాడు.

వారం తర్వాత కొంచెం గుణమిచ్చినతర్వాత రాజు పాదరీమాటకు 'నేను క్రైస్తవుడనైతే మీరు నాకేమి ఇస్తారు?' అని హాస్యానికి అడిగాడు. పాద్రి 'మీ ఆత్మ ఇప్పుడు సైతానుకు లోబడిపోయి వుంది. దాన్ని మీకు విడిపించిఇస్తాను' అన్నాడు. రాజుకు కోపం ఎగేసుకొని వచ్చింది.

'మీ అబ్బ సైతానుపాలైవున్నాడు. ముండాకొడుకా! అతన్ని మొదట విడిపించుకో' అన్నాడు. పాద్రి 'ఈమాట అనేది సైతాను అని మామతంలో చెప్పబడివుంది. దేవుడు అతన్ని పంపించేసి మీకు ఒళ్లు బాగుచెయ్యాలని మేము ప్రార్థిస్తున్నాం' అన్నాడు.

ఇతని ఈ ఓర్పుచూసి రాణికి ఆశ్చర్యం. పాద్రి ఓంకారదేవుని కోవెలలోని దీక్షితుల వలెనే సహనంగల మనిషిఅని ఆమెకు తోచింది. ఇందుకుగాను ఆమె పాద్రిని చాలా మెచ్చుకొంది. పాదరి రాణి ఆజ్ఞపొంది ఆమెకూ, ఆమెకన్యకూ, క్రైస్తవమతంలోని గొప్పతనాన్ని వర్ణించిచెప్పాడు. 'మీరు క్రైస్తవమతం స్వీకరించడాన్నిగురించి ఆలోచించాలి' అని రాణికి సూచించాడు. రాణి 'మామతం మాకు బాగుంది. మిమతం మీకు బావుంటుంది. మీరు ఆమార్గంలో మోక్షాన్ని పొందండి. మేము మా మార్గంలో పొందుతాం. ఇప్పుడు మీవు వచ్చివున్నది మందు ఇవ్వడానికి. ఆపనిని సరిగా నెరవేర్చు. మేము మీకు పూర్తిగా మర్యాద చూపుతాం' అంది.

క్రైస్తవమతం హిందూమతంకంటె గొప్పదని నేను మీకు ఋజువుచేసి మరీ చూపుతాను. మీ మతానికిచెందిన గురువులను ఓసారి పిలిపించండి. నాతో వాదించనివ్వండి. నేను వాళ్లను ఓడిస్తాను' అని పాదిరి జవాబు చెప్పాడు.

రాణి: 'మా మతంవిషయం మా పెద్దలు ఆవిధంగా వాదించడానికి ఒప్పుకోరు. మీరు అడిగారు అని అయ్యవారికి తెలియజేస్తాం. దీక్షితులుగారు ఒప్పుకుంటే మీకిద్దరికీ అనుకూలమైనరోజు వాదం నడపనివ్వండి' అంది.

దీక్షితులు దేవాలయంలో గ్రహశాంతిని, పూజను చేశాడు. రాజుకు ఆరోగ్యం చిక్కాలి అని అన్నదానం, వస్త్రదానం చేయించాడు. రాణి ఇందుకు సంబంధించిన వ్యయమంతా తానే భరించింది.

ఓ నెలరోజులకు రాజు దేహస్థితి చాలవరకు అనుకున్నట్టే నయమైంది. భర్త మూర్ఛ పోయినతర్వాత తన మాంగల్యానికి ఎక్కడ చేటువస్తుందో అని భయపడ్డ రాణి ప్రస్తుతం ఆ భయం తొలగిపోయింది అని మనస్సులో సంతోషపడింది. వైద్యునికి, దీక్షితులవారికి, పాదరీకి దక్షిణ ఇచ్చి 'భగవంతుడు మీద్వారా ఈసారి మమ్మల్ని రక్షించాడు' అని అంది.

# 34

చిక్కణ్ణశెట్టి అన్నకుమారుడు చిక్కరామశెట్టి భార్యనుగూడి అరకలగూడుకు పారిపోయిం తరువాత మడకేరిలోని తన పినతండ్రిగతి ఏమిటి అని ఆలోచించడం మొదలుపెట్టాడు. అతడు జరిగినసంగతి ఏమిటి అని అడిగినబంధువులకూ, స్నేహితులకూ, అందరికీ ఉన్నది ఉన్నట్లు చెప్పి, చిన్నాయనను ఎల్లా కాపాడుకోవడం అని వాళ్ళతో ఉపాయాలు ఆలో చించడం మొదలుపెట్టాడు.

రెండుఏండ్లక్రిందట మైసూరుదొర రాజ్యాన్ని సరిగా ఏలడంలేదని, ఆంగ్లేయులు అతన్ని దొరతనంనుంచి తప్పించి శాసనాన్ని తామే వహించారు. 'కొడగురాజు అయోగ్యుడు అయ్యాడు. అతన్నికూడా తప్పించి మైసూరుతోబాటు కొడగుపరిపాలనకూడా వహించండి అని ఎందుకు అడగకూడదు? తామో మైసూరు నివాసులు. ఇప్పుడు ఆంగ్లేయులే తమ ప్రభు వులు. చిక్కణ్ణశెట్టి మడకేరిలోవున్నా మూలతః అరకలగూడు మనిషే. కొడగుదొర మైసూరు షాహుకారిని కష్టపెట్టుతున్నాడు. ఈవిషయం విచారించండి అని ప్రజలు దొరలతో మొరపెట్టుకోడం సరైనమాట. అవిధంగా నిశ్చయించుకున్నారు. అరకలగూడులోని ప్రముఖులైన జనులమంది ఓ విన్నపం, చిక్కణ్ణశెట్టి బంధువులతరపున ఓ అర్జీ, చిక్క రామశెట్టినుంచి వేరే ఓ ప్రార్థనాపత్రం. ఈవిధంగా ఓ వారంలో మూడు అర్జీలు బెంగుళూరు లోని ఆంగ్లదొరలచేతికి వచ్చిచేరినాయి.

అరకలగూటినుంచి ఈవిధంగా అర్జీ పోయించి అని చిక్కరామశెట్టి రహస్యంగా చిక్కణ్ణశెట్టికి వార్త అందింది. చిక్కణ్ణశెట్టి తానుగా ఏ ఫిర్యాదు చేయడానికి సమ్మతింప లేదు. కాని ఇతరులు అల్లాచేస్తే అతనికేమీ అభ్యంతరంలేదు. అతడు మంచిపనే అయింది అనుకొన్నాడు. 'ఈమాట రాజభవనానికి తెలిసినా వాళ్ళు తనకేమీ చెరుపు చేయకుండావుంటే చాలు' అని లోలోపల వాంఛించాడు.

# 35

ఆరకలగూడునుండివచ్చిన అర్జీలవంటివి ఆంగ్లేయులకు మిగుల ప్రీతికరాలు. వారు ఆరోజుల్లో భారతభూమిని మింగే అజగరపాత్రను వహిస్తూవుండిరి.

హైదరుతో జగడమాడుతూ మైసూరుభూమిమీద తిరుగుతూ, దొడ్డ వీరరాజుతో సహకరిస్తూ కొడగునేలపై విహరిస్తూ ఆంగ్లేయులు 'మైసూరుకానీ, కొడగుకానీ: చక్కని నేల ఇటువంటి భూఖండం చేతికచిక్కడం అపరూపమైన పుణ్యం' అని గ్రహించారు.

టిప్పు చివరిసారి 'ఓడిపోయి మైసూరురాజ్యం పునర్వ్యవస్థీకరింపవలసి వచ్చినప్పుడు ఆంగ్లేయాధికారులు రెండువర్గాలుగా చీలి మాటాడారు. 'రాజ్యాన్ని మాకు వెనక్కి ఇప్పించండి అని అడిగి ఆపదలో రాజమాత మనకు ఎంతో సహాయం చేసింది. ఆమెగారివిశ్వాసానికి మనం ద్రోహం తలపెట్టకూడదు. వాళ్ళరాజ్యాన్ని వాళ్ళకు ఇవ్వడమే న్యాయం' అని ఒకపక్షంవారి వాదం. 'న్యాయం న్యాయం అంటూ కూచుంటే రాజ్యాన్ని సంపాదించడం ఎట్లా? ఇక్కడివాళ్ళకు పరిపాలించేయోగ్యత వుందా? వీళ్ళను గద్దెక్కించి కూచోబెట్టినా వీళ్ళను కనిపెట్టివుండాల్సింది మనమే. ఈ పరోక్షప్రవర్తనవల్ల ఏమిటి లాభం: శాసకులై వుండేవాళ్ళు సహాయం పొందిండి అంతా తెలుస్తూకూచుంటే కొన్నిలక్షలు వార్షికాలు ఇవ్వాల్సివస్తుంది. దేశాన్ని మనం మనచేతిలోకి తీసికోడమే మంచిది' అనేది రెండోపక్షంవారి వాదం. ఈ రెండుపక్షాలమధ్య వాదం తూపుమాపేడే కష్టమైపోయింది.

చివరికి ఆ చర్చ ముగిసింది. ధర్మదృష్టిచేతనూ, న్యాయదృష్టిచేతనూ కాదు. 'టిప్పును ఓడించాలి అంటే నిజాము, మరాఠీలు ఆంగ్లేయులకు సాయపడ్డారు. మైసూరును రాజులకు అప్పగించకుండావుందామంటే టిప్పుచేతిలోని ఈ విశాలమైన భూభాగాన్ని తెల్లదొరలు ఒక్కరే మింగేపరిస్థితిగా లేదు. నిజామును భాగం పెట్టాలి; మహారాష్ట్రులకు భాగంపెట్టాలి. టిప్పును ఓడించడానికి మేము మీకు సాయం చేస్తామని వాళ్ళ ఇద్దరి నిక్కడు. వాళ్ళు ఇప్పటికే ప్రబలిపోయివున్నారు. ఇంకా భూమి పంచిపెడితే వాళ్ళను పట్ట పగ్గాలుండవు. ఒక్క టిప్పునోడించి ఇద్దరు టిప్పులను (దేశీయరాజులను) పైకెత్తడం ఏమంత రాజనీతి? మైసూరురాజ్యాన్ని హిందూరాజుకిస్తే ఆంగ్లేయులు మన రాజ్యాన్ని మనకిచ్చారని కృతజ్ఞతగా వుంటారు. నిజాముకు, మహారాష్ట్రులకు ప్రతికక్షియైన మూడోశక్తిగా అవసరముపడ్డప్పుడు మనపక్క నిలబడుతాడు' ఈవిధమైన ఆలోచనతో ఆంగ్లేయులు మైసూరును హిందూ రాజుకు తిరిగి అప్పగించారు.

ముప్పైసంవత్సరాల్రకిందట కొత్తచోట నివాసంగావచ్చిన అధికారులు, సహాయకులు వీళ్లల్లో మూడువంతులజనం. 'ఇటువంటిభూమిని మనం సొంతానికి అట్టె పెట్టుకోకుండా వెనక్కు ఇచ్చివేసామే' అని దుఃఖించినవాళ్లే. తరువాత ఇరవైఏళ్ళల్లో టిప్పును ఓడించిన సందర్భంలోని వేడి చల్లారి ఆంగ్లేయుల మనఃప్రవృత్తిలో మార్పువచ్చింది. అప్పట్లో ప్రతి ఘటంగా కానవచ్చే మరాఠీదండు ఇప్పు దొకమూలకు నెట్టివేయబడ్డది. ఒంటరివాడైన నిజాము మహారాష్ట్రులకు పట్టినగతే తనకూ పట్టుతుందేమోనన్నభీతితో బ్రతుకుతున్నాడు. అజగరవృత్తిలోనున్న ఆంగ్లేయులు ఎప్పుడు సమయంవస్తుందా అని ఎదురుతెన్నులు చూస్తూ వచ్చారు. మైసూరురాజుల తెలివితక్కువతనంతో రాజ్యంలో గందరగోళం, తిరుగుబాటు వచ్చింది. దాన్నే నెపంగాచేసికొని రాజును సింహాసనంనుండి దింపేసారు. మైసూరును కబళించేశారు.

కొడగునేల ఒకవిధంగా దొరలదృష్టిలో మైసూరుకంటె అందమైంది. కొడగులోని నవ పర్వతాలు, వనోపవనాలు, కొండచరియలు, రాజోద్యానం. వాళ్ళబైబిలులో వర్ణించిన గార్డెన్ ఆఫ్ ఈడెన్‌కు సమంగా చేశాయి. తమద్వీపంలో స్కాట్లాండులోని పర్వతప్రదేశం చాలా అందమైంది అని వాళ్ల పరిజ్ఞానం. కొడగుఅందం స్కాట్లాండులోని ప్రకృతిసౌందర్యం కంటె పైచేయిగా వుంది. మైసూరును మింగినట్లే కొడగునుకూడ కబళించాలని చాలమంది తెల్లదొరలనోళ్లల్లో నీళ్లూరుతున్నాయి. రాజుతో కలహాలు పెరగాలి అని వాళ్ళకోరిక. ఇంతకుముందువచ్చిన పలు వివాదాలు భోజనంలోకి తయారౌతూవున్న కిజ్జాయముల సువాసన వలె వాళ్ళ ఆసను రేకెత్తింపచేశాయి. అరకలగూడునుంచి వచ్చినపిర్యాదు కాగితాలతో వాళ్ల సంతోషం పొంగి పొరలింది.

మైసూరుప్రభుత్వం ఆంగ్లేయాధికారులచేతిలో వుంది. మాక్లియాడ్ అనే అతడు చీఫ్ కమిషనరు. క్యాసామైజర్ రెసిడెంటు. హాకర్ అతనికి సహాయకుడు. క్యాసామైజర్ కొడ గును మింగివేయాలనేసిద్ధాంతం గలవాడు. ఆరోజుల్లో అక్కడి వ్యవహారంఅంతా రెసిడెంటే చూడవచ్చుననే ఏర్పాటైంది. అరకలగూడునుండి అర్జీలువచ్చిన సుమారు వారంలోపల మడకేరినుంచి 'రాజుగారికి ప్రస్తుతం దేహస్థితి సరిగాలేదు. గుణంగావున్నవెంటనే తమ రందరూవచ్చి ఆతిథ్యం స్వీకరించాలని వాంఛిస్తున్నారు' అని మేగ్‌లింగ్ పాదరీ వ్రాసిన ఉత్తరం వచ్చిచేరింది. క్యాసామైజర్ 'ఆహ్వానం అంగీకరిస్తున్నాం. భగవంతునికృపచేత రాజుగారికి త్వరగా గుణంకలగాలి. ఆపైన మేం రావడానికి అనుకూలమైనసమయం ఏదో తెలియబరుస్తాం' అని జవాబు వ్రాసాడు.

# 36

తిరిగివస్తాను అని మంత్రులను ఉండమనిచెప్పి, లోపలికివెళ్ళి నరాణి రాజును ప్రక్కపై పరుండ జేసి, దాసినిపిలిచి గాలి వీచవలసిందిగాచెప్పి, తనచేతితోనే నుదుటికి, చెంపకు, గొంతుకకు పన్నీరుచల్లి మృదులంగా నిమిరి దాసితో 'క్షణం చూస్తూవుండు, వస్తా' అనిచెప్పి మంత్రు లున్నతావుకు వచ్చింది. వచ్చిచూస్తే అప్పటికే మంత్రులు వెళ్లిపోయారు. అక్కడనున్న బసవన్న 'మంత్రులు రేపు తిరిగివస్తామని చెప్పారు అమ్మాజీ!' అని తెలియజేశాడు

రాణి మళ్ళీ రాజుదగ్గిరకు వచ్చిచేరింది.

రాజభవనంబైట అడుగు పెట్టిందేతడవుగా బోపణ్ణకు పట్టరానికోపం పొంగివచ్చింది. 'చూశారా? అయ్యవారూ! ఈ తిక్కరాజువంశం ఎటువంటిమాట ఆడగలిగింది? కొడగు ఆడదానిగర్భాన జన్మించి, కొడగుస్త్రీని పెళ్ళాడినా ఈరాజుకు ఇంకా తెలియలేదు, కొడగుల స్వభావమెట్టిదో! నేను దేవుణ్ణికాదు. నన్ను అంటే అన్నాడు అనుకో; పెండ్లాడిన తన గృహ లక్ష్మినిపట్టుకొని ఇటువంటిమాట అన్నాడే! వీడు రాజా! రాజుగా వుండొచ్చా? ఈమాట అన్నవానిదగ్గిర నేను మంత్రిగా వుండొచ్చా?' అన్నాడు.

లక్ష్మినారాయణయ్య 'రాజుగారికి బుద్ధిచాలదు బోపణ్ణా! చదువుసంధ్యలు లేకుండా పెరిగారు; ప్రవర్తన సుశిక్షితం కాదు. అనుకొని లాభంలేదు. అయితే రాజుమాట, లేక నీ, నామాటగా అంతం కాలేదు. రాజగృహంమాటంటే ఊరిమాట. వాడవాడకు చెందినమాట. మనం కోపగించుకొని బిగిసి కూచుంటే దేశంగతి ఏమిటి?' అని అన్నాడు.

'దేశంగతి వేరేగతి అయ్యవారూ! ఈయనకథ ఇహ ముగిసినట్లే. ముష్టివాళ్ళ వంశం గదా! అడుక్కుతినేవాడు పెద్దఅయితే ఎట్లా వుంటుంది. ఆ కోవకు ఆ నాలుక, ఏవాడపెట్ట కావాడ పలుకు.'

'బోపణ్ణ! నీకు కోపంరావడం ఉచితమే. కాని కోపంలో అనేమాటలు సరిగావు.'

'చిత్తం అయ్యవారూ! ఆమాట నేను ఇప్పుడు చెప్పటంలేదు. ఇహమీదట నేను పొన్నప్పపక్షం. నాకు ఈయన రాజుగాడు నేను మంత్రిని కాదు ముగ్గురు ఇతన్ని అనుస రించుకొని వుంటూవున్నాం. ఇద్దరయ్యారు. ఇద్దరిలో ఇప్పుడు మీరొక్కరే అయ్యారు.'

'నేనొక్కణ్ణిమాత్రం మిమ్మల్ని అందర్నీవదలి ఎన్నాళ్లుంటాను? పోదాం అన్నా లాభం?'

'అది అట్లావుంచినీ. తురకిలువచ్చి అంతా గందరగోళం చేసింతర్వాత ఎవరు మంత్రి ఎవరు రాజు ? ఈ బిచ్చగాళ్ళవంశం నశించేపోయింది. దేశానికి ఏంలోటు వచ్చింది ? దొడ్డ రాజుగారు చెర విడిపించుకొనివచ్చి 'తక్కడి'ను కలుసుకొని, ఆయనను దగ్గిరకుచేరదీసి, దేశానికి ఒక పెద్దగా ఏర్పాటుచేశారు. తిరిగి కొడగు రాజుగారిదింటూ అయింది. పెద్దవాడు పుట్టాడు, పెద్దగా హుందాగా పెరిగాడు, కొడగునేలకు గౌరవం చేకూర్చి గొప్పచేశాడు. తానూ గొప్ప అనిపించుకున్నాడు. పురుగుపుట్టి, పురుగులాపెరిగి, కొడగునేలంతా పాములపుట్ట చేసాడు. ఎవరో పాముతల చితకపొడుస్తారు. దాంతో కథ ముగుస్తుంది. తిరిగి వెనకటిలాగా దేశం వుంటుంది. దానికితగ్గవాళ్లూ వుంటారు.'

వీరరాజు బోపణ్ణనుగురించి ఆడినమాట ఎంత చెడ్డదో లక్ష్మీనారాయణయ్యకు తెలియక పోలేదు. అటువంటిమాటలకు బోపణ్ణమనస్సు కోసిపోవడం సహజమే. రాజు ఏదో కార ణంతో మితిమీరిమాటాడితే మంత్రి అతనికివిరోధంగా నిలబడడమా ! మరి దేశం ముందుకు ఎలా నడుస్తుంది ? మంత్రిగాఉన్న తనవంటివాడిస్థితి ఏమిటి ?

రాజుకు మంత్రికి సరిపడకపోవడమనేది కొడగుచరిత్రలో కొత్తపుట్టం ఏమీకాదు. అటు వంటిసందర్భంలో ఎప్పుడేమైంది జనానికి జ్ఞాపకమే. ఎప్పుడో వెనకటిమాటకాదు. లింగ రాజు రాజు కావాలనుకొని అతడు కారియప్పను కొఱ్ఱుకెక్కించి చంపాడు. దొడ్డరాజు గతిం చినప్పుట దేవమ్మాజి రాణి అయింది. సోదెయనాయకుడు ఆమెగారి మంత్రి. తాను రాజు కాకుండాపోనీ మంత్రియైనా కాకూడదా అని లింగరాజుకు దుఃఖం. ఆసమయంలో ఇతన్ని చూసి చింతపడి కారియప్పతోటి తక్కరులనందరినీ పిలిచి 'బైట ఎంతపెద్దదైనా కానీ మన దేశంలో ఎందుకు మంత్రికావాలి. మనపెద్దలు మనకు లేరా ? లింగరాజు మంత్రికావడమే మంచిది. ఇది మాకు సమ్మతం' అని నిర్ణయం చేయించాడు. సోదెయనాయకుడు మంత్రి త్వాన్ని వదులుకోవలసినవా డయ్యాడు. లింగరాజు మంత్రి అయ్యాడు. మంత్రి అయిన ఓ సంవత్సరంలో ఆయన తానే ప్రభువుకావాలి అని కోరుకొంటే కారియప్ప అందుకు ఒప్పుకోలేదు. దేవమ్మాజి రాణి అవడం, దొడ్డరాజుగారి కోరిక - అది అట్లే సాగనీ అని అన్నాడు. కారియప్ప తనకు మంత్రిపదవి సంపాదించిపెట్టినవాడనేమాటకూడ మరచిపోయి లింగరాజు అతనిని తనవిరోధిగా భావించాడు. తాను బలవంతంగా గద్దెకెక్కినతర్వాత కారి యప్పమీద ఒక అసత్యనేరం మోపాడు. అతడూ, అతనిపెండ్లాం తన్ను చంపించడానికి ప్రయత్నించారంటూ. అతని కొఱ్ఱుకెక్కించి, అతని పెళ్ళాన్ని వెలివాడకు వెడలనడిచాడు. రాజుకు వివేకం లేకపోతే వెలివాడలోని జనానికి వివేకం లేదా ? కారియప్పంతటి దొడ్డవాని భార్యను తమచెంతకు చేర్చుకొనేటంతటి ధార్ష్ట్యానికి పాలుపడలేదు. కారియప్ప కొఱ్ఱుమీఁద చనిపోయాడు. అతని భార్య ఎదురుగా-ఏడురోజులు అన్నాహారాలులేకుండా అటమటించి ఎనిమిదోరోజు కళ్ళు మూసింది. ఈ సంఘటనగడచి ఇంకా ఇరవైఐదేళ్ళు నిండీ నిండక !

కారియప్ప అప్పట్లో చివాసు. ఇప్పటిరాజుకు 'లింగరాజు కున్నంత స్తోమతులేదు. అయినా, అతడు తలచుకుంటే బసవన్న, బోపణ్ణప్రాణాలు తీయించడానికి జంకేపటం కాదు. ఆ విమ్మట జనం తిరగబడవచ్చు. మర్యాద మంటిపాలు చేయవచ్చు. అది వేరేవిషయం. కాని బోపణ్ణ తిరిగి బ్రదికి పట్టగట్టటం అనుమానం. వ్యవహారం ఇంతదూరంరావడం లక్ష్మీనారాయణయ్యకు బాగులేదనిపించింది. ఇటువంటి అనర్థం ఎదురుచూస్తోందంటే రాజు బెదిరేపటం కాదు. బోపణ్ణ బెదిరేవాడుకాదు. ఇరువురిస్వభావం వచ్చేదెదో రానీ అని మొండికేసే స్వభావం. రాజుకు బుద్ధిబోధించి రానున్న చెట్ట తప్పింపలేం. ఏమైనా, బోపణ్ణనే మన నొప్పింపాలి. ఓర్పుకొనేటట్లు చెయ్యాలి. ఈవిధంగా పర్యాలోచించి లక్ష్మీనారాయణయ్య అప్పటికి మెదలకుండా వుండిపోయాడు.

# 37

తిరిగి బోపణ్ణ కనబడ్డప్పుడు లక్ష్మీనారాయణయ్య ఎదో పనిమాటముగించి 'రాజుగారికి దేహస్థితి చక్కబడేటంతవరకూ వారు కోపగించుకున్న విషయాన్నిగురించి మన మేమీ మాటాడకూడదుసుమా బోపణ్ణ!' అన్నాడు.

'సరే పంతులుగారూ! నేనేమీ చేసేదిలేదు. ఇహమీద ఎమిచేసినా వారే చేయాలి. వంట్లో ఆరోగ్యం చిక్కనతర్వాత తాము మాటాడింది తప్పుఅంటే మంచిది మహారాజా! అని, మంత్రిపదవి చాలు అని చెప్పేస్తాను' ఆయన మహారాజులై ఏలనీ. నేను ఏదో నా మానాన నేనుంటాను. తప్పైంది నావల్ల అని అంటే చాలు. నేను వారిచేత ఆమాట అనిపించాలి. లేకుంటే నామర్యాద ఏముంది? పాపం అథం కుథం తెలియని ఆ కొడగున్నాటిపిల్ల పెళ్లి చేసి కొన్నపిల్ల, ఆమె మర్యాద ఏం కావాలి? అయితే, మీరు చెప్పినట్లు ఇవన్నీ రాజుగారి ఆరోగ్యం కుదుటపడ్డతరువాత ఆలోచించవలసిన మాటలు.'

'అంతేగా! ఆమాత్రం తాళుకొంటే చాలు. అయినా నోరువిడచి, రాజు తనది తప్పైంది అని చెప్పాలి అని మనం ఒత్తిడి చేయవచ్చా!'

'ఈ పెద్దమాట రాచటికానికి సంబంధించే మాటేమీ కాదు. స్వంతమాట. తప్పైంది అని అంటే రాచటికపు కీవికేమీ లోపం రాదు.'

'అది నిజమేననుకో. ఎట్లాగో నాలుగురోజులు సమాధానపడి నడచుకొని వారికి మంచి బుద్ధి కలిగేటట్లు చేయాలి. ఈ దారిలో పడిపోకుండాచేయడం మన కర్తవ్యం. అమ్మాజీ

శాసనసూత్రాన్ని తనచేతిలోకి తీసుకొనేధోరణిలో లేదు. అందుచేత ఇకమీద మనం రాజునే సరియైనదారిలో నడిపించుకోవాలి.

'ఇప్పుడు వారూ నాకు ప్రభువులే. అయ్యావారూ నేనేమో మంత్రినే వారు ఎన్నేమీ 'ఛో' అనలేదు. నేనూ రాం రాం చెప్పలేదు.'

'ఆమాట నిజం.

'ఇంకోమాట. తప్పైపోయింది అని అననీ, అనకపోనీ ఇంతోటివిషయం మూర్ఖుడులే అని సహించుకొంటాను. మూర్ఖుడైనవిమ్మట ఇతన్ని సింహాసనంపై ఉండనివ్వను. మంచిగాదిగితే సరే సరి; లేకపోతే విద్రోహినై ఇతన్ని దింపేస్తాను. ఓవేళ దింపలేనూ! నేనే సమాప్తమైపోతా. ఆలోచన చేసిచేసి ఈమాట ఈసారి గట్టిచేసికొన్నా.'

'ఇదేవీ, ఇప్పుడు జ్ఞాపకం పెట్టుకోవద్దు. బోపణ్ణా! సావకాశంగా తర్వాత ఆలోచిద్దాం స్థితి బాగుపడటానికి చూద్దాం. ఇటువంటి అహితము జరుగబోతుందంటే ఆమాత్రం తాను గ్రహించలేకపోతారా? ఆయన వాళ్ళి కోల్పోయారని మనంకూడా కోల్పోవడం మంచిదికాదు.'

'మీమాట మీకు బావుంటుంది. ఓర్పుపట్టేది మీగుణం. మీరు సహించివుండాలంటే సహించుకోండి. కాని మీయందు యోగ్యంగా భాసించేది మాకు తప్పె అవుతుంది జనం, ఈ బోపణ్ణ వట్టి నపుంసకుడు, తిట్టినా కొట్టినా పడివుండి ఇంకా రాజప్రాసాదంలోని ఎంగిలికూడుతింటూ కూచున్నాడంటుంది. వేరే జనం అంటే ఏమో అనుకోవచ్చు. కాని తోటి 'తక్కరు'లే అంటారు. కొడగునేలపై పుట్టినవాడు దాన్ని సహించుకోగలడా? ఓర్చుకుంటాం, నిబ్బరించుకుంటాం, ఇంక మిగిలించేవిటి? ఈ సందర్భంలో మీదారికి నాదారికి పొత్తు కలియడంలేదు.'

'మీరు చెప్పినమాట అంతా నాకు నమ్మకమే బోపణ్ణ! కాని మీరు మంత్రిపదవి వదిలితే నేనుమాత్రం పట్టిపెట్టుకొని ఊరేగుతానా? నేనూ వదిలేస్తా-ఇద్దరూ వదలిపెట్టితే, రాజు మిగిలేది అంతంతమాత్రమే. దేశానికి కీడు. దేశహితానికి వేరేమార్గం ఆలోచించి, మనం వదిలిపెట్టాలి. అట్లాకానిచో, దేశానికి క్షేమంలేదు.

'ఈమాట బాగుంది. అయ్యావారూ! ఆలోచించండి. ఏం చేద్దాం చెప్పండి ఇల్లా చేద్దాం అంటే సరేనంటాను.

# 38

వీరరాజుగారు ఈసారి జబ్బుపడడానికి ఒంట్లో ఏదోవిధమైన ప్రకోపం కారణమని వైద్యులు చెప్పారు. దేవిప్రకోపం, ప్రకోపం అంటే ఏమిటి అని ఎవరూ అట్టే పట్టించుకోలేదు. అందరికీ తెలిసిన నిజాన్ని వైద్యులు మర్యాదకోసమని కప్పిపుచ్చి శబ్దజాలంద్వారా వెలిబుచ్చుతారు. ఆవిషయం జనానికి తెలుసు. రాజసౌధానికిచెందిన వైద్యుల శబ్దప్రయోగంకూడ ఇట్టిదేనని అందరికీ తెలుసు.

అందరికీతెలిసిన ఈమాటను అంతరంగగోష్ఠులలోకూడ ఎవరూ నోరువిప్పి చెప్పడం లేదు. అల్లా చెప్పగలిగేది, రాజసౌధంలోని అంతఃపురానికిచెందిన గౌడసాని ముసలిది దొడ్డవ్వ. ఆమె లింగరాజుకాలంనుంచీ, మహల్ పెత్తందారీతనం చేస్తోంది. రాజునూ, బసవన్ననూ, చిన్నప్పటినుంచీ ఎరుగును. బసవన్నను సాకింది ఆమే. పలుకారణాలచేత ముసలికి రాజుతో, బసవన్నతో ఏసంగతిగురించియైనా చనవుగామాటాడే హక్కువుంది.

రాజసౌధం దాసీజనంకోసం ఏర్పడ్డ ఈ స్త్రీవాటిక, రాజుగారికై పట్టుకొనితెచ్చిన పడుచుల్ని ఉంచే స్థలంగా రూపొందింది. పట్టుకొనివచ్చిన పడుచుపిల్ల కొత్తజీవితం సాగించడానికి ఒప్పుకుంటే ఆమెను వేరేఇంటిలో వుంచడానికి ఏర్పాట్లు జరుగుతాయి. వీటన్నిటికి బసవన్న అధికారి. అతని ఆధీనంలోవుంటూ అంతకే పెత్తనం చలాయిస్తూవుంటుంది దొడ్డవ్వ.

వీరరాజు మైమరచి పడివున్నరోజు దొడ్డవ్వ రాజభవనానికివచ్చి రాజును చూసింది. బసవన్నను దూరంగాపిలిచి 'రాజుకు ఒంట్లో సత్తువలేదు. సత్తువ కలగాలంటే ఈ వైద్యుల మందు లాభంలేదు. మలయాళంమందే మందు. కొండకిందికి చెప్పంపించినా మంచిదే. భగవతి ఒక్కతె ప్రస్తుతం వచ్చివుంది. గుట్టక్రింది కాల్వపక్క దేవాలయం కట్టుకొనివుంది అంటారు. ఆమెకు కబురుపెట్టి చూపించడం మంచిది' అంది.

బసవన్న : 'చూద్దాం వుండు' అన్నాడు. అతనికీ, అదే ఎఱుక, అదే నమ్మకం. కానైతే, మొదట వైద్యుల్ని అడిగి వాళ్లేమంటారో చూడాలి. అపిమ్మట రాణి అనుమతిని పొందాలి. ఒకటి రెండురోజుల్లో రాజుకు స్పృహవచ్చినమీదట, బసవన్న వైద్యునితో ఈమాట ఎత్తాడు.

వైద్యుడు లోగడనే మలయాళ భగవతిసంగతి వినేవున్నాడు. ఆమె మడకేరిలో ఒక భాగ్యవంతుని ఇంటికి వచ్చినప్పుడు ఆమెను చూసికూడవున్నాడు. ఆమెతో కొద్దిసేపు మాటాడాడుకూడా. ఆమె తీరు, ఆమె గడుసుతనం, ఆమె నిజంగా ఒక దక్షతగలిగిన వైద్యురాలని అతడు భావించుకొన్నాడు. ఆమెస్నేహం సంపాదిస్తే ఆమెనుంచి కొన్ని అమూల్య

ముల్లైన ఔషధాలు సంపాదించవచ్చునని అతని ఆశ. రాజప్రాసాదానికి ఆమె రావడానికి ఒప్పుకొంటే ఆమెతో మైత్రి పెంపొందించుకునే అవకాశం చిక్కుతుంది. వైద్యుడు 'భగవతి చాల తెలిసినమనిషి. ఆమెను పిలిపించి చూపించడం చాలామంచిది' అన్నాడు. 'అయితే భగవతికి ఎవిధమైన అసంతృప్తి కలగనివ్వకూడదు. ఈ ఉపాసనలూ, ఔషధాలా మాటే ఇట్టిది. మందుయోగ్యత చాల స్వల్పం. దానికి భగవతిచేసే ఉపాసననుంచి హెచ్చు శక్తి వస్తుంది. ఆ ఉపాసనకు కావలసినసౌకర్యమంతా మనం కల్పించాల్సివుంటుంది' అని హెచ్చరిక చేశాడు.

బసవన్న : 'ఓ ! దానికేం ! అమ్మాజీ సరేనంటే దాన్నంతటినీ ఏర్పాటు చేసినట్లే' అని జవాబిచ్చాడు. మరుసటిరోజు రాణికి ఆసంగతిని తెలిపాడు.

రాణి ఆరోజు దీక్షితులు దైవప్రసాదాన్ని తెచ్చినప్పుడు, వారికి జ్ఞాపకం చేసింది. 'భగవతిని తెప్పిద్దామనివుంది. ఇందలి మంచిచెడ్డలు మీరు చెప్పాలి' అంది.

దీక్షితులుకూడ భగవతివిషయం వినివున్నాడు. అయితే ఆమెను ఎప్పుడూ చూడలేదు. ఆమెవచ్చి కొద్దినెలలే అయినప్పటికీ, మడకేరి, దానిచుట్టుప్రక్కల సీమలో ఆమె పలుకుబడి బాగా పెరిగిపోయిందని ఆయన వినివున్నాడు. ప్రజలు భగవతి చాలా దర్పంగల స్త్రీ అని కూడా చెప్పుకుంటున్నారు.

రాణి ప్రశ్నకు దీక్షితులు 'రప్పించవచ్చు. అభ్యంతరంలేదు. అయితే వచ్చింతర్వాత కనుగలిగి నడచుకోవాలి' అన్నాడు.

ప్రమత్తులమైవుంటే చెట్ట చేకూరుతుంది కదా ?'

'అంతా దైవీశక్తి. ఇక్కడ ఓంకారేశ్వరి. అక్కడ మహాకాళి. అదివేరు ఇదివేరా ? ఇక్కడ ప్రసన్నమూర్తి దేవి. అక్కడ ఉగ్రమూర్తి. ఇక్కడ మనం చాలవినయంగా సాత్త్వికమైన పూజ లుపచరిస్తాం. అక్కడ ఉపాసకురాలు లోకమాతను హఠంతో పూజిస్తుంది. ఇక్కడ దైవకృప మెల్లిగా ప్రసరిస్తుంది. శరీరానికి చిందులూ శివాలూ ఉండవు. అక్కడ దైవకృప వేగంగా ప్రసరిస్తుంది. దానివేగం హెచ్చు. ఫలం తీవ్రం. అపచారమని అనుకోకుండావుంటే ఓమాట చెప్పాలి. ఈశ్వరకృపాప్రసారం నిదానంగా జరిగితేనే ఎక్కువ క్షేమం; భగవతిప్రసాదం చాల ఉగ్రమూ, తీవ్రమూ అయినది.'

'జనం ఆమెను భగవతి అని అంటారే అయ్యవారూ !'

'భగవతిఅంటే మహాకాళి. ఆమె దేవ్యుపాసకురాలు. ఉపాసన సిద్ధింపవలెనంటే ఎంతో నిష్ఠగా జీవితం గడపాలి. బైటిజనానికి దేవత ఏమిటి, ఉపాసకురా లేమిటి ? భగవతి ఉపాసకురాలు అని ఇంతపొడవుగా చెప్పడానికిబదులు భగవతి అని అంటూవుంటారు.

'హెచ్చుతగ్గులు అయితే కష్టం. అందుకని పిలవకుండావుంటే బావుంటుందనిస్తోంది.'

లోచనలు చేసేవాడుకాదు. అయినా ఆపాటి అసూయ వుండకూడదని ఎక్కడవుంది ? రాణి బసవన్నతో 'భగవతి ప్రస్తుతం రాజభవనానికి రావలసిన అవసరంలేదు. కాని ప్రత్యక్షమై వున్న దేవతకు దేశంలో పూజలు నడుస్తూవుంటే మే మాసంగతే పట్టించుకోనట్లు వుండ కూడదు. రాజభవనంనుంచి ఒక్కరోజు పూజకై ఏర్పాటుచేయించు-ఆ బాధ్యతఅంతా నీవే వహించు' అంది.

బసవన్నకు కావాలిసింది ఆమాత్రం అనుమతే. రాణి సమ్మతింపకున్నా, భగవతి మూలంగా రాజుకు ఏమైనా మేలు చేకూరుతుందేమో విచారించేవాడే. మేలు అంటే రాణి దృష్టిలోనూ, ఇతరజనదృష్టిలోనూ మేలనిపించుకొనేవిషయం కాదు. రాజుయొక్క కాముక మైనదృష్టికీ, అతని నర్మసచివుడైన బసవన్నదృష్టికీ మంచిగావుండేవిషయం. అతడు రాణి అనుమతి లభించిందని దొడ్డవ్వకు చెప్పాడు.

దొడ్డవ్వ : 'అమ్మాజి ! ఒప్పుకోవడం ఎంతైనా మంచిదైంది. లేకుండావుంటే మనం రహస్యంగా వెళ్ల వలసి వచ్చేది. భగవతి అందుకు ఒప్పుకొనేది కాదు' అంది.

దొడ్డవ్వమాటలద్వారా, ఆమె ఇదివరకే భగవతిని మాటాడించినట్లు, రాజభవనంనుండి సరైనపిలుపు వస్తేనేగాని రానని భగవతి చెప్పినట్లు, అతనికి బోధపడింది. బసవన్న 'అట్లా అయితే నువ్వు భగవతిని అప్పుడే చూశావా ?' అని అడిగాడు.

'చూడకుండావుంటే రాజుగారు మనకు మిగిలేవారేకారు. నేను చేయించాల్సిన పూజ నేను చేయించనే చేయించా. లేకపోతే, ప్రభువుకు ఇంతత్వరగా ఎక్కడనుంచి నయ మయ్యేది ?'

'అల్లానా ఏమవ్వా ! వైద్యుని ఔషధం, భట్టుపూజ, పాదరీమందు, ఇవేవీకాకుండా భగవతిచేసిన మాయే గొప్పదంటావా ?'

'అయ్యో ! నా తంత్రికాన ! వైద్యునిసంగతి వేరనుకో. ఆయన దానికీ సరి, దీనికీ సరి. దీక్షితులు, పాదిరీ, కుడిప్రక్కవాళ్ళు (దక్షిణమార్గులు). ఎడమప్రక్కరోగానికి (వామాచార సంబంధి) కుడిప్రక్కపూజలు (దక్షిణాచారం) ఎందుకు పనికొస్తాయి. దెయ్యాన్ని వదలించా లంటే అగరువత్తితెస్తే ఏం లాభం ? చీపురుకట్ట తేవాలిగాని. రాజుగారికివచ్చింది సామాన్య మైన రోగమా ? ఇక్కడ నువ్వు ఈ మందుసేవ చేయిస్తుంటే నే నక్కడ భగవతిపూజ చేయించాను. లేకపోతే వారికివచ్చినరోగానికి వారు బ్రతికేవారేనా ?'

'ఇటువంటిప్రమేయంలో నువ్వింత ఏలా స్వతంత్రించావు దొడ్డవ్వా ?'

'ఇందులో స్వసంతరం ఏముంది బిడ్డా ! రాజు నా బిడ్డకాదా : అవ్వాజిపాలు ఓ పీసం, నా పాలు పదిహేనుపాళ్ళు. బసవన్న నవ్వాడు. క్షణముండి 'అల్లాఅయితే నువ్వు ఈ అమ్మ ఎవరో ఎరుగుదువా ?' అని అడిగాడు.

'ఆ ! ఎరగకేం ? నే నెరగని భగవతి ఎక్కడనుంచి వచ్చింది ?'

'ఎవరు ఈ అమ్మ ? మలయాళంనుండివచ్చి అయిదారునెలలు అయిందంటారే ?'

'మలయాళంనుంచివచ్చి ఆరునెలలు అయింది నిజమే. మలయాళానికిపోయి ఎన్ని ఏండ్లయింది ఎవరికీ తెలియదు.'

'అయితే భగవతి ఇక్కడి తల్లేనా ?'

'ఇహ నన్నేమీ అడగకుబాబు ! నేను నోరుతెరిస్తే తప్పు. తెరవకూడదని ఒట్టు పెట్టుకున్నా. ఇంటిమీద, పిల్లలమీద, నామీద ఒట్టు పెట్టా. ఒట్టు భంగంచేయకూడదు. అంతా నీకే తెలుస్తుంది. ఆపైని అడుగు.'

దొడ్డవ్వమాట బసవన్నలో కుతూహలాన్ని రేకెత్తింపజేసింది కాని ఇట్లా అయిన పిమ్మట ఆమె ఈమాటను ముందుకు సాగనివ్వదని అతనికితెలుసు. అందుకని అప్పటికా ప్రసంగం కట్టిపెట్టి ఓ నౌకర్ని పిలిచి 'ఒరేయి అబ్బిగా ! రేపు పూజ చేయించడానికని వస్తాం అని భగవతిగారి మందిరానికివెళ్ళి చెప్పు' అన్నాడు.

# 40

మరునటిదినం బసవన్న రాజుకు తాను భగవతిసన్నిధిని పూజచేయించడానికి వెళ్ళివస్తానని చెప్పాడు. రాజు 'ఎక్కడికైనాపోయి చావు. నీవల్ల ఇక్కడయ్యేది ఏమిటి ?' అన్నాడు.

బసవ : 'అదె సరిదిద్దుకొని వస్తా దొరా ! భగవతి మనస్సుకువస్తే పోయినప్రాయం తిరిగి వస్తుందట '

'వస్తుందేం నీ [1] పిండాకుడు ? ఇంకా ఏముంది ఈ వంట్లో ? నీకు జతగా ఆడేదానికి నా ప్రాణం నిలబెట్టాలని ప్రయత్నిస్తావు ?'

'శరీరం వుండేది ప్రయత్నం చేయడానికే దొరా ! ఇవ్వాళ ప్రయత్నం. రేపు సిద్ధి. నేను నయం చేయిస్తాను. మీరు చూస్తూవుండండి.'

'నిన్నెవ్వ రొద్దన్నారురా ముండమోపి ! ఏమేమి చేయదలచుకున్నావో చెయ్యి పో. అందరికి నేను దొరను. నువ్వు నాకు దొరవు.'

రాజు ప్రసన్నుడయ్యాడు, బసవన్న నమస్కరించి బైటపడ్డాడు.

అంతకుముందే పూజాద్రవ్యాలు పదిమంది నౌకర్లు తలమీద మోసికొనివెళ్ళారు. భగవతి ఆజ్ఞాప్రకారం పూజ నడిచేసమయంలో బసవన్న ఒక్కడే దేవాలయంలో వుండాలి. వేరే

1. పిండం కూడు 'పిండాకుడు'గా మారింది.

ఎవరైనావుండి, పూజనుచూస్తే ఆ పూజ నిష్ఫలమౌతుంది. అందుచేత పూజాద్రవ్యాలు మోసుకుపోయినవౌకర్లు వెనక్కు వచ్చేశారు. బసవన్న ఒకగుర్రాన్ని ఎక్కి ఆశ్రమంవున్న సమప్రదేశానికివెళ్లి, కాల్వదగ్గిరదిగి, అక్కడనుంచి మందిరందాకా కాలిదారిగా వెళ్ళాడు.

మందిరంచుట్టూ పచ్చని తీగెలల్లుకొనివున్నాయి. తీగెలగుండా లోపలికి వెళ్లడానికి ఓవారి అక్కడ ఓ మహిళ నిలబడివుంది. ఆమె 'కుంటి'ని కనుసన్నచేసి పిలిచి లోపలికి పోవడానికి దారిచూపింది.

మందిరమనేది గుట్ట అడుగునందున్న పాతకాలపు గుహ. గుహలో పూర్వకాలం మతంగమహర్షి కాని, గౌతమఋషికానీ తపస్సు చేసివున్నారని జనులవిశ్వాసం. భగవతి గుహకు ముందుపక్క కర్రలతో నాలుగుగోడలుగా ఆవరణం కట్టించింది. గుహ ముందు ప్రక్క ఒక వాకిలి పెట్టారు. వాకిలికిముందుగా ఒక చప్పరం. దానిమీద ఓ తీగె వ్యాపించి వుంది. మొత్తంమీద మందిరం సమీపించేటప్పటికి అదేదో విశేషమైనస్థానమని భావన కలుగుతుంది. బసవన్నకు మనస్సులో ఒకవిధమైన భయం. ఈ భగవతి బాలదర్పంతో కూడిన స్త్రీ అని జనం చెప్పివున్నారు.

ఆమె ఏమి అడుగుతుందో తానేమిచెప్పాలో, ఏమాట చెప్పొచ్చు, ఏమాట చెప్ప కూడదు, రాజు శరీరం బొత్తిగా నిస్సత్తువై పోయింది. అతనికి శక్తి వచ్చేటట్లు చూడు అని చెప్పాలి మొత్తంమీద. దీనిని ఏ మాటలద్వారా చెప్పడం? అని ఈవిధమైన ఆలోచనాపరం పరలో మునిగితేలుతూ అతడు వాకిలి గుమ్మందగ్గిరకు వచ్చాడు. ఒక్కక్షణంమాత్రం అత నికి మందిరంవాకిలిలో భగవతిమూర్తి కనబడింది. అతడు దూరంనుంచే చేతులు జోడిం చాడు. ముందుకు అడుగు ఉంచాడు.

బసవన్న కుంటుతూ కుంటుతూ వాకిలిదగ్గిరకు జరగడంలో భగవతి ఏకైకదృష్టితో అతన్నిచూస్తూవుంది. ఆమెవంకచూసి బసవన్నకు కొంచెం భయం, హెచ్చు మెప్పుదల, కల భావన ఒకటి కలిగింది. ఆహా! ఎంత గంభీరమైనమూర్తి. వయస్సునిండిన మోహం అయితేమాత్రం! అందులో కనవచ్చే ఆ కాంతిపుంజం!

ఒకేతీరున రెప్పవాల్చకుండా చూడటం మంచిదికాదు అని బసవన్న కన్ను కొంచెం మరల్చాడు. తిరిగి తల యెత్తేసరికి భగవతి తన కుడిచేత్తో కంటిదగ్గిర ఏదో రాచినట్లు కన బడింది. అప్పటికి అతడు ఆమెదగ్గిరకు చేరనేచేరాడు. ఆమెకళ్లు అశ్రుభరితాలవడం అతను చూశాడు.

భగవతి బసవన్నకు లోపలికిరా అని సైగచేసి లోపలప్రక్కకు తిరిగింది. ఆమెమూర్తి ముందుప్రక్కనుంచి ఎంత ఠీవిగావుంటుందో వెనకప్రక్కనుంచికూడా అంతే ఠీవిగా వుంటుంది. విశ్వవిఖ్యాతమైన నిడివి, పెద్దతల బసవన్న 'నా మోహం భగవతి! ఈమె నిండైన ప్రౌఢ' అనుకొన్నాడు.

భగవతి బసవన్నను గుహలోకి పిలుచుకొనిపోయింది. గుహలో మూడుగదులు. మధ్య గది వెనుకగోడకు అంటుకొనివున్న రెండుతలుపులు మిగతా రెండుగదులకు తలుపులవుతాయి. కుడివైపుగదిలో ఒక పెద్ద దీపంవెలుతురు కన్పడుతోంది. ఎడంప్రక్కగదిలో వెలుతురు తక్కువ. మధ్యగదిలో వెనుకప్రక్క ఒకగూటిలో ఒకపటము, దానికెదురుగుండా వెలుగుతూవున్న ప్రమిద ఒకటి :

# 41

భగవతి బసవన్నకు భగవన్మందిరానికిబైట నేలమీద కూచోమని అనుమతించి తాను లోనికి వెళ్లింది. దైవమందిరంలో వాకిలిప్రక్కకు ముఖంగా గదిమధ్య దేవిమూర్తి వుంది. అది ఒకవిధమైనలోహంతోచేసిన మూర్తి. రాగో, బంగారమో అనే సందేహం పుట్టించే అందమైన ఒక లోహం. అది బహుశః ఆగమవిధానంప్రకారం భగవద్విగ్రహాల్ని మూర్తీకరించడానికి పూర్వీకులు నియమించివుంచిన పంచలోహం అనేపేరిట మిశ్రలోహం కావచ్చు. మూర్తి సామాన్యంగా దేవాలయాల్లోని విగ్రహాలకంటె ఎత్తుగా దాని ముక్కు, మోహం చక్కగా దిద్దినట్లు చెక్కబడివున్నాయి. లోకాన్నిపాలించేశక్తి కొంచెంపాటిదికాదని తోప చేసేటట్లు దానియందలి భావం, ముద్ర, దర్పంగావుండి భయభక్తుల్ని కలగజేస్తున్నాయి. మూర్తిచేతిలో ఓ కత్తి. మూర్తిఆకారంలోని గాంభీర్యాన్ని దర్పాన్ని హెచ్చించేటట్లుగా దానికి పుష్పాలంకారం చేయబడింది. దానిలో కెంపువర్ణం విశేషం. భయం పుట్టడానికి కారణం - ఆ కెంపువర్ణం గదిఅంతానిండి కళ్ళకు మిరుమిట్లు గొలుపుతూవుండడం-మూర్తికి ఎదురుగా పూలరాశిమధ్య, కుంకుమ ఒకరాశిగా గోపురాకృతిలో పోయబడివుంది.

బసవన్న అందంగా గుళ్ళు గోపురాలచుట్టూ తిరిగినవాడుకాడు. ఇటువంటి దైవ సాన్నిధ్యం ఇదివరకెన్నడూ అతడు చూచిండలేదు. మొత్తంమీద అతనికి ఇక్కడకు రావడంతప్పయిందేమో అనిపించడానికి ఈ కలిగిన మొదటిభయమే కారణం. గుహలోని చీకట్లు, అర్చకురాలి మౌనగంభీరమైన ఎర్రనిరంగుల దర్పం, అతనికి సహింపరానివైనాయి. ఎక్కడ లోగడ అనుభూతికిరాని ఒకానొకభక్తిభావన అతనిలో జాగృతమైంది. కూచున్న వడాన చేతులుజోడించి మూర్తిపైపు తదేకదృష్టితో చూశాడు. అతనిగుండెల్లో గుడ్లగూబలు కూశాయి.

భగవతి మూర్తిఎదురుగా కూచొని ఒక పుస్తకాన్ని తెరచి ఎదురుగుండా పెట్టుకొంది. మూర్తి రెండుప్రక్కలవున్న హారతిబొమ్మలచేతుల్లోని వత్తిని సరిచేసి, వెలిగించి, వెలుగును

పెద్దచేసి బసవన్న వైపు తిరిగి 'నోరు తెరవకు' అని సైగలద్వారా తెలియజేసి తాను పుస్తకం తీసి మంత్రాలు పఠించడం మొదలుపెట్టింది.

భగవతి కంఠధ్వని విన్నక్షణంలో బసవన్న భయకంపితుడయ్యాడు. ఆ ధ్వని అంత గంభీరమైంది, ఉన్నతమైంది! ఆమె ఆకృతి ఎంత అపూర్వమో, ఆమె కంఠధ్వనికూడ అంత అద్భుతమనిపించింది అతనికి.

ఆ మంత్రపాఠం ఎంతప్రొద్దునడిచిందో బసవన్న ఊహించలేకపోయాడు. రెండుగడియలో మూడుగడియలో అనుకోవడానికి, అది చాలాసేపు సాగింది. మంత్రపాఠం మధ్య మధ్యల, అయిదునిమిషాలకు, పదినిమిషాలకు ఓసారి భగవతి ఇంత కుంకుమ ఇన్ని పూలూతీసి మూర్తిచరణాలకు సమర్పిస్తూవుండేది. అయిదేసినిమిషాలకు, పదేసినిమిషాలకు, మూర్తివైపు దృష్టిసారించి చేతులు జోడించేది. ఈ తతంగమంతా బసవన్నమనస్సులో, ఈస్థలం సామాన్యమైంది కాదు, ఈ మూర్తి సామాన్యమైందికాదు, ఈ అర్చకురాలు సామాన్యురాలు కాదు అనేభావాన్ని నాటుకొనేటట్లు చేసింది.

సావధానంగా నడిచిన ఆ అర్చన ముగిసింతర్వాత భగవతి తాను లేచినిలబడి బసవన్నకు నిలబడమనిసైగచేసి మొదట సిద్ధంచేసివుంచిన కర్పూరనీరాజనం మూర్తికి నివాళులిచ్చింది. ఆసమయంలో ఆమె చెప్పినమంత్రం, ఇదివరకు తాను దీక్షితులవారు చెప్పగా విన్నదేనని బసవన్నకు తోచింది. హారతిముగించి భగవతి మూర్తి సన్నిధినుంచి అయిదు గుప్పిళ్ల పూలు, అయిదుగుప్పిళ్ల కుంకుమ తీసి రాజభవనంనుంచి వచ్చినపళ్ళెరములో ఉంచి, దాన్నితెచ్చి బసవన్నముందు పెట్టింది. 'ఈపొద్దుపూజ పూర్తిఅయింది. ఇది ఐదురోజులు తక్కువకాకుండా నడవవలసినపూజ. మీ వీలుబడిని వారానికి, రెండువారాలకి ఓ పూజ చేయిస్తూవుండండి' అంది.

బసవ: 'సరేనమ్మా' అన్నాడు.

'మేము రాణిగారికి చెప్పదలచుకున్నమాట వుంది. రాజభవనానికి వస్తాం. ఈసంగతి వారికి చెప్పు.'

'అల్లాగే తల్లీ!'

ఈవిధంగా జవాబిస్తూ, బసవన్నకు లోపలలోపల భగవతి తన్ను ఏకవచనంతో సంబోధించడానికి కారణం ఏమిటా అని ఆలోచన కలిగింది. తాను మంత్రిననేసంగతి ఈమెకు తెలియదా? లేక తెలిసినా తాను కుంటిననే నేరానికి తన్నుచూస్తే చులకనేమో? లేక భగవతి అయిన ఆమె, అందరినీ ఇల్లాగే పిలవాలేమో?

అది ఎట్లావున్నా తాను అక్కడినుండి వెంటనే వెళ్ళిపోవాలి అనుకున్నాడు. ప్రసాదం పళ్ళెరాలు రెండు తీసుకొని 'పీటిని ఇహ తీసుకొనిపొమ్మేదా?' అన్నాడు.

'నువ్వు గుర్రంమీద వచ్చావా?'

'ఔను.'

'అది కాల్వదగ్గిర వుందా ?'

'అవును.'

'మంచిది. మా సేవకులు దాన్ని అక్కడకు తెచ్చిపెడుతారు.'

బసవన్న 'మంచిదమ్మా!' అన్నాడు. కుంటుతూ వాకిలివైపు అడుగుపెట్టాడు.

అనిమిషంలో ఏమైందో యేమో అతడేమీ చూడలేదు. భగవతి భుజాలురెండూ అతన్ని కప్పివేసాయి. ఆమె అతనిని వెనక్కులాగి కౌగిలించుకొంది. అతనితలను తనగుండెకు అన్చి తలమీద తన చెంపపెట్టి ఒత్తింది. అనిమిషంలో ఆమె వెనవెని వనవని ఏడ్చినట్లు అతనికి ధ్వని వినిపించింది. మరుక్షణంలో ఆమె అతన్ని వదిలేసింది. శీఘ్రంగా దూరంగావెళ్ళి నిల బడింది. 'ఇక్కడ ఇంక నిలబడకు. పో. ఇక్కడి ఏమిజరిగిందీ, రెండోకంటివానికి తెలియ కూడదు జాగ్రత్త:' అంది.

బసవన్నకంటె ముందుగా బైటకుపోయి వైట వాకిలిలోనిలబడ్డ దాసీని పిలిచి, లోపలికి దేవమందిరంలోకి వెళ్ళిపోయింది.

బసవన్నకు ఆమె ఈ ఉద్దిత్తమైన నడవడిక, అర్థం కాదు. అతడు తికమక పడి పోయాడు. అప్పట్లో వివరంగా ఏ ఆలోచనా చేసేస్థితిలో లేడు. తల ఏదోఅయినట్లయి దాన్ని తడవిచూశాడు. లలితిశిరోజాలు వెడికి ముద్దముద్దిలై వున్నాయి.

అతడు ఈ మహిళ ఇట్లా చేసిందేమా అని అనుకొనవచ్చు. అక్కడ అల్లా ఆలో చించడంకూడా తప్పేనని అతనిభయం. అక్కడ వుండటమే ఇహమీద పొరబాటు. అను కుంటూ, సాధ్యమైనంత తొరతొరగా బైటకు వచ్చిపడ్డాడు. కాల్వదాకా రొప్పుకుంటూ రోజుకుంటూ వచ్చి గుర్రాన్ని ఎక్కాడు. అప్పటికి భగవతి పంపిన దాసి, రెండుపళ్లెరాల్ని అక్కడకు తెచ్చింది. వాటిని ఆమెదగ్గిరనుంచితీసుకొని బసవన్న రాజభవనానికి వెనుదిరిగి వచ్చాడు.

## 42

గుర్రంమీద కూచునివస్తూ బసవన్న సాయంకాలం నాటి తన అనుభవాన్ని, అంతటినీ మన స్సులో నెమరువేస్తూవున్నాడు. దేవమందిరంలో మనస్సులో లోపలలోపల అణచిపెట్టి వుంచినసంగతి అతనికి ఇప్పుడు వెంటాడుతోంది. భగవతి చాల అందమైనమనిషి అనేది.

ఏ రాజభవనంలోనైనా అంతే; మడికేరి రాజభవనంలోనూ అంతే; రాజభవనంమాట అటుంచు. డబ్బువున్న ఏ మనిషి ఇంటిలోనైనా అంతే. 'నన్ను మీరు కొనుక్కొంటారా?' అంటూ అడిగి ఆడదానిసౌందర్యం వ్యాపారానికి వస్తుంది. ఇంటియజమాని శీవాటం మనిషి అని వేరే కనబడిపోయిందో ఇహ చెప్పాల్సిందేమి వుంది?

రాజభవనంలోనిబ్రదుకే సౌందర్యవిపణిగా మారిపోతుంది. వీరరాజు రాజైనదిమొదలు అతనిదృష్టి నాకర్షించడానికి అనేకవిధాలైన అందాలు వచ్చాయి, రాజుదృష్టిప్రసరిస్తే చాలు తాము ధన్యలైపోయామనుకొనేవాళ్లు ఎంతమందో! అంత సులభంగాచిక్కిన అందం క్షుద్రమైందిగనుక రాజుగారిచూపులు ఇంకోవైపు ప్రసరించాయి. ఆయనగారికోరిక వీరిక లెత్తుతుంటే వాటిని తీర్చడం బసవన్న పని. ప్రయత్నపడి అతడు కొంగ్రొత్త 'అందాలబరిణి' లను రాజుగారిచేతి కందిచ్చేవాడు. అయినా తనంతటతాను వలచివచ్చినా లేక ప్రయత్నపూర్వకంగా లభించినా, మొత్తంమీద ఆ సౌందర్యరాశులలో కానరాని ఏదో ఒకవింత చెలువు, ఒకవింత వయ్యారం, వయస్సయిన భగవతిలో కాపురం చేసుకొన్నాయి అని బసవన్నకు తోచింది.

తర్వాత అతనికి 'ఈ మహిళ నిజాయితీ కలదేనా?' సందేహం కలిగింది. ఆమె తనను ఆవిధంగా ఎందుకు కౌగలించుకొంది? పరిచయంలేని మగవాని తల ఆవిధంగా తన ఎదురురొమ్ముమీద ఆన్చికొనివుండిందే? ఈమెకు ఏమి కావాలి? వచ్చిన మగవాళ్ళందరితో ఇదే వ్యవహారమా? కొంపదీసి: కాదంటే తన్నుమాత్రం ఎందుకు అలాచెయ్యాలి? కాముకుడైన రాజు సావాసంలోవుండి బసవన్నకూడా కాముకజీవనంలోని పాడురుచులన్నీ చవిచూశాడు. అయితే తన్నొప్పికొనివచ్చిన యువతులు అందంచూసి రాలేదని అతనికి తెలుసు. ఈ మహిళ ఎందుకు తన్ను ఈవిధంగా వెనక్కుగుంజి మరీ కౌగిలించుకొన్నది?

అట్లా ఆలోచిస్తూవుండగా అతనికోవిషయం జ్ఞాపకంవచ్చింది. మంత్రగాళ్లు, రోగికి నయంకావాలంటే మంత్రంచెప్పి, రోగిని తాకడం, కౌగిలించుకోవడం మొదలైనవి చేస్తారు. అదోక్రమం. రాజుకు శక్తి రావడానికిగాను మనమీపూజ చేయించాం. పూజకు రాణేమో రాలేకపోయె; అతనిపరంగా తాను వెళ్లాడాయె: భగవతి తన్ను కౌగిలించుకోవడం బహుశా రాజుకు శక్తి చేకూర్చేఉపాయం కావచ్చు.

మరిదెట్లా! భగవతి తన్ను కౌగిలించుకొని ఏడ్చిందేమిటి? ఏడుస్తుంటే, వెక్కి వినబడింది. ఆమెకన్నీటితో తన తల తడిసిపోయింది. ఈ ఏడ్పులూ, ఈ వెక్కిలూ ఎందుకు? ఏమైనా ఇదికూడా చికిత్సలో ఓ భాగమేమో?

అట్లా ఏదైనావుంటే తనకు మొదటనే హెచ్చరిక చేసివుండొద్దా? అటువంటిదేం లేకుండా హఠాత్తుగా ఈవిధంగాచేయడం ఆమె అతన్ని సందేహాంబుధిలో ముంచేసింది.

మొదటిసారే ఇంచక్కగా నడిచింది. ఇంకా నాల్గుపూజలు నడవాలి. మధ్యలో ఈమె రాజభవనానికి రావాలి. పూజ ముగిస్తేమాత్రం? రాజభవనానికివచ్చి ఈమె ఏమిటి చెప్తుందో ఏమిటి చేస్తుందో ఇహముందు ఏమి కానుందో? రాజు ఏమిచేస్తాడో? ఊరు దీన్ని ఏవిధంగా గ్రహిస్తుందో?

ఈ సంగతులేమీ చెప్పకుండా బసవన్న రాజభవనంచేరి ప్రసాదం పళ్లెరాన్ని రాణి సన్నిధిలో వుంచాడు. 'భగవతి రాజభవనానికి వస్తారుట. ఇంకా నాలుగురోజులు పూజ జరగాలిట' అన్నాడు.

రాణి: 'మంచిది బసవన్నా!' అంది.

ఆ సమయానికి రాజుగారు తప్పతాగి మైమఱచి తనగదిలో పడివున్నాడు. ప్రసాదం గిసాదం, మాటకు అతడు సామాన్యంగా విలువ ఇవ్వడు. దాన్ని ఇప్పుడు గ్రహించేస్థితిలో లేడు. అయినా రాణి కొంచెం కుంకుమ, రెండుపూలు తీసికొనిపోయి అతనినుదుట కుంకుమబొట్టుపెట్టి పూలను కండ్లకుఅద్ది ప్రక్కనఉంచి తానూ ప్రసాదం కుంకుమను స్వీకరించి, పూవులను తలలో ముడుచుకొన్నది. తన పెజ్జమీదకుపోయి పిల్లకు ఆ కుంకుమపెట్టి కొంచెం ప్రసాదం ఇచ్చింది.

# 43

'మిగిలినపూజ వారానికోసారిగా నడపనీ' అని రాణి ఆజ్ఞాపించింది. ఆవిధంగానే పూజా పురస్కారాలు నెరవేరాయి. రెండోపూజకు, మూడోపూజకు బసవన్న వెళ్లలేదు. నాలుగో పూజకు బసవన్నను రానీ అని భగవతి చెప్పినమీదట అతడు పోయాడు. ఆరోజు భగవతిలో అతనికి మొదటిరోజు వింతనడవడిక ఏమీ కనబడలేదు. 'ఐదోపూజ పైవారం వద్దు. దానికి విశేషమైన ప్రక్రియ నడపవలసివుంది. అంతా సిద్ధంచేసుకొని నేను తెలియజేస్తా'నంది.

నాలుగురోజులు తరువాత, భగవతి ఊరిలోకి వచ్చిందిఅని ఎవరో రాజభవనానికి వార్త అందిచ్చారు. కొంచెం సేపైనతర్వాత ఆమెగారేపంపిన ఒక నౌకరువచ్చి 'భగవతి ఇక్కడికే వస్తున్నారు. రాజభవనానికి తెలియచెయ్యాల్సిందని నన్ను పంపించారు' అన్నాడు.

రాణి: 'ఈమె వచ్చింది. ఇంక కొంచెం ముందుగాతెలిస్తే బాగుండేది. ఈమెకు తగినట్లుగా మర్యాదలుచేయడానికి వీలౌతుందో కాదో' అని అనుకొంది. అయితే ఏమిటి చేయడం? వస్తాం, అని చెప్పినదానిమీదట స్వాగతం పలకాలి. సాధ్యమైనంతమట్టుకు

మర్యాదగా చూడాలి. సేవకులకు 'ఇక్కడ ఈ ఆసనం వెయ్యి. పళ్ళెంలో ఆకులు, వక్కలూ ఉంచండి' అనిచెప్పి తాను భగవతికి ఎదురేగి తీసుకొనిరావడానికి ముఖమండపానికి వచ్చింది.

ఆమె ముఖమండపానికివచ్చి అటూఇటూ చూస్తూవుందోలేదో అప్పటికే భగవతి అక్కడకు వచ్చిచేరింది. ఆమెవెంట ఒక్కత్తే దాసీది. భగవతి దాసీదాన్ని వాకిలిదగ్గిర వుండమనిచెప్పి ముందుకు వచ్చింది. రాణివాసంలోని దాసీది ఆమెకు చేతులు ముకుళించి 'అమ్మగారు ఎదురుచూస్తున్నారు' అంది. భగవతి 'మంచిది' అని సైగతోనే జవాబుచెప్పి, ముఖమండపంలోపలికి వెళ్ళింది.

భగవతి వచ్చేతీరు, నిలబడే వైఖరిలోని సౌకుమార్యంచూసి రాణి ఈమె ఎంతో తెలిసిన తల్లి అని గ్రహించింది. ఆ పెద్దఆవిడరూపం, ఈ చిన్నమ్మకంటికి చాల అందంగా తాన వచ్చింది. మొత్తంమీద భగవతికి చేతులు ముకుళించినప్పుడు, రాణిమెదలో భక్తి తరంగిత మైంది.

భగవతి రాణివిషయమై అట్లె సమ్మోహితురాలు అయింది. జనం రాణిని పొగడుతూ వుండటం తాను విన్నదే. కాని నడివయస్సులోవున్న స్త్రీ ముఖంలో ఇంత ఆకర్షణ, చూపులో ఇంతటి హుందాతనం, పెనవైచికొనివుంటాయని ఆమె ఎప్పుడూ ఊహించుకోనైనా లేదు. భగవతి తనకంటె పెద్దవాళ్ళనుతప్ప మిగతావాళ్లను 'రా' కొట్టి మాటాడుతుంది. రాజభవనానికి వచ్చినామె రాణిని 'రా' 'పో' అనడమేతప్ప 'రండి' 'వెళ్ళండి' అనేది ఆమె ఆలోచించనేలేదు. ఏకవచనప్రయోగమే తగినదని ఆమె అభిప్రాయం. కాని ఎదురుగా చేతులు ముకుళించి నిలబడ్డ ఆ మూర్తినిచూస్తే, ఆమె నోటివెంబడి ఏకవచనం రాలేదు. ఆమెదేవుని ఎదుట, గురువులసమక్షమున తప్ప సామాన్యంగా చేతులు జోడించేదిలేదు. అటువంటిది, చేతులు ముకుళించి నిలబడ్డరాణినిజూచి తానూ అప్రయత్నంగా ముకుళితహస్త అయింది.

'ద్వారబంధందాకా ఎందుకు వచ్చారు ? నే నెల్లాగూ లోపలికి వస్తున్నానుకదూ !' అంది.

'తమరు వచ్చేవిషయం కొంచెం ముందుగా తెలిసివుంటె ఎంతో హెచ్చైనమర్యాదలతో తమకు స్వాగతం చెప్పివుండేవాళ్ళం. ఇప్పుడు ఏం లోపం జరిగినా సహించుకోవాలి' అని రాణి చెప్పింది.

భగవతి : 'మీకో అమ్మాయి ఉందికదూ ?'

రాణి : 'అవును.'

భగవతి : 'పెండ్లివయస్సు వచ్చివుంటుంది.'

'అబ్బే ! అది ఇంకా పసికూన ! అయినా ఆ వయస్సుకు బిడ్డల్ని చంక కెత్తుకున్నవాళ్లూ లేకపోలేదు. రాజభవనంలోని కన్యలకు పెండ్లి కొంచెం నిదానంగా అవుతుంది.'

'మీకో ఆడుబిడ్డ వుంది గాదూ !'

'ఉన్నారు.'

భగవతికి ఈప్రశ్న అడుగకమునుపే ఆమెకు రాజుకూగల పరస్పరవైమనస్యం అంతా తెలుసు. అయినా ఏమీ తెలియనట్లుగా, ఆమె ప్రశ్నించింది. రాణి సహజంగా 'ఆడుబిడ్డ ఒక్కరున్నారు' అనిచెప్పి, 'ఇదేమి: ఈమెకు నిజంగానే ఈసంగతులేమీ తెలియవా? లేక ఈవిధమైనవేషం వేస్తోందా?' అని సందేహించింది. కాని తనసందేహాన్ని పైకి కనబడు నియ్యలేదు.

భగవతి; 'బాంధవ్యంలో మనస్సులు సరిగూడకపోతే, వాటిని సరిచేయడానికి దేవిదగ్గిర సేవలు జరిపించవలసివుంటుంది. ఆసేవలు చాల తొందరగా ఫలిస్తాయి. మీరు ఈసారి చేయించినపూజ ఆగమవిధానానికి చెందింది. ఆ పూజలు తంత్రానికి చెందినవి. వాటికి నియమం, నిష్ఠ హెచ్చు. వ్యయంకూడా కొంచెం హెచ్చే. అయితే రాజభవనం వ్యయానికి వెనకముందులు చూడకూడదు' అంది.

అన్నకూ, చెల్లెలికీ మనస్పర్ధలున్నట్లు ఆమెకు తెలుసునని, ఆమె మాటలధోరణినిబట్టి ధ్వనిస్తూనేవుంది. రాణి 'సంసారం అన్నతరువాత మాటామాటపట్టింపులు లేకుండా వుంటాయా? ఏదో వుండనేవుంటాయి. అంతా కుదుటపడాలి అని మీరు భగవతిని ప్రార్థించండి. తంత్రపూజలు ప్రస్తుతానికి వద్దు' అంది.

'వద్దూ, కావాలి అనేమాట ఇప్పటికిప్పుడే చెప్పనక్కర్లేదు. నిదానంగా ఆలోచించాలి. తోడబుట్టినవాళ్ల సంగతే కాదు. ఆలుమగలు, తల్లిబిడ్డలు, రాజులూ, సేవకులూ ఇదేవిధంగా ఏవిధమైనసంబంధంలోనైనాసరే పొరుపొక్కులుపుట్టితే సరిజేయడానికి తంత్రంలో ప్రయోగాలున్నాయి.'

'మంచిది తల్లీ.'

భగవతి ముందుమాటకు అవకాశం ఇవ్వడంలేదనిగ్రహించి మౌనం ధరించింది. 'పూజలనుచేయించే భక్తులనుచూచే రివాజు. అందుకని ఓసారి ఇల్లా వచ్చాం. చూడటమైంది. తిరిగివస్తాం' అని లేచింది.

రాణి లేచినిలబడి పరిచారికకు సైగచేసి, తాంబూలం వళ్లెరాన్ని తెప్పించి తానే దాన్ని తీసి భగవతిచేతి కందించింది. భగవతి ఆకులూ, వక్కలూతీసికొని వెడలిపోయింది.

# 44

భగవతి తానై రాజభవనంతో సంబంధం పెంచుకోవడానికి ప్రయత్నిస్తోందని బసవన్న మన స్సుకు తట్టింది. ఆమెమాటను మొదట తెచ్చింది దొడ్డవ్వ. ఆ ముసలిదానిమాటలనుండి, ఆమెకు భగవతికి పూర్వపరిచయమున్నట్లు, పూర్వం కొడగులోఉన్న ఆవిడ అనేవంగతి బసవన్నకు తెలియవచ్చింది. ఆమె ఉద్దేశం ఏమిటో? కేవలం రాజుకు మందిచ్చి అతని రోగాన్ని పోగొట్టడమా? లేక అంతకుమించి వేరే ఏమైనావుందా? అని అతనికి అను మానం పుట్టింది.

ఆమె ఒక్క సామాన్యవ్యక్తి అయివుంటే బసవన్న ఒక్కక్షణం వెనకాడకుండా ఆమెవెంట తనజనాన్ని కావలావుంచి పొంచిచూసేవాడు. భగవతి గొప్ప ఉపాసకురాలు. తానేమైనా చేయబోతే ఆమె దేవత తనగొంతు పిసికిపారేస్తే గతేమిటి తనకు? ఈవిధంగా వెనకముందులు, చాలాసార్లు పర్యాలోచించి, చివరకు ఆమెకు ఏమి హాని చేయడానికి కాదు- సంగతి ఏమిటి అని తెలుసుకోవడానికి, ఆమె పోకడ, మాటతీరు కనిపెట్టివుండడానికని ఏర్పాటుచేశాడు. నెలా, రెండునెలల్లో అతనికి భగవతి మడకేరి, మరి చుట్టుపక్కలమున్న అందరి గొప్పవాళ్ళఇళ్ళకూ ఏదో కారణంకల్పించుకొని వెళ్లుతూవుండడం కనిపట్టాడు. వారిలో ఎక్కువమంది రాజుకు కానివారు. బసవన్న నియమించిన వేగువాళ్ళు. అన్నిచోట్లా నడుస్తూవున్న అన్నివిషయాలూ గమనిస్తున్నట్లు లేదు. అయితే అనేకసందర్భాల్లో ఇదంతా గుప్తంగా జరుగుతున్నట్లు తెలుస్తోంది.

భగవతి ఇలా వెళ్లివచ్చిన ఇండ్లల్లో అప్పంగొళకుచెందిన రాజభవనంకూడా ఒకటి. అక్కడ నడచినవృత్తాంతం బసవన్నకు చాలామట్టుకు వివరంగానే తెలుసు.

చెన్నబసవయ్యకు స్వల్పంగానేమో అనారోగ్యం ఏర్పడింది. దాంతో చుట్టూవున్న జనం 'భగవతిని పిలిపించండి' అని చెప్పారు. అల్లా చెప్పడానికికూడా భగవతే కారణం కావచ్చు. చెన్నబసవన్న వాళ్లను పిలిపించాడు. ఆమెవచ్చి పూజలు చేయించండి అంది. అల్లాగే పూజలు చేయించారు. ఆరోగ్యం ఏర్పడ్డతర్వాత చూసేనెపంమీద ఆమె రెండు సార్లు తిరిగి రాజభవనానికి వచ్చింది. ప్రసాదంకూడా స్వతః వంచిపెట్టింది.

మొదటసారే ఆమె చెన్నబసవన్నకూ. రాజవంశానికి మనస్పర్థలున్నాయి అనిచెప్పి దానిని సరిదిద్దడానికి పూజలను నడిపించాల్సిందని చెప్పింది. చెన్నబసవన్న కోవంతో 'దీన్ని సరిదిద్దమని నేను దేవుణ్ణి ప్రార్థిస్తానా? అతన్ని బాగుపడమని నేను వేడను. అతన్ని 'శిక్షించివేయి' అని దయ్యాన్ని పిలుస్తాను' అన్నాడు.

భగవతి సరిదిద్దేటట్లుగాచెప్పి, అతడు రాజకుటుంబంవల్ల తినకైన ఇక్కట్లన్నీ జ్ఞాపకం చేసికొని మండిపడేటట్లు చేసింది. అతడు ఆంగ్లేయులకు ఫిర్యాదుచేసినసంగతి ఆమె అతని నుండి గ్రహించింది. అది మంచిపని అని నోటితో అనకపోయినా 'మంచిదికాదు' అని గట్టిగా చెప్పనూలేదు. చివరకు జరిగిన సంభాషణలో తిరిగి మరోసారి చెన్నబసవన్న ఫిర్యాదు చేసినా తప్పేమీ లేదన్నట్లే ఆమె తన అభిప్రాయాన్ని వ్యక్తంచేసినట్లయింది. చెన్నబసవన్న తలచుకుంటే ఆమె భగవతిసన్నిధానంలో రాజు చెల్లెలు దేవమ్మాజి, సింహాసనం అధిష్ఠించ డానికిగా కావలసినపూజలు నడపేటట్లుగాకూడ కనిపించింది.

'అప్పంగోళ'లో నడచినవృత్తాంతం ఇంతవివరంగా తెలియడంచేత బసవన్న ఆమె రాజుకుగల ఇతరశత్రువర్గంతోకూడ ఇదేధోరణిలో మాటాడుతూవుందేమోనని విచారించడం మొదలుపెట్టాడు. రాజుకు నష్టంవచ్చేతీరున అవిడపోకడలుసాగితే తానేమీ ఊరుకోదలచ లేదు. ఆమెకు ఎదురొడ్డవలసిందే. అయితే తానొక్కడే అంతపని చేయగలడా? ఎవరి సాయమైనా తీసికొందాం అంటే రాజువిషయంలో నిజమైన, నిష్కల్మషమైన ప్రేమ, సహానం ఉన్నవాళ్ళు ఒక్క రాణిగారే. మరెవ్వరినీ అతడు నమ్మేటట్లు లేదు. రాణి రాజు కంటె యోగ్యతలో నిలువెత్తున పైన నిలబడివుంది. రాజును హెచ్చరిస్తే దమ్మిడీ లాభం లేదు. 'నీ భగవతితలను నరికిపారెయ్యి' అంటాడు. తప్పితే 'ఆమెను చండాలురకు వేయి' అంటాడు. ఏమిటి చేయడం? చాలాసేపు ఆలోచించి బసవన్న చివరకు దొడ్డవ్వతో మంత్రాంగం చేద్దామని నిశ్చయించుకొని, ఓరోజు ఆ ముసలిదానితో 'ఏం దొడ్డవ్వా! నిన్ను ఓమాట అడగాలి; అడగవచ్చా' అని ప్రశ్నించాడు.

దొడ్డవ్వ : 'ఒక్కమాటేమిటి బిడ్డా పదిమాటలు అడుగు ఫర్వాలేదు. నీమాటేమన్నా ముత్యమా రత్నమా?' అంది.

దొడ్డవ్వ మాటాడేతీరే ఇటువంటిది. పెద్దవాళ్లకు కావాలిసినసేవలుచేసి ఆమె ఎవరితో నైనా చతురంగామాటాడేహక్కు సంపాదించుకొన్నది. ఇంతేగాక, బసవన్న తాను పెంచి, పెద్దజేసినవాడు. ఆ రెండుకారణాలవల్ల ముసలిది బసవన్నతో మాటాడేటప్పుడు మాటల పొంకం, కుదురు మొదలైనవాటికోసం జాగ్రత్తపడవలసింది ఏమీ లేదు.

'పదిమాటలు తిరిగి చెప్పుకొందాం. ఇప్పుడోమాట చెప్పు చాలు. ఈ అవ్వ భగవతిగా రున్నారే, పూర్వం ఈవిడగారెవ్వరో చెప్పవ్వా?'

'ఈ ఒక్కమాట మువ్వడుగకూడదు. నేను చెప్పకూడదు. ఏమైనాసరే తెలుసుకోవా లంటే పోయి ఆవిడనే అడుగు.'

'ఏమో అడిగినానంటే కోపగించి శాపం ఇస్తే?'

'నీమీద ఆమె కోపపడదు. శాపం అంతకంటా ఇవ్వదు. భయపడకుండా పోయి అడుగు.'

బసవన్నకు తాను భగవతి మందిరానికి వెళ్లినప్పుడు భగవతి తన్ను కౌగిలించుకోవడం గుర్తుకు వచ్చింది. దొడ్డవ్వమాటలో నిజముంది అని అతనికనిపించింది. కాని భగవతి తన్ను గురించి ఇంత ప్రసన్నురాలగుట ఈమెకు ఎట్లా తెలుసు? భగవతి తనయెడల ప్రవర్తించిన తీరు దొడ్డవ్వకుచెప్పి, కారణం అడుగుదామా అని నాలుక చివరిదాకా వచ్చింది. కాని అంత లోనే బసవన్న ఆమాట విరిచేశాడు. 'ఈవిషయం ఎవరికైనా చెప్తావేమో జాగ్రత్త' అని భగవతి చేసినహెచ్చరిక అతన్ని నిలవరించింది.

# 45

సంగతి ఏమిటనేది దొడ్డవ్వనుంచి తెలుసుకొనేసందర్భం కనబడకపోవడంతో బసవన్న మునలిదిచెప్పినట్లు భగవతిదగ్గరకే పోవడానికి నిశ్చయించుకున్నాడు. భగవతి దైవజలంకలది, ఆమెతో పగ పెట్టుకోకూడదు అనేదృష్టిలో అతనికి కొంచెం భయంభయంగావున్నా మంది రానికి వెళ్ళడమంటే, భగవతితో మాటలాడటమంటే అతనికి ఇష్టమే. దీనికి ముఖ్యమైన కారణం బసవన్న అనాధశిశువై రాజభవనం ఆవరణంలో ఎవ్వరికీ అక్కరలేని కుక్కలతో పాటుగా ఒక చిన్న కుక్కపిల్లలాగా పెరగడం. అతనికి తనతల్లి ఎవ్వరు అనే గుర్తులేదు. అతన్ని పెంచినమూర్తులలో మొదటిది దొడ్డవ్వది. నిజానికి దొడ్డవ్వ అతన్ని చూచికొన్న విధం, లాలన అని చెప్పడం కొంచెం కష్టం. చుట్టుప్రక్కలవాళ్ళు దిక్కులేనిపిల్లడిని, పిల్లవా డనడంకంటే, ఎక్కువసార్లు కుక్కపిల్లఅనే పిలిచేవాళ్ళు. కాలు మెలగబడి కుంటుతూవున్న పిల్లవాన్ని ఎవరో ఒక్కరు 'కుంటి' అని పిలవడం మొదలుపెట్టారు. ఎవరికీ, కావట్టని అనాథబాలుని, కారణ మేమైన కానిండు - మొదటిసారిగా ప్రేమగా చూసుకొన్నప్రాణి ఎవ రంటే, నిజానికి రాజకుమారుడైన వీరరాజే. రెండుసంవత్సరాలు చిన్నవాడైన రాజకుమా రుడు, తనకంటె కొంచెం పెద్దయిన కుంటిపిల్లవాడిని తనజతకు చేర్చుకొన్నాడు. బసవన్న కూడా అతడంటే ఎంతోప్రేమగా మసలుకొన్నాడు. ఈవిధంగా వీరరాజు, కుంటి బసవన్న, బాల్యంలో శరీరాలు రెండు, ప్రాణం ఒక్కటిగా 'జీవికాజీవి' అన్నంత గాఢస్నేహితు లయ్యారు. వాళ్ళచెలిమి వికసించినతీరు ఇంతకుముందు వర్ణించాం. మొత్తంమీద ఫలితార్థ మేమిటంటే, బసవన్నను ఇప్పటికి ఆర్నెల్లక్రిందటివరకు, ప్రేమిస్తూవచ్చిన ప్రాణి ఒక్క రాజే. ఇహ తన బీడువారి, ఎండిపోయినజీవితంలో, భగవతి ఒక సుఖం, పచ్చికలా మొలవ జేసింది. రాజుగారి కాముకజీవితంలో సాచివ్యంనడపిన బసవన్నకు ఆడదానిపరిచయం అనేది

చాలా పాతకాలపు మాట. పాతమాటేగాక పరిచయాలు పాతగిలికూడా పోయినాయి. కాని వయస్సుమీరినదైనా, అందమైన భగవతి, ఉన్నపళాన, తన్నుపట్టుకొని లాగి రొమ్ముకు కౌగిలించుకొని ముద్దు చేసేటప్పటికి అతనికి భయసంభ్రమాలతోబాటు అనిర్వచనీయమైన సంతోషంకూడా కలిగింది. ఈజన్మకి అటువంటిసుఖాన్ని పొందడం అదే మొదలు. అందు కని, భగవతిదగ్గిరకుపోవడం అతనికి మిక్కిలి ఇష్టమైన పనే. ఆవిధంగా తన్ను కౌగిలించు కొన్న స్త్రీ తనకు చెడ్డ కలగనీయదు. నమ్మకంతోబాటు అతనికి లోపల తనకేతెలియని ఒక ఆశకూడా వుంది. ఆరోజు కౌగిలించుకొన్నట్టు తిరిగి కౌగిలించుకొని ముద్దాడటంలో ఓవిధ మైన ఆనందానుభూతి.

ఆడది తన్నులాగి, కవుగిలించి, ముద్దాడితే ఇంకొకరీతి ఆనందం అనుభవానికివచ్చింది. మొదటి ఆనందం, ఈ రెండో ఆనందంఅంతటి మేలురకంకాదు. దీని అంతస్తు అది అందుకోలేదు.

బసవన్నకు భగవతి మేలిజాతి ఆనందాన్నికలగజేసి అతనికి చాలా ప్రియమైనవ్యక్తి అయింది.

# 46

ఓరోజు బసవన్న ఉన్నపని ముగించికొని ఒక్కడే సేవకునితోకూడా భగవతి ఆశ్రమానికి పోయాడు. పోతూ అతడు, ఇంతకుముందు ఆశ్రమానికిపోయినప్పుడల్లా చెయ్యాలనుకుంటూ చేయకుండావుండిపోయిన ఓపని చేసుకొని మరీ రావాలి అని నిర్ణయించుకొన్నాడు. రాజాకు వంట్లో బలంపట్టేమందు ఇవ్వమని భగవతిని ప్రార్థించాలి. మొదటిసారిలాగానే గుర్రాన్ని కాల్వదగ్గిర విడిచి, మందిరం ముందుప్రక్కకువచ్చి అతడు 'అవ్వా!' అని పిలిచాడు. పరిచారిక వచ్చింది. అతని అనుమతితీసుకొని, తాను వచ్చినసంగతి భగవతికి చెప్పింది. భగవతి బసవన్నను రమ్మనమనిచెప్పి ముఖమండపం తిన్నెమీద కూచోమని చెప్పింది. దాసీని పోయి వాకిలివగ్గిరవుండు అంది. ఆమె వాకిలివగ్గిరకు పోయినపిమ్మట బసవన్నతో 'ఏమి వచ్చావు?' అని అడిగింది.

బసవన్నకు గుండె పట్టిపరదై పోయింది. ఆధ్వనిలో ప్రేమవాసన అయినాలేదు. ఆ చూపులో కౌగిలించుకుంటుంది అనే దూరసంకేతమైనా, అటువంటి నీడజాడలైనా లేవు.

'మీతో చెప్పుకోవాల్సింది ఓమాట వుందమ్మా! అందుకని వచ్చా. తప్పైతే వేసట పడవద్దు.'

'ఏమిటిమాట? రాణిగారిని గురించా?'

'కాదు, నామాటే.'

'ఏంమాట! చెప్పు.'

'అడుగుతున్నా అమ్మా! కోప్పడవద్దు. మీరు రెండునెలలపాటు అక్కడికీ, ఇక్కడికీ వెళ్ళి ప్రజల్నిచూసి వచ్చారుకదా! 'అప్పంగౌళ'కు వెళ్ళి అల్లుడుగారిని చూశారు. వీళ్ళు రాజుగారంటే సరిపడనివాళ్ళు. అటువంటిచోటికి మీరు వెళ్ళివచ్చారంటే, రాజు కేమైన కీడు మూడుతుందేమోనని భయం. అందుకని మిమ్మల్ని వేడుకోవటానికి వచ్చా.'

'ఏమిటి నీవు వేడేది?' భగవతి కంఠధ్వని కర్కశమైంది.

'రాజుగారిని కాపాడుకోవాలి.'

'నువ్వేమి చెయ్యాలి! నీకేం పట్టింది.'

'నేను పరాయివాడినా? రాజుగారివెంట నుండే కుక్కని.'

'రాజుగారివెంటవుండే కుక్క! ఇటువంటిమాట మాటాడడానికి నీకు సిగ్గూ శరమూ లేవా? మనుష్యుడవైపుట్టి కుక్కగా పెరుగుతావా? మీ అమ్మ నిన్ను కుక్కకమ్మని కన్నదా? మేం ఏం చేస్తామో, చెయ్యాలో, ఎక్కడకు వెళ్ళాలో, వెళ్తామో అదంతా మా ఇష్టం. అవన్నీ చెప్పడానికి మమ్మల్ని పెట్టి పోషించేవాళ్ళు ఎవ్వరూలేరు. మేం ఏం చేస్తామో, ఎక్కడకు వెళ్తామో పొంచి చూడవలసినపనేమీ లేదు జాగ్రత్త! నువ్వా గమనింపవద్దు. మరెవ్వరినీ మాపై నిగా పెట్టవద్దు. వేగుపనిచేసావా కథ ముగిసినట్లే. తెలిసిందా?'

భగవతి అంటున్న ఒకొక్కమాట చురకత్తిలా బసవన్నమనస్సును దూసికొనిపోయి, అక్కడే వుండిపోయాయి. చివరికి ధైర్యం పోగుచేసుకొన్నాడు. మనుష్యులకు అంకే స్వభావం కావలనిది. కానైతే ఇప్పుడు తాను వింటున్నది మనుష్యమాత్రులమాట కాదు. దైవవతినిది చెబుతున్న మాట.

అతడు లేచి నిలబడ్డాడు. భగవతికి చేతులుజోడించి నమస్కరించాడు. భయంతో అతని కాలు వణికిపోతూవుంది. 'తప్పైందమ్మా! కోప్పడవద్దు. ఆజ్ఞ అయితే వెళ్ళివస్తా' అన్నాడు.

తనమాటలో అనవసరంగా క్రౌర్యం ధ్వనింపించిందని భగవతి గ్రహించింది. అతనికి కొంచెం ధైర్యం రానీ అని మాటను కొంచెం పెంచుతూ 'రాజును అంతగొప్పచేసి మాటాడడం, నిన్ను నువ్వు కొంచపఱచుకోవడం! దాంతో నాకు కోపంవచ్చింది. అట్లా ఎప్పుడూ చేయకూడదు. రాజు ఏమంతపోతే నీకొలగించాడు?' అంది,

బసవన్నకు కొంచెం ధైర్యం వచ్చింది, కాని అతడు రాజును విడిచిపెట్టేటందుకు సిద్ధంగా లేడు. అతడు 'క్షమించేయకోరేదమ్మా! నన్ను ఒక్కప్రాణిగా చూసుకొని ప్రేమించి పాడిన

వాడు ఈలోకంలో ఆయన ఒక్కడే. అటువంటి దొరదగ్గిర కుక్కనై పడివుండటం నా గౌరవానికి భంగమైన మాటకాదు' అన్నాడు.

'తిరిగి ఆమాట అనకు. నువ్వు రాజై అతడు నీదగ్గిర కుక్కఅయితే వద్దంటావా?'

'శివశివా! అంతోటిమాట వద్దు తల్లీ!'

'నామాటకు అడ్డంరాకు. నీకు అక్కర్లేకపోతే వేరే ఎవరికీ అక్కర్లేదా! మేము మీ రాజుగారినిగురించి ఆలోచింపనే ఆలోచించం. ప్రజలకి ఏది మేలో దాన్నిగురించి ఆలో చించాలి. మాపనికి అడ్డుపడితే జాగ్రత్త!'

'జాగ్రత్తగాకేం తల్లీ! కాని దొరలకు ఏవిధమైనకీడు కలుగకూడదు. కాస్త ఆవిషయం గమనించండి.'

'మంచిది. నువ్వు ఇంతగా చెప్పావుగనుక మేము నీకుగా మాటఇస్తాం. నీ రాజుగారి ప్రాణానికి వచ్చినభయం లేదు. ఆవిషయం మేం చూసుకుంటాం.'

'ఆపాటి నడుచుకోండి తల్లీ. చాలు. ఇహమీదట నామనస్సు కుదుటపడింది. ఆజ్ఞ ఇస్తే పోయివస్తా.'

మంచిది వెళ్లు.'

'రాజుగారిక్షేమాన్ని కనిపెట్టి, దానికైనసదుపాయం చేసారుగదా అని సంతోషంతో బసవన్న బైటకు వచ్చిపడ్డాడు.'

భగవతి మొదటిసారిలాగా అతన్ని బైటకుపోయేసమయంలో పట్టుకొని కౌగిలించుకో లేదు. లభిస్తే లభించవచ్చుననుకునే సుఖం దొరక్కుండానే, తనకే తెలియని ఒకానొక అసంతృప్తితో బసవన్న ఆశ్రమాన్నివదలి వచ్చాడు. దొరకు బలంపట్టే మందూ మాకూ, మాట ఎత్తడం పడలేదు ఈతితవకూడా అతనికి.

# 47

ఇవన్నీ ఇట్లా నడుస్తూవుండగా, ఇదేసమయంలో, ఓరోజు అపరంపరస్వామి ఓంకారేశ్వరుని ఆలయం ముందున్న పుష్కరిణి పైమెట్టుమీద ధ్యానం చేసుకోవడానికన్నట్లు కూచున్నాడు. ఆసమయానికి అలవాటుప్రకారం పెద్దదీక్షితులు పుష్కరిణికివచ్చి నీటిలోనికిదిగి, ఆచమనం, ప్రోక్షణ ముగించుకొని, ఆలయంలోకి పోవడానికని సోపానాలెక్కుతూ వచ్చాడు. ఎదురు గుండా పైసోపానంమీద యువకుడైన సన్న్యాసి ఒక్కడు కూచునివున్నాడు. ఎవరో సన్న్యాసి ఆహ్నికానికి వచ్చివుండొచ్చు అనుకొని దీక్షితులు ముందుకు సాగిపోయాడు. దగ్గిరకువచ్చాక స్వామి 'శరణు అయ్యవారూ!' అన్నాడు.

దీక్షితులు చకితుడయ్యాడు. అనుకోకుండా మాటాడించడంవల్లనేకాక వేరుకారణం ఏదో ఉండివుండాలి. ఆయన బదులుగా 'శరణు అయ్యా! ఎక్కడినుంచి వచ్చివున్నారు?' అన్నాడు.

'మేం వకలేశపురం వుంది చూడండి. ఇక్కడికి అక్కడినుంచి మారాక.'

'అట్లనా! సంతోషం. దేవాలయానికి వచ్చినట్లు కానం. ఇక్కడ పరదేశీయులు కల్పించిన కట్టడివుంది. పూజకువస్తే ప్రసాదాన్ని స్వీకరించవచ్చు. ప్రతిదినమూవచ్చినా సంతోషమే. మాకు దర్శనం లభిస్తుంది. మీకు రోజూ భిక్ష నడుస్తుంది'

'అల్లాగే అయ్యవారూ! ఈ ప్రొద్దువస్తాం. కాని మిమ్మల్ని ఓమాటు అడగాల్సివుంది.'

'ఇంత తిరిగి అడగాల్సినవని లేదు. ప్రతిదినం పదిమంది సన్న్యాసులువచ్చినా, ప్రసాదానికి కష్టంలేదు.'

'ఆమాట సరే! అయ్యవారూ! అయితే మేం అడుగదలచుకొన్నది ఆమాటకాదు.'

'ఏమిటో అడగండి?'

'మేం మాట్లాడేది మీకు ఆశ్చర్యం కలిగించవచ్చు. ఆ జిజ్ఞాస ఎందుకనిపించవచ్చు.'

అంతటిలోకి దీక్షితులు పై సోపానానికి వచ్చాడు.

స్వామిలేచి అతనిఎదుట నిలబడ్డాడు. ఇద్దరూ దేవాలయంవైపు నడిచారు. దీక్షితులు క్షణం అతనివైపు చూపువిసిర్చి, తిరిగి ఏదో స్ఫురించినట్లు 'మీ ధ్వని మాకు కావాలిసిన ఒకరి కంఠధ్వనిని పోలివుంది. దానిచేత మేం కొంచెం విస్మితులమయ్యాం' అన్నాడు.

'ఔనండి! ఆశ్చర్యం పడండి! ఎవరా కావలసినవారు?'

'అదంతా ఇప్పుడు వాపోయి ఏం ప్రయోజనం?'

'రాజభవనం అప్పాజివారి కంఠధ్వనిలాంటిదా అయ్యవారూ!'

నడుస్తూన్న దీక్షితులు చటుక్కున నిలబడిపోయాడు. స్వామివైపుచూసి 'నీవు వీరన్నవా? అన్నయ్యా!' అన్నాడు.

'ఔను అయ్యవారూ!'

'మరి ఆమాట ముందే చెప్పితే ఈ విభ్రాంతిపాటు వుండేదికాదుగా! వీరన్నా సౌఖ్యమా! అప్పాజి సుఖంగా వున్నారా? ఎక్కడున్నారు?'

'పట్నంలో మూడురోజులు, మైసూరులో మూడురోజులు, అరకలగూడులో మూడు రోజులు, ఈమధ్య బెంగుళూరులో ఓ ఆరురోజులు. ఇల్లు విడిచిపోయినవాళ్ళు ఏపాటి సుఖపడుతారో అపాటిసుఖమే వారిది. నేనుకూడా వుంటూవస్తున్నా.'

'జీవన్ భద్రాణి పశ్యతి' 'బ్రతికియుండిన సుఖములు బడయవచ్చు' సుఖంగా వుండటం ముఖ్యం. ఆయున్నప్పుడంటే అన్నీవుంటాయి. ఎందుకని ఇక్కడకు తిరిగివచ్చే ఆలోచనలు వేయడంలేదో!'

'విషయం మీకు తెలియందేముంది? వెనక్కుతిరిగివస్తే నాకేమైనా కీడు వాటిల్లుతుం దేమోనని అప్పాజి. తామూ ఇక్కడకు అడుగుపెట్టడం లేదు. నన్నూ పెట్టనివ్వడంలేదు. ఆరకలగూడు చిక్కరామశెట్టి అప్పాజితో విన్నపం చేసుకొన్నాడు - మడకేరి, కొడగు అంతటా మీ తమ్మునికుమారుని సమ్మతిస్తుంది. ఇప్పుడు మీరువెళ్ళి యత్నించేస్తే వీరన్న గారు రాజుకావడం అంతా ఒప్పుకుంటారు అని. మాకూ వార్త వచ్చిచేరింది. రాజభవనం ప్రజలు విసిగిపోయారు అని. అందుమీదట, నేను ఇక్కడకు రావడానికి అప్పాజివారు ఒప్పు కొన్నారు. ఏడునెలలైంది. మొదట ఇక్కడకువచ్చి. ఓవారం వుండిపోయాను. తిరిగివచ్చా.'

'వెనక ఓసారి వచ్చావా? నాకు తెలియదు.'

'అపరంపరస్వామి అని ప్రజలు చెప్పివుంటారు. ఆయన నేనే.'

'చుట్టుప్రక్కల మంచిచెడుగులన్నీ చూసుకొని, పోయి అప్పాజిగారికి చెప్పివున్నా. వారు కొంచెం శాస్త్రంచూపించి మంచిసమయం అని తెలుసుకొన్నతర్వాత 'వెళ్ళు, దీక్షితుల వారిని చూడు. వారేమంటారో తెలుసుకొని ముందువథకం వేసికో' అన్నారు. అందుకని వచ్చివున్నా.

'నిన్ను ఎవ్వరూ గుర్తించలేదా?

'సూరప్పకుమాత్రం తెలుసు.'

సూరప్ప లక్ష్మీనారాయణయ్య తమ్ముడు. పూర్వం అప్పాజికుటుంబంలో పెరిగినవాడు. వాళ్ళకు చాలా ఆప్తుడు ప్రస్తుతం అతడు రాజభవనంలో సంగీతానికి, నాటకప్రదర్శనాలకు ప్రబంధకర్త.

అంతలోకి వాళ్ళు దేవాలయందగ్గిరకు వచ్చిచేరారు. దీక్షితులు 'మంచిదప్పా, రేపు ఈవేళకు ఇక్కడనేవుండు. ఇవ్వాళంతాచూసి రేపు చెప్తాను' అన్నాడు. వీరన్న చేతులు ముకుళించి వెనక్కుతిరిగాడు. దీక్షితులు ఆలయానికి ప్రదక్షిణంచేయడం మొదలుపెట్టాడు.

## 48

మరునటిరోజు వీరన్న తిరిగి కొలనుదగ్గిర కూచున్నాడు. దీక్షితులు గుణించిచూసి ఫలితాన్ని అతనికి చెప్పాడు.

'గ్రహాలేమో అనుకూలంగానే వున్నాయి. కాని అంత ప్రబలమైన మేలుకలుగజేసే సూచనలు ఏమి కనబడటంలేదు. ప్రాణాపాయం ఏమీలేదు. కొంచెం లాభమే చేకూరుతుంది.

కాని దానిస్వరూపం స్పష్టం కాలేదు. అప్పాజీ ఊరికివచ్చి జీవితం గడపాలిఅంటే రాజుకు తెలియజేసి వచ్చివుండొచ్చు; అయినా మొత్తంమీద బైటనిలిచేదే క్షేమం. రాజభవనంలోని ఇతరజాతకాలుకూడా వుంటాయికదూ: ఆ జ్యోతిషం ఇతరులకు చెప్పకూడదు. అయినా ఇంకో సంవత్సరంపాటు ఇక్కడకు గుప్తంగా వస్తూ 'తూ బైటనేవుండటం మేలు. రహస్యంగావుండి; అందరికీ క్షేమమార్గాన్ని అరయడం మంచిది.'

వీరన్న: 'అందరికీ క్షేమమంటే ఏవిటి?' అని అడిగాడు

'మీ పెద్దవాళ్ళు ఒకళ్ళకొకళ్ళు స్నేహంగా నడచుకోలేదు వీరన్నా: అధికారవ్యామోహంలో చాలామంది తప్పు నడచుకొన్నారు. అన్న తమ్మునికి, పిల్లవాడు తండ్రికి, పినతండ్రి అన్నకొడుకులకూ, తమ్ముడు అన్నకు, అక్క చెల్లెలికీ, చెఱుపుచేసి తాము బ్రదుకుదాం అనుకొనేవాళ్ళు. ఒక్క మీ తండ్రి అప్పాజీ ఈ క్షుద్రవ్యవహారాల కొప్పుకోలేదు. తలమీద గుడ్డ వేసికొనిపోతూ దేశాన్ని త్రోసివచ్చి అన్యాయం చేయలేను అన్నా మీ తండ్రి న్యాయమూర్తి. అటువంటివానికి నేను చెప్పకూడనిదేముంది? అందరికీ మేలేదో అప్పాజీ తామె ఎరుగుదురు.'

'అవునవు. ఇప్పుడు వారు రాజుకావాలని అనుకోడంలేదు. సమాజుడు రాజైతే చాలునని కోరుకొంటున్నారు.'

'న్యాయంగా రాజ్యం చేజిక్కితే మంచిదే అట్లా కానిపక్షంలో అప్పాజీకి ఈరాజ్యం వాటిట్టుమ.'

'మీమాట 'ఎవును సిద్ధియించే' లన్నట్లు కనపడుతోంది అయ్యవారూ: రాజునో, అతని కూతురినో, నష్టపరచి మనం బ్రతికారి ఆనేమాలకు అప్పాజీ ససేమిరా ఒప్పుకోరు.'

'అదే, నాకూ అనిపిస్తోంది.'

మరికొంత పరస్పరం భావవినియమంచేసికొని, వీరన్న దీక్షితులఅనుమతిపై తాను తన సన్న్యాసివేషంలో మడకేరిలోనూ, చుట్టుప్రక్కలా జరుగుతూవున్న పరిస్థితుల్ని అవగాహనచేసుకుంటూ, వెనుకనుంచి తండ్రికి సంగతులన్నీతెలియజేస్తూ, ఆయనకు న్యాయమూ క్షేమమూఅయినతీరుగా నడుచుకోవడానికి వీరన్న నిశ్చయించుకొన్నాడు. అతను సెలవు తీసుకొనేసమయంలో దీక్షితులు 'చూడు అన్నా: రాజభవనంలోని జ్యోతిష్కులపాట్లు ఇట్లాంటివి అని చెప్పడానికిలేదు. నేను నీతో ఈవిధంగా ఏమాట మాటాడినా నిజానికి రాజద్రోహం. మీతండ్రి ధర్మాన్ని విడిచిపుచ్చేవాడుకాదనే ధైర్యంతో నేను ఏదో ఈమాట లాడాను. ఇట్లా అన్నానినికూడా వారికి చెప్పు' అన్నాడు

వీరన్న 'మంచిది అయ్యవారూ.' అన్నాడు.

# 49

ఓంకారేశ్వరుని దేవాలయంలో స్థానకర్తృస్థానము, రాజభవనంలో జ్యోతిష్కునిపదవి, దీక్షితులకు వంశపారంపర్యంగా వచ్చాయి. దొడ్డరాజుగారు ఓంకారేశ్వరదేవాలయం నిర్మించిన తర్వాత దాని ముఖ్యాధికారం దీక్షితుల తండ్రిగారికి అప్పగించారు. అప్పటికి దీక్షితులు పూప వయస్సువాడు. తండ్రితోపాటు దేవాలయంసేవల్లో పాల్గొంటూ, రాజభవనానికి పోయివస్తూ వ్యవహారకుశలు డయ్యాడు. జ్యోతిషంలో తండ్రికి లెఖ్ఖల్ని చేసియిస్తూ వివరాలన్నింటిలో తండ్రి అంతవాడు అయ్యాడు. ముప్పదిఏండ్లవాడు తండ్రి గతించినతర్వాత దీక్షితులు సహజంగావే దేవాలయం ముఖ్యాధికారపదవికి, రాజభవనం జ్యోతిషానికి తానే అధికారి అయ్యాడు.

జ్యోతిష్కుడన్నతర్వాత, అందులోనూ సమర్థుడని పేరుపడ్డతర్వాత, ఊళ్లోవాళ్ళేమిటి, దేశంలోవాళ్ళేమిటి, ప్రక్కఊళ్ళవాళ్ళేమిటి, అందరూవచ్చి అదృష్టాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నిస్తారు. దీక్షితులు ఈవిధంగా చుట్టుప్రక్కలంతా పేరు మోగిపోయాడు.

తండ్రినుండి నేర్చుకొన్న మూడుసూత్రాలతో అతడు జనులకు ప్రీతిపాత్రుడయ్యాడు. మొదటిసూత్రం జ్యోతిషం చెప్పినప్పుడు ప్రజలనుండి డబ్బు తీసుకోకుండా వుండటం. మిగతామాట అట్లావుంచు. డబ్బుతీసుకుంటే గ్రహాలు తమఫలితాన్ని సరిగ్గా చూపవని, ఈ కుటుంబంలో మొదటినుంచీవస్తున్న నమ్మకం. ధనం తీసుకొనిచెప్పే జ్యోతిష్కుడు భవిష్యత్తును సరిగా గుణించడం సాధ్యంకాదు. అయితే డబ్బు కూడబెట్టవచ్చుగాని దైవజ్ఞుడు కాలేడు. రెండవసూత్రం : గ్రహాలు చూపించేది నడవదగ్గమార్గమేగాని, ఆమార్గంపై ఉంచాల్సిన అడుగుల్ని కాదు. అందుచేత దైవజ్ఞుడు అదృష్టాన్ని సంకేతింపవలెనేగాని, ఇది ఇట్లాగే జరుగుతుంది, ఇది ఇట్లా జరగదని ఇదమిత్థంగా చెప్పడం తప్పు. జీవితంలో గ్రహాలగతితోబాటు మనుష్యప్రయత్నముంటుంది; దాన్నిమించింది దైవకృప. మనుష్యప్రయత్నం, దైవకృప, దీన్నిమించి గ్రహగతి జీవితాన్ని నడిపించదు. వీటితోబాటు కలిసివుంటుంది. సమర్థుడైన దైవజ్ఞునికి ఇవి కూడేరీతికూడ గ్రహాలగతియందే లీనమైవుండటం కనబడుతుంది. కాని సామాన్యునివృష్టి అంత నిశితంగా చొచ్చుకొనిపోదు. మూడవసూత్రం : జ్యోతిష్కుడైనవాడు ఎవడోవచ్చి అదృష్టాన్ని అడిగినప్పటికీ, అతనికి సాధ్యమైనంతవరకూ సాయపడాలి. అతనిపనిలో తాను గ్రహాలకు ప్రతినిధి అన్నమాట : సూర్యచంద్రులు మంచివారినిమాత్రమే కనిపెట్టివుండరు; అందరికీ తమతమవేడిని, చల్లదనాన్ని అందజేస్తారు. జ్యోస్యులు అదేవిధంగా మంచివాళ్ళు అని, చెడ్డవాళ్ళు అనీ ఎంచకుండా, సత్యవంతులనీ, మృషావాదులు అనీ బాధపడకుండా, గొప్పవాళనీ, తక్కువవారనీ తూకంవేయకుండా శత్రుమిత్రభావం చూసుకోకుండా

అయినంతవరకూ భాగ్యపరిశీలనచేసి, ప్రశ్నించడానికి వచ్చినవాళ్ళకు తనకు తెలిసినంతమేరకు భవిష్యత్తు చెప్పాలి.

తండ్రివున్నరోజుల్లో ఈ సూత్రాలప్రకారం నడిచేభారం దీక్షితునికి లేదు. తండ్రి దివంగతుడైనపిమ్మట అతడీ సూత్రాలను ఏపొద్దూ మరచిపోలేదు.

# 50

వీరన్నవచ్చి తన అభిప్రాయాన్ని అడిగింతర్వాత దీక్షితులు ఓరోజు అవకాశంతీసుకొని వీరన్న, రాజు, రాణి,-ముగ్గురిజాతకాలుతీసుకొని అవి ఏ ముఖంగా నడుస్తున్నాయో పరిశీలించాడు. స్థూలంగా గుణించేటప్పటికి, అతనికి రాజు తన తోబుట్టువుకు చెఱుపుచేస్తా డని పించింది. తోబుట్టువువల్ల అతనికీ చెరపు చేకూరుతుందనే సూచనలు కనబడ్డాయి. కాని రాజు చేసేచెఱుపే పెద్దది. ఇది గ్రహాలద్వారానే తెలియదగ్గ రహస్యమేమీ కాదు. రాజు చెల్లెల్ని చెరసాలలో పెట్టివుంచాడు. ఆ చెల్లెలిపెనిమిటి రాజుమీద ద్వేషంపెట్టుకొనివున్నాడు. అందుచేత వీరన్న మడకేరికి రావడంచేత రాజుకు ఏమైనా విశేషహాని కలగవచ్చుననే సూచన ఏమీ లేదు. ఈవిధంగా వుండటంచేతనే వీరన్నకు తాను చెప్పదగ్గమాటచెప్పి దీక్షితులు పంపించివేశాడు. ఇహమీదట రాజు చేయబోయేహాని ఏపాటిదో కొంచెం తెలుసుకుందాం అని దీక్షితులు తిరిగి లెక్కవేశాడు. ఆరకంగా చూడటంలో రాజు జాతకానికిగల గ్రహస్థితి తాను ఇంతకుముందు చూసివున్న ప్రసిద్ధమైనస్థితి అని అతనిమనస్సుకు స్ఫురించింది. ముత్తాత, పెత్తాతలకాలంనుంచీ వాళ్ల వంశంలో పురాణకాలానికి సంబంధించిన కొన్ని చిత్రాలు (జాతకచక్రాలు) ఉన్నాయి. జ్యోస్యులు వాటిని అప్పుడప్పుడూ తీసుకొని చూడటం కద్దు. ఆనాడు ఆ చక్రాల్నితీసుకొని అతడు చూశాడు. వాటిలో సోదరద్వేషానికి సంబంధించిన చక్రాల్ని వేరుచేసి పరిశీలింపగా, అతనికి కంసుని చివరిసంవత్సరం గ్రహగతికీ, వీరరాజు ఆ సంవత్సరం గ్రహగతికీ బాలా సామ్యం ఉన్నట్లుతోచింది. చెల్లెల్నితెచ్చి చెరలో పెట్టాడనే దానిమూలాన్న సోదరద్వేషం కనబడివుంటుందనుకోవచ్చు. కాని ఆ సందేహం అనుకోకుండాఉన్న ఈ సాదృశ్యంవల్ల పుష్టమై రెక్కలుకట్టుకొని మరీ కనబడుతోందని అతనికి తోచివుండలేదు.

ఇప్పుడు ఇది ఇట్లా అయిందికదూః రాజును ఇటువంటి కీడునుంచి రక్షించడం తన కర్తవ్యం. రాజు చెల్లెల్ని చెరనుంచి విడిపించేటట్లుచేస్తే ఈ చెఱుపులోని ఓభాగాన్ని తప్పించ

వమ్ము. దీన్ని ఎట్లా సాధించడం? భవిష్యత్స్వరూపాన్ని రాణికి తెలియజేసి ఆమె తన పెనిమిటిని వేడుకొనేఏర్పాటు చెయ్యాలి; ఎల్లాగో తంటాలుపడి రాజు సోదరిని అప్పంగొళకు వెనక్కు పంపించేమార్గం చూడాలి.

వారంలో రెండుసార్లు, మూడుసార్లు దీక్షితులు తానే ఈశ్వరప్రసాదాన్ని స్వతః తీసికొని పోయి రాజభవనంలో ఇచ్చేపద్ధతి. ఈసారి రాజభవనానికి పోయింతర్వాత రాణి ఈమాట నెత్తేటట్లుచేసి తాను హెచ్చరిక ఇవ్వాలి అని దీక్షితులు నిశ్చయించుకొన్నాడు. కాని తలవని తలంపుగా ఆరోజే రాణి ఆయనకు కబురుపెట్టింది. దీక్షితులు రాజభవనానికి వెళ్ళాడు.

రాణి పంపించింది - రాజు ఆంగ్లేయులకు ఏర్పాటుచేయనున్న విందు భోజనాన్నిగురించి-వచ్చేనెలా, నెలాపదిహేనురోజుల్లో వర్షాలు ప్రారంభించకమునుపే దేవాలయంలో విశేష పూజామహోత్సవాల్ని, రాజభవనంలోని పరివారకులకు, పండుగ, పబ్బం అని స్వంతపని లేకుండాఉన్న ఓరోజున నడిపింవాలిసిందని రాణి ఆయనకు చెప్పింది. దీక్షితులు పంచాంగం చూసి అనుకూలంగావుండే రెండు మూడురోజులు తెలుపుతాను అన్నాడు.

అదైనపిమ్మట రాణి తానుగా 'నెలా రెండునెలల్లో రాజుగారి ఆరోగ్యం, మిగతావిషయాలూ, చక్కగా వున్నాయేమో చూడవలసింది అయ్యవారూ!' అంది.

దీక్షితులకు రాణి ఈమాట తానుగా అడగటం, ఈశ్వరుడే అడిగించాడనిపించింది. తన కోరిక, ఆమెప్రశ్న ఒకేసారి ఒనగూడకుండా ఎట్లావుంటాయి? అతడు 'అదంతా చూసే వున్నా అమ్మాజీ! నేడో రేపో తమతో చెప్పాలనేవున్నా' అన్నాడు.

'హాని ఏమీ లేదుగా!'

'రాజుగారికి వారి కుటుంబానికి ఎట్టి ఆపదాలేదు. కానైతే మరోవిధంగా గ్రహగతి బాలా పీచంగా వుంది.'

రాణి ఎద ఝల్లుమంది. అయినా భయాన్ని అపుకొని ఆమె 'ఏం అపాయం? శాంతి ఏమైనా ఆజ్ఞాపించండి. చేయిద్దాం' అంది.

'ఇది శాంతిపాఠాలతో నివారణమయ్యే అపాయంకాదు. రాజుగారిచేత మనమో పని చేయించాలి' అనిచెప్పి దీక్షితులు రాణికి గ్రహగతినిగూర్చి తెలిపాడు వివరంగా. 'చేతనైనంత తొందరగా ఆడుబిడ్డగారిని అప్పంగొళకు పంపించివేయండి' అన్నాడు.

'అయ్యో! అయ్యవారూ! ఈమాటకు రాజుగారు ఒప్పుకుంటారా? మీకు తెలియదా?'

'అవును. అమ్మాజీ. మీరు ఆజ్ఞాపించేదిఅంతా నిజమే. అయినా మనకున్నమార్గం ఇదొక్కటే.'

'కంసునిచెర అంటారే. ఆడపడుచుకు పిల్లలు లేదాయె. అభయం ఎందుకు?'

'గ్రహాలు అటువంటిసూచన మనకిస్తున్నప్పుడు మనం నమ్మవలసిందే. ఆ సూచనకు వివరమైన అర్థం ఏమిటి అని మనం చెప్పడానికిలేదు. ఈ గ్రహగతి జాతకునిసోదరిని వావి

మంది దూరంగావుంచడం ముఖ్యమని సూచిస్తోంది. అట్లాచేయడం రాజుగారికి క్షేమం. రాజుకు క్షేమాన్ని ఆలోచించేవాళ్ళకు ఇంతకుమించి కర్తవ్యం లేదు.'

'అట్లాగే అయ్యవారూ ! మాచేతిలో ఉన్నదాన్ని తప్పక చేస్తాం. రాజుగారిని ఇటువంటి చళలోంచితప్పించి, దరిజేర్చడానికి ఈశ్వరసన్నిధిలో పూజ చేయించడం నయంకాదూ !'

'పూజ నడుపుతూవున్నాను అమ్మాజీ ! చింతింపకండి. ఇక్కడ ప్రభువులమనస్సు సుముఖంచేసికొని, ఆడుబిడ్డను అప్పంగొళకు పంపించేప్రయత్నం మీరు చూడండి.'

ఈవిధంగాచెప్పి దీక్షితులు రాణి ఆజ్ఞపొంది రాజభవనంనుంచి వచ్చేశాడు. రాణి చాల విచారంలో ముందుదారి ఏమిటాఅని కలవరపడుతూ కృచుండిపోయింది. తాను అంతగా దిగులు పడటానికి ఆమె ఊహించని ప్రబలమైనకారణ ముందని, ఆమెకు ఆ సాయంత్రమే తెలియ వచ్చింది.

# 51

బెంగుళూరులోని ఆంగ్ల రాజప్రతినిధియైన అధికారినుండి, అతనిదగ్గిరవున్న ఒక్క ఆంగ్లే యునుండివచ్చిన ఉత్తరాలలోనివిషయం ఇప్పుడు చెప్పవచ్చు.

ప్రతినిధి వ్రాసినఉత్తరం ఈవిధంగా వుంది : 'కొడగు మహారాజులైన శ్రీ మన్మహారాజ శ్రీ చిక్క వీరరాజేంద్రప్రభువుల శ్రీ సమ్ముఖమంకు ప్రభువుల ఆచంద్రార్కమిత్రులైన ఆంగ్ల సార్వభౌముల [1]కుంపిణీ సర్కారువారి మైసూరుదేశం రెసిడెంటుమహాశయులు చేయు ఆదరపూర్వకమైన గౌరవనమస్కృతులూ, ఉగాది శుభాకాంక్షలు. తర్వాత తమ ఆరోగ్య స్థితిని తెలిపి తమ కర్మచారులుపంపించివున్న మర్యాదపత్రము సకాలమునచేరింది. అందుకు గాను మేము అనేకానేకములైన వందనములను మీ శ్రీ సమ్ముఖమునందు అర్పించు చున్నాము. సార్వభౌములయు, మిత్రప్రభువులయు స్వల్పకాలీనమైన అనారోగ్యం నయమై ప్రభువులు ఇప్పుడు సుఖంగా వుండటంతెలిసి చాలా సంతోషమైంది. ప్రభువుల ఆరోగ్యానికి సంబంధించిన ఈ వార్తను రాజపురుషులైన మైస్రాయిప్రభువులకు విన్నవించడమైనది. ఈపాటికి వార్తశ్రుతమైవుండాలి. పైపెచ్చు ప్రభువులు ఇంతకుముందే మమ్మల్ని మా పరివారంతోసహా మడకేరికి ఆహ్వానించవలెనని ఆదరపూర్వకంగా ఆమంత్రించివుండటం, తిరిగి ఇప్పుడు మేమందరం రావేరావాలి అని బలవంతంచేసి ఆజ్ఞాపించడం ఇక్కడ అందరికీ

1. కుంపిణీ = కంపెనీ; ఈస్టిండియా కంపెనీ.

ఆనందాన్ని చేకూర్చింది. ప్రభువుల ఆదరాతిథ్యాలు స్వీకరించడం మాకు సంతోషహేతువు మాత్రమే కాదు, గర్వకారణం కూడా. అందువల్ల ఈ ఆహ్వానాన్ని చాల కృతజ్ఞతతో అంగీకరిస్తాం అని మా పరంగానూ, మా పరివారపరంగానూ విన్నవించడానికి ఎంతో సంతోషిస్తున్నాం. ఉగాదివేళకు మేము తమదగ్గిరకు రావడానికి అనుకూలంగా వుంది. కాని సందర్భం కలిసిరాలేదు. ప్రభువులకు అనుకూలమైనసమయం వర్షాకాలానికి ముందుగా ఈ రెండునెలల్లోపల ఏది అని తెలిస్తే ఆసమయానికి అందరమూ తమ సన్నిధికివస్తాం. సద్యః వేరే ఏరోజూ, అనుకూలంకాకపోతే నవరాత్రుల్లో రాగలం. ముఖ్యంగా ఈ అదను ప్రభువుల సందర్శనలాభం పొందడానికి వీలుగా చేస్తున్నప్రయాణం అయినప్పటికీ, ఎట్లాగో అక్కడికి రానేవస్తున్నాం గదా అని, ఆ సమయంలోనే సార్వభౌముల ప్రతినిధిగారికి, ప్రభువులకూ మధ్య పరిశీలనకు రావలసిన కొన్నిసంగతులను, తమదృష్టికితెచ్చి నిర్ణయాన్ని పొందాలనే కోరిక మాకుంది. దానికి సంబంధించిన వివరాలతో వేరే ఉత్తరం ఈలోగానే సమ్ముఖానికి పంపించడమవుతుంది. ఈవిధంగా శ్రీ మత్సముఖాన విన్నవించు,

క్యాసా మైజర్.
మైసూరు రెసిడెంటు.

దీనితోబాటు రెసిడెంటువారి ఆప్తసహాయకులైన పార్కర్ మహాశయుడు మంత్రి శ్రీ బసవన్నగారికి అని ఒక విశ్వసనీయపత్రాన్ని పంపించాడు. అందులో ఈ క్రిందివిధంగా వుంది.

'ప్రియమిత్రులకు :—

సౌ. మహారాణిగారు శ్రీ ముద్రాజేంద్రులవారి పరంగా పంపిన ఆహ్వానానికి రెసిడెంటుప్రభువులు లోవచారప్రత్యుత్తరాన్ని (Formal reply) అనుగ్రహించివున్నారు. దానితోబాటు ఈ ఉత్తరాన్ని పంపిస్తున్నా.

'ప్రభువుల ఒప్పుదల కావలసివున్న కొన్నివిషయాలను ఈలోగా అక్కడకు వస్తున్నాం అనే ప్రతీక్షలో, పనిగా వేరే పెట్టివుంచాం. వచ్చేటప్పుడు నేను వాటిని తీసుకొనివస్తాను. రెసిడెంటుగారు, సహాయకులు, దళపతి, నేనూ వస్తున్నాం. శ్రీమతి లూసి, ఆమె అతగా ఆమె స్నేహితురాలు శ్రీమతి హెలెన్, మావెంట వస్తున్నారు.

'ఎట్లాగో రానే వస్తున్నాం, ఒకటి రెండురోజులు అడవికివెళ్ళి వేటాడివస్తే బాగుంటుంది అని పెద్దల అభిప్రాయం. వీలుగావుంటే దానిఏర్పాట్లు చేయింప ప్రార్థన.

'శ్రీమతి లూసి, ప్రభువులకు, అట్లే మీకు ఆదరం తెలియజేస్తూవున్నారు. దానితోబాటు నా మన్ననలనుగూడ ఇరువురూ స్వీకరించండి. ఈ వివరాలన్నీ ప్రభువులకుగూడ నివేదించాలని కోరుతున్నాను.

ఇట్లు,
తమ

విమ్మర వ్రాసింది: 'మేము ఇంతకుముందు మీ ఊరికి చాలసార్లు వచ్చివున్నా, మీ ప్రాంతంలోని ఆడవిల్లల రూపసౌందర్యాన్నికాని, వాళ్ల సొంపు సోయగాలుకాని మాచేభాగ్యం కలుగలేదు. ఈసంగతి క్రిందటిసారి మీకు సూచనగా తెలియజేసివున్నాను. అది మీకు జ్ఞాపక ముండివుండవచ్చు. ఈసారి మాకు ఈ ఆనందాన్ని కలగజేస్తే మేమంతా చాల ఋణపడి వుంటాం. ఉన్నతకులాలకు చెందిన స్త్రీల పరిచయభాగ్యం పొందాలని శ్రీమతి లూసిగారికి గల గొప్పకోరిక. ఇందువిషయమై ప్రత్యేకంగా ఈవిధంగా, వ్రాసినందుకు తాము వేరుగా ఏమీ భావించరని నమ్ముతున్నాం. ఈ రెండు త్తరాలుగాక రాణికి ఓ చిన్న ఉత్తరం: 'తమ వన్నిధానంనుండి వచ్చిన ఆదరయుక్తమైన ఆహ్వానానికి సంబంధించి రాజుగారి పేరిట తిరిగి ఉత్తరం వ్రాసివున్నాం.

ఇట్లు,
తమ వినీతుడైన
సేవకుడు.'

# 52

రాణి దీక్షితులకు చెప్పివంపించడానికి ఆమెకని వచ్చిన ఈ మూడవఉత్తరం కారణం. రాజు గారికని వచ్చినఉత్తరాన్ని బసవన్న రాజునకు వినిపించి మంత్రులదగ్గిరకు పంపించాడు. తనపేరిట వచ్చినఉత్తరాన్ని వేరుగా చదువుకొని ఎవ్వరూలేని ప్రొద్దుల రాజుగారికి చదివి వినిపించాడు.

రాజునకు ప్రియమైనవిషయం అనేది రుచికరమైన మద్యమై వుండొచ్చునని ఇద్దరూ అర్థం చేసుకొన్నారు. లూసి చాలా సరసురాలైన యువతి. ఆమె వస్తోందంటే, రాజుకు పట్టరాని సంతోషం: వేటకు ఏర్పాటుచేయడం కష్టమయినపనేమీ కాదు. చివరికి తిరిగి వ్రాసినమాట ఒక్కటి ఉండిపోయింది. రాజు బసవన్నను 'ఆ తడవ ఈ పార్కర్ ఏమికావా లన్నాడు' అని అడిగాడు.

'వాడు చెడ్డవాడు దొరా: వాడిమొహానికితోడు దొడ్డప్ప పంపించిన ఆడవాళ్లు మేలురకం కాదట: మాటకారితనం, అందం చందం చాలదు' అన్నాడు.

'అందుకని?'

'కులంగల స్త్రీలు, బ్రాహ్మణులు, కొడగులు, ఇటువంటివాళ్లను పిలిపిస్తే బాగుంటుం దన్నాడు.'

'ఏరా! ఊరివారికి [1]పీకూ పుట్టినోడు, తేరకువచ్చిన తాంబూలం చప్పరిస్తారా!'

'చిత్తం ప్రభూ!'

'ఇంక మరోప్పుడైతే మొహంమీద ఉమ్మేసి వుండొచ్చు. కాని ఇప్పుడేమో అవేట్లుగా లేదు.'

'చిత్తం ప్రభూ!'

'వుండాకోరు చెన్నబసవన్న మామీద ఫిర్యాదు చేశాడుకదూ! సూర్యచంద్రులుండేదాకా స్నేహితులైనవాళ్ల అడగటానికి వస్తున్నట్లు కనిపిస్తోంది.'

'కావచ్చు ప్రభూ!'

'ఇప్పుడు వీళ్లతో జగడం వద్దు. దాసనపిల్లనూ, కొడగుజాతి పిల్లనూ ఇద్దరినీ పిలిపించి వీళ్ళమొహాన పారెయ్యి.'

'ఇంకా నేరం అయిపోదా ప్రభూ!'

'పోనీలే! ఏమిటౌతుంది? 'ఏమిటి ఈ పని?' అంటే నీకోపమే చేసింది అందాం.'

'దానికేమీ వీళ్ల వేసకాదేరకాలు కావు. దొరా! తెచ్చిఇచ్చేది నీ ఔదార్యత! విన్న విచారణచేసేది మా దాద్యత అంటారు.'

'ఏంచెయ్యాలో చూడు. మహమ్మారిని పిలిచినతర్వాత పోతుమేకను బలిఇవ్వాలిసిందే.'

బసవన్న 'చిత్తం ప్రభూ!'

'ఇంక వీళ్ళను ఇప్పుడు వేరుగా పిలిపించడం కాకపోతే కానీ, నవరాత్రులకు రానీ, వాలుగురోజులు విడిచిపెట్టి రాయి.'

'చిత్తం ప్రభూ!'

## 53

ఆడుబిడ్డవిషయంలో రాణిపడ్డ చింతకి ఆమె అప్పుడు తెలుసుకోని ప్రబలకారణం ఆ పాయం కాలానికి తెలిసిందని ఇంతకుముందు చెప్పాం. దాన్నిగూర్చినవివరం ఇప్పుడు తెలుసుకోవాలి.

---

1. సాధారణంగా 'నా కొడకా' అనేది ఓ తిట్టు. రాజు కనుక 'నీ కొడుకు' 'పీకు పుట్టినోడు' అని తిట్టుతూవుంటాడు! —అనువాదకుడు.

ఉత్తయ రక్షణ సేనానిగావచ్చి సుమారు రెండు నెలలు గడచిపోయినాయి. అప్పుడు ఒక దినం రాజకుమారి తల్లిదగ్గరకువచ్చి 'అమ్మాజి! అక్క మొదలకుండా ఏడుస్తూ కూచున్నారు. బావగారు ఇక్కడకు వచ్చిపొయ్యేలా చేయండి అమ్మాజి' అంది.

రాణి: 'మీ అప్పాజి ఒప్పుకోరు తల్లీ.'

'ఇది అప్పాజికి తెలియలసినపని లేదు.'

'రహస్యంగా, ఇటువంటిపని చేయడం మంచిదికాదమ్మా! హెచ్చుతగ్గువైతే మీ తండ్రి, చెల్లెలినో బావగారినో ఏమైనాచేస్తే కష్టం.'

'అదేమో అమ్మాజి! అత్త ఇక్కడ పుట్టింటిలో ఈవిధంగా ఏడుస్తూవుండటం నాకు కష్టంగా వుంది. రేపు నా మాటా ఇంతేగా అనిపిస్తోంది.'

ఈ చివరిమాటతో రాణిమాట బిగి సడలింది.

'అయ్యో! అమాట వాలింపు [1]అవ్వా! ఇంటి ఆడుబిడ్డ ఏడ్వడం ఎందుకు? అనుకుంటే బావ వచ్చేదెట్లా?'

'వారు వచ్చేసమయానికి నేను బైటవాకిలివద్దవుండి మాకు కావలసినవారు అని చెప్పి లోపలికి తీసుకవస్తా, ఎవరు అపుతారు?'

'గుర్తు తెలియనిదే కావలివాళ్ళు ఎవరినీ లోపలికి వదలిపెట్టరమ్మా!'

'నేను వదలిపెట్టిస్తానుగా, అమ్మాజి! ఉత్తయ్యగారికి చెప్పుతాను.'

'ఉత్తయ్య ఒప్పుకోవద్దా?'

'ఒప్పుకుంటారు అమ్మాజి!'

రాణికి తనకూతురికున్న నమ్మకంచూసి నవ్వు వచ్చింది. ఆమె 'రేపు ఉత్తయ్యకు దీని మూలాన ఏదైనా కీడు కలగవచ్చు' అంది.

'ఏమికీడు కలుగుతుంది అమ్మాజి! పిలిపించి రప్పించడం, ఉదయమయ్యేటప్పటికి లేపి పంపించడం. ఇది ఎవరికి తెలియాలి?'

రాణి దీర్ఘంగా ఆలోచించింది. ఇక్కడ చూద్దామా తన కూతురికోరిక; ఒకవక్క ఆడుబిడ్డ దుఃఖం: బైట అల్లుడు రాజభవనంపై విషం గ్రక్కుతూవున్నాడు మరోవైపు: రాజభవనానికి హాని కలగకుండావుండటానికే దేవుడు ఈ పిల్లకు ఈ బుద్ధి పుట్టించాడేమో! తిరిగి, తిరిగి ఆలోచించి చివరికి ఆమె 'మంచిది చిట్టితల్లీ! నీకు తోచినట్లే చెయ్యి; ఒక్కసారికి' అంది.

ఉత్తయ్యన్ను ఒప్పించడం రాజకుమారికి ఏమీ కష్టం కాలేదు.

ఆ తర్వాత ఎనిమిది పదిరోజుల్లో చెన్నబసవయ్య ఒక రాత్రివేళ, రాజభవనానికి వచ్చాడు, పెండ్లాన్నిచూచి ఉదయం పెందలకడలేచి బైటికి వెళ్లిపోయాడు.

---

1. అవ్వ = అమ్మ. ప్రేమసూచకమైన వ్యవహారం.

ఒక్కసారి ఇల్లాచేసి నిలిచిపోవడం అతనికి సాధ్యం కాలేదు. దేవమ్మాజీకి సాధ్యం కాలేదు. రాజుకూతురు అపాయానికి గురికావచ్చునని తెలిసికూడా. వాళ్ళు పదిరోజులు వదలి ఓసారి, నెలరోజులువిడిచి మరోసారి కూడుతూ వచ్చారు. మూడునెలలంతర్వాత తిరిగి కలిసినప్పుడు దేవమ్మాజీ గర్భిణీ కావడంతెలిసి ఇద్దరూ భయపడ్డారు. చెన్నబసవన్న రావడం నిలిపేసాడు.

దేవమ్మాజీ గర్భిణి అయివున్నసంగతి ఆరునెలలవరకు రాణికి తెలియలేదు. చాలా నెలలు గడచిపోయినా, అల్లుడుగారు తిరిగి రావడానికి ప్రయత్నించకుండా వుండటం ఆమెకు ఎంతో సంతృప్తి కలగజేసింది. కాని ఈ సంతృప్తి శీఘ్రంగానే భంగమైపోయింది. అత్తతో గవ్వలాట ఆడటానికి వెళ్ళివచ్చిన కూతురు అత్తయ్య కడుపుతోవున్నదని తెలియజేసింది. దీక్షితులు రాణికి రాజుగారి కంసయోగంసంగతి ఆ మధ్యాహ్నం తానుగానే చెప్పాడు. గ్రహాలగతి ఇంత కఠోరసత్యంగా పరిణమించడంచూసి రాణికి అమితమైన భయంవేసింది. చెన్నబసవన్నను పిలిపించి తెప్పించేసందర్భంలో కూతురిమాటకు తాను తల ఊపినందుకు ఏమేమి అనర్థాలు వాటిల్లనున్నవో అని ఆమె కలవరపడిపోయింది.

కలవరపాటు నిజానికి న్యాయమైందేనని పదిహేనురోజుల్లోనే స్పష్టమయింది. రాజు ఏరోజైనా ఓసారివెళ్ళి చెల్లెలు దేవమ్మాజీని కఠినంగా మాటాడి రావడంకద్దు. ఈసారి వెళ్ళినప్పుడు ఆమె గర్భిణి అన్నమాట వెంటవెళ్ళిన బసవన్న అతనిచెవిలో ఊదాడు. రాజు పరకాయించి చూశాడు. చెల్లెల్ని ఔనా అని ప్రశ్నించాడు. దేవమ్మాజీ అతనికి జవాబివ్వలేదు. రాజు కోపంతో ఇష్టంవచ్చినట్లు రేగాడు, అరిచాడు. ఎవరికి గర్భిణి అయింది చెప్పు, లేకపోతే మాదిగాళ్ళకు పారేయిస్తాను అన్నాడు. అప్పటికీ, ఆమె మెదలకుండా వుండేటప్పటికి బసవన్నతో 'ఈమెను తొడమీద కూర్చోబెట్టుకో బసవా' అని చెప్పాడు. బసవ రాజుతో తాగి తందనాలు త్రొక్కినవాడు; వానికీ బుద్ధి అరకొరగానే వుంది. అతడు దేవమ్మాజీని లాగి తొడమీద కూర్చోబెట్టుకొన్నాడు. దొరకు ఆనందం చేకూరనీ అని ఆమెను అమర్యాదగా పట్టుకొన్నాడు. ఇదంతా అయినమీదట రాజు బైటికివస్తూ బసవన్నతో 'ఒరేయ్! బసవా! ఈమె ఎవరివల్ల కడుపైందో విచారిద్దాం. ఇప్పుడు ఈగదికి తాళంవేసి వుంచు. మేం చెప్పందే ఎవరినీ లోపలికి వదలకు' అన్నాడు.

ఇది అయినమరునాడే కథ మొదట్లో చెప్పినట్లు కూతురూ, రాణీ చెరసాలకువచ్చి దేవమ్మాజీని రక్షించడానికి ప్రయత్నపడ్డారు.

# IV

# కథాగర్భం

## 54

గర్భిణీగావున్న చెల్లెలిమీద చేయిచేసుకొనే ఆలోచన వదిలేసి, కూతురితోబాటు బైటికి వచ్చాడు వీరరాజు. అంగలు పంగలుగా తన పెరటిలోకి వచ్చిచేరాడు. అతనికి తాను నడుస్తున్నతీరు మంచిదనే భ్రమ లేనేలేదు. కానైతే ఏసంగతిగానీ సరిజేసుకొనే నేర్పు అతనికి మలభంగా పట్టుబడడం లేదు.

అతనికి ముఖ్యంగా మనసులో మూడు ఛిద్రాలేర్పడ్డాయి. తనకూతురు తన క్షేమాన్ని పాటింపకుండా రాజుకు విరోధియైన దేవమ్మపక్షాన్ని వహించడం; ఆమెలాగానే రాణీ గౌరమ్మాజీ తన భర్తను విరోధించి ఆడుబిడ్డపక్షాన్ని వహించడం; దీనికి కారణం దీక్షితులు రాజు జాతకంచూసి కంసదేవకియోగం వుందని జ్యోతిషం చెప్పివుండడం 'ఈ బాపనాడు కలిగినంతవరకు భోంచేసి మెదలకుండా వుండలేడు. అతని కెందుకీ తలపొగరు? పిలిచి నాలుగు చీవాట్లుపెట్టి మరీ పంపించాలి.'

వీరరాజు సేవకుని ఒకణ్ణిపిలిచి 'ఒరే అబ్బిగా! పోయి ఆ గుడిబాపనయ్యను ఓసారి ఇక్కడకు రమ్మనమని చెప్పు' అన్నాడు. తాను వాడుకగా కూర్చునేచోట కూచున్నాడు.

తండ్రి ఆపైన ఏమిచేస్తాడో అని ఆలోచిస్తూ రాజకుమారి ప్రక్కనే కొంచెంసేపు కూచుంది. రెండునిమిషాలు పోనిచ్చి కోపాన్ని చల్లబడచేద్దాం అనే ఆలోచనతో 'అయ్యవారు రేపుమధ్యాహ్నం లోపలివసారాలో పురాణం చెప్తారు అప్పాజీ!' అంది.

ఆమాట రాజుచెవిలో పడ్డట్టే లేదు. అతనిమనస్సు కోపంతో కాగిపోతోంది. కూతురు తండ్రివైపు చూసింది. అతని ఆలోచన ఎక్కడోవుందని తెలుసుకొని మౌనంగా వుండిపోయింది.

తిరిగి కొంచెంసేపు కూచునివున్న రాజకుమారి లేచి రాణివాసంవైపు వెళ్ళింది. వాకిలి గుమ్మంలో నిలబడ్డ నౌకరుకు దీక్షితులయ్య అంతఃపురంవైపు వెళ్లుతూవుండటం కనబడింది.

తిరిగి కొంత సేపటికి రాజకుమారి తండ్రిదగ్గిరకు వచ్చింది. 'అప్పాజీ! అయ్యవారు వచ్చివున్నారే! ఇక్కడకు రమ్మనమని చెప్పనా?' అంది.

వీరరాజు 'ఊఁ' అన్నాడు. ఆక్షణమే అతనికి తన అదృష్టాన్నిగురించి వచ్చిన కోపం అంతా దీక్షితులపైకి తిరుచుకొనిపడ్డది. దాని ఉధృతం అనుభవించడానికి దీక్షితులు ఎదురుగా లేడు. అంచేత ఆ ప్రవాహం ఎవరు ఎదురుగ్గావస్తే వాళ్ళను ముంచేసింది.

రాజకుమారి తానే అంతఃపురానికిపోయి దీక్షితుని పిలిచి తెచ్చింది; ఆమెవెనక రాణీ కూడా వచ్చింది.

# 55

దీక్షితుల్ని చూడగానే రాజుగారికోపం ఆపాదమస్తకం భగ్గుమనిపోయింది. ఆయన 'రండి! ఇక్కడకు అయ్యగారూ! మిమ్మల్ని ఎవ్వరూ పిలిచినవాళ్ళూ తలచినవాళ్లూ లేరా? ఏమిటి మీరు చెప్పినమాట! కంసదేవకి అంటూ! ఆడవాళ్లను బెదరగొట్టడమేనా మీ పని! కాస్త నోటికి తాళం వేసుకోవడం మంచిది' అన్నాడు.

దీక్షితులికి మొదట ఉక్కిరిబిక్కిరై పోయింది. రాజుగారిదగ్గిరకు రావడానికి ముందు నిమిషం రాణీ, రాజు అతన్ని పిలిపించడం తన చెల్లెల్నిగురించి ఏమో అడగడానికి అయి వుండొచ్చు అని చెప్పింది. చెల్లెలు కడుపుతోవుండటం తెలియజేసింది.

దీక్షితులకు రాజు చెల్లెల్నిగురించి విన్నమాట ఆశ్చర్యాన్నే కలగచేసింది. అతడు జాతకాన్నిచూసి, రాజుగారియోగం కంసయోగంగా వుందనిచెప్పింతర్వాత, రాజుగారి చెల్లెలికి పిల్లలు లేకపోవడం, ప్రస్తుతానికి ఆమె గర్భవతిఅయ్యే సావకాశం లేకపోవడం, గుడ్డిలో మెల్ల అన్నట్లు కొంచెం మంచిలక్షణంగా కనబడింది.

చెల్లెలికి బిడ్డా, పాపా వుంటేగదా ఈ మామ చంపడానికి? బిడ్డకలిగే ఎత్తేలేదు. కొంతలో కొంత క్షేమం. కాని ఇదేమి దైవేచ్ఛ? చెరలోవుండికూడా చెల్లెలు గర్భిణిగా వుందే! గ్రహాలు తమపని తాము చేసికొని వూరుకోవల్లే వుంది.

జ్యోతిషశాస్త్రంలో తనకున్నప్రజ్ఞ అసాధారణమైందనే గర్వం తనకుంది. అయితే రాజుగారన్నమాటలు ఉచ్ఛిష్టంలా అతనిచెవుల్ని మైలపరిచాయి. దీక్షితులు ఒక్క క్షణం మనస్సులో మెలికలు పడిపోయాడు. పెల్లు రేగకముందే కోపాన్ని తాను అదుపులోకి తెచ్చుకొన్నాడు. రాజునుద్దేశించి 'ప్రభువులు ఏవిషయం అడగదలచుకొనివున్నారో, నిదానంగా ఆజ్ఞాపిస్తే చూసి చెప్తాను' అన్నాడు.

'ఇంకేముంది ఆజ్ఞాపించడానికి? ఏమిటది ఏమిటో చెప్పారుటగా! కంసదేవకి యోగమంటూ? ఏమిటా గొడవ? రానున్నదంతా తెలిసినవాళ్లు! చెప్పి వినిపించండి.'

దీక్షితులు రాణివైపుతిరిగి 'ప్రభువులకు తాము తెలియజేశారా అమ్మా?' అని అడిగాడు.

రాణి : 'ఔను. అయితే ఆ విషయమంతా సరిగ్గా చెప్పు. రాజుగారు చెల్లెలిగారిని అప్పంగొళకు పంపించాలి అంటున్నారు. అందుకు వర్జ్యం, వారం, మంచీ చెడ్డాచూసి చెప్పడం కోసం మిమ్మల్ని పిలిపించింది' అంది.

రాజు అవివేకాన్ని, తొందరపాటునూ, కొంతవఱకు రాణి సరిదిద్దింది. రాజుకూడి ఆ విషయం గ్రహించాడు. అతడు కొంచెం తీక్షణంగా పెళ్ళాంవైపుచూసి ఏమీ అనకుండానే దీక్షితులవైపు మొగం త్రిప్పాడు.

దీక్షితులు : 'నాకు విషయాన్ని అంతటినీ గ్రహించగల నేర్పువుంది. అయితే ఇప్పుడే మీకు చెప్పేదా? లేక తిరిగివచ్చేదా? అనే ఆలోచనలో వున్నా. నేను చెప్పేసంగతి విని వేసటపడి లాభంలేదు. వేసటపడేటట్లుగావుంటే నన్నేమాటా అడగొద్దు. మనస్సు శాంతపడ్డ తర్వాత ప్రభువులు ఏ ప్రశ్న అడిగినా, నాకు తెలిసినంతవరకు ఉన్నసంగతి ఉన్నట్లు చెప్తాను.'

శాంతపడటం, అన్నమాట వీరరాజును మరింత రెచ్చగొట్టిందేగాని, ఏమీ ప్రయోజనం లేకుండాపోయింది. ఆయన మొదటిఫోరణిలోనే కర్కశంగా 'అట్టే శ్రీరంగనీతులు చెప్పకు; ఏమిటా యోగం? రేపు చెప్పేదేదో ఇప్పుడే చెప్పేయి. వింటాం. చెప్పి అటుపో' అన్నాడు.

దీక్షితులు చెప్పాడు. 'నా మాటలు రుచింపకపోయినంతమాత్రాన ప్రభువులు కోపగించుకోగూడదు. మా పెద్దలనుండి నేను నేర్చుకొన్నశాస్త్రంలోని సంగతులు నేను చెప్తాను. ప్రభువులకు ఇప్పుడు పట్టేయోగం, లోగడ మనం ఎరిగియున్న ఒక యోగానికి సరియైన నకలు. దానిప్రకారం సోదరుడు సోదరికి, ఆమెబిడ్డలకు కష్టాలు కలగచేయడం, అనేది సూచింపబడుతుంది. పెద్దలు ఆవిధంగా చెప్పారు. ముందుగా తెలిసికోవడం, అటువంటి సన్నివేశంనుండి సాధ్యమైనంతవరకూ తప్పించుకోవడానికి ప్రయత్నించడానికిగాను. ప్రస్తుతం ప్రభువులు తమసోదరిని అల్లుడుగారినుండి వేరుచేసి, రాజభవనంలో వుంచారు. గ్రహాలగతి జాగ్రత్త అని చెప్పుతోంది. చెల్లెలిగారిని రాజుగారియొద్దకు పంపించవలసి వుంటుంది. ఈ యోగంమాట నేను మొదట చూసినప్పటికి చెల్లెలుగారు గర్భవతి కాలేదనుకుంటాను. ఇప్పుడామె గర్భిణి. దీన్నిబట్టే మనం గ్రహాలు సూచించింది నిజమని భావించవచ్చు. చెల్లెలిగారిని అప్పంగొళకు పంపించివేసి ప్రసవానంతరం ఒక్క ఏడాదిపాటు అటు ప్రక్కకు పోకుండావుండటం మంచిది. చెల్లెలుగాని, ఆమె భర్తగాని, ఇక్కడికి రాకుండా కట్టడి చేసేది. ఆమధ్యకాలంలో మనవళంతప్పి ఏవిధమైన అనర్థమూ జరుగకుండా కాపాడవలసిందని ఈశ్వరుని ప్రార్థించాలిసి వుంటుంది. అపాయం తప్పించుకొని ఓ సంవత్సరం పాటు భద్రంగా గడిపివేస్తే ఆపైన భయంలేదు'

రాజు: 'మనకు ఎప్పటికీ భయంలేదు. మీరు బెదరగొట్టినట్టల్లా బెదిరిపోవడానికి మేము గాజులు తొడిగించుకోలేదు. మీకూ మీ గ్రహాలకీ ఈ విషయం గట్టిగా చెప్తున్నాం. మీరు చెప్పినట్టల్లా మేము ఆడేవాళ్ళం కాము. మిమ్మల్ని, మీ గ్రంథాల్ని అబద్ధమని రుజువుచేస్తాం చూడండి. మా సోదరి రాజభవనంలోనే వుంటుంది.

దీక్షితులు: 'అపైన ప్రభువులచిత్తం. హితం తెలిసినంతవరకూ చెప్పాలి.'

రాజకుమారి తండ్రిదగ్గరకు వెళ్ళి, అతని బుగ్గనిమిరి 'అప్పాజీ! అత్త ఇక్కడవుంటే తిండికూడా తినదు. ఆమెను ఆమె భవనానికి పంపించివేద్దురూ!' అంది.

రాజు: 'ఓసి పిచ్చిదానా! నువ్వు పెంచి పోషిస్తావు కదా అని ఆమె నాకు చెల్లెలుగా పుట్టలేదు. నీకెందుకు ఆమెను కాపాడే సంగతి.'

రాణి: 'తంగియమ్మాజి (చెల్లెలుగారు) రాజభవనంలో వుండటం తప్పేమీ కాదు. మనమే పురుడు పొయ్యవలసివుంటుంది. తల్లీ పిల్లా, ఆపైన సుఖంగా వాళ్ళ ఇంటికి వెళ్ళవచ్చు. కాని అల్లుడుగారికి ఆపాటి జ్ఞానం లేదు. ఇప్పుడే పంపించివేయడం ఆయనకు సమ్మతం; ఊరిలో మనకీ మంచిపేరు నలుగురిలో. చెల్లెలుగారికీ సంతోషం. శాస్త్రం చూసినా అదే సరైనమార్గం అనిపిస్తోంది. మన పుట్టమ్మాజి (వీరరాజు కూతురు) కావాలిస్తే పోయి చూసి వస్తూవుంటుంది. ఇప్పట్లో పంపడమే మంచిదనిపిస్తోంది.'

రాజకుమారి తండ్రి కంఠం తన బాహువులతో అప్పళించి చెంపకు చెంపచేర్చి సానునయంగా 'అవునప్పాజీ! పంపించివెయ్యండి' అని బ్రతిమాలింది.

దేనికి లొంగని వీరరాజు కూతురి ప్రేమానునయాలకి వెన్నవలె కరగిపోయాడు. 'సరే! అట్లయితే పో. పోయిపంపు. ఈ పొద్దే వెళ్ళిపోనీ. బావనయ్యనే గెలవనీ. పూజపూజ అంటాడే. బంగారం, ధాన్యం, వస్త్రాలూ, అడిగినవన్నీ ఇచ్చిపంపించు' అన్నాడు.

దీక్షితుల్ని అన్న ఎత్తిపొడుపుమాటలకు ఆయన ఏమన్నా అంటాడేమోనని రాణి కొంచెం భయపడింది. దీక్షితులు ఏమీ మాటాడలేదు. లేచి 'స్వస్త్యస్తు. ఆజ్ఞ అయితే నేను వస్తాను' అన్నాడు.

రాజు ఆయనకు బదులాడలేదు. అతనివంక చూడనైనా లేదు.

రాజకుమారి అంతకుపూర్వమే బైటికి పరుగెత్తిపోయింది. రెండునిమిషాల్లో బసవన్నతోబాటు వెనక్కు తిరిగింది. రాజుతో 'అప్పాజీ! బసవయ్యకు చెప్పండి' అంది.

రాజు బసవన్నకు 'దేవమ్మను అప్పంగొళకు పంపించివేయాల్సింది. ఒరే! కుంటీ! వాడెవడురా? రాజభవనం కాపలావాడు! చెన్నబసవన్నను లోపలికి రానిచ్చినవాడు. ఆ నీ కొడుకిని ఇల్లా లాక్కురా! ఎందుకు లోపలికి రానిచ్చాడో అడుగుదాం! చెత్తంపెట్టి వీపు వంబరేగకొడదాం' అన్నాడు.

రాజు చివరిమాటలకు కుమారి పులుకుపులుకున తల్లివైపు చూసింది. రాణి ఆనంగళి గమనించినట్టే దీక్షితులతో 'దయచేసి సామగ్రి ఇప్పిస్తాం, రండి అయ్యావారూ!' అని అంతఃపురంవైపు మళ్ళింది. దీక్షితులు రాజుగారికి నమస్కరించి ఆమె వెనకవెనకాలే వెళ్లాడు.

లోపలికివెళ్తూ, రాణి పలాడించి కూతురికి తనతో రమ్మనమని సైగ చేసింది రాజకుమార్తె తల్లివెనకాలే వెళ్ళింది.

# 56

వీరరాజు చెల్లెల్ని చెరనుండి విడవటానికి ఒప్పుకోడం, రాణికి సంతోషమిశ్రితమైన ఆశ్చర్యాన్ని కలిగించింది. సంతోషంకంటె మించిన ఆశ్చర్యం ఆమెను ముంచెత్తింది. ఆమెకు ఆక్షణంలో ఒకే ఒక ఆలోచన. మరేమైనా కారణం పెట్టుకొని వీరరాజు తానొప్పుకున్న మాటను త్రోసిరాజనకముందే దేవమ్మాజిని అప్పంగొళకు పంపించివేయాలి.

అంతఃపుర పెరటిలోనికివేరిన రాణి దీక్షితుల్ని ఒక ఆసనంమీద కూచోమని 'చెల్లెలుగారు పుట్టినిల్లు విడిచివెళ్లడానికి ఈ ప్రొద్దు శుభగడియలేగా అయ్యవారూ!' అంది.

దీక్షితులు: 'ఆవిషయం ఏమీ చూడవద్దు. మంచిపని చేయడానికి అవకాశం చిక్కినప్పుడు వేరే ఏ ఆలోచనా పెట్టుకోకూడదు. ఆమెగారిని ఇంకో గడియలోపల ఈ శుభ ప్రయాణానికి సిద్ధపడుపు. ఈశ్వరుడు కాపాడుగాక' అన్నాడు.

రాణి కూతురితో, 'పుట్టమ్మా! అత్తదగ్గిరకుపోయి ఇప్పుడే ఊరికి వెళ్ళాలట, అప్పాజి చెప్పారు అని తెల్పి ఆమెను ఇక్కడకు తీసుకురా అమ్మా! నే నీలోపల కావలసిన కానుకలు మొదలైనవన్నీ సిద్ధం చేస్తాను. ఎక్కడి జాజవే తల్లి!' అంది. రాజకుమారి వెంటనే అత్త దగ్గిరకు బైలుదేరింది.

అత్త రాకముందే అంతా సద్ది సిద్ధం చెయ్యాలని, ముగ్గురు దాసీలను ఒకళ్ల వెంట ఒకళ్లను పిలిపించి. ఒకత్తెతో 'పల్లకీ బోయలదగ్గిరకుపోయి వెంటనే ఒక మేనాను వాకిలి ముందు తెచ్చిపెట్టమని చెప్పు. ఇద్దరు బోయవాళ్లు అధికంగా వుండనీ. కూడా తుపాకులతో ఇద్దరుభటు లుండాలి. సిద్ధంచేసి ఇక్కడకు వచ్చిచెప్పాలి అని చెప్పు' అంది. మరో దాసీతో 'వసతిలో చెప్పు. అవ్వాజి ఇక్కడకు వస్తారు, కొంచెం పండ్లు పాలు, కొంచెం [1]'హాలు బాయి' వళ్ళెంలో తీసుకొని రా' అంది. మూడోపరిచారికతో 'రెండు తమలపాకు చుట్టలు,

1. 'హోలుబాయి' —పాలతోచేసే తీపిపదార్థం ఒకటి.

పూవులు, గంధము, అక్షతలఖరిజె వెంటనే సిద్ధంచేయి' అంది. అడుపడుచుకు కానుక లివ్వ డానికి వస్త్రాలు తానే తేవాల్సివుంది. దీక్షితులకు 'కొంచెం వుండండి అయ్యవారూ : ఆడ పిల్లను ఆశీర్వదించి వెళ్లుదురుగాని' అని చెప్పి లోపలి విశ్రాంతిస్థలానికి వెళ్ళింది.

జ్ఞాపకమున్నంతవరకు శీఘ్రంగా పనిచేసేతొందరలో రెండు కంకణాలు, రెండు పట్టు నెర్లాలు, రెండు రవికెగుడ్డలు తీసుకొని వెనక్కువచ్చింది. వాటిని ఒకప్రక్కకుపెట్టి దీక్షితు లకు 'నేను మిమ్మల్ని ఓమాట అడగనా అయ్యవారూ ?' అంది.

దీక్షితులు : 'సందేహంతో పనిలేదు. నిక్షేపంగా అడగండి అమ్మాజీ' అన్నాడు.

రాణి : 'ఏదో మాటమీద విసగటచెంది దొరలు మిమ్మల్ని కొంచెం హీనంగా చూశారు. ఇందుకు మీరు కోపం పూనరాదు. వారన్నమాటల్ని మరచిపోవాలి సుమండీ.'

'అమ్మాజీ : ఇందువిషయమై మీకు సందేహమే పనిలేదు. ప్రభువులు నాకేమైన కొత్త వారా ? నాకు ఈడా జోడా ? మీ మామగారు నాకంటె చిన్నవారు. ఆయన కుమారుని నేను చిరంజీవిగా భావింపక వేరుగా ఎల్లా భావిస్తాను ?'

'మే మేమో చేపట్టినవాళ్లం. లోడబుట్టినవాళ్లు, కడుపున బుట్టినవాళ్లు మేమంతా సహించు కుంటాం. బైటివాళ్ళు నొచ్చుకుంటారని మాకు తెలుసు. మీరు రాజుగారిని మన్నించినంత మాత్రాన చాలదు. వారు ఆవిధంగా మాటాడినందుకు . వారి కేవిధమైన కీడు కలుగకుండా చూసుకోవాలి.'

'ఆప్రకారం దేవుడు అనుగ్రహించుగాక : తల్లీ : మీరుకూడ ప్రార్థించండి. ఒక్క రెప్పపాటుకాలం నా బుద్ధి తికమకపడిపోయింది. వెంటనే ఈశ్వరుని జ్ఞాపకం చేసుకున్నా. ఓంకారేశ్వరా : నీవు నన్ను కాపాడు. నన్ను పరీక్షించకు తండ్రీ : అని మనసా స్వామి శరణుకొచ్చాను. తక్షణమే బుద్ధి కుదుటపడింది.'

'మీరు పుణ్యాత్ములు అయ్యవారూ :'

'పెద్దవారి అనుగ్రహం. అమ్మాజీ, దాంతోబాటు మీవంశం నన్ను నా శరీరాన్ని పెంచాయి అని ఎప్పుడూ స్మరణకు తెచ్చుకుంటూనే వుంటాను. మూడుతరాలుగా ఈ వంశం మా కుటుంబంవారిని పోషిస్తూవస్తోంది. అరవై సంవత్సరాలుగా చేసినవుపకారం ఎక్కడకు పోతుంది తల్లీ : గుండిగెనిండావున్న అన్నం తిన్ననోటికి ఓ రాతిముక్క తలిగితేమాత్రం ఏమైంది ? అంతకుపూర్వం కడుపునిండా తృప్తిగా అన్నం తిన్నమాట అబద్ధమై పోతుందా ? కోపిస్తే నేనే చెడ్డవాణ్ణి. అయ్యవారికి కోపం రాకూడదని మీరుకూడా ఈశ్వరుని ప్రార్థిం చండి.'

దీక్షితులవారి శాంతవచనాలతో రాణి మనస్సులోని వ్యాకులం మాసిపోయింది.

అప్పటికి సింహద్వారంలోని పరిచారికవచ్చి మేనా వచ్చివుందని చెప్పింది. ఒక్కనిమి షంలో రాజకుమారి, దేవమ్మాజీ, వెనక బసవన్న వచ్చారు. బసవన్న రాణికి నమస్కరించి 'మేనా దిప్పించినా అమ్మాజీ' అని అడిగాడు

రాణి 'చెప్పించటం అయింది భగవయ్యా! అమ్మాజీగారిని పిలిచి తోడ్కొనివచ్చాను. అందరం సాగనంపి వద్దాం, పరిచారకుల్ని గుమ్మాలదగ్గిర వుండనీ, చూడు' అంది.

బసవన్న వాకిలిచివరకు వెళ్ళాడు. అక్కడనుంచి ఆమెదగ్గిరకు తిరిగివచ్చి 'అమ్మాజీ గారు నామీద [1]మనసుకైనా కోపం తెచ్చుకోగూడదు' అన్నాడు. రాజకుమారి పక్కన నవ్వింది. రాణి, దేవమ్మాజీ మొగంపైని పర్వుతీసిన చిర్నగవు చూసింది. దీక్షితుల ముఖం పైననూ నవ్వురేకలు చిందులాడాయి. బసవన్న జవాబుకోసం ఎదురుచూడకుండానే బైటికి వెళ్ళాడు.

బసలోని సేవకులు తెచ్చిన పండ్లు, పాలు, దేవమ్మాజీకి ఇచ్చి రాణి ఆమెకు విభూతి కుంకుమ అందించి, పూలు జడలో కీలించి, చేతులకు పసిడికంకణాలు తొడిగి, కానుక లర్పించి, 'ఇక మీరు ఊరికి బయలుదేరిపొండి, ఈశ్వరుడు మిమ్మల్ని కాపాడుగాక. మీ అన్నగారివంశాన్ని రక్షించాల్సిందిగా ఈశ్వరునిఎదుట ప్రార్థించండి. వెళ్ళేముందు అయ్య వారికి నమస్కరించి వారి ఆశీర్వాదములు తీసుకోండి' అంది.

దేవమ్మాజీకి నోటినుండి మాట పెగలలేదు. ఆమె అనుకోకుండా.. సౌభాగ్యపువెల్లువ ఆమెను ప్రవాహంగా ముంచెత్తివేసింది. అశ్రుపూరితాలైన నేత్రాలతో, ఆమె [2]ఒడి గట్టించు కొని దీక్షితులవారికి నమస్కరించింది. ఒక్కమాటైనా నోటివెంట జారనివ్వకుండా వదినె గారి రొమ్ముపై తలఆన్చి జోత అర్పించింది. మేనకోడలిని పట్టుకొని కౌగిలించుకొని, తల నిమిరి ముద్దాడింది. 'నీవు బ్రతికించావు ప్రభూ! అని ఈశ్వరుని స్మరించి రాజభవనంనుండి పాదం బైటమోపింది. రాణి, రాజకుమారి ఆమెవెంట వెళ్ళారు. దీక్షితులు కుంకుమాక్షతలు నాలుగుతీసుకొని వారివెంట వెళ్ళాడు. శుభమస్తు అని దీవిస్తూ దేవమ్మాజి వెడలిపోయే సమయాన ఆమెపై చల్లాడు.

రాజుగారి చెల్లెల్ని ఎక్కించుకొని మేనా అప్పంగొళకు బైలుదేరింది. ఏళ్ళతరబడి క్రమ్ముతున్న చీకట్లు ఈ సంధ్యవేళ వైదొలగిపోయినాయి అని రాణి మొదలుకొని కస పూడ్చే పరిచారకురాలుదాకా అందరూ సంతోషపడ్డారు.

---

1. గర్భవతులకు అనేకవిషయాలపై మనసవడం సహజం—అనువాదకుడు.

2. గర్భవతులైన స్త్రీలకు ఒడిగట్టి అందులో కడుపుచలవకై పళ్ళు, తాంబూలాదికం పెట్టుట వాడుక.

# 57

ఆడుబిడ్డను కాపాడిపెట్లయింది. ఇహ రాణికి, కష్టమయిన మరోపనికూడా వుంది. తన మాటప్రకారం నడచుకొని అపాయంలో చిక్కుకొన్న ఉత్తయ్యన్ను రక్షించవలసివుంది. ఇటువంటి సంకటం రావచ్చునని ఆమె ముందే ఆశంకించివుంది. కాని ఆ శంక ఆమెకు నేటి వస్తుస్థితి కలగజేసినంతభయాన్ని కలగజేయడంలేదు. రాజుగారిమనస్సు అప్పుడున్న స్థితిలో అతడు ఉత్తయ్యను ఏమిచేసినా చేసినవాడే. పిల్లవానిగతి ఏమి? తన కూతురిగతి ఏమి? దోవణ్ణ ఏమంటాడు? దేశానికి భద్రత ఎట్లా చేకూరుతుంది? కీడు నూహించినకొలదీ రాణి మనస్సు తత్తరబిత్తరలాడ మొదలుపెట్టింది. ఏదో కారణంచేత రాజు ఈసంగతిని మరచి ఉత్తయ్యను పిలవకుండానే వున్నా మంచిదేనని రాణికి అనిపించింది.

వేరే ఏం కారణం కావాలి, కొంచెం ఎక్కువగా తాగితేచాలు అని ఆమె మనస్సులోని అభిప్రాయం. రాజు తాగినప్పుడల్లా చెడిపోతున్నాడే అని మామూలుగా బాధపడే రాణికి ఆక్షణంలో కొంచెంతాగి మైమరచిపుండటమే మంచిదనిపించింది.

కాని ఆ ప్రతీక్ష ఫలించలేదు. తాగినప్పుడే నిజానికి రాజులో పగ తీర్చుకొనే ఉబలాటం కలుగుతుంది. ఆ సాయంకాలం, అతడు తాగనూ తాగాడు. 'ఎక్కడ ఆ ఉత్త?' అని బసవన్నను నాలుసార్లు గద్దించి అడగనూ అడిగాడు.

ఉత్తయ్యకు రాజభవనానికి కాపలా కాయడం పనితోబాటు ఊరి కావుదలనుగురించి పైనుండి కనిపెట్టేపనికూడా వుంది. అందుకు ఆ మధ్యాహ్నం ఊరికావలానుగురించి ఏదో విచారించిరావడానికి వెళ్ళాడు. రాజభవనానికి రాత్రి కావలా చూసుకోవడానికిమాత్రం రావడానికి అతనికి వీలైంది.

రాజభవనం పైటివాకిలిదగ్గిర వస్తూనే అక్కడి కావలావాడు 'దొరలు మధ్యాహ్నం తమకోసం కబురు పంపించారు' అన్నాడు. ఎందుకైవుంటుందా అని ఉత్తయ్య ఆలోచిస్తూ వుండగానే, అతన్ని వెదుకుతుంటూపోయిన నౌకరు అతనిదగ్గిరకువచ్చి చేరాడు. రాజు పిలిపించిన కారణంఏమిటో తెలిపాడు. ఆ సాయంకాలం రాజుగారు చెల్లెల్ని అప్పంగొళకు పంపించివుండటం చెప్పాడు.

ఉత్తయ్యకు ఒకే ఆలోచన: రాజుచేతికి చిక్కినట్లే మాటలాడారు. తాను కోపగించుకొని, అతనికి జవాబిస్తే అవివేకమనిపించుకొంటుంది. మిగతాసంగతి ఏమైనా తాను చెప్పు బసవన్నను లోపలికి వదిలిపెట్టింది, రాజకుమారిబాధ్యతమీదనని తన నోటితో తాను చెప్పకూడదు. ఆ విషయాన్ని గట్టిగా వల్లెవేసుకుంటూ అతడు రాజుగారి పంచపాళికి వచ్చిచేరాడు. గుమ్మంలోని సేవకుడు 'కొంచెం తాళండి' అని అతనికిచెప్పి ఉత్తయ్య వచ్చినసంగతి

బసవయ్యకు చెప్పమని ఒక నౌకరును పంపారు. రెండునిమిషాల్లో బసవన్న వచ్చారు. రాజు గారిగదిలోకివెళ్ళి అతడు కొంచెం నిద్రలోవున్నట్లు గమనించాడు. మెదలకుండా గుమ్మం దగ్గిరకు తిరిగివచ్చాడు. ఇంతలో మెలకువవచ్చిన రాజు 'ఎవరది? కుంటి బసవన్నేనా? ఉత్తయ్యను పిలిపించలేదా? ఎందుకింత ఆలస్యం?' అని అరిచాడు.

'వచ్చారు వచ్చివున్నారు దొరా!'

'ఇక్కడకు రమ్మనమని చెప్పు, ఆ రండాముండావాణ్ణి!'

బసవన్న తిరిగి గుమ్మంలోకివచ్చి 'దొరలు మిక్కిలి కోపంగావున్నారు. ఇప్పుడెదో, ఎప్పుడో పనివుందని సాకుపెట్టి మీరు వెళ్ళిపొండి. నన్ను తిడతారు, నేను పడి వూరుకుంటాను. ఏమంటారు?' అన్నారు.

ఉత్తయ్యకు బసవన్న సలహా రుచించలేదు. తాను దోవజ్జకు బంధువు అనే కారణంచేత బసవన్నకు తన్నుగురించి ఈర్ష్య అని అతనికి తెలుసు. అది నిజంకూడ. వేరేసందర్భంలో అయితే బసవన్న దోవజ్జగారి ఈ చుట్టానికి కొంచెం పరాభవం జరిగేటట్లే చూసేవాడు. ఊరకేవాడు కాడు. కాని ఇప్పుడు దోవజ్జను పరాభవించడం, రాజుగారి వైరివర్గానికి బలం చేకూర్చినట్లౌతుంది అని అతనికి కొంచెం విరక్తి ఏర్పడింది. ఉత్తయ్య ఈసంగతి గమనించాడు. ఇతడు తన్ను హెచ్చరించడం తన హానికేనని అతని అనుమానం పై పెచ్చు ధైర్యంతో బాటు, సహజంగా కలిసిమెలిసివుండే ఒకానొక తుంటరిసాహసంకూడా అతనిలో వుంది. ఎక్కడైనా 'అపాయం' అనేమాట వింటేచాలు 'ఏపాటి అపాయం? కొంచెం చూద్దాం!' అనడం అతనిమనస్సుకైన ప్రథమప్రవృత్తి. బసవన్న ఇచ్చిన సలహాకు ఒక్క నిమిషం ఊరుకొని అతడు 'ఏం వినాలో విననీ, లోపలికి పదండి' అన్నాడు. బసవన్న అతనిని లోపలికి తీసుకొనిపోయి ద్వారంప్రక్కగా తాను నిలిచి, మరోప్రక్క అతన్ని నిలిపి 'ఉత్తయ్య వచ్చారు. ప్రభూ!' అని రాజుకి చెప్పాడు.

# 58

అప్పటికి గౌరమ్మాజీ, రాజకుమారి, అంతఃపురంనుండి పంపపాళీవచ్చి గది బైటివసరండాలో ఒకప్రక్కకు నిలబడ్డారు. రాజుగారికి కనబడటంలేదు. మొదట్లో ఉత్తయ్యకూ కనబడలేదు. బసవన్న ఆ వైపు చూసినచూపుతో అక్కడ ఎవరో ఉండవచ్చునవితోచి ఆయన అటువైపు గూగా కొంచెం తలత్రిప్పాడు. రాణి, రాజకుమారి నిలుచుండటం ఎదురుగావున్న గోడ

అర్థంలో చూశాడు. తన ఆచరణగురించి ఆయన మొదట చేసికొన్ననిశ్చయం వాళ్ల ముఖ వైఖరిచూడగానే మరింత స్థిరపడింది.

బసవన్నమాటనువిని రాజు 'ఎవరు అది? ఉత్తయ్య వచ్చాడా?' అని అడిగాడు. ఉత్తయ్య 'ఔను దొరా!' అన్నాడు.

'ఒరే ఉత్తా! రాణభవనం కావలా కాయడానికని నిన్ను పడవాలుగాపెట్టితే చెన్న బసవన్నను నువ్వు అదెలా లోపలికి రానిచ్చావు?' అని గద్దించి అడిగాడు.

ఉత్తయ్యా జవాబు ఏమీ చెప్పలేదు.

రాజు : 'ఎందుకో కొడకా! అడిగినమాటకు మాడువలకవేం?'

ఉత్తయ్య: 'కొడుకా! గిడుకా అంటే మేం వినేదిలేదు దొరా! తప్పుంటే విచారించాలి. నిజంగా నేరముంటే దండించాలి. అంతేగాని, మేం కొడుకు, తొత్తుకొడుకు అంటే పడం' అన్నాడు.

'దండిస్తాం చూడు. వదిలేస్తాం అనుకొన్నావా? దండిస్తాం చూడు. చెప్పు, ఎందుకు వదిలేసావ్?'

'వదిలినమాట నిజమే ప్రభూ! ఇప్పుడు దాన్నిగురించి అడగవద్దు. శిక్ష ఏమిటో ఆజ్ఞాపించండి, అనుభవించితీరుతాను.'

'అనుభవించితీరడం ఎటువంటిదోయి మూర్ఖా! కథే ముగిసిపోతుంది. నీ తల తెగిపోతుంది. కాదంటే కొర్రుకెక్కించి చంపిస్తాం.'

రాణికి ఇంక ఈ పిల్లవానిని నిస్సహాయునిగా విడవకూడదు అనిపించింది. ఈ చర్చలో ఎట్లా జోక్యం కలిపించుకోటమా అని ఆమె యోచిస్తూవుంది. రాజకుమారి ఏమనుకుందో, తల్లికికూడా సూచించకుండా తానున్నచోటినుంచి తటాలున గదిలోపలికి వచ్చింది. తండ్రి పక్కన మోకరిల్లికూచుని ఆయనకంఠం కౌగిలించుకొని 'అప్పాజీ! మీరు ఉత్తయ్యను ఏమీ అనకండి. మామయ్యను నేను దొంగతనంగా లోపలికి తెచ్చా. అత్త ఒకటే ఏడ్పు! నేను చూడలేకపోయాను. ఏమైనా తప్పుంటే అది నాది' అంది.

'అవతలికి పో చిట్టితల్లీ! నువ్వు ఎందుకువచ్చావ్ ఇక్కడికి? నువ్వు దొంగతనంగా లోపలికి వదిలావా? నువ్వు దొంగపని చేసేదాకా ఇతడు ఎందుకు కూరుకొన్నాడు? నీ అందానికి మోహపడి వదిలాడా?'

'ఔను, అప్పాజీ, దొరగారికూతురు చెప్పినారే. కూతురేమిటి తండ్రి యేమిటి? అని నా మొహంచూసి అనుమతించాడు.'

అలోగా రాణికూడా లోపలికి వచ్చింది. కూతుర్నిపిలిచి, 'ఇక్కడకు రా! చిట్టితల్లీ అప్పాజీగారి[illegible]విసుగు కలిగించకు. పడవాలు తప్పేమిటి? రాణి రాజకూతురు, రాజుగారి

వెళ్లిలా ఏడ్వకూడదు అంటే అల్లుడుగారిని లోపలికి తెచ్చారు. కావలివాండ్రు దొరతో చాడీ చెప్పివుట్లుందే!' అంది.

రాణి మరి రెండుముక్కలు చెప్పుదామనుకున్నట్లుంది. ఇంతలో రాజా పుంటివచ్చాడు, 'ఓహో! నువ్వూ వచ్చావా? కొడగు రాణివి. నీ బోవన్న, అల్లుని రక్షించడానికా! అవతలికి నడు. చాలు చాలు. ఇదేమిటి తల్లీ చిట్టితల్లీ! నేనేమి చేయబోయినా నువ్వు నా కాలికి చుట్టేసుకొంటావే! అల్లాఅయితే ఇహ నేను ఏమి చేయవలెనని అన్నా నిన్ను అడగాలన్న మాట!' అన్నాడు.

రాజకుమారి: 'ఈసారికి నామాట వినండి అప్పాజీ! ఇహమీదట నేను మిమ్మల్ని కష్ట పెట్టను' అంది.

రాజు: 'ఏమిటి! వీడి మొహంచూస్తే మోహం కలుగుతోందా బిడ్డా! రేపు ఇతన్ని పెళ్ళి చేసేసుకొంటావా ఏమిటి?' అని ప్రశ్నించాడు.

రాజకుమారి: 'చేసుకుంటారేమో అడగండి అప్పాజీ!' అంది.

రాజుకు మనస్సులో ఏం భావం మెల్కొన్నదో అయన 'ఔనమ్మా చిట్టితల్లీ! నేను నీకు సరియైన ఒకపిల్లవాణ్ణి తీసుకొనిరావాలిసి వుంది. మంచి అప్పాజీ అయితే తెచ్చి వుండును. ఇతడేమంత అందగాడు? ఎటువంటివాళ్లు లేరు నీకు కావాలంటే!' అని చెప్పి ఉత్తయ్యతో 'ఒరే ఉత్తా! రాజభవనానికి కావలాకనిపెట్టితే పూర్తిగా పదురులాడటానికి చూస్తున్నావా? అవతలికి పో. అభము, శుభం తెలియనిపిల్లను మోహపెట్టుతూ బెల్లిస్తు న్నావా? అందగాడవేరే పో! దూరంగా పో. తిరిగి ఇటువైపు కన్నెత్తి చూశావా జాగ్రత్త!' అన్నాడు. బసవన్నతో 'ఒరేయి బసవన్నా! ఈ తొత్తుకొడుకు బోవన్న మేనల్లుడు పొగరు బోతువేషాలు వేస్తున్నాడే. బోవణ్ణకు చెప్పు. వీణ్ణి పొలిమేర కావలాకు పెట్టమని. ఈసారికి వదిలిపెట్టుతున్నాం. చేతికర్రపెట్టి బాదుతాను. తల తీయించేస్తాను.'

అందరూ పొండి అవతలికి. అబ్బా! నా తల పగలగొట్టుకొనిపోతోంది. ఒరేయి బసవన్నా, ఇంత [1]పీరు తెస్తావా! నీ తస్సాగొయ్యా!' అని మొరగి చాలించాడు.

వీరరాజు చాల అలసిసొలసిపోయాడు. క్రిందటేడు కోపవేగంతో మేని స్పృహ దప్పి నప్పటినుంచి ఈవిధంగా భావోద్రేకం కలిగినప్పుడెల్లా అతనికి ఆదేవిధమైన ఆయాసం, శ్రమా కలుగుతూవుంటాయి. వాళ్ల మైకం కమ్ముతుందని జంకి అతడు అప్పటికి చాలిస్తాడు. అత డింకేమీ మాటాడకపోవడంతో రాణి ఉత్తయ్యకు చేసైగతో బైటికి పొమ్మనమని చెప్పింది. అతడు ఆమెవైపు, రాజకుమారివైపు ఒక్క క్షణంపాటు చూసి, వాకిలికవతలకు వెళ్ళిపోయాడు. బసవన్న అతనివెనక వరండాలోకి పోయాడు. క్షణమైనవిమ్మట ఒక వెండి పాత్రతో నిండా పీరుపోసి తెచ్చాడు. రాణి దాన్ని తీసుకొని రాజుదగ్గిరపెట్టి 'తీసుకోండి

1. పీరు = కల్లుపీళ్లు.

పిల్ల' అంది. రాజా పిల్లని తీసుకొన్నారు. ఇంత చిలిపి కాగాదు. వ్యంగ్యంగా 'కొడుకురాని కూతురిని ఎవరికీ ఇవ్వవద్దు. పరిత్యైనవాడినిచూసి పెళ్ళిచేయి' అన్నాడు. 'కళ్లుతెరచి మొదటనే ప్రక్కమీద కూచునివున్న కూతురి తలను నిమిరి తిరిగి కళ్లు మూసాడు. ఒక్కనిమిషంలో నిద్రలో అతడుపెట్టే గురక వినబడుతోంది.

పెనుగొండలాంటి బెడద మంచులా కరగిపోయిందని రాణి ఓంకారేశ్వరుని మనసా స్మరించింది. కూతుర్ని లేపి, పిలుచుకొని అంతఃపురానికి వెళ్ళింది.

# 59

ఆ సాయంకాలం దేవస్థానానికివచ్చి దీక్షితులను చూస్తాననిచెప్పిన భగవతి ఆ ద్వేవకారంవచ్చి [1]దొడ్డప్పకు తన కథను చెప్పింది.

'పదునాల్గేళ్ల పిల్లను. [2]అణ్ణయ్య, రాజభవనంలోని టకటొంకులు నేనేమి ఎరుగుదును? రాజాగారి తమ్ములు దగ్గిరకు రా అన్నారు. రాను అని ఎందుకు చెప్పాలి? వెళ్ళాను. దగ్గిర నిలిచి 'పెళ్ళి అయినట్లే అనుకో, బెదకురా' అన్నారు. అమ్మను అడగాలి అన్నాను. తరువాత అడుగుదుగానిలే అన్నాడు. లాగుకొని బలవంతంగా పోనేపోయారు. తనపని తాను చేసే వాడు. తర్వాతవచ్చి అమ్మకు చెప్పాను. 'నా కూతురు గతేమిటి? అని వాపోయింది. ఆయన దగ్గిరకు వెళ్లింది. 'ఇల్లా చేయవచ్చా?' అని అడిగింది. 'ఏమీ చేయలేదు. నువ్వు మెదల కుండా వుండు. పెళ్లి అయిందనే అనుకో' అన్నారు. అమ్మ మెదలకుండా వుండిపోయింది. నన్ను నాల్గురోజులు ఓపికపట్టు అంది.

'ఓపిక పట్టు అని చెప్పినంతమాత్రానికి ఆపిల్ల ముసలిదైపోయిందా? ఓపికపట్టే వయస్సా? ఓపికపట్టే కుటుంబమా? చూస్తాను, ఓపికపడుతాను అంటే ఆగేతీరు వుందా? నాలుగురోజులు ఓపిక పట్టేలోపల నాలుగుసార్లు కలిశారు. నాన్నకు తెలుసు. రాజాగారికి చెబుతాను అన్నారు. నాన్ననూ ఎల్లాగో శాంతపరిచారు.

'ఈమె నా భార్య. తొత్తుకాదు' అన్నారు. 'హొళేరి' నుండి లేవనెత్తుకొని నాకునాడికి చేర్చారు.

'ఏదోవిధంగా కబురు రాజుకు చేరింది. ఆయన గుర్రంఎక్కి 'నాకునాడికి' వచ్చారు. కలిసివున్న సమయం. గదిలోంచి మిద్దెపైకిదింపి సొరంగంనుంచి పంపించివేశారు. వాకిలి తెరుస్తూ 'అన్నయ్య'ను చూశారు.

---

1. దొడ్డప్ప పెత్తండ్రి. 2. అణ్ణయ్య — అన్నయ్య

'ఏమయ్యా, కాదా!' అని అడిగితే 'కాదు నిజం' అన్నారు. తర్వాత చెప్పడానికి వీళ్లేవి మోసం అంటే మోసమే. 'రాజుగారికి చాడీలు చెప్పారుగా. ఏంచేస్తారో చెయ్యండి' అన్నారు.

'పిల్లవాణ్ణి కన్నా. నాన్న, అమ్మా తిరిగివెళ్లి గోలచేసారు. - 'మీ కూతుర్ని పంపండి. చెబుతున్నానుగా' అన్నారు.

ఆ పిల్లవాణ్ణి కన్నాయన తిరిగి ప్రలోభనం చూపించారు. మళ్ళీ జతను ఉంచుకున్నారు. మళ్ళీపెళ్ళి అయినట్లే భావించు అని ఊరడించారు. వెనక్కి పంపించారు. 'మెదలకుండా వుంటే పెళ్లి, చాడీలుమోస్తే పెళ్ళిలేదు గిల్లీలేదు' అన్నారు. కానీలే అని ఓపికపట్టి వుంటూ వుంటే నాన్నను చంపివేసారు.

'ఆయనతో కూడివున్నప్పుడు ఆయనగారిమాటను చక్కగా వినుకోవాలి అన్నా! అన్న హయాము అయింతర్వాత తానేగా రాజు. తన హయాము తీరిపోయింతర్వాత నా కడు పునపుట్టిన బిడ్డే రాజు. అంతా నిజమే అనుకొన్నాను. అణ్ణయ్యా, వీళ్లకు పిల్లలే లేరు చూడు. దేవక్కకు ఒక్కగాని ఒక్కబిడ్డ పుట్టాడు. ఆబిడ్డ అప్పుడే పోయాడు. ఎన్నోఏండ్లు గడచి పోయాయి. తిరిగి కడుపూలేదు, కాలూ లేదు. పెళ్ళి అయిందని ఒప్పుకొంటే వాళ్ల ఆస్తికి ఈ నా బిడ్డే హక్కుదారు. కానీలే అనుకున్నా. మెదలకుండా వుండిపొయ్యాను.

'నేను సంతోషంగానే ఉన్నాననుకోండి. పెండ్లి కాలేదని పౌరుషానికే కొదువలేదు. పెళ్ళి కాలేదుగదా అని నేనేమీ మోసం చేయలేదు. చేతులకు గాజులుతొడిగి, మెళ్ళో మంగళ సూత్రం కట్టినవానితోవలెనే, ఋజువుగా నడుచుకొన్నాను. ఋజువుగా నడిచానుగనుక నాకు నెలజీతం ఇమ్మనమని అడగలేదు. పరువూ, పటెమంచెమూ లేని పెళ్లాన్ని. సొంతభార్య లాగానే సంతోషంగా వుంటూవచ్చా.

'సంవత్సరం అయిపోయింది. దేవక్క ఒక్కశిశువును కన్నది. నా పిల్లడు పెళ్లికాని పెళ్లాం పిల్లడు. ఆమెపిల్లడు పెండ్లయినభార్య పిల్లడు. వీడి గతేమిటా అని నాకు చాల భయం వేసింది.

'పిల్లవాణ్ణి ఎత్తుకొని అమ్మదగ్గిరకు వెళ్లాను. వేటకోసం కట్టిన నాడు నాడు రాజభవనంలో ఆయన, ఆయన స్నేహితులు ఇద్దరూమాత్రమే వుండివున్నారు. దేవక్క హాలేరు రాజభవ నంలో ప్రసవించింది. అమ్మనూ, నన్నూ పెరటిలోనికి పిలిపించారు. దాసీముండ, లంజముండ కాన అని అడ్డమైనతిట్లూ తిట్టారు. అమ్మ పిల్లవాణ్ణి ఎత్తుకొని దగ్గిరకువెళ్ళింది.

'ఇది నీబిడ్డ కాదా, నా కూతురు లంజేననుకో, అయినా నీబిడ్డేకదా అని అడిగింది. బిడ్డనుచూసి తండ్రికి కోపం మరింత తీవ్రమైంది. ,ఓసి, లంజేకానా! నువ్వు నాకు చెప్పే పాటిదానివా? అంటూ బిడ్డ కాలుపట్టుకొని క్రిందికిగుంజి, నా బిడ్డే, ఇక్కడవిడిచి వెళ్ళి పొండి అని పెద్దగా అరిచారు. కాలు మెలబడడంతో పిల్లవాడు గొల్లుమని ఏడ్చాడు. నా కడుపు

దహించుకొనిపోయింది అన్నా! నేను ఆయన్ను తనివితీరా తిట్టాను. 'నీ వంశం నిలుస్తుందా?' అని అడిగాను. నిలిచేవుంది అన్నారు ఆయన. బిడ్డను క్రిందవుంచుతారా లేక చంపి పారెయ్యనా? అని గద్దించారు. దాంతో అమ్మ బిడ్డను క్రింద వుంచింది. పెద్దపెట్టునఏడ్చాడు బిడ్డ. బిడ్డ నాయన చెప్పారు. 'నా బిడ్డను నేను చూసుకొంటాను. బిడ్డకూ, మీకూ ఏమీ సంబంధం లేదు. మీరు ఇప్పుడే సూటిగా తిరిగి వచ్చినదారిని వెళ్ళిపోవాలి. కొడగునేలదాటి వెళ్ళాలి, నన్ను అడగకుండా చెప్పకుండా మళ్ళీ ఈనేల త్రొక్కారా! చూసుకోండి, ఈ బిడ్డశవం మీ చేతికొస్తుంది జాగ్రత్త!' అన్నారు. 'పొండి' అని విదలిస్తూ మూదలించారు. నలుగురు మరి దారకుల్ని పిలిచి పైన నిగావుంచి పొలిమేరఅవతలికి వదలిపెట్టిరండి అని ఆజ్ఞాపించారు. పోయాం అదేపోకడగా అన్నా. తల్లీ కూతుళ్ళం, మొహాలు వేలాడేసుకొంటూ! ఓయి దైవమా! ఈ బిడ్డను ఏదోవిధంగా కాపాడు తండ్రీ! అని మ్రొక్కాను. ముప్పైనాలుగుఏళ్ళు కాలగర్భంలో కలిసిపొయ్యాయి. బిడ్డను బ్రతకనీ, బట్టగట్టనీ అనే గంపెడాసతో ఇటువైపు ఇన్నాళ్లుగా మొహమైనా చూపించలేదు. అన్న చనిపోయి, తమ్ముడు రాజ్యానికి వచ్చాడు. వచ్చేదా అని కబురుచేస్తే వస్తే పిల్లవాడికి ఆశ వదలుకో అన్నారు.

'సరే, బిడ్డ నాదగ్గిరకువచ్చి ఏం చెయ్యాలి, వున్నచోటనే వుండనీ, పెరగనీ. మేమున్న చోట నాసిగానే వుందామె' అని అనుకున్నా. అమ్మ చచ్చిపోయింది, ఒక్కర్తెనే మిగిలా. గురుసేవ చేశాను. భగవతిచరణకమలాలు శరణుజొచ్చాను. ఇవ్వాళకాకపోతే రేపు నీ కరుణ రానీ; నా కన్నబిడ్డను తండ్రి సింహాసనంపై కూచోనీ అని వేడాను. ఆ బిడ్డను కంటితోనైనా చూడకుండా క్షేమసమాచారం తెలుసుకుంటూ ఇంతకాలం మెదలకుండా వుండిపోయాను.

'గురుదేవులు అచ్చంగా మీవలెనే చాలమంచివారు. అన్నా! వారూ నన్ను 'పాప' అనే పిలుస్తూవుంటారు. తమ కూతురిలా చూసుకొనేవారు. నాన్నలాగానే ఆయనకూ వైద్యమూ, కాస్తంత సంగీతమూ వచ్చు. మీవలెనే జ్యోతిషంకూడా చెబుతారు. 'ఊరికే ఎందుకు కాలక్షేపం చేస్తావు. చెప్తాను నేర్చుకో, నాకు వచ్చిందాన్ని నేర్పుతా' నన్నారు. అల్లాగేనని వారు చెప్పినవిద్య నేర్చాను. అదే నేను చేసేవైద్యం, చెప్పే జ్యోతిషం.

'జ్యోతిషం నేర్చి పిల్లవానిజాతకం ఎట్లా వుందా అని చూశాను. గురువులకు చూపించి సరిగావుందా అని అడిగాను. పదిపంక్తులు నేను వ్రాసిందాన్నిచూసి సరిగానే వుందన్నారు. మీరు చెప్పేటట్లే వారుకూడ దూరభవిష్యత్తునుగురించి ఆలోచించకూడదు అని సలహా ఇస్తూ వుంటారు. ఆ గురుదేవులు కాలధర్మంచెంది ఇప్పటికి రెండేళ్లయింది. చనిపోతూ, నీ అరణ్యవాసం గడచిపోయినట్లే అని ఓ మాట అన్నారు. ఆరునెలలు సుమారు వారిదగ్గిర వున్నాను. ఊరికి వెళ్లదాం అనిపించింది. జాతకం చూశాను. 'పిల్లవాని దశానాథుడు మంచివాడు. పోగొట్టుకొన్నబంధువును తిరిగి పొందుతాడని, మంచిపదవిలోకి వస్తాడనీ ఉంది, వేరే ఎవరా చుట్టం? నేనుగాక! దగ్గిర వుండామని వచ్చాను. మీ తమ్ముని మనుమడు. అతని జాతకం చూసి అతని శ్రేయోభివృద్ధి కలగడానికి అవకాశముందేమో చూడండి. కలిగేటట్టు చేయండి. మీ 'పాప'ను కదా నేను. నా భాగ్యం ఎట్లావుందో చెప్పండి మరి!

# 60

తమ్ముని కూతురి స్వీయచరిత్ర విని పేక్షితులు చాల దుఃఖపడ్డాడు. 'అయ్యో పాపం, పిల్లకు ఎన్ని ఇక్కట్లు వచ్చాయి. మన కుటుంబంలోపుట్టి అందరివలెనే పెరిగివుంటే, ఈమెకు దారి తప్పి చరించాలిసిన పనేమిటి? దారితప్పి నడవవలసిన యోగముందేమో' ఎవరు చూశారు? తమ కుటుంబంలోపుట్టిన ఆడపిల్లలందరూ, పుట్టినదగ్గిర్నుంచి చనిపోయేదాకా సుఖాలే అనుభవించారా? అయితే ఆ కష్టాలన్నీ నేను: ఈ పెదవారితీరు వేరు; అంతా ఈశ్వరేచ్ఛ. ఏది ఏమిటికో, ఎప్పుడేమో చెప్పలేము. కాని అంతా ఆయనే కనిపెట్టివుంటాడనే ఒక దృఢ విశ్వాసం గనక వుంటే ఎంతోటికష్టమయినా భరించవచ్చు.

ఇది జరిగి రెండునిమిషాలైనా, పెత్తండ్రి నోట మొదల్పకుండా వుండటంచూసి పాప తానె 'ఏమంటారు అన్నయ్యా! పలకరేం?' అంది.

పేషితులు 'ఏపి ఎక్కడమ్మా! ఎంగ్రాడిదగ్గిర వున్నాడంటివే! ఇక్కడెక్కడ వుంటున్నాడు?'

'లసింగి... చెప్పాను. అతనికి రాజయోగం వుంది. కావలసినసాయం చేస్తాను. అని ముందు మాటిచ్చాం.'

'పాపా, నేను నీకు పెత్తండ్రిని. రాజభవనానికి జ్యోతిష్కుడను. నీబిడ్డ రాజా కావాలంటే ఇప్పుడు రాజై చూస్తున్నవారు ఏం కావాలి?'

'అంటే మీరు మీ మనుమడికంటె ఈ పరాయివాళ్ళు నెత్తిమీదవాళ్ళు అన్నమాట!'

'అట్లా అనకు తల్లీ! నా కూతురు నా కూతురే. నా మనుమడు నా మనుమడే. వేరే వాళ్లు వేరే వాళ్ళే. అయినా పాపా, నీకు తెలియందేముంది? ధర్మమంటూ ఓటి వుందిగా, మనుమడికి మేలు కలగాలి అని పరాయివాళ్లకు కీడు కోరడమా? అట్లా కోరమని నువ్వూ చెప్పవు.'

'ఇతరులకు కీడు చేయవద్దు అన్నయ్యా! మనుమడికి న్యాయంగా రావాలసిన ఆస్తి వచ్చేటట్లు చేయి. అదేగా ధర్మమంటే!'

'నీబిడ్డ లింగరాజు బిడ్డ అయినమాట నిజమే. కాని, ఆయన రాజ్యానికి అధికారి కాదమ్మా!'

'మీరూ అల్లాగే అంటున్నారా?'

'చూడు తల్లీ! నేను చెప్పితే నీకు వెష్టగా వుంటుంది. అదంతా నీతో తర్కించడం నాకు ఇష్టం కాదు. అయితే నీవు మామూలుగా అందరిస్త్రీలవంటిదానవు కాదు. ఈశ్వరుడు నీకు ఏ స్త్రీకీ ఇవ్వని తెలివితేటలు ప్రసాదించాడు. అదీగాక, నువ్వు ముప్పైసంవత్సరాలు తపస్సు చేసినదానివి. సామాన్యమా?'

'తపస్సా ?'

'ఔను పాపా! అటువంటి కష్టపురోజుల్లో ఈశ్వరునిఎదుట నాచౌని మనస్సు విగబట్టి, బిడ్డను కాపాడు, నాకు దారిచూపెందు అని వెడుకొన్నావా? లేదా? ఆదే తపస్సు. నీ తల్లి పుణ్యాత్మురాలు. నీ తండ్రి సత్యమూర్తి. నీవు మంచిదానవుకావడంలో ఆశ్చర్యమేమిటి? నే నేవిటి చెప్తున్నాను? .'

'నాటుకి తెలివితేటలు వర్ణిస్తున్నారు.'

'ఆ . మాకావా నుకి. పరాయివాళ్లయితే నేను ఈ మాటలన్నీ మాటాడను. నువ్వు తెలివి గలదానవు అని మాత్రం అని వుంటాను. నువ్వు మనఇంటి ఆడుపడుచువి. అయినా, మీ అమ్మ మన కుటుంబానికి చెందిందికాదు. అందువల్ల ఏమైంది? నీవు మన కుటుంబంలోవల లేవు. ఇల్లాగే మరి చూడు, నీబిడ్డ రాజుబిడ్డ. కాని నీవు రాజుకుటుంబానికి చెందిన స్త్రీవి కావు. ఏం చేస్తాము తల్లీ! అందుచేత బిడ్డ, రాజు కుటుంబంలోని బిడ్డ కాడు. పెండ్లి కాక పోవడంతో బిడ్డకు అధికారం లేకుండాపోయింది.'

'రాజైనవాడు నమ్మకం కలిగించాడు. నేను నమ్మి చెడిపోయాను. ఆ శిక్ష చాలదా అన్నయ్యా! పుట్టిన బిడ్డకూడ నష్టపడవలెనా? అతనికి శిక్షేనా?'

'ఇదికూడా నీకు తెలిసినవిషయమే పాపా! మీ నాయన చేసినతప్పుకు నీకు మన ఇల్లు అంటూ లేకుండాపోయింది చూడు. చేసుకున్న కర్మ వెంటంటి వస్తుంది. నీకు ఓచోట జన్మ కల్పించింది. నీ బిడ్డకు వేరేచోట జన్మ కల్పించింది. నేను ఎందుకుగా ఇక్కడ పుట్టానో, లింగరాజు ఎందుకోసంగా అక్కడ పుట్టాడో? పెద్దలు దీన్నే కర్మ అంటారు. పుట్టినచోట న్యాయంగా బతకాలి. ధర్మంగా నడవాలి.'

'లింగరాజు ధర్మంగా నడిచారా? నేను ధర్మంగా నడచుకోవడానికి? వారుచేసిన అన్యాయానికి బదులు అన్యాయం నేనూ చేస్తాను.'

'ఇదీ పాతకాలపుమాట పాపా! లింగరాజు అన్యాయం చేసారు. దాని లెక్క దేవుని ఎదుట పరీక్షింపబడుతుంది. ఊరికే పోతుందా? నేను తప్పుచేసి నరకానికి పోవాలిసివుంటే నువ్వూ తప్పుచేసి నరకం వెదకుతావా తల్లీ! ఇప్పుడు ఎదో వలలోచిక్కి తిరుగాడుతూ వుంది అదులేదీ. వలనుండి విడిపించుకొని, స్వర్గందారిపట్టు తల్లీ!'

'అన్నయ్యా! నా బుద్ధి స్తిమితంగా లేదు. నా బిడ్డగతి స్మరిస్తే నా కడుపు దహించుక పోతోంది. స్వర్గానికిపోయినా ఇది నన్ను వేధిస్తోనేవుంటుంది అన్నయ్యా! పిల్లలపాటు చూసి కామధేనువు ఇంద్రునిభవనంలో కన్నీరు కాల్వలుగా కార్చింది అంటారు. ఇంద్ర భవనంవెళ్ళి కూడున్నా నా కన్నీరు కాల్వలుగట్టక మానదు.'

'బిడ్డ అంతోటి కష్టంలోవున్నా డా పాపా. వివరంగా ఎందుకు చెప్పవు?'

'సమయం వచ్చినప్పుడు చెప్పుతాను అన్నయ్యా! ఇంకా ఇప్పుడప్పుడే సమయం రాలేదు. ఇంతలోకే వాడి తమ్ముడికి హానికలుగజేసి వాణ్ణి రాజుని చేయాలని నేను అనుకోవడంలేదు. ఆ తమ్ముడు రాజ్యం పోగొట్టుకొంటాడు. అప్పుడు వేరేరాజు కావాలి. అప్పుడు మీ మనుమడు రాజు కావాలి అని నా ఆలోచన. ఆ గడియరానీ, చెప్పుతాను.'

'చాలాదూరం చూశావు. దూరదృష్టి కలదానవు తల్లీ. రాజుగారిజాతకం, బిడ్డజాతకం అన్నీ చూశావా?'

'అవును, అన్నయ్యా! చూశాను. లెక్కవేసి తెచ్చివున్నా. మీరూ చూడండి సరేనా?'

'మంచిదమ్మా! చూద్దాం.'

'మనుమడు దొర అవడం ఇష్టంవున్నా లేకపోయినా, మీరు కూతురు అనే మమకారం పెట్టుకొన్నారుగా! అదే ఒక సంతోషం. ఇన్నిఏండ్లు గడచిపోయాయి. ఎల్లా చూస్తారో అని నేను భయపడుతూ భయపడుతూ వచ్చాను. చనిపోయిన నాన్న తిరిగివచ్చి కౌగలించుకొన్నట్లయింది, నా ప్రాణానికి. కడుపునిండా పొంగిపొరలే దుఃఖాన్ని చెప్పుకోవడానికి ఎదురుగ్గా ఎవరూ, ఏ ప్రాణీ లేదు ఇన్నాళ్ళు! భోజనంతోపాటు దుఃఖాన్నికూడా మింగివేస్తూ వచ్చాను ఇన్నాళ్ళు! ఈనాటికి నోరుతెరచి భయంలేకుండా అంతా చెప్పుకున్నా. ఈ కాగితం తీసుకోండి. గణితం వేసాను, చూడండి. నేనిహ వెళ్ళివస్తాను.'

'దేవాలయానికా పాపా! రెండుక్రోసులదూరంపైన వుందంటారు. రాత్రిపూట ఒక్కత్తెవూ వెళ్లావా?'

'నీకూతురికి భగవతి రాత్రిని పగలుచేసింది. పగటిని రాత్రిగా చేసింది. నాకేమీ భయం లేదు. నేను వచ్చేదా?' అంటూ భగవతి లేచింది. పెత్తండ్రి పాదాలవగ్గిర నుదుటిని నేలకు తాకించింది. లేచినిలబడి, ఆయన ఏమీ మాటాడకమునుపే ఆయన అనుమతిని ప్రతీక్షించకుండానే, చేతులుజోడించి నిలుచున్నచోటనే ప్రదక్షిణంచేసి, ఆలయద్వారంవైపు వెడలపోయింది.

# 61

భార్యను విడిపించవలసింది అని మంత్రి లక్ష్మీనారాయణయ్యను వేడుకోవడానికి వచ్చే ముందు, పాచే సూర్యనారాయణ, ఆమె మడికేరిలో బసవన్న అధీనంలోవుంది అని నిశ్చయానికి రావలసివచ్చింది. మడకేరిలో ఆయనకు బంధువు కలరు. ఊరికి రాగానే అతడు

మొదట తన భార్య పినతల్లి ఇంటికి పోయాడు. భార్యను వెదకాలిఅంటే మొదట ఎవరిసాయం పొందాలో విచారించాడు. వాళ్ల దేవస్థానంలోని దీక్షితుల తమ్మునికుమారుడు నారాయణ దీక్షితులు ఇటువంటిపనులలో జనానికి బాసటగా వుంటాడు అని చెప్పారు. సూర్యనారాయణ అందుమీద నారాయణదగ్గిరకు వెళ్లాడు.

చిన్నదీక్షితులు సూర్యనారాయణ కథంతా విన్నాడు. 'మీరు ఇవ్వాళ, రేపు ఇక్కడ వుండండి, విచారించిచూద్దాం' అన్నాడు.

ఆ సాయంకాలం నారాయణదీక్షితులు కావలిపనివాల ఉత్తయ్యను చూశాడు. సూర్య నారాయణ వృత్తాంతం అతనికి చెప్పాడు. ఉత్తయ్య 'విచారించి రేపు చెబుతాను' అన్నాడు.

ఉత్తయ్య రాత్రి గస్తీ తిరుగుతూ అప్పేరవాడి బోయ మాచన్నతో 'మంగుళూరునుంచి బాపనమ్మ నొకదాన్ని లేవదీసుకతెచ్చి ఇక్కడ వుంచారట. చూసి చెప్పు' అన్నాడు

మాచన్న 'చిత్తం' అన్నాడు.

మాచన్న కావలిపనిలో ఉన్నవాడు. వచ్చినవాళ్ళు పోయినవాళ్ళు ఎవరు అని ప్రత్యక్షంగా కుతూహలం కనబఱచటం మంచిదికాదు. అతడు మెల్లిగా చూచినంతలో, ఒక ఆడుది వచ్చివుంచటం, ఆమెను పట్టుకోవటం కష్టమవటం, వేరే వివరాలు తెలియకపోవటం, ఇవన్నీ జ్ఞాపకానికి వచ్చాయి. అతడు ఆమాట మరుదినం ఉత్తయ్యకు చెప్పాడు. ఉత్తయ్య నారాయణకు ఈ విషయంచెప్పి, 'ఈయన సులభమైన ఏ వేషమైనావేసికొని ఆ వాడకువెళ్లి భార్యజాడ పసిగట్టుకొస్తాడేమో అడుగు' అని చెప్పాడు. దీక్షితులు సూర్యనారాయణను అడిగితే 'నేనేమి ఆపాటి చాతుర్యం కలవాణ్ణి కామబాబూ! అయినా యక్షగానంలో వేషం వేసివున్నాను వెనక. మీరు యోచించివేషంవేసి, ఎల్లా నడుచుకోమంటే అల్లా నడుచుకోవ దానికి నేను సిద్ధమే' అన్నాడు.

బలవంతంగా పట్టుకొనివచ్చిన ఆడపిల్లకాయలను అప్పేరవాడి వెనుకప్రక్కలనున్న ఓ ఇంటిలో వుంచుతూవుంటారు. అందులో సామాన్యంగా ఎవరినీ రానివ్వరు. భవిష్యత్తు చెప్పేవాళ్ళు, పచ్చవేసేవాళ్లు, నల్లపూసలు, గాజులు, దారంవుండలు అమ్మే బానసివాళ్లు, పాములవాళ్ళు, గారడీవాళ్లు, ఇటువంటి ఆటలు ఆడేవాళ్ళు, వీళ్ళనుమాత్రమే లోపలికి రానిస్తారు. వీటిలో సూర్యనారాయణ వేయదగ్గవేషం పూసలు, దండలు అమ్మే వృత్తి ఒక్కటే.

ఉత్తయ్య, నారాయణదీక్షితులు మాటలాడి, సూర్యనారాయణ మరునటిరోజు పూసలమ్మేవేషంలో అప్పేరవాడకు వెళ్ళేటట్లు నిశ్చయించారు. మాచన్న మొదట అతన్ని అప్పేర ఘట్టానికి పిలుచుకొనిపోయి దేశంచేయించే నెపంమీద, ఎవరికీ అనుమానం తగలకుండా, వెనకనున్న ఇంటికి తీసుకొనిపోవాలి. అక్కడ తనభార్య వుందేమో ఉపాయంగా, సూర్య

నారాయణ కనిపెట్టాలి. మాటలమధ్యలో తనది వేషం అనేమాట మరచిపోకూడదు. సందర్భం కనిపెట్టి ఏంచేస్తే భార్య వున్నసంగతి తెలుస్తుందో, అసని చాల జాగ్రత్తగాచేసి వెనక్కు తిరిగిరావాలి. అతనిభార్య అక్కడ లేకనూపోవచ్చు. అంచేత అతను అతిగ పోకూడదు. ఈ వ్యవహారంలో ఏ మెట్టుపైన అడ్డుతగిలినా మెదలకుండా వెనక్కు తిరిగి రావాలి.

సూర్యనారాయణతో నారాయణదీక్షితులు ఈ యావద్విషయం, తిరగితిరిగి మనస్సునకు వచ్చేటట్లుగా చెప్పాడు. మరునాటిదినం, సూర్యనారాయణ పేటలో, వాళ్ళు గుర్తుచేసిన ఒక దుకాణంనుంచి పూసలమ్మే వేషంలో అవ్వైరవాడకు బైలుదేరాడు.

ఏర్పాటుప్రకారం అంతా నడిచింది. మాచన్న చాల చతురంగా ఇతన్ని తోడ్కొనిపోయి వాడలోని పెద్ద భవంతిదగ్గిర వదలిపెట్టాడు. నలుగురుయువతులువచ్చి తమకు కావలసినవస్తువులను తాము కొనుక్కొన్నారు. మాచన్న 'వెనకతట్టున పూసలు కొనేవాళ్లు లేరా?' అని అడిగాడు.

దాసి: 'తీసుకొనిపోయి చూపించు' అంది.

అక్కడ ముగ్గురు ఆడపిల్లలు వచ్చారు. పూసలు ఒకరు, దండలు ఒకరు, దారం ఒకరు తీసుకొన్నారు. మాచన్న 'ఇహ ఇతడు పోవచ్చునా?' అని ప్రశ్నించాడు.

లోపల ఒకామె వేరె ఒకత్తెను సంబోధించి 'మళ్ళా పోయిచూడమ్మా!' అంది. జవాబుగా 'నేమందే శ్రద్ధత్వానికి పూసలు దండలూ వేరే కావాలా?' అంటూ ఏడుస్తున్న ధ్వని వినవచ్చింది.

మాటలాడింది తన భార్యఅని సూర్యనారాయణ నిశ్చయించుకొన్నాడు.

భార్యను పేరుపెట్టి పిలవకుండా వుండగలగడం అతనికి చాలా కష్టమైంది. ఎల్లాగో నిబ్బరించుకొన్నాడు. అక్షణం ఏదో తోచి 'నేను తిరిగివస్తానమ్మా' అని లోపలిదాకా గొంతు వినపడేటట్టు చెప్పాడు. వెంటనే సంచితీసుకొని లేచాడు. భార్య కంఠధ్వని గుర్తుపట్టింది. వెంటనే గుమ్మందగ్గిరకు వచ్చింది. సూర్యనారాయణ ఆమెను చూశాడు. ఇంక ఇక్కడ నిలిస్తే అపాయమనుకొని, 'రేపు వస్తా' నంటూ బైటపడ్డాడు.

ఇంతవని, వాళ్లు అనుకున్నదానికంటె సులభంగా నెరవేరింది. ఇంక మిగిలింది ఆమెను అక్కడనుంచి విడిపించడం ఎలాగా అనేది. ఉత్తయ్య, నారాయణదీక్షితులు ఆలోచించి సూర్యనారాయణ మంత్రి లక్ష్మీనారాయణయ్య సహాయంతో ఆమెను విడిపించుకోవడానికి యత్నించాలి, అల్లా విడిపించుకోవడం సాగకపోతే తాము ఆమెను అక్కడినుంచి బైటికి తేవడానికి తగిన ప్రయత్నంచేయాలి అని నిశ్చయించారు.

ఆ నిమ్మటనే సూర్యనారాయణ లక్ష్మీనారాయణ ఇంటికిపోయి అతనిసహాయం వేడింది.

# 62

ఉత్తయ్య తక్క ప్రతిఘటించి నిల్చివున్న సంగతి చర్చించడానికి బోపణ్ణ ఆ సాయంకాలం లక్ష్మీనారాయణ ఇంటికి తక్కతో కలిసిపోయాడు. లక్ష్మీనారాయణయ్య వాళ్ల ఇద్దరినీ ప్రేమగా రప్పించుకొన్నాడు. బోపణ్ణ వానితో 'మీరు నాకు చెప్పంపినసమయానికి నేనే మిమ్మల్ని కలిసికోవాలసినమాటను తక్కయ్య ప్రస్తావించారు. అందుకని ఇక్కడికే వస్తున్నానని కబురు పంపించాను. మీమాట ముందు చెప్పుతారా లేక నేను చెప్పదలచుకున్న విషయం నన్ను ముందుగా చెప్పమంటారా?' అన్నాడు.

లక్ష్మీనారాయణయ్య 'ఆసంగతి విచారిద్దాంగాని కొంచెం ఇటురండి.' అని అతన్ని లోపలిగదిలోకి పిలుచుకొనిపోయి పాణే సూర్యనారాయణవృత్తాంతం వివరించిచెప్పాడు.

బోపణ్ణ ఉత్తయ్య కథ చెప్పాడు. 'ఇంకా ఈ మీ రాజుగారు ఏలాలి అంటారా అయ్యవారూ?' అని అడిగాడు.

'బోపణ్ణా! నేనేం చేయను? నా స్వభావం ఇట్టిది. ఇదంతా నాకు ధర్మసంకటంగా వుంది. మంత్రి అయినవాడు రాజును సరిదిద్దుకోవడానికి ప్రయత్నించాలి. తిరుగుబాటుచేద్దాం అనిపిస్తుంది. మంత్రిపదవి వదలిపెట్టి నడచుకోవాలి. అప్పుడు దొరను ఎదురుతిరగాలి. సింహాసనచ్యుతుని చెయ్యాలి. మంత్రియైవుండి, ఇల్లా చేయడం రాజద్రోహం అని నా ఉద్దేశం. మీకంటె మాకు ఆప్తులు వేరెవరు? చెప్పండి. నేను ఈపని వదిలివేస్తాను.

దొరగారిని ఏమిచెయ్యాలి అంటారో చెప్పండి, నేను మీకు చేదోడువాదోడుగా నిలుస్తాను. మంత్రిగా వుంటూ రాజుగుణం మార్చలేను. తప్పు నడుస్తుంటే దండించనూ లేను.'

'మంచిది అయ్యవారూ! మీకు సరి అని తోచిందాన్ని మీరు చెయ్యండి. నాకు సరి అని తోచిందాన్ని నేను చేస్తాను. మూడుతప్పులు సహిస్తాను. ఆపైన నేనొప్పను అని చెప్పాను. చూడండి మూడుతప్పులూ పూర్తిఅయ్యాయి. బాపనపిల్లను దొంగిలించాడు. కొడగు కుటుంబాన్ని చెరిచారు. 'తక్క'కు ఇస్తున్న 'పడి' తీసేశారు. నేను మీ ఎదుట ఇప్పుడు శపథం చేస్తున్నాను. సాధ్యమైనంతవేగంగా ఇతన్ని సింహాసనంనుండి దింపేయాలి. మీరు చెప్పినట్లుగా ఈయన భార్యను రాణి కానీ, రాజ్యాన్ని ఏలనీ, అది నాకు సమ్మతమే. ఈయన రాజై రాజ్యంచేసేది నా కిష్టంకాదు.'

'మన ఇద్దరిదారి వేరువేరు అయితే ఎట్లా బోపణ్ణా? నన్ను పని వదిలివేయమని చెప్పు. వదిలివేస్తాను.'

'ఈయన రాజుఅయి వుండటం కూడదు అని చెప్పేవాణ్ణి నేనే మంత్రిపదవి వదలుకో లేదు. ఈయన్నే రాజుగావుండనీ అని చెప్పే మీరు ఎందుకు వదలుకోవాలి? ఉండండి, వడచి వంతదూరం ఓ దారిగా నడుద్దాం. ఆ పై సంగతి ఆపైన....'

'వీలైనంతదూరం మన మిద్దరం కలిసిపోవాలనే నా కోరికకూడ బోపణ్ణా! అయినంత మేర, నేను నువ్వు చెప్పిందాన్ని చేస్తాను. నువ్వుకూడా వీలైనంతవరకు నామాట పాటించు.'

లక్ష్మీనారాయణయ్య ఈ వేడికోలు మిక్కిలి నమ్రతగా చేశాడు. బోపణ్ణకు ఆయన విషయమై జాలి కలిగింది. అతడు 'కానియ్యండి, అయ్యవారూ! మీరు పెద్దలు. ఏదిమంచిదో మీరు చెబుతూవుండండి. నాచేతనైనంత నేను చేస్తూవుంటాను' అన్నాడు.

లోపల ఈమాటలు ముగించుకొని ఇద్దరూ బైటకు వచ్చారు.

## 63

బైటిగదిలో ఉత్తయ్య తక్కతో, మొట్టమొదట సూర్యనారాయణ భార్యను విడిపించాలి అంటే ఏం చెయ్యాలి అని చర్చలు సాగించారు.

బోపణ్ణ: మీ ఇంటిది ఆవాడలో వున్నట్లు మీకు దృఢమేనా సూర్యనారాయణగారూ?'

సూర్యనారాయణ: 'నా కంటితో నేను చూసానుబాబు, సందేహమేమీలేదు. ధ్వని వినగానే రూఢి అయిపోయింది. నా కంఠధ్వనినికూడా విననీ, కొంచెం ధైర్యం తెచ్చుకోనీ అని 'నేను తిరిగివస్తా'నని' కొంచెం బిగ్గరగా అన్నాను. నా కంఠధ్వని ఆమెకు గుర్తుగానే వుండి వుంటుంది. వెంటనే గుమ్మందగ్గిరకు వచ్చింది. ఎదురుపడి చూసుకొన్నాం. ఆమె నన్ను గుర్తు పట్టివుండదు. వేషం అవి తెలియాలి అని తిరిగి నేను 'రేపు మళ్ళీ వస్తా'నంటూ బైటికి వచ్చేసాను. కొంచెం వూరుకొని 'ఏమి పాపం చేసానో ఈ కష్టం అనుభవించాల్సి వచ్చింది. ఆమె నుదుటిపై దీన్ని వ్రాశాడు విధాత. పెద్దలైనవాళ్ళు 'అయ్యో! పాపం' అని జాలిపడి మాకు చేయూత ఇచ్చి కాపాడాలి' అని కన్నీరు కార్చాడు.

లక్ష్మీనారాయణయ్య, బోపణ్ణ, ఉత్తయ్య తక్క కొంచెంసేపు మాటలాడి లక్ష్మీనారాయణయ్య మరుదినం రాజునుచూచి సూర్యనారాయణ రాకతెలిపి, అతనిభార్యను అప్పేరవాడ నుంచి విడిపించి, అతనిస్వాధీనం చేయవలసిందిగా వేడాలి అని నిశ్చయించుకొన్నారు.

ఈమాటలు ముగిసినమీదట సూర్యనారాయణను పంపించివేసి ఉత్తయ్య తక్కమీది ఫిర్యాదుగురించి ఆలోచనలు చేశారు.

ఆయన మేనగోడల్ని రాజభవనానికి పంపించేమాట ఎట్లాగో నిలిచిపోయింది. ఇంక దానిఊసు ఎత్తవలసినపనిలేదు. 'పడి' మాటమాత్రం అవసరంగా ఒక నిర్ణయానికి రావాలిసి వుంది. రాజు ఆజ్ఞాపించినా సరే, బసవన్న స్వతంత్రించినా సరే, ఇటువంటి కట్టడిని నిలిపి వేసే దౌష్ట్యానికి ఇహముందు పాల్పడకుండావుండేటట్లు చెయ్యాలి. మొట్టమొదట 'తక్క' రాజునుజూచి, గడచినసంగతినితెలిపి పడిని తిరిగి ఇప్పించేటట్లు వేడడం, ఆయన ఈవిషయం తలపెట్టకుండావుంటే మంత్రులు జోక్యం కలిగించుకొని ముందుకార్యక్రమం నడిపించడం.

ఇదంతా మాటాడినమీదట బోపణ్ణ, ఉత్తయ్య తక్క, లక్ష్మీనారాయణయ్య ఇంటినుండి బైటకు వచ్చారు.

# 64

ఆ మధ్యాహ్నం మడకేరిదారిలోవున్న అప్పాజీ వీరణ్ణలు ఉద్దేశపూర్వకంగానే మెల్లిగా దారిన నడుస్తూ సాయంకాలం దీపాలు పెట్టేవేళకు ఊరు చేరుకున్నారు. వీరన్న అపరంపర స్వామిగా కావలివాండ్రకు పరిచితుడే. ఆయనవెంట వచ్చినవాళ్లు ఆయన అనుయాయులు. అందుచేత కావలిజనం, అప్పాజి ఎవరు ఏమిటి మొదలైనవి విచారించేసందర్భం రాలేదు.

ఊరి పొలిమేరగడ్డపై నిల్వగానే అప్పాజి 'ఇదేమి మనస్సులోని మంకుతనమో చూడు. ఇక్కడకువచ్చి నిల్వగానే నాకు బిడ్డగావుండి అమ్మ తొడఎక్కి కూచున్నప్పుడు అనుభ వించిన చల్లదనం జ్ఞాపకానికి వస్తోంది.'

'ఔనా అప్పాజి!'

'ఇంక నేను వసతికి వెళుతున్నాను. నీవు సూరప్పను పిలిపించావా?'

'మీరు ఒక్కరే పోవద్దు అప్పాజి. నావెంటవుంటే ఎవ్వరూ అడ్డగించేవాళ్ళూ, మాటా డించేవాళ్లూ వుండరు. పోతూ పోతూ, దారిలో సూరప్పను పిలుచుకొనివస్తాను. కూడానే వచ్చె య్యండి.'

'అదీ బాగానేవుంది అప్పాజి, నడవండి.'

ఈవిధంగా వీళ్లిద్దరూ ముందుకునడిచి బ్రాహ్మణవీధికి వచ్చారు. లక్ష్మీనారాయణయ్య ఇంటినుంచి కొంచెందూరంలో తండ్రిని నిలిపి వీరణ్ణ ఒక్కడేవెళ్ళి సూరప్పనుపిలిచి సమాధి దగ్గిరకురండి అనిచెప్పి వచ్చాడు.

ఈ ఇద్దరూ అక్కడినుండి సమాధిదగ్గిరకు చేరేసమయానికి సూరప్పకూడా అక్కడికి వచ్చిచేరాడు.

సూరప్ప అప్పాజి క్షేమసమాచారాలు విచారించినమీదట, వీరణ్ణ: 'ఏంచెప్పినా వినకుండా అప్పాజి ఇక్కడకు రానేవచ్చేశారు సూరప్పా' అన్నాడు.

సూరప్ప : 'పుట్టిపెరిగిన వూరు చూడాలని వుండటం న్యాయమే. కాని మీరు రేపు ఇక్కడ నిలిచే ఆలోచన చేయవద్దు. ఉత్తయ్యతక్క ఇక్కడకు వచ్చివున్నారు. మా ఇంట్లో అన్నయ్య, ఆయన, బోపణ్ణమంత్రి కలిసి ఎవో రెండుమూడువిషయాలు మాటాడుకున్నారు. ముసలాడు చాల గడుసువాడు. వేటకుక్కలాగా పసిగట్టేస్తాడు.'

'అట్లాగే, ఇక్కడనుంచి బైటపడితే సరి.'

'ఔను, ఇవ్వాళ భోజనం.'

వీరప్ప : 'మీరు మీమాట చెప్పుతూవుండండి. నేనుపోయి భోజనం తెచ్చుకొని వస్తాను' అన్నాడు.

ఇదీ బాగానేవుంది అనిపించింది. వీరణ్ణ ఊళ్లోకి వెళ్లాడు.

అప్పాజి : 'మూడుసంగతులు వినివున్నా, సూరప్పా' ఉత్తరం వ్రాయడం, కబురు తెప్పించుకోవడం, ఎట్లయినా వుండని. ఎదురుగా మాట్లాడడమే మంచిది పోయి కళ్ళారా చూచే వస్తాం అని వచ్చాను' అన్నాడు.

సూరప్ప : 'మంచిపనే అయింది. పుట్టినూరు చూసినట్లయింది.'

'ఔను. ఈ మన చెన్నవీరన్నసంగతి ఏమిటి? తెలియనేలేదుగా!'

'చెన్నవీరన్నను ఈయన ముగించేసివుంటాడు. తెల్లదొరలు ఆయన్ను పంపించి నప్పుడు రాజుగారు నాల్కనాటి అడవికి వేటకై పోయివున్నారు. ఇతన్ని అక్కడికి పిలుచు కొనిపోయినట్లు తెలిసింది. ఆపైన మరి అతనిజాడ తెలిసింది కాదు.'

తిరిగి తప్పించుకొని మలయాళదేశానికి పారిపోయినట్లు వార్త ఒకటి పుట్టింది. అది పుట్టించినవార్తే అయివుంటుంది. బసవన్నపని అయివుంటుంది. అబద్ధమాడటం అంటే అత గాడికి మంచినీళ్లప్రాయం.'

'ఇటువంటివాళ్లెంత పాపిష్ఠివాళ్ళు!'

'పాపిష్ఠివాళ్ళు కాదు. పిశాచాలు అను వాగుంటుంది. యముడు వీళ్ళకు వేరేనరకం కట్టించివుంటాడు.'

'అది సరే! ఇక మనజనం అంటూ ఎవరు?

'మీరు నిశ్చయిస్తే రేపు వాళ్ళు మీదగ్గరకువచ్చి విలుస్తారు. మీరు సమయం చెప్పండి.'

'ఇటు చూ డోమాటు సూరప్ప! ఇతనితో జగడమాడాలంటే ఇన్నాళ్లెందుకు ఓపిక పట్టడం? దేశం పరాయివాళ్లపాలు కాగూడదు. అది ఒక్కటే నా కోరిక.'

'మీరు ఎల్లకాలం ఇల్లాగే వుండిపొయ్యారు. పిల్లవాణ్ణి మీ లాగానే చేసేశారు. మేం ఏం చేయడానికౌతుంది? కొంచెం చెన్నవీరన్న బాధపడ్డాడు. బాధపడ్డందుకు అతడు శిక్ష అనుభవించనే అనుభవించాడు. అందుకే నేను కబురుపెట్టింది. ఈ వ్యవహారంలో జోక్యం కల్పించుకోవాలంటే మనస్సు గట్టిచేసుకోవాలి అని.'

'అల్లాగే కానీ సూరప్ప. ఈ తెల్లమొహాలువచ్చి ఏంచేస్తారో చూద్దాం. ఇతనిస్థితి భంగం వచ్చేధోరణిగావుంటే మన అడుగు ముందుపడుతుంది.'

'ముందో, వెనకాలో అది అప్పటిమాట.'

'ఔను. ఇప్పుడు ఈ 'కావేరీపుత్రుల' సంగతి ఏమిటి?'

'ఈ పిల్లలు కొందరుచేరి ఓ సంఘం ఏర్పాటుచేశారట: నాకు సంగతిఅంతా సరిగా తెలియదు. దానిలో ఎవరున్నారు? ఎవరు లేరు? అనే సంగతికూడా తెలియదు. ఏమాత్రం పైకి పొక్కకుండా తమ కార్యకలాపాలు నడుపుకొంటున్నారుట.'

'మంచిది. మరేం సమాచారం? అమ్మగారు కులాసాగా వున్నారా? అన్నగారు? ఇంట్లో వాళ్లు, పిల్లలు, అందరిసంగతి తెలియచెప్పు.'

'అందరూ కులాసా, దైవకృపవల్ల. మంత్రి అయి అణ్ణ పడేపాట్లు చాల కష్టంగా వున్నాయి.'

'మంత్రిపని అంటేనే కాలికి ముల్లులాంటిది. దానిమొహంపై కష్టాలు వ్రాసే వుంటాయి.'

'వేరే కష్టం అనేమాట అట్లావుంచు. రాజే పెద్ద ముల్లయితే అది జనం తట్టుకోలేనంతగా తయారై కూచుంటే.'

'అదీ మంచిపనే. జనం వీలైనంతవరకు కాపాడని. దేవుడు మెచ్చుతాడు.'

# 65

ఇంతలోకి వీరణ్ణ ఒక నౌకరుద్వారా తను భోజనాన్ని తీసుకొనివచ్చాడు. 'సూరప్ప! మీ భోజనం కానివ్వండి. నే నిక్కడే వుంటాను' అన్నాడు.

తండ్రి పిల్లవాడు భోజనం ముగించారు. అప్పాజీ: 'రేపే ఇక్కడ వుండటం కూడదు. అంటే ఇప్పుడుపోయి దీక్షితుల్ని చూద్దాం. గుడివాకిట పడుకొని తెల్లవారితుదయమే బయలుదేరి పోదాం' అన్నాడు.

శ్రమ అవుతుందేమోనని కొంచెం ఆలోచించి, దీక్షితుల్ని చూడకుండా పోకూడదని అను కొని, ముందనుకొనినట్లే చేద్దామని అనుకున్నారు.

దారిలో లక్ష్మినారాయణయ్య గృహం. దానినుంచి ముందు కొంచెం దిగువలో దీక్షితుల ఇల్లు. దానికిపైన మెట్టమీద బోవణ్ణ ఇల్లు. గుంపుగా పోకూడదని సూరప్ప కొంచెం ముందు ముందుగా వెళ్లాడు. ఆయన లక్ష్మినారాయణయ్య ఇంటిముందుకు వచ్చేసమయానికి బోవణ్ణ ఉత్తయ్య తక్క మాట ముగించి బైటకు వచ్చేసాడు.

ముందుకుపోతూ అప్పాజీ సూరప్పతో 'మేం వెళ్తున్నాం' అన్నాడు. సూరప్ప: 'మంచిది' అంటూ ఇంటిముందుకు వచ్చాడు.

అప్పాజీ అక్కడ మాటలాడడంతోనే ఇక్కడ ఉత్తయ్యతక్క నివ్వెఱపోయాడు. 'ధ్వని ఎవరిది? తక్కడే?' అన్నాడు.

బోవణ్ణ: 'తెలియడంలేదు.'

అప్పటికల్లా సూరప్ప వాళ్ళదగ్గిరకు వచ్చిచేరాడు. ఉత్తయ్య అతణ్ణి 'ఎవరయ్యా నీతో మాటాడినవాళ్లు?' అని అడిగాడు.

సూరప్ప కొంచెం ఆలోచించడానికి తటపటాయించి 'ఎవరంటారా?' అని ప్రతిగా ప్రశ్నించాడు.

'మేం వస్తాం అన్నారు. మీరు 'మంచిది' అన్నారు.'

ఈలోపల సూరప్ప ఎల్లా నడచుకోవాలో లోపల లోపల నిశ్చయించుకొన్నాడు. 'ఓ వాళ్ళా! వాళ్ళెవరో మిమ్మల్ని చూడాలి, బోవణ్ణ, మంత్రిగారి ఇంట్లో వున్నారట, అక్కడకు వెళ్ళాలి అన్నారు. మీరు ఇక్కడ మా ఇంట్లో మాటలాడుతున్నారు అని చెప్పా. అక్కడకు వెళ్ళి కనిపెట్టుకొనివుంటాం' అన్నారు.

ఉత్తయ్యతక్క: 'మమ్మల్ని చూడాలి అనా? అల్లా అయితే ఆ కంఠధ్వని మేం విన్నది కాదు.'

'ఇక్కడికే రమ్మనమని చెప్పవచ్చుగా' అన్నాడు బోవణ్ణ.

సూరప్ప: 'మీరు మాటలు ముగించింది నాకు తెలియదుగా. ఇప్పుడువెళ్ళి పిలుచుకొని వస్తా' అనిచెప్పి, వెంటనే వెనక్కుతిరిగి వెళ్లాడు. అప్పాజీని, వీరణ్ణను కలుసుకొని అప్పాజీ చెవిలో, 'నేను చెప్పినట్లే అయింది. ఉత్తయ్యతక్క వాకిలివద్దఉంది మీ గొంతువిని, నన్ను ఎవరువారు అని అడిగాడు. మీరు దీక్షితుల్ని చూడవద్దు. ఉదయమయ్యేటప్పటికి ఇక్కడ వుండనూ వద్దు. ఇప్పుడే వూరువిడిచి వెళ్ళడం క్షేమం' అన్నాడు.

ముగ్గురూ ఒక్కక్షణంలో రెండుముక్కలు మాటలాడి అదే మంచిదని అనుకున్నారు. సూరప్ప వెనక్కు తిరిగివచ్చి బోవణ్ణతో వాళ్ళు ఇంటిదగ్గిరనే చూస్తాం అన్నారు. అని చెప్పి లోపలికి పోయాడు.

వీరన్న తండ్రిని భద్రంగా నగరివాకిటనుండి గడియ పొద్దుందనగా ఊరి పొలిమేరలు దాటించి తీసుకొని వెళ్లాడు.

# 66

వారందరూ అట్లా మాటాడుతూవుండగానే ఆ సాయంకాలం బోపణ్ణ గుమాస్తా రాజభవనానికి వెళ్ళి, ఉత్తయ్య తక్క వచ్చారు, ఉదయం రాజుగారిని దర్శించడానికి వీలౌతుందా? అని బసవన్నను అడిగాడు. ఉత్తయ్య ఎందుకువచ్చాడు అనేది బసవన్నకు తెలిసినవిషయమే. అతడు రాజుదగ్గిరకుపోయి ఆమాటచెప్పి, 'బోపణ్ణ కబురుపెట్టారు. తక్కను చూడవలసింది' అన్నాడు.

రాజు : 'ఎందుకని 'పడి' నిలిచిపోయింది.'

బసవ : ప్రభువులకు చెప్పి, 'సరే' అన్నమీదటనే నిలిచిపోయింది.'

'లేదు. అప్పుడా శ్మవడురా ముందా? నీవు నిలుపాలి అన్నావు, నేను నిలిపేయి అన్నాను. నిలపాలి అని నువ్వెందుకన్నావో అది ముందు చెప్పు.'

నిజానికి 'పడి' నిలుపుచేయాలి అని చెప్పింది మొదట రాజే. కాని ఇటువంటిసమయంలో బసవన్న రాజుగారితప్పును తనపైన వేసుకోవడానికి ఎప్పుడూ సిద్ధమే. అతడు రాజుగారికి ఆ ప్తుడు కాగలిగింది ఇట్లా చేసే:

'ఆవిషయం అప్పుడే తెలియజెప్పాను ప్రభువులకు. బంగుళూరు తెల్లదొరలు వస్తారుగా. వాళ్ళ ఆడపిల్లలకుతోడుగా ఇద్దరు ఆడపిల్లల్ని ఉండనీ దొరలన్నారు. చూడాలిసింది అని నౌకరుకు చెప్పాను. ఈపిల్ల బాగుందిఅంటే చెప్పి పంపించాను. వాళ్లు పంపడానికి వీలు లేదన్నారు. వీలులేదంటే మెదలకుండా వుండిపోయానా? అన్నివైపులా అందరూ వీలు కాదనే అంటారు. తలపైన మొట్టికాయ మొట్టకపోతే వీళ్ళకు భయం భక్తి వుండవు. ఈ 'పడి' నిలిపేద్దాం అన్నా. ప్రభువులు నిలిపేయి అన్నారు.'

'అంతా నీపుణ్యమే కుంటీ! ఎప్పుడూ పల్లెలివాడు తనమ్మానమాటే. మనకని ఓ నాలుగు రోజులూ, తెల్లవాళ్ళకోసమంటూ ఇప్పుడు!'

'ప్రభువులు నవ్వితే నాకేమి తప్పు? శరీరం ఆడినట్లే దానినీడ ఆడుతూవుంటుంది. మీకు కావాలిసింది నాకూ కావాలి. మీరు వద్దంటే నాకూ వద్దు.'

'అంటే ఇదంతా నువ్వు మాకోసంగా చేస్తున్నావన్నమాట.'

'అందుకేమీ సందేహం లేదుదొరా! లేకుంటావుంటే నేను తలపైన ముసుగువేసుకొని ఏనాడో ఎక్కడికో పోవాలిసివచ్చేది.'

'కోపం ఎందుకురా ముండమోపి! విదానంగా చెప్పలేవూ?'

'నన్ను పెంచినదొర విదానంగావుండక నన్ను తిడతారా? మీరు కాలితోతన్ని చూపించినదాన్ని నేను తలమీదిపెట్టుకొని మోసాను. ఇది మీ కళ్లతో మీరు అనేకసార్లు చూసిన విషయం.'

'ఇటువంటి ఖంటు వుంటూకూడా మాకు వంట్లో ఏమీ సుఖంలేకుండా పోయింది కుంటీ! మందుకాదు, మాకుకాదు గాని - వీటివల్ల అయ్యేదీ పొయ్యేదీ లేదు. ఈ తెల్లదొరలదగ్గిర ఏమైన వుందేమో వచ్చింతర్వాత అడుగు.'

'లేకుండా వుంటుందా దొరా: అడుగుతా ఎల్లాగూ వస్తున్నారుగా.'

'అయినా ఏం చెయ్యాలి? విప్పలేదు. విప్పకతీక లేదు. కాముడు దహించకపోలేదా?'

'చెడ్డమాట ఎందుకుదొరా! అంతా చక్కబడుతుంది. ఈ తక్కను రేపుఉదయం రావాలిసింది అని చెప్పదామా?'

'రమ్మనిచెప్పు. రెండుమాటలు ఖబిరి, 'పది' తిరిగి ఏర్పాటుచేసినట్లూ అవుతుంది. అప్పాజికి కావలసినవాడు.'

'దొరల ఆజ్ఞ! అల్లాగే రెండుమాటలు ఖబిరవచ్చు. లేకపోతే చెలిమి పెంచుకొని నాడులో మన ఏమాటా సాగకుండా చెయ్యొచ్చు.'

'బెదరగొట్టవచ్చు, రమ్మనమను.'

# 67

మర్నాడుఉదయం ఉత్తయతక్క వచ్చాడు. ఖసవన్న అతనిని రప్పించుకొని రాజుదగ్గిరకు వెళ్ళాడు. ముసలివాడు రాజుదగ్గిరకువస్తూన్యాలసమస్కరించి 'నమస్కారం [1]పుట్టప్పాజీ! సౌఖ్యంగా వున్నారా?' అని కీతు దీక్షితుల్నిఅడిగాడు.

రాజుకు తటాలున చిన్ననాటిస్మృతులు జ్ఞాపకానికి వచ్చాయి. ఆయన: 'రండి! తక్కగారూ! రండి. మీరు కుశలమా!' అని ప్రశ్నించాడు.

తక్క చేతులు ముకుళించే రాజుఎదుట ఖంపఖానామీద కూచున్నాడు.

1. పుట్టప్ప = చినబాబు.

రాజు : 'ఏం పనిమీద వచ్చారు?' 'పడి' మాట ఏదో వుందని జనవన్న చెప్పాడు.

తక్క- : 'ఔను. దొడ్డరాజుగారు ఏర్పాటుచేసిన కట్టడి అది. నేను బావన పిల్లగాణ్ణి మోసి తెచ్చి మూడునెలలపాటు గుడిలో పూజ ఆగిపోకుండా చూసాను. రాజుగారినుంచి పడి సంపాదించాలి అనేకోరికతో గాదు ఆ చేయడం. దేవునిసేవకదూ చెయ్యాలి అని చేసాను. రాజుగారు నోరువిడిచి చెప్పారు.

'ఉత్తయ్యా : మా తలకాయ మేము రక్షించుకొనేసందర్భంలో, దేవునిగతి ఏమిటా అని ఆలోచించనే లేదు. నువ్వు నిజంగా పౌరుషంగలవాడివి. ఈశ్వరుని బంటువు. ప్రాణాలు నీవి కావనుకొని పూజ నడిపించావు. పదిమందికి కావలిసిన ఈశ్వరునికి ఏదో ఇంత సేవచేసావు. ఇటువంటి వెంకను ఈశ్వరుడు చేయివదలడు. కాని అట్లని ఈశ్వరుడే చూసుకొంటాడులే అని మెదలకుండావుంటే మేము రాజు అనిపించుకోము. తీసికో, రాజభవనం ఇచ్చే కానుక. ఈశ్వరునికి 'పడి' నడిచేలాగే ఆయన సేవకునికికూడ 'పడి' నడవాలిసిందే. రోజూ నీకో 'పడి' భత్యం. నీకు ఇంటినిండా ధాన్యం. అది దేవుడిచ్చింది. ఈ ఇంకోపడి దేవుడు ఇప్పించేది' అన్నారు. మీరు అప్పటికి పుట్టలేదు పుట్టప్పాటి : దొరలమాట విన్నతర్వాత నాలుగుబుజాలు వచ్చాయి నాకు. రెక్కలు గులగులమన్నాయి. ఆ క్షణంలో ఎదురుగుండా పులివచ్చినా, దానిప్రాణాల్ని ఎడమచేతితో పిండిపెట్టేవాణ్ణి. పడుచుదనంలో చూసుకోండి, మాంచి ఉమ్మస్సుమీద వుండేవాణ్ణి.'

'అదంతా సరే : ఇప్పుడు వచ్చినమాట చెప్పు.'

రాజుకు ప్రారంభంలోవున్న ఓర్పు తగ్గిపోయింది. ఆక్షణమే, రేకెత్తిన ప్రేమ తిరిగి గడ్డకట్టుకొనిపోయింది.

'చెప్తున్నాను కొంచెం విను. మీ తండ్రిగారు, నన్ను తన చెలికానిగా చూసుకొనేవారు. నీ చెవిలో చెప్తున్నాను. ఇంకొకళ్లకు చెప్పాల్సిన మాటకాదు. వారి కొలువలోకి నన్ను తల దూర్చుకోమని చెప్పారు ఓసారి. 'ప్రభూ మీతో సరసాలాడకూడదు. నే నొప్పుకోను' అన్నా. ఆ రోజుల్లోనే మీరు పుట్టింది. మీ తండ్రి నా చేతికివ్వడం, నేను మిమ్మల్ని ఎత్తుకొని ఆడించి ముద్దులాడటం జరుగుతూవుండేవి ప్రభూ : మీరు పసిబిడ్డలుగావున్నప్పుడు నేను మిమ్మల్ని ఆడిస్తూ వుండేవాణ్ణి. ఎత్తుకుంటూ వుండేవాణ్ణి.

రాజు ఏమైనా చెప్పుతాడేమో అని ముసలివాడు తనమాట కొంచెం నిలిపాడు. రాజు ఏమీ చెప్పలేదు. ఉత్తయ్య మాటను తిరిగి సాగించాడు. 'దొడ్డరాజుగారిరోజుల్లో ఈ భత్యాన్ని మానొమి (మహర్నవమి) పండుగదాకా ఇప్పించేవారు. మీ తండ్రిగారు నాలుగేళ్ళు అట్లాగే జరిపించి 'బిచ్చగాడికి పచ్చడం పారేసినట్లు. దీనికోసం మడకేరికి ఏమి వస్తావు : ఊళ్ళోనే తీసుకొంటూవుండు' అన్నారు. ఇమ్మనమని కరణానికి చెప్పాను' అన్నారు. మీరూ దాన్ని నడిపించారు ఈ సంవత్సరంవరకు. ఈ యేడు కరణం 'పడి నిలిపేశారు' అన్నారు. 'ఎందు

తయ్యా!' 'నాకు తెలియదు' 'ఎవరప్పా!' 'రాజభవనం' 'రాజభవనంలో ఎవరు అప్పా!' 'నిలుపు చేయి అన్నవారు?' 'మంత్రులు' 'ఏ మంత్రులు?' 'మనకు తెలియదు' 'మంచిదప్పా! దొడ్డ రాజాగారి హయాములో [1]పండుగగా వుండేరోజుల్ని రాజాగారు తమచేతితో పన్నుగట్టేదిగా చేస్తారా? కానీ అడిగి తెలిసికొంటాను' అని చెప్పివచ్చాను.

ఇది కపటంతోకూడిన మాట. రాజుకు కొంచెం వెస్థతోపాటు కోపంకూడా వచ్చింది. ఈ ముసలోడు తన్ను వ్యంగ్యంగా మాటాడుతున్నాడు. అయినా, రాజు ఏమీ బదులాడలేదు. ముసలాడిని ఇష్టంవచ్చినట్లు మాటాడనిచ్చాడు.

'నిన్నవచ్చి బోపణ్ణగారిని, మంత్రి అయ్యగారిని చూశాను. ఇది తమరు కోరింది కాదు, కుంటి బసవన్న చేయించింది అన్నారు. బసవన్నను నేనేమిటి అడగటం, మిమ్మల్నే చూద్దాం అని వచ్చాను. వచ్చి చెప్పుకొన్నాను. దీన్ని సరిదిద్ది పంపించండి.'

# 68

రాజు 'అక్కడున్నావా బసవన్నా?' అని పిలిచాడు. బసవన్న గుమ్మాని కవతలప్రక్కగా నిలబడ్డవాడు లోపలికివచ్చాడు. రాజు అతనితో 'ఇతని పడి ఎందుకు నిలిపేసారో? ఇతనికి తెలియజెప్పు' అన్నాడు.

బసవన్న: పుట్టమ్మాజికి జతగా వుండటానికని వీళ్ళగ్రామంలోని ఓ ఆడపిల్లని పంపించ మని కోరాం. చెడ్డగా మాటాడి వీలులేదని చెప్పారు. ఇదేమిటయ్యా అంటే మా తక్క రున్నారు చూసుకొంటారు నీపని అన్నారు. తక్కరులతో అక్కడ జగడమెందుకు? ఆయన ఇక్కడికే వచ్చేటట్లు చేద్దాం అని ప్రభువులతోచెప్పి పడి నిలుపుదలచేసాం' అన్నాడు.

ఓక్షణం ఊరుకొని 'ఏమి తక్కరూ?' అన్నాడు రాజు. ఉత్తయ్యకు కోపంవచ్చింది.

'తప్పు ఏం చేశాను? శిక్ష ఏమిటి? కాలు కుంటితే తల తెగగొట్టుతారా? ఇట్లా చెయ్యొచ్చు అని బోపణ్ణగారినో, మంత్రి అయ్యవారినో అడగండి పుట్టప్పాజీ!'

'ఇందులో వాళ్లను అడిగేపనేమీ లేదు.'

'ఇది బసవన్నచెప్పే మాట. నేనూ మంత్రిని, వాళ్లూ మంత్రులేనని. వాళ్ళకంటే నేనేం తీసిపోయానని. అయిన నీచత్వం మీనోటిగుండా మీరు రానియ్యకూడదు. మీరు చూడక్క ర్లేదా? వీళ్ళు గొప్పవాళ్లు, వీళ్ళు చిన్నవాళ్ళు అనేమాట?'

[1] 'పండుగరోజు' సంతోషాన్ని 'పన్నుగట్టేరోజు' దుఃఖాన్ని తెలియజేస్తుంది.

బసవన్న మండేకోపంతో, అప్పటికి గొంతు విప్పరించుకొని 'దొరలు నన్ను మంత్రిగా చేసిన నేను ఇప్పటికి తక్కరుచూపులో 'బసవన్న', 'కుంటి', 'నీవు', 'తాను' అనే అవి రుపరుసలు పోయాడు.

ఉత్తయ్య: 'తప్పేంది బసవయ్య. నువ్వు గొప్పవాడివి. గడుసరివి. ఎంత దొడ్డవాడివో నీకే తెలియదు. కాని ముప్పైఏళ్ళుగా 'రా' 'పో' అని అంటూ ఒక్కసారిగా నాలిక 'రండి' అని అనలేదు. నాలిక తడబడుతుంది మరి!' అంటూ రాజువైపుతిరిగి 'కొడగులో సామెత ఓటి వుంది పుట్టప్పాజీ! పెద్దపనికి పెద్దవాడు. చిన్నపనికి చిన్నవాడు. కుక్కనుతెచ్చి [1]'తక్క' అంటే మందిఎదుటే మైధునం అందిట! అరవైఏళ్ల తక్కగుముందు మూడేళ్ల మంత్రి మర్యాద అంటే ఏమిటి బావుంటుంది? దొరను 'పుట్టప్పాజీ' అన్నాను. మరి దీనికి వన్నేమనాలి?' అన్నాడు.

రాజు: 'ఆవిషయం తర్వాత చూద్దాం. పుట్టమ్మాజీ తోడుకు ఆ పిల్లను పంపించు అన్న మాటకు నువ్వు అడ్డువచ్చావుట! దానికేం చెప్తావు?'

'అట్లానా? అది మీ మాటేనా? దానికి చెప్పుకుంటాను' అంటూ బసవన్నవైపుతిరిగి వ్యంగ్యమైన నమ్రతతో 'బసవన్నగారూ! రెండుక్షణాలు కాస్త పెరగా విలవండి. నేను రాజుగారితో ఓ మాట విన్నవించుకోవాలి' అన్నాడు.

రాజు: 'అతడుంటే తప్పేమీలేదు. మీరు చెప్పదలచుకొన్నది చెప్పండి.' ఇటువంటి సమయాల్లో ఈవిధమైన హఠంపట్టడం అతని అశిక్షితమైన స్వభావానికి సహజమైన విషయమే.

'మీ ఇష్టం పుట్టప్పాజీ. పిల్లను పుట్టమ్మాజీ జతకు వచ్చివుండనీ అనికదూ కబురు పెట్టింది? ఇందులో బూటకం ఏమీ లేదుకదూ?'

'బూటకం మీరేమి చూశారు?'

'నేను చూసానుగనుకనే బూటకమంటున్నాను.'

'మీరు చూసిందిలేదనే అడుగుతున్నాను.'

'మమ్మల్ని ఇంతోటిమాట అడగటానికి మీకు ధైర్యం వచ్చిందన్నమాట.'

'నా ధైర్యం పాతవడ్డమాట పుట్టప్పాజీ! కొత్తదేమీకాదు. దావడం అంటూవుంటే ఈపాటికి నూరుసార్లు చచ్చివుండేవాణ్ణి. నా పుట్టప్పాజీ ఇప్పుడు నా తల నరికివేస్తే నూట ఒక్కటవసారి అవుతుంది. కానియ్యి.'

బసవన్న మధ్యలో నోరు చేసుకొన్నాడు. 'ప్రభువులు అట్లా ఏమంటారు? తక్కరూ!'

ఉత్తయ్య: ఒకరిమనస్సు ఒకరు కనిపెట్టలేరు. అందరిమనస్సులూ తెలిసినవాడు ఈశ్వరు డొక్కడే. మీ ఆలోచన మంచిదేనప్పా అని నేనంటాను. అయితే మంచిదే కావాలి అని ఏమీ లేదు.'

---

1. తక్క = యోగ్యుడు. కొడగలు తమ నామాంతంలో జోడించు నామాంశం.

బసవ 'చెడ్డిదని మీరు ఎల్లా తెలుసుకున్నారు?'

ఉత్తయ్య ఇందుకే పుట్టవ్పాడి: ఏరు బైటికివెళ్ళివుండాలి అని నేను చెప్పడం; నేనూ, బసవయ్యా, వాదులాడుకోగూడదు. నేను వచ్చింది దొరబిడ్డకు విన్నవం చేసుకో డానికి. బసవయ్యగారికి విన్నవించుకోవడానికి నేను సిద్ధంగా లేను.'

రాజ 'సరే: చెప్పేది చెప్పి ముగించు.'

ఉత్తయ్య 'దేశంలోని పెద్దల చెప్పినమాట 'కట్టలేని కొలనులో కాడలేని తామర' అని.

'లోకంపోకడ అంతా దేవుడు చూస్తూనేవుంటాడు. తలుపులుమూస్తే తలపులు మరుగై పోతాయా? దీపం ఆర్పితే ప్రపంచం చీకటైపోతుందా? మనస్సులోని ఊహ కూడిరాక ముందు మనస్సుఎదురుగా బట్టబయలు కాదా? నాకు చెప్పవచ్చు. పుట్టమ్మాజికి జతగా వుండ టానికని. లోపలి దేవునిముందర ఎమిటి సంజాయిషీ చెబుతారు. ముసలాడు ఎల్లాగూ వచ్చాడు. 'పడి' తిరిగి ఏర్పాటుచేస్తే సంతోషమే. ఏర్పాటు చేయించలేమా?-దొడ్డరాజుగారు ఇచ్చింది, చిన్నరాజుగారు తీసేసుకొన్నారు అనుకొంటూ నేను ఇంటికి నవ్వుకుంటూ పోతాను. ఊరు ఏమంటోంది తెలుసుకోవాలి. దొడ్డరాజుగారి పిడికిలిలో దేశం నిలబడ్డది. చిన్నరాజుగారి గుప్పిటిలో ఆయనవ్రేళ్లే ఆయనకు నిలవడంలేదు. దీన్నిచూసి నేను ఏద్వ వలసినంతపనిగా వుంచిప్పా: ముసలివాణ్ణి. దొడ్డరాజుగారు చెప్పవలసినమాట, మీ తండ్రి చెప్పవలసినమాట, వారిద్దరూ కాక నేను చెబుతున్నాను. మంత్రి అయ్యవారినిగాని, బోపణ్ణ గారిని కాని అడిగితే వాళ్లు చెప్తారే చక్కగా బ్రతికేరాజమార్గం. అడగవలసిందేమిటో మీకే తెలుసు. ఒక్కనిమిషం కుదురుగా ఆలోచిస్తే మీకే తెలుస్తుంది. మంచిదారిపట్టండి. మీరు బ్రదికి బాగుపడి, దేశాన్ని బ్రతికించండి. ఆజ్ఞ అయితే వస్తాను' అంటూ ఉత్తయ్య లేచినిల బడ్డాడు. రాజుకు కోపం మండిపోతూవుంది. మాటలాడటానికే కాలేదు.

ఉత్తయ్య ఒక్క అడుగువేసి మళ్ళీ దొరవైపుతిరిగి 'దేశంమాట అట్లావుండనీ పుట్ట ప్పాజీ: మొదట ఈ ఒళ్ళు చూడండి. అరవైఏళ్ళ ముసలిని నేను బజారుమధ్య ఆడుదాన్ని పట్టుకోగలను. వంట్లో బలం తొందరిస్తే నిండినబాన బోర్లపడ్డట్లే; వయసుపిల్లవాడు ముస లాడికంటె హీనంగా కనబడకూడదు. కొంచెం కటువుగా చెప్పాలిసివచ్చింది మాటను. కోప గించుకోకండి. మీ తండ్రి స్నేహితుడు మీ మంచికి చెప్పినమాటను గ్రహించండి. నేను వస్తాను. నమస్కారం మరి:' అన్నాడు. వాకిలి దగ్గిరఉన్న బసవన్నవైపు చూపైనా సారించకుండా వాకిలవతలికి నడిచాడు.

# 69

ఉత్తయ్యతక్క రాజుగారి సన్నిధివదలి వది అడుగులు వేసేసరికి దాసీది ఒకతైవచ్చి 'అమ్మాజి మిమ్మల్ని ఓసారి వచ్చి పొమ్మంటున్నారు' అని చెప్పింది.

ఉత్తయ్య: 'అట్లా అన్నారా అమ్మగారు! ఇదిగో వచ్చాను' అన్నాడు. ఆమె అతన్ని అంతఃపురంలోకి పిలుచుకొని వెళ్ళింది.

అతడు వెళ్లేసమయానికి రాణి అక్కడకువచ్చి ఎదురుచూస్తోంది. తానే ముందుగా 'నమస్కారం తాతగారూ! రండి, కూచోండి, రాజభవనానికి వచ్చినవారు ఓ చుక్క పాలు త్రాగి వెళ్ళండి' అంది.

ముసలివాడి వెష్ట ఎక్కడకు ఎగిరి చక్కాపోయిందో? తన ఎదుటనున్న ప్రసన్న గంభీరమూర్తినిచూచి అతడు లోలోపల చాల మెచ్చుకొన్నాడు. ఆమె మాటందామా తన్నే మార్చివేసింది.

'ఇదే వచ్చాను అమ్మాజీ! మీరు రాణులు. మీరు నమస్కారం పెట్టకూడదు. నేను దాసుణ్ణి' తక్కను. దండం పెట్టుతున్నాను' అన్నాడు.

'దాసులు తక్కరూ కాదురు. పెద్దరాజుగారి స్నేహితులూ కాదురు. చేతులు ముకుళించిన నన్ను చిన్నదాన్ని శుభం కలగాలి అని ఆశీర్వదించండి, కూచోండి.'

తక్క ఆమె చూపించినచోట కూచున్నాడు. ఎదురుగుండా కొంచెం దూరంలో తన ఆసనంపై కూచున్నరాణి పరిచారికతో 'పుట్టమ్మాజిని రమ్మనమని చెప్పు. తాతగారికి నమస్కరించాలి' అంది.

రాజకుమారి శయ్యాగారంలో వుంది. తల్లిమాటవినగానే వరండాలోకి వచ్చింది.

'నమస్కారం తాతయ్యా!' అంటూ ఉత్తయ్యకు చేతులుజోడించి నమస్కరించి తల్లి దగ్గిరకువచ్చి నిలబడింది.

ఉత్తయ్య, 'చిలుకలకొలికిపి. దొరబిడ్డవు క్షేమంగా వున్నావా? చెల్లీ! ఇల్లారండి. విచ్చిన మొగలిపూవువు. దగ్గిఱనిలబడి కళ్లకు పండుగచేయండి.'

రాణికి నవ్వు వచ్చింది. ఆమె కూతురుతో 'దగ్గిరకు పో, పుట్టమ్మాజి. తాతగారిని చూడనియ్యి' అంది.

రాజకుమారి కొంచెం సిగ్గుతో ముసలివాని ఎదుటికివచ్చి నిలబడింది.

ఉత్తయ్య తనరోజుల్లో మంచి రసికుడు అనే పేరుపొందాడు. కాని అతనిజీవితం ఎంగిలివేద్దది అని ఎవరూ, ఎప్పుడూ చెప్పుకోలేదు.

అందమైన మొగం కంటబడ్డప్పుడు నిస్సంకోచంగా చూసి సంతోషించడం అతనిపద్ధతి. అంతే దృఢంగా సాంఘికమర్యాదలను తప్పనీయకుండా వుండడం అతనివ్రతం: సమాజం వద్దనిచెప్పకపోయినా అటువంటి పలుసందర్భాలలో, ధర్మబద్ధమైనదృష్టితో హద్దుల్ని ఏర్పరచుకోవడం కద్దు. అతడు రాజుతో మాటాడినప్పుడు లింగరాజు తమ్ము వచ్చుడంలోకి దూరమనిచెప్పినట్లు చెప్పివున్నాడు. ఆ సందర్భం ఇటువంటిది. లింగరాజు, పాప, స్నేహంతో పెరిగేరోజుల్లో ఒకసారి ఉత్తయ్య చాలా మెప్పుదలగా పాపవైపు చూసాడు. అదిచూసి లింగరాజు అతనిచెవిలో 'ఇవ్వాళ, ఆమెను నీదగ్గిరకు పంపనా?' అని అడిగాడు. నిజంగానో అడిగాడో, పరీక్షించడానికే అడిగాడో అతనికి తెలిసింది కాదు. కానైతే వాళ్ళిద్దరి మధ్య, కల్లకపటాలు లేవు. ఉత్తయ్య లింగరాజుమాటను నిజంగానే తీసుకొన్నాడు. కాని అతనికి ఒకస్త్రీని ఆవిధంగా వేరే మనుష్యునితోబాటు పంచుకొని అనుభవించడం, అశుచి అనిపించింది. అదీగాక, తోటిమానవుడు ఔదార్యం పెల్లుబికినక్షణాల్లో ఈవిధంగా త్యాగ బుద్ధి కనబరిచినా, ఆ పొంగు తగ్గింతర్వాత తనలోతాను వేసట పొందవచ్చు. చెప్పినపాటే 'సరే' అన్నాడే అని మిత్రునిగురించి అపోహయపడినా పడవచ్చు. అతడు లింగరాజుతో 'మీ దొడ్డమనస్సుకు ఇదేమంత కష్టమయినపనికాదు. దీనికి సమ్మతించి మీతో జతగా నేను బ్రదుకలేను' అన్నాడు. లింగరాజుకు, ఉత్తయ్య కనబరిచే నిగ్రహాన్నిచూస్తే చాలా సంతోషం, ఆశ్చర్యమూను. ఆయన 'మీరు చాలా పూజ్యులు. తక్కరూ!' అని మెచ్చుకొన్నాడు.

ఇంతటి గౌరవమర్యాద లుండుటచేతనే ఏమాత్రం సంకోచంలేకుండా రాజకుమారిని చక్కగా చూడటానికని దగ్గిరకు రమ్మనమని కోరాడు.

పిల్లవచ్చి ఎదురుగా నిలబడగానే ఉత్తయ్య, ఆమెను, ఆపాదమస్తకము చక్కగా అవలోకించి 'కావేరమ్మ ఎదురుగా వచ్చినట్లుంది. బంగారపుబొమ్మ' అని ప్రశంసించాడు.

రాజకుమారి సంతోషంగా నవ్వింది. సిగ్గుతో వెనక్కు తిరిగివెళ్ళి తల్లిదగ్గిర నిలబడింది.

రాణి ఉత్తయ్యతో 'పెద్దవాళ్ళ మెప్పువలే కావాలిసింది - పెరిగిన మనుమరాలిని తాతగారు చూడనేలేదు. తాతగారిమిత్రులు వారిబదులు చూశారు' అంది.

'ఔనమ్మాజీ. మీ మామగారు బ్రదికివుండవలసింది. ఎన్నోవిషయాలకు బాగుండేది.'

'దైవము మరోలా భావించాడు. ఇప్పుడు మరోవిధంగా మంచి అయ్యేటట్లు పెద్దలు చూడవలసి వుంటుంది.'

'అందుకనే వచ్చాను అమ్మాజీ, దొడ్డరాజుగారు ప్రసాదించిన 'పడి' ప్రభువులు నిలిపేసారు అన్నారు. వద్దు ప్రభూ! ఊరు కోదై నిందిస్తుందని చెప్పడానికని వచ్చాను.'

'ఎవరు చేసినపనో అది. దొరలు చేసారని ఎప్పటికీ అనుకోవద్దు తాతా! పడి నడుస్తుంది. పెద్దవాళ్ళ ఏర్పాటును చిన్నవాళ్ళు నిలిపేస్తారా? రాజుగారే చెప్పివున్నా, నిజంగా చెప్పిన మాట కాదని, ఊరికే అన్నమాటని తెలుసుకోండి.'

'మంచిదమ్మాజీ! పోరి యింట్లో ఇప్పుడు మనగోడు వినేవాళ్లు లేరు. అనుకుంటుంటే 'నే నున్నా' నంటున్నావు తల్లీ! మీరు చెప్పినట్లే కానివ్వండి.'

ఆయన ఆ మాటలు అంటూవున్నసమయంలోనే రాణి కూతురిచెవిలో 'తాతగారికి పాలు తెచ్చి యియ్యి' అంది. రాజకుమారి లోనికిపోయి తానే ఒకపళ్ళెంలో పాలపాత్రను పెట్టుకొని తెచ్చింది. ఆమె వెనకాల దాసీది ఆకువక్కలు, ద్రాక్ష, ఖర్జూరం, గంధం, తాంబూలం తెచ్చింది.

రాజకుమారి ఇచ్చిన పాత్రను తీసికొని ఉక్కయ్య 'ఒకే [1]తానులో రెండురంకాల గుడ్డ లుంటాయా? ఆ తల్లికి పుట్టినబిడ్డ అచ్చరాలా తాతస్నేహితుణ్ణి. సాకుకో తల్లీ' అన్నాడు పాలుత్రాగి పాత్ర తిరిగి పళ్లెంలో వుంచాడు.

ఆ తర్వాత పరిచారికతెచ్చిన పళ్ళెరంలోంచి, చేతినిండా ఆకులు, వక్కలూ, ద్రాక్ష, ఖర్జూరం తీసుకొని, 'నేను ఇహ వస్తాను అమ్మాజీ' అని లేచాడు.

రాణి: 'పెద్దవాళ్ళు పోయింతర్వాత మీరే పెద్దవాళ్ళస్థానంలో వున్నారు. పెద్దలై, పిల్లలు మీవాళ్ళు అని భావించి చూసుకోండి. వెళ్ళిరండి తాతగారూ!' అని నమస్కరించింది.

రాజకుమారికూడా నమస్కరించింది. ఆమె తనవైపు దృష్టిపెట్టి చూస్తూవుండటం ముసలివాడు ఇంతకుముందే కనిపెట్టాడు. ఇప్పుడు మళ్లీ చూసాడు. ఆమె అల్లా చూడటం, తవ మీసాన్ని అని గ్రహించాడు. 'పులిని చంపి పెరిగింది చెల్లమ్మా ఇప్పటివాళ్ళకుమళ్ళే వొట్టి బూటకం వ్యవహారంకాదు' అంటూ విరగబడి నవ్వాడు. రాజకుమారికూడా నవ్వింది ముసలివాడి దర్పాన్నిచూసి రాణికీ నవ్వు వచ్చింది.

ఉత్తయ్య తక్క రాణికి మళ్ళీ నమస్కరించి సన్నిధినుంచి బైటికి వచ్చాడు.

# 70

ఉత్తయ్యతక్క గదిని విడిచి కొంచెంసేపటికి రాజు 'ఒరేయి కుంటీ అక్కడున్నావా?' అని పిలిచాడు.

బసవన్న అక్కడే వున్నాడు, 'ఉన్నాను ప్రభూ!' అన్నాడు.

రాజు: 'ఒరేయి, ఈసారి కాయిలాపడ్డదిమొదలు నాకు ఇదేమో వుండివుండి తల గుంయి అని లోపల మోతపెట్టుతుండే, కుమ్మరిసారెలా తిరిగిపోతోంది గిరగిరా అనుకో.'

1. ఒకేపీసాలో రెండునూనె లుంటాయా అని మూలం.

బసవన్న : ఔను దొరా ! ఇంకా ఒళ్ళు నయంకావాలి.

రాజా : ఒళ్ళు నయం ! విన్నావా 'వడి' ముసలాడు చెప్పినమాటలు ?

బసవన్న : అప్పాజీగారి మిత్రుడనని ఆయనకు బుద్ధి మిక్కిలి పెడసరం ప్రభూ !

రాజా : అల్లాగా ! చూడు అతనిపొగరు ? ముసలాడి ఊహ తనవల్ల కాకపోతే ఇహ ఎవరివల్లా కాదని ! అతనికొవ్వు ఇంత అడగిందాలోయి !'

'చిత్తం ప్రభూ !'

రాజా : అయినా ఆయన మాటాడుతుంటే అప్పాజీగారే మాటాడుతున్నారేమో నవిపించింది నాకు.

బసవన్న : కావచ్చు ప్రభూ !

రాజా : 'అతనివల్ల అయ్యేదీ పొయ్యేదీ లేదు. అయినా అప్పాజీగారికి కావలసినవాడు. అతనితో జగడంవద్దు తెలిసిందా ?'

బసవన్న : చిత్తంప్రభూ !

రాజా : ఆయన చుట్టాల్లో పిల్లను వట్టుకోగూడదు సుమా !

బసవన్న : వట్టుకొన్నతర్వాత తెలిసింది చుట్టమని. వీళ్ళల్లో, ఎవరు ఎవరికి ఏం చుట్టాలో ! అంతా బీరకాయ పీచు.

రాజా : సరే అవిషయం వదిలేసెయ్యి. నేను చెయ్యమన్నాను. నువ్వు చేసావు. కాని వడి నిలిపేయడం ఏమంత మంచిపనికాదు.

బసవన్న : చిత్తం ప్రభూ !

రాజా : నేను నిలిపేయమని చెప్పడమే తడవుగా నిలిపేసావు.

బసవ : చిత్తం ప్రభూ !

రాజా : ఇతగాడి మీసాలపొగరు ఎక్కువగా వుంది. దాన్ని అణగగొట్టు. 'వడి' తిరిగి ఇచ్చామనిచెప్పు పోనీలే అడివిపిల్లి !

బసవన్న : చిత్తం ప్రభూ !

రాజా : నిన్నటినుంచి ఈపొద్దుదాకా జరిగినమాటలన్నీ చేరి నా తల బ్రద్దలుగొడ్తేస్తున్నాయి కుంటీ ! ఆ సీసా ఇటు తీసుకురా.

బసవన్న సీసా తెచ్చిఇచ్చాడు. ఆయనకు ఉత్తయ్య మాటాడినతీరు ఆశ్చర్యం కలిగించింది. ఎంత దిట్టమయినమాట. ఇతన్ని ప్రత్యక్షంగా పగ సాధించడం మంచిదికాదు. దురహంకారిమాట నిజమే. అయితే దానికి రహస్యంగా శాస్తి చెయ్యాలి. తెల్లదొరలు వస్తారే, అప్పటికి ఇతన్ని మనవాడిగా చేసుకోవడం క్షేమం. కులకంగా ఆలోచించి అక్కడు [illegible] మారకుంది రాజుతో 'అట్లా అయితే తక్కురుకు ఈవిషయం ఇప్పుడే చెప్తాను ప్రభూ !'

అన్నాడు.

రాజు తెలియజెయ్య అని ఆదేశించాడు.

తక్కరు రాణిమండి ఆజ్ఞపొంది బైటికి వచ్చేంతర్వాత బసవన్న వాకిలిలో అతన్నిచూసి 'రాజు 'మీపది మీకుండనీ' అన్నారు తక్కరూ!' అని చెప్పాడు.

తక్కరు ఆనందంతో పొంగిపోయాడు. అతడు 'అట్లనా! బసవన్న! మంచిది. నా నమస్కారం చెప్పు' అన్నాడు.

తక్కరుకు చెప్పినమాట రాణి చెవుల్లోనూ వద్దది ఆమెకూ సంతోషమైంది.

# 71

ఉత్తయ్య తక్క రాజభవనంనుంచి తిరిగివచ్చి, లక్ష్మీనారాయణయ్యకు నడచిన వృత్తాంతం అంతా నివేదించాడు. ఆయ్యవారు 'మొత్తంమీద ఈసంగతి సుఖంగా ముగిసింది-సంతోషం' అన్నాడు. బోపణ్ణ 'అయిందేదో అయింది; ఇంకమీదట ఈయన మన ఆడ పిల్లల్ని చెణకకూడదు సుమా!' అన్నాడు.

ఉత్తయ్య: అయ్యో! ఇంకా ఆమాటేమిటి వదిలేయండి. దగ్గిర్నుంచి మీరు చూడ లేదు. ఇంక ఈయన ఆడపిల్లను చెణకి ఏవిఁటి బావుకుంటాడు? భార్యగా వచ్చిందాన్ని కన్యగాచేసి పంపిస్తాడు.

బోపణ్ణ: మనమంతా అల్లాగే అనుకొంటూ వచ్చాం. అయినా ఈయన చెణకుతూనే వున్నాడు. ఒప్పుకున్నవాళ్ళే చాలినంతమంది ఉన్నారు. ఒప్పుకోనిపిల్లను [1]పాణేనుంచి బల వంతంగా తెచ్చాడుట!

ఉత్తయ్య: 'వేరే ఏదో పిచ్చిపట్టివుండొచ్చు. లేదా బసవన్న వేసో కోతలు:

బోపణ్ణ: అదీ అయివుండొచ్చు తక్కరూ! పూరి కాజేసే 'తక్క'కు పైరు కాజేసే కుక్క! అయినప్పటికీ, రాజుసుకూడి దొడ్డవారు అయ్యారు అన్నట్లే బసవన్న సావాసంచేసి గొప్పవారయ్యారు అనేవాళ్లూ లోకంలో వుండొచ్చు.'

ఉత్తయ్య: లోకంమాట దూరంగాపెట్టుకొని [2]ఇరసానికి కుంగిపోకూడదు. దాని అరు సానికి పొంగిపోకూడదు; అతనిమాట ఎట్లావున్నా రాణమ్మ ఇంటిని కాపాడుకొంటూ వుంటారు. 'కుంటి' వచ్చి చెప్పడానికిముందే మీ పది మీకు వుందన్నారు. తల్లి కావేరమ్మ గారు ఇక్కడవున్నట్లే వుంది, నాతల్లి పుట్టమ్మాజీ ఎదురుగా నిలబడేటప్పటికి.

---

1. 'పాణే' ఒకానొకగ్రామం.

2. ఇరసము = విరసము, అరుసము = హర్షము.

బోపణ్ణ: మీ కండ్లుకూడా అటువంటివే. అందంగాలేని అమ్మాయిని మీరు చూచిందే లేదు.

'పోనిద్దురూ: ముసలితనాన్ని చూచి పడుచుదనము నవ్వితే, పడుచుదనాన్ని బాల్యం నవ్వుతుందట!'

ఈ మాటలధోరణి ఇంతటితో ఆగిపోయింది. పిమ్మట బోపణ్ణ లక్ష్మీనారాయణయ్యకు 'ఇంక అయ్యవారూ! మీరుపోయి పాణేవారి సంగతి తెలుసుకొని రావలసింది' అన్నాడు.

లక్ష్మీనారాయణయ్య: 'పడివిషయం మాటలాడి ఈసరి కప్పుడే రాజుగారు అలసిపోయి వుంటారు. నేను వారిని రేపుచూస్తే బావుంటుంది.'

బోపణ్ణ: ఇవ్వాళ అలసటని రేపు చూడొచ్చు. రేపు శ్రమఅని ఎల్లుండికి వాయిదా వేయవచ్చు. మాకేమైనా సమ్మతమే. కాని బోనులోపడ్డ ఆ ఎలుకకధ వేరు. దాన్ని ఈపిల్లులు భక్షించివేయకుండా వుండాలి ఇంతదూ:

ఉత్తయ్య: ఔను తక్కడూ! అయ్యవారూ: ఆలస్యం చెయ్యకండి. ఈపొద్దేచూచి మాటలాడి పని ముగించుకొని రండి.

లక్ష్మీనారాయణయ్యకు ఆ రాత్రే మనస్కరించలేదు. ఓ రోజు ముందుకు జరిగితే మంచిదనీ, ఈలోపల కొంపలు మునిగిపోవని అతని ఉద్దేశం. కోమలమనస్సులో కష్టాలకు గురియైన ఆడపిల్లను గురించి జాలిలేదని అర్థం కాదు. కనికరం, కారుణ్యం అన్నీ ఉన్నాయి. ఆమెను విడిపించవలెననే కోరికా మిక్కుటంగావుంది. అయితే ఆపని చేయడంలో ఏమంత యోగ్యుడు కాని తన యజమాని (రాజు)తో పెద్దగా ఏం మాటలాడవలసివస్తుందో అనే భయమూ అతనికి కద్దు. ఆయన 'సరే అట్లాగే ఇప్పుడే వెళ్ళిచూస్తాను' అన్నాడు.

# 72

ఆ సాయంకాలం, ప్రొద్దుకుంకేవేళ, లక్ష్మీనారాయణయ్య అరమనస్సుతో దొరను చూడటానికి వెళ్ళి, తాను వచ్చివున్న సంగతిని చెప్పివంపించాడు. వీరరాజు ఎప్పటికంటె కొంచెం ఎక్కువగా తాగి నిద్రపోయాడు. అప్పుడు బసవన్న అతనిదగ్గిరనే వున్నాడు. దొర అతనికి 'ఏం పనిమీద అయ్య వచ్చారో అడుగు' అని హెచ్చరించాడు. బసవన్నవచ్చి 'ఏమిటి సంగతులు' అని దొర అడుగుతున్నారు అన్నాడు. లక్ష్మీనారాయణయ్యకు అతనితో ఆవిషయం చెప్పడం ఇష్టంలేదు. తిన్నగా దొరకు చెప్పాలి. అతడు 'ఇప్పుడు చూడవచ్చు

అంటే సరే, లేకపోతే రేపు రమ్మంటే వస్తాను అన్నాడు. దొరగారి పిలుపననుసరించి పోయే ఈ నెపంలో తనమీద అపనమ్మకం దాగివుందని బసవన్నకు తెలుసును. ఇటువంటి సూక్ష్మాలు గ్రహించడంలో అతడు ఎవరికీ తీసిపోడు. అతడు 'తెలుసుకొనివచ్చి చెప్తాను అయ్యగారూ!' అన్నాడు. లోపలికిపోయి రెండునిమిషాలలో వచ్చి, 'రేపు రావడం మీకూ అనుకూలమే అయితే అల్లాగే రేపే రానీ అని ఆజ్ఞాపించారు' అన్నాడు. లక్ష్మీనారాయణయ్య [1]కాలి త్రిప్పటకు కూలిలేదులే అని వెనక్కి ఇంటికి వచ్చేసాడు.

లక్ష్మీనారాయణయ్య తల్లి సావిత్రమ్మ. ఈ వ్యవహారం ఎల్లా నడుస్తున్నదీ అడిగి తెలుసుకుంటూనే వుంది. ఆ సాయంకాలం, తనకుమారుడు దొరను చూడబోయేటప్పుడు ఆమె 'ఈశ్వరుడు దొరకు మంచిబుద్ధి ప్రసాదించి అంగీకరించి కాపాడనీ' అనుకొంది. కొడుకు వెనక్కితిరిగి రావడంచూస్తే ఆమెకు దొరను చూసివుంటాడనిపించలేదు. లక్ష్మీనారాయణయ్య ప్రాంగణంలోకి రాగానే 'ఏం నాయనా! పుట్టప్పాజిని చూడటం పడలేదా?' అని అడిగింది. లక్ష్మీనారాయణయ్య 'లేదమ్మా! రేపు రమ్మనమని అని బసవన్న చేత చెప్పించారు' అన్నాడు.

'రేపటిదాకా ఆగడానికి వీలు. చాలా అవసరమైనమాట అని చెప్పలేదా!'

'పోయినసందర్భాలన్నీ అవసరమైనవే. ఈ పొద్దు ఒక అవసరం. రేపు ఇంకో అవసరం. దొరవారికి ఏదీ కాబట్టదు. 'రేపు రమ్మను' అన్నారు. అవసరమైనమాట అనిచెప్పితే, ఏమంటారో తెలుసా? ఎల్లుండి రమ్మంటారు.'

'ఆయన చెప్పినమాటకు చెప్పవడి నువ్వు వెనక్కి వచ్చేసావు. ఆ పిల్లగతి ఏమిటప్పా!'

'ఒక్క రోజేగా ఆలస్యం!'

'నీకు ఓరోజు. ఆమెను వెతికించితేవడానికి పదిరోజులన్నా పడుతుంది. పదిదినాలు వద్దుగొడవకు మరోరోజు పెట్టితే ఏం అందామూ? నిన్నో నీపత్నినో ఎవరెత్తుకపోతే ఇట్లాగే అంటావా? ఇల్లాగే వుంటావా?'

'ఇప్పటికి ఈశ్వరకృప వల్లగా వుంది. ఆపదేమీ రాలేదు. ఎట్టి దుర్దశవచ్చినా, ఈ దేశంపాటు ఇంతే. ఇది బాగుపడేటట్లేదు.'

'[2]అప్పయ్యా! ప్రజాకార్యములను చూచేవాళ్ళు ఇంకొంచెం గట్టిగా నిలబడాలి. నీళ్లలోతని చేప భయపడితే ఎట్లా? మీ తండ్రిఅయితే ఇట్లా ఎదిలేసి ఊరుకుండేవారుకాదు. ఇప్పుడేమిటి చేయడం? చెప్పు. పుట్టప్పాజీకి నేనుపోయి చెప్పనా?'

'నువ్వు వాడిని చాల ముద్దుగా పుట్టప్పాజీ అంటున్నావమ్మా. మా వాడనుకుంటే చూడు. తప్పేముంది? నువ్వు పుట్టప్పాజీ అన్నట్టే ఆయన సావిత్రమ్మవ్వ అనాలి అంతే.'

---

1. పోయినదారికి సుంకంలేదు అని మూలం.
2. 'అప్పయ్య' కుమారుని ప్రేమగా సంబోధించు తీరు.

'అంటారులే, అనకేం చేస్తారు? అనకపోతే నే మూరకుంటానా? నాకేమీ పనిలేదుగా. అనేదాకా గిల్లిచూస్తాను. మంత్రి తల్లిని, కొడుకుమాట కాదని దొరను చూడటానికి పోయే దాన్ని, నన్నేం చేస్తారు? పోయిచూస్తాను.'

ఈవిధంగా సావిత్రమ్మ లోపలికిపోయి కోడలికిచెప్పి దొరను చూడటానికి రాజభవనం వైపు బైలుదేరి వెళ్ళింది.

# 73

రాజభవనానికివచ్చి సావిత్రమ్మ రాణిని చూసింది. మెల్లిగా సంగతంతా ఆమెచెవిలో ఊదింది. 'మీరూ తోడుగా రండి. రాజుగారిని ఓమాట అడుగుతాను' అంది.

గౌరమ్మాజి: 'మీరు రాజుగారిని చూడదలచుకుంటే నే నెందుకు అవ్వా? మీరు ఎత్తుకొని ఆడించిన దొరబిడ్డ. ఇందులో ఎవరితోడు కావాలి మీకు?'

'సరే, అడ్డులేదనుకో; కాని, బ్రాహ్మణపీఠమంచివచ్చిన ఆడుది తిన్నగా రాజుగదిలోకి వెళ్ళటం కద్దా? పుట్టమ్మాజినైనా రానీ, సాతమ్మవ్వ వచ్చిందని చెప్పనీ.'

రాణి కూతుర్ని పిలిచి 'పుట్టమ్మాజి, సాతమ్మవ్వ వచ్చారు. అప్పాజిగారిని చూడవలె నంటున్నారు. వా రున్నచోటికి పిలుచుకొనిపో' అంది.

రాజకుమారివచ్చి ముసలిదాని చేయిపట్టుకొని ఆమెను రాజుగారి శయ్యాగారానికి పిలుచుకొనిపోయింది. వృద్ధను గుమ్మందగ్గరనిలిపి తాను లోపలికిపోయి 'అప్పాజి, సాతమ్మాజి వచ్చివున్నారు. మిమ్మల్ని చూడాలిట' అంది.

ఎటువంటిస్థితిలో ఉన్నా వీరరాజుకు కూతురి కంఠధ్వని అమృతసేచనంలాగావుంటుంది. అదీకాక, ఆసమయానికి సారాయిమత్తు దిగిపోయింది. అతడు 'ఏమిటి చూస్తూ నిలబడ్డావ్?' అని అడిగాడు.

ఈమాత్రం చాలునని ముసలిది గదిలోకి నడిచింది. 'ఏమంత పెద్దపనికాదు పుట్టప్పాజి, చిన్నమాట ఓటి వుంది. దాన్నిచెప్పి, ఔననిపించుకొని పోదామని వచ్చాను' అంది. దొర దగ్గిరకువచ్చి నిలబడింది.

'ఏమిటా చిన్నవిషయం?

ముసలిది రాజకుమారితో 'నీవు అమ్మాజిదగ్గిరకు పో తల్లీ నేను వచ్చేస్తాలే' అనిచెప్పి ఆమెను పంపించి వీరరాజుతో సన్నగొంతుతో 'పసిపిల్లదానిచెవిలో ఈమాట పడగూడదని పంపించేసాను' అంది.

వీరరాజు: 'ఏదైనా ఆడదానిమాటా ?' అన్నాడు.

'ఆడదానిమాట కొఇద్దే అడుది రావడం, మగవాడిమాటైతే మగవాళ్లే వచ్చి వుందురు.'

'ఎప్పుడూ అల్లా కాదవ్వా ! ఆడది మగవాడిమాటకు, మగవాడు ఆడదానివిషయానికి వెళ్లడం లోకంలో రివాజు' ఇదీ హాస్యధోరణి ! ఇల్లా అంటూ రాజు తన మాటసొంపుకు తానే నక్కున నవ్వాడు.

'పడుచుపిల్లతోటి పరసపుమాటలు ! ముసలిదాని కిదంతా ఏమిటీ తెలుస్తుంది. దొరబిడ్డ పుట్టినప్పుడు చేతిలోకితీసుకొని నేలమీద పరుండబెట్టినదాన్ని నేను. ఇప్పుడో ఆడకూతురి విషయమై వచ్చాను. [1]పుట్టప్పాజి నేను చెప్పినట్లు జరిగించాలి.'

'ఏ ఆడకూతురు ?'

'పాణేపిల్ల. మా బంధువులపిల్ల. ఇక్కడిజనమే లాక్కొని బలాత్కారంగా తెచ్చారు. 'అవ్వేరవాడి'లో ఉంచేసారు. ఆమె పెనిమిటివచ్చి గోలపెట్టాడు. విడిపించి ఇవ్వండి అన్నాడు. మా పుట్టప్పాజికిచెప్పి నేను విడిపించుకొనివస్తాను అని మాటఇచ్చి నేనే వచ్చాను. ఏమప్పా ! ముసలిదానిమాట జరగనీ; ఆమెను పిలిపించాలి.'

'పాణేపిల్ల ? మేము చూడలేదే ! అడిగి రేపు చెబుతానవ్వా !'

'అడగడానికి, చెప్పడానికి వేళలేదు పుట్టప్పాజి ! ఇప్పుడే బసవన్నునుపిలిచి ఆపిల్లవుంటే పాతమ్మకు తెచ్చి అప్పగించు అని చెప్పాలి. ఒక్క పడుచుపిల్లను వదిలివేస్తే ముగ్గురు పడుచుపిల్లలు వస్తారు. వంశం నాశంచేసి చేయదగ్గదేముంది ? కొలువుచేసేవాళ్ళకు బుద్ధి వుండదు.'

'అల్లా అయితే మీరేమి నా గొంతుమీదకూచుని పని చెయిస్తారా ?'

'ఉండండి పుట్టప్పాజీ ! ఏమైనా దొర దొరే ! నా పుట్టప్పాజి నావాడైతే దొర అనేది సారవంతమైన మాటా ? ఇది అడిగికొనేమాట. ఎత్తికొని ఆడించిన ఈ ముసలిది అడిగి కొన్నదికదా అని దొరలైనవారు చేయవలసినమాట. ముసలిదానిమాట చేసి ఆ వంశాన్నే నిలిపితే ఈశ్వరుడు దొరకూతుర్ని కాపాడుతాడు. ఆడపిల్లలు ఎవరైనా ఒక్కటే. మనపిల్ల ఏమిటి ? పరాయిపిల్ల అని ఏమిటి ? రేపు పుట్టమ్మాజికి ఏవిధమైనకష్టమూ కలుగరాదు.'

తన కూతురిమాట ముసలిది ఉద్దేశపూర్వకంగా ఎత్తింది అని వీరరాజు గ్రహించాడు. వెంటనే అతనికి కూతురు సుఖపడాలి అనేకోరికతో మనస్సు కొంచెం పీకులాడిందికూడా. అతడు 'ఒరేయి బసవా ! అక్కడున్నావా ?, ఈ ముసలిదిక్షఇదేమిటో నామీద మంత్రం పారిస్తోందిరా ? ఇక్కడికి రారా ముండమోపీ !' అని అరిచాడు.

1. పుట్టప్పాజి = చినబాబుగారు.

జరుగుతున్న మాటలన్నీ బసవన్న గుమ్మం వెనకతల నిల్చి వింటూవున్నాడు. రాజు పిలవడంతోనే 'వచ్చాను దొరా!' అంటూ లోపలికి వచ్చాడు.

వీరరాజు 'ఎవరు అది పాణెపిల్ల? బాపనపిల్లటగా! ఈ ముసలిది నా ప్రాణాలు కొరికేస్తోంది. ఏమిటో, ఎవరో చెప్పి తరిమివెయ్యి' అన్నాడు.

'తరిమేయి అంటే తప్పులేదు పుట్టప్పాజీ! పిల్లనుమాత్రం ఇచ్చివెయ్యి. నా మొహం మీద ఉమ్మేసినా తప్పులేదు. [1]నా చెల్లెలితో సమానం మీ అమ్మ కూతుర్నికన్న రోజు నేను గది బైట పడుకొన్నా, దొరబిడ్డను ప్రక్కలో పెట్టుకొని, నిద్ర పట్టేసమయానికి ఎందుకో మెలకువ వచ్చింది. చెవి గులగుల అన్నట్టయింది. ఇదేమిటా అనిచూస్తే దొరబిడ్డ చెవిలో ఉప్పు పోస్తూవున్నాడు. అప్పుడు ఉప్పు, ఇప్పుడు ఎంగిలి. నాకు వచ్చినలోపం లేదు. మచ్చినమని చేసి పంపు, నవ్వుతూ వెళ్తా. మీ కూతురు సుఖంగా వర్ధిల్లాలి అని మనసా వాంఛిస్తాను.'

ముసలిదాని ఒత్తిడి భరించేదారి రాజుకు కనబడలేదు. 'సరే! పో అవ్వా! పిలుచుకొని పో. ఓరీ బసవా! సాయమ్మవ్వ ఏడుస్తూవున్న పిల్లను ఆమెవెంట పంపించివేయి' అన్నాడు.

బసవన్న: 'ఎవరో ఏమిటో చూసికొని పంపేదా? దొరా?'

'పోరా ముండమోపీ! చూసుకొని పంపేదేమిటి? అంటే పిలుచుకొనిరా లేకపోతే పోనీ, తిరిగి నాకీ సంగతి చెవిలో పడకూడదు. పొద్దున్నే ఆ ముసలాడు, సాయంకాలానికి ఈ ముసలిది దాపురించారు నా ప్రాణానికి. ఇంకా నువ్వు వేరే చూసివచ్చి చెప్పేదేమిటి! ఏ పిండాకూడు! నావల్లకాదు. వెళ్ళు అవతలికి ముసలిదాన్ని తీసుకొని. నువ్వున్నావు; నీకు జత ఆమె వుంది. పొండి మీ ఇద్దరూ!'

ముసలిది వీరరాజు బుగ్గను పట్టుకొని అల్లాడించి ప్రేమగా 'ఇప్పుడు నా పుట్టప్పాజీ! దీనికే నేను వచ్చింది. నా దొరబిడ్డకు శుభమగుగాక! నీ కూతురు సుఖంగా వర్ధిల్లాలి. నేను వస్తానప్పా!' అంది. బసవన్న వెంట వెళ్ళింది.

ఆమె నాలుగడుగులువేస్తే గుమ్మందాటి బైట పడుతుంది. వీరరాజు ముసలిదాన్ని పిలిచి 'ఏ చెవికిఅవ్వా! ఉప్పుపోసింది. కుడిచెవిలోనా ఎడంచెవిలోనా?' అని అడిగాడు.

'కుడిచెవిలో నాయనా! నాకు బాగా జ్ఞాపకం'

రాజు 'అందుకే కాబోలు, నువ్విన్నాళ్ళు బ్రదికావు' అని గొల్లుమని నవ్వాడు. ముసలిదికూడా నవ్వుకొంటూ బసవన్న వెంటబడిపోయింది.

1. అమ్మ చెల్లెలు అని మూలం. మీ అమ్మ నాకు చెల్లెలివంటిది అని భావం. తెలుగులో 'కోడలు పిల్ల' వంటి ప్రయోగం. పిల్లలాంటికోడలు అని భావం.

# 74

బసవన్నతో పాటు బైటికివచ్చి ముసలిది 'ఇదే వచ్చేస్తాను, ఓ నిమిషంలో' అంటూ అంగలు పంగలుగా అంతఃపురానికివెళ్ళి 'పుట్టిపెట్టి ఆపిల్లను వదిలిపెట్టు అని బసవన్నకు చెప్పారు అమ్మాజీ. ఈశ్వరుని కృప' అని తెలియజేసింది. రాణి 'చాలా మంచిపనిచేసారు అవ్వా! [illegible] మర్యాద కాపాడారు' అంది.

ముసలిది : 'నేను వెళ్ళిరానా! తిరిగివచ్చి మీకు అన్నివిషయాలు చెబుతాను. ఇప్పుడా పిల్లదాన్ని బైటికి తెచ్చేది ముఖ్యమని' అంది.

రాణిదగ్గిరవున్న ఆకు వక్కలవొక్కిరమును తానే తీసుకొని, ఆకూ వక్కలు ముసలి దాన్ని చేతిలోపెట్టి 'జానమ్మా వెళ్ళిరండి. ఈ[illegible] ఆ అమ్మను ఇంటికి పిలుచుకొని పో' అంది.

ముసలమ్మ తన వయస్సుకుమీరిన చురుకుతనంతో పరుగెత్తుకొని బసవన్న వున్న చోటికి వచ్చి 'బసవన్నా! ఆ పిల్లను పిలిపించావా?' అని అడిగింది.

బసవన్న : '[1]అప్పయ్యా' అని కూచుంటే ఆ అమ్మ అక్కడినుంచి కదలుతుందా? మీరే వచ్చి పిలుచుకొనిరావటం మంచిది. మేం బైటకు తెస్తామంటే ప్రాణం తీసేసుకొంటుంది.'

'అదీ నిజమే' అంటూ ముసలమ్మ 'పద నేనే వస్తా' నంది.

వాళ్ళిద్దరూ తోడుగా ఆ పిల్లదాన్నివుంచిన చెరవాడకు పోయారు.

'రాజుగారు మిమ్మల్ని ఇంటికి పంపింతు అన్నారు. మంత్రి లక్ష్మీనారాయణయ్యగారి తల్లి ముసలమ్మగారు మిమ్మల్ని తీసుకొనివెళ్ళడానికి వచ్చివున్నారు' అని చెప్పేటప్పటికి పాపం నాగమ్మకు నమ్మకం కలగలేదు. ఆమె 'నాకు తెలిసినవాళ్ళు ఎవరన్నా వచ్చేనే నేను వాళ్ళవెంట వెళ్తాను. మీరు నన్ను వేరే ఎక్కడికో లేవుకుపోవాలి అని చూస్తున్నారు' అంది. సావిత్రమ్మవెళ్ళి 'చూడుతల్లీ! మీ మగవాడే రావాలి, అని చెప్పితే పోయి పంపిస్తా నమ్మకో. నాకేమీ కష్టంలేదు. కాని ఎంత ఆలస్యం ఔతుంది?' ఒక్క గడియముందే ఈ స్థలాన్ని విడిచెయ్యి. నన్నుచూస్తే మోసంలాగుందనిపిస్తుందా?' అని అడిగింది.

'అవ్వా! మీరు చాల దొడ్డవారు సరే. నాకు గుర్తులేదు. ఇక్కడివాళ్ళు చాలా నమ్మకంతో మాటలాడి మోసపెట్టడానికి చూస్తారు.'

ముసలిది : 'నిజం మాటమ్మా నువ్వు చెప్పింది. నీ భయం నీది. ఏమీ తప్పులేదు. బసవయ్యా! కొంచెం మా ఇంటికి చెప్పిపంపించి పాపం నారాయణప్ప ఓసారి రావాలి అని చెప్పు నాయనా! నన్నూ రక్షించినట్లు! నేను ఇక్కడే వుంటాను.'

---

1. 'అప్పయ్యా'—తెలుగులో 'అమ్మయ్యా' అని చెప్పినట్లు.

వినవన్ను బైటికిపోయి ఒక సేవకుణ్ణిపిలిచి అవిధంగానే ఆజ్ఞాపించాడు.

నౌకర్లు బైటికివచ్చిన రెండునిమిషాలతర్వాత నాగమ్మ 'మీరు నన్ను రక్షించడానికిగా వచ్చారు అవ్వా! పదండి పోదాం. పోతూ ఎటో పడిపోతున్నామన్నట్లు నాకు కనబడితే మాత్రం నేను గొంతు పిసికికొని ప్రాణాలు విడుస్తాను' అంది.

సావిత్రమ్మ 'నువ్వు పిసికికొన్నా పిసికికొంటావు, అంతటిదానివే తల్లీ నువ్వు! మహా ధైర్యంగల పిల్లవు! ఏం చూసి బెదరావో నాకేం తెలుసు. వుండు, నీ పెనిమిటే వస్తారు. కలిసిపోదాం' అంది.

నౌకరుపోయి సూర్యనారాయణను పిలుచుకొని తెచ్చేటప్పటికి మూడుగడియలపొద్దు పెరిగింది. ముసలమ్మ రామధ్యానంచేస్తూ కూచుంది. సూర్యనారాయణ వచ్చినచప్పుడు విన నానే లేచి 'రా తండ్రీ! నీభార్యకు ధైర్యంచెప్పు. ఆమెను పిలుచుకో' అంది.

సూర్యనారాయణ నేలమీద సాష్టాంగంగాపడి ముసలమ్మ కాళ్లకు మ్రొక్కాడు. 'నా ఇల్లు నిలబెట్టిన దేవతవు నీవు అవ్వా! నా మానం నా భార్య ప్రాణం కాపాడారు' అన్నాడు.

'రక్షించేవాడు ఈశ్వరుడు తండ్రి! మనుష్యులు! వాళ్లమొహం వాళ్ళేమి రక్షిస్తారు! ఇల్లా అనేటట్లయితే మా పుట్టపాజి రక్షించారు అని చెప్పండి. వింటమే ఆలస్యం. తీసుకొని పొండి' అని చెప్పారు.

అప్పటికి నాగమ్మ లోపలినుంచివచ్చి సావిత్రమ్మకాలిమీద పడింది. 'నేను కొంచెమైనా తప్పు చేసివుండలేదు. ఎవరూ నన్ను హీనంగా చూడకుండావుండేటట్లు నన్ను చేపట్టినవారు చూడాలని చెప్పు అవ్వా!' అని వేడుకొన్నది.

సూర్యనారాయణ: 'ఎవరు నిన్ను హీనంగా చూసేది? హీనపరిస్తే నేను చూసుకొంటా నులే' అన్నాడు.

సావిత్రమ్మ: 'నువ్వో ఎప్పుడైనా కోపంలో హీనంగా మాట్లాడవచ్చునయ్యా! ఏదీ నా చేతిలో చేయివెయ్యి. ఎన్నడూ అట్లా మాటలాడనని అను' అంటూ చేయి చాచింది.

సూర్యనారాయణ ముసలవ్వచేతిని తనచేతితో పట్టుకొని తన తలతో స్పృశించాడు. 'నేను ఈమెను చెడ్డగా మాటాడితే నాకు రౌరవాదినరకాలు తప్పవు అనుకో' అన్నాడు.

నాగమ్మ ఇంతవరకూ ఆపుకొన్నదుఃఖం ఆమె ప్రయత్నాన్ని మీరిపోయింది. ఆమె 'అయ్యో! మీకు ఇంత అపనింద తేవాల్సిన గీత నా నొసట వ్రాసిపెట్టివుంది' అని గోల పెట్టుతూ పెనిమిటి భుజంమీద తల పెట్టుకొని పెద్దపెట్టున గొల్లుమని ఏడ్చింది. సూర్య నారాయణ అందరిఎదుట భార్యను ఓదార్చడం ఇష్టంలేక కొంచెం సంకోచించినా, ఓదార్చడం అవసరమనితోచి ఆమె వెన్ను మెల్లిగా నిమిరి తట్టి 'ఏమీ కాలేదు. నువ్వు మెదలకుండా వుండు. జగదంబ అవ్వరూపంలోవచ్చి నిన్ను కాపాడింది. ఒక్క గడియక్రింద ఈవిధంగా జరుగుతుందని నువ్వనుకొన్నావా? కాపాడిన ఆ దైవమే ఇకమీదటకూడా కనిపెట్టి

వుంటారు. సవ్వాల్సిన సమయంలో కంట తడిపెట్టకూడదు' అని బుజ్జగించాడు. తాను కట్టుకొన్న పంచెఅంచుతో ఆమె కన్నీరు తుడిచాడు.

దంపతుల జరిపిన ఈ సంభాషణ అక్కడున్నవాళ్ళ మనస్సులనన్నింటినీ కదిలించి వేసింది. బసవన్నకుకూడ ఆ ఇరువురిమధ్య జరిగినచర్చ, మనస్సులో ఏదోమూల కొంచెం కళవళంపుట్టిస్తూనే వుంది.

ముసలమ్మ: 'పదవండప్పా! ఇక పోదాం' అంది. అందరూ అక్కడినుంచి బైలుదేరి వచ్చారు.

# 75

రాజుగారిచెల్లెలు దేవమ్మాజీ రాజభవనంనుంచి విడుదలై అప్పంగొళకు పోయినప్పుడు, చెన్నబసవన్నకు సంతోషంకంటే ఆశ్చర్యం ఎక్కువ వేసింది. ఆశ్చర్యంకంటెనూ అతని మనస్సులో ఒకరీతి దర్పం రూపుగట్టింది.

అమ్మాజీ వస్తున్నారు, ఈపాటికి పల్లకి నగందారికి వచ్చివుండొచ్చు అని వార్తాహరుడు ఒకడువచ్చి చెప్పేదాకా అప్పంగొళ రాజభవనంలోని కుటుంబం నమ్మలేదు. కాని దీపం పెట్టేవేళకు దొరసాని రానేవచ్చింది. ఆమె గర్భిణి. చెన్నబసవన్న పెద్ద రాజభవనానికి వెళ్లడంగాని, ఆయన ఈమెను కలియడంగాని ఇక్కడి వాళ్ళెవరూ ఎరుగరు. అందుచేత వాళ్ళు ఒకళ్లమొహం ఒకళ్లు చూసుకోవడం మొదలుపెట్టారు. దొరసానికి స్వాగతంచెప్పి రాజభవనంలోపలికి పిలుచుకొని వెళ్ళారు. శయ్యాగారంలో కూర్చుండజేసి, సేవలు చేసారు.

చిన్న చేడియ ఒకత్తువచ్చి 'కొంచెం పాలు పుచ్చుకుంటారా? అమ్మాజీ! ప్రయాణం చేసివచ్చేటప్పటికి అలసటపడి వుండొచ్చు' అని అడిగింది.

ఒక పరిచారిక తట్టలో పాలపాత్రపెట్టుకొని తెచ్చి ఇచ్చింది.

చెన్నబసవన్న పల్లకి వచ్చాక గుమ్మంలోనిలబడి 'ఎట్లా వున్నారు? అని అడిగి భార్యను స్వాగతించాడు. ఆమె 'మీరు సౌఖ్యమా? బొత్తిగా చిక్కిపోయారే? అని అడిగి లోనికిపోయింది. చెన్నబసవన్న రెండునిముషాలు తన గదిలోకిపోయి చేటికలు ఆమెను సేవింప నియమించి ఆ పిమ్మట శయ్యాగారానికి వచ్చాడు. ఆమెప్రక్కన కూచున్నాడు. నౌకర్లు అందరూ మెల్లిగా ఎక్కడివాళ్లక్కడ జారుకొన్నారు.

'ఏమిటి సంగతి? ఒకేపట్టాన మిమ్మల్ని పంపించేసారే: బెంగుళూరినుంచి ఒత్తిడి వచ్చివుంటుంది.

'దీనికీ బెంగుళూరికి సంబంధం ఏమిటేమా. మీరు భ్రమపడుతున్నారు అంతే.'

'మీకు జ్ఞాపకంలేదు. నెలరోజుల్రిందట ఉత్తరం వ్రాశాను. ఈ దుర్మార్గుడు తన చెల్లెలు తనకు లొంగాలని ఒత్తిడి చేస్తున్నాడు. ఇతనికి తగినశాస్త్రి చేయండి అని. వాళ్లు 'జాగ్రత్త కబడ్దార్' అని ఉత్తరం పంపించివుండొచ్చు. బెదిరాడు దాంతో.'

'అంటే బావమఱదిని తిట్టడంతో మీరు నా మర్యాదే మంటగలిపారు అన్నమాట. ఆ పాపిష్టిముండాకొడుకులంతా మీరు వ్రాసినఉత్తరం చదివివుండొచ్చు. చెల్లెలు పెనిమిటిని వదిలేసి అన్నను కాదంటే అనవచ్చు. ఇటువంటి ఆడది ఎట్లా వుంటుందో అని ఇక్కడివాళ్లు వచ్చినప్పుడు నా వైపు వెర్రిగా చూడవచ్చు. అప్పుడు మొకమువు చల్లగా వుంటుంది.'

'తోడబుట్టినవాళ్లు మీరు మీ అన్నయ్యను ఓర్చవచ్చు. మాకేమిటి దాక్షిణ్యం? అన్నను క్రిందికి లాగేసి గద్దెపై చెల్లెల్ని కూర్చుండబెట్టినతను మరి చూడు, ఈనా మీసాన్ని కత్తిరించేసి, కుక్కబొచ్చు అంటించుకోకపోతే? ఏమనుకొన్నాడో తొత్తుకొడుకు?'

'అయినా తొత్తుకొడుకైతే మీరు తొత్తుకు అల్లుళ్లౌతారు. నన్ను కన్న దేవకాంబి మాగులొత్తుల్ని పాలించింది, దాకే తప్పేంది. మీ మీ జగడాలలో మీరు మా తల్లిదండ్రుల పేర్లు బైటికి లాగకండి.'

'తండ్రిని, తల్లినీ ఏవరేమన్నారు? కొడుకు మొగానకొస్తే, కన్నవాళ్ల మొహంపైన ఓ తువ్వర పడింది. అటువంటి కొడుకును కన్న తల్లికి, తండ్రికి పేరు ఏమి నిలవబోతోంది?'

'వదిలిపెట్టుదురా అంతటితో. నా అదృష్టం వారితోబాటు నాది, నాతోబాటు మీది. ఇంత చక్కగావుంది అదృష్టం. పుట్టినమ్మకు పుట్టినదే పాడి. నేను పొందుతూవున్న భాగ్యం ఎక్కడ మిగిలిపోతుందోనని దాన్ని అనుభవించడానికి బిడ్డకూడా చేరే వచ్చివద్దాను?'

చెన్నబసవన్న భార్యమొగంపై మొగంపెట్టి 'కడుపుమంట అట్లా పెద్దగా మాటాడించింది. మీరేమీ అనుకోకండి. ఎన్నినెలలు?' అని అడిగాడు.

'ఏడునెలలు నిండాయి. నేను ఆక్కడపడ్డకష్టాలకు వాడుశరీరాన్ని ఏదిభేద్దామనుకొన్నా. విన్నకూడా, వచ్చిపోతేనే మంచిదనుకున్నా. మాకేమో నొసట చెర వ్రాసివుంది. నొసట చెరను వ్రాసుకొని వేరొకరుకూడా పుట్టారా? నిన్న ఈ ప్రొద్దుకి దైవం కన్ను తెలిచింది. శిశువు నొసటిపై చెర వ్రాయలేదు. దానిపై ఇల్లే వ్రాసివుంది. ఆ వ్రాతే నన్ను ఇక్కడికి పిలుచుకొనివచ్చింది. వ్రాత ఏమైనా కానీ, దూరమైన పెనిమిటిని తిరిగి చూడగలిగాను. తెలిచినకన్ను తెలిచేవుంచి దైవం మీ వంశాన్ని మిమ్మల్ని చల్లగా కాపాడాలి.'

దంపతులమధ్య నమ్మకాని కేమీ లోపంలేదు. అల్లాగే ఇద్దరికీ రాజుమీద పూర్ణానుగ్రహమే: అయితే అల్లుడెవచ్చిన చెన్నబసవన్న కోపంతీరు వేరు: వంశంలోని ఆడుకూతురైన దేవమ్మాజి కోపంతీరు వేరు.

దంపతులు ఇదేవిధంగా కొంత పొద్దు పరస్పరం మాటాడుకొన్నారు. దేవమ్మాజి తాను బైటికి రావడానికి కారణం ఏమిటో పెనిమిటికి తెలియజెప్పింది. దాన్ని తెలియజెప్పడంలో, అవతన్న తప్పు, తొడమీద కూర్చోబెట్టుకోడం, తన గుండెమీద చేయివైచి పిసకడం, ఇట్లాంటివన్నీ చెప్పలేదు. ఎందుకు ఇట్లా జరిగిందో వివరించలేదు. ఇటువంటి అనిష్టకరమైన మాటలు జ్ఞాపకం చేసుకోవడం ఆవిడకి ఇష్టముండదు. జ్ఞాపకానికివచ్చినా దాన్ని మగవానికి చెప్పడం అపాయమని అంతరాంతరాల్లో ఆవిడ ప్రాణానికి తెలుసును. బలాత్కారంగా ఇంతలుచేసిన దుష్టులు మరేమైనా చేశాడా అని అడగడం మగవానిస్వభావం. మొత్తంమీద ఆమెచెప్పిన మాటలపట్టి కోడలు గౌరమ్మ చాల ముద్దయినపిల్ల అనీ, పదివే గౌరమ్మ అభిమానం, దాక్షిణ్యంగల స్త్రీ అని తెలియవచ్చింది. 'తల్లీ కూతుళ్ళు కలిసి నన్ను రక్షించారు' అని దేవమ్మాజి వాళ్ళిద్దరినీ వేనోళ్ళ పొగడింది.

ఇంతలోకి పరిచారకులువచ్చి భోజనం తయ్యారైంది అని చెప్పారు. వాళ్ళిరువురూ లేచి భోజనానికి వెళ్ళారు.

మరునటిదినం సూర్యోదయానికి కొంచెం ముందుగా దేవమ్మాజి ఒక మగపిల్లవానిని ప్రసవించింది.

# 76

బిడ్డ పుట్టినసంగతి మడకేరి రాజభవనానికి తెలియజేశారు. అప్పంగోళ రాజగృహంలోని అందరికీ చాలా సంతోషమైంది.

రాజభవనంలో నిర్బంధంగా వున్నరోజుల్లో చెరసాలలో గర్భం ధరించడం, గర్భధారణ చేసినన్నాళ్లూ, తల్లి ఆ సంతోషంతో ఉప్పొంగిపోతూవుండడం కారణంగా, తొమ్మిది నెలలు నిండకముందే ప్రసవించింది. దాంతో బిడ్డ మామూలుకంటె చిన్నగా వున్నాడు. అయినప్పటికీ లక్షణవంతంగా వుంది. చివరి రెండురోజుల క్షోభనూ, సహించకుండా ప్రసవం కొంచెం ముందుగా జరిగివుండాల్సింది. చెరలోని తల్లిని బైటకుతెచ్చి తన రాజభవనంలో పుట్టిన ఈబిడ్డ అదృష్టవంతుడని ప్రసవవేళలో దగ్గిరనున్న మంత్రసాని అంది. ఈమాట విన్న వాళ్లందరూ నిజమే నిజమేనన్నారు.

మడకేరి రాజభవనంనుంచి పిల్లవానికి, తల్లికి, ప్రసాధనసామగ్రి, మంగళవస్తువులు కానుకగా వచ్చాయి. రాణి ఆడుబిడ్డకు తన సంతోషం తెలియజేసి 'మీరు వత్యం పొసం

సరిగాచేసి, త్వరగా ఆరోగ్యం సంపాదించాలి' అని మరిమరీ చెప్పింది. రాజకుమారి 'నేను పాపను చూడాలి. బేసిదినాల్లో చూడవలెనని ఈరోజు రానడంలేదు. వేగంగా వస్తాను' అని చెప్పివంపించింది.

రాజునుంచి ఏమాటా రాలేదు. సిఖానికి అయన అన్నమాట మరోచెవిని పడవలసినవి కావు. వార్త మొదట రాణివాసానికి చేరింది. అది మోసుకొని రాజకుమారి తండ్రికి చెప్పింది. తండ్రి 'పుండాకోరు! మొదటే పట్టపగ్గాలులేకుండా వుంది. పిల్లడు పుట్టినమీదట ఇంకా కొవ్విపోతుందేమో' అన్నాడు. బసవన్ననుపిలిచి 'ఓరీ! కుంటీ! ఆ భడవ, బెంగుళూరికి నెలకో ఫిర్యాదు వంపిస్తూవచ్చాడు. ఇహమీదట వారానికోటి వంపుతాడనిపిస్తోంది. ఏం ఆట ఆడుతాడో కాస్త కనిపెట్టివుండు ముండమోపీ!' అని హెచ్చరించాడు. బసవన్న 'చిత్తం! దేవరవారి ఆజ్ఞ' అన్నాడు.

బిడ్డపుట్టినవేళ సరిగా తెలిసికొని, రాణి దీక్షితులను స్వాగతించి పళ్లెంలో మంగళ ద్రవ్యాలుంచి సమర్పిస్తూ 'జాతకంచూసి చెప్పాలి' అంది. దీక్షితులు 'చూసిచెప్తాను అమ్మాజీ! దానికేం అభ్యంతరం లేదు. కానైతే, జాతకంచూసేముందే నేనో విన్నవం చేసికోవాల్సి వుంది. జాతకం చూసింతర్వాత చెప్తే అందులో కనిపించినసంగతి అని మీరు శంకించవచ్చు. ఆ శంక కలగగూడదని, ఇప్పుడే విన్నవించుకుంటున్నాను.'

'అవశ్యం చెప్పండి అయ్యగారూ![1] ఇప్పుడు చెప్పినా, తర్వాతచెప్పినా మీరు భగవంతుడు. మీకు తోపజేసినసత్యాన్ని చెప్తారని మేము ఎరుగుదుము. మీరు భయస్థులు అనే సందేహము మాకు ఎప్పుడూ లేదు.'

'వెనుక చూసినమాటనే తిరిగి చెప్తున్నాను. దుష్టయోగము ఉన్నదాన్ని నివేదించాను. అది మనం అనుకోకుండా కొంతవరకు నిజమైంది. అల్లుడుగారు అక్కడవుంటూ ఈమె గర్భిణిఅవడం సందర్భపడదు అని మనం అనుకున్నాం. మన మూహింపనిరీతిగా దైవం వాళ్ళను కలిపాడు. గర్భం ఏర్పడింది. యోగం సూచించే ఇహమీదిటి అనిష్టములు నివారింపదగినవైతే ఈశ్వరకృపచేత తొలగిపోయే విశ్వప్రయత్నం చేయాలి మనం.

'సరే అయ్యవారూ! ఏం చేద్దామంటారు?'

'ఈ సంవత్సరం గడిచిపోతే ఆపైన భయంలేదు. తమరు వీలైనంతత్వరలో అల్లుడు గారిని కుటుంబసహితంగా ఎక్కడికైనా క్షేత్రస్థలంలో నివాసార్థం యాత్రమీద వంపించడం క్షేమం.'

---

1. దక్షిణజిల్లాల్లో బ్రాహ్మణులను 'అయ్యగారు' అనడం వాడుక. ఉత్తరజిల్లాల్లో పంతులుగారు అన్నట్లు.

పసిబిడ్డను రాజుగారి అందుబాటులో లేకుండాచేయడం దీక్షితుని ఉద్దేశం. రాణికి ఈ సంగతి బోధపడింది. ఆమె 'మంచిది అయ్యవారూ! పుట్టినసంవత్సరం బిడ్డను దివ్య క్షేత్రంలో వుంచినట్టూ అవుతుంది. నెల గడవనియ్యండి, ఏర్పాటుచేద్దాం' అంది.

జాతకాన్నిచూసి దీక్షితులు మరుసటిదినం వచ్చాడు. 'జాతకాన్ని చూశాను అమ్మాజీ! దీన్ని ఇంత వేగంగా చూడకూడదనిపిస్తోంది. నిజానికి ఈ జాతకం వ్రాయడమనేది చాల ప్రయాసతో కూడినపని. జలోదయం, శీర్షోదయం అయినసమయంలో ఏ గ్రహం, ఏ నక్షత్రం, ఎక్కడున్నాయి, ఎట్లావున్నాయి అని తెలుసుకున్న మీదటకూడా జ్యోతిష్యనిలెక్క కొంచెం హెచ్చుతగ్గులవుతూ వుంటుంది. ఉన్నఫలితమొకటి, చెప్పేఫలమొకటి. అటువంటప్పుడు అప్పంగొళలో ప్రసవమైనసమయాన్ని ఇక్కడ మనకు చెప్పితే దాన్నిబట్టి జాతకుని అదృష్టాన్ని మనం గుణించడం అవివేకమైన పని. కొంచెం పెరిగినవాళ్ల జాతకమైతే జీవితంలో వాళ్లకు వాస్తవంగా సంభవించిన కష్టసుఖాలు లెక్కకు తీసుకొని, ఈ గడియలలోపుట్టితే ఇది కావడానికి వీల్లేదు, ఫలానాగడియలలోపుట్టితే ఇంతకంటె భిన్నంగా జరగడానికి వీల్లేదు, ఇదంతా ఇట్లా జరిగిందంటే ఫలానాసమయంలో జాతకుడు పుట్టివుండాలి, ఈవిధంగా ఈ గడియలలో పుట్టినవానికి ఈ సంకటాలు వస్తాయి, ఈ అదృష్టం కలిసివస్తుంది, అని దైవజ్ఞుడు గుణించిచెప్పడానికి వీలౌతుంది. పుట్టిన రెండురోజుల్లో ఈవిధంగా గుణించి చెప్పడానికి వీలైనసంఘటనలు ఏమీ జరుగవు. కొంచెం ఓపికపట్టడం మంచిది. కొన్నాళ్లయిం తర్వాత చూడవచ్చు.'

దీక్షితులిచ్చిన దీర్ఘోపన్యాసం విని రాణి, జాతకం ఏదో అనర్థకాన్ని సూచిస్తూవుండవచ్చు, దాన్నిచెప్పడం దీక్షితులకు ఇష్టంలేదు అని అర్థం చేసికొన్నది.

'అట్లా అయితే ప్రస్తుతం జాతకం వ్రాయించవద్దంటారా? అయ్యవారూ!' అని అడిగింది.

'అవును అమ్మాజీ.'

'సరే, వద్దు విడిచెయ్యండి.'

'అమ్మాజీ! జాతకం వ్రాసేదాకా కూచోకుండా, ఈలోగానే విన్న నేను విన్నవించు కొన్నట్లు, తండ్రి, తల్లి, బిడ్డ ముగ్గురినీ ఏదో పుణ్యక్షేత్రానికి పంపించడం మంచిది.'

'అల్లాగే చేద్దాం, అయ్యవారూ!'

రాణి సందేహం నిజమైందే. ఎంత స్థూలంగాచూసినా దీక్షితులకు ఈబిడ్డ ఆయుర్భాగ్యం చాలా తక్కువ అనిపించింది. కంసయోగం మామదగ్గిర అల్పాయుష్కుడైన అల్లుడు. దీక్షితునికి ఈ సాన్నిధ్యము అపాయకరమైంది అని తోచింది. గ్రహాలు సూచించే అమంగళాన్ని నివారించడానికి యత్నంచేయడం అవశ్యకర్తవ్యమని దీక్షితుని విశ్వాసం. అతడు తనకు తెలిసినదాన్ని రాణికి విన్నవించాడు.

బిడ్డ జాతకం చూపించాలి అని తల్లికుండటంలో ఆశ్చర్యంలేదు. ఆమె చెన్నబసవన్నతో 'పదివేగారు బాపనయ్యగారికి కబురుచేసివుంటారు. జాతకంలో ఏమి గోచరించింది, చెప్పించి తెలుసుకోండి' అంది.

చెన్నబసవన్న 'మీ బాపనయ్యవారు వొర్తి జారుడుబండ. 'మునిగిపోయాం, కొంప మునిగిపోతోంది' అని చెప్పడం నేర్చుకున్నాడు. 'బాగుంది' అని చెప్పడం అతనిమొహాన వ్రాసిలేదు. నేను జాతకాన్ని వేరే ఎవరికన్నా చూపిస్తానులే' అన్నాడు

'ఎవరున్నారు?'

'పిలిపిస్తాను-చూడండి.'

చెన్నబసవన్న వేరేవారు అని చెప్పడం భగవతిని మనస్సులో పెట్టుకొని. ఆయన ఆరోజే ఆమెవద్దకు ఒక సేవకునిపంపి, ఆమెవచ్చి బిడ్డకు, తల్లికి రక్షరేకులు కట్టాలని, బిడ్డ జాతకం గుణించాలి అనీ, వానికి కబురు పెట్టాడు.

# 77

నౌకరు భగవతి ఆశ్రమం చేరేటప్పటికి ఆమె మడకేరికి వచ్చివుంది ఓంకారేశ్వరుని ఆలయంలో దీక్షితునితోడ మాటలాడుతూవుంది. తండ్రి కూతుళ్లు మాటాడుకొన్నదికూడా బిడ్డ జాతకం గురించే.

'మామజాతకం, అల్లుడి జాతకం ఒకదానికి ఒకటి పొత్తుపడివున్నాయి. మీదిపన్ను, కిందిపన్ను ఇంత చక్కగా కలవవు. ఈ మామ చంపాలి. ఆ బిడ్డ చావాలి.'

'సరే పాప! నీ కెందుకీ గొడవ?'

'ఈ మాట నా కక్కరలేదు పో. ఇదే నిజంఅయితే ఈరాజు రాజ్యభ్రష్టుడు కావడం నిజం. నా బిడ్డ రాజయ్యేది నిజం.'

'రాజు చెడిపోవాలి అని నువ్వు అనుకొనివుండొచ్చు పాపా. రాజభవనం తిండి తిన్న వాడిని నేను ఈ విషమపరిస్థితిని తప్పించు అని ఈశ్వరుని వేడవలసివుంది.'

'నాబిడ్డ రాజు కాగూడదు అనాలి.'

'విధిలేక రాజుకు రాజ్యం తప్పిపోయేపక్షంలో మరొకరు రాజు కావాలసివుంది. నీ బిడ్డ అని ఒకడుండి అతడు రాజైతే నేను ఎందుకు వద్దనాలి? అదృష్టం సరిగా లేక కష్టపడిన కూతురు ఇన్నాళ్లతరువాతనైనా ఓ సుఖమంటూ కళ్లచూస్తే నేనుమాత్రం సంతోషించనూ!'

'ఆ సుఖం ప్రాప్తించడంలో సందేహముందా అన్నా!'

'వాక్యంలో సందేహంలేదు, పాపా! దానికి పదిముఖాల అర్థముంటుంది. ఎప్పటికి ఏ అర్థం, అనేది తెలుసుకోవడం గణకుడి పని. తనజాతకం తాను చూసుకొంటే, మమకారం అనేది అర్థాన్ని మరుగుపడచేస్తుంది. వ్యామోహం తన కనుకూలమేకావాలని ప్రేరేపిస్తుంది. ఇందుకనే దైవజ్ఞులు తమకు సంబంధించినవాళ్ళ జాతకాలను చూడకూడదని నియమం చేశారు.'

వీళ్ళిద్దరూ ఈప్రకారం సంభాషించేవేళ, చెన్నబసవన్న నౌకరు భగవతిని వెదకుకొంటూ దేవాలయానికి వచ్చాడు. ఆతడు చెప్పంపించినమాటను ఆమెకు అందించాడు.

ఆతడు ఎక్కడినుంచి వచ్చాడో తెలుసుకొని దీక్షితులు 'నువ్వు వీరితో చాల సన్నిహితంగా వుంటున్నావా పాపా?' అని అడిగాడు.

'అవును. ఎందుకు అన్నయ్యా!'

'చూడు తల్లీ! వీరికీ మన రాజుగారికీ షష్ఠాష్టకం! నువ్వు వీరితో చేరి, రాజుగారికి ఏదో ఎంగా వీరిని పురిగొల్పి, ఏ గణితంమాట నిజమయ్యేటట్లు చూడాలని! జాగ్రత్త!'

'అంతేనంటారా అన్నయ్యా!'

'అంతకంటె మించిన చెట్టేదు పాపా! వారికి కాదు. నీ బిడ్డ అనేవానికే. ఈ కోరికతో నువ్వు చేసే కీడు ఒకటికి రెండింతలై నీకే ఎదురుకొట్టవచ్చు తల్లి. జాగ్రత్తకలిగి ఉండు'

భగవతి మొహం చిన్నబోయింది. ఆమె 'సరే! నేను వెళ్లిరానా?' అంది.

దీక్షితులు: 'వెళ్ళిరా! పాపా!' అన్నాడు. ఆమె నాలుగుఅడుగులు పోయినవెమ్మట 'ప్రసవించినవారికి, పుట్టిన శిశువులకు దైవజ్ఞులు ఏమి చెప్పవచ్చు, ఏమి చెప్పకూడదు అనే విషయం నీకు తెలుసునుగా' అన్నాడు.

'జ్ఞాపకం వుంది అన్నయ్యా!' అని అంటూ భగవతి బైటకు వచ్చేసింది. తండ్రి, తల్లి, శిశువు అందరు పుణ్యక్షేత్రానికి వెళ్లి ఒక్కసంవత్సరంపాటు వుండాలి అని దీక్షితులు రాజభవనంలో చెప్పినమాటను ఈమెకూ శ్రుతపరిచాడు. ఈమె చెన్నబసవన్నకు మరేమీ చెప్పకుండా ఇంతమాత్రం చెప్పి వూరుకొంది.

## 78

ఇంగ్లీషువారిని నవరాత్రములకు రండి అని ఆహ్వానించడానికి నిశ్చయించి ఉత్తరం పంపించారు. నవరాత్రముల ఉత్సవాలకి, ఆంగ్లేయుల ఆతిథ్యానికి చేయవలసిన ఏర్పాట్ల సందర్భంలో బోప్పణ్ణకూ, రాజుకూమధ్య ఏర్పడ్డ అభిప్రాయభేదం ఒక అనర్థకరమైన

రూపాన్ని స్పష్టంగా తాల్చింది. నవరాత్రి కాగానే రాజభవనంలో ఆయుధపర్వం జరగడం అలవాటు. ఆటగాంగ్రకార్యక్రమంలో కొడగుల నాట్యపరంపర ఒక ముఖ్యభాగం. బైటి జనంవచ్చి చూస్తారనేకారణంగా ఈ భాగాన్ని వాడుకకంటె కొంచెం హెచ్చుగా చెయ్యాలి అని వీరరాజు అపేక్ష. కొడగుల పెద్దఅయిన కారణంచేత ఈవిషయం నిర్ణయించే పెత్తనం బోపణ్ణగారిది.

ఈసారి బసవయ్య బోపణ్ణ యింటికివెళ్ళి ఈవిషయం ప్రస్తావించినప్పుడు బోపణ్ణ 'మాకు ఈసారి ఉత్సవానికి రావడానికి సందర్భంగా లేదు. ఈ ఏర్పాటు మరెవరిచేతనైనా చేయించుకోండి' అని చెప్పాడు.

బోపణ్ణ ఉత్సవానికి రాకుండావుంటే ఆయనకు రాజుకు ఏదో భేదమనే సంగతి ఊరంతా వెల్లడవుతుంది. బైటినుంచి వచ్చినజనానికి అచ్చుకొట్టినట్లుగా ఈవిషయం తెలిసిపోతుంది. ఆ యీ కారణాలచేత బసవన్న చాల భయపడ్డాడు. దానికితోడు, బోపణ్ణ ఈ ఏర్పాట్లు చేయకపోతే వేరెవరు సమర్థులు? అనే చింత ఉండనే వుంది.

బోపణ్ణ వాళ్లవర్గంలో చాల పలుకుబడిగలవాడు. అతనికి గల యోగ్యత మరొకడికి లేదు. కొంచెం ఇంతకంటె తక్కువవాడైతేనేం వేరే ఎవరినన్నా ఈపనికి పెడదామంటే ఆ పెద్దమనిషి 'బోపణ్ణ ఎందుకని ఈపని చేయలేదు?' అని అడుగుతాడు.

కారణంతెలిస్తే 'అతడు విసుగుపడి వదిలేసినపని నేనుచేసి, ఆయనస్నేహాన్ని ఎందుకు పోగొట్టుకోవడం? ఆయన పగ ఎందుకు సంపాదించుకోవడం?' అని ప్రశ్నిస్తాడు. దీనికి విరుగుడేమిటి? బసవన్న సంగతిని మొదటినుంచీ చివరిదాకా ఉన్నదున్నట్లు రాణికి చెప్పాడు. ఆమెకు రాజ్యసింహాసనంలోని ఒ కాలే విరిగిపోయినంత భయం వేసింది. బోపణ్ణ ఇంత స్పష్టంగా తన విరోధాన్ని ప్రకటించింతర్వాత, ఆయన దొరకు ప్రతికక్షిగా యుద్ధ రంగంలో నిలబడ్డట్టే. ఆమె ఈ విషమపరిస్థితిని ఎట్లయినా సరిదిద్దవలెననీ ఆలోచించింది. 'మంత్రి అయ్యవారికి చెప్పు. బోపణ్ణతో మాటలాడి ఆయనను సమాధానపడేటట్లు చేయమను' అంది.

బసవన్నపోయి లక్ష్మీనారాయణయ్యకు రాణిమాటను చెప్పినతర్వాత బోపణ్ణ కోపం ఇంతదూరం పెరిగిపోయిందా అని ఆయనకూ ఆశ్చర్యం వేసింది. ఇంతకుపూర్వం బోపణ్ణ ఆడినమాటలో అతనికి రాజునుగురించి మంచి అభిప్రాయంలేదని లక్ష్మీనారాయణయ్య కని పెట్టాడు. కాని మంత్రి అయినవాడు దేశానికి సంబంధించినపనిలో జోక్యం కలిగించుకో కుండా అలిగి కూచోడం ఏం బావుంటుంది? బోపణ్ణ ఇటువంటి నిందనీయమైన ఆలోచన చేస్తాడని లక్ష్మీనారాయణయ్య కలలోనైనా ఊహించలేదు. ఆయన బసవన్నకు ఏమీ చెప్ప లేదు. 'బోపణ్ణగారినిచూచి మాట్లాడుతానని రాణిగారికి విన్నవించు' అని చెప్పాడు. అదే రోజు బోపణ్ణను కలిసాడు.

బోపణ్ణ: 'చూడండి అయ్యవారూ! మీ రాజుగారు నా వంశాన్ని భ్రష్టుచేసుకోమని అంటారు. అట్లా అనిపించుకొని, నేను తిరిగి వాళ్ల ఇంటికి ఏ మొహంతో పోను? ఆయన నన్ను చూసి తిరిగి ఆమాట అంటే నేను విని మెదలకుండా వుండేదా? ఇంతోటి అభాండం అమ్మణిగారిపేరు, నాపేరు కలిపి జనం చెప్పుకొంటూవుండటం న్యాయమా? నేను మళ్ళీ రాజభవనంలో అడుగుపెట్టాలనివుంటే రెండుసంగతులు నెరవేరాలి. మొట్టమొదట ఆవిధంగా తూలనాడింది తప్పు అని రాజు ఒప్పుకోవాలి. ఇహముందు అటువంటిమాటలు పలకనని హామీ ఇవ్వడం రెండవది.'

ఎంత చర్చించినా బోపణ్ణ ఆమాటే మళ్ళీమళ్ళీ నొక్కిచెప్పాడు. 'ఆ పొద్దు మొహం మీద ఉమ్మేసిపంపిస్తే సిగ్గులేకుండా తిరిగివచ్చావా అని అడిగితే ఆయనకు ఏమి సమాధానం ఇవ్వాలి?' అని అడిగాడు.

'అది ఒక విషగడియ. కోపంతో బుద్ధి స్వాధీనం తప్పినక్షణాల్లో ఆయన నోటివెంబడి ఆమాట వచ్చింది. అట్లాకానిచో సీతాదేవినిబోలిన పతివ్రతను రాజు ఆవిధంగా అంటారా? అది ఆయన అన్నమాటగాదు. ఆ విషగడియప్రభావం, అంతే' అని లక్ష్మీనారాయణయ్య జవాబు చెప్పాడు.

బోపణ్ణ: 'మీరు పెద్దవాళ్లు అయ్యవారూ! నాకూ మీ మాటనుమీరి నడచుకోవడం ఇష్టం కాదు. నేను కోపగించుకుంటున్నానని మీ రనుకోవద్దు. సంకోచిస్తున్నాను, లోలోపల సిగ్గుపడిపోతున్నాను అని భావించండి. రాజుగారితో ఈవిషయం చెప్పండి. ఆయన ఆపొద్దు మాటాడింది నా విషయంకాదు అని అంటేచాలు. తప్పైంది అని అనక్కర్లేదు. ఇహమీదట చెయ్యనని ఒప్పందమూ అక్కర్లేదు.'

'ఇదైనా పర్యవసానం అంతేగదా! ప్రభువైనవారినుంచి ఆపాటిమాట అనిపించడం తగదనిపిస్తోంది బోపణ్ణా!'

'నాకు అదీ తెలుసు. కాని ఆయన ఈమాత్రమైనా అనకపోతే, అక్కడికి రావాలంటే నాకు బెరుకుగా వుంది. మీ ఎదుట మాటలాడిన తుంటమాటలు, ఇంకా నలుగురెదుట మాటలాడితే ఆయనకథ, నాకథ ఎంత క్రిందికి దిగజారిపోతుందో!'

ఇంక మాటాడి ప్రయోజనంలేదు అని తెలుసుకొని నడచినవృత్తాంతం లక్ష్మీనారాయణయ్య రాణికి తెలిపాడు. రాణి: 'రాజుగారాడినమాట బోపణ్ణగారికి చాలా కటువుగా వుండి వొంటొచ్చు. చేపట్టినభార్యను చెడ్డఘడియలో మాటాడింది, కావాలి అని మాటాడిందికాదు అని మేము మరిచిపోతాం. వేరేవారికి నిజానికి మనస్పంకటం హెచ్చు' అంది.

ఏమిటి చేయడం అని ఆలోచించి వాళ్ళిరువురు రాజుగారు బోపణ్ణను ఉత్సవకార్యక్రమం ఏర్పాటు చేయమని ఆజ్ఞాపిస్తే అది వెనకటిమాట మరచిపో అని ప్రకారాంతరంగా వేడినట్లే అని నిశ్చయానికి వచ్చారు. లక్ష్మీనారాయణయ్య రాజునుచూసి పరిస్థితిని వారికి ఉపాయంగా తెలియజేసి, ఆయనద్వారా బోపణ్ణకు ఆహ్వానం వెళ్ళేటట్లు చూడవలసిందిగా ఏర్పాటైంది.

# 79

లక్ష్మీనారాయణయ్య బసవన్నను పిలిచి 'ఉత్సవవిషయం రాజాగారినిచూసి మాటలాడవలసి వుంది. ఎప్పుడు రావచ్చునో అడిగిచెప్పు' అని చెప్పాడు. బసవన్న రాజా ఆజ్ఞనుపొంది లక్ష్మీ నారాయణయ్యకు తెలియజేసాడు.

లక్ష్మీనారాయణయ్య చాల నయముట్టిపడేమాటలతో బోపణ్ణ విచారసరణి రాజాకు వివ రించాడు. 'ప్రభువులు నూరుసార్లు ఆదరంతోకూడిన మాటచెప్పి ఒకసారి అనాదరమైన మాట మాటాడితే సేవకులు దాన్ని జ్ఞాపకం పెట్టుకొనేదిలేదు. స్వామి సేవకసంబంధమే ఇట్టిది. బోపణ్ణకు ఈవిషయం తెలుసు. కానైతే, ఆయనకు ఓ సందర్భంలో సంకోచం ఏర్పడింది. ప్రభువులు ఆరోజు అన్నమాటలు కుటుంబానికి సంబంధించినవి. అటువంటి ఆలోచన ఈషత్తు వున్నా రాజకుటుంబం మర్యాదకు, గౌరవప్రవృత్తికి చాల కళంకమైనవిషయం. మంత్రి మైనవాని శ్రేయస్సుకు వ్యాఘాతం చేకూర్చేది. అందుచేత ఆరోజు జరిగిన ఏ మాటా మన స్సులో పెట్టుకోవద్దని కబురుచేస్తే ఉత్సవం సాంగోపాంగంగా నడవడానికి వీలవుతుంది' అన్నాడు.

రాజా: 'ఏ చేటా వుండేపనికి ఈ సంవత్సరం వేరే చెప్పించగించ ఏముంది?' అన్నాడు

'తానుచేసింది ప్రభువులకు సమ్మతమో కాదో అని బోపణ్ణగారికి సంకోచం'

'బసవన్నపోయి ఆయనకు చెప్పలేదా?'

'బసవన్న వెళ్ళి చెప్పినతర్వాతనే బోపణ్ణ ఆ సంకోచాన్ని వెలిబుచ్చాడు. అందునే నేను ఆయనతో ఈమాటచెప్పి సన్నిధానంలో విన్నవించడానికై ఇటు వచ్చాను'

'ఓహో! మేము తప్పు మాట్లాడాము అని ఒప్పించాలి అని బోపణ్ణగారి పట్టువలనలె ఉంది. అది నెరవేరడానికి మీ రాయబారం ఒక నెపమనుకుంటాను.'

'ఈవిషయంలో నేను బోపణ్ణగారితో కలిసి ప్రవర్తిస్తున్నమాట నిజం. కాని మూలతః ప్రభువుల శ్రేయస్సంపాదనకై సేవకుడనుగా వర్తిస్తాను. నేను మాటాడినతీరు ప్రభువులకు కొన్నివేళలలో వేష్ట కలిగించవచ్చు. అది నాకు తెలుసు. కాని పెద్దలతో మాట్లాడేటప్పుడు ప్రియమైనమాటను నేరుగా చెప్పాలి, అప్రియమైనమాటలను నేరుగా చెప్పకూడదు అని మా గురువులు మాకు సారం చెప్పారు. ఇది సార్వకాలికమైన సత్యం అని నిష్కర్షగా చెప్పారు. నేను వారిపద్ధతిని అవలంబించి నడుస్తున్నాను. దీనివల్ల వచ్చె వేష్టను తట్టుకొని, నా ఆశయం మంచిది అనేదాన్ని చిత్తానికి తెచ్చుకొని రాజకార్యం నిర్వహించడం ప్రభువుల పని.'

విమ్మట రాజా 'సరే. నారిసే రమ్మనమని చెప్పు. చెప్పవలచింది ఎదురుగానేచెప్పి విని పిద్దాం' అన్నాడు.

# 80

లక్ష్మీనారాయణయ్య వరండాలోకిపోయి 'రాజుగారు కబురుపెట్టారు. వచ్చి మాటలాడిపొండి' అని బోపణ్ణగారికి కబురుచేశారు. కొద్దిసేపట్లో బోపణ్ణ అరకొరమనస్సుతో వచ్చాడు. ఇరువురూ రాజుగదిలోకిపోయి ఆయినకు నమస్కారంచేసి కూచున్నారు. వీరరాజు 'మేము అన్న మాట తప్పైందని ఒప్పుకోవాలి అని మీరు మాకు అయ్యవారిద్వారా చెప్పిపంపించారా?' అని బోపణ్ణను అడిగాడు. ఆయనమీద మిక్కిలి అసహ్యమైన చూపులు సారించాడు.

లక్ష్మీనారాయణయ్య ఇది కనిపెట్టలేదు. బోపణ్ణకు కోపం వచ్చింది. రాజుమీద అంతగా రాలేదు. తనతోటి మంత్రిమీద. తన ఉద్దేశాన్ని లక్ష్మీనారాయణయ్య రాజుగారికి ఈవిధంగా స్పష్టంగా పచ్చిపచ్చిగా చెప్పివేయవచ్చా? రాజు మాటాడింది కాలుదువ్వి కలహానికి పిలవడం.

ఇంతకుముందైతే బోపణ్ణ జగడానికి ఎదురు నిలబడేవాడే. ఇప్పుడు ఆయన జగడంలో కాలహరణం చేయడానికి సిద్ధంగా రాలేదు. ఆయనమనస్సుకు తనమధ్య రాజుమధ్య ఇంకా చర్చ సాగించవలసిన అవసరం కనబడలేదు. ఆయన లక్ష్మీనారాయణయ్యవైపుచూచి 'ఈవిధంగా మీరు చెప్పవచ్చునా? అయ్యవారూ?' అని అడిగాడు. లక్ష్మీనారాయణయ్య దొరకుగూడ చక్కగా తెలియాలి అనే ఉద్దేశంతో, అయితే బోపణ్ణకుమాత్రం చెప్తున్నట్లు 'ఆరోజు రాజుగారు అన్నమాటకు మీరు రాజభవనం రావడం వారికి ఇష్టంలేదని అర్థం చేసుకున్నారు. రావడానికి సంకోచిస్తున్నారు అని నేను రాజుగారిసన్నిధానంలో విన్నవించాను. రాజుగారు నామాటను ఈవిధంగా అర్థంచేసుకొని ఆజ్ఞాపిస్తున్నారు. ప్రభువులు క్షమాయాచన చేయవలెనని మీరు కోరినట్లు నేను చెప్పివుండలేదు' అన్నాడు.

బోపణ్ణ: 'దాన్ని తిరిగి వారికి విన్నవించండి. నేను మాటలాడడం సుఖమైనవిషయం కాదు. అదను తప్పింది.'

లక్ష్మీనారాయణయ్య రాజుతో 'బోపణ్ణగారు ప్రభువులనుండి క్షమాయాచనను ప్రతీక్షించడంలేదు. సేవకుడైనవాడు ప్రభువులనుండి ఇంతటిమాట పలికించవలెనని, ఎన్నటికీ ప్రయత్నించడు. బోపణ్ణగారు రాజభవనానికి రావడం ప్రభువులకు ఇష్టం కాదేమోననితోచి, అటువంటప్పుడు వచ్చి దొరలకు అనవసరమైన చిత్తాయాసం కలిగించకూడదనే ఉద్దేశంతో దూరంగా వుండిపోయారు. ఆయన రాజభవనానికి రావడం మీకు అసమ్మతంకాదని నాకు తెలుసు. అది వారికి చెప్పాను. ప్రభువులు అమాటే కాస్త స్థిరపరిస్తే చాలు. వెనకటి మాటలను తడవవలసిన పనే లేదు' అన్నారు.

'మీతోటి మంత్రిమర్యాదను కాపాడేవారు మీ దొరమర్యాదను ఎందుకు కాపాడరు? ఆయన చేస్తున్నపనులన్నీ మేము చేయమని చెప్పితేనే చేస్తున్నారా? మిగతాపనులన్నీ ఎట్లా చేస్తున్నారో, ఇదీ అట్లాగే చెయ్యాలి. వేరే మొహాన బొట్టుపెట్టి మేం చెప్పడం ఎందుకు?'
బోపణ్ణ తిరిగి, లక్ష్మీనారాయణయ్యవైపు చూసి 'మిగతాపనికూడ విడిచిపెట్టమంటారా?' అని అడిగాడు.

లక్ష్మీనారాయణయ్య ఆయనకు 'కొంచెం ఓపిక పట్టండి' అనిచెప్పి రాజుగారితో 'నేను మొదటనే విన్నపం చేసుకున్నాను. మిగతాపనులు చేయడంలో రాజభవనానికి రావలసిన అవసరంలేదు. ఈ పండుగపనికి రావలసివుంటుంది. అందుచేత ప్రభువుల ఆజ్ఞ కావాలి' అని చెప్పాడు.

రాజు: 'మీ తెలివితేటలు మాకు తెలుస్తూనేవున్నాయి అయ్యవారూ! మీరు మావలే మాటాడుతున్నట్లు నటిస్తూ మీ సహమంత్రివలెనే మాట్లాడుతున్నారు. [1]గొడ్డలిపిడి, చెట్టుదే అన్నట్లు కనిపిస్తూ గొడ్డలికి సాయపడ్డట్లు అది వదిలిపెట్టండి. మీ ఇష్టంవచ్చినట్లు నడవండి. మంత్రులిద్దరూ మామీద దయవుంచి రాజభవనంలో అడుగుపెట్టి మీమీ పనులు ఏమున్నాయో వాటిని చక్కబెట్టి మమ్మల్ని కాపాడండి' అని వెటకారంగా అన్నాడు.

బోపణ్ణ చివ్రున లేచాడు. ఆయనమొహం కందగడ్డయిపోయింది. లక్ష్మీనారాయణయ్యవైపుతిరిగి 'ఇటువంటి కొక్కిరిమాటలకు ఇక్కడకువచ్చి ఏం లాభం? నేను ఇక్కడ వుంటే వ్యవహారం మరీ చెడిపోవచ్చు' అని రాజుకు నమస్కారం అదోరకంగాపెట్టి వెళ్ళిపోవడానికి చూశాడు. లక్ష్మీనారాయణయ్య లేచి ఆయన భుజంమీద చేయివేసి కూచోబెట్టి తానూ కూర్చొని రాజుగారితో 'తమ ఆజ్ఞాప్రకారం. కొంచెం వెషకలిగివుండొచ్చు. దాన్ని లెక్కచేయకండి. అని ఒక్కముక్క ఆజ్ఞాపిస్తే మామీద దయచూపినట్లౌతుంది' అన్నాడు.

రాజు: అయ్యవారు మీరు. 'ప్రాణం పోయినాసరే వ్యాఖ్యానం మానం' అంటారు. మంచిది. ఆజ్ఞాపించాం. దయచేసికూడా తీసుకొనివెళ్ళండి.'

ఆయన్ని ఇంకా ముందుకు గుంజడం అపశకునమనిపించింది. ఇంతేచాలు అని లక్ష్మీనారాయణయ్య 'ప్రభువుల ఆజ్ఞ' అంటూ, బోపణ్ణకు సైగచేసి లేచాడు. ఆతడూ లేచాడు. ఇద్దరూ రాజుగారికి నమస్కరించి బైటికి వచ్చేశారు

1. 'కొడలి కావు కులానికి మృత్యు' అని కన్నడసామెత. కొడలి = గొడ్డలి.

# 81

మహార్ణవమి ఆయుధపర్వానికి అంగ్లేయులు అతిథులుగా వచ్చేసందర్భాన్నిగురించి రాజా, రాణీ, ఇరువురూ సంప్రతించుకోకపోయినా, ఇద్దరి మనస్సుల్లో ఒక ఆశ మెదలుతూవుంది. ఊరిలో పెద్దతలకాయలు రాజుకు విరోధంగా వున్నాయి. మంత్రి బోపణ్ణ రాజాపై అపనమ్మకం పెట్టుకొన్నాడు. ఇంటి అల్లుడయిన చెన్నబసవన్న రాజుకు విరోధంగా, ఆయనమీద నేరాలు, ఫిర్యాదులు పంపించివున్నాడు. పండక్కంటూ ఈ తెల్లదొరలనురప్పించి చాల మర్యాదగా చూసి, మంచి మాటలాడి, ఆయన స్నేహాన్ని సంపాదించుకుంటే రాజభవనానికి ఒక చక్కనిస్నేహం లభించినట్లౌతుంది. చెన్నబసవన్న వ్రాసిన ఫిర్యాదుకాగితాలు చూసిన అధికారులకు ఆ మనిషి ఏమంత నమ్మతగనివాడు కాదనిపించేటట్లు చూడాలి. అన్నివిధాలా రాజా యొక్కపదవి భద్రంగావుండేలక్షణాలు కనబడుతున్నాయి.

రాజభవనం ఆడుపడుచుకు నిర్బంధంనుంచి వదిలించి ఆమె భర్తవద్దకు పంపించడం కూడా, ఈ సందర్భంలో మంచిపనే అయింది అని రాణీ అనుకొన్నది. రాజుకు చెల్లెలి విషయంలో నిజమైన పగ ఏమీలేదు. ఏదో మనస్తాపంతో ఆమెను ఇక్కడ కొంతకాలం నిలిపి వుంచవలసి వచ్చిందని సమాధానం చెప్పవచ్చు. పెనిమిటి ఆమెను సరిగా చూడకపోవడంతో ఆమెను రాజభవనంలో పుట్టింటనే వుంచవలసివచ్చింది అని ఎవరన్నా చెబితే బానన్నట్లే అనిపిస్తోంది. రాణీ అబద్ధాన్ని చెప్పడానికి ఒప్పదు. కాని రాజా చెబితే తాను కాదని అబద్ధమనీ చెప్పబోదు.

# 82

రాజుకీ, రాణీకీవున్న ఉద్దేశాలు ఇట్లావుంటే తెల్లవాళ్ళమనస్సులో పరుగులుతీస్తున్న కోరికలు వేరు. వాటిస్వరూపం ఇంతకుపూర్వం మదరాసు గవర్నరునుంచి బెంగుళూరిలోని రెసిడెంటు మహాశయునికి వచ్చినపత్రం రెసిడెంటు ఆ గవర్నరుకు జవాబుగా పంపించిన ఒక ఉత్తరం-వీటిద్వారా స్పష్టమవుతుంది. మదరాసుగవర్నరు వ్రాసిన ఉత్తరంలోని ముఖ్యాంశాలు:—

"మంగుళూరునుంచి కలెక్టరు పంపించిన ఒక రిపోర్టులో కొడగురాజుగారి మనుష్యులు మంగుళూరు దగ్గిరలోని ఓ గ్రామంనుంచి ఒక ఆడపిల్లను దొంగిలించికొనిపోయారని తెలు

స్తోంది. కొడగురాజు పెత్తండ్రి దొడ్డ వీరరాజు, తండ్రి లింగరాజు - వీళ్ళమార్గంలో పోవడం లేదని మనకు బాగా తెలిసినవిషయం. ఈవిషయం ఇంతకుముందే అనేకసందర్భాల్లో మనకు ఋజువైంది. కానైతే ఆయన లోగడ తన దౌర్జన్యాన్ని తన ఏలుబడిసీమలోనే ప్రకటిస్తూ వుండేవాడు. ఇప్పుడు దౌర్జన్యం పెచ్చుపెరిగి తన దేశపు పొలిమేరలుదాటి బైటికి పరవళ్ళు చిందుతోంది. అటువంటిపనిని మేం సహించమని ఆయనకు స్పష్టం చేయాలి. ఆయన జనం దొంగిలించిన ఆ పిల్లను వెదకించి, తిరిగి ఆమె గ్రామానికి పంపించినసంగతి రాజు మాకు తెలియజేయాలి. అల్లా చేయనిపక్షంలో, మా జనం వెదకడానికి వస్తారు. వాళ్ళకు రాజు అన్నివిధాలా సాయపడాలి. ఆమె దొరికితే ఆమెను వాళ్ళవెంబడి పంపించాలి. జరిగినతప్పుకు క్షమాపణ చెప్పుకోవాలి.

'ఇంతకుపూర్వమే తెలిసినసందర్భాలనుబట్టీ, ఈ సంఘటననుబట్టీ మాకు స్పష్టమయినది ఏమిటంటే - ఈ దేశంప్రజలు ఈ దేశాన్ని పరిపాలించుకోవడానికి తగరని అనేకసందర్భాల్లో వీళ్లు అనాగరికులుగా వన్యజీవులుగా తప్పుదారిలో నడుస్తూవుంటారు. మరి అనేకవిషయాల్లో, పసిపిల్లలకంటె కనాకష్టంగా ప్రవర్తిస్తారు. రాజైనవాడు తప్పిసడిస్తే అధికారులు అతన్ని అదుపులో పెట్టరు; అధికారులు తప్పినడిస్తే జనులు ఏమీ అనరు, ఎదిరించరు. ఇటువంటి పరిస్థితిలోవున్న జనం అభ్యుదయం సాధించడం సాధ్యం కాదు.

'ఈవిషయంగురించి ఆలోచించినకొద్దీ మాకో నిజం గోచరిస్తూవుంది. తెలివిలేని ఈ అమాయికప్రజను ఆంగ్లేయులు తమ రెక్కలక్రిందికి తీసుకొని రక్షించాలి. పెంచి దక్షులగా తయారించాలి అనేది దైవసంకల్పంగా తోస్తుంది. లోగడ నడచిన చరిత్రబట్టి చూసినా, ఈ నిజం దృఢపడుతుంది. భారతదేశంలోని ప్రజలు అన్నిదిక్కులలోనూ పక్ష ప్రతిపక్షములుగా ఏర్పడి పరస్పరం దెబ్బలాడుకొని ఒకదానివెనుక ఒకటిగా తమతమప్రాంతాల్ని మనచేతికప్పగించారు. మనం పరిపాలనా భారాన్ని వహించకపూర్వం ఏ ప్రాంతంలోనూ సుఖశాంతులు లేవు. మనం శాసనం వహించినతర్వాత జనం సుఖంగా బ్రతుకుతున్నారు. తెల్లదొరలే రాజ్యమేలాలని మనసా కోరుతున్నారు. ఉత్తర భారతదేశమంతా ఇందుకు సాక్షి. దక్షిణ భారతదేశంలో కర్ణాటకం, పశ్చిమ సముద్రతీరం, మైసూరు, ఆదేవిధంగా ఈ సత్యాన్ని నిరూపిస్తాయి. మొన్నమొన్నటి ఉదాహరణం మహారాష్ట్రం. మొత్తం భారతదేశం అంతా మనకు కైవసమై, నీతిబద్ధమైన పరిపాలనకు లోగి, సుఖశాంతులు అనుభవించి ప్రగతిపథాన్ని తెలుసుకోవాలనేది మా మనస్సుకు నిగ్గుగా తేలిన సిద్ధాంతం. 'మైసూరుప్రజలను అయోమయస్థితి నుంచి ముక్తుల్నిగావించి కాపాడినప్పటినుంచి, కుంపిణీ సర్కారు రెండు సంవత్సరాలక్రిందటనే, ఆ ప్రాంతాన్ని చక్కగా నడిపించేభారం తనమీద వేసికొన్నట్లు అయింది. కొడగు దొరలు తమ అధికారదౌష్ట్యాన్నివదిలి తిన్నగా రాజ్యంచేస్తే చాలా సంతోషమే. ఇందువిషయమై వారు మనకు సంతృప్తికరమైన హామీ ఇవ్వకుంటే, మైసూరు రాజులనువలెనే, వీరిని

కూడా కొంతకాలందాకైనా గద్దెనుండి తొలగించి కుంపిణీవారు వారితరఫున శాసనభారాన్ని వహించడం మేలనిపిస్తోంది.

'ఇది మా దృఢమైన నిశ్చయం. ఈరోజే మేము గవర్నర్ జనరలు మహాశయులకు ఒక నివేదిక వ్రాసియున్నాం. మీరూ ఈ విషయాన్ని మనస్సులో పెట్టుకొని ముందు కార్య క్రమం నిశ్చయించుకోవాల్సి వుంటుందని మా సూచన '

# 83

ఈ ఉత్తరానికి జవాబుగా మైసూరు రెసిడెంటు వ్రాసినజాబు సారాంశ మిట్లావున్నది. 'తమ ఉత్తరంలో తాము సూచించిన నిర్ణయ మేదైతే ఉన్నదో దానికే మేమూ వచ్చేమని తెలుసు కొని మాకు ఆశ్చర్యం వేసింది. ఈ దేశం ప్రజలనుగురించి తమరు వెల్లడించిన అభి ప్రాయము మాకు సంపూర్ణంగా సమ్మతమైందే. నిస్సహాయులూ, అజ్ఞానులూ ఐన ఈ జనాన్ని రక్షించేకర్తవ్యాన్ని దేవుడు మనకు అప్పజెప్పాడనే తమ నిర్ణయంకూడా మాకు సమ్మతమే. శాసనం పూసెజ్జ కాదు. అయినప్పటికీ కుంపిణీవారు వీలైనంతశీఘ్రంగా యావ ద్భారత పరిపాలనాభారాన్ని తమపై వహింపనిదే ఈ ప్రజలకు సుఖం లేదు.

'ఈమాట ఇతరప్రాంతాలకంటెనూ, ఎక్కువగా మరింత స్పష్టంగా, కొడగు రాజ్యానికి అన్వయిస్తుంది. రాజు సరిగా పరిపాలించడంలేదు. ప్రజలు అసంతుష్టులయి దోషారోపణచేసి, ఈ రాజును శిక్షించింది అని పదేపదే వినతిపత్రాలు పంపిస్తున్నారు. రాజభవనం అల్లుడు పంపించివున్న పత్రాలవిషయం మీకు తెలిసిందే. రాజు ఈయనభార్యను చెఱలో వుంచి వున్నాడు. అతడు అయోగ్యుడు. అతనిని సింహాసనంనుండి దింపి అతని చెల్లెలైన తన భార్యను గద్దెకెక్కించవలసిందని ఇతని వేడికోలు. ఇక్కడకు ఇటీవలనేవచ్చిన ఒక వృద్ధు, తాను రాజుకు పెత్తండ్రినని, రాజును ఏమైనా తొలగించేపక్షంలో తనకుమారుని రాజు చేయ వలసివుంటుందని ప్రార్థిస్తున్నాడు. ఈయనో, ఈయనవరంగా మరొకరో ఒకసూచన చేసి వున్నారు. రాజుకు ఓ అన్న వుండివున్నాడు. అతడే రాజు కావాలిసివుంది. ఇప్పటిరాజు రాజైంది తప్పు. ఈయన సరిగా రాజ్యం చేయడంలేదు. అందుచే ఈయనను రాజ్యాధికారం నుంచి తప్పించి ఇతని అన్నను రాజుగాచేయాలి అని ఆ సూచన. ఈ అన్న అనే ఆయన ఇంతకుముందు చెప్పబడిన ముసలివాని కొడుకో లేక వేరొకడో ప్రస్తుతానికి నిశ్చయించి చెప్పడం కష్టం. ఇంతకీ ఏ దృష్టితో చూచినప్పటికీ, ఈ రాజును గద్దెనుండి పంపడం

మంచిది అనే నిశ్చయానికి మనం రాకపోవటంలేదు. దీనితర్వాత పృచ్ఛప్రశ్న - ఈ 'వీరు రాజు కావాలి' అని చెప్పుకొనేవాళ్ళల్లో 'ఎవడైనా సింహాసనమెక్కడానికి అర్హుడేనా' అనేది. అయితే కొత్తగా గద్దెమీద కూచొనేవాడైనా మైసూరు సింహాసనంమీద కూచోబెట్టిన వ్యక్తికంటె బాగా నడచుకొంటాడని ప్రతీక్షించడానికి తగిన ఆధారాలు ఏమీ లేవు. ఆప్రకారం ఒకర్ని గద్దె ఎక్కించినా, దేశము తిరిగి ఇక్కట్లపాలవడంచూసి, మనం పశ్చాత్తాపపడి తిరిగి మనమే స్వాధీనం చేసుకోవలసిన పరిస్థితి ఏర్పడవచ్చునని తోస్తుంది.

'ఎట్లాగూ మనం ఈలోపల రాజుగారి అతిథులమై మడకేరికి వెళ్ళనున్నాముగా! అప్పుడు ఈ సంగతులనుగురించి రాజుకు హెచ్చరిక చేద్దాం. దేశకాలపరిస్థితులను సావధానంగా గమనించి దేశాన్ని కుంపిణీవారి శాసనంకింద తీసుకోవడంలోని సాధకబాధకాల్ని, బలాబలాల్ని తెలుసుకోవడానికి ప్రయత్నిస్తాం. ఆసమయంలో తాముకూడా ఒక్క రోజైనా అక్కడికి దయచేయడానికి వీలైతే స్థితిగతుల్ని మనసారా చర్చించుకోవడానికి అనుకూలంగా వుంటుంది.

'ఇక ఉత్తరంలో పేర్కొనినటువంటి, అయితే మా మనస్సుకు ముఖ్యమనీ తోచిన మరోసంగతి వుంది. తెల్లదొరలు భారతభూమికి రావడంమూలాన ఈ ప్రజలకు సువ్యవస్థితమైన రాష్ట్రజీవనం ఇవ్వడమేగాక, క్రీస్తుమహాశయుని సువార్తకూడ వీరికి తెలియజేసి, వీరిని అంధకారంనుంచి ఉద్ధరించడంకూడా దైవసంకల్పమేనని నాకు తోస్తుంది. మిగతాప్రాంతాలలో హిందూమతం చాలా అవివేకంతోకూడిన మతమని మనకందరికీ తెలుసు. అది కొడగులో మరింత బిరడుగట్టినరూపంతో అసంస్కృతమైవుందని ఎరిగినవారు చెప్పుతారు. పూజనీయులైన మేగ్‌లింగ్ అన్న మన మతప్రచారకు లొకరు చాలావరకు పరిశీలించి మాకీ విషయం చెప్పారు. క్రైస్తవసేవకులను కొడగులో కోతకువచ్చిన పంట ఎదురు చూస్తోందని వారి అభిప్రాయం. తగినప్రయత్నంచేస్తే కొద్దిఏండ్లలో మొత్తం కొడగురాజ్యాన్ని క్రైస్తవ ధర్మానికి ఆటపట్టుగా చేయవచ్చునని, రాజభవనంలోని వాళ్ళుకూడా తమవైపు మొగ్గివున్నారని మేగ్‌లింగ్‌గారు చెబుతున్నారు.

'ఈసారి కొడగుకు పోయినసందర్భంగా మేము ఇందులోని సాధ్యాసాధ్యాలను విచారింపగలం.'

# 84

పండుగ ఏర్పాటంతా ముందుకు సాగింది. బోపణ్ణ తాను చూడదగినపనులన్నీ తాను చూడ
నవి విడిచిపెట్టి ఊరుకోలేదు; కాని నిర్వహించడంలో పెద్దగా శ్రమకూడ పడలేదు. ఆయన అల్లుడు పడవాలు ఉత్తయ్య మడకేరియందు లేకపోవడం కొంత హడావుడికి కారణమైంది. రాజభవనం కావలాపనిని సరిగా చూడటంలేదనే కారణంచేత అతనిని పొలిమేరకావలికి పెట్టమని రాజాజ్ఞ కాగానే, అతన్ని హెగ్గళసీమకు పంపించడం జరిగింది. కొడగుల ఆటపాటల్లో ఉత్తయ్య చాల నిపుణుడూ, ఉత్సాహశాలి. అతడు ఉంచున్నచోట నూరుగురుజనంవచ్చి నిలబడతారు. అంతటిప్రభావం మరెవ్వరికీ లేదు.

ఇంటి అల్లుడు చెన్నబసవన్న ప్రస్తుతం రాజభవనంతో స్నేహంగా వుంటూవుండటం చేత అతనిని ఉత్సవంలో పాల్గొనవలసిందిగా ఆహ్వానించారు. ఆయన కొడగుల జానపద గీతాలను, నృత్యాలను నేర్చిన దిట్ట. ఉత్తయ్య చేయదగినపనుల్లో కొంతభాగం ఆయనకు అప్పగించారు.

బైటినుండివచ్చిన జనానికి కొడగుల సంప్రదాయము, చరిత్ర తెలియని అనే ఉద్దేశంతో వెనుక ఎవరో వ్రాసి పల్లెటూరిజనం అప్పుడప్పుడూ ప్రదర్శిస్తూ వచ్చినదృశ్యాల్ని ఈ ఉత్సవాల్లో అభినయించడానికి ఏర్పాట్లు జరిగాయి. ఆదేవిధంగా ఎవరైనా కవిత్వం ఇష్టమున్నవాళ్ళు కవిత్వం వినిపించవచ్చు. నాటకాలు అభినయించవచ్చు. వానికి తగినఏర్పాట్లు లక్ష్మీనారాయణయ్య తమ్ముడు మణేదారు సూరప్ప చూసేటట్లుగా నిర్ణయించారు.

అతిథులై వచ్చిన తెల్లవారికి వేటాడటం ప్రియకరమైనవిషయం అని తెలిసినవిషయమే. వారున్నవారంలో రెండు మూడురోజులు మృగయావినోదార్థం కేటాయించారు. రాజభవనం ఆయుధశాలనుంచి తగినవన్ని ఆయుధములూ, వలలూ, పలుపుత్రాళ్లూ తెచ్చివుంచారు. వేటకు వెళ్లే అరణ్యప్రాంతాలలోనున్న గ్రామాలకు వేటకు హాజావెళ్లడానికి జనాన్ని జత కూర్చవలసిందిగా ఆజ్ఞలు జారీ అయినాయి.

రాజుగారి అశ్వశాలలో [1]పోపి ఉంది. రాజభవనం శ్వానశాల వుండనేవుంది. మంత్రి అయినవిమ్మటకూడా బసవన్నే కుక్కల పెంపకం కనిపెట్టివుంటున్నాడు. అతిథుల ఆహార పదార్థాలనుగురించి కొంచెం చర్చ నడిచింది. తమ విజయానికి పునాదిరాళ్లు, గోమాంసం, ఉడుం మాంసం అని తెల్లవారివిశ్వాసం. అదే వాళ్ళ గర్వకారణం. త్రాగడానికి కొడగులో ఎట్టి నిషేధమూ లేదు. అది రాజవంశానికి సంబంధించిన ఆచారమేమీ కాదు. రాజా పెత్తండ్రి పూర్వాచారాన్నివదిలినవాడు కాదు. కానైతే ఆయన ఇతరులు మద్యం సేవించ

1. పోపి = పొట్టి గుర్రం.

దానికి ఎన్నడూ అడ్డు తగలలేదు. తెల్లవారు తమరిని చూడటానికి వచ్చినప్పుడల్లా వారికి మద్యపాత్రల నందింపజేసేవారు. ఈ రివాజుమూలంగానే చిక్క వీరరాజు బసవన్న సావాసంలో మద్యపానానికి అలవాటుపడ్డాడు. ఆయన నిల్వచేసివుంచుకొన్న మద్యభాండారం వచ్చిన అతిథులకందరికీ, ఒక్కవారమే గాదు, మూడునెలలవరకూగూడ మధుపాత్రల నందింపగలదు. మద్యవిషయకమైన చింతలేదు. ఇతరమాంసాలనుగురించిన చింతకూడ లేదు. కానైతే గోమాంసం ఇదెట్లా? కొడగురాజ్యంలో గోవధ జరుగకూడదు. ఇదివర కెప్పుడు జరిగింది లేదు.

వచ్చినవారికి ఇష్టమయినఆహారాన్ని అందించాలి. గోమాంసం కావాలి అంటే దానికి తగిన ఏర్పాట్లు చేయండి అని రాజునాజ్ఞ అని బసవన్న మంత్రులకు తెలియజేశాడు.

లక్ష్మీనారాయణయ్యకు ఇది సమ్మతం కాదు.

బోపణ్ణకూడ 'మా దేశమందు ఇది పద్ధతికాదు. ఇట్లా చేయకూడదు' అన్నాడు. రాణిని అడిగారు.

ఆమె 'ఆచారంలేనిదాన్ని చేయవద్దు' అంది. బసవన్న 'దేశంలోని ఆవుల్ని చంపవద్దు, సిరియాపట్టణంనుంచో పాణెనుంచో తెప్పిస్తేనేమి?' అన్నాడు. దేశంలో ధర్మం నిలబడ్డట్లూ వుంటుంది. అతిథులరుచికి అనుకూలంగా విందారగింపజేసినట్లూ వుంటుంది. నీ యిష్టమని ఈ పని బసవన్నకు అప్పగించారు.

తెల్లవారు ఆడవాళ్లు మగవాళ్లు జతగా వస్తారుగనుక వాళ్ళ వాడుకప్రకారం, వాళ్ళ వీలు ననుసరించి ఆ యా సమయాల్లో నృత్యాలు ఏర్పాటు చేయవలసిందని ఆజ్ఞ అయింది.

మధ్యలో మేగ్‌లింగ్ హార్కీ సూచించిన వేరొక కార్యక్రమాన్నికూడా జోడించారు. భారతదేశంలో ఉన్న మతాలు వాలినంత ఉన్నతస్థాయిలో లేవు, క్రైస్తవమతము ఈ అన్ని మతాలకంటె శ్రేష్ఠమని నేను వాదిస్తాను.

మీ మతపండితులలో ప్రముఖులైనవారు ఎవ్వరువచ్చినా సమ్మతమే: రాజుగారు తెల్లదొరలు, కొడగులోని పౌరప్రముఖులు చేరివున్నసభలో ఈవిషయం నిరూపింపబడి, సిద్ధాంతీకరింపబడితే, కొడగుజనం క్రైస్తవమతం స్వీకరించడానికి, క్రైస్తవమతప్రచారకులు తమ పెద్దల సువార్తను కొడగులో ప్రచారంచేయడానికి తోడ్పడినట్లౌతుంది అని ఆయన ప్రార్థించాడు. ఇది బోపణ్ణకుగాని లక్ష్మీనారాయణయ్యకుగాని సమ్మతమైన పనికాదు. కాని రాజు 'ఇదీ జరగనీ' అని ముదల ఇచ్చాడు. ఆయన ఈవిధంగా అనుమతించడానికి కారణాలు వేరు: దీనివల్ల మేగ్‌లింగ్ మహాశయుని మంచివానిగాచేసికొని తన శరీరానికి బలం చేకూర్చే మంచి మందును సంపాదించుకోవాలని ఆయన కోరిక. రెండవది, మతాలవిషయంలో తాను చాలా నిష్పక్షపాతిగా కానిపించి తెల్లదొరలను తనవైపు త్రిప్పుకోవాలనుకోడం మూడవది వేరే ఓ చిన్న కోరికకూడ ఆయనమనస్సులో దాగట్లాగుతూవుంది. 'ఈ గురుదీక్షితులు తనంత

వారు లేరని అహంభావం చూపిస్తూవుంటాడు. 'క్రిస్మస్ పండుగరోజు కాబట్టి, కాకపోతే బియ్యానికి చెరగుపట్టడం, పున్నమికి చేయిచాచడం ఇదే ఇతని ఉద్యోగం : ఇతరమతస్థులు తమ మతం కోసం ఎంతెంత కష్టపడతారో ఇతనికి తెలియదు. ఇతనికి తెలిసినసంగతులేమిటో ఓసారి నోరుతెరిచి అందరిముందరా చెప్పనీ' అని రాజుగారి ఆలోచన. ఇందుకు తగిన ఏర్పాటు జరిగింది. ఆ సంగతి ముందుగానే దీక్షితులకు తెలియజేసారు

# 85

పండుగరోజులు వచ్చాయి. అతిథులూ వచ్చారు. రాజభవనం ఆతిథ్యం ఏ కొరతాలేకుండా జరిగింది.

రెసిడెంటు, ఆయన స్నేహితులు మడికేరికి వచ్చినరోజు రాజుతరపున బసవయ్య ఊరి ద్వారంవద్దకువెళ్లి వారిని స్వాగతించారు. వారు రాజభవనందగ్గిరకు రాగానే బోపణ్ణ, లక్ష్మీనారాయణయ్య వాళ్లను ఆహ్వానించి రాజభవనంలోపలికి పిలుచుకొనివెళ్లారు. వీరరాజు తెల్లవారి కర్నలు ఉద్యోగి దుస్తులనుధరించి తన పెత్తండ్రి, దొడ్డ వీరరాజేంద్రులకు కుంపిణీ అధికారులు గౌరవసూచకంగా ఇచ్చివున్న కత్తిని నడుముకు ధరించి పెద్ద వజ్రంతో మెరిసి వడుతున్న తలపాగ తలమీద అలంకరించుకొని వాళ్లను తన ఆసనకక్ష్యకు స్వాగతించాడు.

కుశలసంప్రశ్నం పిమ్మట పెద్దరాజు వారికై కట్టించివుంచిన రెండంతస్తులమేడ విడిదిగా వాళ్లను తోడ్కొనిపోయారు.

బెంగుళూరినుంచి వాళ్ల వచ్చేసమయానికి మంగుళూరు కలెక్టరు వచ్చిచేరాడు. వీరరాజు ఆజ్ఞాప్రకారం బసవన్న ఆ మధ్యాహ్నమే ఆయననుజూచి 'పాణెనుంచి ఒక ఆడకూతుర్ని రాజభవనానికి ఎవరో తెచ్చారు. ఆమెను కాజేసికొని తేవడం మొదలైనసంగతులు రాజభవనానికి తెలియదు. విచారించినమీదట ఆమెకు ఇక్కడికి రావడం ఇష్టంలేదని తెలిసింది. ఆమెను క్షేమంగా పాణెకు పంపించాలని ఆలోచిస్తున్నాం. ఇంతలోనే ఈమాట మంత్రి లక్ష్మీనారాయణయ్యవారి ఇంట్లోతెలిసి ఆపిల్ల వాళ్లపిల్ల కావడంతో మంత్రిగారితల్లి ముసలవ్వవచ్చి ఆమెను తమఇంటికి తీసుకపోయింది. పాణెనుంచి ఆమెను వెదకుకుంటూవచ్చిన ఆమె పెనిమిటికి ఆమెను అప్పగించారు. ప్రస్తుతం ఈ విషయమై మనస్సు చెందుతూవున్న ఆరాటం దూరమైంది. ఈవిషయం మీకు అప్పుడే నివేదించాం' అని చెప్పాడు. కలెక్టరు : 'విని చాలా సంతోషమైంది. ఈసంగతి మద్రాసుకు నివేదిక పంపించాను' అన్నాడు.

రెండవరోజు, నాలుగోరోజు వేటకు ఏర్పాట్లయినాయి. దేహస్థితి అంత బాగాలేదనే నెపంతో వీరరాజు వేటకు వెళ్ళలేదు. సమాధానపడివుంటే చోవణ్ణ వెళ్లవలసినవాడు. మన స్సమాధానం కానందున ఏదోపని నెపంచెప్పి అతడూ వెళ్లకుండా వెనకే నిలిచిపోయాడు. అతిధులను అడవికి పిలుచుకొనిపోయి అక్కడ వాళ్ళతో కూడిమాడి, ఆడిపాడి వాళ్ళను వెనక్కు పిలిపించేపని బసవన్నమీద పడింది.

కుడిపాదం మెలివడి, అతనినడక కొంచెం వికారంగావున్నా, గుర్రంఎక్కినమీదట ఆయన ఏ రౌతుకు తీసిపోడు. రాజుకంటె అతడు దృఢమైన శరీరయష్టి కలవాడు. యజమాని కాకపోవడంచేత ఆయన స్వైరవిహారానికి ఒక మితివుంది. అందుచేత రాజుకంటె రెండేళ్ళు పెద్దయినా ఇంకా హృష్టపుష్టంగానే వున్నాడు. అతిథులు ఒక్కరొక్కరూ ఒక రోజుకాకపోతే వేరొకరోజు ఒకజంతువునుగాకపోతే వేరొకజంతువును చంపేటట్లు ఏర్పాటైంది. మగవాళ్ళకుమల్లే ఆడవాళ్ళకుగూడ ఒక్కొక్కజంతువును సమకూర్చే ఏర్పాటు. అందరూ వేటలో కృతకృత్యులై వెనుదిరిగి రావాలి. వేటలేని మూడురోజులు రెసిడెంటు మొదటిరోజు రాజుతో, రెండోరోజు రాజుగారి అనుమతిమీద మంత్రులతో, మూడోరోజు ఇంటి అల్లుడు చెన్నబసవన్నతోడ మాటలాడాడు.

ఆ రోజుల్లోనే కొంచెం విశ్రాంతి చిక్కినసమయంలో అతిథులు, రాజుగారి ఆయుధశాల, అశ్వశాల, కుక్కలచావడి చూశారు. అతిథుల కన్యలు రాణిగారినిచూసి రాజభవనంలోని వస్త్రాభరణాలను తిలకించి సంతోషపడ్డారు.

## ౮౬

పండుగరోజులలో, దేశచరిత్రకు సంబంధించిన కొలడ ఘట్టాల్ని ప్రదర్శించడం రాజవంశంలో పూర్వంనుంచీ వస్తున్న ఒక ఆచారం. మిత్రులయిన తెల్లదొరలు వచ్చినప్పుడు కొడగురాజు వారిమైత్రిని సంపాదించినవిధం ప్రదర్శించడంకూడా ఇందులోని ఓ భాగం. ఈసారి తెల్లదొరలు ఊరిలోవున్నరోజుల్లో ఆయిదురోజులు, సాయంసమయాల్లో ఇటువంటిదృశ్యాల్ని అభినయింపచేశారు.

లక్ష్మీనారాయణయ్య తమ్ముడు సూరప్పకు తెలుసు ఈ దృశ్యాల్ని చక్కగా అభినయింపగలవాళ్ళు, ఎక్కడెక్కడ ఎవరెవరున్నారు అనేసంగతి. ఆయన వాళ్ళనుపిలిపించి ఓ చోటచేర్చి, ఎవరు ఎవరు ఏ విషయాన్ని అభినయిస్తారో తెలుసుకొని వాళ్లను తనకు తెలిసి

పుంతవరకూ తగిన నన్ని వేశాలను అభినయూర్థం ఇచ్చాడు. తానే దృశ్యాలవెనుక నిలబడి నిర్దేశకుడుగా వ్యవహరించాడు. నడుస్తూవున్న ప్రసంగాన్ని తెలియజేయడం, పాత్రలకు మాటలను అందియ్యడం, నటుడు చెప్పినమాట చాలకపోతే దాన్ని పూర్తిచేయడం, ఈ పను లన్నీ నిర్వహించాడు.

మంగుళూరుసీమలోని యక్షగానం, మలయాళిష, కడకళి. వీని ప్రభావంచేత కొడగు సిద్ధం చేసికొన్న ఒక నాటకకళ ఇది.

మొదటిరోజు కొడగు రాజవంశం మూలపురుషునిచరిత్ర అభినయించి ప్రదర్శించారు. అంతకుమునుపు పాలిస్తున్న రాజవంశంలోని చివరిరాజు దుష్టుడై ప్రవర్తించడంచేత ప్రజలు అతనిని విరోధించి వాళ్లనాయకుడు అతన్ని చంపడం. ఇక్కేరినుంచివచ్చిన స్వాములు ఒక్కరు వాళ్ళను ధైర్యానికి మెచ్చుకొని, వాళ్ళల్లో ఒక్కరిని రాజు కమ్మనమని చెప్పడం; వారంతాచేరి 'మేం రాజయ్యేది లేదు. స్వాములైన మీరే రాజు కండి' అని బదులు చెప్పడం. ఆయన సమ్మతించి రాజు కావడం: ఇదీ ఆరోజు నాటకసారాంశం. కొత్తదొర ప్రజలకు యజమానిగా రాలేదు. జనులకు మంచిదారిచూపించే గురువుగా సింహాసనానికి వచ్చాడు. ప్రజలు ఆయనకు సేవకులుకారు. కుటుంబంలోని పిల్లలు. వాళ్లు ఆయనకు ఇచ్చేది పరిపాల నకు ఇచ్చే పన్నుకాదు, గురువుగారికి సమర్పించే జీవికకైన వస్తుసామగ్రి. ఈవిషయం నాటకంలో స్పష్టంగా రూపుకట్టింది. చివరికి రాజైనవాడు 'నేనూ, నా వంశంలోనివాళ్ళు మిమ్మల్ని కుటుంబంలోని సంతానంలాగా చూసుకొంటాం. ఈ వంశంలో ఎవరు ఈ దారి తప్పి చరిస్తాడో, అతనిని ఆ కాలంలోని జనం వెనకటిరాజుకి. మీరు ఇచ్చినదండన, ఇవ్వ వచ్చు' అని స్పష్టంచేసి చెప్పాడు.

ఈ సందర్భంచూస్తూంటే చిక్క వీరరాజుకు అన్వయిస్తుందని రాజు, రాణి, మంత్రులు, ఆట చూడటానికివచ్చిన ఇంకా అనేకప్రజలూ గమనించారు. కాని ఈమాటలు పలికించినప్పుడు సూరప్ప ఏదో ఉద్దేశంతో అనిపించాడు అని అనిపించలేదు. కథా ప్రవా హంలో తమంతట తాము సహజంగా దొరలివచ్చిన పలుకు ముత్యాలవి.

ఉద్దేశపూర్వకంగా, సాభిప్రాయంగా ఆడినపలుకులు కావనుకొనే ఎవరూ తిరిగి ఆ ప్రస్తావన ఎత్తలేదు. మాటువడివున్నవిషయాన్ని రేపడందేనికి?

మరునటిరోజు, దొడ్డ వీరరాజు టిప్పుకు విరోధంగా తెల్లవారికి సహాయం చేసిన కథ. టిప్పుదగ్గిరనున్న మునల్మాను సేనానులు, కొడగుప్రజలను హింసించడం: దొడ్డ వీరరాజు చెరనుండి విడిపించుకొనివచ్చి ప్రజలను పోగుచేసి సేనానులను ఢీకొని వాళ్ళనోడించి, కొడగు కైవసం చేసికోవడం; తలచేరి, మంగుళూరునుండి తెల్లవారు దండెత్తిపోయినప్పుడు వాళ్ళకు జాపటగా నిలవడం 'నువ్వు మనదేశస్థుడవు; ఆంగ్లేయులు విదేశీయులు; మనమిద్దరమూ కలిసి వాళ్లను తరిమివేయాలి. గెలిచినరాజ్యంలో నీకు సగంరాజ్యం ఇస్తాను. రా' అని టిప్పు వీర

రాజును పిలవడం; ఆయన ఆంగ్లేయులు నాకు మిత్రులు; అంతేగాక నువ్వు నా దేశాన్ని కోత పాలుచేసినవాడివి' అని అతని ఆహ్వానాన్ని నిరాకరించడం; తెల్లవారు ఇందుకు మెచ్చి వీర రాజుకు గౌరవసూచకంగా ఒక కరవాలం బహూకరించడం—ఈ సంఘటనలు కథావస్తువుగా ఒక నాటకాన్ని ఆడారు. ఓ టిప్పు, ఓ ఆంగ్ల అధికారి టేయిలర్; ఓ వీరరాజు, ఓ సేనాని; ఇద్దరు కొడగు జనం; వీళ్ళకు సూరప్పవెనక హంగు. నటులు సంగతి తెలిసినవారు.

తెల్లదొరపాత్రవహించిన నటుడు 'దొరవారు ఏమంటారు' అనేటప్పటికి బలే ఉత్సాహంతో ఆ సందర్భంలో దొర మాటలాడవలసినమాటలు కంఠపాఠం చేసింది స్వల్పం, తాను చేర్చింది మరికొంతగాచేసి నోటినిండా మాటలను దొరలించాడు. సూరప్ప మాటలు పూరించడం వేరే వుండనేవుంది. 'సభ 'షేష్, శాబాస్' అని అరిచింది. తెల్లదొరలు దుబాసిద్వారా ఈ ఘట్టాన్ని అర్థంచేసికొని దృశ్యం నడిచినతీరుకు చాలా మెచ్చుకొన్నారు. చివరికి, మా దొడ్డ వీరరాజేంద్రుల ప్రభువులపేరు చెబితే పరంగిజనం టోపితీసి నమస్కారం చేస్తారు అన్నప్పుడు ఔను తీస్తారు అని చుట్టూవున్నజనం సమ్మతిసూచకంగా అఱిచింది. దుబాసి దీని అర్థాన్ని రెసిడెంటుకు చెప్పగా ఆయన 'So we do Saheb' 'ఔను స్వామీ ; ఇది నిజం' అనిచెప్పి లేచి నిలబడి తన తలమీది టోపితీసి నతమస్తకుడయ్యాడు. తోటి ఆంగ్లేయులు నిలబడి మర్యాద చూపించారు. జనుల ఆనందానికి అవధులులేవు. ఆట చాలా సంతోషంగా సుఖాంతంగా ముగిసింది.

మరుదినం మలబారులోని ముసల్మాను రాణిని టిప్పు ఆమె రాజ్యంనుంచి వెళ్ళగొట్టడం; ఆమె వీరరాజుదగ్గిరకు శరణాగతురాలై వచ్చినట్లు దూతచేత కబురుపెట్టడం; వీరరాజు తల చేరిలోని టేయిలర్ దొరకు చెప్పంపించి ఆంగ్లేయులసాయంతో టిప్పుసేనలను ఓడించి మలయాళదేశంనుంచి తరిమివేసి, బీబీకి ఆమె రాజ్యాన్ని తిరిగి అప్పగించడం - ఇదీ కథావస్తువు. దీనిలో 'కొడగు దొరలు పరస్త్రీని సోదరివలె చూస్తారు. శరణాగతులను, తమ ప్రాణాలను బలి ఇచ్చిఅయినా రక్షిస్తారు. ఒకసారి స్నేహమైనపిమ్మట మిత్రద్రోహం చెయ్యరు' అనేసంగతి చక్కగా నిరూపింపబడింది. దీనిస్వారస్యం ఆంగ్లేయులూ మెచ్చుకోవడం జరిగింది.

నాలుగోరోజు, లింగరాజుచేసిన భూమివ్యవస్థ ఆడి చూపారు, పూర్వపురాజులు, పూర్వం తీసుకొంటున్న పన్నును రైతు రాజభవనానికి కట్టడానికి వచ్చినప్పుడు, 'నీవు పండించింది ఎంత ?' అని అడిగితెలిసికొని, పండినదాంట్లో పదింట ఓ పాలుమాత్ర ముంచుకొని, మిగిలిన దాన్ని 'నువ్వే తీసుకోపొమ్మ'ని విడిచిపెట్టడం; ఆమీద దేశంలో ఆ ఏర్పాటే ఎన్నటికీ సాగుతూవుండడం; గ్రామంలోని [1]గౌడ తననుంచి ఎక్కువ తీసుకొన్నాడని రైతువచ్చి

1. గౌడ = జాతి విశేషము. కన్నడప్రాంతమున ఈ జాతివారు సాధారణంగా గ్రామాధికారం నిర్వహించడంచేసి ఆ శబ్దానికే గ్రామమునసబు అని అర్థ మేర్పడింది. ప్రకృతార్థం గామాధికారి అని—అనువాదకుడు.

రాజుతో చెప్పుకొన్నప్పుడు రాజు గౌడనుపిలిచి, విచారించి అది నిజమని తెలిసినమీదట, గౌడ మంచి రైతుకు అతడు ఎక్కువగా తీసుకొన్నదానికి రెట్టింపుధాన్యాన్ని వెనక్కు ఇప్పించడం; ఒక్కఏడు పంట నష్టమై రైతు చాల కొంచెంధాన్యం తెచ్చినప్పుడు గౌడ దాన్ని ఒప్పుకుండావుంటే రైతువచ్చి రాజుతో చెప్పుకోవడం రాజు మంట పాడయింపా అని విచారించి నిజమని తేలినమీమ్మట ఆసారి రైతు శిస్తు కట్టక్కర్లేదు, మించింది అతనికే చాలదు గనక రాజభవనం భాండారంనుంచి అతనికి ధాన్యం తోలించి అని ఆజ్ఞాపించడం; దొరతో ఋణం వాకువస్తవి రైతు చెప్పడం; ముందుపంటలో ఏడు దీన్ని మాటికి మరోవంతుచేర్చి వాను వెనుకవించి ఇవ్వవచ్చులే అని రాజు చెప్పడం; ఇవీ ఇందులో కథ.

ఇదంతా కొడగులకు తెలిసినసంగతి. ఇన్ని వివరాలు అతిముఖ్యమైన ఆంగ్లేయులు ఎరుగరు. ఈ సంగతులన్నీ చెప్పినతర్వాత వాళ్లకు ఈ దేశంలోని రాజతంత్రం. ఎంత ఉన్నతమైందో కొంతకొంత తెలిసి ఆశ్చర్యమగ్నులయ్యారు.

# 87

మొదటిరోజు వేటకు పోయినప్పుడు అతిథులవెంట బసవన్న ఒక్కడే. రోజూ వేటకు వెళ్ళినా, ఈసారి ఈ అతిథ్యం బాధ్యతను అతడు వహించలేదు. అతిథులసంఖ్య హెచ్చు: అందరిసౌకర్యాన్ని చూడడం అసాధ్యమైనదని. లూసి పార్కరు వేటలో నిపుణురాలు. ఆమె బసవన్నను 'మీలో మంచి నిపుణుడైన వేటకాడు వేరెవరు లేరా?' అని ప్రశ్నించింది.

బసవన్న ఆమెకు మగవాళ్ళు ఒకళ్లు తోడుండాలనిపిస్తోం దనుకొన్నాడు. 'ఉన్నారు లేకేం? పిలిపిస్తాను' అన్నాడు. రాజభవనానికి రావడంతోటే ఈసంగతి రాజుకు చెప్పి 'ఉత్తయ తక్కన్ను, పడవాల ఉత్తయన్ను పిలిపించండి దొరా!' అని చెప్పాడు.

రాజుకు బసవన్నలాగానే ఆ పిల్లవిషయమై తేలికగా ఆలోచించేస్వభావం. 'ముసలివాడిని ఏం చేసుకొంటుందో ఆమె? ఈపాటి తెలియదా నీకు?' అన్నాడు. బసవన్న నవ్వి 'అందుకే ప్రభూ! నడుచుకుర్రవాణ్ణి పిలిపించండి' అన్నాడు.

'ఇక్కడ కావలి కున్నవాడు అతడేగా!'

'చిత్తం ప్రభూ!'

'అతడువస్తే ఈమె నిన్ను మూ చూడదు!'

'మది గమనించే ముక్కుకు ఒక్కవాసన చాలదా దొరా!'

'అల్లాగా 'కుంటీ' : ఇటువంటిమాటల్లో నువ్వు చాలా నిపుణుడవు.'

'ఇద్దరినీకూడా పిలుచుకపోతే ముసలాడు మాటాడుతూ వుంటాడు, వయసోడు వేట కుంటాడు. సరిపోతుంది ప్రభూ ?'

'ఇష్టంవచ్చింది చెయ్యి ముండమోపీ : కొడుకుకు నువ్వే దొరవు.'

'అంటం అనేశారు దొరా : అంతోటిమాట చెల్లదు.' బసవన్న ఆ ఇద్దరి వేటకాండ్రకు వెంటనే కబురు పంపించాడు. ముసలి ఉత్తక్కయ్య ఉత్సవాలకై ఎట్లాగూ మడకేరికి రానే వస్తున్నాడు, యువకుడయిన ఉత్తయ్య పిలుపు అందగానే మరుసటిరోజుకల్లా రెక్కలు గట్టుకొని వ్రాలాడు.

రెండోరోజువేట చాలా చక్కగా నడిచింది. బసవన్న నిరీక్షించినట్లే, ముసలి 'తక్కయ్య', పెద్దలతోపాటు ఆడిపాడి తన పరాక్రమకథలనుచెప్పి తాను తృప్తిపడి వాళ్ళను తృప్తిపఱచాడు. వయస్సులోని ఉత్తయ్య చిన్నవాళ్ళతోపాటు వుండి, లూసి పార్కరు మనస్సును సంతోషపెట్టేచాతుర్యం ప్రదర్శించాడు.

లూసి పార్కరు అతనిని 'My Robin Hood' అని పొగడింది. ఆరోజు వేటలో ఒకజంతువు వాళ్లకు చిక్కకుండా ఒక పట్టమయినఅడవిలో దూరింది. లూసి పార్కరు, హాకరు, ఇవపుడూ దానిని వెంబడించి, అడవిలో చొరబడ్డారు. బసవన్న కేకవేసి వారిని పిలిచి ఆపాడు. గుర్రం వెనుగెత్తించి వాళ్ళలోకలిసి 'ఇంతకుమీద మనం వేటలాడటం తప్పు. ఇది భగవతివారి అడవి' అని చెప్పాడు.

వేట ముగించుకొని వారందరూ వెనక్కు వచ్చినప్పుడు, భగవతి ఆశ్రమము ఎదురుగా పోవలసివచ్చింది. భగవతి వాకిటదగ్గర నిలబడివుంది. ఆమెనుచూసి కొంచెందూరంలో బసవన్న గుర్రంనుండి దిగి వంటుకుంటూనే గుర్రాన్ని నడిపించుకుంటూ ఆశ్రమం గుమ్మం వరకూ వచ్చాడు.

దొడ్డ దొరగారు : 'ఈమె ఎవరు ?' అని ప్రశ్నించాడు. బసవన్న : 'వీరు ఇక్కడి ఆశ్రమం కట్టుకొన్నారు భగవతి ఉపాసకురాలు. ఆ దేవతకై మేము దీన్ని సురక్షితమైన అరణ్యంగా వుంచేశాము. ఇక్కడ ఎవ్వరూ వేటాడరు' అన్నాడు.

దొర : 'ఈ ఆశ్రమానికి ఎదురుగా గుర్రంమీద పోగూడదా ?'

బసవన్న : 'అది మీ ఇష్టం. మాకు పూజాస్థలం కాబట్టి మేము దిగి నడుస్తున్నాం.'

దొర : 'మీరు గౌరవం చూపించేస్థలానికే, మేము మర్యాద చూపిస్తాం. దేవుడందరికీ ఒకడే' అని గుర్రమునుంచి దిగి టోపి తీసేసి తలవంచి ఆశ్రమద్వారాన్ని దాటెను. ఆయన వెంట ఉన్నవాళ్ళుకూడా అట్లాగే చేశారు. భగవతి ఏమీ మాటాడకుండా ఔనో కాదో అని ఓ చిరునవ్వుతో వాళ్లను చూచింది. ఆశ్రమంముందుభాగం దాటినతర్వాత పెద్దదొర గుర్రం ఎక్కాడు. బసవన్న : 'దేవత అడవిలోకి అడుగుపెట్టలేదవ్వా !' అన్నాడు. భగవతి :

'మంచిది' అంది. బసవన్న నాలుగు అడుగులువేసి గుర్రాన్ని పక్క [illegible] కూర్చు కున్నాడు.

అందరివలెనే తానూ గుర్రందిగి ఉత్తయ్యతక్క భగవతినిమాసి [illegible] చాలా కాలం క్రింద చూసిన ఒకానొక మొగంవలె కనిపిస్తోంది. కానో కాదో - ఏది సంభవం? కాకుం డుటే ఎక్కువ సంభవం, నలభై ఏళ్ళక్రిందట చూసినమొగం ఈరోజు గుర్తించడం సాధ్యం కాదు అనుకొన్నాడు.

పెద్ద దొర : ' What a magnificent creature! If the goddess is anything like her votary she deserves her place" అన్నాడు.

లూసి : హాస్యంగా "In the wilderness you mean?" అంది.

దొర : "In Parnassus, my dear" అని జవాబిచ్చాడు.

విడిదిచేరినమీదటకూడా తెల్ల అతిథులు భగవతి రూపురేఖలను, ఒడ్డు పొడుగునూ, చాలాసార్లు జ్ఞప్తికి తెచ్చుకొని ప్రశంసించారు.

ఉత్తయ్యతక్క బోపణ్ణకు జరిగినసంగతి అంతా చెప్పి 'ఈ తెల్లవాళ్ళు మంచివాళ్లు తక్కరూ! పూజచేసేస్థలమని కుంటి చెప్పాడు. పెద్దదొర వెంటనే గుర్రం దిగుతారు చూడండి. మీ దైవం మా దైవం అని భేదంలేదు. మా దేవుడు గొప్ప అని అహంకారం లేదు. దుమికినంతటనే టోపీతీసి ముందుకు వెళ్లాలనివుంటే తలవంచి మరీ వెళ్ళారు. తెల్ల వాళ్లు నిజంగా గొప్పవాళ్లు తక్కరూ!' అన్నాడు.

బోపణ్ణ ఈ మాటలువినికూడా ఏమీ మాటాడలేదు.

ఓనిమిషం ఊరకుండి ఉత్తయ్యతక్క బోపణ్ణను 'ఈ భగవతి ఎవరు? నీకుతెలుసా?' అని ప్రశ్నించాడు.

'తెలియదు తక్కరూ! ప్రజలంటున్నారు, మలయాళదేశానికిచెందిన అవ్వ అని, మంత్రం, మాయం అన్నీ తెలుసునని. అంతే మేము విన్నదీ'

ఉత్తయ్యతక్క : 'అంతేనంటారా?' అన్నాడు. మాట ముందుకు సాగించలేదు. ఆమె 'పాపా' అని మనస్సులో నిశ్చయం చేసికొన్నాడు. ముప్పైనాలుగు ఏళ్ళక్రిందట లింగరాజు ఆమెను లేవనెత్తుకవచ్చి ఉంచుకొన్నసంగతి అతని స్మృతిపథంలో తటుక్కున మెరిసింది.

# 88

వేటాడని మొదటిరోజు పొద్దుదొర రాజునుకలిసి ఆయనతో కొడగుపరిపాలనగురించి సంభా షించాడు.

రాజు మామూలుకంటె ఎక్కువనిగ్రహంతో ఆరోజు కొంచెం తక్కువమద్యం సేవించి అత డడిగిన ప్రతిప్రశ్నకూ జవాబ్దారీతో బదులిచ్చాడు. దొర: 'చెన్నవీరయ్య అనే ఒక వ్యక్తిని, మీ ఏలుబడికి లోబడివున్నవానిని, అపరాధి అని నిర్ణయించి మీ యొద్దకు పంపిం చాము. ఆయనవిషయమై మీరు ఇచ్చినశిక్ష ఏమిటి అని ఎన్నోసార్లు ఉత్తరాలు వ్రాసి వున్నాము. తమదగ్గిరనుండి ఏ జవాబూ లేదు' అన్నాడు. రాజు: 'చాల స్వల్పవిషయం. మేం చేయదలచింది చేశాం. మీరు దీన్ని అడగవలసింది కాదు' అన్నాడు.

'నాకు స్వయంగా ఇప్పుడు ముఖతః చెప్పవచ్చుగా!'

'బసవన్న చెప్పుతాడు అడగండి.'

'మంగుళూరుసీమనుండి ఎవరో అయోగ్యులొక్కరు ఓ ఆడపిల్లను దొంగిలించి తమ మంత్రి బసవన్నపై దోషారోపణ చేశారుట. ఆమెకు ఇష్టంలేదని తెలిసినవెంటనే తాము ఆమెను వెనక్కు పంపించివేశారుట. ఇది చాలా సంతోషకరమైనవిషయం. జనం తమ మీద వృథా ఆరోపణలు చేయడానికి వీలులేకుండాపోయింది. చాలా మంచిపని.'

'ఔను. మా పరివారంలో వుండటానికి ఇష్టంలేనందున, నిర్బంధంగా వుంచకూడదు అని ఆజ్ఞాపించాం.'

చాలాసంతోషం. తమ చెల్లెలిగారిని ఆమె భర్తతో ఉండనివ్వకుండా రాజభవనంలో వుంచేవారనే ఫిర్యాదు వచ్చింది. ఈమధ్య ఆమెను ఆమె పెనిమిటివద్దకు పంపించారని బసవన్నగారు చెప్పారు. ఇదికూడా చాలా మంచిపనైంది.'

'మంచిపనేం కాదు పొండి. మా చెల్లెలు మా దగ్గిరవుండటమే నిజానికి మంచిది. మా అల్లుడనబడేవాడు మంచివాడు కాడు. రాజవంశానికి అల్లుడై గొప్పవాడై కూచున్నాడు. ప్రజలలో ఓ సామెత వుంది. 'ఉప్పులేనిగంజి తాగి సుఖంగా వుంటాడు ఇంటిపిల్లడు. అల్లు డైనవాడు నేతిబువ్వతిని దిబ్బెక్కి నానామాట లంటాడు అని। చెన్నబసవన్న చేసిన ఫిర్యా దులన్నీ మీరు నిజమని భావించకండి.'

'మాదాకావచ్చిన సమాచారం అంతా కుంపిణీవారి మిత్రులయిన తమకు విన్నవించడం మా కర్తవ్యం. అందుచేత దీన్ని తమగుర్తుకు తెచ్చాను. విధిలేదు ఇహ - అనేపరిస్థితి వచ్చే దాకా మేమేమీ ఇటువంటివిషయాల్లో జోక్యం కలిగించుకోము. ఇదే ఘనతవహించిన కుంపిణీ సర్కారువారి ఆశయం. ఇదే గవర్నరు జనరలుగారి, మరి మద్రాసు గవర్నరుగారి

అభిప్రాయంకూడా. వారి ఆజ్ఞకూడా అంతే. కావలసినన్ని ఫిర్యాదులు రావచ్చు. వాటిని మనం నమ్మకూడదు. అబద్ధమనీ అనుకోకూడదు. అది మాకు సంబంధించినవిషయంకాదని తటస్థంగా వుండిపోతాం. మిత్రులైన తమకు సంబంధించినవిషయాలు కావడంచేత తమ గుర్తుకు తెస్తున్నాం. 'మీరు చేసిందేమీ తప్పుకాదు. ఈ ఫిర్యాదులు వ్రాసినవారికి బుద్ధిలేదు. వచ్చి బసవన్నకుచెప్పితే సరిదిద్ది పంపించాను. ఆ ముసలాడు వచ్చాడు. వడి ఇవ్వలేదన్నాడు ఇప్పించాం. నచ్చేదిలేదు, అడిగేదిలేదు. దారినపోయే దానయ్యలందరికీ ఫిర్యాదులుచేస్తే ఏం చేస్తాం.'

'దారినపొయ్యేవారికని కాదు. తమస్థానం గొప్పది. తమ ఎదురుగ్గావచ్చి మాటలాడటానికి జంకుతారు. తమ మిత్రులైన మేము వాళ్ళకు సులభులం. మా కోరికను తాము మన్నిస్తారనే నమ్మకంతో మా దగ్గిరకు వస్తారు.'

'ఆమాట కద్దులేదు. బసవన్న ఏమి? మీరేమి?'

'ఎవరికో కొంతమందికి ఇవ్వవలసిన పణం ఇవ్వలేదు అని, ఇట్లాగే మరికొన్ని మీ ప్రజల బంధుగులు మా సీమలో జీవితం వెళ్లబుచ్చుతున్నవారు నేరం తెచ్చారు. అటువంటి దేమీలేదని మేము నమ్ముతున్నాం.'

'రాజకుటుంబంపెత్తనం సహస్రముఖీనమైంది. ఈ ప్రొద్దు పండుగ, రేపు దండుగ. ఆడే వాళ్లంటే ఆడిస్తారు. ఈశ్వరపూజ, బీదలకు అన్నదానం ఈ రెండే చాలు రాజకుటుంబాన్ని అప్పులలో ముంచడానికి. ఇంతకు పైపెచ్చు కుంపిణీ మా కుటుంబధనం లక్షలాదిగా మ్రింగి పెద్ద గొయ్యిలా కూచుంది. సాహుకారుచేతిలోచిక్కి దివాలా తీయకపోతే ఏమిటి అవుతాం మరి?'

'దొడ్డవీరరాజుగారు కూతురిపేర పెట్టిన నిధినిగురించి....?'

'ఔను.'

'అది వివాదాధీనంగా వుందికదూ! నిర్ణయానికి వచ్చింతర్వాత తమ భుక్తానికి వస్తుంది.'

'వేగంగా మా హక్కుకు చెల్లేటట్లు చూడండి.'

'అనేకకారణాలతో వెష్టపడ్డ కొందరు, తాము రాజ్యభారాన్ని వేరొకరికి విడిచిపెట్టడం మంచిది అని మేము మీకు చెబితే బాగుంటుందని చెప్పారు. ప్రస్తుతానికి మేం అల్లా చెప్పటానికి తగినంత కారణంలేదని మా పై అధికారులు నిశ్చయించారు.'

'మీ పై అధికారులు బుద్ధిమంతులు పొండి. అయితే నిజానికి వాళ్ళు, దీనికీ మాకూ సంబంధంలేదని చెబితే బాగుంటుంది.'

'మేము ఆమాటే చెప్పాం కాని ప్రజలు మైసూరు రాజును శాసనంనుండి తొలగించారు. కావాలంటే కొడగు రాజునుకూడ దింపగలరని తెలుసుకున్నట్లు కనబడుతుంది.'

'మైసూరు రాజుమాట వేరు. గద్దె నెక్కించినవారే గద్దెనుంచి దింపేశారు. మమ్మల్ని కుంపిణీవారిదాకా ఎవడు తీసుకవచ్చి ఈ సింహాసనంమీద కూచోబెట్టలేదు.'

'ఈమాత్రంకూడ ప్రజలకు తెలియదు పాపం: గద్దె సమకూర్చకపోయినా, దానినుంచి దింపవచ్చునని వాళ్లు అనుకుంటారు. కష్టాలలో చిక్కవడ్డామే, ఎవరు విడిపిస్తారా అని ఆలోచిస్తారేకాని వేరేవాళ్ళని అడగవచ్చా, అడగకూడదా అనేమాట వాళ్ళబుర్రలకు తట్టదు. దాని మూలంగా కుంపిణీ చాలాసార్లు ఇబ్బందులకు లోనవుతూవుంటుంది. కష్టాలలోవున్నవాళ్ళను చూస్తే సానుభావం, మిత్రులైన తమరినిగురించి దాక్షిణ్యం: ఏం చేయాలో తెలియక చాలా మనస్సంకటంగా వుంటుంది.'

'కన్నతండ్రికిలేని విచారం బైటవాళ్లకా; మాదేశం ఆడపిల్లకాయల్ని మేం బంగారం లాగా చూసుకుంటాం. మీ కుంపిణీవారు ఈ విషయం పట్టించుకోనక్కర్లేదని చెప్పండి.'

'కావచ్చు. మేం మీతో మాటాడినసమాచారం అంతా నివేదిక వ్రాస్తాం. అప్పుడు ఇదీ తెలియజేస్తాం. ఇంకోమాట మిగిలిపోయింది. ఈ మీ ప్రాంతంనుంచి మాకు వచ్చివున్న ఓ మనవిలో, తమ అన్నగారు ఒకరున్నారని, వారు రాజు కావాలిసివుంటే, వారిని తప్పించి మీరు రాజయ్యారనీ, ఇప్పుడు రాజైవున్నవారిస్థానాన్ని అన్నగారి కిప్పిస్తే న్యాయం నడచి నట్లౌతుందనీ. తమకీ రాజ్యభారం వుండదనీ, ప్రజలకు సంతోషంగావుంటుందనీ. అందులో వ్రాశారు. తమకో అన్నగా రున్నారనేవిషయమే మాకు తెలియదు.'

'మాకూ తెలియదు పోనివ్వండి. అంటే మనవి చేసుకొనేవాళ్లు, మనవి వినేవాళ్ళు. కావాలంటే, మాకు ఓ అన్నేమికర్మం, ఓ తండ్రినికూడా సృష్టించేస్తారు అన్నమాట.'

తెల్లదొర పక్కున నవ్వాడు. 'మీరు చెప్పింది చాలాబాగుంది రాజా: తమరు ఎంతటి నిపుణులో మాకు నిజంగా తెలిసేది ఇటువంటిసందర్భంలోనే. తమరు దయవహించి మాతో ఈ సంభాషణ జరిపినందుకు నేను తమరికి నమస్కరిస్తున్నాను. చర్చఅంతా పరస్పర విశ్వాసంలో సాగిందని ప్రకటింపదలచుకొన్నాను. తాము, నన్ను మా మిత్రబృందాన్ని రప్పించి ఎంతో ఆదరించారు. ఈ సత్కారాన్ని ఎప్పటికీ మరచిపోలేం వెళ్ళిపోయేముందు ఈ విషయం తిరిగి విన్నవించుకుంటాం.'

'సరే.'

'ఇప్పుడు జరిగినమాటలన్నీ ఇంత ధారాళంగా ఉత్తరంలో వ్రాయుటకు వీలువడటం లేదు. ఆ కారణంచేతనే తమరిని ముఖతః కలుసుకొనే ఈ సందర్భాన్ని మేం వాంఛించాం. ఇక, నేను మీకు శ్రమ కలిగించను. ఆజ్ఞఅయితే రేపబెల్లుండిలో మేము తమ మంత్రులనూ, ఇంటి అల్లుడుగారినీ, చూసి రెండుమాటలు మాట్లాడుతాం.'

'దానికేమీ అడ్డులేదు. మాట్లాడండి. మీరంతా రావడం మాకు చాలాసంతోషాన్నిచ్చింది. మర్యాదఇచ్చి మర్యాద తీసికో అని మాలో ఓ మాట వుంది. మేం ఎల్లప్పుడూ మర్యాద

ఇవ్వడానికి సిద్ధం. మీరూ ఆ ప్రకారం మాయందు గౌరవం చూపండి. చక్కగా నడచుకొంటే, మా పెత్తండ్రిగారికంటె మేము తీసికట్టు కాము.'

దొర నిలబడ్డాడు. వాకిలవతలఉన్న బసవన్న పూలతోనూ పండ్లతోనూవున్న పళ్ళెం లోపలికి తెప్పించాడు. తెల్లదొరగారికి తానే పూలదండను మెడలో వైచి, తురాయి ఇవ్వడానికి రాజా కందించాడు. రాజా తురాయి దొరకుఇచ్చి పూలగుత్తిని అతని చేతికందించాడు. దొర రాజాతో కరచాలనంచేసి సతమస్తకంతో వీడ్కోలు పొంది, బైటకు వచ్చేసాడు.

# 89

ఈ సమావేశం అయిన మూడోరోజు ఉదయం దొర లక్ష్మీనారాయణయ్యను, బోపణ్ణనూ, దానికి మూడోరోజు చెన్నబసవన్నను పిలిపించుకొని, వాళ్లతో సంభాషణలు జరిపాడు.

వరాయివాళ్ళు మనవాళ్లను కలుసుకోడానికి ఈవిధంగా అనుమతించకూడదని బసవన్న రాజాకు సూచించాడు. రాజా : 'కలుసుకోనీ పోనీ; వీరు చేయగలిగిందేముంది? చూడవద్దు, మాటాడవద్దంటే ఏదో కప్పిపుచ్చుతున్నారని అంటారు. వీళ్ళనుచూసి మాటాడి ఏమిటి సాధిస్తారో సాధించనీ' అన్నాడు.

దొరకు బోపణ్ణను వేరుగా, లక్ష్మీనారాయణయ్యను విడిగా కలుసుకొని మాటాడాలని కోరిక. కాని అట్లా వేరువేరుగా రావడానికి బోపణ్ణ ఒప్పుకోలేదు. లక్ష్మీనారాయణయ్య కూడా సమ్మతించలేదు. అందుచేత ఇద్దరినీ ఏకకాలంలో చూడవలసివచ్చింది.

వాళ్లిరువురు వచ్చినతర్వాత కుశలప్రశ్నలువేసి గౌరవించి, కూర్చుండబెట్టి దొర 'మంత్రి స్థానంలోవున్న తా మిద్దరూ ఈవిధంగా ఏకమనస్కులై ఐకమత్యంగా నడచుకోవడం మాకు ఎంతో సంతోషంగా వుంది. అధికారివర్గంలో ఇటువంటి ఐకమత్యంకంటె మించిన క్షేమసాధకతత్త్వం రాజ్యానికి వేరు ఉండబోదు' అన్నాడు.

బోపణ్ణ : 'అయ్యవారు మాకు పెద్దలు, మా అందరిక్షేమం కాపాడ సమర్థులు. మేము వారివెంట ఉంటూవుంటాము. మాలో భేదభావానికి అస్కారమే లేదు' అన్నాడు.

'చాలా సంతోషం. మేము తిన్నగా తమరిని చూడాలనికోరడం ఎందుకో తమకు బహుశః తెలిసివుండదు. మాకు ఇక్కడనుంచి కొన్ని విన్నపాలు, వినతిపత్రాలు వచ్చివున్నాయి. వాటివిషయంలో స్థూలంగా తమ రాజాగారికి నివేదించేవున్నాం. కాని కొన్ని వివరాలు ప్రభుత్వాధికారులనుండి తెలిసికొంటేతప్ప ప్రయోజనంలేదు. రాజాగారికి అటువంటి

వివరాలన్నీ తెలిసివుండవు. అందుచేత మేము తమ రాజుగారితో ఉచితరీతిని సంభాషించి తమరితో వివరంగా మాటాడటానికి అనుమతిపొంది, మిమ్మలను పిలిపించాం.'

బోపణ్ణ : 'రాజుగారి ఆ ప్తమంత్రి మా కీ సంగతి చెప్పారు.'

'ఈ ఆ ప్తమంత్రి బసవన్నగారు నిమ్నజాతి మనుష్యుడనీ, రాజుగారి దురదృష్టవశాత్తూ అతడిప్పుడు మంత్రిఅయి కూచున్నాడనీ, రాజుగారి కుచేష్టలకన్నింటికీ అతడే ప్రేరకుడూ, పోషకుడూ అనీ మనవిచేసుకొన్నవాళ్లు చాలామంది వ్రాసివున్నారు. దీనిలో నిజం ఎంతవరకున్నదో మాకు తెలియడం మంచిది.'

బోపణ్ణ లక్ష్మీనారాయణయ్యవైపుతిరిగి 'ఏమంటారు అయ్యవారూ ?' అని ప్రశ్నించాడు. లక్ష్మీనారాయణయ్య : 'ఈసంగతి తెలిసికొని ప్రయోజనం ఏమిటి ?' అన్నాడు.

బోపణ్ణ : దొరకు 'సంగతి తెలుసుకొంటే తమకేం ప్రయోజనమో ?' అని అడిగాడు.

దొర : ఓరీతి చిరునవ్వుతో వాళ్ళవైపుచూసి 'మనవిచేసుకొన్న వాళ్ళమాటలు నిజమా, అబద్ధమా అని తెలిసికోవాలని మా ఆశయం' అన్నాడు.

బోపణ్ణ : 'నిజమనుకోండి. ఆ పిమ్మట ?'

'మేము దాన్ని మా పై అధికారులకు నివేదిక పంపుతాం.'

'వారేమిటి చేస్తారు.'

'వారేం చేస్తారో మేం చెప్పడానికి లేదు.'

'ఇట్లాగే చేస్తారని దృఢంగా చెప్పడానికి కాదు, సరే. కాని ఈవిధంగా చేయవచ్చు లేక ఆవిధంగా చేయవచ్చు అని కొంత డొంకతిరుగుడుగా చెప్పవచ్చుగా.'

'అదైనప్పటికీ చెప్పడం కష్టమే.'

'మీ పై అధికారులు ఏం చేస్తారో, చేయనున్నారో తెలుసుకోకుండా మనవిచేసుకొన్న వాళ్ళమాటలు నిజమో, కాదో చెప్పి మేం బోనులో స్వయంగా చిక్కువడతామా ?'

'మేం ఎవరికీ చెఱపు ఆలోచించం. తాము పరిపాలనాచక్రం నడిపేవారు. తమవిషయంలో ప్రజలు చాలప్రేమగా సంతోషంగా మాట్లాడుతారు. అది మాకుతెలుసు. వాళ్లు నిందించేది కేవలం రాజుగారిని, మంత్రి బసవన్ననూ. మేమో బైటివాళ్ళం. మాకు ఇక్కడ ఎవరిమీదా ఎటువంటి దోషారోపణ లేకుండావుండటమే కావాల్సింది. జనం సుఖంగా వుండాలి. శాసనం చక్కగా వుండాలి. ఇంతకుమించి మాకేమీ అక్కర్లేదు.'

'తాము మమ్మల్ని ఈమాట అడుగుతామని రాజుగారికి చెప్పారా ?'

'పరిపాలనకి సంబంధించిన కొన్నివిషయాలు అడుగుతామని చెప్పాం.'

'మా రాజుగారు మీ కుంపినీవారికి స్నేహితులు. స్నేహితుల పరిపాలనగురించి ఇంతగా విచారించకూడదు మరి.'

'మీరు చెప్పింది చక్కగావుంది నిజమే. మాకు మీ పరిపాలనగురించి ఏమీ చెప్ప వక్కర్లేదు. కాని ఇక్కడ ప్రజలలో సంక్షోభం చెలరేగితే దానికి ప్రతిక్రియ మీ రాజ్యం వెలుపల తప్పదు. కొడగులో వీచే పెద్దగాలి మా పరిపాలనలోవున్న సీమలోకూడ వ్యాపిస్తుంది. మా సీమలు భద్రంగావుండాలంటే ఈ రాజ్యంకూడ భద్రంగావుండాలి. ఇందుకే మాయీ చింత.'

'నిజానికి ఇక్కడ పరిపాలన భ్రష్టగావుంటే ఏం చేస్తారు?'

'పరిస్థితి నిజంగా చెడిపోయినసమయంలో మా పై అధికారులు ఏంచేస్తారో చెప్పలేం. అక్కడ ఈ దేశం పరిస్థితులపై కన్నుంచినవాళ్లు, మైసూరు పరిపాలనను కొద్దికాలంపాటు కైవసం చేసికొన్నట్లే కొడగు పరిపాలనకూడ కొంతకాలం చేజిక్కించుకోవడం మంచిది అనుకుంటున్నారు. కుంపిణీ ప్రభుత్వానికి ఈ దేశంమీద కన్నులేదు. ఇప్పటిదాకా అది చేజిక్కించుకొన్న భూభాగాన్ని చక్కగా పరిపాలించుకొంటూవుంటే చాలు. నిజానికి ఆ ప్రజలుకూడ అగతికంగా మా ఏలుబడిక్రిందకు వచ్చారు. 'ఈ ప్రజలూ విధిలేక మనక్రిందకు వస్తే ఈ భారాన్ని భరించడం ఎట్లా?' అని మా సర్కారులో కొంతమంది కటకట పడుతున్నారు. 'కష్టమో! సుఖమో! ప్రజలక్షేమం ముఖ్యం' అనేవాళ్లూ వున్నారు. కొడగుప్రజలు సుఖంగావుంటే కుంపిణీకి ఏవిధమైన కష్టమూ లేదు. కొడగుజనం కష్టపడుతున్నట్లు విన్న వించుకుంటూవుంటే, పరిస్థితిని చక్కజేయడం ఎట్లాగా అని కుంపిణీ చింతపడాల్సి వస్తోంది.'

బోపణ్ణ లక్ష్మినారాయణయ్యతో మెల్లగా 'మంచిది అని మాట ముగిస్తాం అయ్యవారూ!' అన్నాడు.

లక్ష్మినారాయణయ్య : 'ప్రజలక్షేమము సాధించడానికి కావలసినసాయం మేము కోర వచ్చు. అయితే కుంపిణీవారు కొడగును ఇంకో మైసూరుక్రింద జమకట్టకూడదు' అన్నాడు.

బోపణ్ణ దొరకు ఇదేమాట చెప్పాడు. 'తాము ఇంత నిస్సంకోచంగా ఈమాత్రం మాటాడినందుకు మేం చాల సంతోషపడుతున్నాం. మంత్రులందరూ, ఈవిధంగా మాట లాడితే రాజకీయవ్యవహారాలు ఎంతబాగా నడపవచ్చు. మైసూరును కుంపిణీ ఏమైనా చేసిం దనుకుంటున్నారా అదేమీ లేదు. మీవంటి దక్షులైనమంత్రులు మేం రాజ్యం చూసుకుంటాం అని ముందునిలబడి, ఈ మంత్రులు నడిపించినట్లు మేం రాజ్యం నడపుతామని రాజుగారు హామీ ఇస్తే కుంపిణీ రేపే ఆ రాజ్యాన్ని రాజుగారికి వెనక్కు ఇచ్చివేసి ఆ మంత్రులను అధికారంలో వుంచడానికి సిద్ధంగా వుంది. తమరిద్దరూ, ఏకముఖంగా కొడగు పరిపాలనలో కొడగుప్రజలకు ఇక్కట్లులేకుండా చేస్తామని హామీఇస్తే, కుంపిణీసర్కారు ఇక్కడిగొడవే పెట్టుకోదు. మహారాజులాగా మీ కార్యకలాపాలు మీరు చూసుకోవచ్చు అని చెప్పుతుంది. ఇక్కడ సంక్షోభం చెలరేగుతుందేమో అని భయం కుంపిణీవారికి.'

బోపణ్ణ ,లక్ష్మీనారాయణయ్యకు "అటువంటిసందర్భం వచ్చినప్పుడు మీకు తెలియ జేస్తాం అని చెప్పుదాం అయ్యవారూ!' అని చెప్పాడు.

లక్ష్మీనారాయణయ్య సమ్మతిసూచకంగా తల త్రిప్పాడు.

బోపణ్ణ దొరకు 'కొడగులో ప్రస్తుతం మీరు చెప్పేప్రసక్తి ఏమీ పుట్టివుండలేదు. అటు వంటిదేదైనా తటస్థించితే మీరు మిత్రులై సాయపడవచ్చు. మీకైతే ఇక్కడ 'ఏ విషయం లోనైనా సరే శోక్యం కలిగించుకోవడం మాకు సమ్మతం కాదు. ఇందునుగురించి ఏ సందే హమూ ఉండకూడదు' అని చెప్పాడు.

'మీ మాటలు మాకు తిరిగి చాలా సంతోషాన్ని కలిగచేశాయి. ఈ నిష్ఠ, ఈ నిశ్చయమే ప్రజలను కాపాడటానికి వున్నది. మాతో ఇంత నిష్కపటంగా మాటలాడిందానికి మా నమ స్కారాలు స్వీకరించండి' అనిచెప్పి దొర వాకిలిదగ్గరవున్న సేవకునికి సైగచేశాడు. అతడు తెచ్చిన ఆకు వక్కలు, పూలగుత్తిగల పళ్ళెం పక్కనపెట్టుకొని మొదట లక్ష్మీనారాయ ణయ్యకు ఆ పిమ్మట బోపణ్ణకు ఆకులు వక్కలు పూలగుత్తి ఇచ్చాడు. మంత్రులు సంతో షంగా వాటిని స్వీకరించి అయనకు నమస్కరించి అనుజ్ఞతీసికొని బైటకు వచ్చేశారు

# 90

చెన్నబసవన్న మర్నాడురోజు దొర అతన్ని రాజమర్యాదతో స్వాగతించి అత్యంతమైన ఆత్మీ యతాభావాన్ని ప్రదర్శిస్తూ మాటలాడాడు. 'తాము కొడగులో చాల గొప్పవంశానికిచెందిన వ్యక్తులని విని ఉన్నాం అందుచేతనే లింగరాజుగారు ఆదేపనిగా వెదకి తమ అల్లుడుగా చేసి కొన్నారట.'

'ఔను దొరగారూ మా వంశం కొడగుదేశంలోనే చాలా ఉన్నతమైన వంశం. మంత్రి బోపణ్ణగారున్నారే, వారివంశంకంటెనూ మావంశం గొప్పది.'

'అదే మేమూ విన్నసంగతి. మేము బెంగుళూరికి వచ్చిందిమొదలు, మిమ్మల్ని చూడ వలెననే కోరికతోనే ప్రతీక్షిస్తున్నాం. అది ఇప్పటికి ఒనగూడింది. మాకు ఎంతోసంతోషం.'

'మాకూ చాలా సంతోషంగావుంది తమరిని దర్శించడానికి. మీకు వెనకవున్న పెద్ద దొరను మేము చూశాం. వారికి ఒకటి రెండుసార్లు రెండు వినతిపత్రాలు వ్రాసుకొని వున్నాం. తమకీ అటువంటిపత్రం ఒకటి వ్రాసుకొనివున్నాం.'

'ఔను. తాము వ్రాసినప్రతి ఒక్కపత్రంలోని విషయాలూ, మేం చక్కగా గమనిస్తూనే వచ్చాం. తమకీ, రాజుగారికీ మధ్య కొంచెం మనస్తాపం ఏర్పడిందని మాకు తెలుసు. అందుకు

లన్న తర్వాత ఏదైనా కొంచెం ఎగుడుదిగుడైతే ఇట్లాగే వుంటుంది. ఇప్పుడు అంతా చక్కబడిందని వింటున్నాం. చాలా సంతోషం.'

'సరిపోవడం ఎక్కడిదీ సార్! మేం మీకు పత్రం వ్రాసిస్తున్నాం అని ఆయనకు మీరు తెలియజేసివుంటారు. అంత కొంప ఏం మునిగిపోయిందనుకున్నారోగాని దెళ్లెల్ని మా దగ్గరకు పంపించేశాడు. అంతా ఎక్కడ కుదుటపడింది?'

'అట్లయితే ఇంకా చక్కబడవలసినవి ఏముంది? ఏమైనప్పటికీ మేము పరాయి వాళ్ళం. మీ కుటుంబవిషయాల్లో తలదూర్చడం మాకు తగనిపని. కాని రాజాగారు మనకు కావలసినవారు, రాజభవనం అల్లుడు అనేకారణంగా మీరూ మాకు కావలసినవారే. అందుచే రెండువర్గాలకు మిత్రులమైవుండి, మేము చేయవలసినసేవ ఏమైనావుంటే చెల్లించడానికి మేం సిద్ధమై వున్నాం. మిత్రులమధ్య వైమనస్యం వుండటం మాకేమీ సుఖప్రదమైన విషయం కాదు. కానైతే వైమనస్యం పుట్టినప్పటికీ, మా మనస్సుకు ఎంత ఆందోళనగావున్నా, దాన్ని సహించుకుంటూనే ఆ వైమనస్యాన్ని నివారించడానికి యత్నించడం మా కర్తవ్యమని మే మెరుగుదుము.'

'ఎవరూవచ్చి బాగుచేసేరోగంకాదు ఇది సార్! మా రాజాగారికి ఇంక కుదురు రావట మనేది కల్లోమాట.'

'తాము ఇంతగా ఆశాభంగంపొందడం మాకు మనఃక్లేశాన్ని కలిగిస్తోంది. అటువంటి మనస్తాపం ఎందుకు వచ్చింది? మాకు చెప్పడానికి వీలయితే చెప్పండి.'

'చెప్పడానికనేగా వచ్చింది. చెబుతున్నాం వినండి. మొదటిమాట ఏమిటంటే మా మామ గారు కూతురికిచ్చిన ఆభరణాలలో సగానికిపైగా ఈయన తన ప్రాసాదంలోనే వుంచేసుకున్నాడు. మాకు ఇవ్వలేదు. ఆ వస్త్రాభరణాలు మా ప్రాసాదానికి రావాలి అని అంటే మేం వాళ్ళి అబద్ధం చెప్తున్నామని, ఇచ్చేదిలేదని అంటాడు.'

'సరే.'

'తండ్రిగారు కూతురికి అప్పంగొళచుట్టూ పదిగ్రామాలు జాగీరిచ్చారు. వారున్న నాలుగు రోజులూ, జాగీరు తిన్నగా నడిచింది. వారు కన్ను మూసింతర్వాత జాగీర్దారీ బందైంది. రాజభవనం బిడ్డా, అల్లుడూ, ఇద్దరమూ 'దారినపోయే దానయ్య' లయ్యాం. పదియేళ్ళు ఈవిధంగా నడిచాయి. ఏటేటా వెయ్యి [1]హొన్నులు మాకు రావాలిసింది. రాజభవానికి చెల్లింది.

'తెలిసింది.'

---

1. హొన్ను = బంగారు నాణెం: The Gold coin called a Pagoda అని బ్రౌణ్యం, వరహా అని మరికొందరు.

'వెనక నాలుగుసంవత్సరాలు, పోయిన రెండేళ్లు చెల్లెలు రాజభవనంలో చెఱసాలలో వుంచబడ్డది. రాజుగారు శివాచారపరులని ప్రతీతి. శైవాచారంలోని కట్టుదాటునూ, దేనినీ వారు పాటించరు. శివాచారానికి ఆయన ప్రవర్తనకు అజగజాంతరం. తాగివున్న సమయాల్లో ఆయన చెల్లెలితోనైనా సరే ఎట్లా ప్రవర్తిస్తాడో కష్టం. చెల్లెలు అక్కర్లేదు. చెల్లెలి పెనిమిటి అంతకుముందే అక్కర్లేదు. మాకూ కావాలిసినంత బలగముంది గనుక ప్రాణాలతో మమ్మల్ని ఉండనిస్తున్నాడు. లేకుంటే మేం బ్రతికి బట్టగట్టి నేలమీద నడిచేదిలేదు.'

'తమరు చెప్పినట్లు ఈ విషమపరిస్థితిని చక్కజేయడం కొంచెం కష్టమే. తమరు ఏం చేయాలని ఆలోచిస్తున్నారు?'

'మేం చేసే ఆలోచన మీకు తెలియజేయడానికిముందుగా మీరు మాకు సాయం చేస్తామని మాట ఇవ్వాలి. లేకుంటే మిమ్మల్ని నమ్మి మేం మామాట చెప్పడం, మీరు రాజుతో మంచి పెంచుకోవడానికి, ఆమాట అక్కడ చెప్పడం, దాంలో గుండెల్లోని నంజు తలకెక్కి మేం చెడడం. తలప్రాణాలు తోకకు రావడం.'

'తమకు ఆ శంక రవ్వంతైనా వద్దు. మా అధికారంలో వున్నంతవరకూ మాట ఇస్తున్నాం. అధికారస్థానంలో వున్నప్పుడు మాకు ఎవరైనా చెప్పినమాట వారిమధ్య మా మధ్య ఉండవలసిందే. ప్రతికక్షులకే కాదు, అయినవాళ్ళకుకూడా మేం అటువంటిసంగతులను చెప్పడం జరుగదు. అటువంటి నమ్మకం లేకపోతే మేము జనులకు కష్టసమయాల్లో సహాయం ఎట్లా చేయగలం? మీరు లోగడ చెప్పినమాటలు, ఇహముందు చెప్పబోయే మాటలు, ఇవన్నీ మా మీ మధ్య అతిరహస్యంగా వుంటాయి. మా దగ్గిర సహాయకులకు మేం రహస్యవార్తలు చెప్తూవుంటాం. రహస్యంగా ఆజ్ఞలు ఇస్తూవుంటాం. మేం పరస్పరం మాటాడుకొనేది ఒక్కతృణమైన బైటపడితే ఈ మనుష్యులు మాలో బ్రతికివుండలేరు. దీనిని మీరు నిశ్చయంగా తెలుసుకోవాలి.'

'మంచిదిసాహెబ్! అల్లా అయితే చెప్తాం వినండి. మా మామగారు కొడుకును రాజుగా చేయాలనిచూస్తే జనం ఆయన వద్దు అని చెప్పారు. మీసంతానమే కావాలనుకుంటే మీ అమ్మాయిని సింహాసనంమీద కూచోబెట్టండి అని చెప్పింది. అన్న వుంటూవుంటే చెల్లెల్ని గద్దెమీద కూచోబెట్టడం మామగారికి ఇష్టం కాలేదు. తక్కరుతోడ మాటలాడి నచ్చజెప్పి, ఒక్కసంవత్సరంచూసి, ఆపైన కావాలంటే మా అమ్మాయినే రాణిగా చేయండి అని ఒప్పించారు. ప్రజలు దానికి ఒప్పుకున్నారు. ఆయన కళ్లుమూశారు. ఆడపిల్లైపుట్టి, భర్తకంటె హెచ్చుగా ఈమె నన్ను రాజ్యభ్రష్టు చేయవచ్చునని అన్న చెల్లెలిమీద మొదటినుంచీ పగబట్టి సాధిస్తూనేవున్నాడు. ఈయన పగబట్టితే మాకేం నష్టం. ఈయనకు కడుపుమంటగా వుంది. అయితే ఇప్పుడేం కావాలిసివుంది? ప్రజలకందరికీ విసిగెత్తిపోయింది. ఈయనచస్తే ప్రజకు దుఃఖం లేదు. ఈయన్నుతప్పించి చెల్లెలు సింహాసనం ఎక్కితే సరే అంటారు. కానైతే

ఊరిలో వుంచి, జగడం రేపడం మాకు ఇష్టం కాదు. ఇటు నలుగురూ, అటు నలుగురూ నిలబడి ఒకళ్ళనొకళ్ళు పొడుచుకొని రక్తం కాల్వలు గట్టిస్తే మాకు ఒరగిందేమిటి? అందు కనే మేం మీతో చెప్పడం. కొడగుప్రజలు వాంఛించేది ఇది - ఈ రాజు పరిపాలన ముగిం చండి అని.

మీరు కుంపిణీ సర్కారువారి పక్షకునకిగల అధికారులు. మైసూరును కైవసం చేసు కొన్నారు. మీరు ఈరాజుతో కచ్చితంగా చెప్పండి. 'పన్నాలుగు సంవత్సరాలు ఏలావు చాలు; గద్దెనుంచి దిగి మీ తండ్రి వాంఛించినట్లు మీ చెల్లెలిగార్ని కొంతకాలంపాటు ఏలనివ్వండి' అని. ఈరాజు మీమాటను తోసిపుచ్చలేడు. సింహాసనం వదిలేస్తాడు. చెల్లెలు సింహాసనానికి వస్తుంది. మిమ్మల్ని సరిగా చూసుకొంటారు. దొడ్డ వీరరాజు ముప్పైసంవత్సరాలక్రిందట ఏవిధంగా మీకు చేదోడు వాదోడుగా వున్నారో ఆచేవిధంగా ఈమెకూడా మీకు కుడిభుజంగా నడచుకోగలదు. మీ చేతిలోవున్న మైసూరుకు మా చేతికివచ్చిన కొడుగుకు ఏమీ తేడాలేదని మీకే తోస్తుంది. అవకాశ మిచ్చిచూడండి.'

'మీరు స్పష్టంగా ధైర్యంగా మాటాడారు. మాకు చాల సంతోషం. కాని ఈ సంద ర్భంలో మేము ఇంకోవిషయాన్ని ఆలోచించాల్సి వుంది. మీ పత్నిగారిని రాణిగా చేయాలని మేం రాజుకు సూచిస్తే, వారినుంచి మీకేమైనా హాని కలగవచ్చునే?'

'ఆ! అదీ నిజమే.'

'మరి ఆ ప్రమాదాన్ని ఎల్లా తప్పించడం?'

'మాకు వెనక అండగా చాలామంది ప్రజలున్నారు. అంత భయపడాల్సింది లేదు.'

'మీరు ధైర్యశాలురు. అందులో సందేహం లేదు. కాని మీరు పోట్లాడవద్దంటున్నారే? మా సూచనతెలిసి ఈ రాజు మిమ్మల్ని శిక్షించడానికి పూనుకొంటే మీరు ఆయనను విరో ధించాల్సివుంటుంది. అంటే కయ్యం కావాలిసివుంటుంది. అందులో తలకాయలే ఎగిరి చక్కా పోవచ్చు. వ్యవహారం సుఖసుఖాల తేలేటట్లు లేదు.'

'మీ సలహా ఏమిటి మరి?'

'మే మేమీ సలహా ఇవ్వం? ఇక్కడే దగ్గిరలోనేవుంటే ఈయన శిక్షించడానికి ప్రయత్నించవచ్చు. తప్పించుకోవడానికి ఏం చేయాలో మీరు ఆలోచించండి.'

'దగ్గిరలోవుండం. అంతేగా?'

'ఏం చేస్తారు?'

'నెలా రెండునెల్లలపాటు కొడగుదేశం వదిలేసి వేరేచోటికి పోవచ్చు.'

'తమరు నిర్భయంగా వేరేచోట ఎక్కడ వుండవచ్చునో, సరిగా ఆలోచించారా?'

'మేం నంజనగూడుకు వెళ్ళి వద్దాం అనుకుంటున్నాం.'

'నంజనగూడులో తగిన రక్షణ వుందా?'

ఎప్పటికివలెనే దేశంలోని పదిమంది పెద్దలు మడకేరిసీమ దేవస్థానంలో చేరి జ్యోతిష్కు విచే ఆయుధపూజకు ఒక ముహూర్తాన్ని ఏర్పాటుచేసుకొన్నారు. ఏ దిక్కునుంచి వేట ఆడాలి, దాని నత్ఫలితం ఏ నక్షత్రంలో పుట్టినవానికి, [1]"హాలెమర"ను ఏ ముహూర్తంలో నరకాలి, మరి ఏ ముహూర్తంలో వారు పీకాలి అనేవిషయాల్ని అన్నింటినీ జ్యోతిష్కుడు నిశ్చయించాడు.

ఉదయానికల్లా ప్రతిఒక్కడూ తుపాకి, కత్తులూ, కటార్లూ, ఈటె, బల్లెం మొదలైన తనదగ్గిరనున్న ఆయుధాలవన్నింటిని తీసికొని చక్కగా తోమి శుభ్రంచేసి ఇంటి సొమ్ముల గదిలో కొందరూ బియ్యంలో కొందరూ పెట్టివుంచారు.

వంట అయినపిమ్మట ఆయుధాలకు మొట్టమొదట నైవేద్యం. వీరబాలురు తమ ఆయుధాలను ఎదురుగుండా ధూపంవేసి వాటికి గంధంబొట్టులు పెట్టి, ఎదుటనున్న అరటాకులో వంట పదార్థాలన్నింటినీ వడ్డించి ఆయుధదేవతకు నైవేద్యం పెట్టారు.

ఆ పిమ్మట ఇంట్లోవాళ్ళ భోజనం. కొంచెం విశ్రమించి వీరులందరూ కొత్తదుస్తులను కట్టుకొని మైదానంలోకివచ్చి ఆయుధాలముందు నిలబడ్డారు. ఇంటిపెద్దలు ఒక్కొక్కడూ తుపాకి తీసికొని తమచేతిలోపట్టుకొని పూర్వంనుంచీ అనూచానంగా వస్తూవున్న సూత్ర వాక్యం పఠించి చిన్నవాళ్ళల్లో అందరికంటె పెద్దవాడైనవానికి ఇచ్చారు. అతడు ఒక్కొక్కడూ ఈ పెద్దవాని కాలుపట్టుకొని తుపాకిని తీసుకొన్నాడు. ఆ పిమ్మట వయస్సు ననుసరించి మిగిలినవారూ, పెద్దలనుంచి ఒక్కొక్క తుపాకి తీసుకొన్నారు.

నూరుబారల దూరంగా ఓ వగ్గానికి గజం, గజంమూరంలో ఇరవైటెంకాయలు కట్టి తూగాడజేశారు. తుపాకీలు పట్టుకొన్నవారు ఒకవరుసలో నిలబడి, ఆ కాయలకు గురిపెట్టి కొట్టాలి. ఈ పందెం చాలాబాగా నడిచింది.

నూటికి తొంభైమంది లక్ష్యభేదం చేసినవాళ్ళే. మిగతావాళ్లు అభ్యాసంచాలని చిన్న పిల్లకాయలు, లేదా మిక్కిలి వయస్సైపోయిన ముసలాళ్ళు.

అప్పుడే ఏమంత వయస్సు మీరిపోని ఉత్తయ్యతక్క పిల్లవాంద్రబలవంతంమీద తానూ తుపాకిపేల్చడానికి వచ్చాడు. 'ఏమ్రా! మీ వయసుకుర్రవాండ్రు నన్ను నవ్వులాటలు పట్టించాలని చూస్తున్నారా? పులిని చంపానంటావే కాయికొట్టు చూద్దామనకండి. మీలాగా వయస్సులో వున్నప్పుడు నేనూ అప్పుడు నా వయస్సులో వున్నవాళ్లనుచూసి నవ్వింది కద్దు. రాలుదాకును చూస్తే చిగురుకు నవ్వు' అన్నాడు.

ఎత్తేటప్పుడు చేయి వణకుతూవున్నా గురిమాసి తుపాకి మడమ గుండెకుపెట్టి ఒత్తినప్పుడు ముసలాడు ఉక్కుతో పోతపోసిన విగ్రహంలా నిలబడ్డాడు. మూడుసార్లు గురిపెట్టి

---

1. బలి పాడ్యమినాడు అనగా కార్తిక శుక్ల ప్రతిపత్తున వృక్షవిశేషం తెచ్చి నరకుట ఆచారం.

వేరువేరుగా మూడుకాయలను తుపాకిగుండ్లతో కొట్టాడు. వెనక కొదిగివున్న జనం, అతిథులూ అతని కౌశల్యాన్నిచూసి ముగ్ధులై జయఘోష గావించారు. ముసలి: 'చూశారా మరి! ఈ మీసం తమాషాకు పెంచిందికాదు. నేనూ పాతమనిషిని. నా తుపాకీ పాతదే' అని నవ్వాడు. పిల్లలూ విరగబడి నవ్వారు. 'మూడు నీ తుపాకి, ఈ తుపాకి అంత మంచిదికాదు' అని ముసలాడుప్రక్కన నిల్చున్న ఒక్కయువకుని తుపాకితీసుకొని సరిగా గురిచూడకుండా రెండుకాయలమధ్యను కొట్టి తుపాకిని వెనక్కు ఇచ్చేశాడు.

అతని ప్రదర్శనంచూసి జనం నవ్వుతూవుంటే ముసలాడు 'దిష్టి తగులకూడదు అని ఓటి ఈవిధంగా కొట్టాలి. గురితప్పక దిష్టి తగిలేటట్లు కొట్టారో నాకుమల్లేనే ముసలాళ్లు అయిపోతారు, తల నెరిసిపోతుంది, చూసుకోండి' అని తనహాస్యానికి తనకే నవ్వువచ్చి సంతోషపడుతూ, తిరిగి తనతోటి ముసలివాళ్ళతో వచ్చిచేరాడు.

దుబాసి తనప్రక్క బసవన్నను ఉంచికొని ఈ ఆట వివరాలన్నీ తెలిసికొని అతిథులకు అంతా వివరించాడు. పెద్ద తెల్లదొర 'ఈ జనం పెద్దలు చిన్నలను కలిపెట్టివుండటం, చిన్నలు పెద్దలను పాల్గొనచేయడం చాలా బాగుంది' అని పొగిడాడు. ఉత్తయ తక్కనుగురించి " The old man is wonderful! How cheerful an old man can be! And he can handle a gun! Each time he shot off in the flicker of an eye and hit the nut. He is marvellous " అన్నాడు.

ఆటుపిమ్మట నూరుగజాలదూరంలో రెండు మగ్గాలుకట్టి జనం ఒకవైపు పంక్తిగా నిలిచి ఇంకోవైపుకు పరుగెత్తేపందెం, అల్లాగే ఓ పెద్దగుండు ఎంతదూరం విసిరివేయవచ్చునసే పందెం ఒకటి, కత్తిసాము ఒక పందెమూ నడిచాయి. అన్నిపందెములలో అందరికంటె ఎక్కువగా గెలుపొందినవాడు పడవాలు ఉత్తయ్య. వేటలో అతని చాతుర్యాన్నిచూసి సంతోషపడ్డ అతిథులు, అతడే లక్ష్యభేదనంలో, గుండు విసరడంలో, కత్తిసాములో మొదటివాడుగా గెలుపొందడంచూసి అతణ్ణి వేనోళ్ళ ప్రశంసించారు.

ఉత్తయ్య తక్క: 'అరే తమ్ముడూ ఉత్తప్పా! నువ్వు ఇంత నేర్పరివి కావడానికి కారణం ఏమిటో తెలుసా?' అని అడిగాడు. యువకుడు: 'చెప్పుతాతా! తెలుసుకుంటాను' అన్నాడు.

'నీకు పెట్టింది నాపేరు.'

'ఔను తాతా! [1]'బిద్ద' అని పెట్టివుంటే ఇట్లా గురికొట్టడం చేతయ్యేదికాదు.

వాళ్ల ఈ వినోదాన్ని అతిథులకు అర్థం చెప్పారు.

---

1. 'ఉత్త' 'బిద్ద' శబ్దములలో శ్లేష. బిద్ద పడిపోయెను. పడిపోయినవాడు గురిచూసి కొట్టలేడు అని స్వారస్యం.

పెద్దదొర : 'ఈ ముసలివాడు, ఈ యువకుడు, ఇద్దరూ చాలా శక్తిమంతులు, సజ్జనులూకూడ; వీళ్ళకు మేము ఏదైనా గౌరవం చెయ్యాలి అని వాంఛిస్తున్నాం. చెయ్యవచ్చునేమో రాజుగారిని అడగండి' అని బసవన్నకు తెలిపాడు. బసవన్న ఈసంగతి చెప్పినప్పుడు రాజు చాల వేసటపడి 'ఏమంత పొడిచేశాడు ఈ ముండలు! రెండూ రెండు మదమెక్కిన అబోతులు. వీళ్లూ కొవ్వెక్కి ఏడుస్తున్నారు. వాళ్ళు కొవ్వెక్కి తన్నుకొంటున్నారు' అన్నాడు.

బసవన్న రాజుతో 'ఇచ్చుకోనివ్వండి, పోనీండి ప్రభూ! మనం వద్దన్నామని ఎందు కనిపించుకోవాలి?' అన్నాడు.

రాజు అతనితో 'చేయదలచిందిచేసి చావమను' అన్నాడు.

పెద్దదొర అప్పుడే వాళ్ళను గౌరవించాడు. పిమ్మట పెద్దదొర 'మావాళ్ళు గురికొట్టడం కొంచెం చూస్తారా?' అని ప్రశ్నించాడు. రాజు 'కానియ్యండి' అన్నాడు. పెద్దదొర రెండు గుళ్లు వదిలాడు. ఒక్కటి కాయకు తగిలింది. ఒక్కటి తప్పిపోయింది. హాకర్, పార్కర్, రెండేసిగుళ్లు వదిలారు. వాళ్ళూ ఓసారి గురికొట్టగలిగారు, మరోసారి తప్పిపోయారు. కెప్టెన్ దొర మూడుసార్లు కొట్టాడు; మూడుసార్లూ గురికొట్టేశాడు. ఆయన చాల తెలివైనవాడని అందరూ మెచ్చుకొన్నారు.

తర్వాత కొడగు యువకులు గోదాలోదిగి కుస్తీలుపట్టారు. జతలు జతలుగావచ్చి వాళ్ళు అయిదయిదునిమిషాలు పేచీలుపట్టడం చూడటానికి చాలా అందంగావుంది. ఈ మల్లయుద్ధంలో ఒకళ్లు గెలవడంగాని మరొక్కరు ఓడిపోవడంగాని ముఖ్యమైనవిషయం కాదు. ఇద్దరూ తమశరీరాన్ని పొందికగాచూపించడం ముఖ్యమైనవిషయం. ఒకడు మరొకడిని చిత్తుచేసినా, అతనిని పట్టుకొని లేపి ఎత్తుకొని కౌగలించి ఆతర్వాత ఇద్దరూ ఒకళ్ళచేయి ఒకళ్లు పట్టుకొని నడచిపోయేవాళ్ళు. ఈపద్ధతినికూడా పెద్దదొర మరిమరీ మెచ్చుకొన్నాడు.

తెల్లవాళ్ళు మనల్ని మెచ్చుకుంటున్నారే అని కొడగులకు ఎక్కడలేని ఆనందం. మిగతాప్రజలకుకూడ ఈ పరాయిదేశంవాళ్లఎదుట మనవాళ్ళు బుద్ధిమంతులనిపించుకోవడం గర్వకారణమైంది. మొత్తంమీద మిగతా కార్యక్రమాలన్నింటికంటె అతిథులకు ఆయుధపూజనాటి ఈ బయలు కార్యక్రమం ఎక్కువగా నచ్చింది. సంతోషాన్ని చేకూర్చింది.

# 92

ఆరోజురాత్రి అతిథులకు రాజభవనంలో విందుభోజనం.

అతిథులువచ్చేసరి రాణి కూతురుతోపాటు వాళ్ళను రాజుగారి ఆసనకక్ష్య సమ్ముందగ్గర స్వాగతించింది. కష్యరు ఓప్రక్క తెల్లవాళ్ల పద్ధతిప్రకారం రెండుబల్లలనువేసి వానిచుట్టూ కుర్చీలుంచి భోజనానికి ఏర్పాటుచేశారు. రాణి అతిథులను కూచోమనిచెప్పి, ఆడపిల్లలు కూచున్నచోట ఓ నిమిషంపాటు కూర్చొని దుబాసిద్వారా రాజభవనంపక్షాన స్వాగతం చెప్పించింది. అప్పటికి రాజుగారు వచ్చారు. అతిథులను చూడడం ఆయనకు అప్పగించి, కూతుర్ని తండ్రితోపాటు కొంచెంసేపుండమ్మనమని రాణి లోపలికి వెళ్ళిపోయింది.

రెండునిమిషాలు అతిథులు వేటనుగురించి, క్రీడావినోదాలనుగురించి మాటాడుకొన్నారు. పార్కరు రాజుతో 'తమరు పిస్తోలుతో చాల చక్కగా గురికొట్టగలరటే' అని జిజ్ఞాసగా అన్నాడు. రాజు 'అదంతా పాతకాలంమాట. వయస్సులో మేం రెండువందల ఏనుగుల్ని చంపాము. పట్టుకొన్నవాటిసంఖ్య మరి రెండునూర్లు' అన్నాడు.

అందరికీ ఆశ్చర్యంవేసింది. 'ఇప్పుడు కొంచెంగానైనా నానరే తమ నేర్పు చూపరాదా?' అని లూసి ప్రశ్నించింది.

రాజు కొంచెం దూరంగానిలబడ్డ బసవన్ననుచూసి 'కొంచెం చేతివాటా చూపించనా?' అని అడిగాడు.

బసవన్న 'చేయి నొప్పిపుట్టకుండావుంటే చూపించండి దొరా!' అన్నాడు.

'ఆ రాగిపళ్ళెం తీసుకునిరా ఇక్కడికి' అని రాజు బసవన్నకు ఓ పళ్లెం చూపించాడు. బసవన్న ఆ పళ్లెం తేగా, దానిలో ఈ నాలుగుచోట్లా బొగ్గుతో గుర్తుపెట్టించి తెప్పించు అని చేతితో నాలుగుచోట్ల దానిమీద చూపించాడు. 'నా పిస్తోలు నాలుగునింపి, తే' అన్నాడు.

పళ్లెంలో బొగ్గుతో గుర్తుంచిన మూడుస్థలాలకు, మధ్య ఒక్కచోట చక్రాకారంగా గుర్తు పెట్టి తెచ్చారు; పిస్తోళ్ళూ వచ్చాయి. పదిగజాలదూరంలో పళ్లాన్ని గోడకు ఆనించి ఉంచు అని రాజు బసవన్నకు ఆదేశించాడు. రాజు తను కూచున్నచోటున కొంచెం వెనక్కుజరిగి మూడునిమిషాలు కూచున్నాడు; ఓ పిస్తోలుతీసికొని దట్టవైపు గురిచేసి ఒడలురిక్కించి కొట్టాడు. గుండు పై మచ్చపై సరిగా పడింది. పళ్ళెంతిరిగి గోడకు సరిగా ఆన్చు అనిచెప్పి రెండోసారి ఎడంవైపు మచ్చ, మూడోసారి కుడివైపు మచ్చ, నాలుగోసారి మధ్యలోనిగుర్తు గురితప్పకుండా కొట్టేశాడు. అతిథుల ఆశ్చర్యానికి అవధులు లేవు. వీరరాజునుచూస్తే ఆయనచేతిలో ఇంతశక్తి, కంటిలో ఇంతటి లక్ష్యసిద్ధి ఉంటుందని ఎవరికీ తోచదు. పెద్దదొర "This beats anything I conld have thought" అన్నాడు.

రాజు బసవన్నకు 'ఏమైనా మంత్రించావా ఏమిటి? నాలుగుగుర్ని పోటీగా పడ టానికి!' అన్నాడు. బసవన్న 'అది ప్రభువులచేతిలోని మంత్రం ప్రభూ!' అన్నాడు.

పార్కరు: 'వీళ్ళ రాబిన్ హుడ్ సాయంకాలం చాలా బాగా కుస్తీపట్టాడు. మన కెప్టెన్ సాహేబు కుస్తీ బాగా సాధనచేసినవారే. వీళ్ళిద్దరూ మల్లయుద్ధంచేస్తే చక్కగా వుంటుం దంటోంది లూసి' అని పెద్దదొరకు చెప్పాడు.

'పడవాలు ఉత్తయ్యకు కబురుచేస్తే దీన్ని ఏర్పాటుచేయవచ్చు' అని పార్కరు చెప్పాడు. దొడ్డదొర ఒప్పుకొన్న వెంటనే ఉత్తయ్యకు కబురుపెట్టారు.

ఉత్తయ్య వచ్చాడు. మల్లక్రీడ నడిచింది. కెప్టెన్ దొర పశ్చిమశైలిలో కుస్తీ పట్టు తాడు. ఉత్తయ్య భారతదేశంలో దాక్షిణాత్యపద్ధతికి అలవాటుపడ్డ జెట్టి. ఏమైనా పట్లుపట్టడం చూడటానికి చాలా ముచ్చటగా వుంది. రాజు బసవన్నతో 'దొరను కింద పడేయవద్దని చెప్పు' అన్నాడు. ఉత్తయ్య ఈసంగతి తెలుసుకొన్నాడు. తాను పడటానికి వీలైనట్లుగానే పట్లు పట్టాడు.

కాప్టెన్, ఉత్తయ్య ఇద్దరి శరీరయష్టి చూడటానికి ఎంతో చక్కగా వుంది. ఒకటి ఎక్కువ ఒకటి తక్కువ అనడానికి వీల్లేదు. పట్లు పట్టేవిధం వేరువేరు. కాని దగ్గిరదగ్గిర సమానమైన శక్తిమంతులైన వాళ్ళిద్దరి మల్లక్రీడ అతి రమణీయంగా దర్శనీయంగా వుంది.

పెద్దదొర: 'మహారాజుగారు సమ్మతిస్తే వీళ్ళిద్దరకూ ఒక్కొక్క పారితోషికాన్ని ఇవ్వాలి' అన్నాడు.

రాజు: 'అట్లాగే' అని అనుమతించాడు,

'ఇటువంటి సన్నివేశంలో బహుమానాలను ఆడపిల్లలలో ప్రముఖులైనవారిచేత ఇప్పిం చడం మా ఆచారం. అది తమకు తప్పుగా తోచకపోతే మహారాణిగారో, రాజకుమారో ఇస్తే బావుంటుంది.'

రాజు క్షణం ఆలోచించి 'రాజకుమారి ఇస్తుంది' అన్నాడు.

'అప్పుడే మేము మహారాజుగారికి ఓ బహుమానం ఇవ్వాలని కుతూహలపడుతున్నాం.'

రాజు అందుకూ సమ్మతించాడు. రాజకుమారి ఆడపిల్లల గుంపులోంచివచ్చి ఉత్తయ్యకు, కాప్టెన్ దొరకు, రాజుకు పారితోషికాలు ఇచ్చింది.

ప్రాయంలోని పడుచుపిల్ల. ఇటువంటిపని కెన్నడూ అలవాటుపడిందికాదు. యువకులు తన్ను ప్రేమించే వయస్సువాళ్ళు. యువతి వాళ్ళకు పారితోషికాలు బహూకరించడంలో కొంచెం సంభ్రమం, కొంచెం సంకోచం కలిసివున్న ఒకానొక వింతసొబగూ, సోయగమూ ఒలకబోసింది.

ఉత్తయ్యమనస్సులో ఆమెనుగూర్చి చాలాకాలంగా కుతూహలం దాగుడుమూత లాడుతూ వుంది. కాప్టెన్ ఈమెను పెండ్లాడితే ఎంచక్కగావుంటుందో అనుకున్నాడు. రాజు కైనా తనకూతురు వ్యక్తిత్వం, వొడ్డుపొడుగూ కను విందైంది.

# 93

మరుదినం ఉదయం అతిథులలో చిన్నవాళ్ళు రాజభవనంలోని ఆభరణాదికంచూసి ఆనందించారు.

మడకెరె రాజభవనం ఆభరణశాల మొదటినుంచీ అపూర్వమైన రత్నాలకు, ఆకరం. హాలేరు, హొరమలెకుచెందిన రెండు రాజకుటుంబాల రాజులు తమతమ రాణులకై సంపాదించిపెట్టిన వందలకొలది నగలు అందులోవున్నాయి. వాటిలో కొన్ని హొరమలె రాజవంశం నశించినపిమ్మట హాలేరు రాజవంశానికి ఆస్తిగా వచ్చాయి. ఈ ఆభరణాల్లో ఏవి ఎక్కడివి, ఎక్కడినుంచి వచ్చాయి అనే వివరాలన్నీ తెలిసిన మనుష్యులున్నారు. హాలేరువంశం హైదరుచేత ఓడిపోయి, రాజకుమారులు చెఱసాలలోవద్ద రోజుల్లో రాజభవనం ఆభరణాల పెట్టి చిక్కణ్ణసెట్టి పెత్తండ్రి అధీనంలో భద్రం చేయబడ్డది. దొడ్డ వీరరాజు తిరిగి రాజైన తర్వాత అవి తిరిగి రాజభవనానికి వచ్చిచేరాయి. దొడ్డ వీరరాజు పరిపాలనలో భండారానికి అనేకములైన ఆభరణాలు వచ్చిచేరాయి. లింగరాజు రోజుల్లో అట్టి వస్తువాహనాలు పోగుపడలేదు. ప్రస్తుతం జరుగుతున్న ఏల్బడిలో రాజ్యవంశంలోని అన్నివర్గాలకుచెందిన ఆడపెల్లల ఆభరణాలూ, భాండారానికి వచ్చిచేరాయి.

దొడ్డ వీరరాజుకూతురు దేవమ్మాజి తన స్వంతానికి చేయించుకొన్న నగలే ఎన్నో వున్నాయి. పినతండ్రి లింగరాజుకుకూడ ఇవ్వకుండా పట్టుబట్టి ఆమె వాటినన్నింటిని తన దగ్గిరే వుంచుకొంది. చిక్కవీరరాజు రాజ్యానికి వచ్చినతర్వాత అవి రాజభవనానికి రావాలి అని చెప్పంపించాడు. ఆమె ఒప్పుకోలేదు. రాజు ఆమె చనిపోయింతర్వాత ఆభరణాలన్నింటినీ కైవసం చేసికొన్నాడు.

అతనితండ్రి లింగరాజు తనచెల్లెలు దేవమ్మాజికి హరణంక్రింద ఇచ్చిన ఆభరణాలలో ఎక్కువభాగం అతడు బలాత్కారంగా ఇప్పటికీ రాజప్రాసాదంలోనే పెట్టివుంచాడు.

నగలనుచూచి మెచ్చుకొన్న అతిథులు అవి ఎవరి ఎవరి శరీరాలలంకరించాయో, వాటిని చూసి ఎవరిగుండెల్లో ఈసుపొగలు సెగలై రేగిందో, ధరించిన ఎవరెవరిప్రాణాలు బలిగొన్నాయో, ఇదేమీ ఆలోచించలేదు.

రాజకుటుంబానికి చెందిన ఈ నగలతోబాటు, అతిథులు రాణీవి, రాజకుమార్తెవి, వస్త్రాభరణాలుచూసి మిగుల సంతోషపడ్డారు.

మగవాళ్ళకంటె లూసీ, హెలెన్ ఆశ్చర్యాన్ని, హర్షాన్ని వెలిబుచ్చడంలో ఆశ్చర్యం లేదు. వాళ్ళు హాకర్‌తో మెల్లిగా 'రాజునడిగితే ఈ పదకాల్లో ఒకటి రెండు మన కిస్తారేమో'

అని అంది. హాకర్: 'ఉపాయంగా అడిగిచూద్దాం. ఇస్తారులే. మొదలుకుంటావుండు' అన్నాడు.

ఆరోజురాత్రి భోజనానంతరం నాట్యం నడిచింది. కార్యక్రమానుసారం సమాప్తమైన పిమ్మట పెద్దదొర, అతనివెంటనున్న జనం, వసతిగృహానికి పోవాలని లేచారు. హాకిర్: 'రాజుగారు మనసీమనృత్యాలు ఇంకా రెండు చూడాలని వేడుక పడుతున్నారు. లూసి, హెలెన్ సోదరీమణులు, నేను ఆ నృత్యాలు ప్రదర్శించి రావచ్చునా?' అన్నాడు. పెద్దదొర 'అట్లాగే కానియ్యండి' అని అనుమతించాడు. అందరూ వెళ్ళిపోయారు. వీళ్ళుమాత్రం మిగిలిపోయారు.

క్రిందటిసారి వచ్చినప్పుడు లూసి హాకర్, రాజు సమక్షంలో ఓ మనృత్యాల్ని ప్రదర్శించారు. అవి తెల్లవాళ్ళల్లో ప్రచారంలోవున్న జానపదనృత్యాలు. వానిలో కొంచెం అశ్లీలధ్వని వుంటుంది. ఆ కారణంచేత అవి ఆ రుచివున్న మనుష్యులకు చాల అనుభవయోగ్యంగా, ఆస్వాదనీయంగా కానవస్తాయి.

రాజు, బసవన్న ఇద్దరే కూచునివుండగా, హాకర్, లూసి, హాకిన్ హెలెన్, లూసీ హెలెన్, రెండేసి నృత్యాలు ప్రదర్శించి రాజును సంతోషపెట్టారు.

ఈ నృత్యాల్ని వర్ణించడం ఔచితీశోభితంగా వుండదు. ఇక్కడ ముఖ్యంగా గమనించవలసిం దొక్కటే. రాజుకు చేకూరిన ఆనందం ఇంతంతని చెప్పడానికి వీల్లేదు.

బైలుదేరి వెళ్ళిపోవడానికి ముందు హాకరు బసవన్నతో మెల్లిగా 'లూసి, హెలెన్ వీరికి రాజుగారు ఒక్కొక్క ఆభరణం బహూకరిస్తే చాలా కృతజ్ఞంగా వుండగలరు' అని సూచించాడు.

రాజు వెంటనే 'ఏమిటా సంగతి?' అని అడిగితెలుసుకొన్నాడు. 'ముంపట ఎంత చక్కగా నాట్యం చేశారో! మనదేశం వేశ్యలు ఇంత సిగ్గువిడచి నాట్యం చెయ్యనే చెయ్యరు. పోయి ముందుకు రమ్మనమని చెప్పు. అడిగించి ఇచ్చిపంపిందాం' అన్నాడు.

# 94

మొదటనే ఏర్పాటుచేసినప్రకారం ఆరోరోజు మధ్యాహ్నం ప్యాది మేగ్‌లింగ్ మహాశయుడు రాజుగారిసభలో క్రైస్తవమతం గొప్పతనాన్నిగురించి సిద్ధాంతీకరించడానికిగాను శాస్త్రార్థం జరిగింది. ఈ శాస్త్రార్థం తన కిష్టంలేదని దీక్షితులు విన్నవించుకొన్నాడు. దొర దాప్ని పెద

చెవిని పెట్టారు. మైసూరినుంచి ఎవరినైనా సమర్థులైనవారిని పిలిపించండి అని రాజుకు దీక్షితులు సూచించారు. రాజు 'అది ఇంకోసారి కానీ; ఈసారి మన అయ్యోవారినే మాటాడనీ' అన్నాడు.

సభ చేరేటప్పటికి నగరంనుంచి జనంవచ్చి చుట్టూ చేరారు. ఆటకు ఎట్లాగో, వాదాన్ని చూడటానికికూడా జనంలో ఉత్సాహం రేకెత్తింది.

అతిథులందరూ వచ్చి కూచున్నతర్వాత రాజుగారు వచ్చేశారు. మోగ్‌లింగ్, దీక్షితులు అంతకుముందేవచ్చి సభామండపంమధ్యలో ఎదురుగా కూచున్నారు. పాద్రి శాస్త్రార్థం ప్రారంభించారు. 'మా గురువైన ఏసుక్రీస్తు స్థాపించినమతం మీ మతంకంటె శ్రేష్ఠమయిందని మేము చెప్తున్నాం. దాన్ని మీ రొప్పుకుంటే వాదమేలేదు. మీరు ఏమంటారు?'

దీక్షితులు: మేము మా మతాన్నిగురించే వాదించే అలవాటువున్నవాళ్లం కాము. మీ మతం శ్రేష్ఠమయిందని, మీరుచెప్పితే అది మీ ఇష్టం. దానికేమీ మా అభ్యంతరం లేదు. మా మతం శ్రేష్ఠమయిందని మేం నమ్ముతున్నాం. ఆ ప్రకారం మేం నడచుకొంటాం. దానికి మీరు అడ్డు తగులకూడదు.'

మామతం శ్రేష్ఠమని మేం చెప్పడానికి కారణం మిమ్మల్ని ఒప్పించి మిమ్మల్ని మా మతంలో చేర్చుకోవడానికి. మీరు ఉద్ధరింపబడటాని కిదే దారి. మీరు మామతాన్ని ఒప్పుకొంటే ఈ ప్రజలంతా మా మతాన్ని అంగీకరిస్తారు. క్రైస్తవగురువు దయవల్ల అందరూ ఉద్ధరింపబడతారు.'

'మేము కానీ, ఈ ప్రజలుకానీ, ఇప్పుడు నడచుకొంటున్నదారి వదలిపెట్టి వేరుదారికి రావలసినకారణం కనబడదు. ఎవరెవరు ఏ దారిలో ఉన్నారో, వారు ఆ మార్గంలోనే నడచుకోవడం ఉద్ధారహేతు వౌతుంది.'

'లోకేశ్వరుడైన ఒక్క భగవంతుని వదలిపెట్టి మీరు బహుదేవతలను పూజిస్తూవుంటారు. అందుచే ఉద్ధరింపబడటం అసాధ్యం. మా దేవుణ్ణి నమ్మితే ఉద్ధరింపబడటం సుకరం.'

మీరు దేవుణ్ణి లోకేశ్వరుడని వర్ణించారు. మేము దేవుణ్ణి అదేవిధంగా వర్ణిస్తాం. దేవుడొక్కడే. పరబ్రహ్మపదార్థం ఒక్కటే. దాన్ని ప్రజలు తమతమ బుద్ధికి, జ్ఞానానికి తగినట్లుగా వర్ణించి తమతమభాషల్లో పేరుపెట్టుకొని పూజిస్తూవుంటారు. ఏ పేరుపెట్టి పూజించినా అదంతా జగదీశ్వరుడైన ఈశ్వరునికే చెల్లుతుంది. దేవునికి చెందనిదేశం, తెలియనిభాష అంటూ లేవు. అందరూ ఆయన సంతానం. ఆయన అందరినీ రక్షిస్తూవుంటాడు.'

'ఓంకారేశ్వరుడు, [1]ఇగ్గుతప్ప, పైతూరప్ప, కరింగాళి' ఇవన్నీ ఒకే దేవుడా?

'ఏమీ అభ్యంతరం లేదు. ఇవన్నీ దేవునిగురించిన వివిధభావనా వైభవాలు.

1. ఇగ్గుతప్ప, పైతూరప్ప, కరింగాళి—గ్రామదేవతలు. ఇందులో 'కరింగాళి' ఆడుది.

'ఓంకారేశ్వరునికి కేవలం పూలూ పళ్లూ పెట్టుతారు. ఇతరదేవతలకు జీవబలి ఇస్తున్నారు. ఓంకారేశ్వరుడు జీవబలి అంగీకరిస్తాడా?'

'మనుష్యుడు తాను పండించేదాన్ని, అనుభవించేదాన్ని దేవునికి నైవేద్యం పెట్టుతారు. ఇంతేగాని దేవుడి కాకలితీపేసిందనిగాని, ఆయన నైవేద్యం ఆరగించాడనిగాని అర్థం కాదు.'

'కరింగాళి భక్తుడు ఓంకారేశ్వరునికి మాంసం పెట్టవచ్చా?'

'అతడే పూజారి అయితే సమర్పించవచ్చు.'

'మీరు దాన్ని తాకి సమర్పించరన్నమాట?'

'లేదు.'

'ఎందుకని? మీరూ అతడూ దేవునిబిడ్డలే అయివుండి మీరు అతన్ని తగులకుండా, అతడు తినే ఆహారాన్ని అంటకుండా, అతడు దేవునికై తెచ్చిన పూజాసామగ్రిని స్పృశించకుండా, మిమ్మల్ని శ్రేష్ఠులమని అనుకుంటూవుంటారు. ఇది తప్పుకాదా?'

'ఇది పూర్వంనుంచీ వస్తున్న ఏర్పాటు. ఒకధర్మంలో పెరిగిన ప్రజలు అనేకరీతులకు చెందిన ఆచారములు గలిగివుంటారు. ఆచారాలు వేరు కావున వాళ్లకాళ్ళ వేరువేరుగా వుంటుంది.'

'మీరు బ్రాహ్మణులు కదండీ?'

'ఔను.'

'మీరు మిగిలినజాతులకంటె ఉత్తములు కదూ?'

'మేము అట్లా చెప్పం. వేదం చెప్పింది. దాన్ని మా ప్రజలు అంగీకరించారు.'

'మీరు ఈశ్వరునితలలోంచి వచ్చినవాళ్ళు, శూద్రులు దేవునిపాదాలలోంచి వచ్చినవాళ్ళు అని చెప్తారుకదూ!'

'వేదంలో అట్లా వుంది!'

'అందుచేత మీరే గొప్పవారన్నమాట!'

'దేవుని విరాట్స్వరూపంగా చెప్పి ఆతనికి అంగాంగాల్ని కల్పించి వేరువేరువృత్తికి వేరువేరుభాగాలనుంచి జనం పుట్టింది అని వేదం చెప్పింది. వృత్తి శ్రేష్ఠమైతే జాతి శ్రేష్ఠం.'

'మా మతంలో ఒకరికంటె ఒకరు శ్రేష్ఠులని చెప్పం. అందరు దేవుని సంతానమని, అందరూ సమానమని చెప్తాం. ఇదే న్యాయమైనపద్ధతి అని మీకు తోచడంలేదా?'

'మీరు వేరేదేశం జనం. మీదేశానికి ఆపద్ధతి బాగుంది. ఈదేశం కర్మభూమి. ఇందులోని మనుష్యులు ఇల్లా ఇల్లా నడచుకోవాలి, ఇల్లా ఇల్లా జీవించాలి, అనేకజన్మలు ఎత్తిన తర్వాత జ్ఞాన భక్తి కర్మాలద్వారా మోక్షాన్ని సాధించాలి అని వ్యవస్థీకరింపబడివుంది. మాకు ఈ వ్యవస్థ బాగుంది'.

'ఓంకారేశ్వరుడు, కరింగాళి ఒకే దేవుని రెండురూపాలని చెప్తారా?'

'ఓంకారేశ్వరుడు దేవుడు. ఉమాదేవి ఆయనపత్ని, లోకమాత. కాళి అనేది లోకమాత యొక్క లయస్వరూపం. కరింగాళి అంటే నల్ల కాళికాదేవి అని అర్థం. కాళికాదేవి నలుపు అని శాస్త్రాలలో చెప్పబడివుంది. కరింగాళిపూజ ఓంకారేశ్వరుని పత్నియొక్కపూజ. దేవుని సమస్తశక్తియూ, ఆయనపత్నియందు దుంటుంది. అమ్మ ప్రసన్నురాలైతే తండ్రి తనంతట తానే ప్రసన్ను డౌతాడు.'

'దేవునికో పెళ్ళాముండాలా ?'

'పరబ్రహ్మ ఆడదీ కాదు, మగవాడూ కాదు. పరబ్రహ్మస్వరూపం అనిర్వచనీయం. అది లోకసృష్టి స్థితిలయములకై మూడు ఆకారాలు తాలుస్తుంది. ఈవిధంగా ఏర్పడిన ముప్పురుదేవుళ్ళకు ముగ్గురు శక్తిదేవతలు తోడౌతారు. ఆ శక్తులనే భార్యారూపంగా భావి స్తారు. మనుష్యబుద్ధికి అందుబాటులో వుండటానికని ఈవిధమైన సంబంధాలు కల్పింప బడ్డాయి.'

'అంతేకాదు; మీరు వీటికి విగ్రహాలు తయారుచేసి సమక్షంలోపెట్టుకొని పూజిస్తూ వుంటారు. దేవుడు అవతారమెత్తి మనుష్యుడౌతారంటారు. అతడు పంది, మత్స్యం అయ్యా డని చెప్తారు. కోతిని అతనికి సేవకునిగా ఏర్పాటుచేశారు. ఆ కోతి నూరుయోజనాల సముద్రం ఎగిరి దాటిందని చెప్తారు. ఈవిధంగా కాకమ్మకథలన్నీ చెప్పి మీరు ప్రజలను భ్రమలపాలు చేస్తూవుంటారు. ఇదంతా తప్పు.'

'మనుష్యశక్తికి తగినట్లుగా దేవతను కల్పించుకొంటూ వుంటాడు. యోగులు ఈశ్వరుని హృత్పద్మంలో సాక్షాత్కరింపించుకొంటారు. యోగులంకాని మనబోంట్లకు ప్రతిమ అవసరం. దేవుడు మనలను రక్షించాలంటే మనవద్దకు రావాల్సివుంది. అందుకని అవతారం ధరిస్తాడని చెప్తాం. మత్స్యం, పంది మనుష్యజాతికి నికృష్టజీవులుగా కనబడతాయి. దేవునికి తాను సృజించిన ఈ జీవరాశిలో ఈ భేదబుద్ధి లేదు. దేవుడు ఈ రూపం ధరించవచ్చు లేక ఈ రూపం ధరింపకూడదు అని ఏమీ లేదు. అణు రేణు తృణకాష్ఠాలలో సర్వత్రా ఆయన సంపూర్ణంగా వ్యాపించివున్నాడు. ఆయన సేవకులూ అంతే. మనుష్యులే అయియుండాలనే నియమం ఏమీ లేదు. కుక్క, పందివంటి జీవులుకూడ భగవత్సేవ చేయజాలి వున్నాయి. ఆయన వాటిసేవ తప్పక స్వీకరిస్తాడు. కోతి సముద్రాన్ని దాటిందంటే మా కాశ్చర్యంలేదు. భగవత్సేవయందు నిశ్చలమైనభక్తి కలిగివుంటే కోతికూడ నూరుయోజనాలు సముద్రాన్ని లంఘింపకలదు. మీరు ఏమితప్పుగా భావిస్తున్నారో వాటినన్నింటిని మా పూర్వులు సరియైనవని లోగడనే సిద్ధాంతీకరించివున్నారు. ఇది మీకు సమ్మతం కాకపోతే, మీరు ఒప్పుకోవాలని బలవంతం ఏమీ లేదు. అట్లాగే మీరుచెప్పిన ప్రతిమాట మేం ఒప్పుకోవాల్సినవని లేదు. మీ మతం ప్రకారం మీరు నడుచుకోండి. మేం మా మతంప్రకారం నడుచుకొంటాం.'

'అదెట్లా? రెండుమతాలు ఒకేసారి సరికావుగా? ఇది సరైందైతే మీ మతం తప్పన్న మాట. మీమతం సరైందైతే మామతం తప్పన్నమాట.'

'మతం సరైందో తప్పైందో విచారించవలసింది తత్త్వజ్ఞులైనవాళ్ళు. మంచిప్రవర్తన నేర్పేది మంచి మతం. సత్యవంతులు కావాలి, పరోపకారులు కావాలి, మర్యాదగలిగి నడచుకోవాలి అని చెప్పేమతం మంచిమతం. మా మతం మా ప్రజకు ఈమాట చెప్తుంది. మీ మతమైనా మీకు ఇదేవిషయం చెప్తావుండాలి. ఇటువంటిస్థితిలో ఈ మతం ఎక్కువ, ఆ మతం తక్కువ అని చెప్పడానికి కారణం కనబడదు.'

ఈవిధంగా వాళ్లవాదం పెరిగిపోజొచ్చింది. ఎప్పటికీ తెగేటట్లు కనబడలేదు. మొదట రెండుగడియలపాటు ఇద్దరి తర్కవితర్కాలూ, వాదోపవాదాలూ, ఊహాపోహలూ వింటానికి బాగానే వుంది. ఆ తర్వాత అందరికీ విసుగెత్తిపోయింది.

# 95

ఆడపిల్లల గుంపులోంచి శుభ్రస్వచ్ఛమైన తెల్లచీరెకట్టుకొని ఒక మూర్తి లేచినిలబడింది. వెంటనే లేచి కనబడ్డ ఆ ఆకృతివైపు సభ ఒక్కకన్నై తిరిగిచూచింది.

నిలబడ్డవ్యక్తి భగవతి. ఆమె 'దీక్షితులయ్యవారు అజ్ఞాపిస్తే నేను పాద్రిగారిని రెండు మాట లడుగుతాను' అని చేతులుజోడించి అడిగింది.

దీక్షితులకు కొంచెం విస్మయంతోపాటు పెద్దగా భయంకూడా వేసింది. ఈ పిల్ల ఏమి అవాకులు చెవాకులు మాటాడుతుందో అని వృద్ధునికి శంక. ఆయన ప్రభువువైపు చూశాడు. ఆయన మొహంమీద ఎట్టి సూచనాలేదు. తెల్లదొరవైపు పరికించాడు; దుబాసి ఆయనకు ఆమె మాటాడింది చెప్పడం కనబడ్డది.

మరుక్షణంలో తెల్లదొర 'రాజుగారు అనుమతిస్తే ఆమె పాద్రితోడ వాదించవచ్చు' అన్నారు. దుబాసి ఈమాటను రాజుకు విన్నవించాడు. అందుమీదట 'అట్లాగే' అని అనుమతించాడు.

తెల్లదొర "This is the lady we saw at the hermitage three days ago" అన్నాడు. లూవి "yes" అంది.

భగవతితో చర్చించడం పాద్రికి సమ్మతమే. ఆయన ఆమెతో 'ఇక్కడకువచ్చి సమక్షంలో కూచొని ఏమి చెప్పదలచుకున్నారో చెప్పండి' అన్నాడు. భగవతి సభామండపం

మధ్యకు వచ్చింది. దీక్షితుసెవమక్షంలో నేలముట్టి నమస్కారంచేసి కూచోకుండానే విలు చుండే 'మా గురువులు బాగా తృప్తిగా మీకు మా మతంవిషయాలు తెలిపివున్నారు. మీరు వాటివివరాలు తెలుసుకోకుండా తప్పుదోవలో మాటాడుతున్నారు. మా మతాన్నిగురించి ఇంతగా దూయబట్టుతున్నారే మీరు మరి మీ మతాన్నిగురించి రెండుముక్కలు మేమూ అరు గుతాం చెప్పండి. సభవారు విని సంతోషిస్తారు' అంది.

మేగ్‌లింగ్ పాద్రి 'అవశ్యం; కావలసింది అడుగు; సమాధానం చెప్తాము' అన్నాడు.

'మీరు దేవుని తండ్రి అంటారు. తల్లి అని పిలవరు కదూ ?'

'ఔను. దేవుడు తండ్రి.'

'తల్లికాదు ?'

'తల్లి అప చెప్పం.'

'దేవునికి అతనికుమారుడు ఒకడు కలిగాడు.'

'అవును. దేవునియందు దేవపుత్రుడు, పావనమైన ఆత్మ మూడూ ఒకటై కూడి వున్నాయి.'

'దేవునికి భార్య అంటూ లేదు.'

'లేదు.'

'పత్నిలేకుండా పుత్రు డెక్కడినుంచి వచ్చాడు ?'

'భగవచ్ఛక్తికి మితిలేదు.'

'పత్నిలేకుండా కుమారునిపొందిన దేవుడు కోతై సముద్రాన్నిమాత్రం దాటలేడా ?'

ఇవి ఒకదానికి ఒకటి సంబంధంలేని మాటలు.'

'మీరుచెప్పిన అద్భుతం భగవంతుని అపారమైనశక్తిచే సాధ్యమంటున్నారు. మేం చెప్పే అద్భుతాలకూ అదే కారణమంటే మీరు ఒప్పుకోరు. ఈ మీ మాటలకున్న సంబంధం ఏమిటో ?'

'మీరు మా మతాన్ని తెలిసికోలేదు. ఈ వాదాన్ని వేరే ఎక్కడో విని ఇక్కడ కుకాము వాదం చేస్తున్నారు.'

'ఔను. తమవంటి పాదిరీగారు మలయాళంలో మా గురువుగారిదగ్గరకు వచ్చినప్పుడు ఈమాట మేమడిగి తెలుసుకున్నాం. మీరుకూడ మా మతవిషయాలను అట్లాగే తెలుసుకుం టున్నారు. ఎవర్నోఅడిగి నాలుగు పైపై మాటలునేర్చుకొని ఆ చిలుకపలుకులే పలుకు తున్నారు.'

'మీరు చెప్పేది సరికాదు.'

'మీకు సరికానట్లే కనిపించవచ్చు. కాని అది సరి ఔనో కాదో చెప్పవలసినవాళ్ళు మీరూ కాదు, నేనూ కాదు. సభవారు. ఇక్కడచేరిన పెద్దలు. వారికి నేను మాటాడింది సరిగా వుందని తోస్తోందో లేదో వారిని చెప్పనీ.'

దువాని తెల్లదొరకు ఈ వాదాన్ని వివరించిచెప్పాడు. దొర నవ్వి "I do not know about the argument but the objection is certainly clever" అన్నాడు. దువాని ఈమాట కన్నడంలో చెప్పినప్పుడు, జనం భేష్ భేష్ అంది.

రాజు బసవన్నతో మెల్లిగా 'మా గట్టిపిండమే మీ భగవతి' అన్నాడు

భగవతి వాదాన్ని ముందుకు సాగించింది. 'మీగురువు ప్రతిదినమూ ప్రార్థనలో చెప్ప, దానికి వాక్యాల్ని వ్రాసి ఇస్తారట నిజమేనా?'

'ఔను.'

'దానిలో దేవుని స్వర్గంలోవున్న ఓ తండ్రీ! అని పిలుస్తారట గామా!'

'ఔను..

'అంటే భూమిమీద దేవుడు లేడనా?'

'మీరు అడుగదలచింది అంతా అడగండి. చివరికి మేము చెప్పదలచుకున్నది చెప్తాం.'

మంచిది. 'స్వర్గంలోవున్న ఓ తండ్రీ!' అంటే దేవుడు భూమిమీద లేడు. 'నీపేరు పావనం కావాలి' అంటే ఇంతవరకూ అపవిత్రంగా వుందన్నమాట.

'నీ సామ్రాజ్యం నెలకొనాలి' అంటే ఇంతవరకూ ఆయనకు ఎట్టిప్రభుత్వమూ లేదని.

'నీసంకల్పం స్వర్గంలో నడుస్తున్నట్టే భూమిమీదకూడ నడుచుగాక' అంటే ఇప్పుడు నడవటంలేదనీ, భక్తుడు నడవాలి అని భగవంతుని ఆశీర్వదిస్తున్నట్లు. 'ఈరోజు నీవు నాకు నా రొట్టె ఇయ్యి' అంటే దేవునిపరిపాలన భూమిపైకి దిగిరావి అని ఆశీర్వదించే ఈ పెద్ద మనిషి ఉత్తరక్షణంలో ఒక తుంపు రొట్టెముక్క ఇమ్మనమని దేవురిస్తాడు. 'మేము మా విరోధులతప్పులను మన్నించినట్లు నువ్వు మా దోషాల్ని మన్నించు' మొదలకుండా మన్నించు అని అంటే దేవుడికి తెలియదుకాబోలు. పరపడిచూపించి మరీ అడుగుతారు. 'మాకు ఆశ చూపించి వంచింపవలదు.' ఎందుకు? దేవుని అర్థమైపడియలూ ఇదేవని.

'మమ్మల్ని అపాయంనుంచి రక్షించు' ఈమాట కొంచెం.అర్థవంతంగా కనబడుతోంది. ఎందుకంటే 'రాజ్యం నీది, శక్తి నీది, కీర్తి నీది' ఈ ప్రార్థన మీరుచేసేది సరిగా వుందా?'

'మీరు ప్రార్థనలోనిమాటలను సరిగా అర్థం చేసికోలేదు.'

'కావచ్చు. మా మతాన్నే మేం సరిగా తెలుసుకోలేదు. ఇంక ఇతరులవాన్ని సరిగా తెలుసుకోడానికి పొద్దేది? మాకు మీరు చెప్పేమాటను మేం మీకు చెప్తున్నాం. మీరు మా మతాన్ని సరిగా అర్థం చేసికోలేదు.'

సభలోని జనం సంతోషంతో 'అవునవ్వా! అవునవ్వా!' అని వినాదాలు చేసారు.'

దువాని దొరకు ఈ యుక్తిమాటలను తెలియజేసాడు. తెల్లదొర "She is certainly a clever woman. She knows that attack is the best defence" అన్నాడు

దుబాసి ఈమాటను సభవారికి తెలియజేయాల్సినపని లేదు. కాని అతడు హిందువు. తన మతం మర్యాదను కాపాడేమాట సభకు చెప్పడం అతనికి సంతోషం. తెల్లదొరవ్యాఖ్యను సభవారికి కన్నడించి చెప్పాడు. సభ 'ఔను సార్!' అని మార్మోగింది.

భగవతి పాదిరీకి 'చాలా! ఇంకా చెప్పనా?' అంది.

పాద్రి: 'ఇంకోమాట చెప్పండి. ఇవ్వాల్టికి అక్కడికి అవుదాం. మరోసారి శాస్త్రార్థం సాగిద్దాం.'

'మేం దేవుడు అవతారమెత్తుతాడంటే మీరు ఒప్పుకోరు. దేవునిపుత్రుడు క్రీస్తు గురువై అవతారమెత్తాడని అంటారు. మేము అవతారం అంటే మీరు ఒప్పుకోరు. కాని మీరు చెప్పేదీ అదే. ఇదెట్లా సరిగా వుంది?'

'దేవునిపుత్రుడు మనుష్యరూపాన్ని ధరించాడు అంతే. అతడు మనుష్యునినుంచి పుట్ట లేదు. దేవునినుంచే పుట్టాడు.'

'నేను చెప్పేమాటలకు మీరు కోపగించుకోకూడదు. మీ మాట క్రీస్తు తల్లిఅయిన మేరీ దేవికి కళంకం తెచ్చేదిగా వుంది. మీకు అట్లా అని తోచదా?'

'భగవంతుని అనుగ్రహంచేత ఆమె ఆ పుత్రుని గర్భంగా ధరించింది. అందులో కళంకం ఏమీ లేదు.'

'ఒక పురుషుని సహవాసంచేత గర్భాన్నిధరిస్తే కళంకం కాదా?'

'ఔను.'

'పతి పత్నీ సంబంధం చెడ్డదని మీరంటున్నారు. ఈ సంబంధం దేవు డొనరించిన నియ మమే. దీనిలో తప్పేమిటి? పదిమందికి తెలియకుండా దొంగతనంగా కూడితే తప్పు. పెండ్లయిన ఆడుది తన భర్తతోకూడి సంసారంచేసి బిడ్డనుకంటే అది కళంకమా?.

'దేవునిపుత్రుడు, జన్మించడానికి ఒక్క ఆశ్చర్యకరమైనపద్ధతిని అవలంబించాడు. అందుచేత అతడు దేవపుత్రుడని సిద్ధాంతీకరింపబడుతుంది.'

'మా ఊరిలోనో మీ ఊరిలోనో పెళ్ళికాని ఆడపిల్లలు గర్భవతులై ఒక పుత్రునికని, ఈ బిడ్డ తండ్రి ఎవరు అని అడిగితే 'దేవుడు' అని జవాబు చెప్పారనుకోండి. మీరు ఒప్పు కుంటారా?'

'మేరీ దేవియొక్క నడవడిక శాస్త్రములో చెప్పబడివుంది. అందుకని దాన్ని మేం నమ్ముతాం.'

'దీనిని సాధిస్తూ మేమో శాస్త్రగ్రంథం వ్రాస్తే.'

'అది మీరు వ్రాసినశాస్త్రం అవుతుంది. దాన్ని ప్రజలు అంగీకరించరు.

'అప్పట్లో ఆ శాస్త్రాన్ని ఎవరో వ్రాసివుంటారు. దాన్ని మీరు అంగీకరించారు. మేము ఇప్పుడు వ్రాసేశాస్త్రాన్ని నూరుఏళ్ళు గతించినపిమ్మట అప్పటిప్రజలు నమ్ముతారు. ఇప్పుడు

మనం ఈ పిల్ల ఆశ్చర్యకరమైనపద్ధతిలో గర్భం ధరించిందంటే నమ్మం. భవిష్యత్తులోని పాదిరీలు దాన్ని సాధిస్తారు. సమర్థిస్తారు. నమ్మటమే మన ధర్మమని ప్రబోధిస్తారు.'

సభలో వెనకతట్టున కూచున్న ఉత్తయ్య తక్క 'పాదిరీ చెప్పినరీతిగా అందరూ చేస్తే ఊరు భ్రష్టుపట్టిపోతుంది' అన్నాడు. సభలో జనంఅంతా గొల్లుమని ఒక్కటే విరగబడి నవ్వడం :

పాదిరి : 'మీరు ఇంతకుపూర్వంచేసిన శాస్త్రార్థం విని మూడు నాలుగువిషయాలు తెలుసుకొని ఇప్పుడు మాట్లాడుతున్నారు. ఇల్లా మాట్లాడడం మతచర్చ అనిపించుకోదు. ధర్మం, మతం వీటి తిరుగు మరుగుళ్ళే వేరు. ఆత్మస్వరూపం, దైవస్వరూపం, ముక్తి స్వరూపం. మతం వీటినిగురించి చెప్పాలి. జనానికి తెలియచెయ్యాలి. మీరు మాటాడినతీరు విచిత్రం. మాటకు కొక్కెంవేసి లాగి వెనకముందులు చేసి, ప్రజల్ని నవ్వించడం మాత్రమే.'

'మీరు మతాన్నిగురించి చెప్పినమాటా అంతే. అది జీవాత్మ, పరమాత్మ, పురుషార్థములు వీటి అని చెప్పే విషయసామగ్రిని అంతటినీ విడిచిపెట్టి ఏవో నాలుగు మాటలకు కొక్కెంవేసి లాగి వయస్సుచెల్లిన మా అయ్యవారు మర్యాదగా, శిష్టతతోకూడిన జవాబులిస్తే వాటిని అంగీకరింపక, మీరే బుద్ధిమంతులైనట్లు ప్రదర్శించుకున్నారు. మీలాంటి బుద్ధిమంతులైన మా జనం చెప్పేమాటను మేం చెప్పాం. మీ మతాన్ని మీరు ఉంచుకోండి. మా మతం మేం పాటిస్తాం. అందరూ నిజాయితీగా వుండాలి, చక్కగా నీతిగా బ్రతకాలి అని మీరు ప్రజలకు చెబితే మీ జోలికి మేము రానేరాం'. సభ 'ఔను, ఔను' అని పెద్దపెట్టున ఘోషించింది.

దుబాసి దొరకు ఈ యుక్తిప్రత్యుక్తులవివరాలు మెల్లిగా చెప్తూవచ్చాడు. దాని చివరి భాగం వివరించి చెప్పినప్పుడు తెల్లదొర "What do they call this lady? Bhagavati? that means goddess does it not?" అన్నాడు. భగవతి ఉపాసకురాలు. అని చెప్పడానికి బదులు 'భగవతి' అనేది సంక్షిప్తరూపం అని చెప్పినమీదట "Yes certainly she is most sensible woman. She was done better than either the Padre or her own teacher, the Dikshit. Let us stop now. The discussion can continue on some other occasion if His Highness approves" అన్నాడు.

రాజానుమతితో నాటిసభ ముగిసింది.

# 96

ఆనాడు సూరప్ప 'నాలుగురోజుల' ఒకేతీరున అరచిఅరచి నా గొంతు పట్టుకపోయింది. కొంచెం జ్వరంవచ్చినట్లుగా వుంది. 'ఆడదామనుకున్న నాటకం ఆడేటట్లుగా లేదు' అని కబురు చేశాడు. రాజు 'వేరేనాటకం ఏదన్నా చెయ్యండి' అని చెప్పాడు. పాపం సూర్య నారాయణ వీరరాజును పొగడినట్లున్న హాస్యదృశ్యాన్ని గుర్తుచేశాడు. ఆయన ఈ నాలుగు నెలలు పిరియాపట్టణంలోవుంటూ ఇక్కడకు వస్తూపోతూ వచ్చాడు. అప్పుడు చెన్నబసవన్నను గుర్తు పెట్టుకొన్నాడు. చెన్నబసవన్న నాటకం సంభాషణలువిని ఇవి ఆడితే బాగానేవుంటుం దన్నాడు. సూర్యనారాయణ ఇటువంటి లఘునాటకాల్ని ప్రదర్శించడం అలవాటున్నవాడు. తానే దాన్ని ఆడటానికి ఒప్పుకొన్నాడు.

సభచేరి అంతా సిద్ధమైనవెమ్మట సూర్యనారాయణ భుజకీర్తులూ, కిరీటమూ ధరించు కొని, వెనకపక్క పెద్దతోక వేలాడుతూవుండే నడుముపట్టీ ఒక్కటి కట్టుకొని కొడగు వేషంలో రంగస్థలానికి వచ్చాడు. మైసూరువైపు నాటకాల్లో రాజవేషం వేసేమనుష్యుడు ధిత్తోంగ ధకపైయ్య, అని నాట్యమాడేటట్లు వేరువేరు అడుగులువేస్తూ నాట్యంచేశాడు. 'ఆహా! రాజునైన నేను రాజసభకువచ్చి ఇంత శ్రమపడి నాట్యంచేసినా మీరు ఎవ్వరు? అని అడిగేవాడు ఒక్కడూ లేడే! నేను ఎవరినో ఈ సభవారికి తెలపడం ఎట్లా? అని నేను దీర్ఘంగా విచారించుతున్నాను' అని చింతాముద్రితమైన ముఖంతో నిలబడి 'హా తెలిసెన్! బుద్ధివంతులైనవారికి ఏవిషయమైనా తెలియకుండా ఎల్లా పోతుంది? అందులోనూ నావంటి బుద్ధిమంతునికి తోచనిసంగతి అంటూ ఏముంటుంది? మధ్య సారథి ఎవ్వరూ లేకపోతేనేం? ఒక మంత్రిని ఏర్పాటు చేసుకొంటే సరి.'

సూరప్ప ధిత్తోంగ థకపై నృత్యం, అతని నిల్చున్న భంగిమ, మాట్లాడినవైఖరి, సార థినిగురించి ఉబలాటం, ఆలోచనాముద్ర, తనకుతాను బుద్ధివంతుణ్ణి అని పొగడుకోటం, ప్రజలకందరినీ పక్కుమని నవ్వేటట్లు చేసింది. ఎదురుగ్గా కూచున్న రాజభవనంమనుష్య లూ, అర్థాన్ని అడిగితెలుసుకొన్న అతిథులకూకూడ ఇతని అభినయం నవ్వు పుట్టించింది. పెద్ద తెల్లదొర "The fellow acts well. His pose is ludicrously thoughtful" అని మెచ్చుకొన్నాడు. (ఈ నటుడు బాగా అభినయిస్తున్నాడు. వీని భంగిమ నవ్వును కలిగిస్తూ ఆలోచనాదీప్తమై వుంది.)

మంత్రిని నియమించాలి అని నటుడు తనదగ్గర నిలబడ్డ గుంపువైపు తిరిగి 'అయ్యా! సభాసదులారా! ఎవరైనా ఒక్కరు దయచేసి రంగస్థలానికి రండి. నాకు మంత్రిగా: బహు మానం ఇస్తాను. నేను వేషంవేసిన రాజు కాను, మోసంచేసే రాజునుకాను' అన్నాడు.

సభనుండి ఎవడో ఒక్కడు లేచి పడుచువాడు నిలబడ్డాడు. 'నేను మంత్రి చెప్పే మాటలు నేర్చుకోలేదే?' అన్నాడు. రాజు: 'మా రాజ్యంలో నాటకమాడేదంతా మేమే. వేరెవ్వరూ తోకకూడా ఆడించడానికి వీల్లేదు. ఈ తోకను చూశావా?' అని తనతోకను లాగి చూపించాడు.

'చూసా.'

'ప్రభువుతోక ఇంతగా వున్నప్పుడు దేశంలో ఇంకో తోక ఎలా వుంటుంది? (ఒక్క క్షణమాగి) 'లేదు' అనవద్దా? ఈమాత్రం తెలియదా? మాటలు నేర్చుకోలేదు అంటున్నావు కదూ? ఇప్పుడు చెబుతాను తెలుసుకో. నేను ఇటువంటిసంగతులు చెప్పినప్పుడు నువ్వు 'చిత్తం ప్రభూ!' అని అనాలి. నేను ఈసంగతి ఇంతేగా అని అన్నప్పుడు 'ఔను మహా ప్రభో!' అనాలిసివుంటుంది. మనదేశంలో మనతోకే ఆడాలి. ఇంకోళ్ల తమతోక లాడించ డానికి వీల్లేదు. మన నాలుకలే మాటాడాలి. ఇతరుల నాలుకలు ఇటూ అటూ కదలాడ కూడదు.'

మంత్రికావడానికి వచ్చినమనిషి 'ఇంతే పని అయితే దీనికి మా 'ఒక్క' సరిపోతాడు స్వామీ! మావల్లకాదు' అనిచెప్పి ఒరేయ్ 'అప్పా!' నువ్వు రారా! మంత్రి అయిపో' అని కేకవేశాడు. వెనక నిలబడ్డజనం మధ్యనుంచి ఓ కుంటివాడు రంగస్థలానికి వచ్చాడు. 'తీసు కోండి. వీణ్ణి మంత్రిచెయ్యండి' అనిచెప్పి మొదటవచ్చినవాడు తాను ప్రజలమధ్యకు వెళ్ళి చేరాడు.

## 97

నాటకంలో రాజు కొత్తమనిషిని కాలినుంచి తలదాకా పరీక్షించాడు: కుంటికాలిని తదేక దృష్టితో చూశాడు; వెంటనే దగ్గిరకుపోయి కూచొని అది కుంటి అవునా కాదా అని నిశ్చయం చేసుకొనేటట్లు ఇటూ అటూ చూసి, లేచి నిలబడి, ఎదురుగావున్న పళవైపుతిరిగి, రాజు వెన కగా నిలబడ్డ బసవన్నమీద చూపులుసారించి 'అవును' అన్నట్లు నాలుగుసార్లు తల నాడించి, తిరిగి కొత్తమంత్రి ఎదురుగానిలబడి 'ఏమయ్యా! నువ్వు మా మంత్రివి అవుతావా?' అని ప్రశ్నించాడు.

'అట్లాగే ప్రభూ!'

'నిన్ను ఇక్కడికి పిలిచిన ఆ కోతికి చెప్పినమాట విన్నావా? నువ్వు రెండేమాటలు అంటూవుండాలి. మేము ఏమైనాసంగతి అడుగుతామనుకో, 'సరే మహాప్రభూ!' అనాలి. 'ఔనా' అని అడుగుతామనుకో, 'ఔను ప్రభూ!' అనాలి. తెలిసిందా?

'అవును ప్రభూ!'

'తెలిసింది అను. ఆట ఆడేటప్పుడు ఆమాట....ఇప్పుడు సరిగానే మాటలాడు.

'అప్పుడు సరిగా మాట్లాడకూడదా? ప్రభూ!'

'ఒరేయి! ఎక్కువగా ప్రేలరాదు, మేము చెప్పింది రెండేమాటలు మాట్లాడాలి.'

'చిత్తం మహాప్రభూ!'

'సరే! అక్కడ నిలుచో. మేము రాజులం. నాట్యంచేస్తాం చూడు.' అనిచెప్పి నాటకం లోని రాజు నాలుగుఅడుగులు ధిత్తోంగ. ఝుణతయ్య, అని సరిగా నాట్యం చేయకుండా, తాళంవిడిచి పిలకపట్టుకొని అడుగులువేసి నృత్యాన్ని ముగించాడు. ఈ అవివేకంతోకూడిన నృత్యం బుద్ధిపూర్వకంగా నవ్వు పుట్టించటానికే చేశాడు. సభ ఒక్కపెట్టున నవ్వింది.

నాటకం రాజు: 'అయ్యా మంత్రి! నువ్వు మమ్మల్ని 'ఎవరు?' అని అడుగుతున్నారు కదూ?' అని గట్టిగాచెప్పి, అంతకంటె మెల్లిగా, అయినా, అందరికి వినబడేటట్లు 'ఔను మహాప్రభు! అను ముండమోపీ' అన్నాడు.

ఎదుటివాడు: 'ఇదేమయ్యా! అంతా నువ్వుచెప్పిందే చెప్పేటట్లయితే నేనెందుకూ ఇక్కడ? నువ్వే చెప్పుకో!' అన్నాడు.

'అట్లయితే నీకు నువ్వే మాట్లాడుతావా?'

'ఎందుకు మాట్లాడరాదు. మాట్లాడుతా.'

'సరి అట్లాగే మాటలాడు.'

'నువ్వు ఎవరప్పా! ఈవిధంగా పిలకపట్టుకొని నాట్యం చేస్తావు?'

'ఒరేయి! రాజును నువ్వు అంటావేం?'

'నాకేంతెలుసు నువ్వు రాజువని.'

ఎదుటివాడు అతన్ని బాగా ఎగాదిగచూసి 'చూస్తే కనబడటంలేదా?' అన్నాడు.

'కనబడటంలేదు. నేనేం చెయ్యను? వేరువిధంగా కానవస్తుందే!'

'ఏమిటి కనబడుతోంది?'

దగ్గిరకుపోయి అతని తోకపట్టుకొని ఎంతపొడుగో అని పరీక్షిస్తున్నట్లు నటించి, 'ఇది కనబడుతోంది అప్పా!' అన్నాడు.

'ఆహా! అదైనా నీకు కనబడుతోందిగా!'

'కండ్లల్లోకివచ్చి గ్రుచ్చుకొంటున్నట్లుంటే, కనబడకపోవడ మెటువంటిది? ఇదేమిటి ఇదంతా నిజమైన తోకేనా?'

'మరేవిఁటి అనుకుంటున్నావు ?'

'ఇదేవిఁటి తనంతట తానే ఆడుతుందా ? చేతితో పట్టుకొని దీన్ని ఆడించాలా ?'

'ఒరేయ్ ! తలపొగరు మంత్రీ ! మితితప్పి మాటాడబోకురా. నోరుమూసికొని మీరు ఎవరు ? అని అడుగు. నువ్వు నా రోకపట్టుకొని కూచుంటే ఆట ముందుకు జరుగదు.'

'ముందుకు జరగనీ ! చెప్పప్పా ! నువ్వెవరు ? 'అదిగదీ తెలివిఅంటే. ఏం సారథీ ! నేను ఎవరోనని భయభక్తిపూర్ణంగా ప్రశ్న వేస్తున్నావుకాదూ ?' అని మీసం దువ్వుకుంటూ భుజకీర్తిని ఆడిస్తూ 'మేము ఎవరమో సంతోషంగా తెలుసుకొన్నవారమవుతున్నాం. నువ్వు ఆనందభరితుడవు కమ్ము. సమస్తభూమండల మండనాయమానమైన [1]'కోడగు' అను పేరుతో పరిశోభించుచున్న దేశం వొటివుంది. నువ్వు ఎరుగుదువుగా సారథి ?'

'కోడగు ? కొడగు-కోడగు ఎక్కడిది ?'

'ఒరే మూఢ ! కొడగుదేశానికి రాజును నేనంటే నన్ను ఈ సభలోని జనం బ్రతకనిస్తుందా ? ఎదురుగా విరాజమానులై రాజ్యసింహాసనం అలంకరిస్తూవున్న చిక్క వీర రాజేంద్ర మహాప్రభువులు కొడగుదేశానికి ప్రభువులు. మేము 'కోడగు' దేశస్థులం. అది ఎక్కడవుందని అడుగుతుంటివా సారథి ?'

'ఔను, చెప్పప్పా !'

'వినవయ్యా సారథి. ఆ దేశప్రభువులు దాన్ని పూర్వం కిష్కింధ అని పిలుస్తూ వుండేవాళ్ళు.'

'ఓహో ! నువ్వు కోతిమహారాయరవా ?'

'ఒరే సారథి! నీ బుద్ధి ఎంత చురుకు అనేది నువ్వు ఇంతవేగంగా మేం 'కోడగ'ల మని గ్రహించటంతోనే స్పష్టమౌతోంది. నువ్వు కేవలం సారథిగావుండటం ఇహ మాకు ఎంత మాత్రం ఇష్టం లేదు. ఈక్షణంనుంచి నువ్వు మా మంత్రివి. నీ పేరేవిఁటి ?'

'బసవ అన్నప్ప.'

'అహా ! ఎంత ఆశ్చర్యం. ఈ పేరిటిమనుష్యులే చాలా బుద్ధివంతులని కనబడుతోంది. ఈ క్షణంమొదలు నువ్వు నీ పేరేమిటి అని అడిగితే, 'మంత్రి బసవయ్య' అని చెప్తుతూవుండు.'

'మంత్రి : సరే ? రాజు ఎవరంటే ఏం చెప్పాలి? మా పెద్దతోక మంగన్న అనాలా ?'

'అయ్యా మంత్రీ ! నీ కుశాగ్రబుద్ధి దీన్నిబట్టికూడా స్పష్టమౌతోంది. నువ్వు సూచించి వల్లే మాపేరు ఉండనీ.'

'మీరు వాలి మహారాజులకేమైనా....'

---

1. కోడగ = కోతి.

'ఔను మంత్రివర్యా! మేం రామచంద్రునికాలంనాటి వాలి మనుమడి, మునిమనుమడి, మునిమనుమడి, మనుమడి, మనుమడి, మునిమనుమడి....'

'ధాలు విడిచిపెట్టు. నీ తోకంతపొడుగు చెప్పినా అక్కడినుంచి ఇక్కడికి చేరేదిలేదు. అతడు వాలి, ఆయనకులానికిచెందిన [1]బాలివి నువ్వు అని చెప్పచాలు.'

'ఆహా! తిరిగి నీ కుశాగ్రబుద్ధికి మెచ్చుతున్నాను. అట్టే విచారించిచూడగా నీకు ఇంతోటి చురుకుబుద్ధి ఎట్లా వచ్చిందో నాకు తట్టుతూనేవుంది.'

'ఎట్లానయ్యా?'

'అయ్యా! మంత్రివర్యా! చెప్పుతూవున్నవాడివి అవుతున్నాను. వినుకొన్నవాడివికమ్ము. నీబుద్ధి ఇంత చంగుచంగున ప్రవహించడానికి కారణం నువ్వు దేవునిదయవల్ల 'వంగువు' కావడం.'

'వంగు అంటే.'

నాటకం రాజు: 'అది' అని మంత్రి కుంటికాలివైపు వ్రేలుపెట్టి చూపించాడు.

'కుంటి అనా.'

'ఔనయ్యా! మంత్రివరేణ్యా!'

'అంటే నువ్వు నాకు తెలియనిభాషలో నన్ను కుంటి అని తిట్టుతున్నావా?'

'అయ్యా మంత్రివర్యా! సామాన్యులు కుంటివాళ్లయితే వాళ్ళని 'కుంటి' అనే చెబుతారు. పదవీధరులు కుంటివాళ్ళు అయితే వాళ్లను 'వంగువు' అని చెబుతారు.'

'సరేనప్పా! గొప్పోళ్ళయితే నరి తలనొప్పికి, కాలినొప్పికి వేరేవేరే పేర్లు అన్న మాట.'

'ఔను కుంటీ, ఛీ ఛీ మరచిపోయాను. ఔనయ్యా వంగుమంత్రివరేణ్యా!'

ఈలోపల ఆడపిల్లలు కూచునిఉన్న వైపునుంచి ఒకధ్వని వినబడింది. 'ఎన్నిసార్లు చెబుతావు 'కుంటి' 'కుంటి' అని' అంటూ. వెనుకవరుసలోంచి ధ్వని రావడంవల్ల అందరూ ఆ వైపు తలత్రిప్పారు. కానైతే, ఎవరికీ ఇట్లా అరచినవాళ్ళు ఎవరు అనేది తెలియలేదు. వెనుకవైపు ఎత్తునుండి తను వాడుకగా కట్టుకొనే తెల్లచీరతో భగవతి నిలబడివుంది. ఈ అబిచింది ఆమే. నాటకంరాజు ధ్వనివచ్చినవైపు తలత్రిప్పి, 'మంచిదవ్వా! ఇహమీద అన మలే' అని నాటకంమంత్రివైపు మొహంపెట్టి 'అయ్యా! మంత్రిగారూ! మీరు ఈక్షణంనుంచి మా కొలువులోచేరిన కారణంచేత మీరు చేయదగిన ఉన్నతస్థాయికిచెందిన కర్తవ్యాలేమిటో వివరంగా తెలుపుచున్నవారమగుచున్నాం. సావధానంగా అవధరింపుడు. మా మంత్రిపని కొడగుమంత్రులపని వంటిది కాదు. ఎందుకంటావా?'

'ఎందుకనో చెప్పప్పా.'

'మేము కొడగురాజువంటి రాజులంకాము గనక.'

1. బాలి = వాలి 'వబయోరభేదః'—అనువాదకుడు.

'అట్లందువా!'

'ఎందుకనో చెప్పబోతున్నాం. అవధరింపు. కొడగురాజులు చిక్క వీరరాజేంద్రప్రభువులు. ఎదురుగా కూచునివున్నారు చూశావా!'

రంగస్థలంచుట్టూ నిలబడ్డజనంలోంచి ఓ ధ్వని, 'అప్పయ్యా! సరసం విరసంలోకి దిగజారిపోతోంది జాగ్రత్త' అని వినవచ్చింది. చుట్టూవున్న పిల్లలందరూ ఈమాట అన్న వాని వైపు చూశారు. ఆయన ఉత్తయ్యతక్క. ఆయన 'నవ్వువట్టించేరభసకు మమ్మల్ని అందరినీ బలిచేస్తున్నావా!' అన్నాడు.

నాటకంరాజు. 'లేదు-తక్కరూ' అని అతనికి జవాబిచ్చాడు. కాని ఆ సమయానికి అతనినాల్కకు ఆ అవహాస్యం రుచి పట్టిపోయింది. అతడు దాన్ని తమాయించుకొనేస్థితిలో లేదు. యక్షగానంలో వేషం వేసింతర్వాత సమయస్ఫూర్తితో మాటలు పెంచడం అలవాటైన ఆ మనిషికి తనలోని వెష్టను బైటపెట్టడానికి చిక్కిన అవకాశాన్ని పోగొట్టుకోవడం మనస్కరించలేదు. ఆయనమాటను అల్లాగే సాగనిచ్చాడు. 'వింటున్నావా మంత్రీ! చిక్క వీర రాజేంద్రులు సత్యవంతులు. కొడగుదేశంలో సత్యం అవసరమైనవస్తువు. మాకు సత్యం వాసనే తెలియదు. కోడగదేశంలో అది అనవసరం. చిక్క వీరరాజేంద్రులు ధర్మనిష్ఠ కల వారు. కొడగుదేశంలో ధర్మం అవసరం. మాకు ధర్మంవాసనే గిట్టదు. కోడగదేశంలో దాని వల్ల కాదగ్గవని లేదు. చిక్క వీరరాజేంద్రప్రభువులు వారి ముత్తాత, పెత్తాత, తాత, పెత్తం డ్రులవలె, తండ్రి లింగరాజులవలెనే, తమప్రజలను బిడ్డలవలె పాలిస్తున్నారు. వారు పరస్త్రీలకు సోదరులవంటివారు. దేశంలోని స్త్రీలనందరినీ తమ తల్లులుగాభావించి మర్యాదగా చూస్తారు. కొడగుదేశంలో ఇటువంటి సత్ప్రవర్తన ఎంతైనా అవసరం. మా కోడగదేశంలో కుటుంబిన్త్రీ లందరూ మా భార్యలే. అదేవిధంగా అందరిపిల్లలు మా పిల్లలే.

# 98

సభ గొల్లుగొల్లుమన నవ్వింది. సమక్షంలో కూచున్న రాజుగారికి ఇందులోని వ్యంగ్యం మొగంమీద ఉమ్మేసినట్లుగా స్ఫురించింది. ఆయన చాలాకోపంతో 'ఎవడురా ఈ 'పీకొడుకు', తెందు పీకు వాణ్ణి' అని అరిచాడు. రాజువెనక నిలబడ్డ జనసన్న ఒక్కఅడుగు ముందుకు వేసి దగ్గిరనున్న మాచన్నకు 'వానిని పట్టుకొని ఆపేయి' అని చెప్పాడు.

మాచన్న ఒక్క అడుగైనా ముందుకువేయలేదు. జనం గుంపులోంచి 'ఓ' అని ఒక్క ఉద్ఘోష బైలుదేరింది. నాటకం రాజు [1]'కావేరి మక్కళు' అని అరిచాడు. ఈమూల నుంచి ఆమూలదాకా [2]'మక్కళ తాయి' అని ప్రతిధ్వనించింది. అడవిమధ్యలోంచి ప్రవహించివచ్చిన నూరు సెలయేళ్ళుకలిసినదిగా రూపొందినట్లు జనం గుంపులోంచి విడిపించుకొని వచ్చి నూరుగురు అతన్ని చుట్టుముట్టారు. వెనకతట్టునవున్న జనాన్ని ప్రక్కకునెట్టి ఆయన పారిపోవడానికి దారి చేసిపెట్టారు. పదిమంది సేవకులతో మాచన్న రంగస్థలానికి వచ్చేలోపల అక్కడ నాటకం రాజుగారు పలాయనమంత్రం పఠించారు.

ఆ సాయంకాలం వినోదం ఆవిధంగా ముగిసింది.

ఆంగ్ల అతిథుల ప్రక్కన నిల్చున్న దుబాసి నాటకంలో జరిగినవిషయాలు వాళ్లకు తెలియజేస్తూవచ్చాడు. అది ఆవిధంగా నిలిచిపోయినకారణం చెప్పాడు. రాజుకు విరోధవక్షం ఒకటి ప్రబలమైంది దేశంలో వున్నది అని దీనిమూలంగా తెలుసుకొని అతిథివర్గం లోలోపల చాలా సంతోషించింది. కానైతే ఆ సంతోషాన్ని వెలికి చిందనివ్వలేదు.

# 99

మరుసటిదినం యథాక్రమంగా అతిథుల వీడ్కోలు మర్యాదలు నడిచాయి.

ఆ మర్యాదలు పూర్తి అయినవెంటనే రాజు బసవన్నతో 'ఆ అల్లుడిగాడిని, [3]'పీ కొడుకునీ' రమ్మనమనిచెప్పు బసవన్నా! అతడు ఎట్లా ఆ నాటకాన్ని వేయించాడో విందాం. సరిగా చెప్పకుంటే తల తీసేద్దాం' అన్నాడు.

అందరూ ఈవిధంగా జరగకతప్పదని అనుకుంటూనేవున్నారు. చెన్నబసవయ్య 'నాకు ఒంట్లో సరిగాలేదు. కొంచెం నెమ్మది ఏర్పడ్డపిమ్మట, రాజుగారి సన్నిధానానికి వస్తాను. ఈమధ్య తప్పు ఏమి జరిగిందో, దాని కారణమేమిటో, మొదలైనవాటిని నూరప్ప తెలుపుతాడు. ఆతన్ని పిలిపించి అడుగు' అని చెప్పాడు.

నూరప్పకైనా రాజు ఎదుటకువెళ్ళడం, జరిగినసంగతి చెప్పి ఆయన చెడ్డమాటలంటే పడి, అవమానం పొందిరావడం ఇష్టం లేదు. కాని ఆయన రాజకుటుంబం అల్లుడులాగా

---

1. కావేరి మక్కళు కావేరి బిడ్డలు.
2. మక్కళ తాయి బిడ్డల తల్లి.
3. 'పీ కొడుకు'—రాజుగారు తిట్టేతిట్టు.

తప్పించుకోగల వోదాలో లేదు. ఇష్టంలేకుండానే అతడు బసవన్నతో కలిసి రాజాఎదుటకు పోయి నిలబడ్డాడు.

రాజా అతన్ని తిన్నగా మాటాడించలేదు. బసవన్నతో 'ఏమిటి మొఱుగుతాడో బావ వయ్య మొఱగుమని చెప్పు' అన్నాడు. బసవన్న సూరవ్పతో 'విన్నవించుకో ఆ నాటక మాడమని చెప్పిందెవరో? ఏర్పాటు చేసిందెవరో' అన్నాడు.

సూరవ్ప: 'ఆరోజు సభలో ఏమి నడిచిందో నేను చూడలేదు. నా గొంతు పట్టుక పోయింది. ఒళ్లు జ్వరంతో కాగిపోయింది. నేను ఇంట్లోనే వుండిపోయాను. నాటకం లేకుండా పోతుందన్రా ఏమిటి చేయడం అని వుండవలసివస్తే చివరిక్షణంలో పాణే సూర్య నారాయణ రాజును పొగడి మంచి ఒక్క యక్షగానంలాంటిది బయలాట ఆడుతాను అన్నాడు. వివరాలు ఏవిటి అని అడిగితే, 'కొడగుదేశం మంచిదేశం. రాజా చాల మంచి వారు. మంత్రులు చాల బుద్ధిమంతులు. వేరేదేశాలు అటువంటివి కావు అని చెప్పాలి. దొడ్డ రాజాగారి కథ చెప్పడం అయింది. లింగరాజులకథ చెప్పడమయింది. ప్రస్తుతం ఏలుతూవున్న రాజాగారికథను ఆడించాలనుకుంటున్నాం. అది కాలేదు. సూర్యనారాయణ దాన్నే ఆడతానని చెప్పినమీదట చాలా మంచివని అని అందరమూ ఒప్పుకున్నాం. ఇతనేమో యక్షగానంలో గట్టి పిండం. వేదికమీద నిలబడి ఆవేశకు సరైనమాట టంకం పొడిలాగా అతికించగలడు. ఆ పొద్దు మాటాడుతుంటే హాస్యంపాలు ఎక్కువైందట. అతడు నవ్వించడం, జనం నవ్వడం, దాంతో అతగాడితల తిరిగిపోయింది. పిలక పట్టుకొని మాటాడాడుట. ఇంకా ఏమేమి రసాభాసువనులు చేసేవాడో దేవునిదయవల్ల మీరు ఆపేశారు అన్నాడు. ఇది నేను తెలిసి చేసిననేరం కాదు. ప్రభువులు మన్నించాలి, నన్ను కాపాడాలి. నేనైతే ఆమాట చెవిని పడిందే తడవుగా సూర్యనారాయణను తల వాచేటట్లు చీవాట్లు పెట్టాను' అని అతి వినయంగా విన్నపం చేసికొన్నాడు.

రాజా: 'ఏరా కుంటీ! ఈ బావనయ్యమాట నిజమేనా?' అని అడిగాడు.

బసవన్న: 'చూడాలిసివుంది ప్రభూ! ఆ సూర్యనారాయణనుపిలిచి రెండు పీకాలి' అన్నాడు.

'పిలిపించమని చెప్పు.'

సూరవ్ప: 'మాట ఖ్రుతిమించి రాగానవడి, ఎప్పుడైతే మేం చీవాట్లు పెట్టామో, సూర్య నారాయణ గ్రహించాడు. ఇంక ఇక్కడవుంటే నెత్తిమీదికి వస్తుందని పారిపోయాడు ప్రభూ! అతడు ఈపాటికి పిరియాపట్టణంలో వుండివుంటాడు' అన్నాడు.

రాజా: 'అతన్ని పిలిపిస్తే సరే. లేకపోతే నీ తలకాయ తీసెయ్యాలి.'

'నేను చెప్పినంపిస్తేమాత్రం అతడు వస్తాడా దొరా! మహాసన్నిధానం కోపగించుకొన్నే టంటే ఎవరికీ ప్రాణాలు వణికిపోతాయి. ఆజ్ఞఅయితే పోయి పిలుచుకవస్తాను.'

'పోయేదిమాత్రం నిజం. తిరిగి వస్తావా? నువ్వు పచ్చిదొంగవు.'

'నేను దొంగని అని మీరు తెలుసుకొన్నతర్వాత 'కాను' అని చెప్పితే బావుంటుందా దొరా? తప్పైపోయింది. నేనే చేయించివుంటానని మీకు అనిపిస్తోంది. అది నేను చేయించింది కాదు అని ఋజువయ్యేదాకా నేను దొంగనే.'

'సరే అల్లాగే కానీ. మూడురోజుల్లో లేకపోతే తల తీయించేస్తాం.'

'తమ ఆజ్ఞ సుప్రసన్నమే? తమ చిత్తానికి ఎదురులేదు. నా పాపమే బ్రదుకుతాను. చంపుతారూ చచ్చిపోతాను. దేనికైనా రక్షించినా, భక్షించినా ఈ ప్రాణాలు మీవి.'

రాజు: 'చెన్నబసవయ్యకు వంట్లో ఆరోగ్యం ఏర్పడనీ. ఆయన్ను విచారించి ఎవరిని దండించవలసింది నిర్ణయిద్దాం. అంతవరకూ, సూరప్పను తనఇంట్లో ఖైదీగా వుండనీ' అని ఆజ్ఞాపించాడు.

# 100

సూరప్పమీదికోపం రాజుకు తగ్గదని చెన్నబసవయ్య నమ్మకం. తాను ఏం చెయ్యాలో ఆలోచించాడు. ఆయనకు నిజానికి వంట్లో ఏమంత అస్వస్థత లేదు. సూర్యనారాయణ స్వతంత్రంగా మాటలు పెంచి, కల్పించి నాటకమాడటానికి సూరప్ప, తానూ ఇద్దరూ ఒప్పుకొన్నారు. సూర్యనారాయణ సమయానికి తగినట్లు మాటలు సాధించగలడు. యక్షగానాలు ఆడటంలో అనుభవం కలవాడిగా ఆ విషయం సూరప్పకు తెలుసు. చెన్నబసవయ్య సూర్యనారాయణకు 'మాట కొంచెం హాస్యంగా వుండనీ, అవునో కాదో అనేటట్లుగా విచిత్రంగావుంటే జనం సంతోషిస్తారు' అని సూచించాడు. సూర్యనారాయణ ఈ సూచనప్రకారం నడచుకోవడంలో తన పైన తనకు నిగ్రహం చాలక మితిమీరి అతికిపోయాడు. అతికిపోకుండానే రాజుకు, బసవన్నకూ, ఇతరులకు కోపం రావచ్చునని అతనికి మనస్సులో అనుమానం వుండనేవుంది. అందుకని అతడు దీక్షితులవారి నారాయణకు ఈమాటచెప్పి తన జనం రంగస్థలంచుట్టూ వుండేటట్లు ఏర్పాటు చేసికొన్నాడు. సూర్యనారాయణకే తాను మాటాడేది సరిగా తెలియడం లేదని చెప్పింతర్వాత చెన్నబసవయ్యకూ తెలియదని వేరే చెప్పాల్సిన పనిలేదు. కాని రాజభవనం పరివారం ముందుప్రక్క రాజువెనకగా కూచొని చెన్నబసవయ్య రాజును అవహాస్యం చేసే మాటవచ్చినప్పుడల్లా బాగా ఆనందిస్తూనేవచ్చాడు. అతడు చెప్పేదివిని అందరితోబాటు పకాలుమని నవ్వుతూవుండేవాడే. అతఃణంలో ఇట్లాచేయడం రాజద్రోహ మనిపించుకొంటుం

దేమో అనే చింతేలేదు. గందరగోళం అయినవిమ్మటనే విచారణకు రావచ్చునని గ్రహించాడు. ఇప్పుడు అది విచారణకు రానేవచ్చింది. ఆయన ముందు ఏమి చేయాల్సింది ముందే ఓ నిశ్చయానికి వచ్చాడు.

తాను రాజును చూడటానికి పోరాదు. ఏదో కారణంచెప్పి దూరంగానే వుండిపోవాలి. అంతగా రాజు పట్టుపట్టితే తానూ, పెండ్లాం పిల్లలు, కొడగు వదిలేసి బెంగుళూరికి లేచి చక్కాపోవాలి. ఈ ప్రసక్తి తెల్లదొరతో మాటాడినప్పుడు రానేవచ్చింది. ఈరాజు అక్కర్లేదని ప్రజలు వేడుకొంటున్నారు ఇతన్ని గద్దెనుంచి దింపేయడానికి అంగ్లేయులు సిద్ధపడుతూ వున్నారు. లింగరాజు బిడ్డను గద్దెనుంచిదింపితే లింగరాజుకూతురు ఆ సింహాసనం ఎక్కడం స్వాభావికం. అంతేగాదు అనివార్యంకూడా.

సూర్యనారాయణమూలంగా ఈ కలహం రావడం తనకు ఈ మేలు సాధించడానికే కావచ్చు. దైవేచ్ఛవుంటే అల్లాగా కానీ. అని చెన్నబసవన్న తనలోతాను నిశ్చయించుకొన్నాడు.

బసవన్న ఇటు సూరప్పను పిలవడానికి పోవడమేమిటి చెన్నబసవయ్య అటు అప్పంగొళకు చక్కాపోయాడు. పోతూ రాణికి 'మేము నంజనగూడుకు రేపటెల్లుండిలో బైలుదేరి పోవడం మంచిది. ఇందుకుగా ఏర్పాట్లు చేయించండి' అని తనవాంఛను తెలిపాడు.

సూరప్ప విచారణముగించి చెన్నబసవయ్య రాజును చూడాలని తిరిగి ఆజ్ఞ అయ్యేలోపల ఆయిన అప్పంగొళకు బైలుదేరిపోయాడనేసంగతి కనిపెట్టాడు. రాజు కోపంతో అరచి బొబ్బలుపెట్టాడు. బసవన్ననూ మొహంవాచేటట్లు తిట్టాడు. 'ఈ తొత్తుకొడుకు అప్పంగొళే రాజభవనం అనుకొన్నాడా? ప్రవేశించాడు, నాశనమైంది. కాసుకోమను. పొగవేసి ఊదరపెట్టి 'వాలు ప్రభూ' అనిపిస్తాను. నవ్వీనవ్వీ పొట్ట చెక్కలై పోయిందికదూ వీడికి! పొగరెక్కి కొట్టుకొంటున్న వీడిప్రాణాలు తోడేస్తాను. తిన్నదంతా కక్కాలి తొత్తుకొడుకు' అంటూ అరిచాడు. క్షణం ఊరుకొని 'ఒరేయి కుంటీ! ఆ నీకొడుకు అప్పంగొళవిడిచి ఎక్కడైనా పోతాడేమో జాగ్రత్త. కావలి వుంచు. ఏమైనా ఇటూ అటూ మెసిలాడా తల చితక గొట్టు. బిడ్డ పుట్టింతర్వాత నుదమెక్కినట్లుంది. పిల్లవాణ్ణి కన్నసుఖం చూపిస్తాను' అని ఆజ్ఞాపించి తనకోపాన్ని మరింత పెంచుకున్నాడు.

ఈ కథఅంతా రాజప్రాసాదంలోని అందరికి తెలిసేటట్లే నడిచింది. రాజకుటుంబం అల్లుడుగారు రాజుకు అవమానమయ్యేటట్లు నాటకం ఆడించాడని రాణికి కోపమే. కాని అంతకంటె రాజు ఎక్కడ చెల్లెలికి, చెల్లెలి పెనిమిటికీ, వాళ్ల పసిబిడ్డకూ చెఱుపు చేస్తాడోనని భయం. 'ఈ సంవత్సరం ఎట్లాగైనా క్షేమంగా గడచిపోతే ముందుసంవత్సరం ఇటువంటి అపాయం లేదు. దైవకృపవల్ల అంతా సరిగావుంటుంది' అని ఆమె భావించింది. 'వీళ్లు నంజనగూడికి వెళ్లాలట. రాజుగారికి తెలియజేయి' అని బసవన్నను ఆజ్ఞాపించింది.

స్వార్థంచేత భవిష్యత్తు ఊహించుకోలేని చెన్నబసవయ్య తనస్వార్థమే దైవేచ్ఛ కావచ్చు నని అనుకొన్నాడు. స్వార్థంలేని రాణి ఇతరులక్షేమానికై దైవానుగ్రహాన్ని వాంఛిస్తూవుంది. వాస్తవానికి ముందేమి కానున్నదో స్వార్థిఅయిన చెన్నబసవన్నగాని, నిస్వార్థురాలైన రాణి గాని తెలుసుకోలేకపోయారు. ఒకవ్యక్తిజీవితం కానివ్వండి, ఒక ప్రజాజీవితం కానివ్వండి, మొత్తం లోకజీవితం కానివ్వండి, మనుష్యు లందరిపాటూ ఇంతే. రేపు ఏమి-అంటే భవితవ్యంగూర్చి ఖండితంగా ఇదమిత్థమని ఎవరూ చెప్పలేరు.

# 101

ఇంగ్లీషు అతిథులు సకాలంలో బెంగుళూరు చేరారు. రెసిడెంటు మదరాసు గవర్నరుకు ఈ చూసిందంతా ఒక నివేదికపంపించి దానిప్రతిని గవర్నరు జనరల్ మహాశయునికికూడా పంపించాడు.

‘ఈసారి నవరాత్రాలకు కొడగురాజుగారి ఆహ్వానంప్రకారం మడకేరికి నేను పోవడం గురించి ఇంతకుముందే తెలిపివున్నాను కదా ! మడకేరినుండి నిన్నటిరోజు తిరిగివచ్చాను. అక్కడిపరిస్థితిని మీకు తెలియజేయాలని మీ కీ ఉత్తరం వ్రాస్తూవున్నాను.

‘కొడగురాజు, జనులమనస్సును చాలాభాగం దుఃఖపెట్టాడని చెప్పడానికి సందేహం లేదు. దొడ్డ వీరరాజు తమ చివరిదశలో సగం మతిభ్రమణ చెందినరోజుల్లో చేసివున్న అత్యాచారాల్ని ఈ రాజు తమ పడుచుదనంలోనే చేసివున్నారు. కొడగుప్రజలకు ఈతని దౌర్జన్యంతో మనస్సు రోసిపోయింది. ‘మేము మడకేరియందున్నరోజుల్లో ప్రతిదినమూ ఊరిలో నాటక మండలికిచెందిన జనులు రాజ్యపరిపాలననుగురించి తెలిపే చిన్నచిన్న నాటకాల్ని ఆడి చూపించారు. వాటిలో వెనకటిరాజుల ఔన్నత్యాన్ని పొగడంతోబాటు, ఈరాజు దౌష్ట్యాన్ని అవహాస్యంగా, వ్యంగ్యంగా ప్రదర్శించారు. ఇష్టంలేని రాజుసమక్షంగానే ప్రత్యక్షంగా ఇంతటి వెటకారంగా నాటకం ప్రదర్శించడం ఎట్లా సాధ్యపడిందో తెలుసుకోవడం కష్టం. రాజు చాల బలహీనుడుగా కనబడుతున్నాడు. ప్రజలు బహిరంగంగానే ఆయనను ఎదురుకొంటున్నారు, ప్రతిఘటిస్తున్నారు.

‘మంత్రులు తమరాజును విడిచిపెట్టేమాట ఏమీ మాటాడలేదు. కాని వారికికూడ తమ రాజుపై అంత విశేషమైన భక్తిప్రపత్తులు ఏమీ లేవని వాళ్ళతీరునుబట్టి తెలిసింది. వాళ్లల్లో పెద్దవాడైన లక్ష్మీనారాయణయ్య (ఇతడు బ్రాహ్మణుడు) ఏమాటనూ ఖచ్చితంగా తెగేసి

చెప్పే స్వభావంకలవాడు కానట్లు కనబడుతోంది. బోవణ్ణ కొడగుజాతివాడు. ఇతడు కొంచెం స్పష్టవాది, సరైనసమయంలో ఇతన్ని ఒత్తిడిచేస్తే ఇతడు జనులపక్షాన మనకు సాయం చేయవచ్చునని తోస్తుంది.

'మూడోమంత్రి బసవన్న ఒకడు తనరాజును విడువకుండా అంటిపెట్టుకొనివుండే ఘటం. నిజానికి ఇతడూ, రాజూ వేరేవ్యక్తులు కారు, ఒకేవ్యక్తి అనిపించుకొనేంత చిక్కని స్నేహం కలవాళ్ళు. వీళ్ల పరస్పరమైత్రిని ప్రజలు బహువిధాలుగా వర్ణిస్తారు. దానిస్వరూపాన్ని చెప్పడానికికూడా నేను అసహ్యించుకుంటాను. సారాంశమిది: రాజు చిన్నవయస్సు నుంచీ ఇతనితోనే పెరిగి ఇతనివల్లనే చెడ్డగుణాలన్నీ అలవరించుకొన్నాడు. మిగతాజనం ఆడది అనేదాన్ని చూసే వయస్సునాటికే ఈతడు వంట్లో ఇహ శక్తిలేదు అనేంతదూరం దురాచారాల్లో పెరిగాడు; ఇప్పుడు ఈ మంత్రి రాజుకు వ్యభిచారంలో స్నేహితుడు, ప్రతినిధిగా రతిసుఖాన్నిపొందే మనుష్యుడు, రాజు తాను అనుభవించలేనిసుఖాన్ని ఇతడు అనుభవిస్తుంటే చూసి సంతోషిస్తాడు అని జనులలో ప్రచారమైవున్న మాట.

'ఇది ఎవరూ మనకు ప్రత్యక్షంగా చెప్పగలిగినవిషయం కాదు; మన పరివారంలోని వాళ్లు వసతికి వచ్చినవాళ్లను, బైట చూసినవాళ్ళను మాటాడించి ఉపాయంగా తెలిసికొన్నది.

'సాధ్యంకాని ఇతరసుఖాన్ని అంటినీ రాజు మద్యపానంద్వారా పొందుతాడట; మేము అక్కడున్నరోజుల్లో అతడు స్మృతితప్పిపోయేటంతగా తప్పతాగలేదు. ఇందుకు కారణం మేమక్కడవుండడమే అని తెలిసింది.

'రాణి నిజాయితీపరురాలు, గంభీరస్వభావంగల మహిళ. రాజభవనంమర్యాద ఏమైనా కొంచెం నిలబడివుంటంటే అది, ఆమె పెద్దరికంవల్లనే.

'ఈమెకూతురు ఇప్పుడిప్పుడే పడుచుతనం ప్రాంగణంలో అడుగుపెట్టుతోంది. ముద్దుగా పెరిగి తనవయస్సుకంటె చిన్నదానివలె నడుచుకొంటూ, ముద్దుముద్దుగా మాటాడుతూ వుంటుంది.'

'రాణినిగురించి ప్రజలకున్న గౌరవభావం, ప్రజలకు ఇంకా ఈ కుమారినిగురించి ఏర్పడలేదు.'

'మొత్తంమీద ఈవిధంగా అనిపిస్తోంది: సరి అయినకారణం ఒకటి వున్నవెంటనే మనం రాజును గద్దెనుంచి దింపేయడానికి ఎటువంటి అభ్యంతరమూలేదు. ఇది తగదనిచెప్పే ప్రజ కొంచెం వుండనేవుంటుంది. అయితే మన ప్రయత్నానికి సాయపడేజనం తగినంతమంది లేకపోలేదు.

'కారణం తనంతటతాను సమకూడిరావాలి. కారణంలేకుండా మనంపోతే అంతగా సాహాయ్యం దొరక్కపోవచ్చు. అది మన నేరమే అనిపించుకోవచ్చు. ఆతురపడకుండా వుండటమే ఇప్పట్లో మన ముఖ్యకర్తవ్యం.

'దీనిఅర్థం మనం చాలాకాలం మెదలకుండావుండాలని కాదు. రాజు పలుదిక్కుల్లో విరోధాలు పెంచుకొనివున్నాడు. ఆయన పెత్తండ్రి ఒకాయన రాజును గద్దెనుంచి దింపే టట్లయితే తనకుమారుని రాజుగా చెయ్యాలి అని ఇటీవలనే మనకు చెప్పుకొన్నాడు కదూ! పెత్తండ్రి ఒకడు వుండివుండాలని ప్రజలు వొప్పుకుంటారు. కాని రాజ్యం విడిచిపోయి చాలాకాలంగా బైటవుండిపోవడంలో అతన్ని చూసినవాళ్లు చాలా తక్కువమంది. మనం కోరు కుంటే ఈ మనుష్యుడు దేశంలో తనపక్షంలోవున్న ప్రజల్ని కూడగట్టికొని మనకు సాయం కోరినంతగా చేయగలడనిపిస్తుంది.

'రాజుకు ప్రస్తుతం ఓ అన్నకూడా వున్నాడని మనకు కాగితాలు వచ్చివున్నాయి. వీటిని వ్రాసినవాళ్లు ఎవరా అని కనుక్కోవడానికి ప్రయత్నంచేశాను. తెలుసుకోవడం సాధ్యంకాలేదు. ఎవరో గుప్తంగా ఈ ఉత్తరాలు వ్రాయించారు. వారు ఎవరు అనేది యథాసమయంలో తెలియకపోదు. వాళ్లవల్లనే దేశంలో కల్లోలం చెలరేగినా ఆశ్చర్యం ఏమీ లేదు.

'జనంలో తగినంతగా అసంతృప్తిపుట్టి కొందరైనా రాజుకు విరోధంగా కొంతగుంపుకు పోగుచేసి వున్నారనిపిస్తోంది. నాటకంలో ప్రత్యక్షంగా రాజును ధిక్కరించినజనం ఈముఠాకు చేరివుంటారు అనిపిస్తుంది. ఎదురుతిరిగిన వీరు మరింత తిరుగుబాటు చేయడానికి అట్టేకాలం పట్టదు. నెలా రెండునెలల్లో ఈ అసంతుష్టి బహిరంగమైన రూపాన్నిధరిస్తే ఆశ్చర్యపడ వలసింది లేదు.

'ఇది ఎట్లావున్నప్పటికీ రాజు తమ చెల్లెలిపెనిమిటిపై పగబూనివుండటంచేత ఆ అల్లుని ద్వారా వేగంగా రాజుకు హానికలగడం నిజం. ఈ అల్లుడు చెన్నబసవన్న జన్మచేత కొడగు వాడు. రాజకుటుంబంలోని పిల్లను పెళ్లాడటంకోసరం మతాంతరం స్వీకరించినవాడు. దొర కూతుర్ని పెండ్లాడడానికి ఒప్పుకొని తాను రాజుకు చాలా ఉపకారంచేశానని చెప్పుతూ వుంటాడు. స్వభావంచేత గర్విష్ఠి. రాజకుటుంబం అల్లుడనని మరింతగర్వం పోగుచేసి కొన్నాడు. ఇంటి అల్లుడు ఇంటికుమారునికంటె ఎక్కువ అనేటట్లుగా ప్రవర్తించడం ఈ దేశంలోనే అలవాటు; తాను రాజుకంటె గొప్పవాడననే విషయంలో చెన్నబసవయ్యకు ఎట్టి సందేహమూ లేదు.

'నేను చెప్పివున్న ఈ మూడు నాలుగుసందర్భాల్లో దేనిమూలంగా సంక్షోభం చెల రేగినా, దాన్ని శాంతింపజేయడానికన్నట్లు మనం ముందడుగువేయవచ్చు. అట్లయితే మనకు భూమిమీదికోరికతో దేశంమీద దండెత్తివెళ్లామనే అపఖ్యాతి తప్పిపోతుంది.

'కోలాహలం, గందరగోళం తానే పెల్లురేగే ఈసమయంలో రాజు దుడుకుస్వభావం కూడా మనకు సాయపడుతుంది. విరంకుశంగా ప్రవర్తించడం కొడగు రాజవంశంలోని సంప్ర దాయం. ఈ రాజు దాన్ని చక్కగా పోషించుకుంటూ వస్తున్నాడు. తోచినప్పుడు తోచినట్లు వెనకాముందూ చూడకుండా మాటలాడడమే రాజధర్మమని, రాజైనందుకు ముఖ్యలక్షణమని,

ఈ రాజభవన. తాను రాజై వుండి కొడగు అనే చిన్నదేశానికి అని ఇతనికి తెలియదు. నేను కాదు, గవర్నరు కాదు, గవర్నరు జనరల్ కాదు, ఇంగ్లండురాజే తనకు ఒజ్జీకాదు అనుకుంటాడు. ఈతని మాటలదోరణికి ఇతిగాని మితిగాని లేదు.

'ఇటువంటిమనుష్యుడు దేశంలో, ఇప్పుడు కనబడేపరిస్థితిలో, తన అవివేకంచేత దావాగ్నిని ప్రజ్వలింపజేయడాని కెంతోకాలం పట్టదు.

'కొడగురాజులు మనవిషయంలో ఎల్లప్పుడూ విశ్వాసంగా మసలుకొన్నమాట నిజమే. అయితే ఈ విశ్వాసంవెనక ఆంగ్లప్రభుత్వంగురించిన భయం దోబూచులాడుతూవుంది. స్నేహితులై వుంటూవున్న ఇటువంటి రాజులవిషయంలో, మనం విరోధులంగా ప్రవర్తించవచ్చునా అనేది విచారణీయాంశం. మనకైనా ఈ సందేహంలేకుండా లేదు. కానైతే ఈ సందేహం స్పష్టంగా కనబడుతున్నట్లే దానికి చెప్పుకోదగ్గ సమాధానంకూడా మరీ స్పష్టంగా మనకు కనబడుతూనే వుంది. రాజుగారు స్నేహితులు. అయితే ఆయన దుష్టుడై ప్రజలు ఆ దౌష్ట్యంనుండి మమ్మల్ని రక్షించండి అని కోరినప్పుడు, మనకర్తవ్యం ఒక్కటే. దుష్టుడైన దొరకు సహాయపడకుండా పీడితులైనప్రజలకు తోడ్పడడమే. ఈవిషయం కుంపిణీ సర్కారువారి ఇంతకుపూర్వప్రవర్తనవల్ల స్పష్టమవుతూనే వుంది.

'మైసూరురాజులు మన స్నేహితులు. ఇప్పుడూ మనస్నేహితులే. అయితే వాళ్ళ పరిపాలనాదౌష్ట్యంచేత, ప్రజలను వాళ్లనుండి రక్షించడానికిగాను, వాళ్ళను సింహాసనంనుంచి దింపవలసి వచ్చింది.

'అదేవిధమైన సమస్య మనల నెదుర్కొంటే అదేవిధమైన నివారణోపాయాన్ని మనం కొడగురాజ్యానికి అన్వయింపవలసి వస్తుంది.

'ఇటువంటిసమస్య తలెత్తాలి అని నేను కోరడంలేదు. కాని అది తలెత్తితే నివారించడానికి నేను వెనుకాడబోను.

'రాజు మమ్మల్ని అతిప్రేమతో చూశారు. ఆదరాతిథ్యాలు ఈ దేశంప్రజలకు వెన్నతో పెట్టిన విద్యలు. కొడగులోవున్న ఆరురోజులూ, మాకు పరలోకసౌఖ్యాలు లభించాయి. ఆ సుఖంలో ఒకటే లోపం. తాము మాతోపాటు లేరనేది.'

ఇట్లు సదా తమవాడైన రెసిడెంటు అని సంతకం.

# 102

అప్పంగొళకు చేరి చెన్నబసవయ్య వీలైనంతశీఘ్రంగా దేశాన్నివిడిచి బెంగుళూరికి ప్రయాణ మయ్యే సన్నాహాలుచేయ మొదలుపెట్టాడు. రాజభవనం చేరినక్షణమే దేవమ్మాజీకి ఏకాంతంగా ఈ ఆలోచనతెలిపి, 'ఈరోజో రేపో బయలుదేరిపోదాం. ప్రయాణానికి సిద్ధంకండి' అన్నాడు.

'బెంగుళూరికి పోదామా?'

'అవును. తెల్లదొరకు చెప్పాను. ఆయన మనపక్షంలో వ్యవహారం నడిపిస్తారు. మీ అన్న వివేకంగా ప్రవర్తిస్తాననే భరోసాఇస్తే వెనక్కు వద్దాం. హఠంపట్టితే అతన్ని గద్దె నుంచి దింపించి మీరు గద్దె నెక్కవచ్చు.'

'అంతా సరిగా అయితే మంచిదే. లేకుంటే చాలా అపాయంకాదూ!'

'ఇక్కడ వుండిపోవడం అంతకంటె ఎక్కువ ప్రమాదం. దినదినగండంగా, క్షణక్షణ గండంగా బ్రతకాలిసివుంటుంది. ఇంతకంటె అదెంతో మేలైనవని.'

'ఔను. ఇట్లా వున్నప్పటికీ ప్రజాసమూహం ఎదుట అన్నయ్యకు అవమానం కలిగించే మాట లనిపించారే, సూరప్ప ఎందుకట్లా చేశాడు?'

'దానికథ చాలావుంది. సూరప్పకాదు, ఆయన అప్ప స్వర్గంనుంచివచ్చినా ఆ పాణే బావనయ్యను నోరు మూయించలేరు. ఆయన పెళ్ళాన్ని ఈయన కాజేసితెచ్చాడు. పాటువడి అతను విడిపించుకొన్నాడు. ఆటనెపంలో తుంటరిమొహాలపై ఉమ్మేసి కడుపుమంట చల్లార్చుకొన్నాడు.

'ఆయన కడుపుమంట చల్లారింది మంచిదే. అయితే మనకిప్పుడు పీకులాట.'

'మూడురోజులు ఈ పేచీ. నాలుగోరోజు నీవే దొరవు.'

'ఈ నొసటిపై ఆ భాగ్యం రాయలా.'

'దాన్ని చూసివచ్చినవారు ఎవరులే-పోసీ. ఆసంగతి మేం చూస్తాం-అంటే మీ అన్నయ్యకు బుద్ధివచ్చేటట్లు చేయకపోతే నేను చెన్నబసవయ్యను కాదు.'

'మంచిది. నాలుగుచీరెలూ, నాలుగుసొమ్ములూ అంతేగా! సిద్ధంకావడం ఎంతసేపు? ఎప్పుడు బయలుదేరాలంటే అప్పుడే బైలుదేరతాము, ఏర్పాట్లు చేయండి.'

చెన్నబసవన్న పరివారంలో తగినంతమంది నౌకర్లు ఉన్నారు. వారంతా దొరవిషయంలో చాలా నమ్మినబంట్లు. స్వభావంచేత ఎవరు యజమానిఅయితే వాని ఆజ్ఞ చావుకైనా వెనకాడకుండా పాటించేవాళ్లు. చెన్నబసవన్న వాళ్లల్లో బోయ బోమన్నను పిలిచాడు.

'ఈరోజో రేపో మీరు అరుగురు ఓమనిమీద వెళ్ళిరావాలసివుంటుంది. అరుగుర్రాలు సిద్ధంచేసి వుంచండి చెబుతాను' అన్నాడు. సోమన్న: 'చిత్తందొరా!' అన్నాడు.

కాని చెన్నబసవయ్య చేసిన ఈ ఏర్పాటు సుఖంగా నడవలేదు. ఆ సాయంకాలం మడకేరినుంచి బసవన్నదళంలోని అరుగురు పదాతిసైనికులు అప్పంగొళకు కావలికి అని వచ్చారు.

వాళ్లు వచ్చారని తెలిసినవెంటనే చెన్నబసవయ్య వాళ్ళను రాజా పంపించివున్నాడు, తానూ తనపెండ్లాం, పిల్లదూ ఆక్షణంనుంచీ బందీలమనేసంగతి గ్రహించాడు. దేవమ్మాజికి కూడా ఇది అర్థమైంది. రాజభవనంలో ఒక్కత్తెయే బంది అయివుండి విడిపించుకొనివచ్చి నాలుగునెలలైనా ఇంకా కాలేదు. ఇప్పుడు తనతోబాటు తనభర్త, తనబిడ్డకూడా బందీలయ్యే పరిస్థితి దాపురించింది అని ఆమె వాపోయింది. ఈ దుస్థితి తలచుకొని వలవలా ఏడ్చింది. ఇంతోటి అదృష్టానికి ఈబిడ్డ ఎందుకు పుట్టాలి అని దుఃఖంతో విలవిలలాడిపోయింది.

రాత్రి చెన్నబసవన్న 'అవ లెల్లుండి నౌకర్లకు అని ఆయుధపర్వం చేయించండి. రాత్రి అందరికీ భోజనాలు పెట్టండి. ఆపై మాట చెప్తాను' అన్నాడు. సోమన్నకు తగిన హెచ్చరిక చేసివుంచాడు.

ఆరోజు ఈ రాజభవనం ఆయుధపూజ నడిచింది. మధ్యాహ్నం ఆటపాటల్లో ఇతరులతోపాటు మడకేరినుంచివచ్చిన కావలామనుష్యులూ సహజంగా చేరారు.

రాత్రి వాళ్లకందరికీ పండగ భోజనం. చెన్నబసవన్న బసవన్నపంపిన కావలామనుష్యులకు ఓ వరుసలో కూచోపెట్టాడు. వాళ్లకు వడ్డించిన పాయసంలో తగినమోతాదులో నల్లమందు వేయించాడు. దేవమ్మాజికి బైలుదేరడానికి సిద్ధంకండి అని చెప్పాడు. సోమన్నకు యుక్తిచెప్పాడు.

నల్లమందు మరి ఇటువంటివే ఇతరవస్తువులు మొదటినుంచీ ఇలాంటి గొప్పవాళ్ల ఇండ్లలో వుండనేవుంటాయి. రాజభవనం జీవితాల్లో ఎంతో అంత విషంకూడా ఉండవలసిన వస్తువుల్లో ఒకటి. అదనుతప్పినసమయాల్లో జీవితంలో అన్నంకంటె విషమే ఎక్కువ ప్రియమైనవస్తువు. అన్నం పుట్టనివాళ్లకు జీవితంనుంచి విముక్తికలిగించే వస్తువు.

రాత్రి మొదటి సగభాగంలో ఇద్దరూ, రెండో సగభాగంలో మరో ఇద్దరూ కావలావాళ్లు మేల్కొనివుండాలి. నిద్రపోయే నలుగురూ నిద్రపోతూవుంటే కావలావాళ్ళు ఇద్దరు బైటికి పోకుండాచూస్తూ కొంచెంసేపు చుట్టూ తిరిగారు. అదేమో అపుకోలేనంత కునికివచ్చి 'ఇదేమిటో కళ్ళు ఒకటే మూతలు పడిపోతున్నాయి' అని ఒకరికొకరు చెప్పుకొని ప్రశ్నించుకున్నారు. కొంచెంసేపైనతర్వాత వాళ్లల్లో పెద్దవాడు, 'నేను కొంచెం పడివుంటాను. ఓగడియ పోయింతర్వాత లేపు' అని అరుగుమీద అడ్డంగా నిద్రకుపడ్డాడు. అతన్ని లేపేబాధ్యత వహించిన యువకుడు అరగంటలోపల తానూ అపుకోలేక నిద్రకుపడ్డాడు.

వాళ్లంతా ఈవిధంగా మైమరచి పడుకోనియ్యి అని కాచుకొని కూచున్న బోమన్న చెన్నబసవయ్యను 'ఇప్పుడు బైలుదేరిపోతారా దొరా!' అని అడిగాడు. దేవమ్మాజీ సిద్ధంగా వుండటం తెలిసికొని, బిడ్డ నిద్రపోతూవున్న తొట్టెను నెత్తిన పెట్టుకున్నాడు.

గుర్రాలు రాజభవనం ఎదుటివల్లంలో చెట్టుచాటున నిలబడివున్నాయి. వాళ్ళు రాజభవనం వెనకటి వాకిటినుంచి బైటపడి మెల్లగా చుట్టివచ్చి కాల్వదాటి వాటిదగ్గిరకు వచ్చిచేరారు.

చెన్నబసవన్న ఓ గుర్రాన్ని ఎక్కాడు. దేవమ్మాజీ అతనివెనక ఎక్కి అతని నడుం పట్టుకొని కూచుంది. బోమన్న మరోగుర్రం ఎక్కాడు. కూడావున్న తుక్రను ఓ గుర్రం ఎక్కమనిచెప్పి తొట్టె అతనిచేతికి ఇప్పించాడు. తాను ఓ విడిగుర్రాన్ని నడిపించుకుంటూ ముందుకు బైలుదేరాడు. అతనికంటె చిన్నవాడు ఉగ్రి వెనకాల ఓ గుర్రాన్నిఎక్కి ఓ విడి గుర్రాన్ని నడిపించుకుంటూ వచ్చాడు.

జాగ్రత్త అనవసరమైనప్పటికీ అజాగ్రత్తగావుండటం ఇష్టంలేక ఓ నూరుగజాలుదారిని మెల్లిని నడకలతో ముగించి ఆపిమ్మట వాళ్ళు చేతనైనంతవేగంగా సంపాజెలోయ ముఖంగా ప్రయాణం సాగించారు.

# V

# కథాపూరణం

## 103

అప్పంగొళకు కావలావాళ్ళను పంపించి రాజు బసవన్నతో 'ఓరి! కుంటీ! ఆట ఆడే సమయంలో విన్న 'పది' ముసలివాడు అక్కడనిలబడి ఆ బావనకుర్రాణ్ణి ఎచ్చవేసాడు. అతన్ని పట్టుకొని రమ్మనమను, కొంచెం విచారిద్దాం' అన్నాడు.

ముసలివాడు ఏమో మాట్లాడటం ఆయనకు గుర్తు. ఆడినమాట తమకు విరుద్ధంగా లేదనేసంగతి ఆయనకు తెలియదు. బసవన్న: 'అతన్ని పిలిచేదేమిటి దొరా! నేను విచారించి వస్తాను' అన్నాడు.

తోడ్తో బసవన్నకు నాటకంలో మంత్రిపాత్రనువహించి తనపేరు బసవ అని అబద్ధం చెప్పి తన్ను అపహాస్యానికి గురిచేసిన ఆ కుంటి బికారిమీద పెద్ద కోపం. అతడు ఆ ముష్టి ముండావాణ్ణి పట్టుకొని బాగా ఉతికేయ్యాలి అని నిశ్చయించుకొన్నాడు.

ఈ రెండోమని వెంటనే జరిగిపోవాలి. వాణ్ణిపట్టుకొని రావడానికి ఇద్దరుదూతలు బైలుదేరి వెళ్ళారు.

భిక్షుకుడు కుంటి లక్కన్న నాటకం ముగిసేటప్పుడు తన తలకు ఏదో తట్టుకోవడం గమనించాడు. ఆటలో చేరు అని నలుగురూ పిలిచినప్పుడు అతనికి ఆట ఎటువంటిదో తెలియదు; దానిలో రాజు, ఆయన కుంటిమంత్రి, వీళ్ళనుగురించిన అవహేళన, అపహాస్యం ఉందనే ఆలోచనే అతనికి తట్టలేదు. 'నీకు తోచినమాట మాటాడు, సూరినారణప్ప దాన్నే పెంచుకపోతాడు. నువ్వు ఏంచెప్పాలోకూడా తానే చెప్తాడు. పేరేమిటి అన్నప్పుడు 'బసవ' అని చెప్పు, చాలు' అని చెప్పారు.

రాజసమక్షంలో దూరంనుంచివచ్చిన పరంగులఎదుట తానూ నాటకం ఆడేసందర్భం దొరికింది అనేసంబరంతో అతడు రంగస్థలానికి వచ్చాడు.

సూర్యనారాయణ రాజునూ బసవన్ననూ అపహాస్యం చేస్తూవున్న సంగతి అతని కంతగా తెలియలేదు. కాని రాజు కోపంతో మొరగి, బసవన్న లేచి, మాచన్న తమదగ్గిరకువచ్చాక లక్కన్నకు ఇదేమో హెచ్చుతగ్గు లైనట్లుందని తెలిసింది. జనసమూహంలేచి రంగస్థలం మీదికి పరుగెత్తుకొనివచ్చారు. సూర్యనారాయణనూ, అతన్నీ అక్కడినుంచి అతనలికి

లాక్కుపోయ్యారు. రాజభవనం ఆవరణ దాటివెళ్ళగానే అతన్ని ఓ సందులోకితోసి 'సద్యా ఎక్కడైనా తలదాచుకో. రేపు మేము చూసుకొంటాం' అని వెళ్ళిపోయారు.

రాజు కోపగిస్తే వాళ్ళెవరూ రక్షించలేరని లక్కన్నకు బాగా తెలుసు. ఇంక తనకు మడకేరిలోవుండే ఋణం తీరిపోయిందనీ, మైసూరుకు పారిపోవడమే మంచిదని అనీ, నిరాశతోకూడిన నిశ్చయానికి వచ్చాడు. ఉదయం కాకముందే కుశాలనగరంవైపు బైలుదేరాడు.

అతన్ని పట్టుకొనితెండి అని బసవన్న పంపించిన నౌకర్లు, అతడు వాడుకగా కూచుని వుండే చౌకులో అతడు లేకపోవడంచూసి ఎక్కడికిపోయాడో ముండావాడు అని విచారిస్తూ వెళ్లారు. వాళ్లు లక్కన్నను ఎందుకు వెదకుతున్నారో కారణంతెలియని ఓ ముసలవ్వ అతడు ఇటువైపే పోతూవున్నాడని చెప్పింది. బిచ్చగాడు రెండుక్రోసుల దూరంలోవున్న పల్లెల్లో ముష్టి ఎత్తుతాడు. బసవన్నపంపిన ఓ దూత యమదూతలాగా వచ్చాడు: చేతిదురద పోయేటట్లుగా అతన్ని బాదబాది అతనిచేతులకు తాడేసికట్టి అతన్ని మడకేరికి ఈడ్చుకొనివచ్చి, బసవన్న సమక్షంలో నిలబెట్టాడు.

బసవన్న కుక్కలకొట్టిలో పర్యవేక్షణ చేసేసమయంలో నేరస్థుడైన లక్కన్న ఎదుట పడ్డాడు. మంత్రి బిచ్చగాణ్ణి నోటికొద్దీ తిట్టాడు. 'మమ్మల్ని నవ్వేటంతగా కొవ్వెక్కిపోయావా నువ్వు! ముష్టితిండితిని పందివెధవా!' అని కేకలు వేశాడు.

బికారికి నోరు మెదలలేదు. అంత భయం. బసవన్నచుట్టూ అతడుపెట్టిన తిండి తింటూ వదికుక్కలు పులుల్లా లక్కన్నవైపు చూడటం మొదలుపెట్టాయి. బసవన్నముఖం, కుక్కల కళ్లు, అతనికి యమలోకంలా కనబడ్డాయి. భయంతో తొట్రుపడుతున్న గొంతుతో అతడు 'అయ్యో! అయ్యో! లేదు నా దొరా! దొరలను, మంత్రుల్ని పొగిడే ఓ ఆట ఆడుతున్నాం, మంత్రిఅయ్యే గౌరవం ఇస్తున్నాం' అన్నారు పొట్టకులేని ముండావాణ్ణి. మంచిదైంది అని వచ్చాను. తీరా పానానికి వచ్చేసింది' అన్నాడు.

'నా కాలు కుంటిఅని హాస్యం పట్టించాలని కుంటివాణ్ణి నిన్ను రమ్మంటే నీ పొగరు చూడు ఎంతుందో, వచ్చి తగుదునమ్మా అని నిలబడ్డావు.'

'అయ్యో స్వామీ! అది నాకేం తెలుసు. రా అంటే వచ్చా. ఉత్తపున్నానికి రచ్చైపోయింది.'

'కుంటి అనేది నీకు తెలుసునో తెలియదో పోనీ. పేరేమిటి అని అడిగితే బసవ అని చెప్పావే! నీ పేరు బసవన్నా?'

'అయ్యో! దేవుడా! నన్ను బసవ అని పిలిచిన తండ్రీలేదు, తల్లీలేదు. నేనొక తల్లితండ్రులులేని అనాధుణ్ణి. ఎవరో కుంటి లక్కన్న అన్నారు. కుంటి లక్కన్న పేరు పడిపోయింది. నేను బసవన్న ఎందుకౌతాను?'

'పేరు బసవన్న అని ఎందుకు చెప్పావు?'

'మంత్రి బసవన్నగారు ఎంతో బుద్ధిమంతులని పొగడాలి. మంత్రి అంటే బసవన్నగారే మంత్రులు, వేరెవరూ మంత్రికాదు అన్నట్లు నటించాలి అన్నారు. నేర్పిపెట్టినమాటలు దొరా! అయిపోయిందేదో అయిపోయింది పోనీ అనే పెద్దమనస్సుతో దొరలు నన్ను విడిచే పెయ్యాలి.'

'ఒరే గాడిదకొడకా! ఆడకూడని నాటకం ఆడి ఇప్పుడు అంగలార్తే విడిచిపెట్టేస్తానా? పుచ్చుకో తొత్తుకొడకా' అని బసవన్న నాలుగుఅడుగులు ముందుకు వచ్చాడు. తనచేతిలోని తోలుకొరడాతో లక్కన్నతలపై ఛడేలుఛడేలుమని రెండు పీకాడు. మరు క్షణంలో అతడు కావాలని విడిచిపెట్టాడో, లేక యజమాని కోపాన్నితెలుసుకొని, కుక్క దుందుడుకుపిండమేమో అతను ఎడంచేతితో నిమురుతూనే వున్నాడు, ఉన్నచోటునుంచి ఒక్కదూకు దూకింది. ముష్టివానిగొంతుక కరచిపెట్టింది. అతడు కేకేసి క్రిందికివడితే నోరుతెరచి అతని మొగంమీదికి వచ్చింది.

యజమాని కోరికఏమిటో తెలియక నౌకర్లు మెదలకుండా నిలబడిపోయారు. కుక్క బిచ్చగానిముక్కు కొరికిపారేసింది. బసవన్న అప్పుడు 'ఓయ్! ఇటురా!' అని దాన్ని పిలిచాడు. నౌకర్లు దానిమీదికిపోయి దాన్ని పట్టుకొని నిలిపేసారు.

ఈ దెబ్బలమూలాన బిచ్చగాడు సగం చచ్చి గోలపెడుతూ, పడిపోయినవాడు పడ్డట్టే వుండిపొయ్యాడు. బసవన్న: 'ఈ ముష్టివెధవనీ, కుక్కల కొడుకును, అవతల తీసుకపోయి పారెయ్యండి. ఇక్కడ శవమైతే కష్టం. ఇక్కడ వీడికెవరు వీళ్ళుపోసేవాళ్ళు?' అన్నాడు. నౌఖర్లు లక్కన్నను పట్టుకొనిలేపి ఎత్తుకొని బైటికి తీసుకొనిపోయారు. గాయంనుండి రక్తం కారి అతనిశరీరం తడిసిపోయివుంది. శరీరంపైవున్న చినిగినగుడ్డ రక్తసిక్తమై వుంది. నొప్పి భరింపలేక వాడు గొంతెత్తి గొల్లుమని ఏడ్వటం ప్రారంభించాడు. అట్లాగే అతన్ని కుక్కల దొడ్డి ఆవరణంబైటికి లాక్కొనిపోయి అవతలికితోసేసి నౌఖర్లు వెనక్కు తిరిగివచ్చారు.

బసవన్న చేసింది అన్యాయం అనికాని, తమ నడవడిక క్రూరమైందనిగాని వాళ్లకు తోచనే లేదు.

బైట దారిలో నేలమీద కుప్పనకూలబడి ముష్టివాడు ఏడుస్తుంటే ఎవరో వచ్చారు. వాడిప్రక్కనకూచొని 'ఎందుకో ఏమైంది' అన్నారు. ముష్టివాడు: 'మంత్రి బసవన్నగారు మీదికి కుక్కని వదిలారు. అది నా ముక్కు కొరికేసింది' అన్నాడు.

వచ్చినవారు అపరంపరస్వాములు. ఆయన ముష్టివానిని లేవదీసి నిలుచుండబెట్టి, 'ఆ ఇంటిదాకా రా! మొహం కడుక్కొందువుగాని' అన్నాడు.

బిచ్చగాని మొహంచూసి స్వామికి కనికరంకంటె ఎక్కువగా భయమే వేసింది.

కుక్క పన్ను ముక్కుమొదలుమాత్రంవదలి, దాని చివరిని, మెత్తనిభాగాన్ని పూర్తిగా పీకేసింది.

స్వామి బిచ్చగాని దగ్గిరనున్న ఇంటిదాకా నడిపించుకొనిపోయి ఇంటివాళ్ళనుపిలిచి 'కొంచెం నీరు త్రాగు' అని అడిగాడు. ఇంటివాళ్ళు తెచ్చిన నీటిచెంబును తనచేతిలో తీసికొని బిచ్చగాని గాయాన్ని ఉపాయంగా కడిగాడు. 'కొంచెం కుంకుమ ఇస్తారా?' అన్న అతని ప్రార్థనకు ఇంటివాళ్ళు పిడికిటనిండా కుంకుమ తెచ్చి ఇచ్చారు. స్వామి దాన్ని గాయానికి పట్టించాడు. తనబట్టచెంగు ఒక తాడులాగాచేసి గాయంమీదకట్టి తల వెనకపక్క బిగించెను. 'బోపణ్ణమంత్రులదగ్గిరకుపోయి జరిగినసంగతి ఏమిటో చెప్పు. ఆయన్ను సాయపడమని వేడికో' అని చెప్పాడు. ముష్టివాడు సహించరానినొప్పిని ఎట్లాగో సహించుకుంటూ, 'అబ్బో! అయ్యో! అమ్మో!' అంటూ మూలుగుకుంటూ బోపణ్ణగారి ఇంటికి వెళ్ళాడు.

స్వామి ఇంటివాళ్ళపాత్ర వాళ్ళది వాళ్ళకిచ్చి 'కొడగుజనం వేటకుక్కలయ్యారు' అని తనలో తాను నణుగుకొంటూ తనదారిని తాను వెళ్ళిపోయాడు.

# 104

తన్ను అవమానపరిచిన ముష్టివానికి తగిన శాస్తిచేసి తనపని ముగించుకొన్న బసవన్న ఉత్తయ్య తక్కను విచారించదలచుకొన్న స్వామిపనికై మనస్సు త్రిప్పెను.

ఆ పనికై అతనికి కింకరులుగా ఊరినిండా నూరుమందికిపైనా రౌడీలు వున్నారు. వాళ్ళల్లో నలుగురు మరీ ముఖ్యమైనవాళ్ళు. వాళ్ళ ఒక్కొక్కళ్ళచేతిక్రింద ఇరవై ముప్ఫై మంది అనుయాయులున్నారు.

ఈ ప్రధానమైనవాళ్ళల్లో ఎవనికైనా బసవన్న చెప్పిపంపించాడంటే ఏమో పెద్దకుట్ర ఏదో నడువనున్నది అని రాజభవనంలోని పరిచారకులందరూ గుబ్బిసలాడటం మొదలుపెట్టారు. ఈ సమాచారం బైటపొక్కితే ఊరిలో మంచివాళ్ళకెవరికో ఏదో చెఱుపు జరుగనున్నదని వాళ్ళకనుమానం. ఆరోజు బసవన్న పోకిరీపెద్దకు చెప్పిపంపించినతర్వాత కావలివాడైన మాచన్న 'సంగతి ఏమిటా' అని ఉపాయంగా తెలుసుకొన్నాడు.

రాజభవనం అన్నివిధాలైన సేవకవర్గాలలోనూ అతని మనుష్యులు ఒకరిద్దరు ఉండనే వున్నారు. బసవన్న రౌడీపెద్దకు చెప్పినమాటనువిన్న ఆ మనుష్యులు ఆ విషయం మాచన్నకు చెప్పనే చెప్పారు.

'రాజభవనం సగౌరవంగా ఇచ్చే దినవెచ్చం పుచ్చుకొనే ఉత్తయ్యతక్క బోపణ్ణమంత్రి ఇంట్లో దిగివున్నాడు. ఆయన నాటకంలో దొరకు అవమానం కలిగించేమాటలను అనండి

అని నటులకు నేర్పిపెట్టాడు. అయన ఎక్కడైనా ఒంటరిగా పోతూవున్నప్పుడు, మీవాళ్ళు ఎవరైనా మీదపడి చెంపమీదా, వీపుమీద నాలుగుపెట్లు పెట్టండి. ప్రాణం తీయవద్దు. నజ్జునజ్జుగా, బజ్జిబజ్జి అయ్యేటట్లు పట్టుగా సిసలైనవి నాలుగు ఇచ్చుకోండి' అని పోకిరీపెద్ద ఆజ్ఞ పొందాడు.

ఆసంగతి తెలియగానే మాచయ్య నారాయణదీక్షితులకు తెలిపాడు. దీక్షితులు ఈసంగతి ఏమీ తెలపకుండానే తనముఠాకుచెందిన ఓ మనిషిని ఉత్తయ్యతక్కమీద కావలాకు పెట్టాడు. 'తక్కరు ఎక్కడికైనా ఒంటరిగాపోతూవుంటే కొంచెందూరంలో నీపాటికి నువ్వు నడుస్తూ వెనకతట్టునవుండు, ఎవరైనా అయనమీద పడితే సాయానికి పో' అని నిర్దేశించాడు.

తక్కకు ఈ సంగతిచెప్పి సావధానపఱచడం, వాళ్ళెవరికీ ఇష్టంలేదు. తమకో ముఠా ఉన్నట్లు, ముఠావాళ్ళకు చెప్పినమాటలు ఇవి, అని బైటపడటానికి ఇది సమయంకాదు; మొత్తంమీద తిమననిని తాము సాధించాలి. తమముఠా ఉన్నదనేసంగతిమాత్రం రహస్యంగానే వుండిపోవాలి.

'కావేరి మక్కళు' సంఘం ప్రస్తుతాని కింతకంటె ముందుకు రాదలచుకోలేదు. ధర్మమార్గాన్ని తప్పవద్దని ముసలిదీక్షితులు వీరన్నచేతులు బంధించేశాడు. పడవాలు ఉత్తయ్యకు కీడు కలుగవచ్చునని స్వామి ఎంతో సావధానంగా వున్నాడు. ఉత్తయ్య తనసీమలో గొప్ప కావచ్చు; ఇక్కడేమిగొప్ప? సంఘం పెద్దగా అతనికై ఏమిటి చేస్తుంది?

బసవన్ననుంచి ఆజ్ఞపొందిన పోకిరీపెద్ద దాన్ని నెరవేర్చడానికి అనవసరమైన కాలహరణం చేయలేదు. ఆరోజు సాయంకాలం తక్క తన సాహుకారు దుకాణానికై పేటలో పోతున్నప్పుడు జనం కొంచెం తక్కువగాఉన్న స్థలంలో ఎవడో ఒకడు ఓమూల నిల్చుని 'ఏమోయి! మాలావు మగదీరుడవనా పులిమీసాలూ నువ్వూ?'

తక్క: ఎవడురా వాడు మీసంసంగతి మాటాడేవాడు?' అని అతనివైపు తిరిగాడు.

ఆ మనుష్యుడు: 'ఎందుకు తాతా! నేనే అన్నది.'

తక్క: 'ఏమిటన్నావు మీసాన్నిగురించి?'

'కావాల్పించేదో అన్నాను, నీకేం?'

'నన్ను చూసేగా ఆ కూసింది?'

'ఓహో తాతా! ఊరికెల్లా నీ దొక్కడే మీసమా?'

'ఊరికి వేరేమీసాలు వుండనీ. ఇక్కడ ఎవరిది పులిమీసం చూసావు?'

'మీదే ననుకోండి. అందంగా వున్నదనకూడదా?'

'అనకూడదు బిడ్డా! వెంట్రుకలు నరసిపోయాయి అని కోపం నరసిపోయిందనుకుంటున్నావా?' అ ట్రేపేలితే, వాతలు తేలేటట్లు కొట్టిస్తా. ఏమనుకుంటున్నావో!'

'మంచిదని తాతా! వాతలు తేలేటట్లు కొట్టిస్తావా? మీసాలు మా పొంకంగా వున్నాయంటే నువ్వేమైనా దొరనయిపోయా ననుకొంటున్నావా?'

వాళ్ళిద్దరిమధ్య మాటలు పెరిగేటప్పటికి అక్కడినుంచి ఇక్కడినుంచి ఒక్కొక్కళ్లుగా ఏడెనిమండుగురు మనుష్యులు వచ్చారు. చుట్టూ నిలబడ్డారు. ముసలివాడిమాటకు ఎగతాళిగా 'ఓహో!' 'ఊహూ!' 'ఆహా!' అంటూ ఒక్కడు ఎక్కిరించాడు. మరోడు నవ్వాడు. మొత్తానికి అందరూ వీధిపోట్లాటలోని రసం అనుభవించారు. నారాయణదీక్షితుల మనిషి వచ్చి తానూ గుంపుచివరిలో నిలిచాడు. జరుగుతూవున్న సమాచారం అంతా జాగ్రత్తగా కని పెట్టాడు.

తక్క : పొగరు పిల్లకాయలకు వాతలుపెట్టడానికి దొర దిగిరావాలా? ఎంత పొగరుగా మాటాడుతున్నావ్.'

పోకిరీవాడి స్నేహితుడు : 'ఎవరో ఈ ముసలాడునోరు పూర్తిగా కొవ్వివుంది. రెండు పీకి బుద్ధి రానీ' అన్నాడు.

తక్క : 'ఎవడో వాడు పీకేవాడు. పీకుచూద్దాం' అని తనచేతిలోవున్న మోటుకర్ర పైకెత్తాడు. ముసలాడు ఈవిధంగా చేసిందేతడవుగా గుంపులో ఎవడో ఒకడు అయ్యో అని కేకలూ బొబ్బలూ పెట్టాడు. వేరొక్కడు 'అరే! ముసలాణ్ణి పట్టుకోండి' అన్నాడు. మరో ఇద్దరు ముసలాడిమీదికి లంఘించారు. ఒకడు ఆయనజబ్బ పట్టుకొన్నాడు. మరొక్కడు వెనకనుంచి ఆయన నడుం వాటేసుకొన్నాడు. ముసలాడి చేతికర్రను గుంజేసి మొదటిరౌడీ దాన్ని ముసలాడిబుజంపై మోదడానికని ఎత్తాడు.

దీక్షితులమనిషి అతనివెనకనే నిలబడ్డాడు, కర్రను గుంజేసికొన్నాడు. 'ఎందుకప్పా! తాతను కొట్టారు. ఆయనపాటున ఆయన్ను పోనివ్వండి' అన్నాడు.

పోకిరి : తనవ్యవహారం ఇట్లా అడ్డు తగులుతుందని అనుకోలేదు. వాడు కొత్తవాని వంక మూసి 'వీడు ఎవడో వచ్చాడు, వీడికి రెండు ఇచ్చుకోండిరా' అని అతనిమీద కురికాడు. తక్కచుట్టూవున్న జనంలో చాలామంది ఇటు వచ్చారు. దీక్షితులమనిషి కర్ర గిరగిరా త్రిప్పుతూ గట్టిగా 'కావేరి మక్కళు, కావేరి మక్కళు' అని బిగ్గరగా అరిచాడు. రౌడీలు అతనిమీద విరుచుకొనిపడ్డారు. కర్ర తిప్పడంతోపాటు అతడు తిరిగి మరింతబిగ్గరగా ఆదే కేక పెట్టాడు. ఎదో ఇంటిలోంచి 'మక్కళ తాయి' 'మక్కళ తాయి' అని కేక వినవచ్చింది. అదేక్షణంలో కొంచెందూరంలో ఒక మనుష్యుడు కర్రపట్టుకొనిరావడం కనబడింది. ఆ మనిషీ 'కావేరి మక్కళు' అని అరిచాడు. 'మక్కళ తాయి, మక్కళతాయి' అని కేక పెట్టుతూ ఒకటి రెండు నిమిషాల్లో పేటవైపునుండి, వీధుల్లోంచి ఎనిమిది, పదిమందిజనం కర్రలుపట్టుకొని పరుగెత్తుకుంటూ వచ్చారు.

ఇంతమందిజనంతో పోట్లాడవలసివస్తుందని పోకిరీపెద్ద ఊహించలేదు. అయినా, ఆయన అమయాయులు పలాయనం చిత్తగించారు. ఉత్తయ్యతక్కను రక్షించినజనం ఆయనచుట్టూ నిలబడ్డారు. దీక్షితునిమనిషి 'ఎటువైపువెళ్ళాలో పదండి, ఇద్దరం తోడుగావస్తాం' అన్నాడు.

తక్క: వీరెవరయ్యా! వీళ్ళు మీదపడ్డవాళ్ళు! కాలుదువ్వి కయ్యానికి వస్తారే!'

దీక్షితులమనిషి: ఎవరో వీధిరౌడీలు. జగడం ప్రారంభంకాగానే నేనూవచ్చి కొట్టుతున్నారు, కొట్టుతున్నారు అని మనుష్యుల్ని పిలిచాను.'

తక్క: 'దేవుడిలావచ్చి, దేవుడిలా కాపాడావు. నువ్వెవరప్పా!'

'మేం ఎవరో వదిలెయ్యండి. నేను పిలిచినంతనే వీళ్లంతా పరుగెత్తుకొనివచ్చారు. మీరు ఎక్కడికివెళ్ళాలో చెప్పండి. తోడుకు ఇద్దరు మనుష్యులం వస్తాం.'

'మీపని మానుకొని నాతో ఎందుకు రావడం? నేను చేయదగిన మహాకార్య మేముంది గనకా? మీపాటికి మీరు వెళ్ళండి. రాచమార్గాన నేను బోపణ్ణగారి ఇంటికి వెళ్ళి పోతాను.'

'అట్లాగంటారా! నేను అటే పోవాలిసినపని వుంది. రండి. జతగా వుంటాను.'

'ఊరిమధ్య నీతోడు ఎందుకుబాబా! నేను పోతాను. నన్ను వదిలిపెట్టుబాబా!'

'ఊరిమధ్యనేగా ఈ పోట్లాట అయింది. ఇంకోడు ఇల్లాగే తయారైతే. నాకేమీ పని లేదు. తోడుగావుంటాను, రండి.'

'అది సరేనప్పా! అడవిలో పోతూవుంటే పులి దారికడ్డురావచ్చు. ఊరిలో పోతూ వుంటే పుండాకోరు దెబ్బలాడటానికి పిలుస్తారే! ఊరు అడవికంటె అధ్వాన్నమైపోయింది' అని అంటూ ముసలాడు దీక్షితులమనిషితోబాటు బోపణ్ణ ఇంటివైపుకు తిరిగాడు. దగ్గరలో వున్న 'కావేరి మక్కళు' గుడికి చేతులుజోడించి అక్కడినుంచి మాయమై ఎటో వెళ్ళి పోయారు.

తక్కడు వసతికివచ్చి తన్ను రక్షించినమనిషికి రెండుమాటలు చెప్పడానికని అతనివైపు తిరిగాడు. ఆ మనిషి లేడు. ముసలివాడు లోపలికిపోయి నడచిన సమాచారం అంతా ఇంటి వాళ్లకు తెలిపాడు.

# 105

అప్పంగౌళనుంచి బైటపడ్డ చెన్నబసవయ్య చోమన్నకు 'సంపాజెకు వెళ్లాలి చోమా!' అని చెప్పాడు. చోమన్న, చెన్నబసవయ్య, తుక్ర, ఉగ్రి, ఈ క్రమంలో వాళ్ళు పరుగెత్తించి వీలైనంతవేగంగా మార్గాన్ని లంఘించారు. అక్కడ పసిబిడ్డకు మెలకువవచ్చి ఏడ్చాడు. చెన్నబసవయ్య గుర్రాన్ని ఆపాడు. తల్లి బిడ్డనెత్తికొని పాలుకుడిపి, బుజ్జగించి, ప్రక్క సరి చేసి వాన్ని తిరిగి తొట్టెలో నిద్రపోగొట్టాడు.

గుఱ్ఱం పరుగెత్తడంలో బిడ్డను అతిగా ఎత్తి కుదెయ్యకుండావుండేటట్లు తొట్టెలోపల అడ్డంగా గుడ్డపట్టి కట్టింది. బిడ్డను తొట్టెలోవిడిచి నిద్రపోగొట్టి దేవమ్మాజీ పట్టీ సరిగ్గా కట్టు అని తుక్రకు చెప్పింది. 'చిత్తమమ్మా' అని వాడు గుడ్డపట్టీని కట్టాడు.

పున్నమిపోయి రెండురోజులైంచి, వెన్నెల దట్టమైనచెట్లమధ్య ఆకులమధ్య మారి, సగం వెలుగు సగం చీకట్లుగా శోభిస్తోంది.

చోమన్న ఈ ప్రాంతంలోని దారులన్నీ బాగా ఎరుగు. కళ్ళకు గంతలుకట్టి విడిచిపెట్టితే, తప్పిపోకుండా నడుస్తాను అనేటంత స్థానపరిచయం అతనికుంది.

దారి, చాలాభాగం కొండలబుజాలపై కెక్కుతూ దిగుతూ పోయింది. కొన్నిచోట్ల చాలా పల్లానికి దిగజారిపోతూవుంటుంది. అటువంటిచోట్ల నీటికాల్వఉండటం, దాన్ని గుఱ్రాలు సులభంగా దాటుతూరావడం జరిగింది. రెండుకాల్వలుమాత్రం కొంచెం వెడల్పు, కొంచెం లోతు. అక్కడ చోమన్న 'ఈ కాల్వ దాటాలి. నా గుఱ్రం దాటుతుంది. మీ గుఱ్రాలు దాటుతాయి. కొంచెంపట్టుగా కూర్చోండి' అన్నాడు.

ముందు గుఱ్రం కాల్వనుదాటినట్టే మిగతాగుఱ్రాలూ దాటాయి. అందరూ భద్రంగా కూచున్నారు. ప్రయాణం ముందుకుసాగింది.

దారిలో అక్కడక్కడా ఒకటో రెండో గుడిసెలువున్నాయి. వాటిలో నిద్రపోతూవున్న జనం రాత్రిలో ప్రయాణీకులకు సహాయంకావాలంటే సాయపడే కావలావాళ్ళు. రెండుమూడు చోట్ల వాళ్లు 'ఎవరా గుఱ్రం ?' అని అడుగుతూవచ్చారు. చోమన్న: 'రాజభవనం నౌకరులం. సంపాజెకు పోతూవున్నాం' అని చెప్పాడు. కావలావాళ్లు: 'తోడు రామా' అని అడిగితే, చోమన్న 'వద్దు పోనియ్యి అప్పా: మేమే నలుగురం వున్నాం' అని చెప్పేసాడు.

కావలాజనం తిరిగి ఏమీ అడగలేదు. ఎవడూ బైటికివచ్చి చూడనూలేదు. ఆవిధమైన రాత్రిప్రయాణాలు వాళ్లకు వాడుకలోనివే. దారికూడా భద్రమైందే. కాలం కర్మంతప్పి మొత్తం సంవత్సరంలో ఏ ప్రయాణీకునికైనా, ఎప్పుడైనా సంకటం సంభవిస్తే, ఆ దుర్ఘటన జరిగిన స్థలం ఎక్కడ, అది ఏఊరి పొలిమేరలో జరిగింది, విచారించి ఆ గ్రామం మునసబు, రౌడీలను పట్టించాల్సిందిగా ఆజ్ఞాపించడం జరుగుతుంది. పట్టించి ఇవ్వకపోతే ప్రయాణీకులకు జరిగిననష్టాన్ని గ్రామస్థులే భరించాల్సివుంటుంది.

ఈ ఆచారంఫలితంగా ఏ ఊరిలోనైనా పుండాకోర్లువున్నా రౌడీతనం, దొంగతనం మొదలైనవి చెయ్యాలని మనస్సుపుట్టినా, కొడగుబైటికి పోయేవాళ్లు. తమదేశంలో చెడ్డపనులు చేసేవాళ్ల కాదు.

దారిలో కావలావాళ్ళు ప్రశ్నించారే అని చోమన్నకు కొంచెం మనస్సులో అలుకుగా వుంది. వాళ్ళల్లో చాలామంది తన్నెరుగుదురు. సంపాజెదగ్గిరమాత్రం పొలిమేరలు దాటిపోయేప్రయాణీకులు ఎవరు ? అని సీమసైనికులు ఆపి చూడడం వాడుక. అక్కడ ఎట్లాగైనా

ఉపాయంగా ముందుకుపోతే రెండుక్రోసులదూరంలో దేశసీమనే దాటవచ్చు. చోమన్న చెన్న బసవన్నతో 'సంపాజె చేరగానే నేను సీమచౌకీ ముందుకుపోతాను దొరా! మీ గుర్రాలు కింది దారిలో పోనివ్వండి. ఉగ్గి దారిచూపిస్తాడు. చౌకీదార్లు పిలిచినప్పుడు నేను మాటాడుతూ వుంటాను. మీరు మెల్లిగా తప్పించుకొని పొండి. వాళ్ళను ఒప్పించి నేనువచ్చి మిమ్మల్ని కలిసికొంటాను' అన్నాడు. చెన్నబసవన్న 'అల్లాగే చేద్దాం దానికేం!' అన్నాడు.

సంపాజె చౌకి వచ్చింది. క్రిందిదారిలో ఉగ్గిగుర్రం ముందుగా, చెన్నబసవన్నగుర్రం మధ్యలో, చివరిలో తుక్రిగుర్రం-వుండేటట్లుగా వాళ్లు బయలుదేరారు.

చౌకీ ఎదుటవీధిలో చోమన్న వచ్చాడు.

చౌకీవాకిట కూచుని కునికిపాట్లుపడుతూ, కాపలావాడు చోమన్నను చూడటానికిముందే క్రిందిదారిలో పోతూవున్నగుర్రాల్ని చూసాడు. 'ఎవరప్పా! అది' అని కేకేసి అడిగాడు. అతడు అడిగింది తన్ను అన్నట్లుగా చోమన్న ముందుకువచ్చి 'నేనప్పా' రాజభవనం మని షిని' అని బదులుచెప్పాడు.

'ఆ క్రింద ఎవరు పోతున్నారో?' అంటూ కాపలావాడు 'ఏమండోయి! మీరు ఎవరో చెప్పి మరీ పొండి' అని అరిచాడు. అటునుంచి జవాబు రాలేదు. కాపలావాడు 'ఎక్కడప్పా! వీళ్ళెవరో దొంగతనంగా పోతుందారే! నాయకున్ని పిలవాలి' అన్నాడు.

చోమన్న: 'నీవు కేకపెట్టింది వినబడిందో లేదో. దొంగతనంగాపోయే గుర్రంరౌతులు ఎవరో?' అన్నాడు.

'మరి వాళ్ళెవరో తెలియాలా అక్కర్లేదా? రేపు అడిగితే చెప్పాల్సివుంటుందిగా.

'నేనువెళ్లి తెలుసుకొనిరానా?'

'అల్లాగే చేయి మానుబావా! లేకుంటే మాకు ఉరే. నేనూ తోడుగా వస్తుందా.'

చోమన్న గుర్రాన్ని ముందుకు పోనిచ్చాడు. కాపలావాడు అతనివెనకాల వచ్చాడు. క్రిందిదారి నూరుగజాలలో రహదారినివచ్చి కలుసుకొంటుంది. చోమన్న గుర్రాన్ని కొంచెం పరుగెత్తించి, 'ఎవరిది గుర్రం? వెంబడించుకొంటూ వస్తున్నాం. నిలపవద్దు' అని ముందున్న వాళ్ళకు కేకపెట్టి చెప్పాడు. చెన్నబసవయ్య దానిఅర్థం గ్రహించాడు.

'సీమ దాటేసరికి గుర్రం పరుగెత్తనీ, నిలపవద్దు' అని అతడు తుక్రకు ఆజ్ఞాపించాడు. చౌకీ నౌకర్లకు చిక్కువడతాం అనే సందేహంతో వాళ్ళు గుర్రాలని రెండుకాళ్లమీదా, నాలుగుకాళ్లమీదా దుమికిస్తూ రెండుక్రోసులదూరం ఓ గడియలో ముగించి సీమదాటి అవతలికి వచ్చేశారు.

ఇక్కడ చోమన్న 'నేను చెప్పింది వాళ్ళకు వినబడలేదప్పా! మాటాడనేలేదు. నువ్వు ఉండిపో; నేను అడిగితెలుసుకొనివస్తా' అని వాళ్ళవెనకాలే గుర్రాన్ని వాయువేగ మనోవేగా లతో ఉరికించాడు. మళ్ళీ వెనక్కువస్తానని అతడు చెప్పడం చౌకీదారు తృప్తికోసరం అని

వారే చెప్పనక్కర్లేదు. వీళ్లెవరో మోసం చేసారు అని తెలుసుకొని, నాయకుణ్ణిపిలిచి, నాయకుడు వెంబడించి గుర్రంమీదవచ్చి తమరిని ఆపేయడం జరగాలిగా! ఇదంతా అయ్యేటప్పటికి అర్ధగడియకాలం ఎల్లాగూ పట్టుతుంది. ఇంకో అర్ధగడియలోపల తాము సీమలకు వెలుపల చేరిపోతాం, ఆపైన భయంలేదు. అని ఇంతదూరం చోమన్న ఆలోచించాడు. చెన్నబసవయ్య తుక్ర, ఉగ్రి పొలిమేరలుదాటి గుర్రాల్ని నిలిపిన కొంచెంసేవట్లో చోమన్నకూడా గుర్రాన్ని ఉరుకులూ, పరుగులూ పెట్టిస్తూవచ్చి వీళ్ళను చేరుకున్నాడు.

చెన్నబసవన్న అతన్ని 'ఎవరో వెంబడించి వస్తున్నట్టున్నారే!' అని అడిగాడు.

చోమన్న: 'వెంబడించి వచ్చేవాళ్లు ఎవరు? గుర్రం, కళ్ళెం, వీపుమీదిపట్టా ఇవన్నీ దొరకవద్దూ? ఇంకో రెండుపరుగులుపెట్టించి కన్మొరగిపోయామంటే వాళ్లు ఇటు అడుగు పెట్టి మనలను తాకేదిలేదు' అన్నాడు.

అప్పటికి కోడికూసేవేళ మీరిపోయింది. చంద్రుని వెన్నెలతో ఉషఃకాంతులు కలియబడి, అప్పుడే సూర్యోదయమైందా అన్నట్లుంది.

చోమన్న మాట ముగించేటప్పటికి తుక్ర తన గుర్రంమీది కూచున్నపడానే 'అయ్యో! ఇదేమిటి అప్పా!' అని కేకపెట్టాడు. తన ఎదురుగావున్న తొట్టెవైపు ఒకేతీరున చూశాడు.

అతని భయోద్గారం విన్నక్షణంలో ఎవరో వెంబడించి వచ్చారేమో అని తాము వచ్చిన దారివైపు చూశారు. అటుప్రక్క ఎవరూలేరు. తుక్ర భయానికి ఏమిటి కారణమనుకుంటూ వాడివైపు చూపు త్రిప్పారు. తుక్ర 'తొట్టిలో బిడ్డలేదు' అని అరిచాడు.

# 106

తుక్ర పెట్టినకేక వాళ్లందరిగుండెల్లి ఈటెలుపెట్టి పొడిచినట్లయింది. దేవమ్మాజి అయ్యో అని గోలపెట్టి పెనిమిటి నడుమువిడిచి నేలకు దూకటానికి యత్నించింది. పెనిమిటి పట్టుకోబోయేటప్పటికి క్రిందికి పడిపోయింది.

అంతకుపూర్వమే తుక్ర, చోమన్న, ఉగ్ర తమ గుర్రాలపైనుంచి క్రిందికి దిగారు. చోమన్న 'మెల్లిగా తల్లీ! మెల్లిగా' అంటూ దేవమ్మాజిదగ్గిరసా వచ్చాడు. అప్పటికి చెన్నబసవయ్య గుర్రంనుంచి దిగాడు. పెళ్లాన్ని లేపి నిలబెట్టాడు. తుక్రవైపుతిరిగి 'ఏమిటి ఇట్లా మాటాడుతావ్! పిల్లవాణ్ణి ఏంచేశావ్?' అని గద్దించి అడిగాడు.

తుక్ర : 'అయ్యో నా కర్మం! నేనేమి చేశాను? దొరా! కాల్వ దాటేటప్పుడో, ఈ వరు గెత్తేటప్పుడో, ఎక్కడో జారి పడిపోయివుంటాడు.'

'జారి ఎట్లా పడిపోతాడు? గుడ్డపట్టి కట్టావుగా!' అంటూ తుక్ర గుర్రందగ్గిరకువచ్చి తొట్టి చూశాడు. గుడ్డపేలిక ఓ వైపునుంచి ఇంకోవైపుకు కట్టబడిలేదు. ఒకేవైపు రెండు మడతలుగా కట్టబడివుంది.

ఏమైందంటే, దేవమ్మాజి పిల్లవానికి పాలిచ్చి తొట్టిలో పడుకోపెట్టి ఈ గుడ్డపట్టి కట్ట మని తుక్రచేతికిచ్చింది. వాడు అజాగ్రత్తగా దానిని ఏవైపునుంచి వస్తోందో అదేవైపు ఇంకో సారికట్టి వదలిపెట్టాడు. గుర్రంపెట్టిన ఉరుకుల పరుగుల్లో ఎగిరి పడిపోకుండాకట్టిన గుడ్డ పట్టి నిష్ప్రయోజనమై పోయింది.

పాలు పట్టించి ప్రయాణం మొదల్లో. దానికివతల ఎనిమిదిక్రోసులదూరం వచ్చిన ట్లయింది. ఈమధ్య ఎక్కడో బిడ్డ తొట్టిలోంచి ఎగిరిపడిపోయివుంటాడు. ఈసంగతి అంద రికీ తట్టింది. చెన్నబసవన్న 'అయ్యో! వందివెధవా! కొంప నాశనం చేసేశావ్!' అని చెయ్యివిసరి తుక్రచెంప ఛెల్లుమనేటట్లు కొట్టాడు.

తుక్ర : 'నాదేమి తప్పులేదు దేవరా! తెలియకుండా జరిగిపోయింది' అని విలపించాడు.

'ఎందుకు తెలియలేదో!' అని చెన్నబసవన్న తిరిగి అతన్ని కొడదాం అని మీదికి పోతూవుంటే దేవమ్మాజి అతనిచేతిని పట్టుకుంది. 'మన నొసటివ్రాత కెవరేం చేస్తారు? పదండి, వెనక్కిపోదాం. పసివాన్ని ఎక్కడ పడిపోయాడో, వెతికిద్దాం. ఆలస్యంచేస్తే ఏ పులిపాలో, నక్కపాలో అయిపోతాడు' అంది.

ఏం చెయ్యాల్సిందీ ఎవరికీ తోచలేదు. తల్లిగావున్న ఆమెకు బిడ్డను రక్షించుకోవడం ఒక్కటే ఆలోచన; మిగతావాళ్లు అంత తేలికగా వెనక్కుపోవడానికి ఒప్పుకొనేమనుషులు కారు. సంపాజి చౌకిలోని మనుష్యులు వెనకాల వస్తూనేవుంటారు. సీమకు వెలపలఉన్నప్ప టికీ వాళ్లు వీళ్లని బలాత్కారంగా పట్టుకోవచ్చు. అటువంటప్పుడు పొలిమేరల లోపలవుంటే ఇహ చెప్పేదేవిఁటి? పట్టుబడ్డతర్వాత వీళ్ళందరికీ ఒక్కటేగతి; కొఱత ఎక్కడం. బిడ్డ బనా బ్రతికివుంటుందనేభ్రమకూ ఆస్కారం లేదు. ఎనక్కో, పులో పని ముగించకుండా వున్నా, ప్రజలచేతికి చిక్కినా చాలు. రాజుచేతిక్కినతర్వాతనైనా ఈ అయిదుగురి ఆయు ష్యంతోపాటు బిడ్డ ఆయుస్సు ముగిసిపోవడం తప్పదు. అటువంటప్పుడు వాళ్లు ఏవిఁటి చేయడం? బిడ్డను తెచ్చేదాకా తాను ఓ అడుగు ముందుపెట్టను అని దేవమ్మాజి హఠంపట్టి కూచుంది. [1]సుళ్యకైనాపోయి చేరాలి, అక్కడి అధికారుల రక్షపొందాలి, అట్లా కాని పక్షంలో తామూ ఉండరు. బిడ్డా వుండదు. అని చెన్నబసవయ్య, చోమన్న తిరిగితిరిగి వివ రించి చెప్పింతర్వాత చిట్టచివరికి ఓ నిశ్చయానికి వచ్చారు. చోమన్న వచ్చినదారిని వెనక్కి

1. సుళ్య = ఒక గ్రామంపేరు.

బిడ్డను వెదకుతూ పోవాలి. గుఱ్ఱం ఎగిరిదూకినచోట్లు, వేగంగా పరుగెత్తిన రెండుక్రోసుల దూరం, ఈలోపలనే బిడ్డ చిక్కితే చిక్కాలి. లేకపోతే బాటసార్లు ఎవరో బిడ్డనుచూసి ఎత్తుకొనిపోతారు; ఉపాయంగా విచారించి బిడ్డను కైవసంచేసికొని అతడు సుళ్యకు తిరిగి రావాలి.

విషయం ఇంతసులభంగా తోపజేయడం, దేవమ్మాజిగారి మనస్సంతుష్టికిమాత్రమే. నోటితో చెప్పకపోయినా చెన్నబసవయ్య, చోమన్నకూ ఇద్దరికీ తెలుసు. బిడ్డకూ, చోమన్నకూ మృత్యువు తప్పదని. చెన్నబసవన్న ఆలోచన ఏమిటంటే-వీలైనంతవేగంగా మంగుళూరులోని కలెక్టరును కలుసుకొని, బ్రిటిషువాళ్ళ ఆశ్రయం వేడి, అవసరమైన రక్షకసిబ్బందితో వెనుదిరిగివచ్చి పిల్లవానిని వెదకవచ్చు అని. చోమన్న ఆలోచన - 'బిడ్డను బ్రతికించేది లేదు, తాను బ్రతికేదిలేదు. తన నొసటిరాత ఎట్లావున్నా తన దొర, రాణి, ఇద్దరూ సుఖంగా వుంటే అంతే చాలు' అని. అదే నిశ్చయానికి చివరికి అతడు వచ్చాడు.

తుక్ర చోమన్న మనస్సు తెలుసుకొన్నాడు. తనతప్పుకు అత డెందుకు చావాలి. ఆలోచించి, అతడు 'చోమన్నా! దొరగారివెంట నువ్వు పో. బిడ్డను నేను వెదకితెస్తా' అన్నాడు.

దేవమ్మాజికి చోమన్న వెళ్ళితేనే బాగుంటుందని వుంది. చెన్నబసవయ్యకూ అదే ఇష్టం. మొత్తంమీద చోమన్న దక్షుడు. మాటలో, వ్యవహారంలో చతురుడు.

చెన్నబసవన్న, దేవమ్మాజి, తుక్ర, ఉగ్గి ముందుకు సాగివెళ్ళారు. పట్టి తొట్టిని, వెనకప్రక్క కట్టుకొని విడిగావచ్చిన గుఱ్ఱాలలో ఒకదాన్నిఎక్కి చోమన్న వచ్చినదారిని తిరిగి వెనక్కు వెళ్ళాడు.

సూర్యుడు పుట్టి లోకానికి కాంతులు ప్రసాదించాడు. ఉదయమైంది. కాని వాళ్లగుండెల్లో మాత్రం చీకట్లు మూలుగుతున్నాయి.

# 107

నాలుగడుగులు తనదారిలోవెళ్లి, చోమన్న వెనక్కుతిరిగి తనతోటి జనుల్నిచూస్తూ నిలబడ్డాడు. వాళ్ళ కళ్లకు చాటుకాగానే తొట్టిని తీసుకొనిపోయి ఒక పొదలో విసిరేసాడు. వచ్చేటప్పుడు అతడు లోగడ చౌకీదారుకు ఓ అబద్ధం చెప్పివచ్చాడు. తిరిగిపోయినప్పుడు ఆ అబద్ధానికి మరింత రూపకల్పన చెయ్యాల్సివుంది. తొట్టి దానికి అడ్డమౌతుంది. చౌకీలోని నౌకర్లు తమదొరనుపిలిస్తే వాడు తన్ను తేరపారి, పైనుంచి కిందికీ, కిందినుంచి పైకీ చూసేమాట

విజం. సమయంకనిపెట్టి తగిన బొంకుపల్కి, నమ్మకం కలిగించి కార్యసాధనకు అనుకూలంగా నడచుకోవాలి. మధ్యలో ఎగుడుదిగుడయిందా వ్యవహారం ఇంకేమీలేదు: తల నరికేయడమో, కొఱత కెక్కించడమో, మొహాన ఏం వ్రాసివుంటే అది తప్పదు.

చోమన్న భయపడుతున్నట్టే చౌకీ, అంతదూరంలోవుండగానే, 'అదిగో, అటునుంచి ఆ గుఱ్ఱంరౌతు వస్తున్నాడు' అనే కేక వినవచ్చింది. ఇట్లా అరచినవాడు చౌకీదారు అయి వుండాలి, ఆ మాటలు తన అధికారికి చెప్తావుండాలి అని చోమన్న అనుకున్నాడు. మరు క్షణంలో చౌకీ బైటివాకిట్లో ఓ యువకుడు నిలిచి అతనివైపుచూడడం కనబడింది. చోమన్న మరీ మెల్లిగామగాక, మరీ వేగంగానూ కాకుండా తనగుఱ్ఱాని నడిపించి చౌకీదగిరకువచ్చి చేరాడు.

నౌకరు : 'ఏమప్పా: అల్లాగే పారిపోయావు? నేను గురికాని నిద్ర చెఱిపినట్లయింది' అన్నాడు.

గురికాడు చేయదలచుకొన్న విచారణచేసి, పారిపోయినమనిషి సరైనసమాధానం ఇస్తే, వృధాగా ఎందుకు నన్ను నిద్రలేపావు అని గురికాడు తన్ను తిట్టకుండావుంటాడు అని చౌకీదారు ఆలోచన.

చోమన్న : 'ఎందుకప్పా: పాపం లేపింది? నేను నిలుపుదాం అని వెంబడించాను. ఎవరో, ఎందుకో భయపడ్డట్లు కనబడుతుంది. ఒకేతీరున గుఱ్ఱాల్ని పరువులుపెట్టించి పారిపోయారు. పొలిమేరలు దాటిపోయారు. ఇహ ఎవరిని ఏమిటి చేస్తాం? చౌకీ అన్నకు చెప్పుదాం అని వెనక్కి వచ్చా' అన్నాడు.

గురికాడు : 'నువ్వు ఎవరిగుఱ్ఱం నౌకరివి?' అని అడిగాడు.

చోమన్న ఆ క్షణానికితగ్గట్లు ఓ అబద్ధం ఆడాడు. 'అప్పంగౌళ చోమన్నను నేను. అల్లుడు దొరగారు మంగుళూరులోని మంజునాథదేవునికి మ్రొక్కుబడి చెల్లించు అని రెండు హొన్నులు ఇచ్చిపంపించారు. బైలుదేరాను. చౌకీఅన్న ఆ గుఱ్ఱాల్నిచూసి కేకేసాడు. నేను గుఱ్ఱంమీద ఉన్నానుగా, అందుకని వాళ్ళను వెంబడించాను.'

నౌకరు : 'అదేమిటప్పా: నువ్వు వాళ్లకు నిలవకండి, పారిపొండి, పారిపొండి అని అఱచావేం?'

చోమన్న : 'మా బాగుందప్పా: నువ్వు చెప్పేది. నిలవండి, పారిపోకండి, పారిపోకండి అనేగా నేను అఱచింది: నిలవకండి, పారిపొండి అని నేను ఎందుకుచెప్తాను? వాళ్ళు ఏ ఊరి దేవతలు నాకు? అట్లా అనడానికి' అన్నాడు.

గురికాడు అతనివైపు క్రూరంగా ఇంతసేపూ చూడటం మొదలుపెట్టాడు. చోమన్న అతి సహజంగా మాటలాడుతూవున్నప్పటికీ, అతనికి చోమన్నమాటలపై విశ్వాసం కుదుర

లేదు. అతడు 'అల్లుడు దొరగారు ఉత్తరం ఏమైనా ఇచ్చారా, బంగారునాణ్యాలు చూపించు' అన్నాడు.

చోమన్న ఉత్తరంకోసం, హొన్నులకోసం, నడుంపై చేయివేసి వెదకినట్లు వెదకి అవి పోయాయి అని తెలిసికొని నిరాశపడినట్లుగా నటించి అయ్యో! ఈ గందరగోళంలో దాన్ని ఎక్కడనో పారేసుకొన్నానప్పా! ఇహ అప్పంగొళకు వెనక్కుపోయి దొర కాళ్ళమీదపడి మ్రొక్కాలి. ఏంచెయ్యను. మొహంమీద రాత' అన్నాడు.

గురికానికి వాడిమాటలు అబద్ధమేనని దృఢమైపోయింది. నిజానికి అతడు చోమన్నను బందీగాతీసుకొని ముందు విచారణ జరిపించాలి. అయితే అతనికో భయం: అల్లుడు చెన్నబసవయ్య చోమన్నను పంపినమాటే నిజమై తాను అతన్ని బందీగా పెట్టివుంచితే చెన్నబసవయ్య తనకు అవమానమైనట్లు భావించవచ్చు. అతడు చాలా పట్టుదలమనిషి అని దేశంలో అందరికీ తెలుసు. అతడు గురికానిమీద క్రూరంగా పగ తీర్చుకోవాలనుకోవచ్చు. లేనిపోని తద్దినం నెత్తిమీదకు తెచ్చుకోవడం దేనికి?

ఇతడు రాజభవనంనుంచి తప్పించుకొని, గుఱ్ఱం దొంగిలించి మంగుళూరికి పారిపోయి రావడంలేదుగదా కొంపదీసి. అట్లా అయివుండదు. దొంగిలించుకొని మంగుళూరికి పోయేవాడు తిరిగి వెనక్కు ఎందుకువస్తాడు? చౌకీవాళ్లకు అతడు చూసినగుఱ్ఱాలు తప్పించుకొని పోయాయి అని చెప్పడానికనే వచ్చివుంటాడేమో? ఇదే నిజం కావచ్చు. హొన్నులూ, ఉత్తరమూ పోయాయి అని చెప్పేమాట? అదీ నిజమే కావచ్చు. అసంభవం ఏమీకాదు.

ఇట్లా అంతా ఆలోచించి, గురికాడు, తానూ అతనితోబాటు అప్పంగొళకు పోవడం, చోమన్నమాట దృఢమైతే చెన్నబసవన్నను క్షమింపమనివేడి బైలుదేరిరావడం, చేయవచ్చునని అనుకున్నాడు.

ఈవిధంగా అతడు నౌకర్లకు తన గుఱ్ఱాన్ని తెమ్మనమని చెప్పడానికి నోరు విప్పాడో లేదో సరిగా అప్పుడే చౌకీకి కుడివైపు కొంచెందూరంలో దిబ్బమీద గౌడయింటివద్ద పదిమంది జనంచేరి గందరగోళంగా మాట్లాడుతూవుండటం వినిపించింది. గురికాడు నౌకరుకు 'అదేమిటో చూసిరా' అని చెప్పాడు. నౌకరు ఆవైపుకు పరుగెత్తాడు. గురికాడు చోమన్నతో 'నీపేరు చోమన్నకదూ!' అన్నాడు.

'ఔను దొరా!'

'నీగుఱ్ఱం ఈ స్తంభానికి కట్టు. మేమూ వస్తాం. అప్పంగొళకు పోదాం.'

'చిత్తం దొరా!'

చోమన్న గుఱ్ఱాన్ని లగాముతో కంబానికికట్టేసి గురికానితో 'దీనికి కొంచెం కుడితినీరు పట్టు అని చౌకీఅన్నకు చెప్పండిబాబూ' అన్నాడు. గురికాడు సమ్మతిసూచకంగా తల త్రిప్పాడు.

గౌడ ఇంటిదగ్గిరకుపోయివున్న నౌకరు వెనక్కువచ్చి, 'దారికాపరి [1]'కొగ్గ' గుడిపె కెదురుగా ఎవరో ఒక పసిబిడ్డను పారేసిపోయారట. కొగ్గన్న అతనిపెండ్లాం ఆ బిడ్డని గౌడ వున్న ఇంటికి తెచ్చివుంచారు' అన్నాడు.

గురికాడు : 'బిడ్డా !' అని ప్రశ్నించాడు.

'మగపిల్లడు. ఆర్నెల్లు వుండవచ్చు.'

'ఇక్కడవుండు, నేనువెళ్ళి చూసివస్తాను. ఏయ్ ! చోమా ! నీవు రా.'

చోమన్నకు దొరబిడ్డ బ్రతికింది. జనంచేతిలో 'చిక్కింది' అని సంతోషం కలిగింది. బిడ్డను ఇక్కడనుంచి విడిపించి మంగుళూరికి ఎల్లా తీసుకొనిపోవడం ? అని ఆలోచన. 'నేనేమి చేయడానికి వుంది, 'కరింగాళి' తల్లీ ! నువ్వు దారిచూపాలి. నేను నడవాలి. బిడ్డను రక్షించి ఇయ్యి. రెండుమేకలు బలిఇస్తా నీ పేరుతో' అని అతడు తన కులదైవాన్నిప్రార్థించి చాకీ గురికానితోకూడ గౌడ ఇంటికి వెళ్ళాడు.

# 108

గురికాడు, చోమన్న, గౌడగారిఇంటికి వచ్చేటప్పటికి ఇంకా ఎంతోమంది జనంచేరి ఓ పెద్ద సంతలాగా ఏర్పడింది. గౌడ ఇంటిలో లేడు. అతని భార్య, అతని కోడలు, వాకిలిబైట కొగ్గతో మాట్లాడుతూ నిలబడ్డారు.

కొగ్గన పెళ్ళాం బిడ్డనుఎత్తికొని అతనిప్రక్కన నిల్చుంది. గురికాడు రావడంచూసి గుంపులో ఒకడు 'దారి విడువండప్పా ! గురికాడు వచ్చారు' అన్నాడు. పెద్ద వచ్చాడు అని జనం సంభ్రమంతో దారి విడిచారు. జనంమధ్యకువచ్చి గురికాడు గౌడభార్యకు కొంచెం దూరంగా నిలబడ్డాడు.

గౌడమ్మ కొగ్గన్నతో 'అంతా చెప్పు ఆయనకు' అని ఆజ్ఞాపించింది.

కొగ్గన్న చెప్పాడు. 'కోడి అప్పుడే కూసిందిదొరా ! నా ముసలిది లేచింది. [2]దిగూవ ఓ బిడ్డ అవురావురుమంటూ వెక్కపెట్టి ఏడుస్తూ పడివున్నాడు. ఆ ఏడ్పు వినవచ్చింది. ముసలిది అదేమో బిడ్డ ఏడుపులాగా వుందే' అంది.

1. కొగ్గ = వంకర. కొగ్గ అని పేరుపెట్టడం అష్టావక్రుడు అని సంస్కృతంలోవున్నట్లు. తేలికమాటల్లో 'వంకరయ్య' అని చెప్పొచ్చు.

2. దిగూవ = దిగువున, పల్లంలో.

'నేను ఔను, అట్లాగేవుండ్' అన్నాను. అది దయ్యమేమో అంది. కోడి కూసింతర్వాత దెయ్యం ఏడనుంచి వస్తాది అన్నాను. అమె కొంచెం రా పోయ్చూద్దాం అంది. నేను ఈ యాళప్పుడు ఏంది బయం? నడు. వస్తి. అన్నా. నానూ లేదా, ఆవిడ బైలుదేరింది సూడ టానికి.

కొగ్గన్న పెళ్ళాం కథ ముందుకు సాగించింది. 'దెయ్యం కాకపోయింతర్వాత తో డెందు కులే అని బైల్దేరాను. మగోడు కదిలేది చాలా కట్టం. నాలుగుఅడుగులువేసి ఈయాళ ఎదో దెయ్యమే అయివుండొచ్చు అనుకున్నా. గుండె ఆగిపోయినంత పనైంది. బిడ్డ వెక్కివెక్కి ఏడుస్తున్నాడు. పేగులు తెరుక్కుపోయాయి అనుకో. ఎమైతే అదైంది అని అమాంతం పరుగెత్తా. వల్లం అడుగున సూదిమల్లె పొదలో బంగారంలాంటి బిడ్డల్లోపడుకొని ఏడుస్తూ వున్నాడు. నాగబిడ్డ. చికిలికన్నులు, కుంకుమరంగు పెదవులు. దెయ్యం అయితే కానిమ్మని చేతుల్లోకి తీసుకొన్నా. చేతికి చిక్కాడు. దెయ్యంకాదు, భూతంకాదు - దేవుడే అని ఎత్తికొని గుడిసెవైపు వెళ్ళా.'

కొగ్గన్న చెప్పాడు, 'లేచినవాడిని నేను బైటికివచ్చి 'ఈవిడ పోయినవైపే పదిపోతివి దొరా! పదిఅడుగులు వేసానో లేదో, మా ఇంటిది బిడ్డనెత్తుకొని ఎదురుగావస్తోంది. దేవుడు లాంటిబిడ్డ అన్నాను నేను. ఈ బిడ్డ ఏందు కిక్కడవుందో' అంది ఆవిడ. దేవేంద్రుడి బిడ్డేమో అన్నాను నేను. చంద్రుడి పగటిబిడ్డ అంది ఆవిడ.

'అదట్టా వుంచు. ఇంద్రుడిబిడ్డయితే పుట్టినరోజే మంచిలచ్చనం కనబదుతోంది అన్నా. 'ఏం కనబడాలి?' అంది ఆవిడ. 'గుడ్డచూస్తే రాజవంశం అనిపిస్తోంది. ఎవరో పొగరు బోతులు దొంగిలించారు. నగలు తీసేసుకొని జార విడిచారు అన్నా. అట్లాఅయితే నే నీ బిడ్డను సాకటానికి వీల్లేదు అందామె. నువ్వు సాకేబిడ్డా ఇది! ఏందే పిపొగరు అన్నా నేను.

కొగ్గన్న పెండ్లాం చెప్పింది, 'పెనిమిటిమాటకు వరేనన్నా అవ్వా నేను. సొంతబిడ్డ అయితే సాకినా అందం చందం! దొంగబిడ్డఅయితే అమ్మకూ, అబ్బకూ అప్పజెప్పాలి. పదు, గౌడకు అప్పగిద్దాం అన్నా. ఇక్కడికి తెచ్చాం. అవ్వా!' అంది.

గురికాడు 'పిల్లవాన్ని అరుగుమీద వుంచు' అన్నాడు. కొగ్గన్న పెండ్లాం బిడ్డను గుడ్డతో పాటు బిడ్డను అరుగుమీద పడుకోబెట్టింది. గౌడమ్మ ఆమెకోడలు, భాగ్యశాలుర ఇంటివాళ్ళు వగ్గురు ఆడపిల్లలు, అబిడ్డ నలువైపులా మూగారు. గౌడమ్మ 'నిజంగానే నాగబిడ్డ' అంది. ఆమెకోడలు 'నాబిడ్డ ఇట్లాగే వుండేవాడు; నాకు పెంచే అదృష్టం లేకుండాపోయింది' అని కంట తడిపెట్టింది. నాల్గునెలల్క్రిందట ఒకబిడ్డను కని పోగొట్టుకున్న ఈ పడుచుతల్లికి ఈ బిడ్డను తానుపెంచితే బాగుండుననిపించింది. కన్నబిడ్డను లాక్కుపోయిన దేవుడు ఈ బిడ్డను తనకోసమే తెచ్చివుండకూడదా అని తలపోసింది.

మిగతా ఆడపిల్లల్లో ఒకత్తె బిడ్డ కనుబొమలను, మరొకత్తె కళ్లని, వేరొకత్తె ముక్కునూ, నాలుగోపిల్ల గడ్డాన్ని వర్ణించారు. ఓ ముసలిది దగ్గిరకువచ్చి బిడ్డ నుదుటిమీది చేయిపెట్టి ముద్దుపెట్టుకొని దిష్టి తాకకుండావుండాలని మెటికలు విరిచింది.

చోమన్న కథంతా విని తన యజమాని అదృష్టం ఎంత చెడ్డదా అని దుఃఖించాడు. ఒక్క రెండుక్రోసులదూరంలో పొలిమేర, అంతదూరం బిడ్డ తొట్టిలోవుంటే ఏ చింతా లేకుండా పోయేది. వేసిన వన్నుగడ నెగ్గాం అనుకొనేసమయంలో, బిడ్డ ఈవిధంగా జారి పడి పోవాలా? ప్రారబ్దం కాకపోతే! ఇప్పు డేమిటిచేయడం? ముందుగతి ఏవిటి? అని లోపల లోపల చింతించాడు. కరింగాళమ్మకు తిరిగి ఓసారి మ్రొక్కుకొన్నాడు.

ఇంతట్లో గౌడ ఇంటికి వచ్చాడు. సంగతంతా అతనికి నివేదింపబడ్డది. అతడు 'గుడ్డలు చూస్తే ఈబిడ్డ రాజకుటుంబానికి చెందినట్లు కనబడుతోంది. అప్పంగొళబిడ్డను ఎవరో దొంగి లించితెచ్చినట్లు వుంది' అన్నాడు.

గురికాడు గౌడతో 'అంతేనంటారా?' అంటూ చోమన్ననుపిలిచి 'ఏమయ్యా! నువ్వు అప్పంగొళవాడివేగా! ఈబిడ్డ మీ రాజభవనానికి చెందిందేనా? తెలియదా' అని అడిగాడు.

అతనిమనస్సులో వీడే బిడ్డను దొంగిలించి తెచ్చివుండొచ్చు, సొమ్ములు తీసేసుకొని అవతల పారెయ్యవచ్చునని పరుగెత్తాడు, ముందుకు పారిపోతూ, కింద పడేసిపోయాడు. తిరిగి వెదుకుతూ వెనక్కు వచ్చివుంటాడు అనే ఊహ పొడసూపింది. మొత్తంమీద వాణ్ణీ, బిడ్డనూ తోడ్కొని అప్పంగొళకు పోవడమే మంచిదని అతడు నిశ్చయించాడు.

చోమన్న ఆ క్షణంలో ఏమి చెప్పడానికి తోచక 'గుడ్డలు రాజభవనంలోవి లాగానే వున్నాయి. బిడ్డ దొరలబిడ్డ కావచ్చు' అన్నాడు.

ఇంతట్లో గౌడ కోడలు లోపలినుంచివచ్చిన తన పెనిమిటికి తనకోరిక వివరించిచెప్పింది, అతడు తనతల్లి కామాట చెప్పాడు. గౌడమ్మ తన పెనిమిటితో 'ఏసంగతీ తెలిసేదాకా బిడ్డను మనకోడలు పెంచుతూవుండనీ. రొమ్మునిండా వుండేపాలు ఎవరోపిల్లలు తాగేవి, ఈ బిడ్డే తాగుతూవుంటుంది' అంది.

గౌడ: 'మన ఇంటిలో ఒకబిడ్డ వుండాలంటే దేవుడు మనబిడ్డను ఎందుకు లాక్కొని పోతాడు? దొంగిలించిన పాప మనకు దక్కుతాడా? నగలు ఏమున్నాయి? బట్టలు ఏమ న్నాయి? ఎవరు దోచుకొన్నారు? ఏమైంది? అని విచారణ జరగవలసివుంది. మనకుండనీ పాప అంటే మనమే దొంగిలించి తెచ్చాము అని ఒప్పుకొన్నట్టూ అవుతుంది. గౌడకులం కీర్తి మాసిపోతుంది. బాబుమీది ఒట్టు. నే చెప్పింది నిజం' అన్నాడు. అతర్వాత కొడుకును పిలిచి 'అప్పాజీ! నౌకరుచేత పాపను ఎత్తించుకొని అప్పంగొళకు పో. రాజకుటుంబం పిల్ల దేమో అడిగితెలుసుకో. కాదంటే మడకేరిలో రాణమ్మగారికి చూపించు. ఆవిడ ఏం ఆజ్ఞ ఇస్తుందో విను. మా పాప కాదనిచెబితే విశ్రాంతగా ఎత్తికొని తీసుకొనిరా, నీ పెళ్ళానికి ఇయ్యి

అని సలహా ఇచ్చాడు. గురికాడు జనానికి 'మేం గౌడతో ఓమాట మాట్లాడాలి. మీరంతా దూరంగా వుండండి' అని ఆజ్ఞాపించాడు. జనమంతా దూరంగాపోయారు. గురికాడు కొగ్గన్నకూ అతనిభార్యకూ 'కొంచెం అల్లంతదూరంలో నిలబడండి' అనిచెప్పి చోమన్నను దగ్గిర వుండమనిచెప్పి గౌడకు 'కొగ్గ అతనిభార్య పాపను చూశారు. వాళ్లనే పాపను అప్పంగొళకు తీసుకొని పోనియ్యండి. అన్నివిషయాలు చెప్పడానికి వీలవుతుంది. మీ అబ్బాయిగారిని రానివ్వండి. నేనుకూడా వెళ్ళుతాను. ఇతడు రాజకుటుంబం నౌకరునని చెప్తున్నాడు. ఇంకా ఏవిఁటేవిఁటో చెబుతున్నాడు. ఇతగాడూ వస్తాడు. ఇతనిసంగతీ విచారించుకొని వస్తాను' అన్నాడు.

గౌడ ఒప్పుకున్నాడు. బిడ్డ తనకు లేకపోయినే అని గౌడకోడలు భోరుమని ఏడ్చింది. ఆమె అత్త ఆమెకు 'బిడ్డ వాళ్లదికాదంటే నీ పెనిమిటి తిరిగి తెస్తాడుగా! నువ్వే పెంచుకో వచ్చు. మెదలకుండా వుండు' అంది. కోడలు 'పెంచేపుణ్యమేవుంటే కన్నపాపే వుండే వాడు. మామయ్య చెప్పినట్లు' అని గొల్లున ఏడుస్తూ ఇంటిలోపలికి వెళ్లిపోయింది.

దేవమ్మాజీ బిడ్డ ఓ తొట్టెలో పడుకొని కొగ్గన్న తలమీద, వెనకప్రక్క గురికాడు, గౌడ కొడుకు, కాపలా కాస్తూవుండగా, చోమన్న ముందు పోతూవుండగా, అప్పంగొళ రాజ భవనానికి ప్రయాణం సాగించి వెళ్లాడు.

# 109

అప్పంగొళ రాజభవనంలో నల్లమందు ప్రభావంతో, ఆలసించకుండా వెంటనే నిద్రపోయిన కాపలావాళ్లల్లో నాయకుడైనవానికి కోడి కూసేపొద్దుకు నిద్ర కొంచెం మెలకువ వచ్చింది. అతడు అర్ధరాత్రి లేచి కాపలాకాయవలసినవాడు. సేవకులు అతన్ని లేపాల్సివుంది. కాని ఈ మేల్కొల్పేబాధ్యతవున్న మెలకువతో వుండాల్సిన ఈ పెద్దమనుషులు తెగబడి నిద్ర పోతూవున్నారే! నాయకునికి కొంచెం భయమే వేసింది. దానికితోడు ఇంకా రెప్పలు వాలి పోతూవున్న తన నిద్రకూడా అతనికి మామూలునిద్రగా కనిపించలేదు. బెల్లం తింటానికి భయ పడేమనిషి అతడు. పాయసం వడ్డనకు వచ్చినప్పుడు అందరికీమల్లే అతనేమీ పాయసం ఎక్కువ వడ్డించుకొని తిన్నవాడూకాడు! మరుసటిరోజు తలనొప్పి వస్తుందేమోనని భయపడి వడ్డించుకొన్న పాయసంలో, సగంభాగం అల్లాగే వదిలిపెట్టేశాడు. అందుచేతనే అతనికి ఈ పొద్దుకైనా మెలకువఅంటూ వచ్చింది. భోజనంలో ఏమైనా విషం కలిపిందేమోనని అలో

చించాడు. అదే నిజమైతే దాన్ని భోజనంలో ఎవరు కలిపివుంటారు? మొత్తంమీద ఎదో కుట్ర జరిగివుంటుంది. ఈ ఆలోచన అంతా నాయకునిబుర్రలో యుడితిస్ఫూర్తిగా తళుక్కుమని మెఱయలేదు. మత్తులో చిక్కుపడివున్న అతనిబుద్ధి ఈ వివరాలను ఒకదానితర్వాత ఒకటిగా అంతశ్చేతనలోంచి మెల్లిమెల్లిగా పైకి లాగింది. కుట్ర ఏమైనా జరిగిందేమోననేభయంతో అతడు కొంచెం చురుకెక్కాడు. ప్రక్కనే పడుకొనివున్న కాపలావాడిని బలంగా తట్టి లేపి 'ఇదేమిట్రా! మీ ముండా మోసిరి! ఇట్లా మత్తుగా పడివున్నారు? ఇదేం కావలా అంట!' అని అఱిచాడు.

ఒక కావలావాడు 'ఇదేం నిద్దురో! నాయకయ్యా! బండనిద్ర' అన్నాడు. మరోడు 'ఊం! ఊం! ఊం!' అని మ్రోత; నిద్రనుంచి లేవనేలేదు.

నాయకుడు తాను లేచి రాజభవనం సమక్షంలోవున్న దిగుడుబావికివెళ్లి మొగంపై నీరు చల్లుకొని, వెనక్కు వచ్చాడు. తన చేతికర్రతీసుకొని రాజభవనంచుట్టూ గస్తీ తిరగడానికి వెళ్ళాడు.

రాజభవనంలో నిశ్శబ్దం. యజమాని, యజమానురాలు పడుకొనేగదులు మిద్దెపైన. వాటిలో వాడుకప్రకారం చిన్నదీపం వెలగడం కనబడింది. ఇంటి వెనకప్రక్కకు పోయిన తర్వాత చివరిగదిలో దాసీది, పిల్లలిద్దరూ ఎదో మాటాడుకొంటూవుండటం వినిపించింది. అదేమిటనేది అతనికి స్పష్టంగా తెలియలేదు. అతడు చుట్టూ ప్రదక్షిణంగా తిరిగి వరండా అరుగుదగ్గరకు వచ్చాడు. నౌఖర్లను లేపడానికి ప్రయత్నించాడు. వాళ్లు సనేమీ లేవలేదు. ఇదేమిటో అని ఆలోచిస్తూ అతడు ముందుప్రక్క సోపానపంక్తిలో ఒక రాతిమీద కూచొని పక్కనున్న మొక్కపై కొరిగాడు.

అప్పుడతనికి జ్ఞాపకం వచ్చింది. తాను వెనకటిరాత్రి కావలా విధిప్రకారం చెన్నబసవన్ననూ, దేవమ్మాజిని ప్రత్యక్షంగాచూసి నమస్కరించివుండలేదు.

ఉదయం లేవడంతోనే ఓసారి చూడటం, రాత్రి చివరికోసారి చూడటం, వాళ్ల కావలా కాసేపద్ధతి. ఈసంగతి జ్ఞాపకం వచ్చేటప్పటికి అతనికి గుండెలు దడదడా కొట్టుకోవడం మొదలుపెట్టాయి. నమస్కారం పెట్టేసమయంకంటె చాలాతర్వాతనే అతనికి వాళ్ళ మాటల సందడి వినబడింది. అయినా తాను తనపని సరిగా చేయనిమాట నిజం. ఈసంగతి బసవన్నకు తెలిస్తే అతడు తన్ను తేలిగ్గా విడిచిపెట్టడు.

తర్వాత రెండుగడియలకు మిగిలిన కావలావాళ్ళు నిద్రలేచారు. ఈపాటికి రాజభవనంలోని నౌఖర్లు కొందరైనా లేవాలి; కాని ఆరోజు ఎవరూ లేవనేలేదు.

కోడి కూసేజాముకు పసిబిడ్డ వెనక రెండురోజులు లేచాడు. ఈరోజు ఆ సందడే విన రాలేదు. నాయకునికి వీటన్నిటిమూలాన భయోత్పాతం కలగడం ప్రారంభించింది, కాని అతదేమైనా నేరం జరిగివుంటుందేమోనని ఊహించుకోలేకపోయాడు. మొన్న తానే కావలి

కాదారు; నంజనగూడుకి పోవాలి ఏర్పాట్లు చేయండి అని నిన్ననే కబురుపెట్టారు; ఎన్నో ఏండ్లుగా నడవకుండా మూలపడ్డ ఆయుధపర్వాన్ని నిన్న నడిపించారు; ఇంతట్లోకి శంకిం చాల్సిన కారణమేమీ కనబడటం లేదు.

బాగా తెల్లవారింది. రాజభవనంలోపలి జనం అందరూ లేవడం తెలుస్తోంది. అయితే ఎవరూ వాకిలింకా తెఱవలేదు.

నాయకుడు బైటివాకిలి తట్టాడు. లోపలినుంచి నౌఖరుకూతురు ఒకత్తె వాకిలిదగ్గిరకు వచ్చింది.

నాయకుడు 'ఇదేమిటవ్వా ! ఇంత ఆలస్యం చేశారు ? ఇంత పొద్దెక్కినా ఇంకా వాకిలి తలుపులే తెరవలేదేం ?' అని అడిగాడు. వాకిలి తెఱచినపిల్ల ఏమైనా జవాబు చెప్పడానికి ముందే నౌఖరుపెళ్ళాం వచ్చింది. 'రాత్రి పండగభోజనం పొద్దుపోయిందిగా నాయకయ్యా ! దొరలు తిని, అమ్మగారు తిని అందరూ తిని పడుకొనేటప్పటికి నిసిరాత్రి అయింది' అంది. నాయకయ్య 'సరి; కన్నవ్వా ! దొరగారు దొరసానిగారు లేవగానే కొంచెం చెప్పు. వారికి 'దణ్ణంపెట్టి నేను మడకేరికి నౌకరును పంపించాలి' అన్నాడు. పిల్లా, దాసీపెద్ద, ఇద్దరూ లోపలికి పోయారు. ఇతడు బైటనే నిలబడ్డాడు.

మళ్ళీ చాలపొద్దు గడచిపోయింది. లోపలినుంచి ఎవరూ వచ్చి ఇతన్ని పిలవలేదు. తానే వాకిలి కొంచెం తట్టి లోపలికి వినబడేటట్లుగా 'ఎవరవ్వా ! అక్కడ ? కొంచెం ఇటురా' అని అఱిచాడు. దాసీపెద్ద వచ్చింది. నాయకుడు ఆమెతో 'నౌఖర్నిపంపేవేళయిందవ్వా ! దొరలు అమ్మగారు దరిసెనమిస్తే మంచిది' అన్నాడు. ఆమె 'వాళ్ళు ఇంకా లేవలేదు అప్పా ! వాకిలి మూసేవుంచారయ్యో !' అంది; లోపలికిపోయింది.

ఏమిచేయడానికి తోచక నాయకయ్య ఓక్షణం ఆలోచనలో మునిగిపోయాడు; వీళ్లకు దాక్షిణ్యంచూపిస్తే బసవన్నదగ్గిర బ్రతికేటట్లు లేదు. అతని మాటప్రకారంనడిస్తే ఇక్కడ నిష్ఠూరం రాకతప్పదు. ఏం చేయడమా అని నాలుగుసార్లు ఆలోచించికూడా నాలుగుసార్లూ ఓ నిశ్చయానికంటూ రాలేకపోయాడు. అయిదోసారి ఇహ తెగించి, 'ఏమైతే అది కానీ, నౌఖర్లు మేల్కొలుపకపోతే నేనే వీళ్ళను లేపాల్సివుంటుంది. నమస్కరిస్తూనే క్షమించాలి అంటాను. మడకేరికి నౌఖరును పంపించాలి. లేకుంటే నెత్తిమీదికి వస్తుంది' అనే నిర్ణయా నికి వచ్చాడు. రాజభవనం ముందువాకిలిని తట్టి లోపలికిపోయి 'ఎవరవ్వా ! అక్కడ ? దొర లకు చెప్పవ్వా ! నేను దరిసెనంచేసికోవాలని' అన్నాడు.

దాసీపెద్ద మళ్ళీ వచ్చింది. 'రాత్రి చాల పొద్దుపోయిందప్పా ! వాళ్లు లేవలేదు. ఏం చేస్తావు ?' అంది.

'పోయి కొంచెం లేపవ్వా ? ఇంకా ఆలస్యమైతే అక్కడ వినరవ్వా !'

'కావచ్చునవ్వా ! పాపం ! పౌరులకూ చాకర్లకూ, పిల్లలకూ పెద్దలకూ అన్నం పెట్టించి, అలసిపోయి, మైమరచి నిద్రపోయారు. దొరలను లేపేవాళ్ళుంటారా ఎక్కడన్నా !'

'అది సరే అవ్వా ! దొరలు పడుకొనివున్నా, నేను ఓసారిచూస్తే చాలు. లేపనే అక్కర్లేదు'.

దాసీపెద్ద: 'మీ ఇష్టం నాయకయ్యా ! నువ్వు ఈ ఇంటిమనిషివి కాదు. నీకు దాతలువేరు. నీకు సరి అనిపించినట్లు చెయ్యి' అంది.

నాయకయ్య: 'నడు అవ్వా !' అంటూ ఆమెవెంట వెళ్ళాడు. ఆమె అతన్ని మేడమీదికి తీసుకొనిపోయింది. నాయకుడు చెన్నబసవన్నగది వాకిట్లో నిలబడి లోపల ఎవరైనా ఉన్న సూచన కపబడుతోందా అని చెవిపెట్టి విన్నాడు. అతనికి ఏమీ తెలియలేదు. వాకిలి మెల్లిగా తట్టిచూశాడు. ఎవరూ పక్కమీద కదలాడుసూచన కనబడలేదు. వాకిలి మెల్లిగా తట్టాడు. కొంచెంగాతెఱచి లోపలికి తలపెట్టి చూశాడు. పక్కమీద ఎవరూ లేరు. ఆయన ఇవతలికి వచ్చి దాసీపెద్దకు 'దొరలు పక్కమీద లేరవ్వా !' అన్నాడు.

దాసీపెద్ద 'లోపలికేమైనా వెళ్ళారేమో !' అంది.

ఎంతటి కఠినమైన కర్తవ్యాన్ని చెయ్యడానికి సిద్ధపడినా నాయకయ్య మగవాడైనవాడు స్త్రీ వుండే గదిలోకి వెళ్లడమా అని సందేహించాడు. చాలానిమిషాలు అక్కడే నిలబడి దేవమ్మాజీ గదిలోంచి మనుషులున్న సవ్వడి వినవస్తుందేమోనని చెవిపెట్టి విన్నాడు. అటువంటి చిహ్నాలేమీ కానరాలేదు. అతడు దాసీపెద్దని, 'బిడ్డ ఎక్కడ పడుకొంటాడవ్వా !' అని మెల్లిగా అడిగాడు. దాసీపెద్ద 'తొట్టి ఇప్పుడు అమ్మగారిగదిలోనే వుంటుంది' అంది.

కిందపక్క సేవకులందరూ లేచి వాళ్ళవాళ్ళపనులు వాడుకప్రకారం చేయడం మొదలుపెట్టారు. నాయకయ్య ఇంకోగడియసేపు వేచివుందామని నిశ్చయించుకొని మేడమీదినుంచి దిగిపోయాడు.

# 110

చాలా కష్టపడి ఇంకో గడియసేపు ఎట్లాగో ఓపికపట్టి వాడు ఇహ తాళడం సాధ్యంకాదని, తిరిగి పైకిపోయాడు. చెన్నబసవన్న గదిబైటా, దేవమ్మాజీ గదిబైట శబ్దమయ్యేటట్టు గబీగుభీ నడిచాడు; బిగ్గరగా మాట్లాడాడు. చెన్నబసవన్నగదివాకిట్లో నిలబడి 'దొరగారూ ! దొరగారూ !' అని తలుపు వీపైనంతగట్టిగా తట్టాడు. జవాబేమీరాకుండా వుండేటప్పటికి గది

లోపలికిపోయి లోపలిగది వాకిట్లో నకిలించి శబ్దంచేసి, తలుపుతట్టి 'దొరా! దొరా!' అని అరిచాడు. అక్కడా జవాబులేదు. తలుపు తోశాడు, అది తెరుచుకొంది. లోపలికి తలపెట్టి చూశాడు; అక్కడ ఎవరైనా ఉంటేగా! ఓ ప్రక్క ఉయ్యాలమంచము పడివుంది; చూస్తే అందులో పసిపాప లేదు. చిట్టచివరి ఆశగా అతడు ఆ గదిలోంచి మూడోగదిలోకి వెళ్ళాడు. అక్కడ దేవమ్మాజి చీరెలు, వల్లెవాటులు, రవికెలు, పైదుపట్టాలు ఉన్నాయి. నేలమీద కొన్ని పెట్టెలు పడివున్నాయి. మనుషులజాడ లేదు.

తన కావలా అజాగ్రత్తమూలాన అల్లుడుగారు, రాజు చెల్లెలు, పసిపావను తీసికొని పారిపోయారనేది నాయకయ్యబుద్ధికి తట్టింది. అతడు భయంతో కంపించిపోయాడు. అక్కడే కుప్పన కూలిపోయేవాడు. వణికించేస్తున్న భయంనుంచి గుండెను మెల్లిగా చిక్కబట్టి అతడు మూడు వాకిళ్ళుదాటి బైటకువచ్చి దాసీపెద్దను 'ఏమవ్వా! ఇంత మోసం చేశారు? దొర, అమ్మ, బిడ్డ తప్పించుకొని పారిపోయారే?' అని దిగాలుపడి అడిగాడు.

పెద్దదాసి 'ఇదేందప్పా! ఇట్లా అంటావు?' అని బదులుచెప్పి అతనిమాట నిజమేనేమో, తానూ చూడటానికి అన్నట్లుగా గదుల్లోకి చక్కాపోయింది.

# 111

చెన్నబసవయ్య, దేవమ్మాజి, బిడ్డతోపాటు ఇల్లువదిలేసి పారిపోతారనేసంగతి సేవకుల్లో చాలామందికి తెలియదు. పెద్దదాసీకి, ఆమెతోపాటుండే, మరి ముగ్గురికిమాత్రం తెలుసు. తమకీ ఈ సంగతేమీ తెలియదన్నట్లే వాళ్ళు నటించాలి; అందుకని పెద్దదాసి ఈ నాటకమంతా ఇంతసేపూ నడవనిచ్చింది. కావలానాయకుడు సేవకులను పరిచారకలనూ, అందరినీ సమావేశపరిచాడు. అందరినీ విచారించాడు. ఎవరిమీదనైనా భారంతోసి, బసవన్న కోపానికి బలిచేస్తే తన తల భద్రంగావుంటుందని అతనికి తెలుసు. ఇంటియజమాని, యజమానురాలు పసిబిడ్డ పోయివున్నందువల్లకూడా కొందరైనా వెళ్ళివుండాలి. ఆ వెళ్ళినవాళ్లు ఎవరు అని కని పట్టటానికి వేరే అంత విచారణ, నడవవలసి వచ్చింది.

ఇదంతా అయినపిమ్మట మడకేరికిపోయి మంత్రి బసవన్నకు సమాచారం చెప్పడానికి వంతు కావలావానిని పంపించాలి.

'నాయకయ్యా! ఈ వార్తను నేను ఒక్కడినివెళ్ళి ఏం చెప్పాలి? దొడ్డవారు మీరూ దయచేస్తే వారు అడిగినవాటికన్నింటికీ చెప్పడానికి చక్కగా వుంటుంది' అన్నారు.

అతనిమాటలో పైకి కనబడే అర్థంతోపాటు అంతరార్థంకూడా వుంది. అదీ అందరికీ తెలుసు.

నాయకయ్యకూ ఆ రహస్యం ఏమిటో తెలుసు. సమాచారం వినగానే మంత్రికీ, రాజుకూ చాలాకోపం వస్తుంది. ఆ కోపం ఆ క్షణంలో ఆ సంగతి చెప్పినవాడిమీద విరుచుక పడుతుంది. పనివాడు దానికి ఎందుకు గురికావాలి?

అతడే చెబితే మంచిది.

నాయకయ్య 'ఔను పో' అన్నాడు. మిగతాజనానికి రాజభవనంలోని నౌకర్లు ఎవరూ తప్పించుకొనిపోకుండా చూడండి అనిచెప్పి కావలావని అప్పగించి, తోటికావలావానితో కలిసి తానూ మడకేరికి ప్రయాణమయ్యాడు.

# 112

మడకేరి రాజభవనంలో ఆ ఉదయం రాజు రోజూకంటె కొంచెం ఆలస్యంగా, సావకాశంగా, నిదానంగా ప్రక్కమీదినుంచి లేచాడు. క్రిందటిసాయంత్రం చెన్నబసవయ్య నంజనగూడుకు యాత్రపోవడానికి అనుమతికోరి వ్రాసిన ఉత్తరం, రాజును సమ్మతపరచడానికిగా, బసవయ్య చేతికి వచ్చింది. అప్పుడు రాజు అందులోనిసంగతులు తెలుసుకొని ఆజ్ఞ ఇచ్చేస్థితిలో లేరు. ఇప్పుడు రాజుగారు లేచి ప్రాతఃకాలికకృత్యాలు నిర్వర్తించి ఆసనకక్ష్యలోకి వచ్చింతర్వాత బసవన్న అతనిదగ్గిరకువచ్చి చేతులుజోడించి చెన్నబసవన్న ఉత్తరంసంగతి విన్నవించాడు.

రాజు: 'కావలావాడు ఇప్పుడే వచ్చాడా ఏమిటి?' అని అడిగాడు.

'లేదు ప్రభూ! ఇది (ఉత్తరం) నిన్నసాయంకాలం వచ్చింది.'

'వాడిని రానియ్యి. వేరే నౌకరు వెళ్ళేటప్పుడు చెబుదాం.' బసవన్న తన వేరేపనులు చూసుకోవడానికి వెళ్ళిపొయ్యాడు. అప్పంగొళనుంచి నౌకరు వచ్చేసమయం మీరిపోయింది. గడియ అయింది. రెండుగడియలు దాటింది. సమాచారం ఏమీ రాలేదు. ఇట్లా ఎందుకైం దప్పా! అని ఆతనికి గుండెల్లో దిగులు ప్రారంభించింది. సేవకుణ్ణిపిలిచి 'అప్పంగొళనుంచి నౌకరు రాలేదు. ఎందుకనో చూసిరావాలి, ఓ గుర్రాన్ని తే' అని ఆజ్ఞాపించాడు.

వీరరాజు దగ్గిరకువచ్చి ఈసంగతి విన్నవించుకొన్నాడు.

'ఇదేమిటి నీ ఏర్పాటు? ఇప్పుడేగా వచ్చిచెప్పావు నంజనగూడుకు వెళ్ళాలంటున్నారు అని. ఇప్పుడువచ్చి సమాచారం ఏమీ రాలేదు అని మెల్లిగా చెబుతున్నావు. మేము 'సరే' అనకుండానే వెళ్ళిపోయారంటావా?'

'ఉండండి ప్రభూ! అంత తలపోయేపని చేస్తారా? కాపలావాళ్ళు రానీండి, విన్నవిస్తారు.'

దొర ఏమీ మాటాడలేదు. బసవన్న బైటికివచ్చి తన ఆజ్ఞాప్రకారం వచ్చివున్నగుర్రం వానితో 'అప్పంగొళ కావలామనిషి ఈపొద్దుకల్లా వచ్చివుండాల్సింది. ఎందుకు రాలేదో చూసి చక్కారా. దారిలో కలవకబోతే రాజభవనానికివెళ్ళి కావలానాయకుని పిలుచుకొని రా' అని ఆజాపించాడు.

రౌతు మడకేరి పొలిమేరదాటి కొంచెందూరం పోయేటప్పటికి అప్పంగొళ కావలా నాయకుడు, అతనిచేతిక్రింది కాపలామనిషీ అతనికి ఎదురుగ్గా వచ్చారు. తాను వాళ్ళకోసమే వస్తున్నసంగతి అతడు వాళ్ళకు తెలియజేసాడు.

నాయకునిప్రాణాలు సగం అక్కడే ఎగిరిపోయాయి. ఎదుటపడ్డ నౌకరుతో అతడూ, అతనివెంట నున్న మనిషీ వేగంగా గుర్రంనడిపి రాజభవనానికి వచ్చారు.

బసవన్న వాకిట్లో ఎదురుచూస్తూవున్నాడు. నాయకుడు పరుగెత్తివెళ్ళి అతని కాళ్ళమీద పడి 'దొరా! పని పాడైపోయింది. నన్ను రక్షించాలి' అని మొఱపెట్టాడు.

బసవన్న: 'ఎందుకో! ఏమైంది?'

'అల్లుడుగారు, అమ్మగారు, బిడ్డ, అందరూ రాత్రి దొంగతనంగా పారిపోయారు. జాము పొద్దెక్కేదాకా ఇది తెలిసికోటమే కష్టమైపోయింది.' బసవన్నకు ఎక్కడలేని ఆశ్చర్యం వేసింది. పట్టరానికోపం ఎగేసుకొనివచ్చింది.

'నీకు వొంటిమీద స్పృహలేకుండా పోయిందా? దొంగతనంగా వాళ్ళు పారిపోతే, కాపలావాళ్ళు మీరేం చేస్తున్నట్లు?'

'దొరా! కూటిలో ఏదో మందుకలిపి పెట్టినట్టుంది. కావలివాళ్ళు అందరూ ఒళ్ళుమరిచి చొప్పకట్లలాగా పడివున్నారు. పొద్దెక్కిందర్వాత లేవడంకూడా అతి కష్టమైంది. లేచిచూసే తల్కి పారేపోయారు.'

'వాళ్ళు మాయమై ఎగిరిపోవడం సరే; నీ తల ఎగరడం ఖాయం తెలుసా.'

'చిత్తం దొరా! దొరా చిత్తం. మా బాగ్గెం. మెలకువ తప్పింది. తల ఇయ్యి అంటే ఇచ్చేత్తాను.'

బసవన్న అతన్ని 'కూడా రా!' అని వెంటపెట్టుకొని రాజసన్నిధానానికి వచ్చాడు.

'ఏమైందో! విన్నపం చేసికో' అన్నాడు.

వీరరాజు బసవన్నను 'ఏం విన్నపం?' అని అడిగాడు.

'అల్లుడు, పెద్దమ్మగారు, బిడ్డను ఎత్తుకొని, దొంగతనంగా పారిపోయారుట ప్రభూ!'

'పారిపోయారూ? నువ్వేం చేస్తున్నావంట ముండమోపీ! నీ తల ఎగిరిపోతుందని తెల్వదా?'

'దొంగతనంగా పారిపోయినవాళ్లు చిక్కితే, నా తల ఎగిరి చక్కాపోయినా ఫర్వాలేదు దొరా!'

'ఓరీ కుంటీ! నీ రంగురంగుమాటలకి, నేను మోసపోయేదిలేదు. ఇదంతా నువ్వే చేయించివుంటావు. నంజనగూడు, గింజనగూడు అని అంతా మోసంచేసి బ్రతుకుదామని చూశావా? ఇదేమీ సాగదిక్కడ. మొదట నిన్ను కాజేసి ఆతర్వాత మిగతావాళ్ళని పట్టిస్తాం. తెలిసిందా?'

'చిత్తం ప్రభూ! వాళ్ళెటుపొయ్యారో, చూడటానికని మనుషుల్ని పంపించా.'

'ఏవైపు పోలేదో, ఆ వైపుకు మనుషుల్ని తరుము. ఆట మా రంజుగావుంటుంది. ఇంతనాటకం ఆడినందుకు నిన్ను కొఱతకెక్కిస్తాం.

బసవన్న ఈమాటకు బదులు చెప్పలేదు. బైటనున్న తన సేవకుని పిలిచాడు. 'కావలా నాయకుణ్ణి చూడు. వేరేమనుషుల్ని పిలు. వాళ్లు నాల్గువైపులా పడిపోవాలి' అని ఆజ్ఞా పించాడు. నౌకర్లు రాగానే, తగ్గవాళ్ళనుపిలిచి, సోమవారప్పేట, కుశాలనగరం, సిద్దాపురం, సంపాజి, హిగ్గళ, అయిదుదిక్కులకూ పోవడానికి మనుషుల్ని నియమించాడు. 'ఈ దారుల్లో ఏదోదారివెంట వాళ్లు తలదాచుకొని పారిపోయివుంటారు. వాళ్ళే దొరకాలి అని ఏమీలేదు. వాళ్ల కబురైనా మనకు తెలియాలి. పొలిమేరలకు వెళ్లాల్సివుంటుంది.

వాళ్లో, వాళ్ళలాంటివాళ్లో వెళ్లివుంటే తెలుస్తుంది. సంజె కూకేటప్పటికి ఈ దొడ్డిలోకి వచ్చి వార్త చెప్పాలి. వార్త ఏమీలేదుఅన్నా ఫర్వాలేదు. రాకుండావుంటేమాత్రం తల లెగిరి పొయ్యాయి అన్నమాటే. కబడ్దార్!' అని ఆజ్ఞాపించాడు. వాళ్ళంతా బైల్దేరి వెళ్ళినమీద దొరదగ్గిరకువచ్చి 'దొంగతనంగా పారిపోయారయ్యె. అంచేత నగలూ, నాణ్యాలూ, వస్త్రాలు కూడా తీసుకపోలేదు. పోయి వాళ్ల పెట్టెలూ బేడలూ చూసి, ఏముందో తీసుకొని చక్కా వస్తాము దొరా!' అన్నాడు.

'కానురా ముండమోపీ! [1]అప్ప పెట్టిన చీరెలూ, సొమ్ములూ అనీ తొత్తుముండ మోసు కొని వీధివిపడ్డదేమో! నడు మేముకూడా వస్తాం. మా చెడ్డ తొందరైపోయింది.

బసవన్న తన్ను మోసంచేశాడని రాజుకు నిజంగా సందేహం లేదు. అయినా మోసం ఎవరైనా చేయవచ్చు. అదనువస్తే చేస్తారు అనేది అతని నమ్మకం. తాను రాజక్షేమం తప్ప కుండా కోరేవాణ్ణి అనేవిషయం రాజుకు తెలియాలిఅని బసవన్న కోరిక. దీనివల్ల అతనికి తనమీద విశ్వాసం దృఢపడుతుంది అని అతని ప్రతీక్ష. మొత్తంమీద అక్కడినుంచి అర

1. అప్ప = తండ్రి

గడియలో యజమానీ, నౌకర్లు ఇద్దరూ, గుర్రాల్ని ఎక్కి ఎదురుగ్గా నలుగురు వేగువాండ్రను పెట్టుకొని తోడుగా నలుగురు పరిచారకులతో అప్పంగొళకు బయల్దేరారు.

ప్రయాణం సన్నాహం జరుగుతూవుంటే ఏదో హెచ్చుతగ్గులైవుంటాయని రాణి ఊహించి 'సంగతేమిటో ఉపాయంగా తెలుసుకొని రా' అని పెద్దదాసిని పంపించింది.

పెద్దదాని ప్రాంగణంలోకిపోయి అక్కడవున్నవాళ్ళను అడిగి తెలిసినసంగతిని రాణికి విన్నపం చేసింది. రాణి దాసితో 'బసవయ్యను, ఓక్షణం ఇక్కడకు వచ్చివెళ్ళమని చెప్పు' అంది.

దొర గుర్రం ఎక్కడానికి తయారవడానికి గదిలోపలికి పోయినతర్వాత బసవన్న రాణి సన్నిధికి పరుగెత్తివచ్చాడు. రాణి 'వార్త నిజమేనా? బసవయ్యా!' అని అడిగింది.

'అవునల్లేనే కనపడుతోంది అమ్మా!'

'అల్లా అయితే నంజనగూడుకు వెళ్లాలి అని చెప్పింది ఒట్టి అబద్ధన్నమాట. కళ్ళల్లో దుమ్ముకొట్టి పోయారన్నమాటవ్వా! నంజనగూడుకు వెళ్లాలి అని చెబుతూవుంటే కాపలా కొంచెం ఢీలా అవుతుంది అని యుక్తివన్నివుండవచ్చు.'

'కావచ్చు. ఇహ ఇప్పు దేవిఁటి?'

'దొరలు తామే అప్పంగొళకు విజయంచేసి వస్తారుట. కూడా పోతున్నాను.'

'గుర్రంస్వారి వాడిక తప్పింది. జాగ్రత్తగా చూసుకో.'

బసవయ్య: 'అల్లాగేనమ్మా!' అనిచెప్పి తలవంచి నమస్కరించి రాజు సన్నిధికి వెనక్కి పరుగెత్తాడు. పెనిమిటి ఎంత నిర్లక్ష్యంగాచూస్తూవున్నా తనకర్తవ్యాన్ని ఇంత శ్రద్ధగా వెల్లిస్తూవున్న పత్ని - ఈ తన యజమానురాలినిచూస్తే, అతనికి ఎక్కడలేని ఓ గౌరవభావం మనస్సులో గూడుకట్టుకొన్నది.

రాణి: 'వాళ్ళు దొంగతనంగా పారిపోవడం తప్పు. కాని సత్యా పసిబిడ్డ రాజుచేతికి దొరకకుండా దూరంపోవడం మంచిదైంది. ఈ సంవత్సరం ముగిసేవరకూ ఈ చెల్లెలు, బావమఱది దూరంగావుండిపోతే దేవుడు రాజును రక్షించినట్లౌతుంది' అని అనుకొన్నది.

# 113

వీరరాజు రాజభవనంవిడిచి బైలుదేరిపోవడంచూచి మడకేరి ఊరుఊరంతటికీ ఆశ్చర్యం పెన వేసుకొంది. అయన గుర్రంవేసే ఎక్కాడే? ఏదోరకంగా ఈవార్త ప్రాకింది. ఊరిజనం పరుగెత్తుకుంటూవచ్చి ఓ ప్రదర్శనం చూడటానికి అన్నట్లుగా దారిలో గుమికూడారు. కొమ్ము

బూరావాడు రాజు రాజభవనంనుంచి బైలుదేరడాన్ని కొమ్ముసారించి ఊదాడు. కూడా నల్గురు ఒకరైనతరువాత ఒకరుగా తమతమ కొమ్ముబూరాలు ఊదారు; వేరిద్దరు [1]'చలవాదులు' తప్పెట మ్రోగించారు.

బసవన్న రాజు వెనకాలేవుంటూ ఇరుప్రక్కలావున్న బీదలకు వాడుకప్రకారం ఓకాసు వేస్తూపోయాడు. బీదవాళ్ళు దాన్ని తీసుకొని 'జీవించు మా దొరా! జీవించు' అని నినదించారు. చేరినజనంలో కొంతమంది ఈ నినాదాన్ని తిరిగితిరిగి అంటూ వచ్చారు.

ఒకకాలంలో దొర ఈవిధంగా బైటికివస్తే దారికి రెండుప్రక్కలా ఊరిలోని మగవాళ్లూ, ఆడవాళ్లూ అంతా నిలబడేవాళ్లు. ఆయన కన్ను చెడ్డది, ఆయన మనస్సు పాషాణం అని తెలిసినప్పటికీ చాలా ఏండ్లు జనం దొరనుగూర్చి ప్రేమగానే ప్రవర్తించారు. ఈ ప్రేమ పనికి రాదు అనేంతదూరం ఆయన తప్పుదారిలో నడిచి, జనం గౌరవప్రేమల్ని పోగొట్టుకొన్నాడు. ఎంతో పెద్దదిగావుండే జయఘోష ఇప్పుడు ఎంత సన్నగించిపోయిందా అని బసవన్న మనస్సుకనిపించింది. సేవకులకు తోచినసంగతి దొరకు తోచలేదు. అతనిబుద్ధి ఆ దిక్కులో ప్రసరించడం మఱచిపోయింది.

ఊరి పొలిమేరదాటి రాజు అప్పంగొళకు తగినంతవేగంగా పొయ్యాడు. ఆయన వస్తున్నాడని తెలియగానే, ఆ రాజభవనంలోని సేవకులు చెల్లాచెదరుగా పారిపోయారు. కావలా వాళ్ళు నల్గురూ, వాళ్లను ఆపడానికి ప్రయత్నించారు. కానైతే ఒకళ్ళొకళ్ళని వెంబడించి పట్టుకొనేసమయంలో పదిమంది పట్టు తప్పించుకొని పారిపోయారు. దొర రాజభవనం వాకిలి చేరేసమయానికి నిల్చినవాళ్లు, దాసీపెద్ద ఒకత్తె, జతకు ఇద్దరు దాసీలు, మరోఇద్దరు సేవకులూ!

రాజు ముందువాకిలి మెట్లదగ్గిర గుర్రం నిలపడంతోటే, దాసీపెద్ద పరుగెత్తుకొనివచ్చి నేలమీద వ్రాలింది. 'నా దొరా! నన్ను కాపాడాలి. నా తప్పేమీ లేదు' అని విన్నవించడం ఆరంభించింది.

రాజు: 'నేను కాచేది, పెట్టేది ఎంతమాత్రం లేదు. నువ్వే కాచేదానివి [2]'కావలి' మీద' అని నవ్వుతూ, 'అంతేగా!' అని బసవన్నను అడిగాడు.

ఇది ఈయన హాస్యం. ఈ హాస్యంవల్ల ఎవరికీ సంతోషం కలగలేదు. అయినప్పటికీ, దొర హాస్యం పలికినప్పుడు దానికి ఒప్పుకోవడం సేవకులకర్తవ్యం. వెనకా, ముందూ ఉన్న

---

1. చలవాది = a Holeya who with resoluteness and obstinacy serves Siva lives by begging alms and is greatly respected by lingavants—Kitial.

2. కన్నడంలో 'కాయ్' ధాతువునకు కాపాడు, కాచు అను అర్థములు కలవు. తెలుగులో 'కాచు' ధాతువున కిల్లే రెండర్థాలు. కన్నడంలో 'కావలి' శబ్దానికి - రక్షణ, కాగు అని రెండర్థాలు కలవు.

జనంలో పలువురు 'హహహా' అంటూ నవ్వినట్లే నటించారు. బసవన్న చాలా అప్తుడు గనుక ఈ ప్రదర్శనం అతనికి అక్కర్లేదు. అతడు నవ్వలేదు. గంభీరంగా 'చిత్తం ప్రభూ' అన్నాడు. దాసీపెద్ద 'దొరలు రే అంటున్నారు రే - లోపలికి దయచేస్తారు. దారిచూపించు' అన్నాడు.

దాసీపెద్ద లేచింది: చేతులు జోడిస్తూనే కాలు వణకిస్తూ వెనక వెనకకు నడిచింది. వెనుకప్రక్క మెట్లువుండటం చూడక.

పడింది. జనం గొల్లుమని నవ్వి తమాయించుకొన్నారు. రాజా 'హహాహా' అని కొంచెం నవ్వాడు. అంగరక్షకునిసాయంతో గుర్రంమీదినుంచి దిగాడు.

దాసీపెద్దలేచి దారిచూపిస్తూ ముందు నడిచింది. మొదట రాజా, వెనక బసవన్న, ఆ వెన్క కావలా నాయకుడు, ఈ క్రమంతో వాళ్ళు లోపలికి వెళ్ళారు.

రాజా నడిపించిన విచారణవివరం, ఇక్కడ చెప్పాల్సినవనిలేదు. నిజానికి విచారణ అతడు కాదు, బసవన్న నడిపించాడు. క్రిందటిదినం ఆయుధపర్వం ఏర్పాటు, దానిలో గెలిచినవారికి ఇచ్చిన ఉడుగరలు, రాత్రి నడచిన విందుభోజనంసంగతి వీటన్నిటివివరాలు దాసీపెద్దనుంచి, తోటి నౌఖర్లనుంచి కావలి నాయకుడు, అతనిదగ్గిరఉండే ఇతర కావలావాళ్లనుంచి సవిస్తరంగా సేకరించాడు. ఉదయం దాసీపెద్ద చాలాసేపు కావలా నాయకుని ఏమార్చిన సంగతీ రాజాకు తెలిసింది. ఆయన బసవన్నతో 'ఈ ముండను గాడిదమీద కూచోబెట్టి మడకేరిలో ఊరేగించి, మాదిగాళ్ళకు పారెయ్యి. ఈ వందిపెధవని కొఱతకెక్కించు' అని ఆజ్ఞాపించాడు. బసవన్న 'చిత్తం దొరా!' అన్నాడు. ఆమీద వాళ్ళు రాజభవనంలోని గదులన్నీ వెదకి ఏమేమి సామానువుందో అని తెలుసుకొని వాటికి తాళాలు వేయించారు. దేవమ్మాజీ లోపలిగదిలోవున్న విడిబట్టలన్నింటినీ ఓ పెట్టెలోపెట్టించి దానికి మిగతాపెట్టెలకూ తాళాలు వేయించాడు. వాటిని నౌఖర్లమీదికెక్కించి పంపు అని ఆజ్ఞాపించి మడకేరికి గుర్రంఎక్కి బయల్దేరాడు.

అప్పంగొళనుంచి వచ్చేదారి మడకేరి, సంపాజిదారిని కలిసేస్థలానికి వచ్చేటప్పటికి, వాళ్ళకు ముందుప్రక్క ఓ మనిషి వానివెనక ఓ [1]ఎరవ, ఓ [2]ఎరవతె, వాళ్లకు వెనకాల గుర్రంమీద ఇద్దరు పెద్దవాళ్లు రావడం కనబడింది.

రాజాగారి నౌకర్లు వేత్రధారులు ఏ ఏయ్, ఏమండోయి, గుర్రం దిగండి. పక్కగా దొరగారు విజయం చేస్తున్నారు' అని అరిచారు.

ఒకక్షణం ఆ మనుషులకు ఈమాట అర్థమయినట్లే కనబడలేదు. వారంతా ఇటు తిరిగి చూశారు. ముందుప్రక్క గుర్రంమీద ఆసీనుడై వున్న రాజాను గుర్తించారు.

---

1. ఎరవ = ఆటవికజాతిమనిషి.
2. ఎరవతె = ఆటవికజాతికి చెందిన స్త్రీ.

గుర్రాలమీదవున్న ఇద్దరు పెద్దవాళ్ళు, ఆ క్షణమే, క్రిందికి దుమికారు. అక్కడ నిలబడి తలవంచి నమస్కరించి 'దణ్ణాలు! ప్రభూ!' అన్ని విన్నవించారు.

వాళ్ల సంపాజిగౌడ కొడుకు, గురికాడు. ముందు నడుస్తూవున్న చోమన్న దొరకు అడ్డంవచ్చి నేలమీదపడ్డాడు. కొగ్గన్న తలమీదవున్న ఉయ్యాలమంచం, నేలకుదింపి, చోమన్న వలెనే తానూ అడ్డంగా నేలమీద సాష్టాంగపడ్డాడు. అతనిభార్యకూడ ఆదేపని చేసింది.

# 114

రాజుకు బసవన్నకూ తాము ఈ మనుష్యుల్ని కలిసింది ఎంతటి అపూర్వయోగమో ఎట్లా తెలుస్తుంది? గుప్తచారులు ఎవరినో బాటసారులను నిలిపారు అని వాళ్ల అనుకొన్నారు. రాజు గుర్రాన్ని ముందుకు నడిపాడు.

గురికాడు ముందు అడుగువేసి బసవన్నతో 'ప్రభువులతో మనవి చేసుకోవాల్సిన మాట వుంది. ఈ బిడ్డను చూపించాలిసి వుంది' అన్నాడు.

'బిడ్డ! ఏం బిడ్డ?'

'అప్పంగొళ రాజభవనానికిచెందిన పసిపాపే అయివుండొచ్చు. దొర అల్లుడుగారికి, చెల్లెలమ్మగారికి చూపించడానికని బైలుదేరాం.'

ఈమాటలుచెప్తూ వాళ్ల ముందుకువచ్చారు. వాళ్ల మాటాడేమాటలు రాజుకూ వినబడ్డాయి. అప్పంగొళబిడ్డ అన్నమాట చెవిలో పడగానే రాజు గుర్రాన్ని వెంటనే నిలిపేసి వెనక్కు మళ్ళించాడు. బసవన్నకూడా తన గుర్రాన్నినిలిపి, లగాముఁలాగి వెనక్కి నడిపించాడు.

రాజు గురికానితో 'నువ్వు ఎవరు?' అని అడిగాడు.

గురికాడు: నేను సంపాజిచౌకిలో వుండే గురికాణ్ణి. ప్రభూ! పొద్దు పొడువకముందే ఎవరో ఐదారు గుర్రాలమీద కిందిదారిలో దొంగతనంగా పారిపోయారు. ఒక్కడు పైదారిలో వచ్చాడు. వాళ్ళను పట్టుకొనివస్తానని పోయినవాడు దొరకలేదంటూ వెనక్కు వచ్చాడు. వాణ్ణి పట్టుకొన్నాం. ఓ పసిపాప దొరికిందంటూ ఈ కొగ్గన్న ఇతని పెండ్లాం ఈ పసి కందును ఎత్తుకొని గౌడఇంటికి వచ్చారు. గుడ్డలుచూస్తే రాచయింటి బిడ్డవిలాగా వున్నాయి. వీడు 'నేను అప్పంగొళవాడిని' అన్నాడు. బిడ్డను ఇతడూ, ఇతనివెంటవున్నవాళ్లూ దొంగి

లించితెచ్చి నగలూ, నట్రా కాజేసి, బిడ్డను పారేసిపోయారేమో అనిపించింది. అప్పంగొాళలో చూపిద్దాం అని బిడ్డనుతీసుకొని అతన్నీ పిలుచుకొనివస్తున్నాం' అన్నాడు.

రాజుకు, బసవన్నకూ, వెనకాలవస్తూవున్న పరిచారకులకూ, కాపలా నాయకునికి మొత్తంమీద తోచింది: నాలుగైదుగుర్రాలమీద దొంగతనంగాపోయేవాళ్ళు చెన్నబసవయ్య, దేవమ్మాజి, పరివారమూ అయివుంటుంది. కాని ఈబిడ్డ వాళ్ళదైతే దాన్ని సంపాజిదగ్గిర విడిచిపోవడం దేనికి? అప్పంగొాళనౌఖరును అనేవాడు వాళ్లను పంపించేయడం దేనికి? వీడు దొంగిలించి వాళ్లు వెళ్ళివుంటే వీడు వెనక్కురావడం దేనికి?' రాజు బసవన్నతో 'బిడ్డ అప్పంగొాళబిడ్డే నేమో? గుర్తేమైనా కనబడుతుందేమో చూడు' అని చెప్పాడు. బసవన్న అంతకుముందే గుర్రం దిగినవాడు ఉయ్యాలతొట్టిదగ్గిరకుపోయి పాపను చూశాడు. ఇక్కడికి వెనకటిఊరిలో కొగ్గన్న పెండ్లాం: పాపను ఒక్కతల్లిచేతికిచ్చి దానికి పాలు కుడిపించింది; బిడ్డ సుఖంగా నిద్రపోతూవుంది. బసవన్న పై కప్పుగుడ్డ సవరించాడు. ముఖానికి ఎండతగిలి మొగం కమలింది. కొగ్గన్న పెండ్లాం: 'అయ్యో! ఎండ దొరా!' అని వంగి తనకే చాలని తన చీర చెఱగు బిడ్డకు ఎండ తాకకుండా అడ్డం పెట్టింది.

బసవన్న పాపముఖం చూశాడు. గుడ్డలు చూసాడు. దొరవైపుతిరిగి 'రాచఇంటిబిడ్డ ఔను దొరా!' అన్నాడు.

రాజు 'పారిపోయినవాళ్లు తల్లిదండ్రులై వుంటారు. వీడు తోటినౌఖరు అనుకుంటాను. ఎవరో ఏమిటో అడుగు' అన్నాడు.

బసవన్న చోమన్నవైపు తిరిగి 'నువ్వు అప్పంగొాళ నౌఖరువా?' అని అడిగాడు.

# 115

ఈవిధంగా సంభాషణ జరుగుతూవుంటే చోమన్నబుద్ధి పాదరసంలా పరుగెత్తింది. ఈ మూడుదారులు కలిసేచోటుకు రాకమునుపు అతడు 'అప్పంగొాళకు పోతాం. వాళ్ళు లేక పోవడంచూసి వీళ్ళు బిడ్డను మడకేరికి తీసుకపోతారు. నేనూ వెంట వుండేదా లేక పొదల్లోకి తప్పించుకొనిపోయి మంగుళూరికిపోయి, బిడ్డమాట దొరకూ, దొరసానికీ చెప్పేదా?' అని ఆలోచిస్తూ వచ్చాడు. ఆలోచించి, ఆలోచించి తిరిగి చివరకు అతడు 'కరింగాళమ్మ దయ దారిలో పడిపోయినబిడ్డనూ, నన్నూ ఒకచోటికి చేర్చింది. అయినంతవరకూ నేను బిడ్డదగ్గిర వుండేయత్నం చేయాలి' అని నిశ్చయించాడు. మడకేరికిపోతే రాణి పసిబిడ్డనుగురించి

ఎల్లాగూ జాలిపడుతుంది; తన్నూ ఏదోవిధంగా కాపాడకపోదు ఆ తల్లి! 'చూద్దాం ఇంతకీ కలింగాళమ్మ ఏమి చేస్తుందో' అని కొంచెం మనస్సమాధానం పడేసమయానికి లేడిపిల్ల పులి వాతబడ్డట్లు వాళ్లువచ్చి రాజుఎదుట పడ్డారు. మొదట నాలుగుమాటలు జరిగింతర్వాత వాళ్ళు తన్నే పరీక్షిస్తారని చోమన్నకు తెలుసు. వాళ్ళకు ఏమిటి చెప్పడం? అబద్ధంచెప్పడం మంచిది కాదు. ఇంకా పదియేళ్లు బ్రతుకుతాననే నమ్మకముంటే ఈపొద్దు అబద్ధంచెప్పి రేపు దేవునికి మీదు కట్టవచ్చు. దొరది రాతిగుండె. బసవన్నది పత్రాతిగుండె. వాళ్లు నిష్కారణంగానే మనుషుల్ని చంపేస్తారు. తన్ను ఈ పొద్దో, రేపో ముగించేస్తారు. ఇటువంటివయస్సులో లేనిమాట చెప్పకూడదు. ఉన్నదున్నట్లు చెప్పుదామంటే నా దొరనూ, దొరసానినీ అన్నంపెట్టి సాకినవాళ్లను మోసగించినట్లౌతుంది. వాళ్ళు మంగుళూరికి పోతారు; రాజుకు ఉత్తరం వ్రాస్తారు. అన్నీ సరే. అట్లా చేయడానికి వాళ్లు స్వతంత్రులు. కాని వాళ్ళు తప్పించుకొని పోయి మంగుళూరు చేరారని చెప్పడానికి, వాళ్లు పోసిన గంజినీళ్లు రుచిచూసిన తన నాలుక కేమి అధికారం? ఏం చెప్పినా ఏదో కొంతలోపం కనబడుతూనేవుంది. ఏమీ చెప్పకుండా వుండటం మంచిది. వీళ్ళు నన్నేమైనా చెయ్యనియ్యి. దైవేచ్ఛ ఎట్లా వుంటే అట్లా అవుతుంది. కాని తానుమాత్రం యజమానికి, యజమానురాలికి కష్టం తెచ్చిపెట్టేమాటను తన నోటినుంచి రానీడు.

చోమన్న ఈ నిశ్చయానికి బసవన్న ప్రశ్నించకమునుపే వచ్చాడు. అతడు 'అయ్యో! దొరగారూ! ఇంకా అప్పంగొళ ఎవరు నేనెవరిని' అని జవాబు ఇచ్చాడు.

సంపాజి గురికాడు 'ఏమి టిట్లా అంటావు? నువ్వు అప్పంగొళనౌఖరు చోమన్నను అని చెప్పలేదా?' అని అడిగాడు.

చోమన్న: 'చిన్నదొర ఎదుట మాటాడినమాట పెద్దదొరఎదుట చెల్లుతుందా?'అన్నాడు.

రాజు వెనకప్రక్కనున్న పరిచారకులు నవ్వారు. కావలా నాయకుడు చోమన్నను గుర్తించాడు. 'వీడు అప్పంగొళ నౌఖరు అయినమాట నిజమేప్రభూ!' అన్నాడు.

రాజు బసవన్నతో 'వీడేమో మహా చమత్కారంగా మాటాడుతున్నాడే' అన్నాడు.

బసవన్న: 'ఈ నౌఖరు నా కొడుకులు ఒక్కొక్కళ్ళు ఇట్లాగే పెచ్చుపెరిగిపోతారు ప్రభూ! వీళ్ళు చాలా తెలివిగా అబద్ధం మాటాడుతారు. ప్రభువులు మెచ్చుతారు. మెచ్చి నవ్వుతారు. దొరలు నవ్వనే నవ్వారుగందా అని వీళ్ళు మరింత బొంకుతూవుంటారు, ఇదీ వరస. చర్మం ఒలిపించేస్తే ముండకు బుద్ధి వస్తుంది' అన్నాడు.

రాజు చోమన్నను 'ఏరా వందివెధవా! పలకవద్దు. నాలుక పీకించేస్తాం. సంపాజిలో పారిపోయినవాళ్లు మీ యజమాని, యజమానురాలేగా! ఔనా?' అని అడిగాడు.

'అది ఎట్లా చెప్పడం? ప్రభూ!'

'అంటే ఏమిటి? పీకు తెలియదంటావా?'

బసవన్న: 'తెలిసినా, అది తాను చెప్పవలసినమాట కాదంటాడు ప్రభూ!' అని దొరకు చిన్నవంచేసి 'అంతేకదూ!' అని చోమన్నను అడిగాడు.

చోమ: 'మీకు తెలియందేముంది దొరా!'

'వాళ్ళు అటు పారిపోతే బిడ్డ ఇక్కడ ఎందుకుంది?'

'దైవేచ్ఛ ఎవరు చూచివచ్చారు దొరా!'

'ఈ బిడ్డ ఇంతకీ వాళ్ళ బిడ్డేనా?'

'ఆమాట నేనుగాదు చెప్పాల్సింది. కన్నవాళ్ళూ పెంచినవాళ్లూ చెప్పాలి.'

రాజుకు చాల కోపంవచ్చింది. అయన 'ఈ కుక్కవెధవకి బొత్తిగా భయం భక్తి ఉన్నట్లు లేదు. నిజం చెప్పితే సరే. లేకపోతే కొఱత కెక్కించడమే అని చెప్పు' అన్నాడు.

చోమన్న తటాలునవచ్చి బసవన్నకాళ్ళమీద పడ్డాడు. 'దొరల కాళ్ళమీదపడ్డాను. నన్ను కొఱత కెక్కించండి వద్దు అని చెప్పను. మా దొరను, దొరసానమ్మను, బిడ్డను కాపాడండి. నేను సంతోషంగా చచ్చిపోతాను' అన్నాడు.

రాజు: 'సంతోషంగా కాకపోతే ఏడుస్తూ చావు. నీ దొరనూ, దొరసానమ్మనూ, ఏం చేయాలో చెప్పాల్సినపనిలేదు. అడిగినమాటకు సరిగా సమాధానం చెప్పు చాలు' అన్నాడు.

'నిజం చెప్పినా చావే. అబద్ధం చెప్పినా చావే. అంటే నేనేం చేసేదిదొరా! మీ ఇష్టం వచ్చినట్లు చేయండి. కథ ముగిసిపోతుంది' అని చోమన్న లేచి వెనక్కువచ్చి నిలబడ్డాడు./

రాజుకు వానిధైర్యానికి ఆశ్చర్యం, మెప్పుదల రెండూ. ఒక పరిచారకునిలో ఇంతటి ప్రేమను సంపాదించిన తన చెల్లెలి పెనిమిటినిగూర్చి ఆయనకు అసూయ కలిగింది. మీదు మిక్కిలి తొత్తుక్రింద బడితొత్తు వీడు తన్ను ఇంత ధిక్కరించడమా అని అయన చాలా మండిపడ్డాడు. తప్పించుకొని పారిపోయిన చెల్లెలు, బావమఱదిమీది కోపం తక్షణం తీర్చు కోడానికి ఈ తుంటవెధవ చిక్కాడని ఆయనకు స్ఫురించింది. ఆయన బసవన్నతో 'ఓరీ కుంటీ! కొఱత నాటించి వీడిని శూలానికెక్కించు వెంటనే' అన్నాడు. బసవన్న: 'ప్రభువులు రాజభవనానికి విజయం చేయవచ్చు. నేను వీడిని ముగించివస్తాను' అన్నాడు.

. రాజు: 'నేను చెప్పినమాట నువ్వు ఎంత చక్కగా చేయిస్తావో చూసినట్లౌతుంది. ఇది మా ఎదుటనే జరగాలి' అన్నాడు.

ఆపైన జరిగినసంగతి వివరంగా వర్ణింపవలసిన పనిలేదు. పక్కనున్న చెట్టుకొమ్మ ఓటి కొట్టి, రెండుమూరలు ఎత్తుగావున్న ఒక కొఱతచేయించి దాన్ని మూడుదారులకు ఓప్రక్కగా పాతించి, బసవన్న కావలినాయకుని, అప్పంగొళ నౌకర్లనుపిలిచి చోమన్నను పట్టింపించి, శూలంమొనతో పొట్టనుచీల్చి గుండెల్లోకిపోయేటట్లు దానిమీద ఎక్కించాడు.

చోమన్న: 'కరింగాళి నాతల్లి నీదయ ఇల్లా వుంది. దొరనూ, దొరసానినీ కాపాడు తల్లీ. వాళ్ళ పసిపాపను కాపాడుకో' అని గసి మొన పొట్టను చీల్చేటప్పుడు అఱిచాడు. ఉత్తర క్షణంలో జీవం ఆ శరీరాన్ని వదిలిపెట్టింది. అతని నోటినుంచి, కండ్లలోంచి, ముక్కుల్లోంచి నెత్తురు ప్రవహించింది.

ఈపని జరుగుతూవుంటే, ఏవగించుకోనివాళ్ళు రాజు, బసవన్న వీళ్ళిద్దరే. చోమన్నను శూలానికెక్కించిన నౌఖరుకూడ ఎక్కించేటంతమట్టుకే కండ్లు తెఱచివుంచి అదైనవెంటనే కళ్లు మూసికొన్నాడు. శూలాన్ని ఎక్కివున్న ఆ శరీరాన్నిచూసి సహించడం వాళ్ల ఎవరివల్లా చేతకాలేదు.

రాజు. 'తొట్టి మంచం నీ ఎదురుగ్గా పెట్టించుకో కుంటీ' అని బసవన్నకుచెప్పి అతడు చేతికి తీసికొన్నమీదట తనగుర్రాన్ని ఊరివైపు త్రిప్పాడు. రెండడుగులు నడిపించి వెంటనే వెనక్కితిరిగి బసవన్నతో 'ఓరీ బసవా! ఈ నీ కొడుకుశవం మూడురోజులపాటు కొఱత మీదనే ఉండనీ. మనుషుల్ని కావలావుంచు. ఇతని కొవ్వుమాంసాలు గద్దలు పొడుచుకొని తిననీ. పందివెధవ శవం కుళ్లనీ' అన్నాడు.

బసవన్న. 'చిత్తంవోరా!' అన్నాడు. దొర గుర్రాన్నిత్రిప్పి తిరిగి ఊరివైపు నడిపించాడు.

అప్పంగొళనుంచి వచ్చివున్న మనుషుల్లో నలుగుర్ని అక్కడ కావలావుంచి బసవన్న కావలానాయకుని మిగతానౌకర్లతోపాటు రాజువెంబడి బైలుదేరాడు.

రాజూ ఆయనకుటుంబం పదిఅడుగులు పోయినతర్వాత సంపాజిగౌడ కుమారుడు చౌకీ గురికానికి 'ఇహనేం వెనక్కి తిరుగుదామా?' అని అడిగాడు.

గురికాడు: 'అట్లాగే' అన్నాడు.

'ఈతదెవరో దొంగ అనుకొని మనం పిలుచుకొనివచ్చాం. నిజానికి ఎటువంటి నిజాయితీవున్న మనిషి!'

'ఔను. నడత అంటే ఇదీ నడత. ఇంతకీ గౌడ కాదు, కొడగు కాదు.'

కొగ్గన్న, అతని పెండ్లాం ఈమాటలు వింటున్నారు.

కొగ్గన్న పెళ్ళానికి 'విన్నావా గౌడమాట?' అన్నాడు.

ఆమె 'అననీ పోనీ. నీకేం? నువ్వు కులంవాళ్లనడత విడిచెయ్యి. మనకున్నది నిజాయితీ ఒక్కటే అను' అంది.

వాళ్లందరూ అక్కడినుంచే తమఊరికి వెనక్కి వచ్చారు.

# 116

చాలారోజులు గుర్రం ఎక్కకుండా విడిచిపెట్టిన రాజు అప్పంగొళకు గుర్రంమీద ప్రయాణం చేయడం రాణికి కొంచెం చింతాకారణమైంది. కొంత పొద్దెక్కినతర్వాత ఆమె మేడమీది కిటికీలోంచి ఆయన వచ్చారేమోనని రెండు మూడుసార్లుచూసి, ఆయన వచ్చినజాడ లేక పోయేటప్పటికి ఆందోళనపడింది. చివరికి దూరంలో ఆయన రావడంచూసింది. అప్పుడు ఆమెకు సంతుష్టి కలిగింది.

రాణితోబాటు నిలబడివున్న రాజకుమారి తండ్రివెనక బసవన్న గుర్రంమీద తొట్టెఒకటి పెట్టుకొనివుండడం చూసింది. 'అమ్మాజీ! పసిపాపను తెచ్చినట్లు కనబడుతోంది' అంది.

ఇదెట్లా సాధ్యమో రాణికి తోచలేదు. చెన్నబసవయ్య దేవమ్మాజీ దొంగతనంగా పారి పోయారనేమాట వట్టిదేమో? పిల్ల వేరే ఎట్లా వుండిపోయింది? ఆమె 'అల్లుడుగారు వెన కాల కనబడుతున్నారా?' అని అడిగింది.

'లేదు, అమ్మాజీ.'

అయితే దీని అర్థం? అక్కడ ఏదో మాటనడిచి తల్లిదండ్రులు తప్పించుకొని పోకుండా వుండేటట్లు రాజు బిడ్డను బలాత్కారంగా తెచ్చివుంటాడు. ఇప్పుడు ఏమిటి చేయడం? గ్రహాలబలమే ఎక్కువైనట్లుంది. దేవుడు సాయపడడో?'

రాజు భవనానికి వచ్చేటప్పటికి, రాణి చాలా వ్యాకులమనస్సుతో ఎదురేగింది. పసిపాప వచ్చిందనే సంబరంతో రాజకుమారి తల్లివెనకాలే తొందరతొందరగావెళ్ళి ఆమెకంటెకూడా ముందుగాపోయి, 'అప్పాజీ! బిడ్డను తెచ్చారా?' అని రాజును మాటలాడించి, ముందుకు పరు గెత్తి ఆతురతతో బసవన్నదగ్గిరకుచేరి ఉయ్యాల మంచంఎదుట నిలబడింది.

వెనకటినౌకరు ఒకడు బసవన్నప్రక్కకు పరుగెత్తివచ్చాడు. బసవన్న 'తొట్టె మంచం దింపుకో' అని అతనికిచెప్పి, అది అతను తీసికొన్నతర్వాత తాను గుర్రంనుంచి దిగాడు.

రాజకుమారి నౌకరుచేత తొట్టె పట్టించుకొని క్రిందికి దింపేటట్లుచేసి బిడ్డను ఎత్తుకొని ముద్దాడింది. 'అమ్మాజీ! మన బాబు' అని చెప్పి నౌకరుకు 'మంచం లోపలికి తే' అని చెప్పింది.

కూతురు పడుతూవున్న ఈ సంబరం రాజుకు విసుగనిపించింది. ఆయన మొగం చిట్లించి, 'పో తల్లీ! నువ్వు లోపలికి పో. మంచం లోపలికి రావడానికి వీల్లేదు' అని ఆ పిల్లను గదమాయించి బసవన్నతో 'ఓరీ కుంటీ! ఈ బిడ్డను అవ్వేరవాడకు పంపించు. చూసుకోమని పెద్దతొడలదానికి చెప్పు' అన్నాడు.

బసవన్న: 'చిత్తం దొరా!' రాజు: 'బిడ్డను ఎవరైనా దొంగిలిస్తారేమో జాగ్రత్త. దొంగ తనంగా పారిపోయిన ముండాకొడుకులు తిరిగివచ్చి మన కాళ్లమీదపడాలి. తర్వాతనే బిడ్డను వాళ్లకిచ్చేది. అంతదాకా ఎవరూ బిడ్డదగ్గిర చుట్టూ తిరుగాడుతూ వుండకూడదు. తల తెగేస్తాం, తల-వరికెయ్యడమే జాగ్రత్త' అన్నాడు.

బసవన్న: 'చిత్తం ప్రభూ!' అన్నాడు.

రాణి బసవన్నతో 'చెల్లెలిగారి బిడ్డ కాదూ?' అంది.

'ఔనమ్మా.'

'వాళ్లూ, అల్లుడుగారూ వెళ్ళిపోయారా?'

'కావచ్చునమ్మా.'

'వాళ్ళు విడిచిపోయారని మనమూ విడిచిపెట్టడం ఎక్కడైనా వుందప్పా. తొట్టె మంచం లోపలికి తెప్పించు.'

రాజు కిది సమ్మతం కాలేదు. అయితే అతడు తెలిసికొన్నాడు. 'రాణి ఈవిధంగా వేరే మాటలు మాటాడేటప్పటికి ఆమెమాటే నడవాలి. ఈయన కోపంతో నాలుగు చెడ్డమాట లని వుంటాడు. అంతే' నని.

రాజు: 'బిడ్డను విడిచిపోయారా పాపం అత్తను సాకనీ అని. ఏం మాట, ఎంచక్కనీ మాటే! వీళ్ల చుట్టరికం! వీళ్ల ప్రేమ! వీళ్ల వావి! వీళ్ల వరుస! ఎంతని చెప్పాలి!' అన్నాడు వెటకారంగా.

రాణి: 'ఏదైనా మన అదృష్టంకొద్దీ వుంటుంది అంతే - మనం వాళ్ళకు ఏం లోపం చేశామని? అయినా వాళ్ళకు తెలిసిందిలేదు' అంది.

రాజు: 'నీకు తెలుసుగా. నువ్వు నేర్పిపెట్టు' అని బిగ్గరగా అఱచి తన శయ్యాగారానికి పోయాడు.

రాణి చెప్పినమాటకు రాజు సమ్మతించేతీరు ఇంతక్కగావుంటుందని తెలిసిన బసవన్న నౌఖరుకు మంచం అంతఃపురంలోకి పట్టు అనిచెప్పాడు. రాణి, రాజకుమారి దాన్ని పట్టించు కొని లోపలికి పోయారు.

అలోపల రాజు 'ఓరీ కుంటీ!' అని కేకవేసాడు. బసవన్న ఆయనదగ్గిరకు పరుగెత్తి వెళ్ళాడు.

రాజు: 'చూడూ! ఆ దొడ్డవ్వకు ఏం మాట చెప్పమన్నానో అదేమాట మీ అమ్మాణికి కూడా గట్టిగా చెప్పు. బిడ్డ బందీగావున్నాడని తెలియాలి. ఎవరూ దగ్గిర తిరుగుతూవుండ కూడదు. దొడ్డవ్వ కుడిపించేపాలు ఈమెకూడా కుడిపించవచ్చు. గుడ్డలు తొడగనీ, సాకనీ. మేం అడిగినప్పుడు తెచ్చి అప్పగించాలి. అట్లాగే అంటే బిడ్డను ఇక్కడ వుంచు. లేకపోతే బిడ్డను ఇప్పుడే బైటికి తీసుకురా' అన్నాడు.

రాణీసమక్షంలోవున్న రాజు తాను హఠంపట్టి గెల్వలేదు. అయితే చాటున మొండిపట్టు పట్టడం చేతౌను. సేవకునిద్వారా దాన్ని సాధించగలదు. రాజునాజ్ఞ చెల్లించకుండా బసవన్న వెనుదిరిగి పోయేదిలేదు. రాజు నమ్మకానికి పునాదిరాయి ఇది.

బసవన్న: 'చిత్తం మహాప్రభూ!' అన్నాడు. రాణీవాసానికివచ్చి రాజు చెప్పినమాట రాణీగారికి విన్నవించాడు.

ఆ సమయానికి రాజకుమారి బిడ్డను మంచంమీద పడుకోపెట్టి తాను నేలమీద మోకరిల్లి కూచుని బిడ్డను ఆడిస్తూవుంది. పిల్లడు ఇంకా పసికందు. అయినా ఈ ముఖం తన్ను ప్రేమి స్తున్నముఖమని గుర్తించి ఆమెను సంతోషంతో చూస్తూవున్నాడు.

రాణి బసవన్నతో 'అల్లుణ్ణి రాజుగారు చూపించడం న్యాయం. రాజుగారిమూలాన నా చుట్టరికం; నౌఖర్లు, చాకర్లూ చూడటం మంచిదికాదు. రాచయింటిబిడ్డ రాజగృహంలోనే పెర గాలి అంటున్నాం. అంతే' అంది.

బసవన్న: 'మంచిదమ్మా' అన్నాడు. రాజుదగ్గిరకుపోవడానికి తిరిగి ఆయన రెండు అడుగులు పెట్టేలోపల రాణి: 'ఏమిటైం దేమిట బసవన్నా! బిడ్డను వదిలిపెట్టి వాళ్లు వెళ్ళి పోయారా?' అని అడిగింది. కొగ్గన్న, కొగ్గన్న పెండ్లాం, గురికాడు, అందరూ చెప్పిన మాటలను, బసవన్న సంగ్రహంగా రాణికి విన్నవించాడు. కూడా చోమన్న అదేమో మోసం చేసి బిడ్డను వెనక్కు ఉంచేసివుంటాడు. అయితే అతనికి దక్కలేదు అన్న తనఊహను వెలిబుచ్చాడు.

ఈకథ విని రాణి అసలుసంగతి ఏమైఉంటుందా అని తన ఊహ సారించింది. చోమన్న తన యజమానికి, యజమానురాలికి ద్రోహం తలచేవాడుకాడు. పిల్లడు, మోసే వానికి తెలియకుండా పల్లంలో జారి కిందపడిపోయివుంటాడు. కొంచెందూరం వెళ్ళి తొట్టి మంచంలో పిల్లడు లేకపోవడంచూసి, బిడ్డను వెదకికొనిరావడానికి చోమన్న వెనక్కు వచ్చి వుంటాడు. అని తనలోతాను నిర్ధారణ చేసికొంది. 'ఆ చోమన్న ఏమన్నాడు?' అంది.

'దొర, దొరసాని దొంగతనంగా పారిపోయారు అనేమాటనే చెప్పలా అమ్మాజీ! బిడ్డ వాళ్ళదేనా అంటే ఔను అని చెప్పలేదు. ప్రభువుగారికి మా చెడ్డకోపం తెప్పించాడు.'

'ఎక్కడ వాడు?'

'మహాకోపంవచ్చి ప్రభువులు వాణ్ణి అక్కడకక్కడే శూలాని కెక్కించేసారు అమ్మాజీ!'

'చోమన్న?'

'అవును, అమ్మాజీ.'

'అక్కడే. శూలానికే?'

'అమ్మాజీ! ఔనమ్మా!'

రాణీ అయ్యో అని విచారించింది. గ్రహబలమే బలంగావుంది అని తోచి మనస్సులో కలవరపడి, 'ఓ ప్రాణం బలి అయిపోయింది. ఇంకా ఎవీ పోకుండా కులదైవం కాపాడు గాక' అని ప్రార్థించుకొని కూతురితోబాటు ఆడుకొంటూవున్న పసికందువైపు తిరిగింది. బసవన్న రాజుగారి విశ్రాంతికక్ష్యకు వెళ్ళాడు.

# 117

పసిపాపను వెదకడంకోసం చోమన్నను సంపాజివైపు పంపించి చెన్నబసవయ్య భార్యతో పాటు యథాసమయంలో సుళ్య చేరుకొన్నాడు. ఇంతప్రయాణం ముగిసేవేళకు దేవమ్మాజి సొమ్మసిలిపోయింది. అప్పంగొళనుండి రాత్రికిరాత్రి బైలుదేరి నిద్రలేకుండా ప్రయాణంచేసిన అలసటతోబాటు బిడ్డను పోగొట్టుకొన్న దుఃఖం ఒకటి అనుకోకుండాక్రమ్మి ఆ బిడ్డను కుంగ దీసేసింది. ఈకారణంచేతనూ బిడ్డ చోమన్నకు చిక్కితే వాడు తమతో జేరడానికి అను కూలంగావుండాలని చెన్నబసవయ్య ఆరోజు సాయంకాలందాకా సుళ్యలోనే నిలిచేటట్లు నిశ్చయించాడు.

ఊరిగౌడ ఇల్లు ఎక్కడ అని విచారించి అతన్ని కలుసుకొని రహస్యంగా తన పరి చయం కలిగించి చెన్నబసవయ్య దిగడానికి స్థలం ఏర్పాటుచేసికొన్నాడు. చోమన్నవస్తే అతన్ని పిలవడానికి కొంచెంసేపు ఉగ్గి, తుక్ర దారిలోనిలబడి ఎదురుచూస్తూ వుండేటట్లుగా చెప్పాడు.

చాలా పొద్దుఎక్కినా చోమన్న రాలేదు. కాని సంపాజినుండి వాడుకప్రకారం వచ్చిన ఎద్దుల వ్యాపారస్థులు ఓ వార్త తెచ్చారు. అది వాళ్లచెవుల్లోనూ పడింది. ఉదయం సంపాజి పొలిమేరలో దారిప్రక్కన పొదలో కొగ్గన్న పెళ్ళానికి ఓ బిడ్డ దొరికిందని ఆమె, కొగ్గన్న ఇద్దరూ ఆ పాపను గౌడనదగ్గిరకు తెచ్చారు. ఆవేళకు సరిగా చౌకీ గురికానికి అప్పంగొళ నౌకరు ఒక్కడు దొరికాడు. బిడ్డ అప్పంగొళకు చెందివుండవచ్చు, అతడు ఆబిడ్డను కాజేసి తెచ్చివుండవచ్చునని గౌడ, గురికాడు, అతన్నీ, బిడ్డనూ, అప్పంగొళకు పంపించేశారు అని ఆ వార్త.

సుళ్యలోనిప్రజలు వార్తను తమలోతాము మరిమరీ చెప్పుకోడం ఆరంభించారు. సమా చారం కొంచెం విచిత్రమైంది. అందుకని ఆవార్త పదేపదే చర్చించుకోవడం కొంత ఉత్సు కతగా వుంది. ఇది ఏమిటి అని చెన్నబసవయ్య సహజంగానే విచారించాడు. వివరాలు తెలుసుకున్నాడు.

బిడ్డ తమది, అప్పంగొళ నౌకరు ఎవరోకాదు చోమన్న. సంపాజిగౌడ, గురికాడు వీళ్లతోబాటు అప్పంగొళకు పోయినబిడ్డ, రాజుగారి కావలాజనంచేతిలో పడివుండొచ్చు. తాము తప్పించుకొని పారిపోయి వచ్చినసంగతి ఈపాటికి పొక్కేవుంటుంది. కావలావాళ్ళు బిడ్డనీ, చోమన్ననూ, మడకేరికి తీసుకపోయివుంటారు, రాజుకు అప్పగించివుంటారు. రాజు బిడ్డనీ, చోమన్ననూ చంపించకుండా విడిచిపెట్టుతాడా? ఎందుకు విడిచేస్తాడు?

ఇటువంటి ఆలోచనలతో చెన్నబసవయ్య తనలో తాను తందరదిందరలాడడం మొదలు పెట్టాడు. సంగతి దేవమ్మాజికి చెప్పడమా, చెప్పకుండా వుండడమా అని మథనపడ్డాడు. పరిపరివిధాలుగా ఊహాపోహలుచేసి సంగతులన్నీ ఆమెకు చెప్పితీరాలని, ఇహముందుకూడా ఏపనిచేసినా ఆమెకు చెప్పే చేస్తూవుండాలని, ఏ అడుగువేసినా ఆవిడను ఆలోచించే వేయా లని నిశ్చయించుకొన్నాడు. తనకు చేరిన సమాచారం అంతా దేవమ్మాజికి చేరేశాడు.

ఉదయం అయ్యేటప్పటికి బిడ్డ లేదని చూసినతోడనే దేవమ్మాజికి పాపనుగూర్చిన ఆశ అడుగంటిపోయింది. ఎక్కడో మినుకుమినుకులాడుతూ వుంది. సాంతంపోకుండా మిగిలి వున్న కొద్దిఆశ ఈ వార్తమూలాన వట్టి అడియాస అయిపోయింది. ఈగతికి రప్పించడాని కేనా? దేవుడు చెఱయందున్న తనదగ్గిరకు తన పెనిమిటినిరప్పించి ఈ బిడ్డను ప్రసాదించింది? లోకంలో ఇదెంత అన్యాయం, ఇదెంత పాతకం! ఈ చేదువిషాన్ని పొట్టనిండామెక్కి బాధ పడటానికి తనలాంటి జీవు లెన్నికోట్లు? లేదు. తనలాంటిజీవులు ఎంతోమంది లేరు. ఇటువంటి సహించడానికి వీలులేనిదుఃఖం, కోటిలో తనలాంటివాళ్ళకు ఏ ఒక్కరికో వస్తుంది. నా పూర్వ కర్మ నన్ను పట్టి పాలారుస్తోంది అని ఆమె అసహ్యవేదనకుతోడుగా తన ఊహాదైన్యం కలిపి తనదుఃఖాన్ని మరింత దుర్భరంచేసికొంది. ఆ దుఃఖతీవ్రతవల్ల చిక్క శల్యావశిష్ట మైంది.

పిల్లవానివిషయం చోమన్నగతి ఏమైందో తెలుసుకోవడానికి ఏమిచేద్దాం అని చెన్న బసవయ్య చింతించాడు. దేనికైనా మంగుళూరునుచేరి అక్కడి ఆంగ్లాధికారినికలిసి అతని సహాయం పొందడం మంచిది. భార్య వెంటనే ప్రయాణంచేసేస్థితిలో లేదు. మరుసటిరోజు బైలుదేరడం సాధ్యంకావచ్చు. గుఱ్ఱంమీదపోవడం కష్టం అనుకుంటే దేవమ్మాజిని ఒక మేనాలో కూచోబెట్టి పోవలసివుంటుంది. మంగుళూరికిపోయి ఎవరినన్నా మడకేరికి పంపించి పిల్లవాన్నిగురించినవార్తను తెప్పించుకోవాల్సివుంటుంది.

కాని పిల్లవాణ్ణిగురించిన వార్తకై ఇంతసన్నాహం చేయవలసిన అవసరంలేదు. దేవమ్మాజికి ఆరోజు జ్వరం రానేవచ్చింది. ఆమె పుళ్ళ వదిలేసి మేనాలో ప్రయాణంచేసే స్థితిలోకూడ లేదు. చెన్నబసవయ్య ఆమెపక్కపై ప్రక్కగా కూర్చునివుండాల్సి వచ్చింది.

గౌడ చేసినసాయంతో భార్యకు పథ్యం పానం నడిపించి ఆయన రెండోరోజుకూడా పుళ్ళలోనే గడిపాడు.

సంపాజిగౌడ, కుమారుడు, చౌకీ గురికాడు, కొగ్గ, కొగ్గన్న పెండ్లాం సాయంకాల మధ్యాహ్నానికి ఊరుచేరి జరిగినసంగతిఅంతా వదిమందితోనూ చెప్పారు. మరుసటిరోజు వచ్చిన వ్యాపారస్థులమూలంగాకూడా ఈవార్త సుళ్య చేరింది. చెన్నబసవయ్య చెవిలో పడింది. బిడ్డ రాజుచేతికి చిక్కింది, చోమన్న ఆయనకోపానికి మొదటిబలి అయ్యాడు. దొరనుంచి తప్పించుకోవడానికి అతడు చేసినప్రయత్నం విపరీతఫలితాలు ఇచ్చివుండొచ్చునని చెన్నబసవయ్య గ్రహించాడు. ఈ సమాచారం వెంటనే దేవమ్మాజికి చెప్పలేదు. రెండు రోజులు గడచినతర్వాత చెప్పుదామని నిర్ణయించుకొన్నాడు.

మరుసటిరోజు దేవమ్మాజి జ్వరంపోయి కొంచెం నయంగావుంది. చెన్నబసవయ్య సుళ్య గౌడనుంచి అవసరమైనసహాయాన్నిపొంది మంగుళూరుకై ప్రయాణం సాగించాడు. పుత్తూరులోనిలిచి మరుదినం సంధ్యాకాలానికి మంగుళూరు చేరాడు. తాను మంగుళూరికి వచ్చివున్నసంగతిన్నీ, కలెక్టరును చూడాలని అపేక్షిస్తున్న విషయమూ తెలిపి ఆ అధికారికి ఓ ఉత్తరం పంపించాడు.

# 118

అతని ఉత్తరంచూసి,కలెక్టరుకు చాలా ఆశ్చర్యంవేసింది. ఆయన చెన్నబసవయ్యను వెంటనే పిలిపించాడు. ఆయనమూలకంగా అన్నివిషయాలు గ్రహించాడు. తనకు పెద్దలైన కుంపిణీ అధికారులకోరిక నెరవేరడానికి ఇంతశీఘ్రంగా అవకాశం దొరికింది అని అతనిసంతోషం. ఆయన చెన్నబసవయ్యకు 'అప్పంగొళలో వుండటం అపాయకరం అని తెలిసినవెంటనే మీరు ఇక్కడకు రావడం మంచిపనైంది. మీమధ్య మీ బావమఅదిగారిమధ్య ఉన్న మనస్తాపాన్ని చాలా సంతోషంగా పోగొట్టుతారు. తమరు చింతింపకండి. పిల్లవాణ్ణి బెంగుళూరికి పంపించివెయ్యాలి అని మేము వెంటనే రాజుగారికి ఉత్తరం పంపిస్తాం. తమరు బెంగుళూరికి పోయి బిడ్డకై అక్కడ ఎదురుచూడండి' అని చెప్పాడు. చెన్నబసవయ్య, దేవమ్మాజి, నౌకర్లు ఓరోజు మంగుళూరులో వుండటానికివీలుగా ఏర్పాటుచేసి మర్యాదలు జరిపించాడు. వీరరాజుకు ఓ పత్రం, మద్రాసు గవర్నరుకు ఓ ఉత్తరం, బెంగుళూరు చీఫ్ కమిషనరుపేర మరో ఉత్తరం వ్రాసి పంపించాడు. మూడోరోజు చెన్నబసవయ్య, దేవమ్మాజీలను తగిన బందోబస్తుతో బెంగుళూరుకు పంపించివేశాడు.

ఆయన వ్రాసిన ఉత్తరాలసారాంశం ఈవిధంగా ఉంది.

'కొడగుప్రభువులు, కుంపిణీ సర్కారువారి అభిమానమిత్రులు శ్రీ చిక్క వీరరాజేంద్ర ఒడయరు ప్రభువులసమక్షంలో మంగుళూరులోవున్న కుంపిణీ కలెక్టరుచేసిన ఆదరపూర్వక మైన విజ్ఞాపన:

'వారంరోజులక్రిందట మేము తమ ప్రత్యక్షసన్నిధిలోఉండి తమనుంచి పొందిన ఆదర పూర్ణమైన ఆతిథ్యాన్ని అనవరతం స్మరిస్తూనేవున్నాం. ఆవిషయంలో మా ప్రముఖులైన రెసిడెంటు మహాశయులు ఈపాటికి తమకు మా అందరిపక్షాన కృతజ్ఞతాపూర్వకవందనాలు సమర్పించివుంటారని నమ్ముతాం. అయినా నా వ్యక్తిగతవందనాలు ఈ ఉత్తరంద్వారా సమ ర్పించడానికి తమ ఆజ్ఞ వుండాలని వేడుతున్నాను.

'ఈ సందర్భంలో నేను ఓ సంగతిని తమ గమనానికి తేవాలని కుతూహలపడుతున్నాను. అది నాకు తెలిసిందే ఓ రెండుగడియలక్రితం. అది చాలా ముఖ్యమైనసంగతి కాబట్టి కొంచెం కూడా ఆలస్యంచేయకుండా ఈ ఉత్తరాన్ని వ్రాస్తూవున్నాను.

'తమసోదరి దేవమ్మాజీగారు, ఆమెగారి పతి శ్రీయుతులు చెన్నబసవయ్యగారు, ఈరోజు ఇక్కడకు వచ్చేరారు. శ్రీ చెన్నబసవయ్యగారు మమ్మల్నిచూసి ఇప్పుడే తమవసతికి వెనక్కు వెళ్ళారు. వారూ తమ చెల్లెలుగారూ రేపు ఇక్కడవుండి, ఎల్లుండి బెంగుళూరికి ప్రయాణం సాగిస్తారు.

'శ్రీయుతులు తమ అల్లుడుగారు మాకు చెప్పిందానివల్ల మూడురోజులక్రిందట వారు ఈ ఊరికిగా ప్రయాణంచేసి వస్తూవుండగా రాత్రి వాళ్ళబిడ్డ, తమ మేనల్లుడు దారిలో తొట్టె మంచంలోంచి జారి పొదలో పడిపోయినాడని, ఆబిడ్డ మరుసటిరోజు సంపాజిగౌడచేతికి దొరి కాడని, అక్కడినుంచి సురక్షితంగా తమ రాజభవనానికి పంపబడి, ప్రస్తుతం తమ భవనం లోనే ఉన్నాడని తెలియవచ్చింది. బిడ్డవిషయంలో గందరగోళం పడుతూవున్న తల్లిదండ్రు లకూ, అది జారిపడిందని విన్నప్పుడు, బాధపడ్డ మాకూ కూడ, ఆ పాప తమ ఆశ్రయంలో క్షేమంగా వుందనేసంగతి తెలుసుకొని మనస్సుకు సమాధానం ఏర్పడ్డది.

'బిడ్డ శీఘ్రంగా తమచేతికి రావాలని తమసోదరిగారు వాంఛిస్తున్నారు. తమకు మేనల్లుడి మీద చాల ప్రేమభావం వుంటుందనీ, బిడ్డ మడకేరిలోనేవుంటేమాత్రం తప్పేమిటని తాము అనుకోవచ్చుననీ, నాకు తెలుసు. అయినా పాపనుబట్టి, తల్లినిబట్టి, పాప వీలైనంతశీఘ్రంగా తల్లినిచేరడం వాంఛనీయం. ఇది తమకైనా తోచేవిషయమే. అందుచేత తాము ఈ ఉత్త రాన్ని అవలోకించినతర్వాత పాపను బెంగుళూరికి పంపించవలసింది అని తల్లిదండ్రులపక్షాన ప్రార్థిస్తున్నాను. వాళ్లు బెంగుళూరులో శ్రీమాన్ రెసిడెంటుగారి అతిథులుగా వుంటారు. బిడ్డను తీసుకొనిపోయేవాళ్లు రెసిడెంటుగారినిచూస్తే పనులన్నీ సులభంగా నెరవేరుతాయి.

ఈ ఉత్తరానికి జవాబుగా ఏసంగతీ, ఆజ్ఞాపించవలసిందిగా వేడుతున్నాను. ఆదరాను గ్రహాలు చూపవలసిందిగా మరిమరీ ప్రార్థన.

ఇట్లు తమ
వినమ్రసేవకుడు.

బెంగుళూరికి రెసిడెంటుమహాశయునికి వ్రాసిన ఉత్తరం: 'ప్రియమహోదయులకు, ఈ పత్రం తమ స్వంత అవగాహనకై వ్రాస్తూవున్నాను. ప్రస్తుతం విషయం చాలా రహస్యంగా వుందాలి.

'మనం మడకేరిలోవున్నప్పుడు చివరిరోజు వేసిననాటకంలో జరిగిన గందరగోళం తమకు జ్ఞాపకం వుండివుండొచ్చు. రాజుగారు అందుమూలంగా తమకైన అవమానం రాజ కుటుంబం అల్లుడైన చెన్నబసవయ్య బుద్ధిపూర్వకంగా చేయించారు అని ఊహచేసి అల్లుడు గారిని నిర్బంధంలో పెట్టివుంచారు. అయన అక్కడినుంచి తప్పించుకొని, భార్య పిల్లవాడితో సహా ఇక్కడకుపారిపోయి వద్దామనుకున్నారు. 'వచ్చేటప్పుడు దారిలో పసిపాప జారిపోయాడు. వీళ్ళిద్దరే ఇక్కడికి చేరారు. బిడ్డ వేరేవాళ్ళచేతికి దొరకి, రాజభవనం చేరాడు. ప్రస్తుతం మడకేరిలో రాజుగారి అధీనంలో వున్నాడు.

'చెన్నబసవయ్య బైలుదేరింది బెంగుళూరికని. దగ్గిరనున్న పొలిమేర ఉదయం కాక మునుపే దాటడం మంచిదని ఇటువైపుకు వచ్చారు. రేపు ఇక్కడవుండి ఎల్లుండి బెంగు ళూరికి ప్రయాణంచేస్తారు. దీన్ని నేనే ఏర్పాటు చేస్తున్నాను.'

'పాపను బెంగుళూరికి పంపించివేయండి, రెసిడెంటుమహాశయులు పాపను, తల్లి దండ్రు లకు అప్పగిస్తారు అని రాజుగారికి ఉత్తరం వ్రాసివున్నాను. ఈ ఉత్తరం చేరగానే సామూ వీరరాజుగారికి ఇదే అర్థం వచ్చేటట్లు ఓ ఉత్తరం వ్రాయించండి.

'రాజుగారు పాపను పంపిస్తారని మనం ఎదురుచూడనక్కర్లేదు. మీరైనా ఆవిషయమై ప్రతీక్షించనక్కరలేదు. వారిస్వభావం నేను ఎరిగేవున్నాను. విజానికి వారు మనమాటను నిరాక రిస్తారు; పాపను పంపించరు, సరిగదా చెల్లెలు, చెల్లెలి పెనిమిటి మడకేరికి రావాలి-అని పట్టు పట్టుతారు.'

'వీళ్ళకేమో ప్రాణభయం. వీళ్లు పోవడానికి ఒప్పుకోరు. ఆపైన ఏం జరుగుతుందో చెప్పడానికి లేదు. అయితే దాన్నిగురించి నేను ఆలోచించడంలేదు. అది దక్షములైన తమ హస్తాల్లో వుంది. ఆపైన తమరు సరిగానే నడిపిస్తారు.

'విషయాలన్నీ వివరించి మదరాసు గవర్నరు మహాశయులకుకూడ ఓ ఉత్తరం ఈ క్షణమే వ్రాసి పంపిస్తున్నా.

ఇట్లు తమ విశ్వాసి.'

మదరాసు గవర్నరుకు వ్రాసిన ఉత్తరం: మాన్యశ్రీ గవర్నరు మహోదయులవన్నిరివి విన్నవించేది.

'కొడగు రాజాగారి చెల్లెలు, ఆమె భర్త ఇక్కడకు వచ్చినసంగతి, ఆ సందర్భంలో నేను సంక్షేపంగా మైసూరు రెసిడెంటుమహాశయులకు వ్రాసిన ఉత్తరానికి నకలు ప్రతి ఒకటి ఈ ఉత్తరంతోబాటు జతపఱచి పంపిస్తున్నాను. దాన్ని తాము పరిశీలించాలని ప్రార్థిస్తున్నాను.

'రాజాగారు సంతోషజనకంగా, సమాధానానికివచ్చి నడచుకొంటారని నాకు తోచదు. బహుశః చాలా అనుచితంగానే ప్రవర్తిస్తారనుకొంటాను. అట్లా అయ్యేపక్షంలో వారిమీద తగినచర్యలు తీసుకోవాల్సివుంటుంది. ఈ సందర్భంలో అన్నివిషయాలు బెంగుళూరికి తెలియ జేసి దేనికైనా సిద్ధంగావుండే ఏర్పాట్లుచేయడం క్షేమం. ఏం చేయాల్సివుంటుందో తమకు నాకంటే బాగానేతెలుసు. అయినా నాకు తోచిందాన్ని విన్నవించడం కర్తవ్యమనితోచి ఈ పంక్తులు వ్రాయడానికి సాహసించాను. క్షమించాలని ప్రార్థన.

'ఈ సంగతులన్నీ ప్రస్తుతానికి ముఖ్యాధికారులలోనే గుప్తంగా వుండిపోవాలని నేను రెసిడెంటు మహాశయులకు నివేదించివున్నాను. ఇట్లు,

తమ విశ్వాసి....'

# 119

అల్లుణ్ణి రాణి అధీనంలోవిడిచి తన విశ్రాంతికక్ష్యకువచ్చి వీరరాజు తన్ను మోసగించి తప్పించు కొని పారిపోయిన చెల్లెలు, ఆమె పెనిమిటి వెంటనే వెనక్కు తిరిగివస్తే సరేసరి, రాకుండా వుంటే వాళ్ళ యీ పసిపాపను చంపించిపారేయాలి అని నిశ్చయించుకొన్నాడు.

ఏసమయానికి ఎట్లాతోస్తే అట్లాచేసి, చేయదలచుకున్నదానికి ఆలస్యమంటూ ఎరగ కుండా పెరిగి, వీరరాజు విశృంఖలంగా విహరిస్తూ వస్తూఉన్నజీవి. సావధానపఱిచే ధ్వని అంటూ వినక, ఆయన నిరంకుశప్రవృత్తి మేనల్లునిక్రౌర్యంగా రూపుదాల్చింది. ఆయన కడు పునపుట్టిన ఆ ఒక్కబిడ్డ ప్రాణాలు తప్పిస్తే, వేరే ఏ జీవాన్నిఅయినాసరే బలిగొనడానికి ఆయన చేయిగాని మనస్సుగాని వెనకాడేది లేదు. చెల్లెలికి, అల్లుడికి, వెంటనే వెనక్కు తిరిగిరండి అని, రాకుండా అక్కడే వుండిపోతే మీ పసిపాప మీకు దక్కదని కబురు పంపించాలి. ఈవిధంగా కబురు పెట్టాలంటే ఇంతకీ వాళ్ళు వుండేచోటు తెలియాలి. వాళ్ళు మంగుళూరులో వుంటారో లేకపోతే అక్కడినుంచి చుట్టుతిరిగి పంజనగూడుకు పోతారో ?

బసవన్న దగ్గిరకువచ్చాక రాజు వాడితో 'ఈ ముండాకొడుకు మంగళూరికి వెళ్తాడను కుంటాను ఏమంటావ్?' అని అడిగాడు.

'చిత్తం ప్రభూ! వేరే ఎక్కడికన్నా వెళ్ళినా అక్కడికి వెళ్ళేవెళ్తా రనిపిస్తుంది.'

'నంజనగూడుకు పోతారంటావా?'

'నంజనగూడుకు ఎందుకు ప్రభూ! అది వట్టి బూటకంమాట.'

'దేవుని చూడటానికని.'

'అదే బూటకం అంటే. ప్రభూ! మనల్ని ఏమర్చడానికి నంజనగూడు, నంజనగూడు అంటారు. మనస్సులో వేరే ఊహలుంటాయి.'

'చూడప్పా! నీకొడుకు మోసం. పైకోటి లోపలోటి!'

'అంతకాక ఏమిటి ప్రభూ! అందరూ అంతే! తమకేంకావాలో అది చూసుకొంటారు. ఇంకోరికి కావాలిసింది వాళ్ళకెందుకు?'

'మొత్తంమీద, ఈ రాజభవనం తిండి తిన్నవాళ్లు మంచివాళ్ళుగా వుండరు కుంటీ!'

'నిజం ప్రభూ!'

'సరే! ఇప్పుడు ఎవరినైనా మంగుళూరికి పంపించి విళ్లు ఎటుపోయారు అని తెలిసికొని వచ్చేటట్లు చేయి.'

'చిత్తం దొరా!'

అని సెలవుదీసికొని బసవన్న వేరేపనిమీద వెళ్లిపోయాడు. ఆదినం రాత్రి మంగుళూరికి వెళ్ళే ఎద్దులతోదాటు ఇద్దరు తనసేవకులు వెళ్ళేటట్లు ఏర్పాటుచేశాడు. నౌఖరు మంగుళూరికి పోయి సంగతి తెలుసుకొనిరావడానికి ఎంతలేదన్నా ఓ వారం పట్టుతుంది. కాని అంతలోపల వాళ్లకు కలెక్టరు ఉత్తరంద్వారా వాళ్లు కోరినవార్తలు తమంతటతామే తెలిశాయి.

కలెక్టరు ఉత్తరంచూసి వీరరాజు అగ్గిబుగ్గయిపోయాడు. భగభగమని మండిపడ్డాడు. అగ్గిరాముడైపోయాడు. 'బిడ్డను పంపుతాం ఈ వ్యభిచారం ముండాకొడుకులకు! వాళ్లు చెప్పి నట్లుగా వీడు మనకు ఉత్తరం వ్రాయిస్తాడా? ఈ తెల్లలంజకొడుకు, వీడి పెక్కు చూశావా? నలుగురుమనుషుల్ని పంపించు, ఈ బొల్లిముండావాణ్ణి పట్టుకొని తీసుకొనిరానీ. గుర్రంమీద బైల్దేరితే క్రిందికిలాగి పడేసి, వెనక్కు రెక్కలు విఱిచికట్టి, చావబాది తెచ్చి ఇక్కడ ఎదుట పారెయ్యి. ఎడంకాలితో మూతిమీద తంతాను.'

ఒక వారంరోజులు మన అన్నం తెగతిని మనకే ఈ అపచారం!'

బసవన్న వెంటనే జవాదివ్వలేదు. మంగుళూరు కలెక్టరుతో పోటీపడి వీరరాజు సాధించే మేలేమీ లేదని అతనికి తెలుసు. కలెక్టరు ఉత్తరం చదువుతూవుండగానే, బసవన్న అతనికి జవాబుగా వ్రాయించాల్సిన ఉత్తరం రూపురేఖలు మనస్సులో దిద్దుకొంటూపోయాడు. తన

దొర కోపగించుకొనేది సహజమే. కోపంమంటలు తగ్గినతర్వాత తాను ఉత్తరం ఎట్లా వుండాల్సింది సూచించవచ్చులే, తొందరలేదు.

వీరరాజు చాలాసేపు కేకలుపెట్టి, అణిచి మధ్యలో తాపోశమనానికై రెండుసార్లు మద్యం సేవించాడు. బసవన్న దగ్గిరనిలబడి 'అల్లుడుగారు రాజకుటుంబమర్యాదను తప్పి నడిచి పారిపోయారు. ప్రభువుల చెల్లెలిగారిని బలవంతంగా పిల్చుకొనిపోయారు. పారిపోయే తొందరలో బిడ్డ ఏమైపోయారు అనేస్పృహ వాళ్ళకు వంటిమీద లేకుండాపోయింది. ఈశ్వరుడు గొప్పవాడు. ఆ పాప మాకు చిక్కింది. పాపను అజాగ్రత్తయిన తండ్రికి అప్ప గించడం మాదే తప్పు. బిడను సాకాలి అనేకోరిక వాళ్ళకుంటే, వాళ్ళు ఏమాత్రం ఆలస్యం చేయకుండా వెనక్కు వచ్చేయాలి. రాజభవనంలో మా ఆధీనంలోవుంటూ బిడ్డను పెంచాలి. మీరు మాతోబాటు వారంరోజులక్రింద వచ్చివున్నారు. మా విందు లారగించారు. మా విష యంలో మీరు ఋజువుగా ప్రవర్తించాలి. మా చెల్లెలూ, అల్లుడూ వాళ్ళను బెంగుళూరుకు వెళ్ళనియ్యవద్దు. ఇక్కడికే వెనక్కు పంపించండి. మాకూ, కుంపిణీవారికీ మధ్య మైత్రిని పెంపొందించండి' అని మంగుళూరుదొరకు ఉత్తరం పోవడం మంచిది దొరా! అట్లాగని ఆజ్ఞా పత్రం వ్రాయించి తెచ్చేదా?' అన్నాడు.

'ఎందుకోయి ముండమోపీ! వాళ్లకు జంకిపోయేనా? ఏయ్ అనగానే కాళ్ళమీద పడి పోతావా?'

'మాట మెత్తగావుంటే కాళ్లమీద వచ్చిపడుతాడు. ప్రభూ! మెత్తనిమాటలకు లోబడక పోతే, బిరుసుమాటలు తర్వాత వుండనేవున్నాయి. మొదట ఇల్లా మాట్లాడిచూద్దాం.'

'నువ్వేమో పూర్తిగా తంత్రజ్ఞుడైపోయావు, కుంటీ! మంత్రంవేసి లంజెను పట్టేస్తావు కదూ!'

'లంజకదూ! దొరా! మంత్రానికి రాకుండావుంటే టోను పెట్టేది.'

'మంచిది. చెయ్యి. ఆయనకు టోనుపెట్టేఆటలో నువ్వు ఆయన గాలానికి చిక్కవద్దు.'

'చేపల్ని ముండల్ని చవిచూడటానికి వచ్చే ఈ మనుషులు నన్ను గాలమువేసి పట్టుకో గలరా? దొరా! ఎరకు నోరుతెరవడం మీను పని. ఈ తెల్లమొగాలకు కావలసిన ఎర మన దగ్గిర వుంది. అల్లుడుగారిదగ్గిర ఏముంది?

'పోనుకో. ఇంకో విందుభోజనానికి పిలిస్తే అక్కడనుంచే నోరు తెరచుకొనివస్తారు ముండలు. నువ్వు చెప్పినట్లే వ్రాయించు. చూద్దాం. ఏమంటాడో.'

'ఆ పందిముండాకొడుకు పీ అల్లుడు అనేవాడు ఇటుప్రక్కకువస్తే వచ్చినరోజే వాడి తల ఎగరగొట్టించాలి, బసవా! వదిలిపెట్టేవు! జాగ్రత్త!'

'రానియ్యండి ప్రభూ!'

'ఈ పనికిమాలినవాడితో చేరి, పుట్టినింటికి ద్రోహం తలిచే ఆ ఆడుకుక్కని, నీ పెనిమిటితో పాటు వుండిపోవే అని పంపించేసెయ్యాలి.'

'సరే ప్రభూ!'

చెల్లెలూ, అల్లుడూ వెనక్కి వస్తే తాను వాళ్ళను చేయదగ్గ చిత్రహింసనుగూర్చి చేసే ఊహలో సుఖానుభూతిపొందుతూ, వీరరాజు అప్పటికి మౌనం వహించాడు.

# 120

బసవన్న తాను సూచించిన ధోరణిలో చాలా జాగ్రత్తఅయినభాషలో కలెక్టరుకు ఓ ఉత్తరాన్ని వ్రాయించి, దాన్ని తెచ్చి రాజుకు చదివి వినిపించాడు. ఆయన ఆజ్ఞపొంది దాన్ని మంగుళూరికి పంపించేశాడు. ఈ ఉత్తరం కలెక్టరుకు చేరేసమయానికి చెన్నబసవన్న దేవమ్మాజీ బెంగుళూరుకు ప్రయాణమై వెళ్ళిపోయారు. అట్లా కాకపోయినా, వాళ్లేమీ వెనక్కి వచ్చేవాళ్ళు కారు. వెనక్కిపోండి అని కలెక్టరు వాళ్ళకు చెప్పనూ చెప్పడు. కలెక్టరు జవాబు వ్రాసే విషయంలో ఎవరినీ సంప్రదించాల్సినపనీ లేదు. ఆయన బహు సంక్షేపంగా, 'తమ ఆజ్ఞాపత్రం అందింది. కాని అది మా చేతికి రాకమునుపే తమ చెల్లెలుగారూ, అల్లుడుగారూ బెంగుళూరికి ప్రయాణమైవెళ్ళారు. అందుచేత తాము కోరినట్లు చేయడానికి మాకు అవకాశం చిక్కలేదు. తమ ఉత్తరాన్ని రెసిడెంటుదొరగారికి పంపిస్తున్నాం. ఈ సందర్భంలో ఆవశ్యకమైన వ్యవహారం భవిష్యత్తులో ఆ దొరగారితోనే నడిపించ ప్రార్థిస్తున్నాను' అని ఉత్తరం వ్రాసాడు.

ఈ ఉత్తరం వచ్చినరోజు వీరరాజు ఇంకోసారి మోటగాడు. మరింతగా కేకవేశాడు. ఎప్పటికంటె ఎక్కువగా మద్యం సేవించాడు. మరుదినం రెసిడెంటు మహాశయునికి ఓ ఉత్తరం వ్రాయించాడు: 'మా అల్లుడుగారు మామీద అపరాధంచేసి, చెఱనుంచి తప్పించుకొని మీదగ్గిరకు పారిపోయివచ్చారు. మా చెల్లెల్నీ తీసుకొచ్చారు. వాళ్ళని ఇక్కడికి పంపించివేయాల్సింది' అని దాని సారాంశం. ఈ ఉత్తరం చెన్నబసవయ్య, దేవమ్మాజీ బెంగుళూరు చేరినరోజు చీఫ్ కమిషనరుచేతికి చేరింది.

# 121

కొడగురాజ్యం పరిస్థితుల్నిగురించి తన ఊహాగానం పై అధికారులకు నివేదికమూలంగా వినిపించిన రెసిడెంటు మహాశయునికి తన భవిష్యవాణి ఇంతశీఘ్రంగా ఫలోన్ముఖం అవుతుం దని అనుకోలేదు. మంగుళూరు కలెక్టరు, చెన్నబసవయ్య, దేవమ్మాజీలనుగురించి అతనికి వ్రాసిన ఉత్తరం వాళ్ళు బెంగుళూరు రావడానికి మూడురోజులుముందుగా చేరింది. ఆయన వెంటనే ఆ సంగతి విన్నవిస్తూ మదరాసుకు, కలకత్తాకు ఉత్తరాలు పంపించాడు. చెన్న బసవయ్య, దేవమ్మాజీలను ఎదురేగి ఆహ్వానించి తీసుకొనిరావడానికి పదిమంది రక్షక భటుల్ని పంపించాడు. బెంగుళూరులో వాళ్ళు దిగడానికి తగినఏర్పాట్లు చేశాడు. తమద్వారా అన్యాయం జరిగిందని కనబడకూడదు కొడగురాజు యోగ్యతతో కనుగలిగినట్టైతే తన దేశాన్ని తాను పాలించుకోవచ్చు, లేకపోతే అతన్ని గద్దెనుంచి దింపడానికి యత్నించాలి అని నిశ్చయించాడు.

చెన్నబసవయ్య, దేవమ్మాజి బెంగుళూరు చేరారు. రెసిడెంటు, చీఫ్ కమిషనరుల ప్రతి నిధి వాళ్ళనుచూసి, వసతికికూడా తీసుకపోయి అక్కడ బస ఏర్పాటుచేశారు. రాజసమాన మైన గౌరవంతో వాళ్ళను సత్కరించి 'తాము ప్రయాణం ఆయాసం తీర్చుకోండి. తర్వాత తమ అనుకూలంచూసికొని పెద్దదొరగారిని చూడవచ్చు' అన్నాడు. చెన్నబసవయ్య, దేవమ్మాజి అతడు చూపించిన ఆదరానికి ముగ్ధులయ్యారు. వాళ్ళు ఓ స్వర్గలోకంలో అడుగు పెట్టినట్లే భావించుకున్నారు. ఆ భావానికి అడ్డుతగులుతున్నది ఒక్కటే: తమ పాప నరకంలో చిక్కుపడివుండడం; ఇద్దరినీ పసిపాపనుగురించిన చింత మనస్సును కాల్చియ పెట్టుతూవుంది. చెన్నబసవయ్యకంటె దేవమ్మాజికి పాపనుగూర్చి బాధ ఎక్కువగా వుంది. ఆమె నిరంతర చింతాదంతురిత.

వచ్చినరోజు విశ్రాంతితీసుకొని మరుదినం చెన్నబసవయ్య రెసిడెంటుగారిని చూడటానికి ఆయన నివాసగృహానికి వెళ్ళాడు.

దొర అతన్ని చాలా ఆదరంతో స్వాగతించి మడకేరిలో చూపించినగౌరవానికి నాలుగు రెట్లు గౌరవంచూపి, మొదట ఆయనను కూర్చోమనిచెప్పి, తర్వాత తాను కూర్చొని కుశల ప్రశ్నలు వేశాడు. 'మడకేరిలో తమరిని చూసింతర్వాత తమమధ్య రాజుగారిమధ్య సామ రస్యంలేదని మాకు స్ఫురించింది. కాని ఆ మనస్తాపం ఇంతశీఘ్రంగా ఇంత విషమంగా పరిణ మిస్తుందని మాకు తోచలేదు. దగ్గిరబంధువులైన తమరినిగురించి రాజుగారు ఇంత అను చితంగా ప్రవర్తిస్తారంటె మాకు ఎంతో ఆశ్చర్యమిశ్రితమైన విషాదం కలుగుతోంది'అన్నాడు.

చెన్నబసవయ్య: 'ఔనుదొరా! ఆయనకు ఇది వాడుకే. చెప్పేవాళ్లు, వినేవాళ్ళు లేక రాజుగారు ఇంతగా కొవ్వెక్కి అఘోరిస్తున్నారు. ఆయనను అణగద్రొక్కడానికి సాయ పడాలి అని అభ్యర్థించడానికి మేము ఇక్కడకు వచ్చాం.'

'దేశీయరాజుల క్రూరప్రవర్తనమూలంగా పీడితులయ్యే ప్రజల్ని వాళ్ళ పిడికిలినుంచి విడిపించి, క్షేమకరమైన పరిపాలనలు నెలకొల్పడం తమ కర్తవ్యమని కుంపిణీ సర్కారు వారు గ్రహించారు. తమ రిందువిషయమై విచారింపనక్కర్లేదు. ఈ సందర్భంలో చేయదగిన పనులు చేయడానికి మేము పై అధికారులనుంచి అనుమతిపొంది వున్నాం. యథాసమయంలో తగిన ఏర్పాట్లన్నీ చేస్తాం.

'రాజును తప్పించి మీరు రాజ్యంచేసే ఏర్పాటుచేయవద్దు దొరగారూ! కొడగును మరో మైసూరు చేయవద్దు.'

'ఆమాట ఇప్పుడు అప్రస్తుతం. అదీకాక తాము యోచిస్తూవున్నమార్గం అనుచితమైంది. కొడగును రాజుగారిచేతినుంచి విడుదల చెయ్యడమే మొదటి అడుగు; అది అయికపిమ్మట ఏర్పాటు ఏమి అనేది ఆలోచించాలి.'

'ఔను సార్! రాజును తీసేశాం అనడంతోబాటు ముందు ఎవరు రాజుకావాలి అనేమాట ఆలోచించాలి. మొదట ఇది, తర్వాత అది అనడానికి వ్యత్యాసమెక్కడ?'

'మంచిది. ఈసంగతి తర్వాత ఆలోచిద్దాం. ప్రస్తుతం మీరు ఇక్కడ నిర్భయంగా వుండటం కావాలిసింది. మిమ్మల్ని క్షేమంగా చూసుకోవడం, మా కందరికీ మొదటికర్తవ్యం.'

'మా బిడ్డను ఇక్కడికి తెప్పించాలి సార్! అది అన్నిటికంటె మొదటిపని.'

'తెప్పిద్దాం. బిడ్డకు ప్రాణభయం ఏమీ లేదుగా?'

'లేదని చెప్పడానికిలేదు. రాజుగారికూతురు చెబుతోంది: మనమీద కోపంతో ఏం చేసినా చెయ్యవచ్చునని.'

'దొరకూతురు అంటే మీ కుటుంబమేగా?'

'ఔను.'

'ఆమె భయపడటం సహజం. కాని రాజుగారు బిడ్డను ఏమైనా చేస్తారేమో అని మాకు అనిపించడంలేదు.'

'అంత ధైర్యంగా చెప్పడానికి లేదు.'

'కానీండి. పాపను వెంటనే పంపించాలి. సురక్షితంగా బిడ్డను, తల్లిదండ్రులకు అప్ప గింతలుపెట్టడం ఇప్పుడు మా బాధ్యత అని మేము రాజుగారికి తెలుపుతాం.'

'అట్లా అంటే రాజు మీమీది కక్ష తీర్చుకోడానికని పాప నేమైనాచేస్తే?'

'మామీద కక్షతీర్చుకొని మీ రాజు ఏమి బ్రతుకుతాడు? కుంపిణీసర్కారువారిముందు. ఇటువంటి ఆటలు సాగవు.'

ఈవిధంగా ధైర్యంచెప్పి, రెసిడెంటు 'దేవమ్మాజీగారికి తోడుగా వుండటానికి లూసిగారిని పంపిస్తాం. మీ యజమానురాలికి చెప్పండి' అని చెన్నబసవయ్యను అతనివసతికి పంపించేశాడు. ఆరోజే వీరరాజుకు ఒక ఉత్తరంవ్రాసి గుర్రంటపా పంపించాడు. దానిలో వ్రాసిన సంగతులు:

'తమ చెల్లెలుగారినిగురించి ఆమె పెనిమిటినిగురించి తాము వ్రాసినఉత్తరం మాచేతికి చేరింది.

మేము తమ సన్నిధికివచ్చి తమ ఆదరసత్కారాలను చవిచూసి, సంతోషంగా వెనక్కి వచ్చిన పక్షంరోజులలోపలనే మాకూ, తమకూ మధ్య ఈవిధమైన ఉత్తరప్రత్యుత్తరాలు నడవవలసిరావడం చాలా శోచనీయం. కాని అటువంటి సందర్భం ఏర్పడడంచేత మేము తమతోపాటు నిజానికి వివాదానికే దిగవలసివుంది. ఈ మాటలను వివాదంగా తీసుకోవద్దనీ, సంకటంనుంచి తప్పించడానికిగాను, ఎదుటివారి ఉనికి తెలిపే వివరణమాత్రమనీ తెలిసికోవాలిసిందిగా ప్రార్థిస్తున్నాం.

'మీ చెల్లెలిగారిభర్త ఏం నేరంచేశారో మాకు తెలియదు. తాము వారిని నిర్బంధంలో వుంచడం న్యాయమే కావచ్చు. ఈ వివరణలో మీకు మే మేమీ ప్రతిచెప్పం. ముఖ్యంగా ఇది మాకు సంబంధించినవిషయం కాదు. ఆయన చెఱనుంచి తప్పించుకొని భార్యాసమేతంగా కుంపిణీ సర్కారువారి శరణువేడి మా ఆశ్రయానికి వచ్చివున్నారు. సందర్భం ఏమిటి అనేది సంపూర్ణంగా తెలుసుకొని తర్వాత మేము వాళ్లను తమదగ్గిరకు పంపించవచ్చు. అంతేగాని, ఊరికే వారిని విడిచిపెట్టడం సాధ్యంకాదు. కుంపిణీ సర్కారు తన శరణువేడినప్రజలను ఎప్పుడూ వదిలివెయ్యలేదు.

'అకారణంగా శ్రీయుతులైన చెన్నబసవయ్యగారి అపరాధమేమిటో, ఆయనే ఆ అపరాధానికి బాధ్యుడని ఎట్లా నిర్ణయింపబడిందో, ఆయన నిరపరాధి అయివున్నా, పరిస్థితి దోషంచేత నేరస్థులుగా కనబడుతూవుండవచ్చేమో! అనే విషయాలపై మాకు తగినంతగా తెలియచేసి ఉపకరింపాలని కోరుతున్నాను.

'ఖైదులోంచి తప్పించుకొనివస్తూ, అజాగ్రత్తమూలంగా తమబిడ్డను పోగొట్టుకొని వచ్చారు. ఆబిడ్డ తమవద్ద చిక్కింది. వారికీ, మీకూ మధ్యనున్న మనస్తాపాలు ఉపశమించడానికి కొంతకాలం పట్టుతుంది. ఈమధ్యకాలంలో బిడ్డ తల్లిదండ్రులను వదిలిపెట్టి మీదగ్గిర ఉండడంలో అర్థంలేదు. దానికి తగ్గంత కారణం లేదు. అంచేత, తాము దొడ్డమనస్సుతో పాపను మా దగ్గిరకు పంపించాలి అని ప్రార్థిస్తున్నాం. మీ చెల్లెలిగారికి బిడ్డను అప్పగింతపెట్టనిదే మేము వారివిషయమైన కర్తవ్యాన్ని నెరవేర్చినట్లు కాదు. అందుచేత తమరు బిడ్డను వేరే ఎవరిఇష్టంవచ్చినట్లూ కాదు, మా ఇష్టానుసారం మాదగ్గిరకే ఏమాత్రం ఆలస్యం చేయకుండా వెంటనే పంపించివేయడం జరగాలి.'

# 122

మంగుళూరునుంచి కలెక్టరూ, బెంగుళూరినుంచి రెసిడెంటూ వ్రాసిన ఉత్తరాలు యథాసమయంలో చూసుకొని మదరాసు గవర్నరు కొడగు వ్యవహారాలు తాను వాంఛించినపాకంలో వడుతున్నాయని లోవల లోవల మురిసిపోయాడు. గవర్నరుజనరలు బెంటింక్ మహాశయునికి తన అభిప్రాయం తెలుపుతూ ఓ ఉత్తరం వ్రాశాడు. దానిలో 'రాజు ఏవిధంగా నడుచుకుంటాడో నిశ్చితంగా మనం చెప్పడానికిలేదు. కాని ఆయన మనలను ధిక్కరించేమాటాడుతాడు అనేది శతవిధాల సత్యం. వారు అల్లా చేసేపక్షంలో ఆయన్ను అనివార్యంగా దండించవలసి వుంటుంది. ఆ స్థితిలో వివరాలుతెలుపుతూ మీనుంచి ఆజ్ఞపొంది పని నడపడానికి వ్యవధానం చాలదు. అందుచే ఇప్పుడే మీరు ఈ సందర్భంలో ముందుగానే ఆవశ్యకమైన చర్యలనన్నింటినీ మద్రాసుసర్కారు తీసుకోగలదని ఓ ఆజ్ఞాపత్రం పంపిస్తే ఎంతో అనుకూలంగా వుంటుంది. సందర్భం కలిసిరాగానే తగినచర్యలు మేము తీసుకోవడానికి సులభంగా వుంటుంది. మరోసంగతి బెంగుళూరులో ఇప్పుడు వుంటూవున్న సేనాధికారులందరూ ఇంతకు ముందు రాజునుచూసి, ఏదోవిధంగా ఆయన ఆతిథ్యం పొందినవాళ్ళే. వాళ్లలో ఎవరికీకూడా ససైన్యంగా కొడగుమీదికి వెళ్ళడానికి మనస్కరించకపోవచ్చు. అంచేత బెంగుళూరు ముఖ్య సేనాధికారానికి ఓ కొత్త కమాండరును పంపిస్తే బావుంటుంది.

మూడవది: ఇక్కడ ఈ సందర్భం అవసరమైన ఉత్తరప్రత్యుత్తరాలు జరిపి ఓ దరికి చేరిస్తేనేగాని సమకూడదు. ఇదంతా ఫలితానికి రావడానికి ఇంకా రెండు లేక మూడునెలలు వట్టవచ్చుననుకుంటున్నాను. ఆ సమయానికి మీరు మదరాసుకు క్యాంపువేసుకొని విచ్చేస్తే అన్నివిషయాలు మీరే ప్రత్యక్షంగా అవగతం చేసుకొన్నట్లౌతుంది. అవసరమైన ఆజ్ఞలన్నింటినీ ప్రత్యక్షంగా ఇవ్వవచ్చుఅనిన్నీ నేను తమకు నివేదింపగోరుచున్నాను' అని వ్రాశాడు.

మంగుళూరులోని కలెక్టరుకూ, బెంగుళూరుకూ, ఇట్లాగే అధికారపత్రాలతోబాటు స్వంత ఉత్తరాలువ్రాసి 'కొడగును మింగివేయాలని తెల్లదొరలు ఆతురపడుతున్నా రనిపించుకోవద్దు; అయితే రాజు అవివేకంగా ప్రవర్తిస్తూవున్నప్పటికీ, మంచివాళ్ళమనిపించుకోవడానికిగా, మితిలేని సహనమూ చూపవద్దు. దేశంలోని ప్రజాక్షేమంకోసం మనం అధికారం వహించడానికి, ఒప్పుకొంటున్నట్లు స్పష్టంగా కనబడాలి. వీటిని ఉద్దేశంలో పెట్టుకొని, అవసరమని తోచినపనులన్నీ చేయడానికి, చర్యలు తీసుకోడానికి, మీకు స్వాతంత్ర్యం వుంది. సాధ్యమైనంతవరకూ మొదట మాకు తెలియజేసి అవసరమైనచర్యలు తీసుకొంటూవుండండి. ఓ వేళ, మొదట తెలియచేయడానికి సాధ్యపడకపోతే చర్యతీసికొని వెంటనే మాకు తెలియచేయండి. ఆ యీ పనులనన్నింటికీ మా సాహాయ్యం మీకు వుంటుంది' అని తెలిపాడు.

ఆ రోజుల్లో కంపెనీ సర్కారువారి పత్రవ్యవహారమంతా, వీలైనచోట్లకు, పడవలమీద, మిగతాచోట్లకు అరవైగడియలూ పోతూవుండే టపాగుర్రాలమీద నడుస్తూవుండేది. ఈవిధ మైన ఉత్తరాలు చాలా అవసరమై వున్నప్పుడు, రోజుకు పది [1]గవ్యూతులదూరం పోతూ వుండేవి. కొడగునుగురించిన ఈ ఉత్తరాలన్నీ మదరాసు, కలకత్తా బెంగుళూరులకు ఈవిధం గానే పోయాయి. గవర్నర్ జనరలు, గవర్నరు, రెసిడెంటు ఈ ముగ్గురూ ఒకేయంత్రంలోని మూడుభాగాలుగా ప్రవర్తించేవాళ్లు.

గవర్నరు జనరల్ బెంటింక్ మహాశయుడు మదరాసు గవర్నరుకు, మైసూరు రెసి డెంటుకు సకాలంలో జవాబులు పంపించాడు. మైసూరుదొర ఏమితప్పులు చేసివున్నా కొడగు రాజులాంటి చరిత్రభ్రష్టుడు కాడు.

అటనినే ప్రజాక్షేమం దృష్టిలోపెట్టుకొని సింహాసనచ్యుతునిచేసిన మనం. కొడగురాజును రాజ్యం చేసుకోమని వదిలేస్తే దేశంలోనిప్రజలకు పక్షపాతంగా కనపడుతుంది. ఆయన పూర్వీ కులకు మనం గాఢమైత్రినిగూర్చి మాట ఇచ్చినమాట నిజమే. అయితే రాజులు ఎంత భ్రష్టు లైనా మనం అవన్నీ ఒప్పుకొంటూ, వాళ్ళస్నేహితులమైవుంటామని దాని అర్థం కాదు.

మన ఆశ్రయంలోవుంటూవున్న రాజబంధువులను విడిచివెయ్యండి అని అడగడం రాజుయొక్క ధార్ష్ట్యాన్ని ప్రదర్శిస్తోంది. అందుచేత ఈ సందర్భంలో అవసరమనుకున్న చర్యలన్నీ మీరు తీసుకోవచ్చును. ఇందువిషయమై మేం సంపూర్ణమైన అనుమతి ఇస్తూ వున్నాము. రాజుగారితో రాయబారాలూ, చర్చలూ నడపడానికి ప్రస్తుతం నాగపూరులోవున్న గ్రాహం మహాశయుని నియోగిస్తున్నాం. గ్రాహం ఇంతకుముందు కొడగురాజులతో వ్యవ హారం నడిపినవారు. కొత్తవాళ్ళకంటె ఎంతో చక్కగా మనం పడుతున్న అభిప్రాయాన్ని రాజుగారికి వివరించడానికి సమర్థులైనవారు. వ్యవహారం ముందుకుసాగి ఓ రూపంతాల్చే సమ యానికి మేము మద్రాసుకు అవశ్యం రాగలం.'

నెలరోజుల్లో లెఫ్టినెంట్ కర్నల్ ఫ్రేసరు బెంగుళూరికివచ్చి సైన్యాధికారాన్ని వహిం చాడు. అదైన పదిరోజులకల్లా, గ్రాహం నాగపూరునుంచి వచ్చిచేరాడు.

---

[1] గవ్యూతి=a league measured by 200 fathoms అని కిట్టెలుపండితుడు. సుమారు రెండుక్రోసులదూరం.

# 123

ఈ మధ్యకాలంలో రెసిడెంటు వీరరాజుకు, వీరరాజు రెసిడెంటుకు మూడు మూడు ఉత్తరాలు వ్రాసుకోవడం జరిగింది.

వాటి మొత్తం సారాంశం ఈవిధంగా వుంది:

వీరరాజు: 'నా చెల్లెలు, ఆమె పెనిమిటి, వాళ్లవిషయంలో ఎల్లా నడుచుకోవాలి అనే దాంట్లో నాకు పూర్ణమైన స్వాతంత్ర్యం వుంది. మీరు నా స్నేహితులమని మరిమరీ నోరు తెరచి చెప్పుతున్నారు. కాని మీ ప్రవర్తన దానికి తగినట్లుగా లేదు. నా చెల్లెలిబిడ్డను మీ దగ్గిరకు పంపించాలి అని చెబుతున్నారు. ఈవిధంగా అడగడానికి మీకు ఎక్కడిది అధికారం? మంచిమాటగా దేవమ్మాజి, చెన్నబసవయ్యలను ఇక్కడకు పంపించివేయండి. పిల్లవాణ్ణి వాళ్ళకు ఇచ్చేస్తాను. పంపించరూ' ఆ బిడ్డప్రాణం తీసేస్తాను. జాగ్రత్త. మకరసంక్రాంతి గడవు చివరిరోజు. ఆరోజు సాయంత్రంలోపల వాళ్ళయిద్దరూ ఇక్కడకువస్తే సరేసరి; లేదా వాళ్ళు మళ్ళీ బిడ్డను చూడడమంటూ వుండదు. అంతేకాదు; ఆతర్వాత మేమూ మీరూ స్నేహితులమే కాము. జాగ్రత్త: ఈసంగతి మీ ఆశ్రయంకోరి వచ్చిన మీ దాసీదాసులు, దేవమ్మాజీ చెన్నబసవయ్యలకు తెలపండి. మీ ఘనతవహించిన పేరుకు మీ అంతట మీరు పంపకపోయినా తమబిడ్డను చూసుకోవడానికి, బ్రతికించుకోడానికి వాళ్ళు తమంతట తామే ఇక్కడికి వెనక్కుతిరిగి రావడానికి ఒప్పుకోవచ్చు. నా ఈ మాటలకు మీరు చెవియొగ్గక, మిమ్మల్ని దండించడానికిగా మేము వాళ్ళపాపను చంపించేస్తే, ఆ బాధ్యత మీదీ, వాళ్ళదీ; మాది కాదు, జాగ్రత్తపడండి.'

రెసిడెంటు. 'మీ చెల్లెలు, ఆమె పతి - వీళ్లిద్దరినీ మీ దగ్గిరకు వెనక్కు పంపించేవిషయంలో మాకు లేశమాత్రమూ అభ్యంతరం లేదు. కాని వెనక్కుపోవడానికి వాళ్లు ఒప్పుకోవాలి. వాళ్లు ఒప్పుకోకుండా మేము వాళ్ళను ఇక్కడినుంచి మీదగ్గిరకు పంపించడం, ఆశ్రయదాతల దృష్టిప్రకారం అధర్మం అవుతుంది. ఇప్పుడు వాళ్లు మీయొద్దకు రావడానికి ఎంతైనా భయపడుతున్నారు. బిడ్డను మొదట రానియ్యండి, ఆతర్వాత అక్కడికి అందరమూ కలిసి వెనక్కు వెళ్ళుతాం అంటున్నారు. ఇటువంటి సన్నివేశంలో, మీరు వాంఛిస్తున్నట్లుగా, వాళ్ళను వెంటనే ఇక్కడినుంచి మీవద్దకు పంపించడం అసాధ్యము. ఇట్లా అంటున్నామని, మీ మా మైత్రికి ఏవిధమైన కొరతలేదు. తమపేరు చెడగూడదు, తమ విరోధులసంఖ్య పెరుగకూడదు అనేటటువంటి ఏకైకదృష్టితో, మేము ఈ వ్యవహారంలో నడచుకొంటున్నాం. ఇది యథార్థమని తమరు గ్రహించి, మీరు మీ మేనల్లుడైన పసిపాపను ఇక్కడకు పంపించమని ప్రార్థిస్తున్నాం. అట్లాచేయక తాము హఠంపట్టికూచుంటే, మన మైత్రిని మీరు తిరస్క-

రించినట్లే అని మేము తెలియజేస్తున్నాం. సంక్రాంతిలోపల మీ మాటప్రకారం చేయకపోతే పాపకు అపాయమని తెలియజేయించారు. ఇటువంటి అమానుషమైనపని తమరు చేయించరని మేము నమ్ముతూవున్నాం. అయినా క్రోధపరవశులై ఓవేళ మీరు పాపవిషయంలో అటువంటి దారుణకృత్యం తలపెట్టితే కుంపిణీ సర్కారువారు దానికి తగిన ప్రతిక్రియ చేయవలసివస్తుంది. ఈవిషయం ఇందుమూలంగా, ఇప్పుడే మీకు మేము విన్నవిస్తున్నాం. ఈ సందర్భంలో, కుంపిణీ సర్కారువారిదృష్టి ఏమిటో తమకు తెలియకపోవడంచేత నేరం జరిగిందని చెప్పడానికి తమకు సావకాశమివ్వకూడదనే ఉద్దేశంతో ఇప్పుడే స్పష్టంచేశాము. ఈ ఉత్తరం సాధ్యమైనంత స్పష్టంగావున్నప్పటికీ, కుంపిణీ సర్కారువారిదృష్టి ముఖతః మీకు విన్నపంచేసి, ఏ సందేహమూలేకుండా వివరించడానికిగాను, మేము తమదగ్గిరకు, ఇద్దరు అధికార్లను పంపిస్తూవున్నాం. వారు చేసేవిన్నపం అంతా చక్కగావిని. మా మీ మైత్రికి దెబ్బతగలకుండా, మీ బంధుగులకు దుఃఖం వాటిల్లకుండా, మీకున్న పేరు ప్రతిష్ఠలు మాసిపోకుండా వుండేటట్లు, మీరు నడుచుకోవాలని మేము మరిమరీ గట్టిగా ప్రార్థిస్తూవున్నాం.

# 124

ఉత్తరప్రత్యుత్తరాల ఈ కోలాహలంలో కలిగిన ప్రయోజనమల్లా ఒక్కటే. వీరరాజు మనః కాఠిన్యం తలమీరి పెరిగిపోవడం. దేవమ్మాజీ, చెన్నబసవయ్య ఇద్దరూ దగ్గిర వుండివుంటే ఆయన వాళ్లను నల్లులను నేలకురాచినట్లు రాచి ముగించేసివుండేవాడు. రెసిడెంటూ, ఆయన దగ్గిర జనులూ చేతికి చిక్కినాసరే: ఆయన వాళ్ళను తన క్రోధానికి బలిచేసివుండేవాడు. కాని వాళ్ళు ఎవరూ చేతికి చిక్కేటట్లు లేరు. చేజిక్కినవాడు చెల్లెలి బిడ్డమాత్రం. రాజుకోపం భూతద్దంలోనుంచి దిగే సూర్యకిరణంలా ఏకాగ్రంగా కేంద్రీకృతమై ఏ పాపమూ ఎరగని ఆ పసిపిసుగు ప్రాణంపై విరుచుకొనిపడ్డది. 'ఈ ముండకు తగినపాఠం నేర్పాల్సివుంది' అని మరిమరీ జపించుకొంటూ, ఆయన తన మేనల్లుని చంపడానికి సిద్ధమయ్యాడు.

ఈలోపల గ్రాహందొర సూచించినప్రకారం రెసిడెంటు మంగుళూరు కలెక్టరుకు ఉత్తరం వ్రాసి తమపరంగా రాజునుచూచి మాట్లాడటానికి తలచేరిలోని పారసీవర్తకుడైన దారా సేటును, మలబార్ కలెక్టరుదగ్గిర శరస్తాదారు కరుపాతి కరుణాకర మెనన్‌నూ మడకేరికి వెళ్ళేటట్లు చేశాడు. వీరరాజు వాళ్ళకు దర్శనమియ్యను అని చెప్పేశాడు. బసవన్న ఆయనకు ఎన్నోవిధాల నచ్చచెప్పినతర్వాత, వాళ్ళను ఎట్లాగో అతి కష్టంమీద అనుమతించాడు. వాళ్లు

చెప్పేమాటకు అవకాశాన్ని ఇవ్వకుండా 'మనదేశస్థులైన మీరు తెల్లవాళ్ల మోచేతి గంజితాగి, వాళ్ళు వదేసిన మాంసంముక్కలు తిని, కుక్కలులాగా దాసానుదాసులై పోయారు. కొడగు మహారాజులుంగారితో రాయబారం నడవడానికి మీరేపాటి దొడ్డ మహానుభావులు? ఇటువంటి పనిలో తల దూర్చడానికి మాకు యోగ్యత చాలదని మీ తెల్లబొల్లిదొరలకుచెప్పి మీ ఊళ్ళో గమ్మున ఉండిపోక, తగుదుమమ్మా అని పెద్దమనుషుల్లా చక్కా వచ్చారా? మీకెంత గుండె ధైర్యం? నిజంగా మాటాడాల్సివుంటే మీ రెసిడెంటో, మీ గ్రాహందొరో, మీ కలెక్టరో రావాలి. మిమ్మల్నిపంపించి వాళ్ళ అవివేకం వాళ్ల ప్రదర్శించుకొన్నట్లే, వచ్చి మీ అవివేకాన్ని మీరు ప్రదర్శించారు; మమ్మల్ని అవమానపరిచారు. ఈ నేరానికిగా మిమ్మల్ని దండించాల్సివుంది. ఈ క్షణంనుంచీ మీరు మా ఖైదీలు. తెలుసుకోండి' అన్నాడు.

నారాపేట్ రాజుతో: 'మేము తెల్లవారి క్షేమమాలోచించి మీ సన్నిధానానికి రాలేదు. తమరు కొడగురాజులై పదికాలాలు వర్ధిల్లాలి అనే కోరికతో ఈపనికి ఒప్పుకొన్నాం. ఆంగ్లేయులు చాలా బలవంతులు. హైదరునుమించిన నాయకుడు లేడు. అటువంటివాణ్ణి, వాళ్ళు ఓడించి చక్కా పారేశారు. టిప్పుసుల్తానునుమించిన తంత్రజ్ఞులు లేరు. అంతటి వాడూ, ఉప్పుకూ, ఊరగాయకూ పనికిరాకుండా ఎగిరి చక్కాపోయాడు. వాళ్లను ఎదిరించి, మనవాళ్ళరాజ్యాలు ఒక్కటొక్కటిగా కర్పూరంలా హరించిపోయాయి. మనప్రజ అంతా మెల్లిమెల్లిగా తెల్లవాళ్ళ ఏలుబడిలోకి వచ్చేస్తున్నారు. తమరు శూరశిఖామణులు. తమప్రజ తమవెనుకనిలబడి చక్కగానే యుద్ధంచేయవచ్చు; కాని ఇది చాలాకాలం సాగేదికాదు. రెండుమూడేళ్ళతర్వాతనైనా ఆంగ్ల సేనావాహినులు, కొడగునేలను ఓ మూలనుంచి ఇంకో మూలకు ముంచెత్తక తప్పవు. హైదరుసేన ఇట్లాగే ఎదిరి నిలిచింది; ప్రజలు పడరానిపాట్లు పడ్డారు. తమ తాతగారు రాజ్యాన్ని పోగొట్టుకొని చెఱలో వుండాల్సి వచ్చింది. తెల్లవారికి ఓడిపోకపోయినా, తమరు వాళ్లకు విరోధంగానిలబడితే, ముప్పొద్దులా రెప్పవాల్చకుండా కనిపెట్టుకొని కావలాకాస్తూ వుండాల్సిందే. మనలో ఈరకం విరోధాన్ని బలవద్విరోధం అంటారు. ఇటువంటి విరోధాన్ని తాము మెడకు కట్టుకోగూడదని మేము వేడుకొంటున్నాం. తమ సింహాసనం కదలాడకూడదు అని మా వాంఛ' అంటూ విన్నవం చేశాడు.

వీరరాజు: 'ఇది మా పక్షంమాటా? పగరనుపొగడి మమ్మల్ని తెగడితే నువ్వు మా వాడివి ఔతావా? నీకు మాంసఖండం తినిపించిన వాళ్లచేయి నాకుతావు. మమ్మల్నిచూసి మొఱుగుతావు. నీ తెల్లబొల్లి దొరలసైన్యం కొడగులో నడుస్తుందా? ఎప్పుడు కన్నావు ఇం చక్కని కల? కొడగు ఏమిటనుకొన్నావు? ఇది మంగుళూరుకాదు. బెంగుళూరూ కాదు. పందు దొరకగానే దారినబడి రావడానికి. రానియ్యి చూద్దాం నీ దొరల్ని. మొదట నిన్ను విడిపించుకొని పోనీ. చెప్పంపించు నీ దొరలకు' అని కోపంతో నాలుగూ విసిరాడు.

కరుణాకరమెనన్ రాజుకు తృప్తిగా మాట్లాడారు. 'సేట్‌జీ తెల్లవారివిపోగడి, మిమ్మల్ని తెగడి సంతోషించేవారు కారు. నిజానికి నాకూ, ఆయనకూ తోచేది ఒక్కటే: తమరు తెల్ల వారి స్నేహితులై వుండడం క్షేమకరమని. కొడగులో అడుగుపెట్టడం సులభంకాదు. మనం పదేళ్ళు పోరాడవచ్చు ననుకొన్నప్పటికీ, అనవసరంగా ఈ పోరాటం, ఈ అవస్థా ఇదంతా ఎందుకు? ఇంతకీ, ఆంగ్లేయులు చెప్తున్నది ఏమిటి? మీ చెల్లెలిపాపను, తల్లిదగ్గిరకు పంప మని. అంతేనా! మీ చెల్లెలుగారు, ఆమెబిడ్డ సుఖంగావుండాలని వేరేవాళ్ళు చెప్పాలా? ఇది మీకూ కావలసినవిషయమే. చెల్లెలూ, చెల్లెలిగారి పెనిమిటీ, ఎందుకనో భయపడి తెల్లవాళ్ళ దగ్గిరకు పోయివున్నారు. పాపను పంపిస్తూ, భయపడకండి, వెనక్కురండి, అంటే వరు గెత్తుకొని మీ పాదాలదగ్గిరకు వస్తారు. తమరు బిడ్డను పంపడమే తమ కారుణ్యానికి సాక్ష్యం పలుకుతుంది. బిడ్డ చేతికివచ్చినాక, చెల్లెలూ, ఆమె భర్త 'రాజుగారికి కోపంలేదు. వారు మనల్ని కడుపులోపెట్టుకొని కాపాడుతారు' అని తెలుసుకొంటారు. వారు ఎప్పుడు వెనక్కు వస్తారో అప్పుడే తెల్లవారితో విరోధంకూడా సమసిపోతుంది.'

రాజుకు ఈ మాటలన్నీ చెవిలో దూరాయో లేదో చెప్పడం కష్టం. ఈ మాటలన్నీ అయిపోయి, కొద్దినిమిషాలు గడిచినా, ఆయన నోరు మెదల్పకుండా వుండిపోయాడు. కొంత సేపటికి వాళ్లవైపు తిరిగి 'కొడగురాజుతో సరిసమానంగా మాటాడేగుండెలా మీవి? ఎంత మితిమీరి పెచ్చుపెరిగిపోయారు: పరాయివాళ్ళుపెట్టిన పిండాకూడుతిని? మీరు కొవ్వెక్కి ఏడుస్తున్నారు. నిజానికి మీ తలలు నరికెయ్యాలి. బందీలుగామాత్రం చేశాం. మీ దొరలువచ్చి 'తప్పైంది' అని అననీ. అప్పుడు మిమ్మల్ని పంపించేస్తాం. కొడుగురాజు మీతోబాటు మాటాడేస్థితికి దిగజార లేదింకా' అన్నాడు దర్పంగా.

బసవన్న వాళ్లిద్దరిలో 'మాటాడింది చాలు. బైటకురండి' అని కనుసన్నచేశాడు. వాళ్ళు లేచి ఆయనతోబాటు బైటికి వచ్చేశారు. బసవన్న వాళ్ళతో 'ప్రభువులకు తెల్లవాళ్ళనుగూర్చి విరోధభావం తీవ్రంగా వుంది. స్నేహితులుగా నటిస్తూ విరోధులుగా ప్రవర్తిస్తారే అని కోపం. మీమీద వారికేమీ లేదు. రాజుగారి చెల్లెలూ, పెనిమిటీ ఇక్కడకువచ్చేస్తే ఏ జగడమూ లేదు. వాళ్లను ఇక్కడకు పంపి వవలసిందిగా మీ యజమానులకు ఓ ఉత్తరం వ్రాయండి. దాన్ని నేను వాళ్లదగ్గిరకు పంపిస్తాను' అని చెప్పాడు.

రాజుగారి చెల్లెలు, చెన్నబసవయ్య కొడగుకు రావడం అంత సులభమైనపనికాదు అని ఆ వచ్చినవాళ్ల నమ్మకం. వాళ్లరానిదే వాళ్ళు పోవడానికి వీలులేకపోతే తమపాట్లు పెరు మాళ్లకే ఎఱుకఅని వాళ్లకు తెలుసు. వీరరాజు దురహంకారి, దురాగ్రహి. తనకు వ్యతి రేకంగా నడుస్తున్నారని తెల్లవాళ్లమీద ఉండేకోపంతో ఆయన తమతలలు తీయించేసినా తీయించదగ్గవాడే! ఇక్కడినుంచి విడిపించికొని బైటపడడం ఎట్లాగా అనే వాళ్ళు ఆలోచిం చాల్సింది.

ఒక్కనిమిషం పోనిచ్చి మెనన్ బసవన్నను 'ఈవిషయం మీ తోటిమంత్రులతో కొంచెం మాట్లాడవచ్చా?' అని అడిగాడు. బసవన్న 'దానికేం అభ్యంతరంలేదు. కాని వాళ్ళు ఈ విషయంలో ఏమీ మాటాడేటట్లు లేరు. రాజుగారి స్వంతవిషయం ఇది. ఇంటి చెల్లెలు, ఇంటి అల్లుడు. వాళ్ళమాట వేరేవాళ్ల కల్పించుకోటం జరగదు' అన్నాడు.

పేట్, మెనన్ పరస్పరం మాట్లాడుకొని మెనన్ బసవన్నతో 'సరే మంచిది. రాజుగారిఆజ్ఞ తెలుపుతూ మా యజమానులకు ఉత్తరం వ్రాస్తాం. దాన్ని బెంగుళూరుకు పంపించే ఏర్పాటు చేయండి. ఉత్తరంవచ్చేదాకా మేము ఇక్కడనే వుంటాం' అని చెప్పాడు. బసవన్న 'మీరు వ్రాసేఉత్తరం రాజుగారికి చూపించవలసివుంటుంది' అన్నాడు.

మెనన్: 'అవశ్యం; దానికేం' అంటూ ఒప్పుకొన్నాడు.

# 125

దేశంలో ప్రజలమనస్సులు ఈ మధ్యకాలంలో రాజు అంటే వైమనస్యం ప్రోదిచేసుకొన్నాయి. దేవమ్మాజి అన్నా, చెన్నబసవయ్య అన్నా పడి చచ్చిపోతారనికాదు దాని అర్థం. రాజు దేవమ్మాజిపట్ల సరిగా నడచుకోవడంలేదని వాళ్ళకు తెలుసు. పండుగనాటకంలో రాజును హాస్యం పట్టించింది కొంతమందికి సంతోషం. అయితే కొంతమందికి నొప్పి కలిగించింది. కానైతే దేవమ్మాజీ, చెన్నబసవయ్యలమీద కాపలాపెట్టి, వాళ్ళను ఖైదీలులాగా రాజు చూడటం ఎవరికీ సమ్మతంకాదు. ఆయన ఆవిధంగా అన్యాయంగా చూశాడు కనుకనే దేవమ్మాజీ, ఆమె పెనిమిటి తప్పించుకొని పారిపోవాలసి వచ్చింది. వాళ్లు దేశాన్నివదిలి పారిపోయింది న్యాయమే. వాళ్ళ గ్రహచారానికి బిడ్డ దారిలో జారిపడి ఈ మామచేతికి చిక్కింది. దాన్ని చెల్లెలిదగ్గిరకు పంపకుండా ఈ అన్న బలవంతంగా బిడ్డను పట్టుకొనికూచున్నాడు. ఈయన ఎప్పుడూ సరిగా నడిచినవాడు కాడు. అయితే ఈ వ్యవహారం అన్నింటినీ మించిపోయింది. ఇదేమి ఈయన కఠోరబుద్ధి! అన్నంపెట్టిన యజమానికి, యజమానురాలికి కృతజ్ఞతతోవున్న చోమన్నను శూలానికెక్కించి చంపించాడా లేదా? అదైనా అదేమి కొఱత వేయించడం? ఓ శూలాన్ని తెప్పించి నాటడానికి ఓర్పులేకపోయింది. కొమ్మ కొట్టించి మేకు చెక్కించి అప్పటికప్పుడే అంగాడిపానాలు తీసేసాట్ట! 'మూడురోజులు శూలంమీదనే కుళ్ళనీ' అని ఆజ్ఞాపించాడుట! అటువంటివాడి మాంసం, గద్దలూ, కాకులూ పొట్టనింపు కొంటాయి. అతని వారికి అతడు సరిగా నడచుకోవడం ఓ నేరమైతే ఈయన సేవకులు

ఈయనకు సరిగా ఎల్లా నడచుకొంటారు? ఈయనగారి ప్రభుత్వం అంతకంతకీ 'నానాటికి తీసి కట్టు నాగంభట్టు'గా వుంటోంది. ఎట్లా అయినా ఈ రాచఱికం ముగింపుకువస్తేనే మంచిది.

ప్రజలలో ఇటువంటిభావం ఎక్కడ కలుగుతుందో ఎట్లా సర్వత్రా వ్యాప్తమౌతుందో చెప్పడం సాధ్యంకాదు. కాని ఈ సంవత్సరంలో చోమనభార్య, చెల్లెలు, జనంలో ఈ అసంతృప్తి ప్రచారానికి మూలకారణం. చోమన్నను శూలానికెక్కించారని విని వాళ్లు శూలం దగ్గరకు పరుగెత్తుకొనివచ్చారు. అతనికోసం నోరుకొట్టుకుంటూ, గోలపెట్టి ఏడుస్తూ వాపోయారు. 'అతన్ని శూలాన్ని కెక్కించిన వాళ్ళకొంప నాశనమైపోనూ!' అని శాపనార్థాలు పెట్టారు. అక్కడ కాపలావున్నవాళ్లు 'ఇక్కడకు రాకండి. శూలానికి ఎక్కించింది ఎవరు అనుకున్నారు రాజుగారు తెలుసా! ఆయనకొంప నాశనమైపోవాలని అంటున్నారా? తల నరికేయిస్తారు జాగ్రత్త!' అన్నారు. వాళ్ళు 'ఇంత మగవాడేపోగా లేంది మేముండి ఏర్వాకం ఏం చేస్తాం? రమ్మనమను. నీ దెయ్యందొరని. మా గొంతువిరిచేసి మా రక్తాన్ని తాగనీ' అన్నారు. మూడురోజులు కళ్ళల్లో వత్తులువేసికొని రాత్రింబవళ్ళు శవందగ్గిర కాపలాకాసి గద్దనీ, కాకినీ తోలేసి ఆ ఎంగిలిశవాన్ని తెచ్చి పూడ్చారు. చెయ్యాల్సిన కర్మకాండలుచేసి రాజభవనానికి ఎదురుగావచ్చి 'నీకొంప నాశనంకాను! నా పెనిమిటిని చంపావా సచ్చినోడా! మా అన్నయ్యను సంపావంట్రా! నీ తిమ్మదియ్య పాడోడ! కరింగాళమ్మ నిన్ను కొఱత కెక్కించాలిరా! భూతప్ప నిన్నుపట్టి పాలార్చనీ. నేలమీద నీ ఊరూ పేరూ లేకుండా నీ వంశం పురుగునాకిపోవాలి. చావరా ముండాకొడుకా' అని రాజును నిర్భయంగా నోటికి వచ్చినట్లు తిట్టిపోశారు. మొదట ఈసంగతి రాజుకు తెలియలేదు. తెలియగానే 'ఈ ముండల్ని కూడా కొఱతకెక్కించండి' అని ఆజ్ఞాపించాడు. నౌఖర్లుపోయి వాళ్లకు రెండేసి ఇచ్చుకున్నాడు. తరిమేశాడు అక్కడినుంచి, వాళ్లు రాజును తిట్టుతూ, కుటుంబాన్ని, వంశాన్ని శపిస్తూ, వీడికి కుక్కచావు కలిగించు అని కరింగాళికి మొక్కుకుంటూ, మడకేరి ఊరంతా తిరిగారు.

వాళ్లు రాజభవనంముందే నోళ్ళు కొట్టుకుంటూ, రొమ్ములు బాదుకుంటూవుంటే రాణి గౌరమ్మాజికి వాళ్లదుఃఖానికి దుఃఖమూ, వాళ్లమాటలకు భయమూ కలిగింది. దొర చోమన్నను చంపించాల్సింది కాదు అని ఆమెకు తోచింది. మహాఅయితే చెఱసాలలో పెట్టాల్సింది. కొట్టించాల్సింది. ఆక్షణమే నిండుప్రాణాలు నిలువునాతీయించడం, తానే కఠోరంగా శూలాని కెక్కించడం, చంపించడం చాలా అతి అయిపోయింది. దొర అంతక్రూరంగా ప్రవర్తించినప్పుడు ఆడవాళ్లు శపించకుండా, తిట్టకుండా వదిలిపెట్టుతారా? వీళ్ళమీద ఏం క్రౌర్యం చూపిస్తాడో అని రాణి భయపడింది. అటువంటిదేమీ కాకుండానే వాళ్ళు ఏడుస్తూ, బొబ్బలేస్తూ వెళ్లిపోయినతర్వాత ఆమె ఓ గురికానిపిలిచి రహస్యంగా 'ఈ ఆడవాళ్ళు మామంచి దుఃఖాల పాలయ్యారు. మేం చెప్పామని చెప్పవద్దు. వాళ్లకు అన్నంపెట్టి, మంచిమాటలుచెప్పి పంపించు'

అంది. అతరు ఈ పుణ్యాత్మురాలు ఉందిగనుక నే ఇదో యిల్లు, కుటుంబం అనిపించుకుం టోంది. అనుకొని తనకు కావల్సినవాళ్లకు ఈమాట చెప్పివేయించాడు. సాయంకాలంవచ్చి ఆ ఆడవాళ్లు ఊరువిడిచి వెళ్లిపోయారు, ఇహ విచారించకండి అని రాణికి చెప్పాడు.

చిన్నదీక్షితులు, లక్ష్మీనారాయణయ్య తమ్మునికుమారుడు సూరి, తమకు కావలసిన వాళ్ళతో వాళ్లచేత ఆ ఆడవాళ్ళకు చెప్పించి, బెంగుళూరికిపోయి తెల్లదొరలతో నేరం చెప్పే టట్లు సలహా ఇచ్చారు. వాళ్ళు ఇది బాగావుంది అనుకొని ఊళ్ళమీదుగా అరకలగూడుకుచేరి, దారి అడుగుతూ, బెంగుళూరుకు చేరారు. రెసిడెంటు ఇంటిఎదుట విలబడి నెత్తీ నోరూ కొట్టు కుంటూ వాపోవడం మొదలుపెట్టారు. ఎవరు ఏమిటి అని ఆయననౌకర్లు అడిగితే సంగ తంతా చెప్పారు.

చెన్నబసవయ్య తన కథను చెప్పుకొని రెసిడెంటుసాయం కోరినప్పుడు, దోమన్నకు పట్టిన దుర్దశ ఏమీ అంతగా చెప్పాడుకాదు. ఆ సంగతి రెసిడెంటుకు మనస్సుకు గట్టిగా పట్టింది దోమన్న పెండ్లాం, చెల్లెలూవచ్చి ఆయనఎదుట గొల్లుమంటూ ఏడ్చినప్పుడే. వాళ్ళు చెప్పిందంతా విని, ఆయన ఒక రాజువిషయంలోనేకాదు చెన్నబసవయ్యవిషయంలోకూడా అసహ్యించుకొని కోపం తెచ్చుకున్నాడు. వచ్చిన ఆడవాళ్ళతో 'మీకు అన్యాయం జరిగింది. మేము మీ రాజును, ఈ సందర్భంలో అడిగితెలిసికొంటాం. అంతవరకూ, మీరు ఇక్కడనే వున్నా సరే, మేం మిమ్మల్ని కనిపెట్టివుంటాం' అనిచెప్పి వాళ్ళను కనిపెట్టివుండే ఏర్పాట్లు చేశాడు. తిరిగి చెన్నబసవయ్యను చూసినప్పుడు వీళ్ళు వచ్చినసంగతిచెప్పి, వీళ్ళనుగురించి అతడు పట్టించుకోకపోవటానికి తన అసమ్మతినీ, ఆక్షేపణాన్ని మృదువుగా తెలియజేశాడు.

# 126

'బిడ్డను పంపించేదిలేదు. అంతేగాక మీరు పంపించివున్న దూతలను, మీ ఇద్దరిమనుషుల్ని కూడా మేము ఇక్కడే నిలిపివుంచాం. చెల్లెలూ, ఆమె పెనిమిటినీ మీరు మాదగ్గిరకు పంపించి, వాళ్ళు ఇక్కడకు చేరినవిమ్మటనే మేము మీ మనుషుల్ని మీదగ్గిరకు పంపడం' అని వీరరాజు వ్రాసినఉత్తరం బెంగుళూరికి చేరింతర్వాత రెసిడెంటు క్యాసామైజర్, సేనాధి పతి ఫ్రేసర్, నాగపూరు రెసిడెంటు గ్రాహంబొర, ఇహ ఇప్పుడు ఏమిటి చేయడం అని సంప్రదింపులు చేశారు. మొదట గ్రాహం మడకేరికిపోయి బిడ్డనూ తమ ఉద్యోగస్థులనూ విడి పించుకొనివస్తే అనే ఆలోచన పోయింది. గ్రాహం మడకేరికి పోవడానికి సిద్ధపడ్డాడు

ఆయనకు అక్కడ ఏ హాని జరగకుండా, కూడా తగినంతమందిని పంపించాలనగానే అతని వెంట వెళ్ళడానికి ఫ్రేజర్ సిద్ధపడ్డాడు. కాని ఈ ఆలోచన క్యాసామైజర్‌కు సమ్మతం కాలేదు.

ఆయన దారాసేటునూ, మెనన్‌నూ, ఆపి నిలిపివుంచినట్లే వీరరాజు గ్రాహంనూ పట్టుకొని నిలిపేస్తే ఏమిటిచేయడం అని అడిగాడు. 'ఈ రాజు మొండిపట్టు పిచ్చికేమీ తీసిపోదు. ఇతడు నిజంగా మనమీదపడి బ్రదకడం సాధ్యమా ? అయినా తానే చాలాప్రచండుడు, మన మందరమూ చాలా దుర్బలులము అన్నట్లు మాట్లాడుతాడు. గ్రాహంగారిని చెఱలోపెట్టి మనల్ని ధిక్కరిస్తే మేము కొడగుమీద దండెత్తిపోతాం. ఈ పిచ్చివాడు గ్రాహంనుచంపితే ఎమిటి చేయడం ? ఈ శంకకు అవకాశం కలిగించడానికి నేను సిద్ధంగా లేను' అన్నాడు.

అనుమానంతోబాటు ఆయన మనస్సులో వేరే ఓ ఆలోచనకూడా వుంది.

ఈ దాన్ని ఆయన వివరించి చెప్పలేదు. 'గ్రాహంపోయి, రాజు ఆయనమాటకు ఒప్పుకొని, జగడం పరిష్కారంచేస్తామే అనుకోండి. రేపు మళ్ళీ ఈ రాజుతో వాదం ఉండనే వుంది. ప్రతిఒకసారికి, గ్రాహంను పిలిపించడం సాధ్యమా ? వెనకటిమైత్రి ఏమున్నా, రాజు ఇప్పుడు దారితప్పి నడుస్తున్నాడు. ఇతన్ని పదచ్యుతునిచేయడానికి ఇది చక్కని అవకాశం. దీన్ని ఎందుకు వదులుకోవడం ? చరిత్రను ముందుకుపోనీ, కొడగు మనదికానీ.'

మంత్రాలోచనలఫలితంగా కొడగుమీద సేనలు పంపడానికి, కావలసిన సన్నాహాలు జరపడానికి తీర్మానమైంది.

ఇదేసమయంలో అప్పాజి రెసిడెంటుదగ్గిరకువచ్చి తాను అంతకుముందు చీఫ్ కమిషనరుతో చేసుకొన్నవిన్నపాన్ని తిరిగి విన్నవించుకొన్నాడు. రెసిడెంటు ఆ వెనకటి రహస్య పత్రాలను తీసికొనిచూసి ఇతనితో 'మీరు కొడగుకు రాజులు కానున్నారా ? ఆపంగతి మీరు ఒత్తిడిచేసేదిలేదు అని ఇందులో వ్రాయబడివుందే ?' అన్నాడు.

అప్పాజి: 'అది నిజం. మేం గద్దె నెక్కం అని మాట ఇచ్చివున్నాము. మేం ఆమాట మరచిపోలేం. ఇప్పటి ఈదొరను ఊడపీకితే నా కుమారుడు వీరప్ప రాజు కావాలిసి వుంటుంది. అతనికి రాజ్యాధికారం ఇవ్వవలసింది' అని జవాబిచ్చాడు.

'దొర కూతురు ? నీ కుమారునికంటె ఆమెకు ఎక్కువహక్కు వుంటుందిగా !'

'దొర కూతురేవిఁటి ? నా కొడుకేవిఁటి ? ఆమెకే కావాలి అనివుంటే అట్లాగే కానివ్వండి.'

'ప్రజ లేమంటారు ?'

'దాన్ని విచారించండి.'

'మీరు మాకు సాయంగావుంటారా ? ఈ వ్యవహారంలో మీరు మా పట్టువుంటే మేము మీ ప్రార్థనకు వీలైనంత అనుకూలంగా నడచుకొంటాం.'

'అల్లాగే.'

'మీ ఈ సంగతి, దేవమ్మాజికి, చెన్నబసవయ్యకూ తెలుపవచ్చా?'

'తెలిపితే తప్పేమీలేదు. అయినా నాలుగురోజులదాటు ఓపికపట్టడం మంచిది.'

'సరి, మేం ఏంచెయ్యాలి అనేది నిశ్చితంకాగానే మీకు తెలియజేస్తాం. అంతవరకూ మీరు మాదగ్గిర వుండండి.'

రెసిడెంటు అప్పాజీని బెంగుళూరులోనే వుంచేశాడు, ఆయన తప్పించుకొని పారి పోకుండా కాపలా పెట్టాడు.

'కొడగుమీద ఇంక పదిహేనురోజుల్లో సేన బైలుదేరేటట్లు ఏర్పాటుచేశాను. నాలుగు వైపులనుంచీ మా జనం ఆ ప్రాంతంలోకి చొరబడాలి. మలబారు, మంగుళూరు కలెక్టరులకు ఉత్తరాలు పంపిస్తున్నాను. తాముకూడా వాళ్ళకు ఆజ్ఞలు పంపించవలసింది' అని మద్రాసు గవర్నరుకు ఓ ఉత్తరం వ్రాసిపంపించాడు.

ఈమధ్యలో మేనను వ్రాసినఉత్తరం వచ్చింది. కొడగుమీద సైన్యాలు పంపడాన్ని మించి వేరేమార్గం లేదు అని స్పష్టపడింది.

పదిహేనురోజులు గడిచాయి. మద్రాసునుంచీ బెంగుళూరునుంచీ ఉత్తరాలు వచ్చాయి. ఈమధ్యలో తగుసంఖ్యలో గూఢచారులు నాలుగుదారులలోనూ ముందుగాపోయి గ్రామాల లోని గౌడలతో సైన్యం వస్తోంది, తగినసౌకర్యాలు కలగచెయ్యాలి అని తెలియజేశారు.

ఇంతలోనే మద్రాసుకు క్యాంపువేసుకొనివచ్చిన గవర్నరుజనరల్ బెంటింక్, వీర రాజుకు ఎచ్చరికగొలిపే ఉత్తరాన్ని ఓదాన్ని పంపించాడు. వీరరాజు దాన్నిచూసి మరింత మండిపడ్డాడు. ఆంగ్లేయులను విమతస్థులు, పరదేశీయులు అని నిందించి వాళ్ళను మన భారతదేశంనుంచి తరిమిగొట్టెయ్యాలి, ఓ మా ప్రజలారా! తిరుగుబాటు చెయ్యండి అని ఒక చాటింపువేయించాడు.

ఫాల్గుణమాసం మొదటివారం బెంగుళూరునుంచి సేనాని ఫ్రేసరు, సేనలోని మూడు దళాలనూ, ముగ్గురు నాయకులఅధీనంలో వాళ్ల వాళ్లమార్గాలలో నడిపించి, తాను ఉపసేనాపతి లిండ్సేతోబాటు ఓ సైన్యాన్ని నడిపించుకొంటూ, శ్రీరంగపట్టణంమీదుగా డిరియాపట్టణానికి పోవడానికి ప్రయాణం సాగించాడు.

# 127

బిడ్డ రాజుకు చిక్క రాజభవనానికి వచ్చినరోజు, పాపను తనచేతికి తీసుకొన్న రాణి తాను ఏదో నాటకంలో తన కిష్టంలేనిపాత్రమ వహిస్తూవున్న ఓ వ్యర్థపు గుడ్డబొమ్మ అనే భావాన్ని అనుభవించింది.

దేవమ్మాజి చెఱలో వున్నప్పుడు, ఆమె పెనిమిటి ఆమెను చూడడానికి తాను ఒప్పు కొన్నమాట నిజం. రాజు క్రౌర్యాన్ని తనవల్ల అయినంతవరకు తగ్గించి, ఆడపడుచును దయతో చూడటం ఆమె ఉద్దేశం. ఆ ఉద్దేశం ఆమెమనస్సు ఏర్పరచుకొన్న సీమలలో నిలవక, పొంగెత్తి ప్రస్తుతం ఈ సంకటంగా పరిణమించింది. ఆ తండ్రి తల్లి బిడ్డను దక్కించుకోవ డానికని ఇల్లువదిలేసి పారిపోయారు. అయితే వాళ్ళు పారిపోవడమే జరిగిందికాని బిడ్డ అపాయంనుంచి తప్పించుకొన్నది లేదు. వాళ్ళప్రయత్నం ఫలితంగా బిడ్డ మరింత అపా యానికి గురి అయ్యాడు. ఇప్పుడు తనచేతికి చిక్కాడు. తాను కాపాడాలి. కాపాడడం సాధ్యమే. తమరిని అందరినీమించి సమస్తం నడిపించేశక్తి ఏదోవుందని ఇదివరకు గమ నించడం అయింది. భవిష్యత్తూ అంతేనేమో! 'ఓంకారేశ్వరా! అంబా! మీరు సర్వస్వ దాతలు. గ్రహాలు మీ కనుసన్న మేరకు నడచుకొంటాయి. ఈబిడ్డమీద దయాప్రసారం రానీ. రాజుమీద కృపాదృష్టి ప్రసరింపనీ. ఆయనద్వారా ఈ పసిపాపకు అపాయం వాటిల్లనీకు తల్లీ. ఈవిధంగా అనుగ్రహించి ఈ ఇంటిని కాపాడు' అంటూ రాణి దైన్యభావం మూట గట్టినట్లు ఈశ్వరుని వేడికొన్నది. తన చేతనైనంతజాగ్రత్తతో బిడ్డను కాపాడుకోవాలి అని నిశ్చయించింది.

బిడ్డేమో రాణివాసంలో చిఱునవ్వువెన్నెలలు వెదజల్లుతూ పెరిగాడు. వచ్చినరోజుకూడ ఆ పాప తల్లికై ఆరాటపడ్డట్లు తోచలేదు. రాచరికపుబిడ్డ కావడంచేతనో ఏమోగాని! బీదల ఇళ్ళల్లో పాపకు తల్లి ఒక్కత్తే నూటికి నూరుపాళ్ళు దిక్కు! తల్లికి బిడ్డ నూరుపాళ్ళ ఆస్తి. భాగ్యవంతులఇళ్ళల్లో బిడ్డకు ఆశ్రయం తల్లికాదు దారి. అప్పంగౌళ రాజభవనంలో ముగ్గురు చెలికత్తెలచేతుల్లో పెరిగినపాప ఇక్కడవేరే ముగ్గురు చేడియలచేతుల్లో చేరింది; మడకేరి అప్పంగౌళే అన్నట్లు ఆడాడు. ఆ బిడ్డ లేజూపులు, తల్లిముఖానికి సంతోషాన్ని కలుగజేసి, వాటిని మళ్ళి వాంచింపజేసినట్లే ఇక్కడ తల్లిముఖంవంటి మరోముఖం ఆ బిడ్డదగ్గిరకువచ్చి నవ్వి, నవ్వించి బిడ్డను తనియజేస్తూవుంది.

దేవమ్మాజి విడిచినస్థలంలో రాజకుమారి వచ్చింది. దేవమ్మాజి చూపించకుండావుండే ఓ ప్రేమ విభ్రమంతో బిడ్డను ముద్దాడి ఆడించింది, లాలించింది. రాణివాసంలో ఒక పసిబిడ్డ

ఆడుకోవడం చాలాఏండ్లక్రింద. ఒంటరిగా ఏడుస్తూవున్నబిడ్డ రోదనధ్వనితో ఇల్లంతా మార్మోగుతోంది. ఈవిధంగాచూస్తే మనిషికో వ్యక్తిత్వమున్నట్లే ఇంటికీ ఓ వ్యక్తిత్వం, ఓ స్వంతఅస్తిత్వం ఉంటుంది. అది పసిబిడ్డనవ్వులకు తానూ నవ్వుతుంది, రోదనలకు తానూ కరిగిపోతుంది. దీనిలో తరతమభేదాలు లేవు. రాజగృహంకూడా తక్కిన సామాన్యగృహం లాంటిదే ఈవిషయమై చాలాకాలం గతించినతర్వాత లభించిన ఈ బిడ్డ సాన్నిధ్యంతో అంతఃపురంలో నవచైతన్యస్రవంతులు పొంగాయి. పెరిగినపెద్దవాళ్లే వుండేఇంటిలో చేటి పిలిపించుకోకుండా యజమానురాలిని మాటాడించదు. పిలిచినా తన అలంకారసంభ్రమంలో మాటాడేటట్లు వుండదు. యజమానురాలు అయినా పనీ పాటా లేకుండా చేటిని పిలవడానికుండదు. పిలిచి చేదియ వచ్చేటప్పటికి, తీరా దర్పంవిడిచి చనవుగా మాటాడేతీరు వుండదు. వీళ్ళమధ్య చిన్నారి పసిపాప ఒక్కడగనక ఊడిపడ్డాటో, జీవితం రంగేమారిపోయి వినూత్నకాంతులు చిమ్ముతుంది. ఏమీ కారణంలేకుండానే చేటిక పసిపిల్లదగ్గిరకూచొని నవ్వులు విరజిమ్మవచ్చు. మాటాడవచ్చు. దాన్ని ఆడించేనెపంతో తానూ ఆడవచ్చు. అట్లాగే యజమానురాలుకూడా తన యాజమాన్యదర్పాన్ని ఓ పాతచీరలాగా పక్కకునెట్టేసి, కేవలం ఓ పిల్లలాతయారై పిల్లతో ఆడవచ్చు. ఒక్కతల్లి వేదనసహించి కంటే, ఆ పసికూన నూరుజీవాలతో మాతృత్వ భావన రేకెత్తింపజేస్తుంది. తాను ఆడుకొనే కాస్తమేరలో గోడలమధ్య నలువైపులాకూడా నవజీవం రప్పిస్తుంది. చాలరోజులుగా ఇటువంటి జీవన్మ్రదమైన అనుభవాన్ని పోగొట్టుకొని మొండిగా బ్రతుకుతూవున్న మడకేరి రాజభవనం దేవమ్మాజి బిడ్డమూలకంగా, శిశు సౌభాగ్యానుభవాన్ని, తత్ప్రసూతానందానుభూతిని అపారంగా పొందింది.

రాజుకు ఒక్కనికిమాత్రం ఇదో సుఖంగా కానరాలేదు. రాణివాసం లోపలిభాగంలో ఎవరైనా బిడ్డను ఆడించినప్పుడు ఆయన శయ్యాగారంగదిలోకి ఆ ముచ్చటలు, ఆ కేరింతలు వినరావు. ఒక్కొక్కసారి పాపను ఆడించే చేటిక రాణివాసంలోని ఇటువైపు వాకిలి దగ్గిరకు తెస్తూవుంటుంది. దొర వినాలి, ఆయనకు వినబడాలి అనేఉద్దేశం లేకుండానే పాపతో ఆడుతూ, పాడుతూవుంటుంది. అటువంటిశబ్దం విన్నప్పుడు రాజుకు ఒకటే కోపం, ఒకటే తాపం! అరవైగడియల్లో ఓ గడియైనా ఆయన చెన్నబసవయ్య దేవమ్మాజి వీళ్లను మరిచి పొయ్యేది లేదు. తాను వాళ్ళకు ఏమైనా హాని కలగజెయ్యాలి అనేతలంపు అయనకు పోదు. వాళ్ళు తనవిషయమైచేసిన అపరాధాలు, మాటిమాటికి దొంతరలుగా అతనిఎదుట నిలబడతాయి. అవి ఒక్కొక్కటి అతన్ని గుండెలు పిండి నొవ్వజేస్తాయి. వాటిని స్మరించికొని పదే పదే, ఎద రోషకషాయితం చేసుకొంటాడు. 'తొత్తుకొడుకా! ఇక్కడవుండి నన్ను పాడు చేసింది చాలక పగ సాధించడానికని నాపై ధ్వజమెత్తివెళ్ళావా? కానీ మీకందరికీ రోగం కుదురుస్తాను. ముండల ముఠాకోరుని నువ్వు దేవుడు దేవుడు అంటావే, ఆ నీ దేవుడు మీ పాపను నాచేతికి అప్పగించాడు రండి, మీ తలకాయ ఏమిటిచేస్తారో చూస్తాం! వస్తే మీ

తలలు, లేకపోతే మీ బిడ్డ తలకాయ ఎగిరిపోక తప్పదు. మీరు తప్పించుకొంటే మీ బిడ్డ ఆయువు తీరిపోయినట్లే; నా కుక్కలకు కూడౌతుంది. రండముండాకొడుకా! కుక్కలు, పాములు కన్నట్లు కన్నారు మీ బిడ్డను మీరు. చచ్చి ఆ బిడ్డ మీ ఆయుర్దాయాల్ని కుంగదీయనీ' అని అనుకుంటూ వుండేవాడు. బిడ్డ ఆనందాన్ని భరింపలేక, ధ్వని వినబడకుండా తనగది లోపలిభాగంలోకి వెళ్ళిపోయేవాడు.

ఇంటికి, బిడ్డకు; రాజుకు, శుభమగుగాక అని దీక్షితునికిచెప్పి రాణి దేవాలయంలో పూజలు జరిగించింది. దీక్షితుని రప్పించుకొని ఇంకేమిచేయాలి అని ప్రశ్నించింది. చాలా సేపు నోరు తెఱవకుండాకూచొని చివరకు 'నాకు తెలిసినసంగతులన్నీ ఇదివరకే తమతో మనవి చేసుకున్నాను. నా తల్లీ! యమదంష్ట్రిక ఓవైపు. అమృతహస్తం మరోవైపు! ఓంకారేశ్వరుడు కరుణిస్తే అమృతహస్తం గెలుస్తుంది. బిడ్డకు భయంలేదు. మీ పుణ్యం సాధించలేని ఫలమా ఇది? మీరు ఆజ్ఞాపించినపూజ నడుస్తోంది. వేరే ఇంకా ఏమో చేయాలి అని నాకు అనిపించడంలేదు. మంచిదారిలో పెట్టు అని ఈశ్వరుని ప్రార్థించడమైంది. ముందూ ఇదే మనకర్తవ్యం' అని ఏమో చెప్పబోయి మౌనం వహించాడు. రాణి 'మరేమిటి? ఆజ్ఞాపించండి' అంది. దీక్షితులు 'లేదు. మరేమీ లేదు' అన్నాడు.

'అట్లాకాదు-మనస్సుకు తోచిందాన్ని తెలపండి. వీలైతే చేద్దాం.'

'రాజుగారి కాలుపట్టుకొని ప్రార్థించి బిడ్డను ఆ బిడ్డ తల్లిదండ్రులవద్దకు పంపించివేస్తే ఎంతమంచిదో నేను చెప్పజాలను. అయితే రాజుగారు దానికి ఒప్పుకోరు. యత్నంచేసి చూడండి; విఫలమౌతుంది; అందుకనే చెప్పలేదు.'

రాణి మాట్లాడలేదు. దీక్షితులు చెప్పింది నిజం. అప్పుడు చెప్పాల్సినప్రత్యుత్తరం ఏమీ లేదని భావించి ఆమె మౌనముద్ర ధరించింది.

## 128

రోజులూ, వారాలూ గడిచిపోయినతర్వాత బెంగుళూరునుంచి, మంగుళూరునుంచి ఉత్తరాలు వచ్చాయి. అక్కడికన్నీ ఉత్తరాలు వెళ్ళాయి. ఈ ఉత్తరాలసంగతి, రాజుకు, బసవన్నకు, దగ్గిర రహస్యంగాపనిచేసే గుమాస్తాకు ఒకనికిమాత్రం తెలుసు. మిగిలినవాళ్ళ కెవరికీ ఏమి నడుస్తోందో తెలియదు.

'కడుపున పుట్టినబిడ్డను చెప్పడానికి వీలులేని అపాయానికి గురిచేసి దేవమ్మాజి ఎడంగా వుండలేదు. ఏమైనాగాని పెనిమిటిని ఒప్పించి, సాధ్యమైతే అతన్ని పిలుచుకొని, కావిపక్షిన ఆయనను విడిచిపుచ్చి, తానొక్కత్తే వెనక్కుతిరిగి వస్తుంది' అని రాణి హృదయాంత రాళంలో ఒకే ఒక ఆశారేఖ మిగిలివుంది. బైటినుంచివచ్చిన ఉద్యోగస్థులను చెఱపెట్టించి రాజా బిడ్డను బలవంతంగా పట్టివుంచినమాట తెలిసింతర్వాత, ఈ వివాదం ఇంతదూరం పెరగ నిచ్చినవాళ్ళు ఇక్కడకు రారు అనిగ్రహించి బిడ్డనుగూర్చి ఆమె తల్లడిల్లింది. దీక్షితులు సూచించినట్లు రాజాను వేడికొందామని మనస్సులో ఊహించింది.

రాణికి తెలిసినట్లే, రాజా ఉద్యోగస్థులను, చెర పట్టించింది, బిడ్డను బలవంతంగా పట్టి వుంచింది, ఊరివారికెల్లా తెలిసింది. దేశమంతటా ప్రాకిపోయింది. ఇదేదో విషమసమయం దాపురించింది అని అందరిమనస్సుకూ తట్టింది.

అందరిదీ ఒక్కటే ఆలోచన. రాజా మొండిపట్టుపట్టి ఆంగ్లేయులతో స్పర్థ పెంచితే వాళ్ళు దండెత్తివచ్చేమాటే నిజం. వాళ్లు అట్లాచేస్తే రాజా బిడ్డనూ, ఉద్యోగస్థులనూ చంపిం చినా చంపించినవాడే. విదేశీయులువస్తే దేశంలో అవ్యవస్థ ఏర్పడుతుంది. ఇప్పుడంతా తీరుగా సువ్యవస్థితంగావుందని అర్థంకాదు. లేకపోయినా రాజభవనం, మడకేరిలోచేసే అవివేకానికి ఓ హద్దు వుంది. దేశం మొత్తంమీద ఒకజీవితం నడుస్తుంది. పరాయివాళ్ళు వచ్చి చేసే అవ్యవస్థలో ఎవరూ తమఇంట్లో తాము నిశ్చింతగాఉండటానికి వీలులేదు.

ఇదంతా నిజమేననుకోండి. అయినా దీన్ని తప్పించడానికి ఎవరు ఏమిచేయగలరు? ఇటు వంటిసందర్భాల్లో జీవితం అనేది విధాత వ్రాసిపెట్టిన ఓ నాటకంలా అనిపిస్తుంది. కవి వ్రాసి ముగించి ఆడు అని చేతికిచ్చిన నాటకం; నటుడు దాన్ని అభినయించడంతప్ప వేరే చేయ గలిగింది లేదు. దీన్నే పూర్వం వాళ్లు విధిలిఖితం అనడం. అడవిమధ్యలో రాజమార్గంలో బైలుదేరినరథాన్ని ఎదుటికి పులివచ్చింది అని అడవికి పట్టించరాదు. మార్గంపైనే తోలాలి. జీతంలోనిమార్గమూ ఇంతే. రథానికి జీవితానికీ ఒకటే వ్యత్యాసం. పులికి భయపడి రథం నిల్చినచోటనే నిల్చిపోవచ్చు; జీవితంలో చిక్కుపడ్డవాళ్ళకే అదృష్టం లేదు.

జరిగినసంగతి బిడ్డకూ, ఉద్యోగస్థులకేకాదు, రాజాకూ అపాయకరమైందేనని అనే కులు గ్రహించారు. వీళ్ళల్లో ఉత్తయ్యతక్క ఒక్కడు. మడకేరిలో పొగరుబోతుల చేతి నుంచి తినదగ్గ దెబ్బలు తప్పించుకొని, ఓరోజు బోపణ్ణ ఇంట్లోవుండి 'తక్క' తనఊరికి వెళ్ళిపోయాడు. తర్వాత నడిచినవృత్తాంతం ఒక్కటొక్కటిగా అతనిచెవిలో పడ్డాయి. ఉద్యోగస్థుల నిర్బంధంవార్త తెలిసినప్పుడు ఆయన తన లింగరాజస్మృతికి తెచ్చుకొని, ఈ పిల్లవాడు అడుగకపోయినా, నేను చెప్పేమాట చెప్పిముగించాలి అనుకొని దొరకు బుద్ధి చెప్పడానికని మడకేరికి వచ్చాడు.

కాకతాళీయంగా రాణి ఆదినం, కూతుర్ని దగ్గిరనిలబెట్టుకొని 'పుట్టవ్వా! నీకు ఓమాట చెప్తాను. నువ్వు దాన్ని అప్పాజిగారికి విన్నవించాలి' అంది.

'ఏం మాట అమ్మాజీ!'

'పసిబిడ్డ తల్లిని విడిచివచ్చి చాలారోజులై౦ది. పాపను దానితోటికి దాన్ని పంపమను తల్లీ.'

'అమ్మాజీ! పాప మనకేవుండనీ.'

'అవునసుకో చిట్టితల్లీ! వాళ్ళఅమ్మ ఇక్కడుంటే నిశ్చింతంగా వుండవచ్చు. అమ్మ చేయి తప్పించి మనం ఇక్కడ అడ్డే పెట్టుకోగూడదు. నన్ను తప్పించి, నిన్ను ఎవరైనా తీసుక పోతే?'

రాజకుమారి కొంచెంసేపు ఆలోచనలో పడ్డది. రాణినివిడిచి తానూ, తనమువిడిచి రాణీ, బ్రతకవచ్చుననేది ఆమెకు సాధ్యంగా కనబడలేదు. ఆమె 'అప్పాజికి చెప్తాను. అమ్మాజీ' అంది.

వీరరాజు మధ్యాహ్నం భోజనంముగించి తిరిగి మంచంమీద కాలుచాచి ఒరగి పడు కొన్నసమయంలో కూతురు తండ్రిదగ్గిరకు వచ్చింది. మంచంప్రక్కన మోకరిల్లికూచుని తండ్రి రొమ్ముమీద తలపెట్టి 'అప్పాజీ' అని పిలిచింది.

వీరరాజుకు ఈపాటిసుఖం ఇదొక్కటే. ఈ కూతురు 'అప్పాజీ' అని పిలిచేటప్పటికి, అతని జీవనాడులు ఉబ్బి తబ్బిబ్బయ్యాయి. ఈ తనకూతురికి ద్రోహం తలపెడుతున్నారనే, ఆయన తన చెల్లెలిమీద, ఆమె పెనిమిటిమీద ద్వేషాన్ని పెంచుకొన్నాడు. తనబిడ్డ ఆడదైన కారణంచేత ఈమెనువదిలి మగపిల్లడనే కారణంచేత చెల్లెలిబిడ్డను ప్రజలు దొర అని పిలుస్తా రేమోనని ఆయనభయం. ఈ కారణంచేత చెల్లెలిబిడ్డఅంటే ఆయనకు ఎక్కడలేని అసూయ. చెల్లెలు, చెల్లెలిపెనిమిటి పారిపోకుండా అప్పంగొళలోనే వుండివున్నా ఈ ఈర్ష్య పెచ్చు మీరినసమయంలో వీరరాజు తన మేనల్లుడి గొంతుపిసికించి పారెయ్యడానికే సిద్ధం! కూతురు వచ్చి దగ్గిరకూచొని ఎదకు తలఆన్చి 'అప్పాజీ' అని పిలిచేసరికి వీరరాజుకు అనిర్వచనీయ మైన ఆనందానుభూతి. ఆయన 'ఏమిటి తల్లీ!' అన్నాడు.

'అప్పాజీ! పసిబిడ్డ ఎంత అందంగా ఆడుతాడనుకొన్నారు?'

'ఊఁ!'

'అమ్మ కనబడక పాపం ఏడుస్తాడు. అప్పాజీ! పాపను అత్తదగ్గిరకు పంపించి వేద్దురూ!'

రాజకుమారి ఇంకా మాట ముగించనైనాలేదు. వీరరాజు ధూపంవేసిన చండికలా లేచి నిలబడ్డాడు. కూతుర్ని దూరంగా తోసేశాడు. 'ఎవరు నేర్పారు నీకు దీన్ని? పదు అవతలికి.

ఆ తొత్తు నిన్ను కన్నది నేర్పిపెట్టిందా? నడు, నడు చాలుచాలు' అని కేకలు వేశారు. కూతుర్ని కొట్టడానికి అన్నట్లు చేయి పైకెత్తారు.

రాణి వాకిలిఅవతల నిలబడివుంది. పెనిమిటి మొరగడం విని వేగంగా లోపలికివచ్చింది. కూతుర్ని కౌగిలించి, లాగికొని విశ్రామకక్ష్యకు, అక్కడనుంచి రాణివాసానికి పిలుచుకొని చక్కాపోయింది.

తండ్రి కేకలుపెట్టినసమయంలో రాజకుమారికి ఉక్కిరిబిక్కిరై పోయింది. అయన ఆమెను ఈవిధంగా గదమాయించి మాట్లాడడం ఇదివరకు ఎప్పుడూ జరగలేదు. అన్ని వేళలా, ప్రేమనే చూపించిన తన అప్పాజి పరాయివాళ్లమీద విరుచుకపడ్డట్లే తనమీద కారాలుమిరియాలు నూరి నడు, నడు చాలుచాలు అనేదాకా ఆమెకు ఇదంతా నిజమనికూడా అనిపించలేదు. ఓ అరక్షణంలో నిజమేనని తెలిసేటప్పటికి భయసంభ్రమాలతో ఆమెకు చేతులుకాళ్ళు ఆడలేదు. దూరానికితోసి కొట్టడానికివచ్చిన తండ్రి చేతిదెబ్బను తప్పించుకోవ డానికి తోచక ఆమె స్తంభీభూతురాలై నిలబడిపోయింది. మొదటిక్షణంలో ముఖంపై తోచిన ఆశ్చర్యమూ, భయమూ, చిత్రకమైనభావంలా ఆమె మొగంపై కొట్టవస్తూ కనబడింది. రాణి వచ్చి, గుంజి ఆమెను తీసుకొనివెళ్ళకపోతే రాజు కొట్టేసేవుండేవాడేమో! ప్రస్తుతం అది తప్పింది. తల్లివచ్చి తీసుకొనిపోయేసమయంలో రాజకుమారి తండ్రి ప్రవర్తనలోని క్రౌర్యాన్ని మనస్ఫూర్తిగా అనుభవించింది. తనతండ్రి తన్ను ఈవిధంగా చూస్తాడేఅని జాలి కలిగించే పరాభవంతో కుమిలింది. అంతకుముందు ఎన్నడూ అనుభవానికి రాని ఓ దుర్భరదుఃఖానికి లోనై, అపుకోలేక, వనవివనవి ఏడ్చింది. పాపంటే ఏమిటో తెలియనిపిల్ల ఇంక బ్రతక కూడదు అని అనుకొన్నది.

తనకోపంతో కూతుర్ని ఇంతకఠోరంగా ప్రవర్తించానని వీరరాజు గమనించలేదు. గమనిస్తే మరోవిధంగా ప్రవర్తించివుంటాడని కాదు. మనుష్యస్వభావమూ, అడివిమధ్య లోని రాజమార్గంవంటిది. వీరరాజు ఇట్లాకాకుండా వేరేవిధంగా నడచుకొని వుండొచ్చునని అనుకోవడానికి లేదు. రాజుకు ఆక్షణంలో తోచింది ఒక్కటే ఆలోచన. 'తాను ఇదంతా చేస్తున్నది ఈ కూతురికోసం. ఈమెవచ్చి తనకు బుద్ధిచెప్పడమా? ఈమె క్షేమాన్ని మరచి పోయి, ఈమెతల్లి ఈమె దాయాదికి సాయంగా నడుస్తుందా? తాను తెలియనివాడు. ఈ అపరిపక్వ బుద్ధులందరూ మహా తెలిసినవాళ్ళు!

# 129

రాజభవనంలో ఈ సంగతి జరిగిందని తెలియగానే ఉత్తయ్యతక్క దొరను చూడడానికి వచ్చాడు.

బైలుదేరివెళ్ళడానికిముందు తాను ఏం పనిమీద బైలుదేరింది తెలిపాడు; బోపణ్ణ 'ఊక దంపుడుపనికి బైలుదేరాడు. దంచినచేతికి అలపు. వెళ్ళిరండి' అన్నాడు.

తక్క రాజు విశ్రాంతికక్ష్యముందువచ్చి వాకిలిదగ్గిర నౌఖరుకు 'తక్క వచ్చారు అని రాజుగారికి చెప్పు' అన్నాడు. అతడు 'ఈపొద్దు వద్దు తక్కరూ; రేపురండి చూద్దాం' అన్నాడు.

తక్క కొంచెం ఆలోచించి 'అంతేనంటావా?' అని అడిగాడు.

'యజమానిమనస్సు ఈ ప్రొద్దు తిన్నగా లేదు.'

'బసవయ్య లేడా?'

'ఉన్నారు తక్కరూ: కొంచెం కూచుంటే వస్తారు.' ఇంతలోవల బసవయ్య వచ్చాడు. తక్కనుచూచి 'ఏమిటిలా దయచేశారు తక్కరూ?' అని ప్రశ్నించాడు.

'రాజుగారిదర్శనం చేద్దామని వచ్చాను. కొంచెం మాటాడాల్సిన పనివుంది.'

'ఏం మాటో చెప్పితే ఆయనకు తెలియజేస్తా. లేదా చూస్తామంటే అడిగిచెబుతా.'

వేరేసందర్భంలో అయితే తక్కరు అతనికి ఏం సంగతో చెప్పేవాడుకాడు. ఇప్పుడు ముసలాడికి అతనిసహాయం దొరకాల్సివుంది. అంచేత ఆయన అలవాటులోలేని ఓర్పు తెచ్చిపెట్టుకొని, 'రాజు చెల్లెలిబిడ్డను తల్లిదగ్గిరకు పంపించండి అని చెప్పాలి. ఈసంగతి చెప్పమని లింగరాజుగారు నన్ను ముందుకు తోస్తున్నట్లు వుంది' అన్నాడు.

తక్కరు రాజుకు ఈమాట చెప్పడం బసవయ్యకూ ఇష్టమే. తెల్లవాళ్ళతో పోటీపడి రాజు నాశనమైపోతాడని బసవయ్యకు ఇటీవల భయం ఎక్కువవడం మొదలైంది. ఆయన 'ఉండండి, చెప్పివస్తా తక్కరూ' అని రాజుదగ్గిరకు వెళ్ళాడు.

బసవయ్య దగ్గిరకువచ్చి వినయంతో నిలబడ్డ ధోరణిచూసి వీరరాజు 'ఏమిటి సంగతి?' అని అడిగాడు.

ఉత్తయ్యతక్కరు వచ్చివున్నారు. చూడాలంటున్నారు.'

'పడి ఏర్పాటైందిగా - ఇంకా ఏం కావాలిట!'

'చెల్లెలిగారి పాపనుగురించి మాట్లాడాలిట.'

'పాపను ఏం చెయ్యాలి అంటాడు. చంపించమంటాడా? బ్రతికించమంటాడా? చంపిస్తానంటే అతనిచేతికియ్యి, బ్రతికించమని మాతో చెప్పక్కర్లేదు.'

'తెల్లవాళ్ళు దండెత్తివస్తే మనకు పీళ్ళసహాయం కావాలిసివుంటుంది దొరా! అందరినీ చెడనాడుకోవడం మంచిపనికాదు. దానివల్ల సుఖంలేదు.'

'ఏమిటంటున్నావు?'

'మీరు చెప్పింది మంచిమాటే, చూస్తాం అంటే చాలు దొరా!'

'అట్లాగని నువ్వే చెప్పు. పీళ్ళంతా ఈమాట ఎత్తితే నాకు తల తిరిగినట్లౌతుంది.'

'ఇక్కడకు పిలుచుకొనితెస్తాను దొరా! చెప్పేదివిని, ఊకొట్టి, చూస్తాం అనిచెప్పితే సరిపోతుంది. మనపక్షం అవుతారు.'

'సరే! పిలుచుకరా. ఏం వాగుతాడో వాగిపోనీ.'

బసవన్న తక్కరుదగ్గిరకుపోయి పిలుచుకువచ్చాడు. రాజు గదిలో బల్లమీద కూచోమని చెప్పి 'దొరలకు వంట్లో ఆరోగ్యంగాలేదు. మీరు చెప్పేమాట చెప్పండి, వింటారు' అన్నాడు.

తక్కరు: 'సరేనప్పా! అట్లాగే అభ్యంతరంలేదు. లింగరాజుగారు మమ్మల్ని తమ స్నేహితులుగా భావించేవారు దొరా! మిమ్మల్ని మీ చెల్లెలిగారిని పసిపిల్లలుగా వున్నప్పటినుంచి ఎరుగుదుము మేము. పోతూపోతూ మీ నాయనగారు మాతో మేం వెళ్ళిపోతున్నాం ఉత్తయ్యా! మధ్యమధ్య పిల్లలమాట వీలైనంతవరకూ కనిపెట్టివుండు అన్నారు. మా మాట ఏమి నడుస్తుంది? మేం దూరంగా ఉండిపోయాం. మీరూ మమ్మల్ని పిలిపించాలేదు. మీ సేవ తప్పింది. ఆరునెలలక్రిందటవచ్చి తొందర కలుగజేసాం. పిల్లలమాట వచ్చింది. ఇప్పుడు తిరిగివచ్చాం. 'మీ తండ్రిగారువుంటే ఆయనే చూసుకొనేవారు. చెప్పేవారు. వారులేరు. మేము చెప్పవలసివస్తోంది.'

తక్కరు ఈమాటలుచెప్పి మౌనం వహించాడు. దొర తాను చెప్పిందాన్ని చెవిలో వేసికొన్నాడో లేదో అతనికి తెలియలేదు. వీరరాజు బసవన్నతో 'ఎందుకో! పెందరాడిముగించి వెళ్లిపొమ్మనమని చెప్పు' అన్నాడు. బసవన్న 'తక్కన్నతో 'చెప్పండి, తక్కరుగారూ! వింటున్నారు' అని చెప్పాడు.

తక్కరు: 'కన్నతండ్రికి కుమారుడు వేరు, కూతురువేరూ కారు. ఇంట్లో నూరుంటాయి, అన్నా చెల్లెలు దెబ్బలాడుకుంటారు. ఏంనడిచినా పెద్దవాళ్ళమధ్యనే వుండిపోవాలి. పసిపాప అంటే దేవుడితోసమానం. తల్లిమీదికోపంతో బిడ్డను అనాధగా చేయకూడదు.

రాజు ఏమీ మాటాడలేదు. ఆయన ఈపాటిమాటలు విని సహించుకొన్నదే బసవన్నకు ఆశ్చర్యం కలుగజేసింది. ఆయన తక్కరుతో 'బిడ్డను తల్లివద్దకు పంపించమంటారా?' అన్నాడు.

'ఔనప్పా! అదే మేం చెప్పేమాట.'

'మంచిమాటే. చూస్తాం అంటున్నారు దొరలు.'

రాజు ఏమీ మాటాడలేదు. చెప్పవలసినమాట చెప్పాం అని తక్కరు లేచాడు. బసవన్న అతన్ని పిలుచుకొని బైటికివచ్చి 'ప్రభువుగారికి వంట్లో ఆరోగ్యం సరిగాలేదు అని చెప్పానుగా. అందేత ఆయనేమీ మాటాడలేదు' అని సమాధానపఱిచి, అతన్ని పంపించివేశాడు.

# 130

రాజగృహంలో పసిపాపమాటపై రాజు మండిపడుతున్నాడని లక్ష్మీనారాయణయ్య ఇంటికి వార్త ప్రాకింది. ఇంతకుముందే సావిత్రమ్మ రాజభవనానికివచ్చి రాణితో పాపవిషయమై మాట్లాడింది. బిడ్డను తల్లిదగ్గిరకు పంపించివేయాలి అని రాణి వాంఛించినట్లే ముసలమ్మకూడా మనసా వాంఛించింది. ఇంతటి రాద్ధాంతమైన విషయంతెలిసి, ఆమె తానేపోయి దొరకు తన మనస్సులోనిమాట చెప్పాలని నిశ్చయించుకొంది.

సాయంకాలం అంతఃపురంలో గౌరమ్మాజి బిడ్డను ఆడిస్తూవున్నప్పుడు సావిత్రమ్మ వచ్చింది. తాను వచ్చినసంగతి రాణికి తెలిపింది.

రాణి: 'తప్పక వెళ్లి చెప్పు. మీ నాలుకచేసినపుణ్యం ఎట్లా వుంటుందో! కూతురిమాట విననేలేదు. అవ్వమాట అయినా ఇష్టం కానీ' అంది.

ముసలమ్మ పరిచారికను ఓదాన్ని వెంటబెట్టుకొని దొరగదిదగ్గిరకు వెళ్ళింది. రాజును చూడాలని బసవన్నతో చెప్పింది. అతడు 'ఆయనగారికి వంట్లో కులాసాగాలేదు. రేపు రండి అవ్వా!' అని చెప్పాడు.

'రేపు మీ రెవరో నే నెవరో! వచ్చానుగా పెద్దముండని. చూసిపోతానాయనా! దొరబిడ్డ వద్దని ఎప్పటికీ అనదు. పోయిచెప్పు.'

'ఏంమాట అవ్వా! అదేమిటో చెప్పు.'

'వేరే ఏం మాటుంది నాయనా! [1]దొరబిడ్డ చెల్లెలి పాపమాట.'

'అయ్యో! ఆమాట ఎత్తవద్దు. ఆయన ఇప్పటికే భగ్గున మండిపడుతూవున్నారు.'

'మండిపడితే నాకేమిటి? మండితే బూడిద అవుతుంది. పోయిచెప్పు. రా అనసి.'

ఈవిడమాటలు లోపల రాజుకు వినబడ్డాయి. ఆయన బసవన్నతో 'ఎవరితో ఆ మాట్లాడడం? ఏం సంగతి అది?' అని అడిగాడు.

---

1 సావిత్రమ్మ ప్రస్తుతం రాజైన చిక్క వీరరాజును దొరబిడ్డఅనే పిలుస్తుంది. వయస్సులో చాలా చిన్నవాడవడం ఇందుకు కారణం. —అనువాదకుడు.

బసవన్న దొరవద్దకుపోయి 'సాతమ్మగారు వచ్చారు. పాపవిషయం మాట్లాడాలిట. నేను వద్దనిచెప్పా.'

'అందు కేమంటుంది. పాప కావాలంటుందా ?'

సావిత్రమ్మ ఇంతలోకి తానే గదిలోకి వచ్చింది. దొరమాటమవిని 'పిల్ల కావాలి అంటే నాకు పుట్టేరోజులా పుట్టప్పావా ? శరీరం వడలిపోయింది. రొమ్ము ఎండిపోయింది. దొరబిడ్డ, దొరకూతురు పిల్లలను కంటూవుంటే చూడటం మా సంతోషం. కన్నపిల్లలను సాకికోండి అప్పా అని చెప్పడానికి వచ్చా. చెల్లెలి బిడ్డణ్ణి, తల్లిదగ్గిరకు పంపించివేయండి. పెద్దవాళ్ళకు మాటలుంటే వుండనివ్వండి, మధ్య పిల్లల్ని బాధపెట్టకండి' అంది.

ఉత్తయ్యతక్క మాటను ఎల్లాగో కష్టంమీద సహించుకున్న వీరరాజుకు ఈమాటలు విని ఓర్మి పీగిపోయింది. పడుకొన్నవాడు ఛెంగున లేచికూచొని ఆయన 'అవతలికి తోసెయ్యి ఈ ముసలిముండని. చెవిలో ఉచ్చపోసావు అంది ఓరోజు. ఇప్పుడు నోట్లో సీసం పోయిస్తాం అవతలికి వెళ్ళిపొమ్మనిచెప్పు. ఇహ మాదగ్గిరకు అడుగుపెట్టకూడదు' అని కేకలు వేశాడు.

రాజు తల తిరుగుతోందనిచెబితే బసవన్నకు మూర్ఛపోతాడేమోనని భయం. ఆయన దొర పాదాలమీదపడి 'దొరలు లేవకండి, పడుకొనేవుండండి. ఈసంగతి నేను చూసుకొంటాను' అని ఉపాయంగా ఆయన్నుపట్టుకొని పరుండబెట్టి సావిత్రమ్మకు నమస్కరించి దగ్గిరకువచ్చి 'మాట్లాడవద్దు' అని సన్నచేసి ఆమెను బైటకు పిలిచితెచ్చాడు. సావిత్రమ్మకు దొర ప్రవర్తనమీద కోపంకంటె ఆశ్చర్యం ఎక్కువ వేసింది. ముసలవ్వ 'ఈ రాజుమనస్సు చాలా చెడిపోయింది. దాన్ని ఈశ్వరుడే సరిదిద్దాలి. అతన్ని కాపాడాలి' అని అనుకొన్నది. ఏమాటా పలక్కుండా అంతఃపురానికివచ్చి జరిగినవృత్తాంతం రాణికితెలిపి తనఇంటికి వెళ్ళిపోయింది.

# 131

ముసలవ్వను పంపించేసి బసవన్న రాజువద్దకు వచ్చాడు. రాజు కోపంతో తనకుతానే స్వగతం చెప్పుకుంటూవున్నాడు. బసవన్నవచ్చి దగ్గిర నిలబడ్డాక 'రంకుముండ తొత్తుకూతురు, ఎప్పుడో పెద్దది అని ఇప్పుడుకూడా నాకు ఈమె పెద్దతికమా ? బోడిముండను పొమ్మనమని చెప్పావా బోడివి ! మా అల్లుణ్ణి మేం మా ఇష్టంవచ్చినట్లు చేసుకుంటాం. దీనికెందుకా మాట?' అన్నాడు.

బసవన్న: 'అవ్వ వెళ్ళిపోయింది దొరా! ఆమాట వదిలేపెయ్యండి' అన్నాడు.

'తెల్లవాళ్లను రేగగొట్టవద్దని నువ్వు మాకు చెప్పేపాటివాడివి. తండ్రిపోయిన నేను నీకు తండ్రివంటివాడినని ఆ ముసలాడు చెప్పాడు. చెల్లెలిబిడ్డను కాపాడుమని ఈ మొద్దు చెప్పుతోంది. మామంచితీరుకు వచ్చింది కొడగురాజ్యాధికారం!'

బసవన్న దొర కోపంతో మాట్లాడుతున్నట్లు గ్రహించాడు. ఏమీ జవాబు ఇవ్వలేదు. 'ఈ బిడ్డను ఏ తరహాగా పుట్టించాడో! అందరిమల్లే తోలుతోగాక బంగారంతోనా! బిడ్డ పొట్టలో వజ్రాలు, కెంపులు తాపించాడా! పొట్టచీల్చి చూపించాలి అందరి బిడ్డలాంటిదే అని.'

ఈవిధంగా రాజు నిమిషం రెండునిమిషాలపాటు, తనలో తానే కోపంతో మాటాడుతూ పడివున్నాడు. బసవన్న కొంచెంసేపు దగ్గిరగా నిలబడి ఆయనమాటలను వింటూ ఆతర్వాత బైటికిపోయి నౌకర్లతో 'ఓరీ! రాజుగారికి వంట్లో బాగులేదు. పిలుస్తున్నారు. దగ్గిరవుండండి; ఏమీ మాట్లాడకండి. అడిగితే నన్ను పిలవండి' అని ఆజ్ఞాపించి తనపనిమీద పోయాడు.

## 132

మధ్యాహ్నం కూతురిమాటమీద వెష్టవరి కేకలు పెట్టినప్పటినుంచే వీరరాజుమనస్సు అతనికి తెలియనివిధంగా వైకల్యం పొందుతూవుంది. అటువంటిసమయాల్లో అతడు చేసేకొ పనిఒక్కటి కొంచెం మధుపానం చేయడం. ఇవ్వాళ మామూలుకంటె ఎక్కువమోతాదులోనే మద్యాన్ని సేవించాడు. దానిఫలితంగానే వాడికకంటె హెచ్చైనదౌర్బల్యంతో బసవన్నమాట నొప్పికొని, ఉత్తయ్యతక్కను తిట్టకుండానే పంపించివేశాడు. తిరిగి ఇంత మద్యాన్ని సేవించి సావిత్రమ్మ వచ్చినప్పుడు షేచ్చేగి మేరమీరి ఆమెనుతిట్టి, వదలి, మరీ బొమ్మవిల్లిపోయాడు. ఈ ఆయాస ప్రయాసలమూలంగా ఆయనకు శరీరతాపం పెరిగింది. శరీరంలోని ఉష్ణంవల్ల మనస్సూ మరింత తపించిపోయింది.

తనకు ఈ యేడు కంసయోగం కదూ! మేనల్లుడు కృష్ణుడు మామైన కంసుణ్ణి హత మార్చాడు. తాను అల్లుడిచేతిలో చచ్చిపోతాననేకదూ దీక్షితులు చెప్పింది!

తాను చెల్లెల్ని ఎంతప్రేమగా చూసుకుంటూవచ్చాడు! ఆమె పెనిమిటి వొట్టి దుర్మార్గుడు. ఈ చెల్లెలు అతనితోచేరి తన్ను పీడిస్తోంది. విధిలేక తాను ఆమెను చెఱలోపెట్టితే దొంగతనంగా గర్భం తాల్చింది. ఈ బిడ్డను తగుదునమ్మా అని కన్నది. బిడ్డను దారిలోపారేస్తే పరాయివాళ్ళ ఆశ్రయంలో దూరింది. ఈ ముండమోపిని దండించకవదిలేస్తే గతి ఏమిటి?

దండించేతీరాలి; వాళ్ళేరీ? వాళ్ళు లేరు. వాళ్ళకుప్రతిగా దండించడానికికదూ ఈ బిడ్డను చేతిలో పెట్టుకోవాలిసింది?

దాయాదులను చంపి దొడ్డప్ప దొరగా వెలిగాడు. జ్ఞాతులనుచంపి అణచిపారివేయక పోతే అప్పటూ దొర అవడం సాధ్యం అయ్యేదికాదు. జీవించడానికి కాలేదు. దొరఅయి తాను దైర్యంగా బ్రతకడానికి వీలులేకపోయింది; దొడ్డప్ప కూతుర్ని చంపించాల్సివచ్చింది; కాబట్టి నట్టి దాయాదుల్ని నిర్మూలం చేయించాలిసేవుంటుంది.

ఇప్పుడు నూరార ప్రజలకళ్ళు తనమీదనే పడుతున్నాయి. తానుపోతే తనకూతురే సింహాసనం ఎక్కాలి. ఆమెకాదు, ఎక్కాలిసింది నేను అని ఈ పారిపోయిన చెల్లెలు చెప్పుతూవుంది. చెల్లెలుపెనిమిటి వత్తిమూడుకు, మా బిడ్డ ఈ కూన గద్దెనెక్కాలి అంటూ వాదిస్తున్నాడు.

చెల్లెలిబిడ్డ! తన కూతురంటూవుండగా ఈ చెల్లెలిపాపకు సింహాసనమా! ఈ పాపే రూపనామాలు లేకుండాపోతే సింహాసనం ఎక్కడం ఎక్కడిది? ఈ పురుగును ఏరి పారెయ్యాలి; పాప తండ్రికడుపుకు చిచ్చుపెట్టాలి.

కొంచెం కొంచెం వ్యవధానంగా మధ్యమధ్య లేస్తూ దొర ఓ గుటికెడుచొప్పున మధువు సేవిస్తూవచ్చాడు. వంటిలో జ్వరం ఎక్కువైంది. మనోజ్వరంకూడా దాంతోపాటు పెరిగింది.

రాత్రి పొద్దుపోయింది. రాజభవనంలో అంతా సద్దుమణగి నిద్రపోతున్నారు. దొరకు నిద్రలేదు. మగత నిద్రగావుంది. దానిలో అతనికో కల వచ్చింది.

తనప్రక్కన తండ్రి లింగరాజు నిల్చున్నాడు. ఎదురుగా చెల్లెలిపిల్లడు కూచునివున్నాడు. ఎవరో వచ్చారు. వెంటనే తనవైపుకు వచ్చారు. తన తలమీదనుంచి కిరీటం తీసికొనిపోయి దాన్ని బిడ్డనితలపై పెట్టారు. ఆహా! అని తాను చూస్తూవుండిపోయాడు. పిల్లవాని కోప్రక్క చెల్లెలు దేవమ్మాజి, మరోప్రక్క తండ్రి చెన్నబసవయ్య, వాళ్ళఎదుట మైసూరు రెసిడెంటు, తెల్లదొర పెద్ద.

రాజుకు ఈ ఆలోచన తానుగా నిర్మించుకొన్న మనశ్చిత్రమని తోచలేదు. ముందు జరుగబోతున్నదానికి ఇది ఉపశ్రుతి అని అతడు నమ్మాడు. పిల్లవాణ్ణి ఏమైనాసరే చంపి వేయాలి అని నిశ్చయించుకొన్నాడు.

ఈ నిశ్చయానికివచ్చి రాజు లోపలిగదిలోకిపోయి అర్ధచంద్రాకారంగావున్న పదునైన ఒక చురిక తీసికొని, నిశ్శబ్దంగానడిచి తన శయ్యాగారానికి వచ్చాడు. అక్కడనుంచి అంతః పురంలోకి వెళ్ళాడు. వాకిళ్ళలో నౌకర్లు కూచొని కునికిపాట్లు పడుతున్నారు. ఈయన వచ్చింది వాళ్ళు గమనించలేదు. రాజు మెల్లిగా రాణీగదిలోపలికి నడిచాడు. బైటిగదిలో కూతురు నిద్రిస్తూవుంది. మంచం క్రిందిపక్కగా చేడియ. మధ్యగదిలో పిల్లవాని తొట్టిమంచం.

దాపిలో పిల్లవాడు నిద్రిస్తున్నాడు. చేటి పక్కగా పరుండివుంది. మూడవగదిలో రాణి పడు కొని వుంది.

రాజు తొట్టిమంచందగ్గిర నిల్చున్నాడు. పిల్లవాణ్ణి తదేకదృష్టిగా చూశాడు. చురిక బైటికి తీసి బిడ్డగొంతుకుపెట్టి ఒక్క నొక్కునొక్కాడు. నిద్రాభంగమై కొంచెం చలించినట్లై నిశ్చేష్టుడయ్యాడు. నొక్కిపెట్టినకత్తిని బిడ్డ గొంతులోనేవిడిచి రాజు నిశ్శబ్దంగా అంతఃపురం నుంచి బైటపడి తన విశ్రామకక్ష్యకు వచ్చాడు.

అందరూ వాళ్ళవాళ్ళస్థలాల్లో కునికిపాట్లుపడుతూ తూగుట్లాడుతున్నారు. రాజు 'ఇట్లాగా వీళ్లు కావలాలు కాసేది' అనుకున్నాడు. తనగదిలోకి వెళ్ళిపోయాడు. కుర్చీలో కూచొని వెనక్కు ఒటిగాడు.

అప్పుడు అతనికి మనస్సులో ఏదో అలుకుపుట్టింది. ఆయన 'ఒరే బసవా! ఉన్నావా ముండమోపీ!' అని అరిచాడు

# 133

చెల్లెలిమీద, చెల్లెలి పెనిమిటిమీద ఎందేద్వేషం, కూతుర్నిగురించి రాణినిగురించి వుండే వేసట, ఉత్తయ్య సావిత్రమ్మలమీద వుండే క్రోధం, రాజు శరీరంలోని జ్వరంలాగానే అతని ధ్వనినికూడా వికారపఱచాయి. చెల్లెలి పిల్లడిని చంపడానికి అతడు మనస్సు రాయిచేసికొని పోయాడు. వెనక్కుతిరిగి వచ్చేసరికల్లా అతని అంతశ్చేతన వెంటనే ధైర్యం దిగనాడి తల్ల డిల్లడం మొదలుపెట్టింది. అతడు బసవన్నను పిలిచిన కంఠధ్వని ఎంతో క్షీణంగా, హీనంగా వుంది. బసవన్నకు ఏదో వికృతధ్వని విన్నట్లైంది.

మాట దొరదేకాని కంఠస్వరం ఆయనదికాదు. బసవన్న పక్కమీదినుంచి దిగ్గున లేచాడు. ధ్వనిలోని వికారానికి భయపడుతూనే దొరగదిలోపలికి నడిచివచ్చాడు.

రాజు తిరిగి 'వచ్చావా? కుంటీ!' అన్నాడు.

రాజువాడే 'కుంటి' శబ్దానికి ఏమీ విశేషార్థంలేదు అని బసవన్నకు తెలుసు. పసి పిల్లవాడుగా వున్నప్పటినుంచీకూడా రాజు ఈ చెలికాని కొన్నివేళల్లో కోపంతో కుంటి అన్నట్లే, మరికొన్నిసమయాల్లో హాస్యంగానూ, మరొప్పుడు ప్రేమతోకూడా ఆవిధంగా పిలుస్తూవచ్చాడు. ఆయన నోటివెంటవచ్చే ఈ శబ్దం ఇతనిచెవికి ఏ అర్థమూ ఇవ్వదు. బసవ అన్నట్లే అదీ ఓ పేరుగా వానిస్తుంది.

రాజు కంఠధ్వని మొదటే వికృతంగా వుంది. బసవన్న ప్రక్కగా నేలమీద మోకాళ్ళ మీద కూచున్నాడు. 'వచ్చాను ప్రభూ! ప్రభూ! వచ్చాను. జ్వరం ఎక్కువైందా? తాపమా?' అని అడిగాడు.

వీరరాజు: 'ఆ పురుగును తుదముట్టించి వచ్చానోయి' అన్నాడు.

ఈమాట బసవన్నకు అర్థం కాలేదు. జ్వరం హెచ్చింది, దొర అసంబద్ధంగా పేలు తున్నాడు, అనితోచి వీరరాజు నుదుటిపై చేయిపెట్టి చూశాడు. జ్వరం సామాన్యంగానే వుంది. నాలికను రెచ్చగొట్టే అంత జ్వరంకాదు. అతడు 'ఏమంటారు దొరా? నిద్ర పట్టిందా?' అని అడిగాడు.

'ఎన్నిసార్లు చెప్పాలోయి! చెల్లెలిబిడ్డను ముగించేసివచ్చాను.'

...ఇంతలో వీరరాజు కంఠధ్వని మామూలుధోరణికి వచ్చింది. బసవన్నవచ్చి దగ్గిర కూచొని ఆయనజీవాలకు కొంతధైర్యం పోశాడు. ఆయనమాటలకు బసవన్న స్తబ్ధు డయ్యాడు. 'అయ్యో! దొరా!' అని గాబరాగా అన్నాడు.

'ఎందుకో యీ భయపడిచావడం. 'అయ్యో!' ఎటువంటిదోయి! పోయిపడివుండు.'

రాజు కంఠస్వరం చాల దృఢంగావుంది. బసవన్న లేచి బైటికివచ్చాడు. తన పడకమీద కూచున్నాడు. పడుకోలేదు.

'వీరరాజుకు చెల్లెలిమీద ఆమె పెనిమిటిమీద చెడ్డకోపంగా వుంది. దానికి ఈ పసిపాప బలి అవుతాడేమో. ఆయన పిల్లవాణ్ణి ఏవిధంగా హింసపెట్టుతాడో, చంపే పారేస్తాడేమో' అని పాప చిక్కినప్పటినుంచీ బసవన్న సందేహిస్తూనే వున్నాడు. చంపించడమే అయితే ఆపని తనకే అప్పగిస్తాడు. దాన్ని ఎట్లా సాధించడమా అనికూడ అతడు ఒకటి రెండుసార్లు ఆలోచించాడు. ఇప్పుడుచూస్తే రాజుకోపం అతనినే హంతకుడినిగా చేసేసింది. మితిలేని కోపాన్ని 'చండాలకోపం' అని పిలవడం బసవన్నకు తెలుసు. ఇదేకాబోలు ఆ పదాని కర్థం. రాజు తానేపోయి బిడ్డను చంపివేయడం!

ఎట్లాగో తాను ఈ పనిచేయడం తప్పింది. అంతమట్టుకు మంచిదనైంది. ఇట్లాగని బసవన్నమనస్సులో ఓ మూల ఓ విధమైన మనస్సమాధానం తలసూపింది. బిడ్డను చంపించు అని ఆజ్ఞాపిస్తే బసవన్న ఆపని నెరవేర్చడానికి జంకుతాడని కాని, అసహ్యించుకుంటాడని కాని కాదు. కాని ఏవగింపును సహించుకునే సేవకుడైనా, సహించుకోవాల్సిన అవసరం లేదంటే మంచిదైందనే అనుకుంటాడు.

మొదటిక్షణాలలోని ఈ ఆలోచనలు ముగియగానే బసవన్నకు రాజుచేసిన ఈ కృత్యానికి పరిణామఫలితాలు ఏమిటా అని ఆలోచనవచ్చింది. నాడు నాడే రాజును తిట్టేమాట నిజం. పిల్లవాడిని వెనక్కుపంపిస్తే ఏ అపాయం వుండేదో లేందో, చంపడంమూలాన దానికంటె ఎన్నోరెట్లు అపాయం ఆహ్వానించినట్లైంది. చెల్లెలు, చెల్లెలి పెనిమిటి ఏనాడూ తన బలగం

కారు. అయితే వాళ్ళనెవరంటో ఆంగ్లేయులు ఇంకపైన స్నేహితులుకారు. రాజు రాజుగా ఎంతకాలం సాగిస్తాడో చెప్పడం కష్టం.

తన యజమాని ఈ అకృత్యం చెయ్యనే చేశాడు. తాను ఆయన్ను కాపాడేవిధం?

బసవన్నమనస్సు ఈ ఘట్టంలో దారి తెన్నూ కనబడకుండా తచ్చాడింది. అతనిప్రాణం తన యజమానికై అల్లాడుతోంది. రాజు చెడిపోతే తనస్థితి చెడిపోయినట్లే అనేభావన ఈ ఆలోచనలన్నింటిమూలంలో వుండివుండవచ్చు. కాని అది అంతరాంతరాలలో ఎక్కడో వుంది. మొదటిలో లేదు. ముందుకు రాలేదు. పైకి ఉబికిరాలేదు.

ఓ అరగడియపోనిచ్చి బసవన్న, అంతఃపురం వాకిలిలోకిపోయి జరిగిన అకృత్యాన్ని రాణికి చెప్పిపంపించాలని ఆలోచించాడు. మరుక్షణంలో అతనికి బహుశః రాజు ఈమాటను బుద్ధిభ్రమలో అనివుండొచ్చు, పిల్లవాడు క్షేమంగానే వుండివుండొచ్చు అనిపించింది. ఇంత వరకూ తోచని ఆ ఊహ ఆ క్షణంలో తోచి అతను 'ఆ ప్రభువు బిడ్డను చంపకుంటే ఎంత బావుంటుంది!' అని చెప్పడానికి వీలులేని మనస్సంతోషాన్ని అనుభవించాడు.

# 134

ఆ క్షణంలో అతని రాణివాసంలోనుంచి 'అయ్యో! అయ్యో!' అనే ఆర్తనాదాలు విన వచ్చాయి. పసివాడు రోజూ ఆవేళకు నిద్రనుండిలేచి ఏడ్వడం అలవాటు. రాత్రి తొట్టిమంచం ప్రక్కనే పడుకొనివున్న దాది నిద్ర మెలకువచ్చి, ఈపొద్దు బిడ్డ అలవాటుప్రకారం లేవలేదు, ఎంత ఒళ్ళెరుగనినిద్ర పోతున్నాడు అనుకొంది. పడుకొన్నపళానే తొట్టిమంచం ఓసారి ఊగించి ఇంకోపక్కకు తిరిగి పండుకొంది.

అదేసమయానికి రాణీకి మెలకువవచ్చింది. ఆమె దాదిని పిలిచి, 'పక్క తడిసివుంటుంది వేరేగుడ్డ వేయి' అంది.

దాది లేచిచూచున్నది. హాపను మావింది. గొంతుమీద చురిక పిడి, దానిఅడుగున మెరుస్తూవున్న కత్తిమొన, చూసి ఇదేమిటో తెలియక బిత్తరపోయి వెంటనేలేచి నిలబడ్డది. ఏమైవుంటుందో అని మనస్సుకు ఒక్కసారిగా మెరిసినట్లై 'అయ్యో!' అని గావుకేక పెట్టింది.

ఆ మనస్సుకు వినబడ్డది, దాదిపెట్టిన ఈ కేక.

దాదికేకతో రాణిప్రాణం తల్లడిల్లిపోయింది. ఆమె ప్రక్కమీదినుంచి అమాంతం లేచింది. 'ఏమైందే?' అని అడుగుతూ తొట్టిమంచందగ్గిరకు ఒక్కపరుగున వచ్చింది.

దాది వెనకప్రక్కగోడ గూటిలో మినుకుమినుకుమంటున్న ప్రమిదదీపాన్ని కొంచెం పెద్దచేసి తీసికొని మంచందగ్గిరకు పరుగెత్తివచ్చింది. అర్ధచంద్రాకారంగావున్న చురిక పాప గొంతులోకిపోయి కూచుంది. ప్రక్కన నెత్తురు ముద్దగా బట్టపడివుంది. పాప చచ్చి పడి వుంది.

చురిక రాజు లోపలిగదిలోని ఆయుధాల్లో ఒకటి అని రాణికి స్ఫురించింది. ఆయనే వచ్చి పాపను చంపివేసివుంటాడు. ఆమెకు మాట్లాడటానికి నోరు పెగలలేదు. శిశుహత్య ఎంతటి ఘోరపాతకం; దీనికి ఏదో కఠోరమైన ప్రాయశ్చిత్తం వుంటుంది. ఇహ కూతురు గతేమిటో మించుకంటె మించినవేగంతో పడుగెత్తుతూ ఆలోచనలు మనస్సునుంచి దూసి కొనిపోయి, బుద్ధిని అంధీకృతం చేశాయి. ఆమె పడిపోవాల్సిందే. అతికష్టంమీద కూలబడి కూచుంది. తలపై చేతులుపెట్టుకొని దుఃఖంలో శిరోదఘ్నంగా మునిగిపోయినస్థితిని స్పష్టం చేస్తూవుంది.

దాది 'అయ్యో!' అని అరవడంచేత రాజకుమారికి నిద్రాభంగమైంది. పక్కగదిలోంచి ఆమె 'ఏమిటవ్వా! కేక పెట్టావు? పీడకల ఏమైనా వచ్చిందా?' అని అడిగింది.

క్షణంతాళి జవాబు ఏమీ రాకపోవడంతో లేచింది: కూడాలేచిన పరిచారకురాలితో తొట్టి దగ్గిరకు వచ్చింది.

దాది వంగి ఆమెచెవిలో 'బిడ్డ చచ్చిపోయాడు. ఎంపేశాడు నా తల్లీ!' అని ఉస్సురు మని ఏడ్చింది.

రాజకుమారి మాటను గ్రహించినట్లే, గ్రహించినా నమ్మకం కుదరనట్లు, మంచంలోకి మొహంపెట్టి చూసింది. కత్తిపిడి నుదుటికితాకి వెలుగుపడి వెనక్కు అడుగువేసింది. చచ్చి కళతప్పిన పాపమొగంచూసి 'అయ్యో!' అని అరిచింది; వళ్లు స్పృహతప్పి నేలమీద పడి పోయింది.

గదుల్లోనూ, వాకిటముందు ఎడివున్న నౌఖర్లందరూ ఒక్కసారిగా లేచారు. ఒకళ్లు, ఇద్దరుగావచ్చి ఇటూ, అటూ వాకిలిదగ్గిర గుమికూడారు. ఏమైందో ఒకళ్లవల్ల ఒకళ్లు తెలిసి కొని వాళ్ళల్లోవాళ్ళు గుసగుసలు పడుతూవున్నారు. రాణికి రాజకుమారికి చెడు వాటిల్లా లని ఎవరికోరికా కాదు. అంతకుమినహాయించి రాజును 'పాపిష్టిముండావాడు వీడు నాశనం కాను' అని శాపనార్థాలు పెట్టారు.

దుఃఖం మొదటివేగాన్నితట్టుకొని రాణి లేచినిలబడ్డది. దాదికి 'బిడ్డ పోయింది అని మాత్రమే చెప్పు. మిగతావిషయం నీకు పనిలేదు. మిగిలిన నౌఖర్లకూ అనవసరం. ఎవ్వ రడిగినా, ఎంతగా అడిగినా పాప పోయింది అనిమాత్రమే చెప్పాలి తెలిసిందా?' అంది.

దాది 'తెలిసింది అమ్మాజీ!' అని సమ్మతిసూచకంగా తల త్రిప్పింది. తనతోవున్న నౌకర్లకు 'తెలిసిందా అప్పా!' 'తెలిసిందా అవ్వా!' అని గట్టిచేసి అడిగింది. అందరూ 'తెలిసిందవ్వా!' అన్నారు.

రాణి దాదికి 'బసవయ్యకు కబురుపెట్టి రమ్మనమని చెప్పు. నౌకర్లు అందరూ వాళ్ళ వాళ్ళచోట్లకు వెళ్ళనీ' అని చెప్పింది.

బసవన్న రాణీవాసంవాకిలి బైటికివచ్చి ప్రతీక్ష సలిపాడు. రాణి చెప్పిపంపించిన క్షణమే వచ్చి సమక్షంలో నిలబడ్డాడు.

రాణి 'ఇది నీకు తెలుసా బసవయ్యా!' అని అడిగింది.

'దొరలు చెప్పారమ్మా.'

'సరే. దీన్ని తీసుకొనిపోయి మాయం చెయ్యి.'

'సరేనమ్మా!'

'తొట్టిమంచాన్నే పట్టించుకొని పో.'

బసవన్న ఒక నౌకరుకు సైగచేసి తొట్టిమంచాన్ని పట్టుకోమని సూచిందాడు. తామ ఓ చివరపట్టుకొని దాన్ని తీసుకొనిపోయారు. రాజకుమారి 'కందా' అంటూ ఒకేతీరుగా కలవరిస్తూ బిడ్డమీద పడబోయింది. రాణి ఆమెను పట్టుకొని ఆపింది; కౌగిలించుకొని తన గదిలోకి పిలుచుకొనిపోయింది.

బసవన్న తొట్టిమంచాన్ని బైటికి పట్టించుకొనిపోయాడు. చురికనుతీసికొని కడిగి తన దగ్గిర పెట్టుకొన్నాడు. పాప కళేబరాన్ని రాజభవనంలోని విలువైనవస్త్రాలతో కప్పిచుట్టి పూర్వరాజుల శ్మశానవాటికలో ఓ ప్రక్కన పూడిపించేశాడు.

# 135

పొద్దుపొడిచేసరికి ఊరిలో నాలుగువైపులా వార్త ప్రాకిపోయింది. రాత్రి గూఢచారులు ఇండ్లకుపోయి గుప్తంగా రహస్యం, రహస్యం అంటూ తమ ఇష్టులకు చెప్పినమాట, వాళ్లు గుప్తంగా వాళ్ళఇష్టులకుచెప్పగా మొత్తంమీద రాజా చెల్లెలిబిడ్డను చంపేసినమాట ఊరిలో వేలాదిజనానికి తెలిసిపోయింది. ప్రజల నాలుకలన్నీ రాజును శపించాయి.

రాజా ఈవిధంగా ఇంతదారుణం చేశాడన్నమాట చెవినబడగానే 'పాపిష్టిముండావాడు ఎంతపనిచేశాడు. పీడిఇల్లు నాశ....' అనబోయి ఒక్కొక్కళ్ళు రాణిని, రాజకుమారిని జ్ఞాపకంచేసికొని 'నాశనంకానూ' అన్న తమమాటను సగంలోనే విరిచేస్తూ వచ్చారు.

ఆ నోటా, ఆ నోటావద్ద ఈకథ ఉన్నదున్నట్లుగా యధార్థరూపంలో ప్రచారం కాలేదు. విన్నవాళ్ళ కల్పనాశక్తిని ఆధారంచేసికొని, కథ చిలవలు పలవలుమొలిచి, కొత్తకొత్త రంగులుదాల్చి పెరుగుతూ, మారుతూ ముందుకు సాగిపోయింది.

పేటలో ఓ మూలలో ఒకరు చెప్పినతీరు 'నిశిరాత్రి రాజులేచి కత్తితీసికొని బైలు దేరాడు. రాణిగారు అడ్డువచ్చింది. పోవే ముండకాన అంటూ ఆమెకు రెండిచ్చుకొని ఆయన ముందుకుపోయిందే తడవుగా బిడ్డను నరికేసిపారేశాడుట.'

మరొకడు: 'అయితే రాణిగారికి దెబ్బలు తగిలాయి అన్నమాట?'

ఇంకొకడు: దెబ్బలు తగులకుండా వుంటాయా?

దెయ్యంలాంటిమొగుడు కత్తిపెట్టికొట్టితే ఆమెదేమో అసలే బిక్కచిక్కిన ప్రాణం. [1]ఏడున్నరలో పడివున్నాదుట.

ఇంకోమూల ముగ్గురు ఆడవాళ్లు మాట్లాడుకుంటూవున్నారు. ఒకత్తె: 'రాజో! దెయ్యమో! ఎల్లా చేతులాడాయో చిగురు తుంచెయ్యడానికి? వీడి ఇల్లు నాశ... '

ఎదురుగావున్న ఆవిడ 'వద్దమ్మా! అనవద్దు. రాణి, ఆ పిల్ల ఏమితప్పు చేశారు గనక. ఈయనకు కీడుకావాలి అంటూ వాళ్ళకు కీడు తలవకూడదు.'

మూడో ఆమె: 'సరైనమాట నా అవ్వ! ఎవరినైతేమాత్రం మన మెందుకుగా తిట్టాలి? పెండ్లాం కూతురే వూరుకుంటే, వీధిలోవాళ్లం మనకేంటి గరజు? కందకులేనిదురద కత్తిపీటకా ఎక్కడన్నా?'

వేరే ఒకచోట నలుగురైదుగురు మనుష్యులు చేరారు. ఒకడు అన్నాడు, 'మంచి తీరుకే వచ్చింది. మంది బ్రదుకు! చెల్లెలిమీద కోపానికి మేనల్లుణ్ణి చంపే రాజు, నేమండగా ఆ కంసుడు ఎందుకు అన్నట్లుగా చేశాడు.

ఒకస్త్రీ కడుపై కష్టపడి కంటే, కూడదు అనిపిస్తుంది. మగవాడికి ఏమిటి తెలుస్తుంది. పాప అంటే వుండే కష్టం?'

వేరొకడు: 'ఇదేమిటవ్వా! మగవాళ్ళనందరినీ ఒకేరాశిలో పోశావు. ఎవ్వరో చేశారని, అందరూ అట్లా చేస్తారా?'

మొదటివాడు: 'చెప్పనీ. మేము మగవాళ్ళం నిజం. మాకు దుఃఖం తక్కువమాట నిజమే.'

ఇంకోవైపు వేరే నలుగురుమనుషులు నిలబడ్డారు. ఒకడు అన్నాడు. ఇంతపని చేసిన మీదట ఈయన దొరగా నిలబడి ఏలేది అబద్ధం.'

---

1 'ఏడున్నర' అంటే కన్నడంలో మతి చలించి ఉన్మాదావస్థకు దగ్గిరగా వుండుట అని అర్థం. 'సాడేసాత్' అనే హిందీప్రయోగాన్నికూడా ఇదే అర్థంలో వాడుతూవుంటారు కన్నడులు.

రెండోవాడు: 'మెల్లిగా మాట్లాడు అప్పా! మా తలకాయఏమో వగలేసుకొనిపోతోంది.'

మూడోవాడు: మొదటివానితో 'వారను ఎవరు వేలుపెట్టి చూపించగలరప్పా! ఆయనకు ఇదేమన్నా కొత్తా! ఏమిటి?'

మొదటివాడు: 'కొత్తేమీ కాదు; పాతేననుకో; వంపుగరోజు నాటకం చూశావా లేదా? దాన్ని ఆడించిన తెల్లవాళ్ళు కాస్తాకూస్తామంది మనుషులు కారు. ఈయన ఈ నాటకమంతా వాళ్ల లెక్క కట్టుతూనేవున్నారు. వడ్డీతో సహా మొట్టచెప్పేస్తారు. చూడు.'

# 136

ప్రజలు ఈవిధంగా మాటలాడుకుంటూవున్న సమయంలోనే ఊళ్ళోకి మరోవార్త వచ్చింది. రాజు ధిక్కరించి నడవడంమూలంగా తెల్లవాళ్ళు ఆయనమీద దండు పంపిస్తున్నారు. అది ఇప్పుడే నాలుగురోజులపాటు ప్రయాణంచేసి కొడగుకు వచ్చిచేరింది.

కొడగు మనది, దీనిమీద పరాయివాళ్ళసేనలు నడవడం మనకు అవమానం అనే భావం పట్టణంలో చాలమందికి లేదు. కొడగు రాజుది; తెల్లవాళ్ళువస్తే ఆయన్ను దండిస్తారు; దండించనీ మంచిదనే: చాలామంది ప్రజలభావన ఇదేప్రకారం హృదయాల్లో ప్రతిధ్వనిస్తూవుంది.

కొంతమందికిమాత్రం ఈ పరాయిసేనలు రావడం ఇష్టంలేదు. ఈ కొంతమంది ఊరిలో స్థితిపరులైన మోతుబరి ఆసాములు. బైటినుంచి వచ్చినసేనలు తప్పుదారినినడిచే దొరనేకాదు దండించడం, ఊళ్లోని ధనవంతుల ఇండ్లు దోచుకోనూవచ్చు. 'మా ఇండ్లుదోస్తే గతిఏమిటి?' అని ఈ వర్గంవారి చింత. ఇంకా కొంతమందికి 'ఇంట్లో ఈడువచ్చిన ఆడపిల్లలు ఉన్నారు కదూ! సేనలు ఇళ్లమీదపడితే మానం, మర్యాద మంటిపాలుగాకుండా నిలిచేదెల్లా?' అని విచారం.

రాజు సొమ్ము దోచడం, పడుచుపిల్లల్ని మానభంగంచేయడం వుండనే వుంది. అయినా ఆయన అవివేకం ఇప్పుడిప్పుడే కొంచెం తగ్గుస్థాయిలో వుంటూవచ్చింది. బలిగొని పొట్ట నింపుకొన్న పాత దెయ్యంపోయి అవురావురుమని ఆకలికోవున్న కొత్త భూతంవస్తే ఏమిటి క్షేమం?

భాగ్యవంతులు తమ ఆస్తులను, సొమ్ముల్ని భద్రపరచుకోవడం మొదలుపెట్టారు. ఆడపిల్లల మర్యాదకోరేవాళ్లు వాళ్ళను దేశంలోని లోతట్టుప్రాంతాలకు పంపించే ఆలోచనలు చేశారు.

చిక్కణ్ణసెట్టి రెండువార్తలూ విన్నాడు. ఈ దొరకాలం ఈపొద్దు సమాప్తం అవుతుం దని అనుకొన్నాడు. తోటి పెద్దమనుషులకు కబురుపెట్టి రప్పించుకొని 'మనము అన్నివిష యాల్లోనూ బోపణ్ణగారి ఆజ్ఞను చెల్లిస్తాం. రాజుగారు తిన్నగా చెప్పినమాట దేన్ని మన్నింప కూడదు; ఏమంటారు?' అని అడిగాడు. అందరూ ఈ సలహాకు సమ్మతించారు. పార్శ్వణ్ణ బోపణ్ణ ఇంటికిపోయి ఆయనకు తమనిశ్చయాన్ని తెలియజేసేటట్లు నిర్ణయించుకొన్నారు.

పార్శ్వణ్ణ బోపణ్ణ ఇంటికి వచ్చేటప్పటికి, ఆయన లక్ష్మీనారాయణయ్య ఇంటికి పోయి వున్నాడు. పార్శ్వణ్ణ ఇద్దరినీ చూసినట్లు ఔతుందని, తానూ అక్కడికే వెళ్ళాడు.

లక్ష్మీనారాయణయ్య ఇంటిప్రాంగణంలోని గదిలో బోపణ్ణ, ఆయన కూచున్నారు. సావిత్రమ్మ వాళ్ళకు ఏమిటో చెప్పుతోంది. పార్శ్వణ్ణ రావడంగమనించి మంత్రులు అతన్ని గదిలోపలికి రప్పించుకొన్నారు.

సావిత్రమ్మ పార్శ్వణ్ణకు 'శెట్టులు అందరూ కూడిపలుకోవడం అయిందా ఇంతవేగంగా పార్శ్వణ్ణ' అని అడిగింది.

'మా మాటలు ఎంతసేపు అవ్వా! శెట్టిగారు ఇట్లా ఇట్లా అని చెప్పారు. మేమంతా అట్లాగే అన్నాం. మంత్రులకు తెలియజేసి రమ్మనమని నన్ను పంపించారు.'

సావిత్రమ్మ: 'నేకు చెప్పుతూనే వున్నానప్పా పిల్లవానికి, బోపణ్ణకు; కాకూడనిపని అయింది. అతను చేసింది తప్పు. కాని ఆయనమీదికోపంతో మితిమీరి అతికిపోకూడదు. వ్రేలు పెంటకొక్కిందని కోసి అవతలపారేస్తామా? మీకూ అదేమాట. ఏమి చేయవచ్చు నని తోస్తుందో అది చేయండి. రాణీగారికి, ఆమె కన్నకూతురికి కష్టాలు రాకూడదు; ఆ విషయం ముఖ్యంగా చూసుకోండి' అనిచెప్పి బైటికి వచ్చింది.

ముసలవ్వ బైటకు వచ్చింతర్వాత లక్ష్మీనారాయణయ్య బోపణ్ణతో 'మనం చిక్కణ్ణ శెట్టికి కబురు పంపిందామనుకుంటుంటేనే ఆయనగారే పార్శ్వణ్ణను పంపించారు. మనమాట ఆయనకు చెప్పిపంపిస్తేసరి' అన్నాడు.

బోపణ్ణ: 'తెలుపండి అయ్యవారూ!'

లక్ష్మీనారాయణయ్య పార్శ్వణ్ణకు చెప్పాడు. 'రాజుగారు చేయకూడని దారుణం చేసే శారు పార్శ్వణ్ణ. ఇంక ఈయన్ను మనం రాజుగావుంచుకోవాలంటే ప్రజలు వొప్పుకోరు. ఈయనమీదికోపంతో తెల్లవాళ్ళు వేరేసేన తెస్తూవున్నారు. బైటిసేన దేశంమీద రావడం మంచిదికాదు. రాజుగారినే వేడుకోవాలి; సింహాసనంవిడిచి వేరేవాళ్ళకు రాజ్యం అప్పగించ మని. తెల్లవాళ్లను పొలిమేర అవతలనే నిలిపేయడానికి మనసేనను పంపించాలి. బోపణ్ణ, నేనూ ఈవిధంగా ఆలోచిస్తున్నాం. పేటజనం దీని కనుకూలంగా నడచుకోవాలి.'

'సరేనయ్యవారూ! శెట్టిగారు విన్నవించమన్నారు. ఇహముందు మేము దేనికైనా సరే బోవణ్ణగారిమాటప్రకారం నడుచుకొంటాం. రాజుగారు ఏమిచేయమనిచెప్పినా, మిమ్మల్ని అడగందే చేయం. మీరు ఈ పద్ధతి వొప్పుకుంటే చాలు.'

'సరేలే. అంతేగా బోవణ్ణా!'

బోవ: 'అల్లాగే!'

ఈ సంభాషణానంతరం 'పేటజనం అనవసరంగా భయపడనిరీతిగా చూసుకోండి' అని చెప్పి మంత్రులిర్వురూ పార్శ్వణ్ణను వంపించేశారు.

వాళ్ళు చెప్పకొనేమాటలు మధ్యలో ఆగిపోయినవాటిని లక్ష్మీనారాయణయ్య తిరిగి ప్రారంభించాడు. 'రాజుకు మన సూచనను బసవయ్యద్వారా చెప్పంపాలా అక్కర్లేదా?'

'అదే మంచిది. నేనుగా ఆయన్ను చూసేదిలేదు. ఈమాట చెప్పడానికి మీరుగావెళ్ళడం మంచిదికాదు. ఉన్నాడుగా కర్ణే-జపిత-చెవి మంత్రి-అతన్నే చెప్పనివ్వండి.'

'ఓవేళ ఆయన ఒప్పుకొంటే ఎవర్ని రాజుగాచేయడం? ఒప్పుకుంటే ఏమిటి చేయడం?'

'ఒప్పడనేమాటే నిజం.'

'అటువంటప్పుడు ఏమిటి చేయడం?'

'బలవంతంగా దింపుదాం అంటే ఇటు పదిమంది అటు పదిమంది పక్షం వహించడంలో గందరగోళం అవుతుంది. అది ఊరికి పీడ. ఇందుకే బైటివేనలు ఊళ్లోకిరావడం మంచిది కాదని చెప్పడం. ఆ సంకటంతప్పించి, ఈ సంకటంలోపడితే ఏమిటి నిర్వాకం చేసినట్లు?'

'ఔను బోవణ్ణా! మనదారి ఏమిటా అని మనం నిశ్చయించుకోవాలికదూ! ఏం చేయడం అనేది అనిశ్చితమైతే చాలా కష్టం. మనము ఎల్లప్పుడూ ఒకేచోట వుండం. ఒకళ్ళొకళ్లను సంప్రదించుకోవడానికికూడా వీలుచిక్కదు. మీ మనస్సు మాకుతెలియక మా మనస్సులోని మాట మీకుతెలియక ఎగుడుదిగుడైతే సుఖం లేదు.'

'మొదట మనమాట బసవన్నకు చెపుదాం. అతన్ని రాజుగారికి చెప్పనీ, ఏమంటాడో తెలియనీ! ఆమీద తిరిగి మాట్లాడుదాం.'

అట్లాగే కానీ బోవణ్ణా! నేను మీ అంతవేగంగా నిశ్చయానికివచ్చే మనిషినికాను. ఈసంగతి జ్ఞాపకం పెట్టుకోండి. నేను ఎల్లాగో నడుచుకోవాలో ముందే మీరు నాకు తెలియజేస్తూ వుండాలిసుమా!'

'తొందరలేదు. అట్లా ఏమీకాదు అయ్యవారూ! మీ గుండె మెత్తనైంది. రాజుగారు అంటే మీరు కొంచెం కరగిపోతారు. నేను చట్టాతిబండను.'

'రాయీకాదు రప్పాకాదు బోపణ్ణా! మీరు న్యాయమాలోచించి నడుస్తారు. నాది కొంచెం దాక్షిణ్యప్రకృతి. అయ్యోపాపం అని పోయి ఒక్కొక్కప్పుడు న్యాయం మరిచి పోతూవుంటాను. రాజ్యం నడపవలసిన నాయకుడు మీవలె ఉండాలి. నావలే కాదు.',

'గొప్పవారు; నా పెస్సుతట్టి మంచివాడిని అనండి; నేను నాచేతనైన మంచిచేస్తాను.'

'అదే నా నమ్మకమూను! ఏంచేస్తారో అది మొదట కాస్త నాచెవిలో పడేస్తూవుండండి: అంతే.'

'ఆ వేళప్పుడు ఆ క్షణాల్లో ఏమోచూసి, ఏమో అడిగి ఇట్లా చెయ్యాలి అనే నిర్ణయానికి నేను వస్తూవుండాలి, అప్పుడు మీరు దగ్గరవుంటే తప్పక తెలుపుతాను అయ్యవారూ! లేక పోతే చెప్పడానికి వీలుపడదు. సరి అని నాబుద్ధికితోచిందాన్ని చేసివెయ్యాల్సి వస్తుంది.'

'సరే బోపణ్ణగారూ! మీరేమి తెలియనివారా? తొందరపాటు కలవారుకారు, మంత్రి అయినవాడు ఏంచేసినా వేలాదిజనానికి తెలిసిపోతుందనే సత్యాన్ని గుర్తించినవారు. ప్రస్తుతం దేశానికిఉన్న ఏకమాత్రదిశా నిర్దేశకులు మీరే. ఈశ్వరుడు మిమ్ములను సన్మార్గంలో నడి పించుగాక!'

'అవి సరే అయ్యవారూ! మీరు ఆశీర్వదించండి. ఆశీర్వదించమని అవ్వగారికి చెప్పండి. మీరు అనేటట్లుగా నేను దేవుడు దేవుడు అంటూ కూచోను. అయితే మంచిదారిగా వుండాలి అనిమాత్రం అంటాను. మంచిదారి కనబడనీ. దానిలో మీ ప్రేమ నాపై ఉండనివ్వండి.'

'బోపణ్ణ ఇంటికిపోయి బసవన్నకు కబురుపెట్టాడు. బసవన్న వెంటనే వచ్చాడు. బోపణ్ణ అతనికి తమకోరిక తెలిపి 'ఈవిషయం రాజుగారికిచెప్పి వారు ఏమంటారో వచ్చి మాకు చెప్పాలి' అన్నాడు.

బసవన్న అడ్డువుల్ల ఏమీ వేయకుండా అసాధారణమైన వినయంతో 'సరే మంచిది. విన్నవంచేసి చెబుతాను' అని రాజుగారి ఇంటికేసి వెళ్లాడు.

# 137

తాను చెప్పినమాటకు బసవన్న ఏమీ అడ్డుచెప్పకుండా ఈప్రకారం నడచుకొంటాడని బోపణ్ణ భావించివుండలేదు. చెప్పినమాటంతావిని ఒకేమాటలో జవాబిచ్చి లేచేటప్పటికి ఆయనకు ఆశ్చర్యం వేసింది. బసవన్న ఏమైనాచెబితే ఈయన వింటాడనికాదు. బోపణ్ణ బసవన్నను

రాజుకు విన్నపాలు మోసేనౌఖరుగా అంగీకరించదానికి సిద్ధం. ఇటువంటివిషయాన్ని తనతో చర్చించడానికి యోగ్యతగల అధికారిగా అంగీకరించదు. అతదేమైనా అధికప్రసంగంచేస్తే అతనితో 'ఈమాట రాజుగారికి చెప్పేఅంతమట్టుకే నీపని. పైమాటలు నీకు వద్దు' అని చెప్పాలిసివస్తుంది అని బోవణ్ణ మనస్సులో గుణించుకొన్నాడు. అటువంటి అవసరం ఏర్పడ లేదు. అదే అతనికి ఆశ్చర్యం!

బసవన్న బోవణ్ణమాటలను విన్నరీతి, ఎవరికైనా ఆశ్చర్యం కలిగించదగ్గదే; దానికి కారణం కావలసినంత వుంది.

పాప కళేబరాన్ని పూడ్పించి బసవన్న తెల్లవారుజామునే రాజు విశ్రాంతికక్ష్యకు వచ్చే సమయానికి వీరరాజు 'కుంటి ఎక్కడనో' అని పిచ్చిపిచ్చిగా కేకలేస్తూవున్నాడు. నౌఖర్లు దగ్గిరకుపోయి ఏమికావాలి అని అడగడానికి భయపడివచ్చిపోతున్నారు. ఏం చేయదానికి తోచక కొయ్యల్లాగా నిలబడిపోయారు. రాజు 'దీన్ని ఇక్కడకు ఎందుకుతెచ్చావు. అవతలికి తీసుకొనిపో' అంటూవున్నాడు.

బసవన్నవచ్చి దొరదగ్గిర నిలబడ్డాడు. వీరరాజు. 'ఎక్కడకుపోయాడో కుంటిముండా వాడు? దీన్ని ఇక్కడకు ఎందుకుతెచ్చాడు?' అని ప్రశ్నించాడు.

'దేన్ని ప్రభూ!'

'ఆ గోడచివర చూడు. అక్కడ ఎవరు దీన్ని పెట్టినవాళ్లు? అక్కడ ఎందుకు పెట్టారు?'

బసవన్న దొర చూపించినస్థలం చూశాడు. గోడచివరలో ఏమీలేదు. దొరకు మగతో లేక బుద్ధి భ్రమించిందో-అంతే. ఇటువంటివిషయాల్లో బసవన్నబుద్ధి అతిసూక్ష్మంగా పని చేస్తుంది. ఆయన ఆలోచన చాలా వేగంగా పరువులుతీస్తుంది. అతడు రాజుతో 'దాన్ని తీసి పారేశాను ప్రభూ!' అని జవాబు ఇచ్చాడు. దొరగారిస్థితి నౌఖర్లకు తెలియకుండా వుండాలి అని 'దొరగారు కోపంగా వున్నారు. అంతా దూరంగావుండండి' అని అందరినీ విశ్రాంతి కక్షకు బైటవసారా వాకిలిదగ్గిరకు పంపించేశాడు. తిరిగిపోయి దొరదగ్గిరసా నిలబడ్డాడు.

దొర: 'అక్కయ్య వచ్చిందేమో? ఎవరు నీపక్కన?' అని అడిగాడు.

ఇదీ భ్రాంతితోకూడిన మాటే. బసవన్న రాజుకు 'రాలేదు దొరా! చెప్పంపించనా?' అన్నాడు.

'చెప్పంపించడం ఎందుకు? ఇక్కడనే నిలుచుంది. ముసుగువేసుకొని ఏడుస్తోంది.'

ఎవరినో ఓదారుస్తున్నట్లు బసవన్న 'ఏడవకమ్మా! దొరలు నొచ్చుకుంటారు. ఇటు ప్రక్కకురా అమ్మా!' అని ఎవరినో పిలుచుకొనిపోతున్నట్లు వాకిలిదగ్గిరకుపోయాడు. ఓ సేవకుణ్ణి పిలిచి 'ఓరీ! పోయి అమ్మణిగారికి విన్నవించేయి. రాజుగారికి జ్వరం హెచ్చింది అను. ఓ నిమిషంపాటు ఇక్కడకు రమ్మనమను' అని ఆజ్ఞాపించాడు.

అతడు తిరిగి మంచందగ్గిరకువచ్చాక వీరరాజు 'తీసుకొనిపోయాను అన్నావు. అక్కడే విడిచిపెట్టావా? ముండమోపీ!' అని మొదటిలాగానే గోడవైపు తల ఆడించాడు.

రాణి వేగంగా అడుగులుపెట్టుతూ గదికి వచ్చింది. వచ్చీరావడంతోటే కాతరస్వరంతో 'ఏమైంది బసవయ్యా!' అని అడిగింది.

బసవన్న: 'కొంచెం చూడమ్మా' అన్నాడు.

రాణివచ్చి మంచంప్రక్కన నిలబడి వంగి దొరను చూసేసరికి ఆయన 'ఒరేయి! ఈమెను ఇక్కడకు ఎందుకు పెట్టావు? ఈ ఇంటికి ఈమె ఎందుకు వచ్చింది?' అని పేలాడు.

రాణికి వెనకముందులు తోచలేదు. బసవ సైగలతో ఆమెకు 'కొంచెం వింటూ వుండండి' అని సూచించాడు. రాజుతో 'తెలియకవచ్చేశారు దొరా! పొమ్మనమని చెబుతా' అన్నాడు.

'దీని తండ్రిపెట్టినసొమ్ము దీంది కాదు. రాజకుటుంబానిది. పెట్టింది తిని పడివుండమని చెప్పు. చెయివిడిచి బైటికివస్తే గుండుతో ఎగరగొట్టేస్తాను. గుండుతో కొట్టేస్తాను. గుండుతో!'

'చిత్తం ప్రభూ!'

'దీన్ని తీసుకొనిపోయి అవతల పారెయ్యి. ఈమెను ఏడ్వవద్దని చెప్పు. మొగం ముసుగేసుకొంది. దొంగముండ! ఎవరికో తెలియదనుకుంటోంది.'

# 138

ఇదంతా వినేటప్పటికి, రాణికి అతనివరిస్థితి తెలిసింది. ఆమెమొగం వాడిపోయింది. ఇంకేమిటి గతి అని ఆమె విలవిలలాడిపోయింది.

రెండునిమిషాలు ప్రక్కవక్కన నిలబడివుండి వాకిలిదగ్గిరకువచ్చింది. ఆమె బసవన్నను సైగచేసి బైటికి రమ్మనమని చెప్పింది. తనమాటలు దొరకు తెలియకుండావుండేటట్లు, అయినా అతడు పిలవగానే వెంటనే అతనిదగ్గిరకు రావడానికివీలుగా శయ్యాగారానికి బైటవాకిలిదగ్గిరనిలబడి బసవన్నతో 'వైద్యుడు అలవాటుప్రకారం రావడానికి ఆలస్యం కావచ్చు. ఆయనను వెంటనే పిలిపించు. కొంచెం చల్లని ఔషధం ఇమ్మనమను. కలవరింత

రెండుగడియలుతప్పితే నయం కావచ్చు' అంది. బసవన్న: 'సరేనమ్మా! నేనుపోయి ఈవని చూస్తాను. కొంచెం ఇక్కడ వాకిట్లోవుంటే' అన్నాడు.

రాణి: 'మంచిది. మేమో, నువ్వో ఒకరు తప్పితే ఒకరు ఇక్కడ వుందాం. వైద్యులు రానీ, చూడు' అంది.

'నౌఖర్లకు ఇది తెలియరాదని దూరంగా వుంచానమ్మా.'

'మంచిపని చేశావు. జ్వరం ప్రకోపించింది. కోపంతో ఏమైనా మాట్లాడుతారు. దూరంగా వుండమని చెప్పు.'

'పుట్టమ్మాజీ ఇక్కడికి రాకూడదమ్మా! దడుసుకొంటారు.'

'ఔను. అట్లాగనే చెప్పు. వైద్యుని వెంటనే రప్పించు.'

'బసవన్న చెప్పిపంపించిన ఓ గడియలో వైద్యుడు వచ్చాడు. రాణి చెప్పినప్రకారం రాజుకు ఉపశమనంగా వుండటానికి ఓ శమనౌషధాన్ని నీటిలోకలిపి త్రాగించాడు. రాజు దాన్ని పుచ్చుకొన్నాడు. గదికిదైటగా శయ్యాగారంలో కూచున్నాడు. రాణి తన లోపలివరండాకు వెనక్కు తిరిగిపోయింది.

బసవన్న వైద్యునితో 'ఈవిషయం పైకిపొక్కితే శిరశ్ఛేదమే వైద్యుడుగారూ!' అన్నాడు.

వైద్యుడు: 'మేము రాజభవనానికి పాతకాపులం బసవయ్యా! రాజభవనం నౌఖరు అన్నతర్వాత తప్పులేకుండానే తల పిండన. మాకీ సంగతి బాగా తెలుసు' అన్నాడు.

బసవన్న నవ్వాడు. వైద్యుడు వాకిలివద్ద కాపలావుండి రెండునిమిషాలలో ముగించు దానికి వీలైన తనపనులను చూసికొనిరావడానికి ప్రాంగణంలోకి వెళ్ళాడు.

వైద్యునిమందుతో రాజుకు ఓ విధమైన మగతనిద్ర వచ్చింది. నాలుగుగడియలతర్వాత ఆయనకు కొంచెం మెలకువవచ్చింది. వైద్యుడు దగ్గరనే నిల్చుని ఆయన బాగా కండ్లు తెరిచినపిమ్మట, కొంచెం పాలల్లో ఓ ఘుటికను రంగరించి దాన్ని తాగడానికిచ్చాడు; దొర అది పుచ్చుకొని తిరిగి నిద్రపోయాడు.

ఇక్కడ సంగతిసందర్భాలు ఇట్లా వుంటూవుండగా, బసవయ్య ఓ నిమిషం వచ్చిపోవాలనే బోపణ్ణగారిపిలుపు అందింది. అప్పటికే, పాప చనిపోయినవార్త ఊరంతాప్రాకి, ఊరిలోనిజనం రకరకాలుగా మాట్లాడుకోవటం, రాజభవనానికి తెలిసింది. బోపణ్ణ బసవన్నను రమ్మనమని కబురుపెట్టడం ఇంతకుముందు ఎప్పుడూ లేదు. అంచేత బసవన్నకు ఈ పిలుపు ఏదో ముఖ్యమైనవిషయాన్నిగురించే అయివుంటుందని స్పష్టమైంది.

రాజు సరిగా వుండివుంటే బసవన్న ఆయనఆజ్ఞ పొందేవాడు. ఇప్పుడు దానికి అవకాశం లేదు. అతడు రాణికి కబురంపి, ఓ నిమిషం చూస్తూవుంటారా?' అని వేడుకొన్నాడు.

రాణీ రాజు శయ్యాగారానికి వచ్చింది. బోపణ్ణ కబురుపెట్టినసంగతి, బసవన్న చెప్పిన మాట విని, 'ఔను. ఏదో గొప్పవిషయమే వుండవచ్చు. పోయిచూడు' అంది.

'వారు ఏమి చెప్పుతారో విని మెదలకుండా సరేనని వస్తానమ్మా. దొరకు స్మృతితప్పడం ఎవరికీ తెలియకూడదు.'

'మంచిది బసవయ్యా! ఏమి చేయవలసివున్నా రాజుగారిని అడిగికదా చేయడం? చెప్పిందాన్నివిని మెదలకుండా రా.'

రాజభవనం సన్నివేశం ఇట్లావుండటంమూలాన్నే బసవన్న బోపణ్ణమాటలను నిదానంగా విని ఏమీ బదులుచెప్పకుండా వెనక్కు వచ్చేశాడు.

# 139

బసవన్న బోపణ్ణమాటలు చెప్పింతర్వాత, గౌరమ్మాజీ రాజభవనానికి వచ్చిన దుర్దశకు చాలా దురపిల్లింది.

మంత్రిగావుండే ఓ మనిషి తనప్రభువుకు అతనిసేవకునిద్వారా ఇటువంటిమాటను చెప్పి పంపించేస్థితికి వచ్చిందే! పదినెలల్క్రిందట మంత్రులు ఇటువంటిప్రసంగమే తెచ్చారు. అవును. అయితే అప్పుడు మర్యాదతో ఓ శిష్టమైనపద్ధతితో తెలియజేశారు. సమక్షానికివచ్చి వివరించారు. ఓ నిర్ణయానికి వచ్చినతర్వాత దొరకు తెలియచేయాలి అని ఆలోచించారు. ఇప్పుడో! ఆవిధమైనతీరు ఏమీ లేదు. అంతేకాదు; దొరమనస్సును విఱిచివేయాలి అనే కటుత్వం ఇందులో వుంది. సింహాసనంమంచి దిగు అని ఆయనకు తిన్నగా చెప్పినట్లే అయిందికదూ! ఈ చెప్పింపులు దొరచేతిలోని నౌకరుద్వారా!

బోపణ్ణ కోపిష్ఠిమనిషి. కాని మర్యాద మరిచిపోయేవాడు కాడు. లక్ష్మీనారాయణయ్య అతన్ని అటువంటిసందర్భాల్లో నిలువరించేపద్ధతి వుండేది. ఇతడు ఇట్లా నడుద్దామంటే అతడు తటపటాయించకుండా బుర్ర ఊపడం. తాను ఏమనుకుంటానో అనికూడ ఈ మంత్రులు ఆలోచించనేలేదు కదూ! రాజుకు కలిగిన పరాభవంలో రాణి అయిన తనకూ కొంతభాగం వుందని గౌరమ్మాజీకి తట్టింది.

విషయం బసవన్నతో చర్చించడానికి వీలులేదు. రాజు ఆరోగ్యంగావుంటే ఈ విషయం తాను జోక్యం కలిగించుకోవాల్సిందేకాదు. కాని రాజు ఈమాటనువిని దీనికి జవాబిచ్చేస్థితిలో లేదు. అంచేత తానే ఈవిషయాన్ని చూసుకోవాలిసివుంటుంది. ఎల్లా నడుచుకోవడం అని

కొంచెం ఆలోచిద్దాం అనుకొంటే బసవన్న మినహాయించి మరెవ్వరూ కనబడడంలేదు. రాజు తన ప్రవర్తనచేత తాను ఎంత ఏకాకిగా ఉన్నాడో, తాను ఏకాకి అవడంచేత తనభార్యను, కూతుర్ని ఎంత నిస్సహాయులుగా చేశాడో, అనేది రాణిమనస్సులో స్ఫురించింది. దీనివల్ల ఆమె తనకై, తనకంటె తన పెనిమిటికై, తన పెనిమిటికంటె తనకూతురికై అధికంగా ఖేదపడింది.

చాలా క్షణాలపాటు ఈవిధమైన ఆలోచనల్లో మునిగితేలి ఆమె 'ఇది ప్రజాభిప్రాయమని చెప్పారా?' అని ప్రశ్నించింది.

'ఔనమ్మా. పాప హత్యమూలంగా మనస్సు రోసింది ప్రజలకు. తెల్లవాళ్ల సైన్యంతో బాటు వస్తూవున్నారు. వాళ్ళను ఆపాలి అంటే ప్రజలమద్దత్తు కావాలి. రాజుగారు గద్దెమీద వుంటే ప్రజలు సాయంచేయరు. అందుకని రాజుగారు ప్రక్కకు తొలగాలి. ఇది వారనే మాట.'

రాణి తిరిగి ఆలోచించింది. రాజు ప్రక్కకు తొలగాడు అనుకో; గద్దె ఎవరు ఎక్కడం? క్రిందటిసారి రాణి శాసనం వహించాలన్నారు వాళ్ళు. అది ఆమెకు అప్పుడూ ఇష్టం కాలేదు, ఇప్పుడూ ఇష్టంకాదు. తాను ఒప్పనని చెప్పినమీదట కూతురు సింహాసనానికి రావాలి. అందుకు ఈప్రజ వొప్పుకుంటుందా?

ఈసంగతి ఎట్లా తెలుసుకోవడం? రాజుకు బుద్ధివైకల్యంకూడా ఏర్పడింది. అయితే ఇది, నేడో రేపో నయంకావచ్చు. ఆలోపల ఈమాట కదలించడం ఉచితమనిపించుకోదు. మాట ఎత్తకుండావుంటే, రాజుగారిస్థితినిగురించి బట్టబయలు చేయాల్సివస్తుంది. ఆవిధంగా చేస్తే ఆయన్ను గద్దెనుండి దింపేయాలనేమాట మరింత గట్టిపడుతుంది.

రెండునిమిషాలపాటు ఆలోచించి రాణి బసవన్నతో 'బసవయ్యా! నీవు మీదొరను దేవుడిలాగా చూసుకొంటావు. ఆయనబుద్ధి తొట్రుపాటుగా వుంది. ఈమాట ఆయనకు చెప్పడానికి వీల్లేదు. ఆయనపరిస్థితి ఇటువంటిది అని బైటివాళ్ళకు తెలియకూడదు. ఓ రోజు రెండురోజులు ఆగి చెప్పుతాం అనాలి. ఏమిటి చేస్తావు? విచారించి చెప్పు.'

'రాజుగారికి ఈవిధంగావుంది అని చెప్పకూడదమ్మా! వంట్లో సరిలేదు. రేపు చెప్పుతాం అంటే సరి.'

'ఏమైందనేది ఎట్లాగైనా వాళ్ళకు తెలుస్తుంది.'

'అమ్మా! నాకోటి తోస్తోంది. ఎల్లాగో పని అయిపోయి రాజుగారిబుద్ధి చెదరిపోయింది. గోడచివర అంటారు. ఏడుస్తోంది ఆడపిల్ల అంటారు. మూడురోజులపాటు ఇక్కడ వుంచనే వద్దు. కొత్తచోటికి తీసుకపోతే ఎట్లా వుంటుంది?'

'ఎక్కడకు అంటావు.'

'పిల్లవాడుగా పెరిగినఇల్లు నాకునాడులోని ఇల్లు ఆయనకు చాలా ఇష్టం. అక్కడికి తీసుకొనిపోతేనో, అమ్మా!'

రాణికి ఈ సలహా బాగుంది అనిపించింది. 'రాజుగారికి వంట్లో సరిలేదు. స్థలం మార్పు దానికిగా నాలుకనాడు రాజభవనానికి వెళ్ళిపున్నారు. రెండుమూడురోజుల్లో మీ విన్నపానికి ప్రత్యుత్తరం ఇస్తారు' అనిచెప్పితే ప్రస్తుతానికి బోపణ్ణ కాపాడవచ్చు మనల్ని. రాజుకుకూడ స్థలంమారిస్తే అసుఖకరమైన స్మృతిసందోహం తప్పవచ్చు. మనస్సు వెంటనే కుదుటపడ వచ్చు. ఆమె బసవన్నతో 'ఈ ఆలోచన బాగుంది, బసవయ్యా! కూడా మేము పోతున్నాం. నమ్మకస్థులు ఎవరో చూసిపంపు. ఇది వెంటనే జరిగిపోవాలి. ఇటు మేము బైలుదేరగానే, అటు నువ్వుపోయి మంత్రుల కీమాట చెప్పవచ్చు' అంది.

'అమ్మా నన్నుఅడిగితే మీరు అక్కడికిపోరాదు.'

'నువ్వు వెళ్తావా?'

'వీళ్ళమాటలకు ప్రతిమాట చెప్పడానికి నేనూ ఇక్కడనే వుండిపోవాలమ్మా.'

'మరి అక్కడ?'

'మీరు సరేనంటే దొడ్డవ్వను పంపిద్దాం. ఆమె ఒక్కత్తెవుంటే పదిమంది పెట్టు.'

పదిఏళ్ళక్రిందట అయితే ఈమాట రాణికి చాలావేసట తెప్పించేది. సహింపరాని అవ మానం ఆమెను అనుభవింపజేసిన, రాజుగారి దుర్విలాసజీవితానికి పతాకలాంటిది దొడ్డవ్వ. కాని ఈవిధంగా మనస్సులో వెష్టపదేవద్ధతిని గౌరమ్మాజి చాలా ఏళ్ళక్రిందటనే పోగొట్టు కొంది. తన పెద్దమనిషితనంచేత తనకు ఏ గౌరవం రావలసివుందో అంతే ఆమెకు ఇప్పుడు అస్తి. రాజు ప్రేమించినకారణంగా ఆమెను ఎవరూ మన్నించేవాళ్ళు లేరు.'

ఓ నిమిషం ఆలోచించి, 'సరి బసవయ్యా! దొడ్డవ్వను పోనీ, వైద్యుల్ని పోనీ; ప్రతి రోజూ ఉదయం సాయంత్రం వార్తలు పంపించనీ. కావాలంటే మనం వెళ్ళవచ్చు' అంది.

రాజు ఇది ఏదీ గమనించేస్థితిలో లేదు. బసవన్న ఏర్పాట్లుఅన్నీ చేశాడు. ఈమాటలు నడిచిన రెండుగడియలలోపల రాజును ఒక శిబికలో పరుండబెట్టి వెనకాలే దొడ్డవ్వ, పండి తుడు, ఇద్దరూ పోవడానికి ఏర్పాటుచేసి, నమ్మకంగల నలుగురుమనుషులతో వాళ్ళ దొరను నాల్కునాడులోని రాజభవనానికి పంపించివేశారు. తర్వాత కొంచెంసేపటికి బసవన్న, బోపణ్ణ వద్దకు వెళ్ళాడు. 'మీరు చెప్పినమాట రాజుగారికి చెబుదామంటే అమ్మగారు వారికి వంట్లో సరిలేదు కొంచెం తాళు' అన్నారు. తావుమారిస్తే మంచిదని వైద్యులు చెప్పారుట. రాజుగారు నాల్కునాడుభవనానికి బైలుదేరివెళ్ళారు. ఓ రెండురోజుల్లో నేనుపోయి ఈమాటచెప్పి వారి ఆజ్ఞ ఏమిటోగ్రహించి చెబుతాను అణ్ణగారూ!' అన్నాడు.

రాజభవనంనుంచి ఓ శిబిక, రెండు డోలీలు, నలుగురు పరిచారకులు, పది కావలి గుర్రాలు బైలుదేరినవార్త అప్పుడే బోపణ్ణకు తెలిసింది.

ఆ పరివారం రాజుగార్ప్రయాణానికి సంబంధించింది అని ఆయన కప్పుడు తెలియలేదు, బసవన్నమాటలద్వారా తెలియవచ్చింది.

# 140

రాజుబుద్ధి భ్రమించినకారణంగా ఆయన్ను మొదట చూసికోవడానికివచ్చి, తర్వాత బోపణ్ణ చెప్పంపించినమాట కారణంగా బైటివ్యవహారాలపై మనస్సు పోనివ్వాల్సి వచ్చింది. ఆపై రాజును నాల్కునాటికి పంపించేఏర్పాట్లు చేయడంతో, లోగడ ఆలోచిస్తున్నవిషయంలో వరి శిష్టాన్నిగురించి ఆలోచించేస్థితిలో లేకుండాపోయింది. రాజును పంపించివేసినతరువాత ఆమె తన కూతురివిషయమై మనస్సు పోనిచ్చింది.

తొట్టి మంచంలో చచ్చిపడివున్న బిడ్డనుచూసి రాత్రి మూర్ఛిల్లిన రాజకుమారి కొంచెం సేపటికి తెప్పరిల్లి పాప పోయాడే 'అని గోలపెట్టి ఏడుస్తూకూచుంది. పాప కళేబరాన్ని పూడ్చిపెట్టడానికి పంపించేటప్పుడు ఆమెను ఓదార్చి ఒప్పించడం చాలా కష్టమైపోయింది. కళేబరం గదిలోంచి పోయినతర్వాత ఆమె ఆగదిలో వుండలేను అంది. బైటికి వచ్చింది. రాణి గదిబైటి విశ్రామకక్ష్యలో ఆమెను ప్రక్కగా కూచోబెట్టుకొని, సాధ్యమైనంతగా ఓదార్చింది.

'ఏమిటి చేయడం ? ఈవిధంగా ఒక్కొక్కసారి అవుతూవుంటుంది. సహించుకోవాలి, నాతల్లీ !' అంది.

రాజకుమారి తల్లి వక్షఃస్థలంపై తలపెట్టి ఏడ్చింది; ఏడ్చిఏడ్చి సొమ్మసిల్లి మెదలకుండా వుండిపోయింది. కొంతసేపటికి 'పాపను పంపించివేయండి అన్నందుకు కోపగించుకొని అప్పాజి ఈవిధంగా చేశారు. చూడు అమ్మాజీ ! నేను మెదలకుండావుంటే బిడ్డ బ్రతికేవాడు' అంది.

కూతుర్ని ఓదార్చడంకంటె ఎక్కువగా రాణి హత్యాదోషాన్ని తానుకానీ, రాజకుమారి గానీ, రాజుమీద మోపరాదు అనేదాన్నిగురించి భయపడ్డది. అయిందేదో అయిపోయింది ; మాట్లాడేవాళ్ళు నోటికివచ్చినట్లు మాట్లాడుతున్నారు; దీన్ని దేన్నీ తప్పించడానికి లేదు. 'లోకము మూయగ మూకుడున్నదే !' అయినా, పాపప్రాణాలు పోయింది రాజు చేతిమీదిగా నని తానుగానీ, కూతురుగానీ తమ నాల్కలతో అనగూడదు. ఆమె కూతురికి 'పాప ఎట్లాగో పోయాడు. ఎవరిమూలానపోయాడు అనేమాట నేనూ నువ్వూ చెప్పాల్సిందిగాదు పుట్ట మ్మాజీ !' అంది.

ఇంతలో చేటివచ్చి 'బసవయ్యగారు చూడవచ్చా అంటున్నారు అమ్మా' అంది. రాణి 'రమ్మనమను' అంది. బసవన్నవచ్చి చేతులుజోడించి నిలబడి 'రాజుగారిని చూడవీ, భగవతిని పంపించు అంటోంది దొడ్డవ్వ. భగవతిని పిలిపించేదా అమ్మా !' అని అడిగింది.

'మంత్రం మందు వేయించాలంటుందేమో !'

'మంత్రం మందు సరే; అవికాకుండా వైద్యులకు తెలియనివిషయాలు అనేకం ఆవిడకు తెలుసునంది. అమావాస్యరాత్రి పూర్ణిమపగలు పిశాచంలాగా అడవిలో తిరుగుతుంది; నారు వేరు తీస్తుంది. ఇంట్లో కూచున్నపండితులకు ఇటువంటిమందులు ఏమితెలుస్తాయి అంది.'

'నిజం బసవయ్యా! చెప్పిపంపించు, రావీ, కొంచెం తిన్నగా చూసుకోండి అని వేడి అక్కడికి పంపుదాం.'

'నేను వెళ్ళిపిలిస్తే ఎట్లా వుంటుంది?'

'బాగానేవుంటుంది. అట్లాగే చెయ్యి.'

బసవన్న ఆలస్యం చేయకుండా ఒక గుర్రంఎక్కి భగవతి ఆశ్రమానికి వెళ్ళాడు. 'రాజు దేహస్థితి బాగులేదు. స్థలం మార్చాలి అని ఆయన నాల్కునాడు రాజభవనానికి పోయివున్నాడు. భగవతి అక్కడికిపోయి ఆయన్ను చూడాలి. మంత్రమో, ఔషధమో సరియైనచికిత్స నడవాలి అని రాణి వేడుకొంటోంది' అని తెలిపాడు.

భగవతి 'రాజుకు ఏమైంది?' అని ప్రశ్నించింది. బసవన్న అస్వస్థతగా ఉన్నాడని మాత్రమే చెప్పాడు. రాజు పాపను చంపాడనిగాని, ఆయనకు బుద్ధిభ్రమణ కలిగిందనిగాని చెప్పలేదు. 'నాల్కునాడు రాజభవనానికి వెళ్ళిచూస్తే అంతా తెలుస్తుంది' అన్నాడు.

'నీవు ఆధేమిటో మిథ్యపుచ్చి మాట్లాడుతున్నావు. రాజుగారిని చూడాలి అని అంటే సౌభరను పంపించకుండా నువ్వే వచ్చావుకదా! ఏదో మితిమీరినవ్యవహారంగా వుంది. ఏమిటది చెప్పు.'

'చూసింతర్వాత అదే తెలుస్తుంది. నేను వేరే చెప్పడం దేనికి?'

'నువ్వు ఎవరికి తనచంగావుంటున్నావో తెలుసుకున్నావా? వీరరాజు నీకు యజమాని కాదు. పగవాడు. ఎందుకు అతనికిగా ఇంతపడి చచ్చిపోతావు. ఎందుకింత వ్యాకులపడతావు?'

'విడిచేయి అని చెప్తావు అవ్వా! ఆవేళ ఇట్లాగే అన్నారు. నేను కాదు అన్నాను. అన్నంపెట్టినదొర నాకు పగవాడు ఎట్లా ఔతాడు? మీమాటకు నేను అడ్డు వచ్చాననుకోకండి. దయచూపి నాకనాటికిపోయి రాజుగారిని కాపాడండి.'

భగవతి: 'మంచిది. చూస్తాం' అంది. బసవన్న 'గుర్రం ఇవ్వనా' అన్నాడు.

'వద్దు. మేము నడుచుకుంటూనే పోతాం.'

బసవన్న మడకేరికి తిరుగుమొగం పట్టాడు. అతడు రాజకుటుంబం దిబ్బమీద గుర్రం నడిపిస్తున్నాడు. 'బావనవల్లం'లో భగవతి నడుస్తూవుండడం అతడు చూశాడు. ఆక్షణంలో ఈమె ఏ మంత్రశక్తితో ఇక్కడికి వచ్చిందో అని విభ్రాంతిపోయాడు. ఉత్తరక్షణంలో తాను గుట్టమొదట్లో గుర్రంఎక్కి మెల్లిగా వచ్చేవేళకు ఆమె గుట్టఎక్కుతూ, దిగుతూ ఇక్కడికి రావడం సాధ్యమేనని తోచింది. అయినా ఆడుది ఇంతవయస్సైనది, ఆ ముసలిశరీరం ఎంత సామర్థ్యం అని అతనికే ఆశ్చర్యం! అతడు రాజభవనానికి వచ్చాడు. రాణికి 'భగవతికి ఆజ్ఞ విన్నవించి వచ్చాను. పోతాం అన్నారు. ఇప్పుడే ఇక్కడ దేవాలయందగ్గిరలో కనబడ్డారు' అని నివేదించాడు.

# 141

బసవన్న అటు బైలుదేరడమే ఆలస్యంగా, ఇటు కాలిదారిలో మడకేరికి బైలుదేరి వచ్చిన భగవతి, అతడు రాజభవనంలో రాణినిచూసి విన్నపం చేసికొనేవేళకు, ఓంకారేశ్వరమందిరంలో తాను తన దొడ్డప్పను చూసింది. బసవన్న వచ్చాడనీ, రాజును చూడాలి అని రాణి కబురు పెట్టిందనీ చెప్పి 'రాజుకు ఏమైందో సుస్తీ ఏమిటో మీకు తెలిసివుండవచ్చుగా' అని సోత్సుకంగా అడిగింది.

'ఎల్లాగూ వచ్చావుగా పాపా! రాజభవనానికి పో అమ్మాజిగారినే చూసిరా.'

'వీళ్ల పిలిచారు అని నేనుపోవడం మొదలుపెడితే, రాజభవనానికి పోనూవచ్చు, రాణిని చూడనూవచ్చు. అయితే ఇదంతా నాకు ఎందుకు? అణ్ణయ్యా?'

'వైద్యం తెలిసినదానివి అని రోగులువచ్చి వేడుకొంటారు. తెలిసినదానివి చికిత్స చేయాలి పాపా.'

'నాకు కాబట్టని జనం. నా పిల్లవాణ్ణి పాడుచేశారు; ఈయన తొలగితే వాడు దొర అవుతాడు. ఈయన్ను నేనెందుకు కాపాడాలి?'

'నువ్వు చెప్పేమాట సరిగాదు. పాపా! పెడదారిని పడుతున్నావు నువ్వు! ఔషధం ఇచ్చేది నువ్వు. కాపాడేది నువ్వుకాదు. కాపాడేవాడు, కాజేసేవాడు దేవుడొక్కడే. మనుషులమైన మనం, మనం మనుష్యమాత్రులమే అనేసంగతి మఱచిపోగూడదు.'

'మీకు రవంతైనా కనికరంలేదు అన్నయ్యా! నాతప్పు [1]గోరంతలైనా మీకంటికి కొండంతగా కనబడుతుంది. నన్ను భ్రష్టుచేసినవాళ్లతప్పు కనబడనే కనబడదు.'

'నీ ఇష్టం వచ్చింది అను నన్ను. పాపా! నువ్వు సరైనదారిలో నడుచుకో.'

'సరే నన్నయ్యా! వెళ్తున్నా. చేతనైంది చేస్తాను.'

'అది మంచివని, నా తల్లీ.'

'మీరు చెప్పినట్లు చేస్తానంటే మీమాట ఎంత మృదువుగా వుంటుంది! ఇప్పుడు చెప్పండి రాజుకు ఏమిటి సుస్తీ?'

'దానిదేముంది? పాపా ఎవరు పట్టితే వాళ్ళే చెబుతారు. అడుగుపో. మంత్రమో, మాయమో, మంచిదని నీకు తోచిందాన్ని చేసిరా. నాకూ ఇక్కడ పూజపని; పొద్దెక్కింది చూశావా?'

---

1 ఆవంతైనా గుమ్మడికాయ అంతగా అని మూలం.

# 142

ఆశ్రమంనుంచి బైలుదేరాక భగవతికి నాల్కనాడికి వెళ్ళాలి, రాజుకు ఔషధం ఇవ్వాలి అనే ఉద్దేశం లేదు. ఆయనకు, ఆంగ్లేయులకూ మధ్య వైమనస్యాలు పెరిగాయి అని తెలుసు ఆమెకు. 'చాలా మంచిపనైంది. ఈలోపలనే ఇతగాడిపని భరతం పట్టిస్తాడు. తనకోరిక సిద్ధిస్తుంది' అనుకొన్నది. రాజుకు ఆరోగ్యంచెడితే తనకోరిక వెల్లడం మరింత సులభం. రోగిపరంగా ఎవరన్నావచ్చి సహాయంవేడితే, వైద్యం తెలిసినవాళ్ల కర్తవ్యాన్నిగురించి ఆమె కెట్టి సందేహమూలేదు. ఆమెకు వైద్యాన్ని నేర్పిన గురువు ఒక్కొక్కమూలిక, ఒక్కొక్క మంత్రం చెప్పివున్నప్పటికీ, మరీ ఓ హెచ్చరికమాటను చెప్పాడు. మూలిక తెలియడం, మంత్రం నేర్వడం గొప్పవిషయం కాదు. తెలిసిందాన్ని, నేర్చిందాన్ని నిష్ఠతో వాడాలి. ప్రాణాలు తీయడానికి వచ్చినవాణ్ణి, పాముకరిస్తే మంత్రంవేసి అతన్ని ఆ విషంనుంచి బ్రతికించాలి. అతడు బ్రతికి నిలబడ్డతర్వాత అతనిచేతినుంచి తప్పించుకొని పారిపోవాలి. అతడు శత్రువనేకారణంచేత అతనికి మంత్రం వేసేదిలేదు అంటే నీవు నేర్చినమంత్రం నేలపాలైనట్లే. నీకు నరకం తప్పదు; నీకు నేర్పినవానికికూడా నరకమే. ఇది ప్రతి వైద్యగురువూ తన శిష్యుడైన ప్రతివానికీ చేసేహెచ్చరిక. కాని గురువే దాన్ని అన్నివేళలా ఆచరించేది లేదు. ఇహ శిష్యునిసంగతి చెప్పేదేమిటి? భగవతిజీవితంలో ఏర్పడ్డ ఇటువంటి సన్నివేశాల్లో గురువుగారు చెప్పింది శిష్యుడికి జ్ఞాపకమేరాదు, వచ్చినా రుచింపదు. భగవతి మనోధర్మమూ అట్లాగే వుంది. అయినా, బొడ్డప్పకు చెప్పకుండా తాను తటస్థంగావుండే ధైర్యం ఆమెకు లేకపోయింది. దానికి తగ్గట్లుగానే ఆయన ఆమెకు ఆమె కర్తవ్యంఏమిటో స్పష్టంగా తెలియజెప్పాడు. ఇంక తన మొదటిఆలోచనప్రకారం మెదలకుండావుండడం, అసాధ్యమైంది. దేవాలయంనుంచి బైటికివచ్చినావిడ 'రాజభవనానికిపోయి రాణిని చూస్తామా? లేక నాల్కనాటి రాజభవనానికి సూటిగా బయలుదేరిపోదామా?' అనే ఆలోచనతో ఓ క్షణం నిలబడి పోయింది.

అంతలోకి అక్కడికి నారాయణ వచ్చాడు. ఆమెనుచూసి 'నమస్కారం అమ్మా! ఎప్పుడు రావడం?' అన్నాడు.

'వచ్చి ఓ గడియ అయింది.'

'అప్పను కలుసుకొన్నారా?'

'చూసి మాటాడాను.'

'ఏమిటిసంగతి? ఏమిటి ఆలోచిస్తూవున్నారు? ఇక్కడివంగతులు తెలుసా?'

'లేదు. ఏం సంగతులు?'

'రాజు చెల్లెలికొడుకును చంపిపారేశాడు. ఉదయమయ్యేటప్పటికల్లా ఆయనకు పిచ్చి పట్టిపోయింది. కుంటి ఆయన్ను 'మోళ' రాజభవనానికి పంపించేశాడు.'

'రాజుకు వంట్లో బాగాలేదని తెలిసింది. ఇదంతా తెలియదు. చంపేపారేశాడా?'

'ఆ చచ్చినతూనను పాతిపెట్టి మూడుగడియలై పోయింది. చంపినవానిచేతులు పురుగులు తినా. ఎప్పుడు తింటాయో దేవుడికే తెలుసు.'

భగవతి ఈమాటవిని చాల దుఃఖంతో అసహ్యించుకొన్నది 'పసిపిసుగును చంపిన పాపిష్టివాణ్ణి తాను కాపాడవలెనా?' అని ఆమె ఆలోచించింది. లోపలికిపోయి దొడ్డప్పను తిరిగి అడిగితే? దొడ్డప్పకు ఈసంగతులన్నీ తెలుసు. తనకు ఒక్కటీ చెప్పలేదు. వైద్యం తెలుసుగా, చికిత్స చెయ్యి అని ఇంతమాత్రమే చెప్పాడుకదా! క్షణం యోచించి ఆమె తెలుసుకొన్నది. మళ్ళీ అడిగినా ఆయన అదేమాట చెప్తాడు. మంచిది. నూరు చెప్పినా, ఆయనే గొప్పవాడు. ఆయన చెప్పినట్లుగా చేయడం తనకూ మంచిది. రాజభవనంవెళ్ళితే రాణితో ఈ సంగతులన్నీ మాట్లాడడం కష్టంగావుంటుంది. రాణి దొడ్డమనస్సుగల ఆడది. రాజునుగూర్చి వేసట, ఆమెనుగురించి గౌరవం, తనమనస్సులో పెనవేసుకొని భగవతికి మరింత కష్టమైంది. ఈ గందరగోళంఅంతా దేనికి? అనుకుంటూ ఆమె నాల్కునాడికి పోదాం అని నిశ్చయించింది.

ఈవిధంగా ఆమె నాలుగుఅడుగులు ముందుంచేవేళకు రాణి పంపిన ఒక సేవకుడు ఆమె వద్దకు వచ్చాడు. 'అమ్మాజీగారు డోలీ పంపుతారట, కొంచెం ఉండండి, రహస్యభవనానికి నడిచిపోకండి అంటున్నారు.' అని చెప్పాడు.

అంతలోకి పక్కసందులోంచి నలుగురుబోయీలు ఓ డోలీ తెచ్చారు. భగవతి అందులో కూచొని నాల్కునాడు రాజభవనానికేసి బయలుదేరింది.

# 143

బోయీలు తగినంత వేగంగా నడిచినా భగవతి నాల్కునాడు రాజభవనానికి చేరేటప్పటికి దీపాలుపెట్టి రెండుగడియలు అయింది. దారిలో దేవుడి అరణ్యాలు రెండు వచ్చాయి. భగవతి ఆ రెండుచోట్లల్లోను డోలీలోంచిదిగి ఈశ్వరస్తోత్రంచేస్తూ అడవిలోకిపోయి కొన్ని పసరాకుల్ని తుంచి తన చీరకొంగున ముడివేసికొన్నది. రాజభవనానికి చేరినవెంటనే వైద్యునితో మాట్లాడి దొర పడుండివున్నగదికిపోయి అతన్ని చూసింది. ఆయనకు ఆహారం చేరిందా, నిద్ర వస్తోందా మొదలైనవివరాలన్నీ దొడ్డప్పనుంచి తెలిసికొంది.

నారాయణదీక్షితులు చెప్పిన రెండుమాటల్లోంచి ఆమె రాజు కేమైవుంటుందని ఊహించు కోగల్గింది. అంచేతనే ఆమె వచ్చేదారిలో చికిత్సకు కావాలిఅని తనకుతోచిన పసురాకుల్ని సంపాదించి తెచ్చింది. తాను తెచ్చిన పసరాకుల్లో రెంటు అరగదీసి రెండు అరగాలికి పట్టు వేసి ఇంకా రెంటినివేయించి కషాయంచేసి రెండుగుటకలు కషాయం తాగించింది. ఆమె వైద్యునితో 'మీరు రేపు మడకేరికి తిరిగి వెళ్ళిపోవచ్చు' అని చెప్పింది.

వైద్యుడు: 'ఔననుకోండమ్మా! అయితే రాజుగారిని కనిపెట్టివుండాల్సిందని నన్ను ఇక్కడకు పంపించారు. ఆయనకు నయంకాకుండానే నేను వెళ్ళిపోనా?' అన్నాడు.

'మీరు చేసే చికిత్స చేశారు. నేనూ ఆపనిమీదనే వచ్చాను. ఇక్కడ ఇద్దరికేం పని వుంది.'

'నేను ఏమీ చేసేది లేకపోయినా, మీరు చేసే చికిత్సనుమా' నాకు తోచినమాట సలహా ఇస్తూవుంటాను.'

'మేం చేసే చికిత్స ఎక్కువభాగం మంత్రం [1]పండితయ్యా! దాన్ని చూసినంతమాత్రాన ఎవ్వరికీ తెలిసేదేమీలేదు. మేం వాడే మూలికలు మంత్రంచెప్పుకుంటూవాడితే పనిచేస్తాయి. మంత్రం కావాలంటే పురశ్చరణ వుండాలి. ఇది మీకు తెలియనివిషయమా?'

వైద్యునిముఖం చిన్నబోయింది. ఆయన 'మంచిది తల్లీ! పొద్దున్నే పోతాను. రాజుగారి స్వాస్థ్యంగురించిన బాధ్యత అంతా తమదేనని రాణీగారికి విన్నవించుకుంటాను' అన్నాడు.

పొద్దున్నే బైల్దేరి వెళ్లిపోయాడు.

రాత్రంతా భగవతి రాజు పక్కనేకూర్చుని ఏవో మంత్రాలు జపిస్తూవుంది. ఉదయం ఆయన ఇంకా మేల్కొనకముందే దగ్గిరనున్న అడవిలోంచి కావలసిన పసర్లు పిండితెచ్చింది; తిరిగి కాలికి పట్టు, మళ్ళీ కడుపులోకి కషాయం. ఈప్రకారం చికిత్స ముందుకు సాగించింది.

ఆరోజు, మరుదినం, మూడోదినం చికిత్స నడిచింది. రాజు మామూలుకంటె ఎక్కువగా ఆహారం పుచ్చుకొన్నాడు. మామూలుకంటె చక్కగా నిద్రపోయ్యాడు. నిద్రలో మొదటిరోజు వినిపించిన కలవరింతమాటలు, రెండోరోజు కొంచెం తగ్గిపోయినాయి. మూడో రోజు నిలిచిపోయాయి. భగవతి దొడ్డవ్వతో 'ఈయనకు నయమైంది. నేను రేపుఉదయం బైలుదేరి వెళ్ళిపోతాను' అంది.

రెండోరోజు బసవన్నవచ్చి రాజుస్థితిని గమనించివెళ్లాడు. మళ్ళీ నాలుగోరోజు వస్తానని చెప్పాడు.

---

1 'పండిత'పదం కన్నడంలో ఆయుర్వేదవైద్యులకూ వాడబడుతుంది—అనువాదకుడు.

# 144

భగవతి ఉదయంలేచి వెళ్ళాలి. ఆమె, మరి దొడ్డవ్వ, రాజుగదికి ముందున్నగదిలో పడుకొని వున్నారు. దొడ్డవ్వ 'రాజుగారికి చక్కగా నిద్ర పట్టుతోంది. ఇహ భయమేమీలేదు కదూ!' అంది.

'రవ్వంతైనా హడావుడిలేదు.'

'సవతిబిడ్డ అనే కడుపుమంటలేకుండా నయంచేయడం అయింది.'

'చేయడం చేయకపోవడం మనిషిచేతిలో లేదు. దేవుడు చేయించింది మనిషి చేస్తాడు.'

'కొడుకు రాజు అయ్యేమాట ఏమైంది?'

'తమ్ముడు బ్రదికితే అన్న రాజు కాగూడదా?'

'మొత్తంమీద ఆశ వుందే!'

'వట్టి కోరికతో ఒలిగిందేమిటి దొడ్డవ్వా!'

'నడుస్తోంది చక్రమంటావా?'

'ముప్పైఏళ్ళపూజ; దేవుడు ఫలితమివ్వాలి.'

'ఇదే ఇంట్లో, ఇదే గదిలో, పసిపిల్లగావున్న ఆ సుఖమయమైన జీవితం ఎక్కడ? ఇదే ఇంటిలో, ఇదే గదిలో ఇప్పుడు చేస్తున్నపని ఏమిటి? రెండూ చూసినవాళ్ళకు ఎంత చోద్యం అనిపిస్తుంది.'

'ఇది నువ్వు ఇప్పుడు అంటున్నావు. నాలుగురోజులు మనస్సు దాన్నే తలపోసికొంటూ వుంది. ఈ ముందున్న ముంగిటిలోకదూ పిల్లవానికాలు మెలివడిపోయింది. ఇక్కడనుంచే కదూ తలమీద గుడ్డవేసికొని బైలుదేరిపోయింది? స్మృతి అంతా సుఖకరమైందికాదు. కష్టప్రదమైన స్మృతులూ దొంతరలుగా వున్నాయి.'

'లేకుండా వుంటుందా నా తల్లికాన!'

'అప్పుడు జరిగింది తెలిసినవాళ్ళు మీ రిద్దరే. నువ్వూ, తక్కరూ!'

'తెలిసినవాళ్ళు; అయినా నోరు తెఱవడానికి లేదు. ఇద్దరినీ ఒట్టు పెట్టించారు. ఆదెటువంటి ఒట్టు!'

భగవతి ఉదయమే వెళ్ళిపోతుందనే కారణంచేత రెండుముక్కలు అప్యాయంగా మాట్లాడాలనేకోరికతో దొడ్డవ్వ ఈమాట తెచ్చింది. ఆమె మాట్లాడడం అరంభించింది చాలా మెల్లిగా. రాజు నిద్రలోవున్నాడు, ఆయననిద్రకు భంగం రాకూడదు అని ఆమె ఉద్దేశం. సంభాషణక్రమంలో వాళ్ళ ఇద్దరి కంఠధ్వనులు కొంచెం హెచ్చాయి. రాజు మూడురోజులు

పాటు సుఖంగా నిద్రపోయి ఆవేళకు సరిగా మేల్కొన్నాడు. అర్ధరాత్రి గడిచిపోయింది. రాజభవనం నిశ్శబ్దంగా వుంది. ఆసమయంలో వాళ్ల మాటాడినమాటలన్నీ రాజుచెవులకు స్పష్టంగా వినవచ్చాయి.

# 145

భగవతి చికిత్సమూలాన వీరరాజుకు గుణంకనబడి నయమైంది. అంతేకాదు; ఆయనకు శరీరం ఎప్పటికంటె తేలిక ఇచ్చింది. మనస్సు సంతోషంగావుంది.

వాళ్ళసంభాషణ విన్న రాజుకు పరమాశ్చర్యంగావుంది. మాటల అనుపూర్వి అతనికి సరిగా బోధపడలేదు. కాని ఇదిమాత్రం స్పష్టం. దొడ్డవ్వ భగవతిని చిన్నతనంలో కన్నది. అప్పు డామె ఈ ఇంట్లోవుంది. ఇక్కడేదోజరిగి ఇక్కడినుంచి ఆమె దుఃఖంతో బైటికి వెళ్ళి పోయింది.

మడకేరినుంచి బైలుదేరేటప్పుడు అతనికి నిద్రమత్తు. నాల్కునాడులోని రాజభవనానికి చేరేవేళకు మత్తు దిగింది. ఆయన్నుతెచ్చి గదిలో పడుండచేశారు. ఆయన స్థలాన్ని గురు తించాడు. దగ్గరనున్న సేవకుని 'మోళ' రాజభవనమేనా ?' అని అడిగాడు. వాడు 'ఔను ప్రభూ !' అనేటప్పటికి రాజు 'ఎందుకిక్కడికి వచ్చారు ?' అని అడిగాడు.

సేవకుడు: 'స్థలం మార్పిడి చేయాలిఅని అమ్మాజి ఆజ్ఞాపించారు.' రాజు అంతటితో ఆమాట వదిలేశాడు.

ఆరోజంతా ఆయనకు మనస్సు బాగాలేదు. కాని పేరు ఆవరణం కాబట్టి గోడ చివరిలో పిల్లవానిశవం మూటగా కనబడడం, ఎవ్వరో ఆడుది మొహానికి ముసుగువేసికొని ఏడుస్తూ ఎదురుగా నిలబడడం, ఈ భ్రమ తప్పింది.

భగవతివచ్చి మందురాసి, మందు తాగించడంమూలాన వంటిని దహించేస్తూవున్న ఏదో తాపం చల్లారింది. మనస్సును క్షోభపెడుతూవున్న చిరాకు తప్పింది.

రెండోరోజురాత్రి ఆయన నిద్రనుంచి లేచేటప్పటికి, సుందరమై గంభీరమై శోభిస్తూ వున్న ఓ నారీముఖం, ఆయన మొగందగ్గిర వంగి ఏదోవిధంగా చూస్తూవుండడం, కన బడింది. ఆక్షణంలో ఆమెమొగం తన తల్లిముఖంగా కనవచ్చింది. మరుక్షణంలో కాదు అనే నిర్ణయానికి వచ్చాడు. మనస్సుకేమో భయంవేసి 'ఎవరు ఈమె ?' అని అడగవలసినవాడే.

అప్పుడు ఆయనకి ఆ మొగానికితోడు ఇంకోమొహం కనిపించింది. అది దొడ్డవ్వముఖం. మనస్సుకు స్థైర్యం ఏర్పడి 'దొడ్డవ్వా!' అని పిలిచాడు.

దొడ్డవ్వ 'ఏమిటి సంగతి దొరా! ఇంట్లో చిరాకుగా లేదుగా?'

'లేదు. ఈమె ఎవరు?'

'భగవతి. మందు ఇవ్వడానికి వచ్చారు.'

రాజుకు తిరిగి నిద్రపట్టింది. అప్పటికి ఆయనరోగం సగం గుణమిచ్చింది.

నేటికి రెండురోజులైంది. ఈ భగవతి తనరోగాన్ని పూర్తిగా నయంచేసిందే. వెనక ఇక్కడివున్న ఆ పెద్దగా కనబడుతోందే. ఆవిడ ఎవరు? ఆసంగతి రేపు అడిగి తెలుసుకోవాలి.

రాజు పక్క మంచంమీద ఒకప్రక్కనుంచి మరోప్రక్కకు తిరిగాడు. కొంచెం చప్పుడైంది. ఆయనకు మెలకువవచ్చిందనితెలిసి దొడ్డవ్వ దగ్గరకు వచ్చింది, పైదుప్పటి అదీ మూసి తిరిగి వెళ్ళిపోయింది.

తెల్లవారుజామునకు ముందే భగవతి రాజభవనంనుంచి నిష్క్రమించింది.

ఉదయం రాజు దొడ్డవ్వను 'భగవతి ఎవ్వరు? దొడ్డవ్వా!' అని ప్రశ్నించాడు.

ఆమె 'మీకు తెలియదా దొరా! కొల్లదగ్గిర గుట్టక్రింది వల్లంలో గుడికట్టుకొని వుండే ఆవిడ' అని జవాబిచ్చింది. భగవతి ఎవ్వరు అని అడగడంతో ఆతనికి తిరిగి మతి భ్రమణం కలిగిందేమోనని ఆమె శంకించింది.

'అదంతా తెలియదా నాకు? మొదట్లో ఆమె ఇక్కడనే వుంటూవుండేదని అంటున్నావు. మా రాత్రి! ఆ సంగతి ఏమిటో చెప్పుమంటున్నాం.'

'మొన్న రాత్రి మాట్లాడుకొన్నవి విన్నారా దొరా?'

'అవును.'

'నిద్రమత్తులో వినివుంటారు. చెప్పిందొకటి విన్నదొకటి కావచ్చు.'

'నువ్వు చెప్పిందేమిటి?'

'అదీ వేరేవాళ్ళవిషయం. ఈమె సంగతి కాదు. ఈమె వాళ్ళను ఎరుగు. వాళ్ళవిషయమై మాటాడుకొన్నాం.'

దొడ్డవ్వ నిజం చెప్పటంలేదు. ఏదో కొంత ముసుగుపెట్టి మాటాడుతోందని రాజుబుద్ధికి దృఢమైంది. కాని ఆమెకు ఇష్టంలేనప్పుడు ఆమెచేత ఆవిషయం చెప్పించడానికి ఇది అదను కాదు. అయినా విపరీతప్రయత్నంగా ఆయన 'భగవతిని ఇక్కడికి రమ్మనమను' అన్నాడు.

దొడ్డవ్వ: 'భగవతి తెల్లవారుజామునే గుడికి అని బైలుదేరివెళ్ళింది దొరా!'

# 146

రాజుకు మతిభ్రమించినసంగతి బైటికి పొక్కకూడదు అని రాణి చేసినప్రయత్నం ఫలించ లేదు. ఆ సంగతి ఇంతకుముందే మనం గమనించాం. బసవన్న భగవతి సహాయంవేడి, ఆమె మడకేరికివచ్చి దీక్షితుల్ని కలిసేసమయానికే, నారాయణకు ఇది పాతకబురై పోయింది. ఊరిలో ఈసంగతి తెలియనివారంటూ లేరు.

బోపణ్ణ చెప్పినమాట రాజుతో చెప్పడానికి వీలులేకపోయిందని బసవన్న చెప్పిన క్షణం లోనే బోపణ్ణ గ్రహించాడు—దొర జవాబివ్వకుండా తప్పించుకుంటున్న వేషం ఇది-అని. మరికొంతసేపట్లో రాజు కేర్పడ్డ అనారోగ్యం వార్తవిని, తను చెప్పింది రాజుదాకా పోక పోవడం, వాస్తవమే నను కొన్నాడు. నిజానికి, దొర తప్పించుకొని తిరగడంగాని, తాను చెప్పింది వినకపోవడంగాని, బోపణ్ణకు అంత ప్రధానమైనవిషయం కానేకాదు. ఆంగ్లేయులు కొడగుమీదికి దండెత్తివస్తున్నారని తెలియకపూర్వం, తాను నడవవలసినమార్గాన్నిగురించి డోలాందోళనగా వుండేది. పరసైన్యం దేశంలోకివచ్చే సావకాశం కనబడగానే అతనికి తాను నడుచుకోవాల్సినమార్గం స్పష్టంగా గోచరించింది.

అంతకుముం వినుకొన్నట్టే, అతడు ఆరోజే, ముప్పైఐదు సిర్కాల్లోని పెద్దలకు నౌఖర్లద్వారా కబురుపెట్టాడు. 'బైటినుంచి దండువచ్చివడుతోంది. దానితో పోరాడి మనం రాజుగారిని కాపాడాలి అని నాబుద్ధికి తోచడంలేదు. మీ కీ విషయం సమ్మతమేనా చెప్పండి. లేకుంటే వెంటనే మడకేరికివచ్చి నాతో మాట్లాడండి. ఎట్లాగైనాసరే, మీ సిర్కానుంచి ఇరవైమందిమనుషుల్ని సాయుధంగా తొందరగా పంపించండి. వాళ్లకు ఇక్కడ కావలసిన ఏర్పాట్లు నేను చూస్తాను' అని చెప్పంపించాడు.

ఆరోజు వెళ్ళిననౌఖర్లు చాలామంది మర్నాడే వచ్చేశారు. మిగిలినవాళ్ళు మూడోరోజు కల్లా వచ్చారు. తక్కరులందరూ ఒకేమాటగా జవాబిచ్చిపంపించారు. 'బోపణ్ణగారు ఏది సరే నంటే మాకూ అదే సమ్మతం. బోపణ్ణగారి ఆజ్ఞానుసారం ఇరవైమందిమనుషుల్ని పంపిస్తూ వున్నాం' అని.

బోపణ్ణ, తోటి తక్కరులు తనపై ప్రకటించిన ఈ విశ్వాసానికి గర్వపడ్డాడు. అతని వక్షఃస్థలం పొంగింది. దేశం బ్రతికుంది అని ధైర్యం చెందాడు. తక్కరు ఈవిధంగా చెప్పి పంపించారు అని లక్ష్మీనారాయణయ్యకు చెప్పాడు.

తక్కరులదగ్గిరకు నౌఖర్లను పరేషించినరోజు, అతడు పొలిమేరలపైవుండే పడవాలు లకు, మీరు వెంటనే మడకేరికివచ్చి ఇహముందు ఎట్లా నడుచుకోవాలి అనేవిషయమై మా

దగ్గిరనుంచి ఆజ్ఞలుపొందాలి అని కబురుచేశాడు. వాళ్ల అయిదుగురు, అయిదుగురూ మర్నాటి కల్లా ఊడిపడ్డారు.

బోపణ్ణ వారికి 'ఇంతవరకు మర్యాదార్థం పొలిమేరలు కాపాడడం అనేపని ఎట్లాగో అట్లా జరుగుతూవచ్చింది. జీతం, భత్యం మేము ఇస్తూవుండేవాళ్లం. పని ఏమైనావుంటే మేమో, రాజుగారో పురమాయిస్తూ వుండేవాళ్ళం. ఇప్పుడు బైటినుంచి దండువచ్చి పడబో తోంది. ఎట్లా నడచుకోవాలి అనేవిషయం మీకు చెప్పాల్సివుంది. రాజుగారు కోరేటట్లే నడచుకోవాలి అని నాకు అనిపించడంలేదు. అయితే నేను చేసినట్లే మీరూ చేయాలని నేను చెప్పడంలేదు. ముందు మీరు ఏవిధంగా నడుచుకోవాలి అనేవిషయంలో రాజభవనానికిపోయి రాజుగారినుంచి ఆజ్ఞ పొందాలంటే పొందవచ్చు. వారి ఇష్టంప్రకారం నడుచుకోవచ్చు. నాకు అభ్యంతరం లేదు' అన్నాడు.

ఉత్తయ్య పడవాలులలో ఒక్కడు. వాళ్ళు అయిదుగురూ మొత్తంగా బైటికివెళ్ళారు. అక్కడ తమలోతాము మాట్లాడుకొన్నారు. రెండునిమిషాల్లో తిరిగి లోపలికివచ్చి 'మాకు ఇప్పటిదాకా మీరే పెద్దలు। ఇహముందూ మీరే పెద్దలు. మేము రాజుగారివద్దకుపోయి తిన్నగా వారినుండి ఆజ్ఞలు పొందడమనేది లేదు. తమరెట్లాఅంటే అట్లా నడుచుకొంటాం. ఆజ్ఞ' అన్నారు.

'దీనికీ నా అభ్యంతరం లేదు. సరే అయితే మీరు చెయ్యవలసింది ఇది - పరాయిసేన సీమపైకి వచ్చినాక ఒకడుపోయి వాళ్ళనాయకునికలిసికొని చెప్పాలి—'మా పెద్దవాళ్ళు మీ పెద్దలతో చాలా ముఖ్యమైనవిషయాలు మాట్లాడవలసివుంది. ఆ మాటలు ముగిసేదాకా మేము మీతో పోరాడం. మీరు గడి బైటనే నిలవండి. పోరాడవద్దు. మేము మీ జోలికి రాం' అని. వారు దానికి వొప్పుకుంటే వాళ్ళను అక్కడనిలిపి ఇటు మీరు రండి. వాళ్ళ కర్నల్ సాహేబుతోమాట్లాడి నేను ఆజ్ఞలు పంపిస్తాను. మీమాటవినక ఓవేళ వాళ్లు ముందుకు గడి దాటివస్తే మీరు వాళ్ళను నిలవరించండి, పోరాడండి.'

పడవాళ్లు ఈ ఆజ్ఞపొంది తమతమ పొలిమేరలకు వెళ్లిపోయారు. బోపణ్ణ ఈసంగతిని కూడా లక్ష్మీనారాయణయ్యకు చెప్పాడు.

పిర్యాపట్నంనుంచి బైలుదేరిన వీరభటులు మూడోరోజు సాయంకాలానికి మడకేరి చేరారు, వాళ్ళ నాయకుడు బోపణ్ణను కలుసుకొన్నాడు. బోపణ్ణ వారిలో మూడువందలజనాన్ని మడకేరి కాపలాకు నిలిపి నాలుగువందలమందిని కుశాలనగరానికిపోయి తనవశాన పోట్లాడేటట్లుగా ఏర్పాట్లు చేశాడు.

మరి మూడురోజులకు బెంగుళూరిసేన అయిదుభాగాలుగా సీమ అయిదువైపులా దగ్గిరకు తోసుకవచ్చిందని వార్త తెలిసింది. బసవన్న రాణిచే అనుజ్ఞాతుడై బోపణ్ణవద్దకు వచ్చాడు

'దొరకు ఇప్పుడే నయంగా వుంది. తమరు చెప్పినమాట వారికిచెప్పి వారు ఏమి జవాబిస్తారో రేపు మీకు చెబుతాను. ఇంతవరకూ జరిగిన ఏర్పాట్లు ఏమిటో చెప్పండి' అని అడిగాడు.

బోపణ్ణ: 'మూడురోజులక్రిందట రాజుగారు ఏమైనా ఆజ్ఞ ఇస్తే ఆవిషయం ఆలోచించ డానికి వీలుగా వుండేది. ఇప్పుడు అవన్నీ మాట్లాడుతూ తర్జనభర్జనలు చేసుకోవడానికి సమయం చాలదు. వచ్చేవాళ్ళ నడక, నడితీరు చూసుకొని మనం నడచుకోవాలిసివుంటుంది. అప్పు డేది బావుంటుందనుకొంటే అది చేద్దాం. ఇట్లాగ్గా రాజుగారికి చెప్పండి.'

బసవన్నకు ఆశలన్నీ అడుగంటిపోయాయి. అతడువచ్చి రాణికి చెప్పాడు. ఆమె 'రాజు మూడురోజులక్రిందటనే దొరతనాన్ని చేతులారా పోగొట్టుకొన్నారు. ఇంక ఇప్పుడు ఇందువల్ల కొత్తగావచ్చే ముప్పేమీ లేదు' అని లోలోపల కుమిలిపోయింది దుఃఖంతో.

రాజుగారి దొరతనం సమాప్తమైంది. ఆయనభార్య అయిన తన రాణీతనం దాంతోబాటే భరతవాక్యం పలికింది. కాని ఈ ఆడపిల్ల ఇందుకుగా ఓ రాజభవనంలో అంటూ పుట్టిందే? అని రాణి చాలాచాలా దురపిల్లింది. ఎంతో నొచ్చుకొంది. ఈ కన్యను సింహాసనంపై కూచో బెట్టడానికి బోపణ్ణ సమ్మతిస్తే ఆయన అల్లునికిచ్చి పెళ్ళిచేయవచ్చు. తండ్రికంటె మంచి దనిపించుకొని తల్లికంటె ఎక్కువసుఖాలు అనుభవించవచ్చు. ఈశ్వరుడు ఈ సన్నివేశాన్ని కలిసిరానిస్తాడా?

ఆమె ఈ సందర్భం ఏదీ ఎవరితోనూ సంప్రదించి చూద్దామనుకోలేదు. ఆమె బస వన్నను 'ఇప్పుడు రాజుగారికి వొళ్ళు నయంగానే వుందికదూ?' అని అడిగింది.

'ఔనమ్మా: పడుకొన్న పక్కవదలి నిలబడుతున్నారు. నడుస్తూవున్నారు. మాటా మంచీ అంతా తిన్నగానేవుంది.'

'పెళ్ళి ఇక్కడ జరుగుతున్నవ్యవహారం అంతాచెప్పి ఏమంటారో తెలుసుకొనివసావా?'

'అట్లాగేనమ్మా!'

# 147

బసవన్న నాల్కనాడు రాజభవనానికి వెంటనే బయలుదేరాడు. రాజుకూ, బోపణ్ణమాటలన్నీ తెలియజేశాడు. 'అమ్మగారు రాజుగారు ఏమంటారో తెలుసుకొని రా అన్నారు' అన్నాడు.

రాజుకు తనగతి ఏమౌతుందనే చింతేలేదు. ఆయన వినగానే, ఎవడు వాడు నన్ను సింహాసనంమంచి దిగు అనేవాడు? పిస్తోలుతీసుకొని కాల్చి పారేస్తాను కబడ్దార్!' అని ఉరిమాడు.

'కొడగురాజా ఇంత చులకనైపోయాడా? ఈ బోపణ్ణ గీపణ్ణ, లెక్కా పక్కా మనకి!' మళ్ళీ 'కొడగుదేశం అంత చదునైందికాదు. తురకలు వద్దపాట్లు వీళ్ళు ఎరుగరు' అన్నాడు. అరవైఏళ్ళక్రిందట తన దొడ్డప్ప కొడగుప్రజలను పోగుచేసి బైటివాళ్లను వంపించేసి దొర అయినట్లే తానూ ప్రజలను ఓచోటజేర్చి పరాయివాళ్ళను వంపించేసేటంతధోరణిలో మాట్లాడాడు.

బసవన్న ఈ ధోరణికి ఏంచెప్పాలో తెలియక మౌనంగా వుండిపోయాడు.

కొంచెంసేపు పోనిచ్చి అతడు రాజుతో 'దొరలు మడకేరికి బైలుదేరవచ్చా?'అన్నాడు.
రాజు: 'మడకేరి ఏమిటి? నాల్కునాడు ఏమిటి? వెళ్ళి బోపణ్ణకి చెప్పు. మా మాటప్రకారం నడవడం మంచిదని. అప్పటికీ అతడు వినకుండావుంటే మేం మడకేరికే వస్తాం, సరిహద్దులకే వస్తాం' అన్నాడు ధీమాగా.

బసవన్న: 'చిత్తం ప్రభూ!' అని మడకేరికి తిరుగుమొగం పట్టాడు.

# 148

బసవన్న మడకేరికి చేరకమునుపే బోపణ్ణ తన దళంవెనకాల కుశాలనగరానికి బైలుదేరేసాడు. బసవన్నకు బోపణ్ణను వెంబడించి, అతన్నే చూడడమా లేక వేరే ఏమైనాచేయడమా ఏమీ తోచలేదు. ఏంచెయ్యాలి అని రాణిని ప్రశ్నించాడు. రాణి: 'మంత్రి అయ్యగారినిచూడు' అని సలహా ఇచ్చింది.

బసవన్నపోయి లక్ష్మీనారాయణయ్యను కలిశాడు. 'ఆయన రాజభవనానికివెళ్లి అమ్మాజీని కలుసుకొని మాట్లాడుదాం' అన్నాడు. ఇద్దరూ రాణివద్దకు వచ్చారు. లక్ష్మీనారాయణయ్య రాణికి 'ఇప్పుడు వ్యవహారంఅంతా బెడిసిపోయి నాచేయి మీరిపోయింది తల్లీ! తమరు ఏమిచెబితే అది నేను చేస్తాను. అయితే దేనికైనా బోపణ్ణగారి అంగీకారం కావాల్సివుంటుంది' అని చెప్పాడు.

'ఆయన రాజాగారికి ప్రతికక్షులుగా నిల్చారు. అటువంటిఆయన అంగీకారం మనమేమని తీసుకోవడం?'

'ఆమాటకొస్తే మీరూ రాజాగారికి ప్రతికక్షులేనమ్మా! ఇదివరకు అయిందంతా ఓ ఎత్తు. ఈతడవ జరగబోయేది ఇంకో ఎత్తు.'

'మంచిదే అయ్యవారూ; ఇప్పుడు ఏమిటి దారి.'

'సంవత్సరం క్రిందట మేము చెప్పినట్లు చేసివుంటే....'

'పెనిమిటిని అడవికి పొమ్మన్నవాళ్ళు, వేరే ప్రత్యేకించి భార్యకు 'నువ్వూ అడవులకు వెళ్లాలమ్మా' అని చెప్పాల్సినపని లేదు అని సీతమ్మవారు చెప్పిందట వెనకటికి అయ్యవారూ! రాజుకు జరిగేదేదో మాకు జరగనివ్వండి. వేరే ఏమీ మేము ఒప్పుకోము.'

'రామచంద్రుణ్ణిగురించి తెల్పినమాటలు లోకంలో ఎవరి కన్వయించవచ్చు తల్లీ!'

అదీ అక్కడే చెప్పింది అయ్యవారూ! 'పతి పెద్దవాడైనా నేను ఆయన్ను విడిచివుండ లేను' అని అందిట అమ్మవారు. పెద్దవాళ్ళు రాసినవిషయం ఇది. విన్నవాళ్లం మనం. ఆ మాటను నెరవేర్చాలి.

'మీమాట నిర్దోషమైంపేనమ్మా! అయితే దేశాని కిప్పుడు ఉపద్రవం వచ్చివుంది. అందు కని ఏమో చెప్పాను. మన్నించాలి. మరి ఏం చేయాలో ఆజ్ఞాపించండి.'

'మీరువెళ్ళి రాజాగారినిచూసి కూతురు రాణి కావడానికి వారిని ఒప్పించండి. కుశాం నగరానికిపోయి బోపణ్ణగారికితెలిపి ఈ ఉపద్రవం ఇక్కడికి నిలిపివేయించండి. గొప్పమనసు వుంచి మమ్మల్ని అందరిని నడపించండి అని మేము వేడుతున్నామని బోపణ్ణగారికి తెలియ జేయండి.'

లక్ష్మీనారాయణయ్య 'తమ ఆజ్ఞానుసారం! తల్లీ! అల్లాగే కలుస్తాను' అన్నాడు. ఇంటికివచ్చి, నడిచినసంభాషణాక్రమం తల్లికిచెప్పి, బసవన్నతోపాటు నాల్కనాటి రాజభవ నానికి బయల్దేరివెళ్ళాడు.

# 149

తాను సింహాసనం దిగిపోవాలి, కూతురు రాజ్యానికి రావాలిఅంటే రాజు ఒప్పుకొనేవాడే నేమో. కాని బోపణ్ణ చెప్పినకారణంగా ఇట్లా జరగడం రాజుకు ఇష్టం కాలేదు. అతడు బస వన్నను తిట్టాడు. రాణిని హీనపరిచాడు. లక్ష్మీనారాయణయ్యను గదమాయించాడు. బోపణ్ణకు శాపనార్థాలు పెట్టాడు. కూచొని మాటాడడానికి సుఖంగాలేక లేచి చేతులుకాళ్లూ వణకుతూ వుంటే, గదిలో ఓ గోడనుంచి ఇంకో గోడదాకా తిరిగితిరిగినడుస్తూ కేకవేశాడు, అరిచాడు, నానాగందరగోళం చేశాడు.

లక్ష్మీనారాయణయ్య ఆ అవాకులు చెవాకులన్నీవింటూ మెదలకుండా వుండిపోయాడు. చివరికి బసవన్న వీరరాజు కాళ్ళమీదపడి 'ప్రభూ! పెద్దవాళ్ళకు రోజులుగా వున్నాయి; అమృ వేళ; ఎట్లాగో, ఉపాయంగా నడచుకోవాలి. ఈమాటకు ఒప్పుకోండి. [illegible]సంగతి

చూడండి' అని దీనదీనంగా బ్రతిమాలాడు. రాజు కాలు విడిపించుకొని, మళ్ళీ నాలుగుసార్లు ఇటునుంచి అటూ, అటునుంచి ఇటూ పరవళ్ళుత్రొక్కి 'సరే! అయ్యవారూ! మా కన్యకుగా రాజ్యాన్ని వదిలేస్తాం. మీరు వెనక్కు వెళ్ళిపొండి. మీ వ్యయం లెక్కకట్టి ఇచ్చేస్తాం అని తెల్లవాళ్ళకుచెప్పి వాళ్ళను వెనక్కు పంపించేయండి' అన్నాడు.

లక్ష్మీనారాయణయ్య: 'చిత్తం ప్రభూ!'

రాజు: 'ఇది మీరు మావాళ్లైవుండి మా పక్షాన తెల్లవాళ్ళకు చెప్పాల్సినమాట.'

లక్ష్మీనారాయణయ్య అంగీకరించి చేతులు ముకుళించాడు. బసవన్నతో బైటికి వచ్చేశాడు.

దొర ఒప్పుకొన్న సంగతి తెలిసి, చీకట్లో కొంచెం వెలుగురేకలు చిమ్మినట్లైంది రాజుకి. నడచినవృత్తాంతం అంతా అమ్మకి చెప్పి లక్ష్మీనారాయణయ్య బోపణ్ణను చూడటానికి కుశాల నగరానికిపడి పోయాడు.

# 150

ఫ్రేసరుదొర ఏర్పాటుప్రకారం ఆయన చేతికింది అయిదు దళాలు ఒకేరోజు సుమారు మధ్యాహ్నంవేళకు తమదారి ముగించుకొని కొడగు పొలిమేరలు చేరాయి. అయిదు పొలిమేరల లోనూ గడికాపరులు ఎదుటి దళనాయకునికి బోపణ్ణగారు పంపించినసమాచారము తమతమ కరణీకులద్వారా తూ. చా. తప్పకుండా తెలియజేశారు.

కుశాలనగరానికివచ్చిన దళంతోపాటువున్న ఫ్రేసరుదొర తానే ఈ రాయబారం విన్నాడు. 'దానికేమీ అభ్యంతరంలేదు' అని ప్రత్యుత్తరం పంపించాడు. మిగిలిన నాలుగు వైపులావున్న ఎదుటి దళనాయకులు ఇల్లాగే జవాబులిచ్చారు. అరకలగూడుదారిలోని పొలిమేరదగ్గిరమాత్రం వ్యవహారం కొంచెం ఎగుడుదిగుడుగా నడిచింది.

బెంగుళూరు విడిచివచ్చాక అప్పాజీ, కర్నల్‌దొరతోబాటు బైలుదేరాడు. కొంచెం దూరం సాగినతర్వాత అరకలగూడి కటువైపు పోయినదళానికి స్థలపరిచయంవున్న ఒకని సాయం అవసరమనిపించి ఆ వైపు పోయినదళాన్ని వచ్చిచేరాడు. పొలిమేర తాకింతర్వాత ఎదుటిసైన్యంనుంచి వచ్చినమాటవిని 'ఇదేమిటి సంగతి? మేము సిపాయీలవద్దకు పోయి, దీని అభిప్రాయం ఏమిటో తెలిసికొనివస్తే మంచిది' అన్నాడు.

దళనాయకుడూ, తానూ కొంచెంసేపు మాట్లాడుకొని ఈపని అప్పాజీచేస్తేనే బావుంటుందని నిశ్చయించుకొన్నారు. అప్పాజీవెంట ఒకమనిషిని పిలుచుకొని ఎదురుదళంవైపు నడిచాడు.

[1]గడిదగ్గిర నిలబడ్డ నౌకర్లకు పడవాలు కఠినమైన ఆజ్ఞచేసివుంచాడు. 'మనం ఒప్పుకొనేవరకూ ఎవడూ ఇటువైపు అడుగుపెట్టడానికి వీల్లేదు. వస్తే ఇంకోమాట ఆలోచించనక్కర్లేదు. తుపాకి పేల్చండి' అని.

పొలిమేర సిపాయి తుపాకితీసుకొని 'నిలు. ఇటు రాకాడు' అని అరిచాడు. అప్పాజికతనిమాట వినబడలేదో, వినబడ్డా అర్థం కాలేదో అతడు 'నేనొక్కడినే వస్తూవున్నా. ఓమాట మాటాడాలి, అంతే' అని నడిచి వస్తూనేవున్నాడు. నాలుగడుగులు వేశాడు.

గడి సైనికుడు ఎత్తినతుపాకి అతనిగుండెలకు గురిచూసి కొట్టాడు; అప్పాజీ అక్కడే చచ్చిపోయాడు.

అప్పాజీవెంట వచ్చివున్న నౌకరు నేలమీద పడుకొనిపోయాడు. ఓ నిమిషానికి లేచి అప్పాజీశవాన్ని లేవదీసికొని పది అడుగులు వెనక్కునడిచాడు. మళ్ళీ తుపాకి పేల్చిన చప్పుడు వినబడగానే నడక కొంచెం మెల్లనచేసి శవాన్నిపట్టుకొని తనసైన్యంవైపు వెళ్లాడు.

తోటిమనుష్యులు ఎదుటికి వచ్చారు, అప్పాజీశవాన్ని శిబిరంవైపు పట్టారు. దగ్గిరనున్న మైదానంలో ఓ గుంటతీసి దాన్ని అక్కడనే మన్ను చేసేశారు. నడచినవృత్తాంతం విన్నవించిరా, అని దళం నాయకుడు ఓ నౌకర్ను కుశాలనగరానికి పంపించాడు.

## 151

ఇక్కడ కుశాలనగరంలో కర్నల్‌ఫ్రేసర బోపణ్ణకు 'మీరు ఇక్కడకువస్తారా? నన్ను అక్కడికి రమ్మంటారా? తమఇష్టం ఎట్లావుంటే అట్లాగు తెలపండి. మీ మర్యాదకు తగని ఏ వ్యవహారమూ మేము సూచించము' అని చెప్పంపాడు. బోపణ్ణ 'మేమే అక్కడికి వస్తాం' అని చెప్పిపంపి అరదీయులో అతనిశిబిరానికి పోయాడు. ఫ్రేసరు బోపణ్ణను, అతి గౌరవంగా స్వాగతించాడు. తన వసతిగుడారంలోపలికి పిలుచుకొనిపోయి ఓ పీఠాన్ని ఇచ్చి అయన కూచున్నమీదట తాను కూచున్నాడు.

---

1 గడి = Border. సం.

'తమరు కొడగురాజ్య మంత్రివర్యులు. తమరిస్థానం దొడ్డది. తామే ఇక్కడికిరావడం మూలాన తమసౌజన్యం ప్రకటమౌతోంది. తాము నిగర్వశిరోమణులు అని ప్రజలు చెప్పు కొనేది అబద్ధం కాదు' అని మృదువుగా ప్రశంసాగర్భంగా మాట్లాడారు.

'ప్రజలకు మనసంగతి తెలియదు పోనీండి. అయినా మీ మంచిమాట మాకు కావాలి.'

'చాలా సంతోషం. కుంపిణీ సర్కారు కొడగురాజ్యంమధ్య నడుస్తూవున్న ఈ వ్యవ హారం ఎట్లా ఓ దారికి వస్తుందని మీ రనుకుంటున్నారు?'

'రాజుగారు, వారిచెల్లెలు, చెల్లెలి పెనిమిటివిషయంలో దారితప్పి నడిచారు. చెల్లెలూ, ఆమె పెనిమిటిగారు మీవద్దకువచ్చివున్నారు. ఆవిషయమై మాట్లాడడానికి మీరు మీ ఉద్యోగస్థు లను వంపించారు. రాజుగారు వారిని బంధించివున్నారు. చెల్లెలు, చెల్లెలిమర్యాదనూ ప్రాణాల్ని కాపాడడానికి ఉద్యోగస్థులను విడుదలచేయడానికి, అనే రెండు పనులకోసం మీరు కొడగు మీదికి ససైన్యంగా తరలివచ్చారు.'

'రాజుగారు వారి చెల్లెలిబిడ్డను చంపేశారు. వారిని శిక్షించడంకూడా మా కర్తవ్యం. అదే విధంగా కొడగు భవిష్యత్తు క్షేమంగా వుండేటట్లు రూపొందజేయడంకూడా మీ కర్తవ్యమని కుంపిణీ సర్కారువారు ఆదేశించారు.'

'చెల్లెలు, చెల్లెలి పెనిమిటిగారి మర్యాద, ఆత్మగౌరవం అనేదాంట్లో రాజుగారు రాజా గారిబిడ్డను చంపిన ఈ కథకూడా చేరివుంది. కొడగుభవిష్యత్తులోని భద్రతాక్షేమాలు, కొడగు లోని పెద్దమనుషులు చక్కజూసుకోవలసినవిషయం. బైటివాళ్ళకు సంబంధవడ్డది కాదు.'

'కొడగుపెద్దలు అపేక్షించని ఏ పనీ, లవలేశమైనా మేము బలవంతంగా నెత్తినమోపేది లేదు. మీరు మీదేశాన్ని సరిదిద్దుకొనే సామర్థ్యంవున్నవాళ్ళు. ఈసంగతి కుంపిణీ సర్కా రుకు తెలుసు. అయినా ఇటువంటిసన్నివేశంలో, దేశవాసులే నడచుకోవాల్సివస్తే, తప్పులు సరిదిద్దడానికి చాలా విలంబంకాక తప్పదు. మిత్రులైన బైటివారు ఇటువంటివేళల్లో, రాజ్యంలో చెలరేగే చర్చలను, తగాయిదాలనూ, ఓదరికి చేర్చడానికి సహాయపడుతూ వుంటారు. ఈ సహాయంమాత్రమే మేము మీకు సూచిస్తున్నాం.'

'సంతోషం. తమ ఉద్దేశం ఏమిటో విశదమైంది.'

'రాజుగారు కుంపిణీ సర్కారువారిని ధిక్కరించారు. కుంపిణీ సర్కారు చెల్లెలికి ఆశ్ర యాన్ని ఇచ్చింది అనేకోపంతో చెల్లెలి బిడ్డను చంపేశారు. ఈ తిరస్కారానికి ప్రతిక్రియగా మేము రాజుగారిని సింహాసనంనుంచి దింపెయ్యాలి. హత్యాదోషానికి శిక్షగా వారికి మరణ దండన విధించవచ్చునేమో చూడవలసివుంది.'

'రాజుగారిని గద్దెనుంచి మా పెద్దలు, ఇప్పటికప్పుడే దింపేసినట్లైంది. ఈ విషయంలో తమరు క్షోభ్యం కలిగించుకోవలసిన ప్రమేయం లేదు.'

'సరే.'

'చెల్లెలిబిడ్డను చంపిననేరానికి రాజుగారిని దండించే అధికారం తమదిగాదు; ఆయన కుంపిణీ పాలితులలో ఒక్కరు కారు.'

'చాలా లెస్సగా చెప్పారు. దండించాలి అని కొడగులైన మీరు అపేక్షిస్తున్నట్లు మేము భావించాం. వద్దంటే మేము ఆ ప్రసక్తి తీసుకొని రాము.'

'మంచిది. ఇహముందు ఏమిటి జరగాలి చెప్పండి.'

'మా ఉద్యోగస్థులను మాకు వెంటనే విడుదలచెయ్యాలి. రాజుగారి చెల్లెలు, చెల్లెలి పెనిమిటి-వీళ్ళ ఇద్దరినిగురించి సరైనఏర్పాట్లు చెయ్యాలి. మేం సేనతో వచ్చినందుకు మాకైన వ్యయప్రయాసలకు ముదరా ఇవ్వాలిసివుంటుంది. ఇహముందు కొడగులో ఇటువంటి అరాచకం ఏర్పడకుండావుండేటట్లు తగినఏర్పాట్లు చెయ్యాల్సివుంటుంది.'

'రాజ్యంలో అల్లకల్లోలమైనపరిస్థితి వుండకూడదు నిజమే. కాని మేం చేసేఏర్పాట్లు మీ సమ్మతిని పొందవలసిన అవసరం ?'

'ఇందుకని కొడగు మేం పరిపాలించేభూమికి మధ్యభాగంలో వుంది. ఇక్కడ జరిగే అల్లకల్లోలాలవల్ల మా భూభాగంలో ఏదోవిధంగా వాటి ప్రభావప్రతిక్రియలుంటాయి. మాకు అటువంటి ఉపద్రవం వుండకుండా చూడవలసివుంటుంది.'

'మంచిది సార్ ! దీన్ని మీరు ఏవిధంగా చేద్దామనుకొంటున్నారు ?'

'మేము ఇదమిత్థమని ఓ నిర్ణయానికంటూ రాలేదు. మీరూ మేమూ సంప్రదించుకొని ఏవిధంగాచేస్తే మీకు సమ్మతమో అది తెలుసుకొని, ఆవిధంగా నడచుకోగలం. మీ ఇష్టం లేనిదే ఒక్కఅడుగైనా మేము పెట్టేది వుండదు.'

'చాలా సంతోషం సార్ ! మరి చెప్పండి.'

'మేము ఇంతదూరం రావడం కొడగుప్రజల క్షేమం ఆలోచించి. తమరు ఆహ్వానిస్తే ముందుకువస్తాము. రాజ్యాధికారానికి ఉత్తరాధికారి ఎవరు ? అనేవిషయం నిర్ధరించడంలో మీకు సాయంచేసి కొంతసేవ చేద్దామని మా కోరిక. కొత్తరాజు గద్దెనెక్కి ఈ వ్యవహారం అంతా శుభాంతంగా ముగిసింతర్వాత మీ ఆజ్ఞబడి మీ మిత్రులమై మాచోటికి వెనక్కి వెళ్ళిపోతాం.'

'దీనికి మీరు మడకేరికి వచ్చేతీరాలి అని అనుకుంటున్నారా ?'

'మీకు ఇష్టంలేకపోతే మేం వచ్చేదిలేదు. తగినఏర్పాట్లు చేసివచ్చి మాకు తెలియజేస్తే, మేము ఇక్కడినుంచే వెనుదిరిగి వెళ్ళిపోతాం.'

'మంచిది. కొంచెం ఆలోచించి ఓ గడియసేపట్లో మీకు మా నిర్ణయాన్ని తెలియజేస్తాం.'

'ఉత్తరాధికారి ఎవరు అని ఆలోచించడంలో, తమరు తమ మనస్సులో వున్నవాళ్ళతోపాటు, ఇహంశః ముగ్గురిపీ, కాదంటే ఖండితంగా ఇద్దరిపీ లెక్కలోకి తీసుకోవాల్సివుంటుంది.'

'ఎవరు ?'

'రాణీగారు, రాజుగారి కూతురూ, సహజంగానే తమలెక్కలోకి వచ్చేవాళ్ళు. రాజుగారి చెల్లెలు మూడోఆవిడ. దీన్ని మీరు ఒప్పుతారో, ఒప్పరో ? ఒప్పుకోండి అనే అర్థంలో ఐహాళః అని చెబుతున్నాం. తమకు తోచకుండావుండదగ్గవాళ్లు మరో ఇద్దరున్నారు. రాజుగారి దొడ్డప్పకొడుకు ఒకడు, రాజుగారి అన్న ఒకతడు.'

'రాజుగారి దొడ్డప్ప బిడ్డ ? సద్యా అన్న ?'

'రాజుగారి దొడ్డప్ప అప్పాజి అని ఓ దున్నారని మీరు గమనించాలి.'

'రాజుగారిదొడ్డప్ప అప్పాజి చనిపోయి ముప్పైఏళ్ల అయిందని జనం చెప్పుకుంటారే!'

'కావచ్చు. ఒకరు తాము అప్పాజి అని, మాదగ్గిరకు వచ్చివున్నారు.'

'ఇక్కడనే ?'

'లేదు; ఆరకలగూడువైపు పోయినదళంతోబాటు ఉన్నారు. తమరు కోరినట్లైతే వారిని మేము మడకేరికి పిలిపిస్తాం.'

'వారి బిడ్డమాటా మీరు చెబుతున్నది ?'

'అవును.'

'పిల్లవా డున్నాడా ?'

'లేదు. మడకేరిలో తమరిదర్శనం చేసుకొంటాడు.'

'ఇంకొకరు రాజుగారి సవతి అన్న ?'

'అవును.'

'ఇది మాకు పొత్తిగా కొత్తమాట. రాజుగారి తోడబుట్టింది ఆ చెల్లెలు ఒకామెతప్ప ఇంకొకడు ఉన్నసమాచారం మేము వినలేదు.'

'ఒక అన్న వున్నారని మాకు ఉత్తరాలు వచ్చాయి. ఇందుకు సంబంధించిన కాగితాల నన్నింటినీ మేము తెప్పించివుంచాం. అవసరమనితోస్తే తమరు అనుమతిస్తే తమకు చూపిస్తాం.'

'మంచిదిసార్ ! ఈవిధంగా విచారణ అంతా జరగాలిఅంటే మీరు మడకేరిలోవుండడం వాంఛనీయం.'

'మీ ఇష్టం. రండి అంటే రావడానికి మా అడ్డేమీ లేదు.'

'ఇటు చూడండి. మేము పిలిపించాం, మీరు వచ్చారు. పని అయింది. మీరు వెళ్లిపోవచ్చు అని మాప్రజలు చెప్పగానే బైలుదేరిపోవాలి; స్నేహం నిలుపుకోవాలి.'

'మీ స్నేహంకంటె మాకు ఎక్కువైంది ఏమీలేదు. మేము కొడగుజనులకు మిత్రులమై వచ్చాం, సేవకులమై వచ్చాం. వాళ్లు సుఖంగా బ్రతుకుతున్నారనేమాట వృథమైన మరు క్షణంలో, వాళ్ళ ఆజ్ఞపొంది మాపాటికి మేము వెనుదిరిగి పోతాం.'

'సరే, మరేమీ లేవుగా ?'

'లేవనే అనిపిస్తోంది. మా మీ ఈ ఒప్పందంమాటలన్నీ సారాంశంగా ఇంగ్లీషులోనూ, కన్నడంలోనూ పది పది వాక్యాలు వ్రాసి ఓ కాగితం పంపిస్తాను. ఇంగ్లీషువాక్యాలకు యథా మూలంగా వ్రాసింది అని దుబాసి శపథం చేస్తారు. ఇంగ్లీషుకు ఒప్పుకొని నేను, కన్నడంలో వున్నదాన్ని ఒప్పుకొని మీరు దానిమీద వ్రేవ్రాళ్లు చేద్దాం. ఆ కాగితం ఓ ప్రతి మీదగ్గిర, మరోప్రతి మాదగ్గిర వుంటుంది.'

'మీ ఇష్టానుసారం చేయండిసార్.'

'రాజకీయాల్లో ఇటువంటివి జరుగుతూవుంటాయి. ఇది మా వాడుక. ఎక్కడో, ఎవరో మాట తోసేసివుంటారు. అంచేత వ్రాసిపెట్టుకొనేపద్ధతి మాలో వుంది.'

'మాట వట్టి గాలిమాట అన్నవాళ్ళు వ్రాత వట్టి సిరాపోత అనలేరా ? అభ్యంతరం లేదు. అల్లాగే కానివ్వండి.

# 152

కర్నల్ ఫ్రేసరు చాలా కుశాగ్రబుద్ధి. సేనాధికారంలోనేకాదు, జనులతో వ్యవహరించేతీరులో, పరిపాలన సాగించేపద్ధతిలోకూడ అతడు చాకచక్యం, నైపుణ్యాంకలవాడు. తనమధ్య బోపణ్ణమధ్య జరిగినసంభాషణలో ఒప్పుకొన్నవిషయాలు ఆయన అప్పటికప్పుడే ఇంగ్లీషులో పది వాక్యాలుగా వ్రాసిపెట్టాడు. దుబాసినిపిలిచి దాన్ని కన్నడంలో అనువదించమని కోరాడు. ఆయన వ్రాసిన కన్నడవాక్యాలను బోపణ్ణవద్దకు పంపించి ఒప్పుకున్నవిషయాలు, ఇందులో సరిగా వచ్చాయా తెలుపాల్సింది అని నేడాడు.

విషయాలు సరిగానే వచ్చాయి అని బోపణ్ణ తనసమ్మతిని తెలియజేసాడు. చిత్తు వ్రాత కాగితాన్ని వెనక్కు పంపించాడు.

ఫ్రేసరు దుబాసికి రెండు పెద్ద వ్రాతప్రతులు సిద్ధపఱుపమనిచెప్పి, బోపణ్ణకు నేను మధ్యాహ్నం తమ పాళెంకు వస్తాను. మన ఒప్పందం కాగితాలప్రతులు తెస్తాను. ఇద్దరమూ ఒకేసారి చేవ్రాళ్ళు పెట్టవచ్చు అని కబురుచేశాడు.

సంధ్యాకాలంలో ఆయన బోపణ్ణదగ్గిరకు వచ్చాడు. బోపణ్ణ ఆయన్ను సగౌరవంగా స్వాగతించి మొదట ఆయన్ను ఆసీనునిగాజేసి ఆ తర్వాత తాను కూచొని, [1]కొడగ ఆంగ్లే

1 కొడగ = కొడగుదేశవాసి—అనువాదకుడు. దేశపరమైన ఈశబ్దం, జాతిపరంగాకూడ మారింది. తెలుగులో 'తెలగ' శబ్దం వంటిది.

యునికంటె శిష్టాచారంలో తక్కువవాడు కాడనిపించుకొనేటట్లుగా ప్రవర్తించాడు. ఒప్పందం పత్రాన్ని కరిణీకులచేత చదివించుకొని ఇద్దరూ చేవ్రాళ్లు చేశాడు. ఫ్రేసరు ఓ పత్రాన్ని బోపణ్ణకు ఇచ్చి, రెండోపత్రాన్ని బోపణ్ణచేతిమీదుగా తాను తీసికొన్నాడు. ఈవిధంగా వీళ్ళ ఇద్దరిమధ్య ఒప్పందం కుదిరింది.

ప్రధానకార్యం ముగించుకొని ఫ్రేసరుదొర బోపణ్ణతో రెండుమాటలు ఆత్మీయంగా మాట్లాడాలని కూచున్నాడు. 'మైసూరు చాల అందమైనదేశం. తాను నడిచినమార్గం అతి సుందరమైన, శోభారమణీయమైన దేశమధ్యంగా వుంది. కావేరి కంటికి ఎంతో ఇంపు సొంపులు చేకూరుస్తుంది. కొడగు చాల సుందరమైనప్రదేశంగా కానవస్తోంది. కొడగులు చాల ధీరులు, స్వాతంత్ర్యప్రియులు, మర్యాదస్థులు అని విన్నాను.' ఇటువంటివే ఎన్నో మాటలు ఆయన మాట్లాడాడు. బోపణ్ణ మాటకారి కాడు; కాని ఆయన అంగ్లేయులది ఇదో ధోరణి అని ఎరుగు. అంచేత ఆయన చెప్పిందాన్ని మర్యాదగావింటూ ఆయన నాలుగు మాటాడితే తాను ఒక్కమాటే మాట్లాడుతూ సంభాషణ నడిపించాడు.

# 153

వాళ్లు ఈవిధంగా మాటాడుతున్నప్పుడు బైటనుంచి లక్ష్మీనారాయణయ్య కంఠధ్వని విన బడింది. బోపణ్ణ తలెత్తి ధ్వనివచ్చేవైపు చెవి పెట్టాడు. అది లక్ష్మీనారాయణయ్యది అని దృఢపడింది. ఫ్రేసరుదొరతో 'ఓ క్షణం అనుమతి ఇవ్వాలి. మాతోబాటువుండే మంత్రి వచ్చి నట్లు కనబడుతోంది. ఆయన్ను స్వాగతించాలి' అని లేచి వాకిలిదగ్గిరకు వెళ్ళాడు.

లక్ష్మీనారాయణయ్య అప్పుడే కుశాలనగరంచేరి బోపణ్ణవసతికి వచ్చాడు. బోపణ్ణను చూడాలని ఆయన చెప్పేటప్పటికి కరణీకుడు ఆయనకు 'అంగ్ల కర్నలు వచ్చివున్నారు, మంత్రి వారితో మాట్లాడుతున్నారు' అని చెప్పాడు.

అంగ్లకర్నల్ బోపణ్ణ వసతికి వచ్చేంతదూరం మాట నడిచింది అని లక్ష్మీనారాయ ణయ్య ఊహించుకోలేకపోయాడు. ఈసంగతి వినేవరికి ఆయనకు గుండె ఝల్లుమంది. తాను రాజునుంచి తెచ్చిన సందేశం నిష్ప్రయోజనమైంది అని ఆయనకు తట్టింది.

లక్ష్మీనారాయణయ్యను చూడగానే బోపణ్ణ 'నమస్కారం అయ్యవారూ! దయచేయండి' అన్నాడు. ఆయన దగ్గిరకురాగానే 'కర్నలుదొర వచ్చివున్నారు. తామూ వారిని చూడవచ్చు' అని చెప్పాడు.

'అంతకుముందు నేమా మీరూ, ఓ రెండుముక్కలు మాటాడుకోవవిలేదా ? బోపణ్ణా!'

'అట్లా అయితే ఈయన్ను పంపించివేయనా ?'

'పంపించండి. మనం మాట్లాడుకోవడం అయినతర్వాత అవసరమనుకొంటే మనమే వారిదగ్గిరకు వెళ్ళుదాం.'

'మంచిది. వారికి చెప్పివస్తాను.'

బోపణ్ణ ఫ్రేసరువద్దకువెళ్ళి 'తమరు మాకు కొంచెం సావకాశం ఇవ్వాలి. తమ వసతి దగ్గిరవుంటే మేమేవచ్చి కనబడతాం' అనిచెప్పి మళ్ళీ లక్ష్మీనారాయణయ్యవద్దకు వచ్చారు. ఫ్రేసరు తన వసతికి వెళ్ళిపోయాడు.

# 154

'ఇక్కడికి మీరు వస్తారని నాకు తోచలేదు' అని బోపణ్ణ అన్నాడు. లక్ష్మీనారాయణయ్య జరిగినసంగతి వివరించాడు. బోపణ్ణ అన్నిమాటలూ విని 'మీరు నన్ను రాతిగుండె వాణ్ణి అనకండి అయ్యవారూ! రాణిగారివిషయంలో నాకు సానుభూతి వుంది. మీకు రాజాగారు చెప్పేమాటకు నేను మనసొగ్గలేను' అన్నాడు.

'రాజాగారినిగురించి మీ కెంత వేసటో నాకు అంతే బోపణ్ణ. కాని ఆమాట ఇప్పుడు ముగిసిపోయింది చూడండి. రాజాగారు గద్దెవిడిచి పోతామంటున్నారు, కూతురు దాన్ని అధిరోహించాలి అంటున్నారు. ఈమాటకు మనము సమ్మతించి, ఈ తెల్లవాళ్ళను వెనక్కు పంపించివేయాలి అని చెప్పారు. ఈవిధంగాచేస్తే ఉపద్రవం తొలగిపోతుంది కదూ ?'

'సింహాసనం విడిచిపొయ్యే అంతవరకే ఆయనగారిపని. కూతురికి కట్టబెట్టేపని ఆయనది గాదు. తక్కరు అంతా ఒప్పుకుంటేకదూ ఆయన ఆమాట సాగించేది ?'

'ఔను నిజమేననుకో.'

'చూడండి అయ్యవారూ! పోయినసంవత్సరం, ఆరునెలలక్రిందటో, కనీసం ఎనిమిది రోజులక్రితమో ఆయన ఈమాట చెప్పివుంటే నేను ఒప్పుకోవడానికి సావకాశంగా వుండేది. అప్పటి కింకా ఆయన పేరుకైనా రాజుగారు. ఇప్పు డాయన ఎవరు ?'

'సరి; ఆయన చెప్పారు అనికాదు మనకు కావాలి అంటేనే దీన్ని చేద్దాం గాపీ.'

'ఏమీ అభ్యంతరంలేదు. కాని ఇది రాజుగారి ఆజ్ఞ అనేమాట మనకి వద్దు. రాజైనవారు గద్దెనుంచి దిగిపోయారు. ముందు ఎవరు రాజు, కొడగు కుంపిణీల సంబంధమేమిటి, ఇది రాజుకు సంబంధించిందికాదు. వీళ్ళమాట ఆయన ఎత్తకూడదు. వదిలేసెయ్యాలి.'

'తమ మనస్సును మీకుతెలిపి, తెల్లవాళ్లతోమాటలాడి వాళ్లను వెనక్కుపంపించివేయాలి సింది అని అంటున్నారు రాజుగారు. మీరు ఆయనమనస్సుతో మనకు పని లేదంటున్నారు.'

'ఎక్కడ అయ్యవారూ! ఇంకోసారి చెప్పండి. రాజుగారు తమ మనస్సును మీకు విప్పి చెప్పినాక దాన్ని నాకు తెలిపి, ఆ తర్వాత తెల్లవాళ్ళకు చెప్పండి అని అంటున్నారా?'

లక్ష్మీనారాయణయ్య జవాబు చెప్పలేదు. బోపణ్ణ ముఖంచూస్తూ కూచున్నాడు.

'నాకు చెప్పమని రాజు అనలేదు. ఆయన్ను కాపాడడానికని మీరు ఈమాట ముడిపెట్టి అంటున్నారు.'

'మీకు చెప్పమని స్పష్టంచేయలేదు. కాని వారి ఊహ అదే.'

'చూడండి అయ్యవారూ! మా మీ మనస్సులు ఒక్కటే; కాని మన ఆలోచన ఒక్కటి కాదు. మీరు అనుకొనేది కొడగు, రాజుగారిదని. నేను చెప్పేది, కొడగు మనదీ అని. మర్యాదకుగా, మీవంటివారు చెప్పుమాటలు విని నమ్మి, రాజైనవాళ్ళు కొడగు తమదీ అని నాట్యంచేస్తారు. ఆ నాట్యం ఇప్పుడు సమాప్తం అయింది. ఇంకా రాజై వున్నవారు, అర్థం వుందో, అర్థం లేకనో బోపణ్ణకు చెప్పుఅని చెప్పాల్సినపని లేదు. ఆయన చెప్పలేదని నేను మన ప్రజలగతి ఏమి అని చూడకుండా వుండలేను.'

బోపణ్ణ మామూలుగా ఒక్కఊపున ఇన్నిమాటలు మాట్లాడేవాడుకాడు. లక్ష్మీనారాయణయ్యకు, ఈమాటలు విన్నమీదట, ఇంకా చర్చను కొనసాగించి ప్రయోజనంలేదనిపించింది. ఆయన మౌనముద్రాధారి!

## 155

ఇక్కడిమాటలు ముగించుకొని వీళ్ళిద్దరూ కర్నలుదొర వసతికి వెళ్ళారు. పోతూ దారిలో, బోపణ్ణ లక్ష్మీనారాయణయ్యతో 'అప్పాజీ, వారికుమారుడు ఈ దొరలను చూశారట: అప్పాజి, అరకలగూడు దారివెంట వస్తూవున్నసైన్యంతోపాటు వున్నారట!' అన్నాడు. లక్ష్మీనారాయణయ్య 'సంతోషం. కాని ఆయన్ను ప్రజలు సమ్మతించేమాట కష్టం. ముప్పై ఏళ్ళతర్వాత, బైట ఎక్కడనో వుండిపోయినవారిని ఎరిగినవాళ్ళసంఖ్య తక్కువ, మరి కావాలనేవాడు ఎవరుంటారు?' అన్నాడు. బోపణ్ణ: 'మన రాజుగారికి సద్యా ఓ అన్నయ్యకూడా వున్నాడుట. ఎవరో ఈ తెల్లదొరలకు ఆవిషయం వ్రాశారట, వారిని చూపిస్తాం అనికూడా అందులో వుందిట.'

లక్ష్మీనారాయణయ్య: 'నాకు తెలిసినంతమేరకు ఎవరూ లేరు. ఎవరు ఎవరిని సృష్టించి తెస్తారో తేనివ్వండి చూద్దాం.'

బోపణ్ణ: 'నేను తెల్లదొరలకు ఆవిధంగానే చెప్పాను.'

ప్రేసరుదొర వసతికిచేరి బోపణ్ణ దొరకు లక్ష్మీనారాయణయ్య పరిచయం కలిగజేశాడు. కర్నల్ లేచినిలబడి లక్ష్మీనారాయణయ్యకు నమస్కరించి 'కూర్చోవాలి' అని ప్రార్థించాడు.

అందరూ కూచున్నారు. కుశలసంప్రశ్నం ముగిలింది. బోపణ్ణ. 'మా అయ్యవారు కరారు కాగితం చూస్తారు' అనిచెప్పి తన్రపతిని లక్ష్మీనారాయణయ్య చేతికందిచ్చాడు. ఆయన ఆ కరారుపత్రం చదివాడు. 'దీన్ని ఇప్పుడు ఏమీ చేయడానికి లేదుగా' అని అడిగాడు.

బోపణ్ణ. 'ఒప్పందం మీకు సరిగా లేదా? అయ్యవారూ!'

'ఓసంగతి నాకు బోధపడడంలేదు బోపణ్ణ!'

'ఏమిటంటారు?'

'ఇహమీద రాజాగారు ఏంచెయ్యాలి అని.'

'ఏమీ చేయనక్కర్లేదు. మెదలకుండావుంటే చాలు. మేము చెప్పినట్లు చేస్తే చాలు.'

'నచ్చారా బోపణ్ణ!'

'రా వనిలేదు; మేము పట్టుకొని పిలిపిస్తాం.'

'మన్రపజలు వెళ్ళారా?'

'మన్రపజలుపోతే మర్యాదగానే వుంటుంది. పోలేదు. బైటివారిని పంపిద్దాం అయ్యవారూ!'

'ఇంత రాతిగుండె లేమయ్యా నీవి బోపణ్ణ!'

'నేను మొదటే చెప్పాను. అయ్యవారూ! మన ఇద్దరిమనసులూ ఒక్కటే అయితే ఆలోచనలు వేరు వేరు. నేను చేసేది తప్పని అనిపిస్తే, తప్పని చెప్పండి. ఆలోచిస్తాను. అవునని తోస్తే సరిదిద్దుకొంటాను. కాదనిపిస్తుందీ నాకు తోచిందాన్ని నేను చేస్తాను. మీరు సరేనని నన్ను వదిలేసెయ్యాలి. నామీద కోప్పడకూడదు.'

లక్ష్మీనారాయణయ్య అవహాయుడై కూచుండిపోయాడు.

'కొడగు మీది బోపణ్ణ! దాన్ని మీరు పరాయిచేతుల కప్పగించవచ్చు' అన్నాడు విషణ్ణంగా.

# 156

లక్ష్మినారాయణయ్యకు తనప్రయత్నం నిష్ఫలమైంది, తాను ఇంకా రాజుకు చెప్పేదేమీలేదు అని తోచింది. ఆయన బోపణ్ణ సమ్మతిపొంది మడకేరికి వెనక్కొచ్చారు. వెంటనే రాణికి తనవల్ల అయేపని ఏమీ లేనందున మెదలకుండా వుండిపోయాను అని కబురుచేశాడు. అతడు స్వయంగా దగ్గిరకు రాకపోవడంచేత తానుగా కనిపించడం ఇష్టంలేదని, రాణి గ్రహించి ఆమాట అంతటితో వదిలిపెట్టింది. ఆయన చెప్పంపించినమాట విసవన్న తనకు చెప్పినాక రాజు 'ఏమైందో వచ్చి తానే చెప్పవలసిందిపోయి ఈ చెప్పంపించడం ఏమిటో నీ బావనయ్యః' అని చిరాకుపడి కేకవేశాడు.

లక్ష్మినారాయణయ్య వెనక్కువచ్చిన మరుదినం కర్నలు ఫ్రేసరు తనదళాన్ని కుశాల నగరంలోకి నడిపించితెచ్చాడు. ఆ మధ్యాహ్నం ఆతనిసైన్యం బోపణ్ణ సేనవెంట మడకేరికి ప్రయాణమై బైలుదేరింది. ఆ సాయంకాలానికి నగందారినడిచి మరుదినం ఉదయంలేచి మిగతానగాన్ని ముగించి మధ్యాహ్నంవేళకు మడకేరికి చేరాయి.

బోపణ్ణ మొదట చెప్పంపించి ఈ ప్రయాణానికి కావలసినసౌకర్యాలు ఏర్పాటుచేశాడు. దారిలోవున్న ఊళ్ళల్లో ప్రజలు అక్కడక్కడా వీళ్ళను ఆపి స్వాగతంపలికి మర్యాద చూపించి ముందుకు సాగనంపుతూ వచ్చారు. ప్రజలవేషభూషణాలు, వాళ్ళ వినయసౌశీల్యాలు, వాళ్ళు చేస్తూవున్న కొమ్ముబూరా, కాహళ తప్పెటమ్రోతల కోలాహలాలు ఫ్రేసరు దొరకు వింత అనిపించాయి. ఇటువంటిప్రజను పరిపాలించడం అట్టే కష్టమైనపని కాదను కొన్నాడు.

మడకేరిలోకూడా కొడగు తక్కదులు ఉత్తయ్య తక్కను ముందుపెట్టుకొని, పేట వర్తకులు చిక్కణ్ణశెట్టి నేతృత్వంక్రింద, ఊరిలోని ఇతర పెద్దమనుషులను కలుపుకొని వీళ్ళకు స్వాగతవాక్యాలు పలికారు. కర్నలు ఫ్రేసరు బోపణ్ణ అనుమతితో దుబాషిని ముందు పెట్టుకొని రెండుముక్కలు తాను విన్నవించుకొన్నాడు. 'మేము మీ స్నేహితులంగా వచ్చాము. మీ ఆతిథ్యాన్ని కోరుతున్నాం. మమ్మల్ని ఋణగ్రస్తులుగా చేయకండి. మా సేవలు స్వీకరించి మమ్మల్ని కృతార్థులనుచేయండి అని వేడుకొంటున్నాం. కొడగుప్రజలు సుఖంగా వుండాలి, వాళ్ళకోరికలు నెరవేరాలి, దానికి మేం సాయపడాలి అని మా ఉత్సాహం. మా కోరిక మీ నాయకుడైన బోపణ్ణగారు మన్నించారు. వారు మమ్మల్ని పిలిపించారు. స్వాగతంపలికి మీరూ మీ సమ్మతిని ప్రకటించారు. మీరిచ్చిన స్వాగతానికి, ప్రకటించిన ఆదరభావానికి మేము మీకు కృతజ్ఞతాభివందనాలు చెల్లిస్తూవున్నాము.

దగ్గిరవున్న జనం [1]'ఉఘే' అని సంతోషాన్ని సూచించింది. గ్రేసరు బోపణ్ణతోబాటు ముందుకునడిచి తనకై ఏర్పాటుచేసిన వసతిలో దిగాడు.

మధ్యాహ్నం అతడు బోపణ్ణఇంటికి వచ్చాడు. బోపణ్ణను పిలుచుకొని తనవసతికి వెనక్కువచ్చాడు. ఇద్దరూ అక్కడకూచొని ఇంక అనుసరించాల్సిన కార్యక్రమం ఏమిటి అని మంత్రాలోచన నడిపారు.

మాటలు ప్రారంభించడానికిముందు బోపణ్ణ, లక్ష్మీనారాయణయ్యకు, అతడూ రావాలి, చర్చల్లో పాల్గొనాలి అని కబురు చేశాడు. లక్ష్మీనారాయణయ్య 'క్షణంవుండి వస్తాను. మంత నాలు నడవనివ్వండి. బోపణ్ణగారు చేసేనిర్ణయమే నా నిర్ణయమూ అని చెప్పండి' అని జవాబు పంపించాడు. రెండుగడియలుపోనిచ్చి వాళ్ళదగ్గిరకు వచ్చాడు.

అంతలోపల వాళ్లు ఎట్లా నడుచుకోవాలో, ఓ నిర్ణయానికి వచ్చేశారు. గ్రేసరు కుంపిణీ సర్కారువారి ప్రతినిధిగా ఓ ప్రకటన ప్రకటించాలి. 'కొడగు రాజుగారు వీరరాజేంద్రులు దేశ పరిపాలన తిన్నగా చేయక, దుష్టులై ప్రవర్తిస్తూ, ప్రజలను పీడించి, అనేక హత్యలనుచేసి, తెల్లవారి ఉద్యోగస్థులను చెఱలోపెట్టి, కుంపిణీ సర్కారును ధిక్కరిస్తూవున్నందున వారికి తగినశాస్తి చేయడంకోసం మేము ససైన్యంగా రావాలిసివచ్చింది. రాజువల్ల దుఃఖాలకు పాలైనప్రజలు మాదగ్గిరకు ఎన్నోఫిర్యాదులు తెచ్చారు. వాళ్ళ ఫిర్యాదులను స్థానికంగానే విచారించాలని మా ఉద్దేశం. మేము ఇక్కడకు వచ్చేసమయానికే, మీ ప్రముఖులైన పెద్దలు, వీరరాజేంద్రులను రాజ్యాధికారంనుంచి తొలగించినట్లు మాకు తెలియవచ్చింది. ఈ విషయంలో ఇంక మేం చేయాల్సింది ఏమీలేదు. కొడగుప్రజలు కొత్తరాజుగారిని నియమించుకోవాలిసివుంది. ఎల్లాగూ ఇంతదూరం వచ్చాంకదా అని ఈపనిలో మేం మాకు చేతనైనంత సాయం చేద్దామనుకుంటున్నాం. ఈ గద్దెకు వారసులమంటూ కొంతమంది కుంపిణీ సర్కారుకు కాగితాలు పంపించారు. వాటినిగురించికూడా మేము బహిరంగంగానే మీ ప్రముఖుల సభలో తెలియజేస్తాం. కొడగుజనం సుఖంగావుండాలనేదే కుంపిణీ సర్కారువారి ఉద్దేశం. దీన్ని సాధించడం ఎట్లాగా అనేది కొడగు ప్రజానీకం నిర్ణయించాల్సినవిషయం. కుంపిణీ సర్కారువారి కోరిక' ఉపన్యాస సారాంశమిది.

అంగ్లసేన వచ్చిందని విని భయపడి నాల్కునాడులోని రాజభవనంలోకి పారిపోయిన వీరరాజుకు 'కొడగు 'తక్కరులు' మిమ్మల్ని గద్దెనుంచి దింపేశారు. మీరు వెంటనేవచ్చి మా వశం కావాలి.' అని తెలుపుతూ ఓ కరణీకుని పంపించవలసివుంటుంది. కూడా ఏభై మంది కొడగుసైనికులు, యాభైమంది కుంపిణీసేన సిపాయీలు, పోవాలిసివుంటుంది. రాజుగారు ఒప్పుకుంటే వారినిపిలిచి తీసుకొనిరావడం, లేక హఠంపట్టితే యుద్ధంచేసి పట్టుకొని తీసుకొనిరావడం ఇవీ చేయదగినపనులు.

---

1 'ఉఘే = జయనినాదం.

రాణిగారికి, రాజకుమారిగారికి నమ్మకం కలిగేటట్లు మాట్లాడాలి. మేము ఏవిధమైన ఇబ్బందీ కలగజేయం. చింతకు ఎటువంటికారణమూ లేదు అని ధైర్యం చెప్పాల్సివుంటుంది.

ప్రస్తుతానికి ఆలోచించాలిసింది ఈపాటే!

వాళ్ళీ మాటలు ముగించి, కరణీకులు ఈవిషయాలు గుర్తు వ్రాసుకొనేసమయానికి లక్ష్మీనారాయణయ్య వచ్చాడు. కార్యక్రమం తనకు సమ్మతమేనని అంగీకారముద్ర వైచాడు.

ఆపై ఓ గడియలోపల, కొడగుసైన్యం సిపాయీలు ఏభై మందిగల దళం ఒకటి, కుంపిణీసేనవారి ఏభై సిపాయీల పటాలము ఒకటీ, లెఫ్టినెంటు కర్నల్ జాక్సను అనే అధికారి ఆధిపత్యంక్రింద నాల్కునాడు రాజభవనంవైపు సాగివెళ్ళాయి. గుర్రాలకీ, మనుషులకూ ప్రయాసలేకుండా మెల్లిగా నడిచి, రాత్రి దారిమధ్యలో విడిసి, తెల్లవారుజామునేలేచి ముందుకు నడిచాయి. మరుదినం ఉదయం పొద్దు మూడుమూరలు పైకి ఎక్కేవేళకు నాల్కునాడు రాజభవనంముందు వచ్చిచేరాయి.

# 157

ప్రేసరుదొర చేసినప్రకటన మడకేరిజనానికి చాలా ఇష్టమైంది. అనేకులు ఒక్కరికొక్కరు మెచ్చుకుంటూ మాట్లాడుకొన్నారు. 'ఈ కుంపిణీవారు నిజానికి ఎంత గొప్పవాళ్లు! సైన్యాన్ని తెచ్చారు. బెదరిస్తే వద్దనేవారులేరు. అయినా ఎంతమర్యాదతో నడుచుకొంటారు!' అన్నది వాళ్ల మాటల సారాంశం.

రాత్రి గడిచిపోయింది. పొద్దు పొడిచింది. కొడగు తక్కరులు, పేటలోని శెట్టి యజమానులు, ఊరిలో పెద్దలు రాజభవనంలో మైదానంలో చేరడం మొదలుపెట్టారు. సభ పది గడియల్లో ఆరంభం కావాల్సివుంది. కర్నలు దొర దానికి సిద్ధమౌతూవున్నాడు.

ఒక సౌఖుడువచ్చి అతనికి ఎవరో స్త్రీ మిమ్మల్నివచ్చి కలుసుకోవాలి అనుకుంటోంది-వచ్చివుంది అని తెలిపాడు. దొర 'కూర్చోమనిచెప్పు. వస్తున్నాను' అన్నాడు. రెండునిమిషాలుపోనిచ్చి బైటికి వచ్చారు.

చూడడానికివచ్చిన ఆడుది భగవతి. ఆమె నిలబడి చేతులుముకుళించి నమస్కరించింది. ఆవేళకు దుబాసి ఓ గదిలోంచి బైటికివచ్చాడు. ప్రేసరుదొరకు ఓ ప్రక్కగా నిలబడ్డాడు. 'ఏమిటి చెప్తున్నారు చెప్పండి' అని భగవతికి నిరూపించాడు.

భగవతి: 'నన్ను ఇక్కడిజనం భగవతి అని పిలుస్తున్నారు. నేను కర్నలు దొరగారికి తెలియజెప్పాల్సినవిషయం ఒకటి వుంది. అది చెప్పడానికనే వచ్చాను' అంది.

ఫ్రేసరు: 'సంతోషం చెప్పండి.'

'నేను ఎవరైనది కొంచెం తమకు వివరంగా చెప్పాల్సివుంది. బెంగుళూరు దొరగారికి ఇంతకుముందు కొన్ని కాగితాలు చేరివున్నాయి. లింగరాజుగారికి పెద్దకొడుకు ఒకడు వున్నాడు. కొడగు రాజ్యాధికారానికి, ఇప్పటి రాజుగారికంటెమా, ఆయనకు ఎక్కువహక్కు వుంది అని వాటిలో చెప్పబడివుంది.'

'అవును.'

'ఆ కాగితాలు వ్రాసినదాన్ని నేనే.'

'అట్లాగా! సంతోషం. ఈ విషయాలన్నీ ఇప్పుడు జరగబోతూవున్నదశలో పరిశీలించ బడతాయి. ఇవన్నీ తాము అందులో చెప్పండి.'

'చెబుతాను. అయితే ఇక్కడ ఈవిషయాలు నా పరిచయం తమకు కలగాలని చెప్పాను.'

'సరి.'

'మీరు రాజుగారిని పట్టుకొనితేవడానికి సైన్యం పంపిందారుట కదూ! అక్కడ చేయాల్సిన పనినిగురించి ఓమాట తమకు సూచించాలని అనుకొంటున్నాను.'

'అవశ్యం అట్లాగే.'

'రాజుగారు ఒప్పుకొని మీ సైన్యంవెంటవస్తే మంచిదే. బహుశా రారు. హఠంపట్టి కూచుంటారు. మీ సైన్యం రాజభవనాన్ని ముట్టడించాల్సివుంటుంది. దానికి మీరు పంపే దండు చాలదు.'

'మీరు చాల తెలివైనవాళ్ళుగా కనబడుతున్నారు. ఇప్పుడు ఎంతమంది వెళ్ళారనుకుం టున్నారు?'

'సుమారు నూరుమంది. ఇంకో నూరుమందైనా వెళ్లడం అవసరం. ఎట్లాగూ రాజు గారు సులభంగా చేతికి చిక్కరు. ఆయన స్వభావంచేత మొండి. రాజభవనంనుంచి తప్పించు కొని అడవుల్లోదూరి, మిమ్మల్ని కష్టపెట్టవచ్చు. ఆయన తప్పించుకొనిపోకుండావుండేటట్లు చూడడం అవసరం.'

'ఏం చెయ్యాలో చెప్పండి. తప్పక చేద్దాం.'

నాల్కునాడు రాజభవనంలో ఏడరలగదిలోంచి, అడవిలోకి పోవడానికి పీబుగా ఓ సొరంగం వుంది. ముట్టడిసైన్యాలతో గట్టిగా పోరాడడం నిరర్థకం అని అనుకొంటే రాజుగారు ఈ మార్గంనుంచి తప్పించుకొని పారిపోవచ్చు. మీరు సొరంగం బైటివాకిలికి సిపాయీలను పంపించి రాజుగారు ఆ మార్గంనుంచి తప్పించుకొనిపోకుండా, ఆయన ఆవైపువస్తే ఆయన్ను పట్టుకొనే ఏర్పాట్లు చెయ్యాలి.'

'సొరంగం బైటివాకిలి ఎక్కడవుందో ఇప్పుడు తాము చెప్పుతారుకదూ?'

'అహా! నేలమీద గుర్తువేసి గీతలురాసి చూపిస్తాను. మీవాళ్ళు దాన్ని తెలుసుకోవాలి.'

'చాలా వందనాలు. భగవతమ్మగారూ! మేము మీకు ఎంతకృతజ్ఞతచూపినా చాలదు. మేము వచ్చివున్నపని సిద్ధించినతర్వాత తమరు చేసినఉపకారానికి బదులుగా తాము కోరిన ప్రకారం ఋణం తీర్చుకోవడానికి మేము ప్రయత్నిస్తాం.'

'ఋణమనిగాదు. ఇప్పటి రాజుగారిఅన్న రాజు కావాలనేది మా కోరిక.'

తెల్లదొరకు ఈ సందర్భంలో ఓ ప్రశ్న వేద్దామని నోటిదాకా వచ్చింది. 'అతనికి మీకూ ఏమైనా చుట్టరికమా?' అని. మనస్సుకు బాగుండదనితోచి ఆయన ఈ ప్రశ్న అడగలేదు. మెదలకుండా 'మంచిది' అన్నాడు.

'రాజుగారితో వారిమైత్రి బసవయ్య అనే అతడున్నాడు. మీ మనుషులు వాళ్ళఇద్దరినీ పట్టుకొనితేవడం మంచిది. వాళ్ళల్లో ఎవరినీ హింసింపరాదు. ఇద్దరినీ భద్రంగా ఇక్కడికి పెట్టుకొని రావాలి అని తమరు ఏర్పాటుచెయ్యాలి.'

ఈమాటల్లో ప్రకటమౌతున్న మన స్తత్వం ప్రేసరుదొరకు కొంచెం విచిత్రమనిపించింది. రాజు ఈమెకు కావలసినవాడు కాదు. అతనికి బాధైతే ఈమెకు ఎందుకు? ఆయన ఇక్కడికి వచ్చేటప్పటికి క్షేమంగా వుండాలిట! ఎందుకో!

ఈ హెచ్చరిక బహుశః మంత్రినిగురించింది కావచ్చు. అతడొకవేళ, ఈమెకు కావాలిసినవాడు కావచ్చు. ఈమె ప్రియుడైనా కావచ్చు. రూపవతి అయినస్త్రీ. ఈమెకు ఓ ప్రియుడుంటే ఆశ్చర్యపడాల్సింది లేదు. అయితే ఈ ఆలోచన బైటికి చెప్పాలిసిందికాదు. దొర వచ్చి కాగితాన్నీ సీసంకడ్డీనితెప్పించి భగవతిచేతికిచ్చి 'రాజభవనం వాకిలి ఏప్రక్క ఉన్నది, సొరంగం దానికేప్రక్కఉన్నది గుర్తుపెట్టి ఇయ్యండి' అన్నాడు.

భగవతి అట్లాగే గుర్తుపెట్టి ఇచ్చింది. దొర 'మీరుచేసిన ఉపకారం గొప్పది. తమరు ఏమైనా ఇంకా తెలియజేయవలసిందుందా?' అని జిజ్ఞాసగా అడిగాడు. 'మరేమీలేదు. మేము దేవిఉపాసన చేస్తాం. ఈసందర్భంలో రాజుగారు మీ కైవసం అవడం నిశ్చయం. అయితే మీరు ఆయనప్రాణానికి ఎట్టిఅపాయం తీసుకొని రాకూడదు. కొట్టడం, గుద్దడంలాంటి పనులు కూడవు. అటువంటి దేదైనాఅయితే మేము చేస్తున్నవ్రతానికి భంగం. అంచేత ఆయనకు గానీ, ఆయన మంత్రికిగానీ, ఏవిధమైన హింస జరుగకుండా చూడాలి. వాళ్ళిద్దరూ ఇక్కడకు సురక్షితంగా చేరేటట్లు ఏర్పాటుచేసుకోవాలి. ఇది మా ప్రత్యేకప్రార్థన.'

'మంచిది భగవతిగారూ! ఆవిషయం మేము సరిగ్గా చూస్తాంలెండి.'

భగవతి ఆజ్ఞపొంది బైటపడింది. దొర ఓ సేవకునిపిలిచి బోపణ్ణకు ఓ చిన్నకాగితం పంపించాడు. 'నాల్కనాడులోని రాజభవనానికి ఇంకా అంతమందిమనుషుల్ని పంపించడం క్షేమకరం అని సూచనవచ్చింది. మా మనుషులు ఓ పటాలం బైలుదేరుతోంది. తమరు

ఓ పటాలంపంపిస్తే మంచిది. వారి బాగా తెలిసినమనుషులై వుండాలి.' దోవణ్ణ, వెంటనే జవాబు పంపించాడు. ఓ పదివాలు, కూడా ఏభై మంది కొడగులు, ఒక్కగడియులోపల దొర బంగళాదగ్గిరకువచ్చి నిలబడ్డారు.

మరి కొంతసేపటికి పైగావచ్చిన ఈ దళం, కాప్టన్ కార్పెంటర్ అనే అధికారి అధిపత్యంక్రింద నాల్క్నాడు రాజభవనంగురించి ప్రయాణమై వెళ్లింది,

# 158

లక్ష్మీనారాయణయ్య తానేరాకుండా సమాచారంమాత్రం పంపించాడే అని కోపగించుకొని రాత్రి ఎట్లాగో గడిపాడు. వీరరాజు ఉదయంలేచి సిద్ధమై బైటికి అడుగుపెట్టేవేళకు మడకేరినుంచి ఓదళం సేన వస్తూవున్నట్లు తెలిసింది. అంతకుముందే బసవన్న చుట్టూవున్న మూడుగ్రామాలకు కబురుపెట్టి, సుమారు రెండువందలమందిజనాన్ని రప్పించాడు. సేన రావడం మంచికోసం కాదనితోచి అతడు ఆ జనాన్ని రాజభవనప్రాకారంగోడకు లోపలి ప్రక్కగా వరుసగా నిలిపాడు. తాను చేసివున్న ఏర్పాటును దొరకు చెప్పాడు. వీరరాజు స్వభావంచేత పిరికివంద గాడు. పడుచుదనంలో ఆయన ఏనుగుల్ని, పులుల్ని చంపినవాడే. కాని ప్రస్తుతం అనేకకారణాలవల్ల అతని దేహదార్ఢ్యం క్షీణించిపోయింది. బసవన్నమాటలు విని అయనమొగం వివర్ణమైంది. ఆయన 'మందు, గుండు, తుపాకి ఉన్నాయా?' అని అడిగాడు.

'భయంలేదు దొరా! మనవాళ్ళగురి సరైందే. పనిపడితే రోజా, రెండురోజులపాటు దెబ్బలాడడానికి ఏమీ ఫర్వాలేదు.'

'మంచిది; చూద్దాం ఎవరు వస్తున్నారో తెలియనీ.'

మరి కొంచెంసేపటికి పరసైన్యం కానవచ్చింది. దాన్ని నడిపించుకొంటూ వస్తున్నవాడు ఓ తెల్ల రౌతు.

సైన్యాన్ని తగినంతదూరంలో నిలిపేసి తెల్లవాడు ఓ నౌకరుచేతికి ఓ తెల్లజెండా ఇచ్చి 'రాజభవనంనుంచి ఎవరైనా రావాలిసివుంది. కొంచెం మాట్లాడాల్సిన పనివుంది' అని చెప్పించాడు.

బసవన్న రాజభవనంనుంచి కరణీకుని పంపించాడు. అతడు తెల్లవానితో మాట్లాడివచ్చి 'బెంగుళూరినుంచివచ్చిన సైన్యమంట! కర్నలుదొర మడకేరికి వెళ్ళారట! రాజుగారు తామై

మడకేరికివచ్చి అయనగారికి వశమైతే సరేసరి, లేకపోతే పట్టుకొనితెండి అని ఈ సైన్యాన్ని పంపించారట' అని విన్నవించాడు.

రాజుకు ఈమాటలు విన్నక్షణంలో కోపం, దర్పం పెనవేసుకొని పెరిగాయి. ఆయన 'ఏమిరా వీళ్ళపొగరు! తెగకొవ్వి మాట్లాడుతున్నారురా! పట్టుబడిపోవాలా లేకపోతే పట్టు కొంటారా? తుపాకిపేల్చి నలుగురు ముండమోపుల్ని తపాతపామని పేల్చివేస్తే బుద్ధి వస్తుంది' అని అడిగాడు.

బసవన్న: 'చిత్తందొరా! అయితే వచ్చినవాళ్లు బెంగుళూరివాళ్ళు. వాళ్ళ తుపాకులు మన తుపాకులకంటె మేలిరకం. మనం దాటుగా కొడతాం సరే. అయినప్పటికీ చాలాసేపు వాళ్ళను నిలవరించడానికి గాదు' అన్నాడు.

'అట్లాగని చెఱలో పడమంటావా?'

'లేదుదొరా! తమరు సరేనంటే నేనుపోయి మా దొరలు తమకుతామే స్వతంత్రంగా వస్తారు. చెర గిర అనేమాట చెప్పవద్దు, అనిచెప్పి వెనక్కు వస్తాను. పరాభవంమాట లేకుండా తప్పుతుంది. తల పైకెత్తుకొని వెళ్ళవచ్చు.'

'నువ్వేమో మహా బుద్ధిమంతుడవని అనుకుంటా వచ్చాను ఇన్నాళ్ళు! కుంటి! చెప్పి నట్లుచేయడం నీ జన్మలో నీకు తెలియదుగా!'

'అట్లాగే చేస్తానుదొరా! అయినా గడియ రెండుగడియలతర్వాత వాళ్లు మీదికి దండెత్తి వస్తే ఇక్కడ మీ రుండడం సుఖమైనదని గాదు.'

'ఇది సుఖంకాదంటే ఇప్పుడే నాశం కమ్మంటావా?'

'ఓ రెండుగడియలు మహా అయితే మూడుగడియలు వీళ్లను మనం ఆపేమే అను కోండి దొరా! తమరూ ఇటూ అటూ తిరుగుతూ ఇక్కడేవున్నట్టు కనబడుతూ, ఏడరల సొరుగునుంచి బైటపడడం మంచిది. వీళ్ళచేతికి చిక్కకూడదనుకుంటే ఓ కొన్నిరోజులు అడవిలో తల దాచుకొని వుండాల్సివస్తుంది. తెల్లవాళ్ళసైన్యం వెనక్కు పోయినతర్వాత బైటికి రావచ్చు, మడకేరికి వెళ్ళవచ్చు.'

'అది సరైనమాట. అవిధంగా చేయి. నాలుగు తుపాకులు పేల్చు, నా తుపాకి తెచ్చి పెట్టు.'

'చిత్తం ప్రభూ!'

ఈవిధంగాచెప్పి బసవన్న కరణీకునితో 'పోయి వాళ్ళకు చెప్పు. రాజుగారు ఒప్పు కోవడంలేదు అని. చొచ్చుకువస్తే పోరాడాలి, పదిమంది చచ్చిపోవాలి' అని ఆజ్ఞాపించాడు. ప్రాకారం లోపలితట్టు నిలబడ్డ తన మనుషులతో 'సిద్ధంగా వుండండి. ఆజ్ఞ ఇవ్వగానే తుపా కులు పేల్చండి. గుండు వృథా పోగూడదు. ఒక్కొక్కగుండుకు ఒకడుచొప్పున చావాలి. చురుకుగా హుషారుగా వుండండి' అని చెప్పాడు. రాజుగారిచేతికి ఓ తుపాకి ఇచ్చి 'మీరు

ఇంటిలోపలినుంచే పేలుస్తూఉండాలి. బైటికి అడుగుపెట్టకూడదు' అన్నాడు. అయిదుగురు గుర్రంరౌతులను పిలిచి, మాదప్ప అనేవాణ్ణి నాయకునిగా వుండమనంది 'వెనకవ్రక్కవున్న పౌరంగం చప్పరంవుండే అక్కడికిపోయి ఎదురుచూస్తోవుండండి, గడియ రెండుగడియల్లో రాజాగారు అక్కడికి వస్తారు. రావడంతోటే వారిని గుర్రంమీద ఎక్కించి పడమటికోనకు తీసుకునిపోవలసింది' అని ఆజ్ఞాపించాడు.

వాళ్లు 'అట్లాగే' నన్నారు. మాదప్ప వాళ్లను పిలుచుకొనిపోయి పౌరంగం వాకిలివైపు వెనకవ్రక్కనుంచి బైలుదేరివెళ్ళాడు.

# 159

కరణీకుడు రాజభవనంనుండివెళ్లి బసవన్న చెప్పినట్లే తెల్లసేనానికి సమాచారం పంపినప్పుడు అతడు 'రాజాగారికి, మంత్రులకు ఏవిధమైన అపాయం వాటిల్లకుండా చూడవలసిందని మమ్మల్ని ఆజ్ఞాపించివున్నారు. మేము వారికి ఏవిధమైనచెఱుపూ చేయం. పోరాడడమే అయితే వారు యుద్ధం ఆపేవరకు గుప్తంగా వుండనివ్వండి. మేము వారిని చెఱపట్టించి పిలుచుకొని పోవలసివుంటుంది' అని చెప్పంపించాడు. తనతోటిమనుషులు ఎంతెంతమంది ఎక్కడెక్కడ ఏవిధంగా నిలవవాలో ఆలోచించి దానికి తగ్గట్లుగా వ్యూహంపన్ని నిలబెట్టించడం మొదలు పెట్టాడు.

కరణం రాజభవనానికి వెనక్కువచ్చి తెల్లసేనాని అన్నమాటలు చెప్పడమేతడవుగా, రాజభవనం దళంవైపునుంచి తుపాకులు పేల్చినధ్వని వినబడింది. ఇటునుంచి బదులుగా తుపాకులు పేలాయి. యుద్ధం ఆరంభమైంది.

తెల్లసేనాని ఉద్దేశం - నేలలోని మిణ్ణుపల్లాలు వాడుకొంటూ ఒక నూటయాభైమంది సిపాయీలు, వేరేవేరే దిశల్లో ముందుకు సాగాలి. ఎదుటివాళ్ళ గురి తప్పేటట్లుగా ఇటూ అటూ తిరుగాడుతూ, తూగాడుతూపోవాలి; కొంతమంది ఎట్లాగూ దెబ్బతినేమాట నిజం. మిగతా చాలామంది ప్రాకారంగోడవాకిలివైపు పోవాలి. ఎదుటివాళ్లను తుపాకులతో కాల్చాలి. రాజభవనంలోకి చొరబడిపోవాలి అని.

ఈపని ఏమంత సులభమైందికాదు అని అతనికి తెలుసు. రాజభవనంవైపు చేసిన సన్నాహాలు, కట్టుదిట్టాలుచూసి ఇంకా కొంతమంది వచ్చివుంటే పని సులభంగా నెరవేరేది అను కొన్నాడు.

కొంచెంసేపు కదనం జరిగింది. బ్రిటీషుసైన్యం ఓ యాభైగజాలు ముందుకు వచ్చింది. మడికేరినుండి రెండోసారి బ్రిటీషుపోయినదళంలో చాలాభాగంవచ్చి వీళ్లతో చేరింది.

రాజు రాజభవనం పై అంతస్తుమీద నిలబడి, అయినంతవరకూ స్తంభాలచాటునవుంటూ, తనసైన్యం పరాయిసైన్యాలకైవాటం గమనిస్తూవున్నాడు. తనవాళ్ళ గుండుదెబ్బలమూలాన బ్రిటీషువాళ్ళు నలుగురు నేలకూలడంతో ఆయనకు ధైర్యంవచ్చింది. బ్రిటీషువాళ్ళు అప్పటికి ఒకర్నిమాత్రం గాయపడచేశారు. బసవన్న రాజభవనం ఎదంతాలో ఎత్తుమీదనిలబడి తన జనాన్ని ఇటుప్రక్క కాల్చు, అటుప్రక్క కాల్చు అని ఆజ్ఞాపిస్తూ అటూ ఇటూ తిరుగుతూ వున్నాడు. మొత్తంమీద మొదటిగడియలో రాజుకు అనుకూలంగానే వున్నాయి ఫలితాలు.

సాయపడటానికి మనుషులు దొరకగానే ఆంగ్లసేనాని మరింత ధైర్యంతో నడచుకోవాలి అని నిర్ణయించుకొన్నాడు. ఆయనసైనికులు మరింత వేగంగా ముందుకు చొచ్చుకొనివచ్చారు. చాలామంది దెబ్బతినిపోయారు. అయినప్పటికీ, ఆవేగంలో ముందుకువస్తే ఇంకోగడియలో ప్రాకారంగానే సమీపిస్తారు. తర్వాత రాజభవనంలోని సిపాయీలకు ఇప్పుడున్న వీలు వుండదు. కానైతే శత్రువుని ఎదురెదురుగా పోరాడటంలో తనవాళ్ళకి అపాయం అధికమే.

ఇంతలో బసవన్న పంపించిన అయిదుగురు రౌతులు సొరంగం వాకిలిదగ్గర వచ్చి చేరారు. మాదప్ప వాళ్లలో ఒకడిని ఓ ప్రక్కకు ఇంకొకణ్ణి ఇంకోప్రక్కకూ నిలిపి, రాజు గారు రావటంతోటే వారిని గుర్రంమీద కూచోబెట్టుకొని విడి గుర్రాన్ని ఓడాన్ని పట్టుకొని ఈ ఇద్దరు పారిపోవాలి. మూడుగజాల వెనుక్కు ఇంకా ఇద్దరు పారిపోవాలి అని హెచ్చరించి అక్కడ కాపాడుతూ నిలబడ్డారు. ఆ గడియలోపల వేరే అయిదుగురు రౌతులు వచ్చారు. వాళ్ళనాయకుడు ముద్దప్ప అనేవాడు; ఈయన మాదప్పనికి పైవాడు. మాదప్ప అతన్ని ఎరుగు. అయితే అతను సోదరులతోబాటు తెల్లవాళ్లపక్షాన పనిచేస్తున్నాడని తెలియదు. వచ్చినతోడనే ముద్దప్ప 'రాజుగారు ఇంకా రాలేదా ?' అని అడిగాడు. మాదప్ప 'లేదు' అని చెప్పి వెంటనే 'ఈయన మడికేరిలో వుండవలసినవాడు. ఇక్కడికెప్పుడు వచ్చాడు చెప్మా' అని అనుకొని 'మీరు ఎప్పుడు వచ్చారు ?' అని అడిగాడు. ముద్దప్ప 'ఇప్పుడే' అన్నాడు. మాదప్ప: 'మిమ్మల్ని బసవయ్యగారు పంపారా ?' ముద్దప్ప: 'ఈమాటలన్నింటికీ ఇప్పుడు సమయంకాదు. చెప్పినపని చేసిముగిద్దాం.'

ముద్దప్ప తనవెంటవున్న నలుగురినీ ముందుకు తెచ్చాడు. సొరంగంవాకిట్లో ఇంకా దగ్గరగా నిలబెట్టాడు. రెండునిమిషాల్లో కొత్తవాళ్లు వచ్చినవైపునుంచే వేరే ఇద్దరు నౌకర్లు వచ్చారు. కళ్ళెం, జీను అమర్చిన రెండుగుర్రాల్ని తెచ్చారు.

ముద్దప్పను, బసవన్న పంపించివుండాలి అనేతప్ప వేరే ఆలోచన మాదప్పకు పోనే లేదు. 'మంచిపనైంది. పనికి ఇంకా నలుగుర్ని సాయంగా వుండటంకోసం పంపించి వుంటారు' అనుకొని మౌనంగా వుండిపోయాడు.

# 160

రాజభవనం ముందువైపు కదనం మరింత జోరుగా సాగింది. బ్రిటీషుసైన్యంవాళ్ళు ప్రాకారం కోటదగ్గరకు వచ్చేశారు. బసవన్న వరండాలో తన మనుషులకు ధైర్యంమాటలుచెప్పి లోపలికి పరుగెత్తాడు. 'ఇంక ప్రభువులు ఇక్కడవుండడం మంచిదికాదు. సొరంగంగుండా బైటికి వెళ్ళిపొండి' అని రాజాగారిని వేడుకొన్నాడు.

రాజా: 'నువ్వేం చేస్తావు.'

'నేను వచ్చేస్తున్నా. దొరా! మీరు పదండిముందు. బైటికిపోగానే ముందు పారిపొండి నేను వెనకనుంచి వస్తున్నా. నాకోసం కనిపెట్టుకొని కూచోవద్దు.'

రాజును సొరంగంనుంచి పంపి వెనక ఒకమనిషినిపంపించి బసవన్న తిరిగి వరండా లోకివచ్చి నిలబడ్డాడు.

సొరంగం దారిలోదిగి బైటికి వచ్చేసరికి ఏమిటన్నా పసకై కనిపెట్టుకొనివున్న ముద్దప్ప మాదప్పలను, మహలక్ష్మి చూశాడు. ముద్దప్ప ముందునిలబడి తాను తెచ్చినగుర్రాన్ని తీసుకొని రమ్మనమని తన మనుషులకు సైగచేశాడు. అది దగ్గిరకురాగానే, దాన్ని ఎక్కడానికిగా రాజాకు సాయంచేశాడు. తనగుర్రాన్ని ఎక్కి అతనిప్రక్కన పెట్టుకొని 'పదండి' అని తన వెనకప్రక్క మనుషులకు గట్టిగా చెప్పాడు. వాళ్ళల్లో ఒకడు ఒకవిధమైనధ్వని చేశాడు. అది ఒకవిధమైన సంకేతధ్వని. ఒకటి రెండునిమిషాల్లో వాళ్ళు వచ్చివున్న దిక్కునించి ఇంకా పదిగుర్రాలు వచ్చాయి. వాటిని ఒక తెల్లవాడు నడిపిస్తూవున్నాడు. ఆయన గుర్రాన్ని పరు గెత్తించుకుంటూవచ్చి ముద్దప్పతో హిందుస్తానీలో 'మహాప్రభులు వీరేనా?' అని అడిగాడు. ముద్దప్ప: 'ఔను' అన్నాడు. ఆ శ్వేతముఖుడు వీరరాజుకు సలాంచేసి హిందూస్తానీలో 'మీరు మా బందీఅయినారు. మేము మిమ్మల్ని మర్యాదగా పిలుచుకొనిపోతున్నాం. ఏవిధమైన అడ్డూ చెప్పకుండా వెంట దయచేయవలసింది. తమకు చాలాచాలా కృతజ్ఞతగావుంటాం' అన్నాడు.

వీరరాజుకు దిక్కు తోచలేదు. 'ఇదేమైనా బసవన్న పన్నిన మన్నాగత ఏమో!' అని ఆయన ఎవరివైపుచూడకుండా మెదలకుండా ప్రశ్న వదిలాడు. తలపనితలంపుగా ఆయన చెయ్యి, నడుం పిస్తోలును తాకింది.

మాదప్ప రాజా మాటకు 'కావచ్చుదొరా!' అని జవాబిచ్చాడు. ఆదేశంలో ఆంగ్ల దళపతి 'మహాస్వామి! పిస్తోలుగొడవకు పోరాదు. అట్లా కానిపక్షంలో నేను దాన్ని నా వశం లోకి తీసికోవాలసివుంటుంది. తమకు అటువంటి అగౌరవం కలగజేయడం నాకు ఇష్టం కాదు' అన్నాడు.

రాజుచేతిని పిస్తోలునుంచి తప్పించాడు. ఒక్క అరనిముషంలో ఆయన మనస్సులో బసవన్నగురించి శతసహస్రాలైన ఆలోచనలు మెరుపుతీగెలా మెరిసిపోయాయి. 'ఈ బసవన్న, ఆ భగవతి, ఈ దొడ్డవ్వ వీళ్ళల్లో ఏదో కుతంత్రం వుంది. తనకు తెలియని కుట్ర ఏదో నడిచింది. ఏదో ప్రయోజనం ఆశించి బసవన్న తన్ను తెల్లవాళ్ళచేతుల్లో అప్పగించాడు' అని రూఢమైంది.

తెల్లసేనాని రాజును బందీగా తీసుకొన్నదళానికి అధిపత్యం వహించాడు. 'మహాప్రభూ! నాతోబాటు దయచెయ్యాలి' అని రాజుకు చెప్పాడు.

'మనజనాన్ని మూడువైపులనుంచీ ముట్టడించి రావి' అని ముద్దప్పను ఆజ్ఞాపించాడు. ఈవిరంగా వాళ్లు గుట్టమచుట్టి రాజభవనం ఎదుటివైపుకు సాగివచ్చారు.

# 161

రాజభవనం వరండాలో నిలబడి బసవన్న తనమనుషుల్ని ప్రోత్సాహపరుస్తూ నినాదాలుచేసి పోరాటం సాగిస్తూవున్నారు. అతనికంటికి రాజు, ఆయన్ను చుట్టుముట్టి ఓ ఇరవైమంది మనుషులు, గుర్రంఎక్కి రావడం కనబడింది. ఇదేమిటి నాకంటికి కనబడేది అని అతడు విస్మయ సంభ్రాంతుడయ్యాడు. వెంటనే అది రాజుగారై వుండరు అనుకున్నాడు. మరు నిమిషంలో సొరంగం వాకిటినుంచి వస్తూవుంటారు అని మనస్సుకుతోచి అతడు ఆ వస్తూ వున్న గుంపుమధ్యలోవున్న విగ్రహంపై చూపు నిగిడించాడు. అప్పటికి గుంపు చాలా దగ్గిరకు వచ్చింది. రెప్పవాల్చకుండా చూసేటప్పటికి బసవన్నసందేహం పటాపంచలైంది. కూడా ఎవరైనా సహాయంవచ్చి, రాజుగారు పోరాడటానికై వెనకప్రక్కనుంచి వచ్చారేమో ననే ఆలోచన ఓ లిప్తసేపు బసవన్నమనస్సులో మెరసింది. ఆ క్షణం ముగిసేలోపల ఈ ఆలోచన పాడుకోవడం ప్రారంభించింది. రాజుగారిప్రక్కన ఆంగ్లాధికారి ఒకడున్నాడే! బసవన్నకు గుండెలు ప్రీలాయి. ఈ తెల్లవాడు సొరంగందగ్గిర కాపలావుండి రాజును చెఱబట్టివుంటాడు. తమవ్యూహం భంగమైపోయింది. రాజు ఖైదీ అయిపోయాడే, ఇహ ఏమిటి గతి అని బసవన్న ఆందోళనపడిపోయాడు. వరండాలోంచి క్రిందికిదిగి పారిపోయి ప్రాకారం గోడ సింహద్వారాన్ని తీసుకొని బైటికివచ్చాడు. వెంటనే వల్లంలోకిదిగి 'అయ్యో! ప్రభూ! వీళ్ళకు చిక్కిపోయారా?' అని రోదిస్తూ చేయెత్తి రాజుగారికెదురుగ్గా వచ్చాడు.

కుంటుతూ, కుంటుతూ పరుగెత్తుతూ, వస్తూవున్న ఈ వ్యక్తినిచూసి ఆంగ్లదళపతి పైగచేసి తనప్రజల్ని ఆపేశాడు. రాజుగారిగుర్రాన్ని తన గుర్రాన్ని వున్నచోటవున్నట్లు విలిపేశాడు.

చిక్కిపోయారా అంటూ అరుస్తూ వస్తూవున్న బసవన్ననుచూసి రాజుకు కోపం మండిపోయింది. ఆయనకు బసవన్న కేక వినబడింది. మాట తెలియలేదు. వీడే తన్ను పట్టింపించి వుంటాడనే దృఢబుద్ధి ఆ సమయంలో ఆయనకు సిమెంటులా గట్టిపడిపోయింది. ఈ సొరంగంమాట, దీనిలోంచి తాను తప్పించుకొనిపోయే సందర్భం, ఇతనికికాక మరెవ్వరికీ తెలియదు. రాజభవనం ఎదుట యుద్ధంచేస్తున్నట్లు నటిస్తు ఓ గుంపును సొరంగంవాకిలికి పంపించండి అని దండెత్తివచ్చిన దళపతికి ఇతగాడే రహస్యం అంతా చెప్పివుంటాడు.

ఈవిధమైన నిశ్చయానికివచ్చిన రాజుమనస్సులో అంతవరకూ కణుదుగట్టివున్న కోపం, ఒక్కసారిగా పైకుబికి ప్రవహించింది: 'నువ్వే పట్టింపించావు. తగుదునమ్మా అని చిక్కారా మహారాయా! అంటున్నావు ముండమోపి' అని క్రుద్ధకంఠంతో ప్రేలుతూ ఆయన తన నడుముకు తగిల్చివున్న పిస్తోలు పైకితీశాడు. తిన్నగా ఎదుర్గా వస్తూవున్న తనసేవకునిగుండెకు గురిచూసి కాల్చాడు.

వీరరాజు చాలామంచి గురికాడు. తుపాకిపట్టినవేళల్లో ఆయనచేయి ఎక్కడాచూడని స్థైర్యంతో వుంటుంది. ఆయన తుపాకినుంచి బైటపడ్డగుండు సూటిగా గురినిభేదించడం ఖాయం. ఈసారి గుండు సూటిగా బసవన్నరొమ్ము దూసుకొనిపోయి గుండెకాయనే కొట్టేసింది. తనదొర తనపై కాల్చడంచూసి విస్మయంతో ఆ నిమిషంలో 'అయ్యో! ప్రభూ!' అని అరుస్తూనే బసవన్న గుండుదెబ్బతాకి చచ్చిపోయాడు. లిప్తకాలంలో చుట్టుకొనిపోయి ఒక్కమూటగా దొరఎదుట నేలమీద కూలబడిపోయాడు.

ఆంగ్లాధికారి రాజుగారిచేతిని గట్టిగావట్టుకొని 'ఎందుకిట్లా చేశారు?' అని అడిగాడు.

రాజు తనచేతిని విడిపించుకొని, 'వీడు ద్రోహి! మమ్మల్ని మీచేతికి అప్పచెప్పాడు' అన్నాడు.

'ఛీ, మీ ఊహ తప్పు.'

'ఎందుకు తప్పు? సొరంగంవాకిలికి మిమ్మల్ని అతడేగా పంపించాడు?'

'కాదు. సొరంగంసంగతి మాకు మడకేరిలో తెలిసింది. అదితెలిసే నేను రెండోదళంతోపాటు వచ్చాను.'

రాజుకు నమ్మకం కలగలేదు. ఆయన 'ఈ తెల్లవాడు బొంకుతున్నాడు' అనుకొన్నాడు. బసవన్నను చంపినదానికి ఆయన పశ్చాత్తాపపడలేదు రవంతైనా!

# 162

క్రిందటిరోజు సాయంకాలం ఊరంతటా చాటింపువేసి చెప్పినప్రకారం ఆరోజు ఉదయం, పది గడియలకు కొడగు తక్కరులు, నాడులోని ప్రముఖులు సభ ఒకటి రాజభవనంబైట ఏర్పాటు చేశారు. వేళకుసరిగా రావడం పడదు. ఓ గడియ ఆలస్యమవుతుంది అని చెప్పంపించి కర్నలు ఫ్రేసరు కొంచెం ఆలస్యంగా వచ్చాడు. బోపణ్ణ లక్ష్మీనారాయణయ్యగాక, మంత్రి పొన్నప్పకూడా వాళ్లజతను నిలబడి తెల్లదొరకు స్వాగతం పలికారు. వాళ్లవెంట దీక్షితులూ, ఉత్తయ్యతక్క వున్నారు.

చతుశ్శాలపైని వరండామధ్యలో నాలుగు ఆసనాలమీద తెల్లదొర, ముగ్గురుమంత్రులు కూచునివున్నారు. వెనకప్రక్క దీక్షితులు, ఉత్తయ్యతక్క, లింద్సె కూచునివున్నారు. వరండా కుడిప్రక్క కొడగు తక్కరు, ఎడంప్రక్క పేటలోని శెట్టిప్రముఖులు శోభిస్తూ వున్నారు. నికటవర్తిజనం చౌకులో పంక్తులు పంక్తులుగా మూడుప్రక్కలా కూచునివున్నారు. దొర ఎడంప్రక్కన మంత్రుల వెనకప్రక్క దుబాసి కూచునివున్నాడు.

ప్రజలకు ఏంమాటచెప్పాలో ఫ్రేసరు, బోపణ్ణ మొదటే ఆలోచించుకొనివున్నారు. సభావ్యవహారమంతా తెల్లదొరగారే నడిపించాలి అని వాళ్లు ఏర్పాటు చేసికొన్నారు. ఫ్రేసరు తన వక్తవ్యాన్ని హిందుస్తానీలో చెప్పాడు.

'సభను ప్రారంభించవచ్చునా? బోపణ్ణగారూ!'

బోపణ్ణ: 'కానివ్వవచ్చునండి సాబ్' అని అంటూ, 'అంతేగా పొన్నప్పగారూ! అయ్యవారూ!' అని తోటిమంత్రుల్ని ప్రశ్నించాడు. వాళ్లు 'మంచిది, అట్లాగే కానివ్వండి' అన్నారు.

ఫ్రేసరు: 'మీ రాజుగారైన వీరరాజులు దేశాన్ని సరిగా పరిపాలించడంలేదనీ, కోపంతో వినగటతో మీరు ఆయన్ను దొరతనంనుండి ఊడబీకారని వినివున్నాము. ఇది నిజమేకదూ?'

ఎవ్వరూ ప్రత్యుత్తరింపలేదు. ఫ్రేసరు దుబాసికి కన్నడంలో చెప్పండి అని ఆజ్ఞాపించాడు. దుబాసి ఆమాటను సభకు తెలిపాడు.

బోపణ్ణ తక్కరువైపు తిరిగి సైగచేశాడు. వారు 'ఔను' అని పెద్దగొంతుతో అరిచారు. బోపణ్ణ, శెట్టులు, యజమానులు, నగరప్రముఖులవైపు మొగంపెట్టాడు. వారూ పెద్ద గొంతుకతో 'అవునవును' అన్నారు.

ఫ్రేసరు: కుంపిణీ సర్కారువారు మీ కోరికను నెరవేర్చడానికిగాను, అందుకైన సాయం మీకు చేయడానికిగాను మమ్మల్ని పంపించారు. మేము వచ్చేముందే మీరు ఈ నిశ్చయానికిరావడం ఎంతైనా మంచిదైంది. బైటిప్రజలు మేమువచ్చి కలగాపులగం చేశామనే శంకకు తావులేకుండావుండడం మాకు చాలా సంతోషం.'

బోపణ్ణ తిరిగి సైగచేశాడు. తిరిగి తక్కిన్ప్రముఖులు 'అటువంటిసందేహం ఏమీ లేదు' అని జవాబు ఇచ్చారు.

క్రేసరు: 'ఈవిధంగా చెప్పినమీదట కొడగుప్రజలు మీరు కొత్తరాజుగారు ఒకర్ని ఎన్నుకోవాల్సివుంటుంది. రాజుగారికి మగపిల్లలు లేరు. రాణిగారికి జన్మించిన ఒక్కకుమార్తె వుంది. సాధారణమైనపద్ధతిని ఆమె గద్దెకు రావాలి. కాని ఆమెకు వయస్సు చాలదు. ఆమెను రాణిగా ఎన్నుకొంటే ఆమెగారిపక్షాన వ్యవహారం చక్కబెట్టడానికి పెద్దవారు ఎవరైనా వుండాలి. ఆమె మాతృశ్రీగారు ఈపనికి ఒప్పుకుంటే ఈ ఏర్పాటు బాగానేవుంటుంది'.

బోపణ్ణ పొన్నప్పవైపు తిరిగాడు.

పొన్నప్ప: 'కుమారిని రాణీ అనిపిలిచి, రాణీగారిని సంరక్షకురాలిగా నియమించడంకంటె రాణీగారికే రాజ్యాధికారం అప్పగించడం మేలు.'

'రాణీగారు సింహాసనానికి రావడానికి ఒప్పుకోరు. ఆ విషయం బోపణ్ణగారికి తెలుసు. అయినప్పటికీ, పొన్నప్పద్వారా ఈమాట చెప్పించడంలోని అంతరార్థం ఏమిటో' అని లక్ష్మీనారాయణయ్యకు చింత. ఆయన బోపణ్ణతో 'బోపణ్ణా, ఈ సంగతంతా మనం ప్రత్యేకంగా ఆలోచించి మంచిదనిపోస్తే, రాణీవారి దర్శనంచేసి వారికి విన్నపంచేసి వారికోరికమేరకు నడుచుకోవడం క్షేమం కదూ?' అన్నాడు. బోపణ్ణ 'ఆపని చెయ్యాలినేవుంటుంది అయ్యవారూ! ప్రజాహృదయం ఏమిటో మొదట తెలుసుకోండి. కొంచెం వినండి' అని ఆయనకు సమాధానం చెప్పాడు.

క్రేసరు. 'పొన్నప్పమంత్రిగారు రాజ్యాధికారాన్ని రాణీకే ఒప్పించాలి అని సూచిస్తున్నారు. దీన్ని మీరు ఒప్పుకుంటారు కదూ!'

బోపణ్ణ తక్కినవారివైపు చూశాడు. ఆయన 'సమ్మతమే సార్' అన్నాడు. బోపణ్ణ, 'ఈ మాట రాణీతో మాట్లాడి నిర్ధరించాలి. మంత్రి అయ్యవారు అట్లాగని అంటున్నారు. మాకూ అదే సమ్మతం' అన్నాడు.

క్రేసరు మెల్లగా ఆయన్ను 'సంతోషం. మేము రాణీగారిని ఇప్పుడు చూడవచ్చో విచారిస్తారా?' అని అడిగాడు.

బోపణ్ణ: 'అవశ్యం విచారించవచ్చు. అయితే వారితో మాట్లాడిరావడంలో చాలా సమయం పట్టుతుంది. అంతవరకు ప్రజలు ఇక్కడ కనిపెట్టుకొనివుండడం అనవసరం. మధ్యాహ్నం నాలుగుగడియలతర్వాత తిరిగివస్తే సరిపోతుంది. అప్పుడు అన్నిసంగతులూ నిర్ణయించవచ్చు.

క్రేసరు: 'మంచిసలహా ఇచ్చారు బోపణ్ణగారూ! అట్లాగే చేద్దాం.'

ఆపై క్రేసరుదొర ప్రజలను ఉద్దేశించి 'మేమూ, మంత్రులూ, రాణీగారిని సందర్శించి సంప్రదించవలసిన సంగతులున్నాయి. సంధ్యాసమయానికి తిరిగి ఈ విషయాన్నిగూర్చి

ముందు చర్చలు సాగించవచ్చు. తమరందరూ ప్రస్తుతం తమతమ ఇండ్లకేగి మధ్యాహ్నం నాలుగుగడియలపొద్దు జరిగింతర్వాత తిరిగి రావాలిసింది' అన్నాడు.

ప్రజలంతా లేచారు: పోవడం ప్రారంభించారు. వాళ్ళు సందర్శనార్థం రాణిగారికి కబురు జేశారు. రాణి: 'వెంటనే రావాలి. రాజుగారి విశ్రాంతికక్ష్యలో కనిపిస్తాం' అని సమాధానం చెప్పిపంపించింది. వాళ్ళు పది అడుగులువేసి రాజుగారి విశ్రాంతికక్ష్య చేరేసరికి రాణి అక్కడికి వచ్చివుంది.

## 163

ప్రజలు రాజును సింహాసనంనుంచి దింపారనేసంగతి ఆమెకు నివేదింపబడింది. ఒక రాజును పదభ్రష్టునిగాచేయడం వీళ్ళకింత సులభమైందే అని ఆమె చాలా కించపడింది. వాళ్ళు చూడాలి అని కబురుపెట్టినప్పుడు ఆమెకు కలిగిన మొదటిఆలోచన 'మీ ఇష్టంవచ్చినట్లు చేసుకోండి, పొండి, మమ్మల్ని సంప్రదించాల్సిన పనిలేదు. మీ మనస్సుకువచ్చినట్లు చేయడానికి మీరు స్వతంత్రులు' అని జవాబు చెప్పిపంపించాలని. కాని నేడు కాకపోతే రేపైనా తనకూతురు రాణి కావాల్సివుంది. తాను తొందరపడి ఆమె అదృష్టాన్ని పాడుచేయకూడదు అని వెంటనే తోచింది. సరేనని దర్శనార్థం సమ్మతించింది. నాలుగుమాటలకంటె ఎక్కువగా మాట్లాడకూడదు. తాను ధైర్యం కోల్పోయినట్లు ఏమాత్రమూ వాళ్ళకు కనబడకూడదు అనుకొని ఆమె బహుగంభీరంగా దర్పంతో నడిచివచ్చింది. ఇంటి యజమానురాలి హోదాకు తగినట్లు వాళ్ళకు చేతులు ముకుళించి, కూచోమనిచెప్పి తాను కూచుంది. ఓ నిమిషానికి రాజకుమారి వెనకనుంచి వచ్చింది. అమ్మప్రక్కన ఆమెనడుంకు చేయివైచి కౌగిలించుకొని కూచుంది.

ఫ్రేసరు: 'నేను కర్నలు ఫ్రేసరును. తమరిని ఇంతకంటె హెచ్చైన ఖఘడియల్లో సందర్శించివుంటే బాగావుండేదనుకొంటున్నాను. మేం చెప్పేమాటలు తమకు వెత కలిగించవచ్చు. వాటిల్లో వ్యక్తిపరంగా ఎటువంటి అగౌరవభావం లేదని భరోసా కలగజేస్తున్నాం' అని చాలా మృదువుగా సవినయంగా చెప్పాడు.

రాణి: 'తాము చాలా సత్యవంతులు అని వినివున్నాను. తమరు తప్పుదారిని నడవజాలరు. మిగిలింది దైవేచ్ఛపై ఆధారపడివుంది. చెప్పండి.

ఫ్రేసరు: 'రాజుగారివిషయంలో ప్రజలు గావించిననిర్ణయం ఈపాటికే మీకు తెలిసివుంటుందికదూ ?'

'అవును తెలిసింది.'

'జనం తమరు రాజ్యాధికారానికి రావడానికి అంగీకరించాలని మనసా వాంఛిస్తున్నారు.'

'అది సాధ్యమైనపనికాదు. అట్లా నడచుకోవడం మా ధర్మానికి విరుద్ధంగా వుంటుంది. మేము ఈసంగతి లోగడనే పెద్దలకు కొంతమందికి స్పష్టం చేసాం. ఈమాటను పెంచవద్దని వేడుతున్నాం.'

ఫ్రేసరు మంత్రుల మొగంవైపు చూశారు.

లక్ష్మీనారాయణయ్య: 'ముందే మేము ఈమాట మనవిచేసివున్నాం. ఈమాట ఇంతటిలో వదిలేయడం మంచిది.'

ఫ్రేసరు రాణినిచూసి 'ఆపక్షంలో తమకుమార్తెను రాజ్యాధికారానికై నిలబెట్టగోరుతాం. ఆమె ప్రాప్తవయస్క ఆయ్యేదాకా తాము ఆమెప దాసటగా వుండాల్సింది' అన్నాడు.

'రాజుగారు?'

'వారికి ఇష్టమైనచోటికి వారిని మేము పంపించివేస్తాం. అక్కడ వారికి అన్నిసౌకర్యాలు కలగజేస్తాం.

'ప్రభువులు ఎక్కడవుంటే అక్కడనే వుండదగినవారం మేము. మా కన్య రాజ్యాధికారానికి వారసురాలై ఇక్కడ వుండవచ్చు. ఆమెకు సాయంగా వేరే ఏర్పాటు చేయండి.'

రాజకుమారి. 'అమ్మాజీ! నే నొప్పుకోను అమ్మాజీ! నేను మీతోబాటే వుంటాను.' తల్లి చెంపకు చెంపఆన్చి ఆమెను చుట్టివేసింది.

దీన్నిచూసి అందరిమనస్సులూ ద్రవించాయి. ఫ్రేసరుకూడ చాలా నొచ్చుకొన్నాడు. కానైతే వేరేదారి ఏమీ లేదు. ఆయన: 'తమరు ఇట్లా అంటున్నప్పుడు కనీసం మూడు నాలుగేళ్ళపాటైనా వేరేఏర్పాటు చెయ్యాలిసివుంటుంది '

రాణి దానికేమీ మాటాడలేదు.

ఫ్రేసర్: 'అందుకు సంబంధించి తాము ఏమైనా సలహా ఇవ్వదలచుకుంటే....?'

'కొన్నిఏళ్ళల్లో మా కుమార్తె రాజ్యాధికారానికి రావాలని మేం వాంఛిస్తున్నాం. మిగతా విషయాలు మీ బుద్ధికి మంచిదిగాతోచినట్లు మీరు నిర్ణయించవచ్చు.'

రాణి లేచినిలబడే సూచనగా 'ఇంక మేము వెళ్ళవచ్చుకదూ!' అని అడిగింది.

రాణి ఇట్లా అనగానే ఫ్రేసరులేచి నిలబడ్డాడు. చాల సగౌరవంగా ఆమెకు నమస్కరించాడు. 'మేము ఆజ్ఞ కోరవలసినవాళ్ళం. తమరు ఆజ్ఞ ఇవ్వవలసినవారు' అని వినయంగా అన్నాడు.

రాణి లేచినిలబడి కూతురితోబాటు అంతఃపురంలోకి వెళ్ళిపోయింది.

# 164

వరండాలోకి వస్తూ లక్ష్మీనారాయణయ్య వెనక్కి నిలబడి బోపణ్ణను ఓ ప్రక్కకు పిలిచాడు. 'నేను మీరు చెప్పవలసినమాట ఒకటుంది బోపణ్ణా! దాన్ని ప్రకారం నడిపిస్తే బాగుంటుంది' అన్నాడు.

బోపణ్ణ: 'ఏమిటది చెప్పండి అయ్యవారూ!'

'రాజుగారిని వైదొలగించడం అయింది. వేరేవ్వారూ కూడదనడంలేదు. దీనికి ఒక్కటే నివారణోపాయం. దానికి మీరు ఒప్పుకోవాలి.'

'జరిగేమాటఅయితే దాన్ని త్రోసిపుచ్చను అయ్యవారూ!'

లక్ష్మీనారాయణయ్య క్షణం ఊరకుండి, 'రాజుగారు పనికిరారు, అమ్మాజీ కాదు, కూతురుగాడు అన్నమీదట మీరే దొడ్డమనస్సుపెట్టుకొని సింహాసనంమీద కూర్చోవడం మంచిది' అన్నాడు.

బోపణ్ణ లక్ష్మీనారాయణయ్యవైపు విస్మయావిష్టుడై చూశాడు. ఆయన ఈ సలహా ఎదురుచూడలేదు, ఈ బాపనయ్య ఈమాటను వ్యంగ్యంగా ఏమైనా అన్నాడేమోనని ఓ నిమిషంపాటు శంకించాడు. లక్ష్మీనారాయణయ్యచూపుల్లో కౌటిల్యం కానరాలేదు. ఆయన ఈ సూచన పరిశుద్ధమైనమనస్సుతో చేసినట్లు కానవచ్చింది. బోపణ్ణ సమాధానపడ్డాడు. ఆయనముఖం ప్రసన్నమైంది. ఆయన అన్నాడు. 'మంచిమాటే చెప్పారు అయ్యవారూ! కొడగు అటువంటిపని చెస్తారా? వేరే ఏమి కాదనుకోండి. దొరను ప్రక్కకునెట్టి వేరెవరైనా కూర్చోబెట్టితే మంచికోసం చేశామని చెప్పవచ్చు. దొరనుదింపిన సింహాసనంపై మేం కూర్చుంటే మంచికో మరి దురాశచేతనో ఎట్లా చెప్పడం? మీరు ద్రోహం అనకపోవచ్చు. కాని చూసినవాళ్ళు అట్లా అంటే మనం ఆమాట అబద్ధమనడానికి లేదు.

'మీరు చెప్పేదికాదు బోపణ్ణా. ద్రోహంకాదని నేను చెప్తాను. నేను చేసుకొంటున్నా నంటున్నాను. మీరు మంత్రులైవున్నది దేశం చేసికొన్న పుణ్యావశేషంకాదా అని ప్రజలకు తెలుసు. మీవంటివారు రాజులైతే మరింత భాగ్యవిశేషంగా భావిస్తారు. మనస్సు పెట్టండి. నేనే మీప్రక్కన వుంటాను. మంత్రిత్వం నడిపిస్తాను.'

'మీరు నడిపిస్తారు సరే అయ్యవారూ! దాని కష్టంలేదు. పైన కూర్చున్నంతమాత్రాన పెద్దలౌ కారు. క్రింద కూర్చున్నవారు చిన్నవారూ అయిపోరు. ఈ ద్రోహం అనేమాటనూ నేను వెనక్కి నెట్టేశాను. కానైతే కొడగునైన నేను రాజా కావడం?'

'విధి లేనప్పుడు కావలసిందే.'

'నేను ఒప్పుకోనుస్వామి! కొడగరు భూమాత బిడ్డలు. భూపతి అనేపేరుకు వారు ఎన్నడూ ఒప్పుకోరు. ఎవరికి కావాలి ఈ పెద్దమాట? కొడగ రాజుకావాలనుకుంటే ఈరాజు ముత్తాతకు ముత్తాతను రాజు ఎందుకుచేయడం వస్తుంది? ఆయన వెనకటిరాజులు అందరూ వచ్చిపోయారని వేరేరాజును కూచోబెట్టాలనివస్తే దేశంలోనిపెద్దలు అంతాచేరి ఆ బూడిద రాసుకొన్న బసుగును పోర అనలేదా? దొరతనానికి రావలసివస్తే భికారీవాళ్లే నయం, కొడగ పనికిరాడు అని అన్నారా లేదా పెద్దవాళ్ళు! ఇప్పుడైనా అదేమాట వస్తుంది. ఇష్టం వచ్చిన ముష్టివాడిని రానీ గద్దె నెక్కనీ రాజు అని పడివిద్దాం. మర్యాదతో నడచుకోనీ. మనం ప్రక్కగానిలబడి దేశాన్ని చూసుకొందాం. ఇది కొడగ కార్యం, బాపనయ్యలపని. గద్దెనెక్కడం అంత ఘనకార్యం ఏమీ కాదు.'

బోపణ్ణ వచోహోరణి ఇంక చర్చకు ఎట్టి అవకాశం ఇవ్వలేదు. లక్ష్మీనారాయణయ్య మౌనముద్రాముద్రితుడు: వాళ్ళిద్దరూ వరండాలోకి వచ్చారు.

## 165

వరండాలోంచి వేరేవాళ్ళందరూ బైటికి వెళ్ళిపోయారు. దీక్షితులు, ఉత్తయ్యతక్కమాత్రం వీళ్ళ ఇద్దరికోసం ఎదురుచూస్తూవున్నారు. ప్రేసరు వాళ్ళతో ఔపచారికంగా ఏవో రెండు మాటలు మాట్లాడుతూవున్నాడు.

వాళ్ళు వచ్చినతర్వాత ప్రేసరు వాళ్ళతోమాట్లాడి ముందు కర్తవ్యాన్ని నిర్ధరించు కొన్నారు. బోపణ్ణ తాత్కాలికంగానైనా దేశానికి రక్షకుడుగా నిలబడడం అందరికీ సమ్మత మైనమాట అని లక్ష్మీనారాయణయ్య తెలియజేశారు. తాను దొడ్డవాడు కావడానికి బోపు బైటనుండి మనుషుల్నిరప్పించి, ఇదంతా నాటకం ఆడాడని మాట అనిపించుకొని జీవించడం కంటె చావుమేలు అని బోపణ్ణ ఇంతకూ ఒప్పుకోనేలేదు. ఉత్తయ్యతక్క అదే సరైన మాట అని అతనికి వత్తాసు ఇచ్చారు. ప్రేసరు: 'బోపణ్ణగారి ఉన్నతమూ ఉదాత్తమూనైన ప్రకృతికి ఈ నడవడిక అనుగుణంగా వుంది. ఆయన రక్షకులుగావుంటే బావుంటుందని నాకనిపించినా, మైత్రీభావంతో వారి నిర్ణయాన్ని నేను ఒప్పుకొంటున్నాను' అన్నాడు.

పొన్నప్పగారినిగానీ, లక్ష్మీనారాయణయ్యనుగాని తాత్కాలికంగానైనా దేశరక్షకులుగా వేసేప్రసక్తే రాలేదు. రాజుగారి చెల్లెలుగాని ఆమె పెనిమిటిగాని దేశరక్షకులుకావడం బోపణ్ణ గారి కిష్టంలేదు. లింగరాజుగారికూతురు అనేకారణంగా ఉత్తయ్యతక్క కొంచెం ఆమెవైపు

మొగ్గు చూపించారు. రాజకుమారి దాయాదులైనవారికి తాత్కాలికమైన అధికారం ఇవ్వడం సరికాదు అని ఫ్రేసరుదొర సూచించారు. మిగిలినవారు అంగీకరించారు.

ఇంక మిగిలినమాటలు రాజు దొడ్డప్ప అప్పాజిగారి కుమారుడు ఇప్పుడు రాజు కావడం గురించి అప్పాజిగారిపేరు అందరికీ తెలుసు. అప్పాజి కుమారుడు ఎక్కడవున్నాడు, అనే సంగతి ఎవరికీ తెలియదు. ఫ్రేసరు 'అప్పాజి, మాతోబాటు బెంగుళూరినుంచి నిష్క్రమించి హెబ్బాలివైపువెళ్ళిన పటాలంతోపాటు ఆ పొలిమేరలు తాకారు. అక్కడి గడికాపరులద్వారా గుండుదెబ్బతిని మృతినందారు. కుశాలనగరంనుంచి బైలుదేరేవేళకు మాకు ఈ వార్తవచ్చి చేరింది' అని తెలిపాడు. ఇంక ఈయనగారికుమారుడు ఎవరా అనేది విచారణీయాంశం.

వెంటనే దీక్షితులు 'అప్పాజీగారికుమారుడు సన్న్యాసివేషంలో ఇక్కడ అపరంపర స్వామి అనేపేరితో తిరుగాడుతూవుంటారు. ఆయన అసలుపేరు వీరణ్ణ' అని చెప్పాడు.

మిగిలినవారు ఈ విషయం ఎరగరు. ఇది దృఢపఱచి చెప్పడానికి, అప్పాజి చని పోయాడు. 'అపరంపరస్వామి తాను రాజుకావాలని అడిగితే అప్పుడు ఈమాట పరిశీలించవచ్చు' అని ఫ్రేసరు సూచించాడు. మంత్రులు తలలూపారు.

ఫ్రేసరు 'చివరిమాట: రాజుకు ఓ అన్నగారు వున్నారుట వారు రాజుకావడంగురించి. ఈ అన్న ఎవరు, ఎక్కడ వున్నారు అనే వివరాలు మాకు తెలియవు. నిన్న మావద్దకు మీ ఊరిలోవుండే భగవతి అనే ఆమెవచ్చి ఈవిషయం తనకు తెలుసుననీ, సభలో చెప్తాననీ చెప్పివెళ్లారు. తమరు అందరూ సమ్మతిస్తే సాయంకాల సభ చేసినప్పుడు ఈసంగతి ఏమిటి అని ఆమెగారిని అడగవచ్చు' అన్నాడు.

ఉత్తయ్యతక్క: 'ఈసంగతి మాకూ తెలుసు. కాని మాకుగా మేం చెప్పకూడదని ఒట్టు. ఆ అమ్మ చెప్పినతర్వాత చెబుతాం' అన్నాడు. సాయంవేళకు తిరిగి ఇక్కడ సమావేశం అవుదాం అని అందరూ తమతమ నెలవులకు వెళ్ళిపోయారు.

# 166

ప్రొద్దుటి నిర్ణయాన్ని అనుసరించి తక్కరుప్రముఖులు, శెట్టి యజమానులు, ఊరిజనం, సాయంసభకు సమావేశమయ్యారు. అందరూ తమతమ స్థానాల్లో కూచున్నారు. మంత్రులు. ఫ్రేసరు సకాలంలోవచ్చి తమతమ ఆసనాలపై ఉపవిష్టులైనారు.

ఫ్రేసరు ఉదయం తాము చేసికొన్ననిర్ణయాలు సంగ్రహంగా ఇంగ్లీషులో గుర్తు వ్రాసి కొని దుబాసిద్వారా వాటి అర్థాన్ని కన్నడంలో వ్రాయించారు. వరుసవచ్చి ఓ నిమిషంపాటు

కూర్చొని, తర్వాత లేచి నిలబడ్డాడు. తన ఇంగ్లీషువాక్యాలసారాంశాన్ని హిందుస్తానీలో అందరిఎదుట చెప్పాడు. ఆ తర్వాత దుబాసి ఆ మాటలనే కన్నడంలో సభాసదులకు శ్రుత పఱచాడు.

రాజునుగూర్చిన నిర్ణయం; రాణి రాజకుమారి ఆయనతోబాటు వెళ్ళడం ఖాయం. బోపణ్ణ రక్షకఅధికారాన్ని సమ్మతించకపోవడం; రాజుగారిచెల్లెలు లేక ఆమె పెనిమిటి, లేక వాళ్లిద్దరూ ఆ స్థానంలో వుండతగదని నిర్ణయం; ఇదంతా చదివిచెప్పినతర్వాత ప్రేసరు తిరిగి లేచినిలబడి 'ఇదంతా తమకు సమ్మతమేనని అనుకుంటాను' అన్నాడు.

తక్కరుపెద్ద 'దీనికి మంత్రులందరూ ఒప్పుకొన్నారా ?'

ప్రేసరు: 'ఒప్పుకొనివున్నారు.'

తక్కరుపెద్ద: 'మేమూ అందరం ఒప్పుకొన్నాం' అని, 'ఔను కాదా !' అంటూ కూడావున్న తక్కరులనూ, ఎదురుగావున్న శెట్టిపెద్దలనూ, బైట చేరివున్న ప్రజలను ప్రశ్నించాడు. అంతా అవునంటే అవునన్నారు.

ప్రేసరు: ఇహ మిగిలినవిషయాలు రెండు. మొదటిది రాజుగారి దొడ్డప్ప పిల్లలు వీరణ్ణ గారిని గురించినది. 'అపరంపరస్వామి అనేవారు ఉన్నారా ?' నారాయణదీక్షితులు పెద్దల మధ్య కూర్చున్నవాడు లేచి 'స్వాములు ఉదయం ఇక్కడికి వచ్చివున్నారు. మధ్యాహ్నం వారి బంధువులెవరో హెబ్బాలిలో చనిపోయారంటే అక్కడికి వెళ్ళారు' అని చెప్పాడు.

ప్రేసరు: 'సరి, వారు వచ్చినమీదట వారినిగురించి ఆలోచింపవచ్చు. ఇహ ఇప్పుడు ఇంకోవిషయం తీర్మానించాల్సివుంది. రాజుగారికి ఓ సవతి అన్నగారు ఉన్నారని, మీలోని మహిళ ఒకరు మాకు తెలిపివున్నారు. ఆమెవచ్చి ఆ అన్నఎవరో సభకు తెలుపగోర్తాను. ఆమె ఇక్కడకు వచ్చివున్నారా ?'

చాలాముందేవచ్చి భగవతి ఊరిపెద్దలు కూచొన్నస్థలంలో కొంచెం పెడగా కూచుని వుంది. ప్రేసరు ఇట్లా అనేటప్పటికల్లా అక్కడినుంచిలేచి ముందుకువచ్చి సభలోని పెద్దలకు చేతులుజోడించి 'వస్తున్నాను' అంది.

భగవతి లేచి రావడంచూచి సభలో కొంచెం సంభ్రమం, సంచలనం కలిగాయి. 'ఒరేయి, భగవతమ్మ చూడండ్రా' అని ఒకడు. 'ఈమెకేటి సంబంధమోయి ?' అని ఇంకొక్కడు. 'రాజుగారి సవతిఅన్నను ఈమె ఎక్కడ చూసిందప్పా అని మరొక్కడు. మాట్లాడడం ప్రారంభించారు. గుంపులో గుసగుసలు బైలుదేరాయి.

ప్రేసరు భగవతికి 'తమ మాటేమిటి ? సభకు తెలపండి' అన్నాడు.

భగవతి చాలా గంభీరమైనధ్వనితో 'లింగరాజుగారిబిడ్డ వీరరాజుకంటె పెద్దఆయన ఒకరున్నారు. లింగరాజుగారిసిమ్మట ఆయనే రాజు కావలసివుంది. అన్యాయంగా అది

తప్పింది. ఇప్పుడెల్లాగూ వీరరాజ ప్రభువును రాజ్యాధికారంనుండి తప్పించడం జరుగుతోంది. ఆ స్థానాన్ని ఆయన అన్నగారికిచ్చి వెనకజరిగిన అన్యాయాన్ని సరిదిద్దాలి' అంది.

మంత్రి పొన్నప్ప: 'ఎవరమ్మా ఈ అన్న మే మెవ్వరమూ చూడలేదే?' అన్నారు.

భగవతి: 'లింగరాజగారు మీకు తెలియకుండా సత్యాన్ని మఱుగుపఱిచారు. మంత్రి బసవయ్య ఆయన పెద్దకుమారుడు.'

ఈమాట వినేటప్పటికి సభలో ఒక్క ఉత్తయ్యతక్కతప్ప మిగిలిన అశేషజనం ఆశ్చర్య చకితమైపోయింది. తన కూతురికి ఓ కొడుకు ఉన్నాడని తెలిసిన దీక్షితులకుకూడ ఈవార్త క్రొత్తదే. బసవయ్య ఆ కొడుకు అని అతనికి తెలియదు. బోపణ్ణ, పొన్నప్ప, లక్ష్మీనారాయణయ్యలు 'కుంటి?' 'మంగలాడు' 'బసవయ్య!' అంటూ ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ ఆమె వంక చూశారు. సభలోని అశేషజనం ఇల్లాగే విస్మయావిష్టమైపోయింది. వీరి మాటలన్నీ విని ఫ్రేసరు 'ఇది ఇక్కడిప్రజల కెవ్వరికీ తెలియదల్లే కనిపిస్తోందే. దీనికి ప్రమాణ మేమిటి?' అని అడిగారు.

భగవతి: 'బసవయ్య నా కుమారుడు. ఈవిషయం తెలిసినవారు ఇక్కడ లేకపోలేదు. లింగరాజగారు నన్ను వివాహమాడారు. ఆ పెద్దలకీ విషయమూ తెలుసు. సభలో మీ వెనకాల కూర్చునివున్న దీక్షితులుగారు మా పెత్తండ్రిగారు.'

ఫ్రేసరు, మంత్రులు, అందరూ దీక్షితులవైపు చూపులు ప్రసారించారు. దీక్షితులు లేచి నిలబడి 'ఈమె నా తమ్ముని కూతురు. లింగరాజగారితో కూడి ఈమె జీవించింది. ఈమెకు ఓ కుమారుడు వుండాల్సినమాట నిజం. అతడు బసవయ్య అనేవిషయం తెలియడంమాత్రం ఇప్పుడే' అన్నాడు.

ఫ్రేసరు భగవతివైపుతిరిగి 'బసవయ్య మీ కుమారుడు అనేవిషయం మీ పెత్తండ్రి గారికి తెలియదే. ఇటువంటిమాటను జనం ఎట్లా నమ్ముతారు?' అని ప్రశ్నించారు.

'మా పెత్తండ్రిగారికి ఇటువంటివ్యవహారాలు మనస్సుకు పట్టవు. వారికి ఈసంగతిని సరైనసమయానికి చెబుతాను అని చెప్పాను. ఆ సరైనసమయం ఇప్పుడు వచ్చింది. అయితే ఈసంగతి లోగడే తెలిసినవారు ఉత్తయ్యతక్కగారు ఉన్నారు.'

ఉత్తయ్యతక్క లేచి నిలబడ్డాడు. భగవతిని ఉద్దేశించి 'ఔను బిడ్డా! నువ్వు లింగరాజ గారివద్ద రాణీకంటెమా హెచ్చుగా వుండివున్నావు. ఈ బిడ్డను కన్నావు. కాని ఏంలాభం? పెండ్లి అని మోసగించి నిన్ను వుంచుకున్నాడు. బిడ్డకాలు విఱిచాడు. కుక్క దొడ్డిలోకి విసిరేశాడు. వాటితోబాటు అద్దేపెట్టాడు. దీన్నిచూసిన నాచేత మీ దొడ్డవ్వకు, నీ అంతట నువ్వు ఈమాట చెప్పకూడదు అని చెడ్డ ఒట్టు పెట్టించాడు. నలభై ఏళ్ళు దాటిపోయాయి. ఇంకా ఆ బిడ్డ రాజకావడమా?' అని సందేహాత్మకంగా అన్నాడు;

భగవతి: పెనిమిటి మోసగిస్తే అదది భార్యఅవటం అబద్ధమైపోతుందా? తండ్రి కుమారునికి అన్యాయం చేశాడు. పెద్దలు దాన్ని సరిదిద్దండి.'

బోపణ్ణ: 'అప్పుడే చెప్పాం. అది చాలా తప్పుఅని. ఇప్పుడు మళ్ళీ అంటున్నాం. ఇటువంటిమాట వద్దని. కుంటి రాజుగారి స్వంతమంత్రి. రాజు ఎట్లానడిస్తే అట్లా నడిచేరకం.'

భగవతి: 'ఎందుకండీ 'కుంటి' అని నోరు పారేసుకొంటారు? పుట్టినప్పుడు మీ అందరికిమల్లే వాడూ పుట్టాడు. అన్యాయంగా వాడికాళ్లు విఱిచిపెట్టారుగాని.'

బోపణ్ణ: 'మేం చెప్పదలచుకొన్నది చెప్పాం' అని ప్రేసరువైపు తిరిగి 'బసవయ్య ఏమైనా కావచ్చు. అన్నకావచ్చు లేదా రాజుకు బాబే కావచ్చు. ఆయన్ను మేమెవ్వరం రాజుగా అంగీకరించలేం' అనిచెప్పి సభవైపుతిరిగి 'ఏమి శెట్టిగారూ! ఏమి తక్కరుగారూ!' అని ప్రశ్నించాడు. అందరూ అవునవునని జవాబిచ్చారు.

# 167

భగవతి మళ్ళీ ఏమిచెప్పేదో, ముందుసంభాషణ ఏవిధంగా పెరిగేదోగాని, ఈ మాటలన్నీ చక్కగా దుబాసిద్వారా తెలిసికొనేసమయానికి ఆయనచేతిక్రింద పనిచేసే దళపతి కార్పెంటరు గుర్రంమీద వరండామెట్లదాకా వచ్చాడు. గుర్రందిగి ఆయనకు సైన్యం మర్యాదననుసరించి నమస్కారంచేసి తన భాషలో 'నాల్కునాడు వెళ్ళినపటాలం వెనక్కు తిరిగివస్తోంది. రాజుగారినీ బసవయ్యనూ పిలుచుకొని వస్తోంది' అని నివేదించాడు.

ప్రేసరు: 'అట్లనా! చాలా మంచిపనైంది' అని దుబాసికి ఈసంగతి అందరికీ తెలియజెయ్యండి అని అజ్ఞాపించాడు.

దుబాసి ఈమాటను చెప్పడంతోటే బైటనిలబడ్డ ప్రజానీకంఅంతా 'ఉఘే' అని జయఘోష చేసింది. రాజు, బసవన్న వీరితోవున్న సేనను చూడడానికి రాజభవనం బైటివాకిలి వైపు ముఖం త్రిప్పారు.

కొన్నిక్షణాల్లో ఆసైన్యం కంటపడింది. ముందుప్రక్క తెల్లదళవాయి. వెనక ఇద్దరు రౌతులు, ఒక పల్లకీ, వాళ్ళవెనక నలుగురు రౌతులు, దానితరువాత మరో డోలీ; మిగతా సిపాయీలు వాళ్ళవెనక. తగినంతవేగంగా అవి పురోగమిస్తూవస్తోంది. ఆంగ్లదళవాయి గుర్రందిగి ముందువచ్చినవానివలెనే నమస్కారవిధులు నెరవేర్చి, కర్నలు ప్రేసరుతో 'మన కార్యం సిద్ధించింది. రాజును పిలుచుకొనివస్తున్నాం. కానైతే బసవయ్యగారు గుండువేటు

మూలాన చనిపోయారు అని తెల్పడానికి చింతించుతున్నాను. వెనక పల్లకిలో ఆయన మృత కళేబరాన్ని మోసుకొనివచ్చాం' అన్నాడు.

దుబాసి బోపణ్ణకు ఈమాటలఅర్థాన్ని తెలియజేశాడు. బోపణ్ణ: ఏమంటారు? కుంటి చచ్చిపోయాడా?' అన్నాడు.

ఈమాట భగవతిచెవుల్లో పడింది. ఆమెగుండెలు బ్రద్దలైపోయాయి. ఆమె 'ఏమది?' అని పెద్దపెట్టున అడిచింది. దుబాసి: 'బసవయ్య గుండెపోటుతో చనిపోయారుట' అని గట్టిగా చెప్పాడు.

అప్పటికి దళం సిపాయీలద్వారా సభలోని మనుషులకిందరికీ ఈవార్త తెలిసింది.

తనకుమారుడు చనిపోయాడు. అతనికళేబరం ఓ పల్లకీలోవుంది అని ఓ క్షణంలో భగవతికి తెలిసిపోయింది. ఆమె 'అయ్యో కొడుకా! నిన్ను పోగొట్టుకొన్నానే' అంటూ ఏడుస్తూ ఎద బాదుకొంటూ 'అయ్యో! అయ్యో!' అని ఏడుస్తూ కళేబరం పెట్టివుంచిన పల్లకీవైపు పరుగెత్తిపోయింది. రెండోపల్లకీదగ్గిరవున్న జనానికి అప్పుడే బసవయ్య ఈమెకొడుకు అనే సంగతి తెలిసింది. వాళ్లు ఆమెకు దారి విడిచారు. భగవతి పల్లకీదగ్గిర మోకాళ్ళమీద కూచుని లోపలికి తలచాచి చచ్చిపడివున్న కుమారునిబుగ్గపై చేయిపెట్టి నిమిరింది. 'బిడ్డా! నువ్వు దొర కావాలిఅని ఇదంతా చేశానురా బాబూ! చేసిందంతా వ్యర్థమైపోయిందే' అని దురపిల్లింది.

దుఃఖాలన్నీ పవిత్రమైనవే. అందులోనూ తల్లిదుఃఖం మరింత పునీతమైంది. జంతు జీవితంలోకూడా ఈ ఎఱుక కానవస్తుంది. మనుష్యజీవితంలో ఇది అన్నివైపులా దృగ్గోచర మౌతుంది. చచ్చినవాడు బసవన్నే అయినా, ఆయన తల్లిదుఃఖాన్నిచూసి ప్రజాహృదయం కరిగింది. 'పాపం! కన్నదుఃఖం బాధించకుండావుంటుందా?' అని ప్రతిధ్వనించింది ప్రజా హృదయం.

ప్రొఫేసరు బోపణ్ణతో మాట్లాడి సభ ఇప్పటికి చాలించవచ్చునని నిశ్చయించాడు. తన వెంటనున్న పెద్దలకు ఓ రెండునిమిషాలపాటు వుండండి అనిచెప్పి తాను రాజుగారి పల్లకీదగ్గిరకు వెళ్ళాడు. రాజుకు నమస్కారవిధి సమాచరించి 'దయచేయండి' అని ఆయన్ను పల్లకీ నుంచి క్రిందికి రప్పించాడు.

రాజు దిగి, నిలవలేక ఒకటే కంపించిపోయాడు. పదిరోజులక్రిందటే జబ్బుపడివుండడం ఓ కారణం. ఇప్పటి ఈ గర్వభంగప్రకరణం మరో కారణం. ఇహముందు ఏమిటిగతి? అనేది అన్నింటినీ మించి వల్కరించేకారణం. ఆయన ముఖంమీద చెమటలు దిగజారి పోతున్నాయి. ఆయన క్షీణమైన కంఠస్వరంతో 'నమస్కారం సార్!' అన్నాడు.

ప్రొఫేసరు: 'నమస్కారం దొరా! నేను మాటాడవలసి వచ్చివున్నకర్తవ్యం రుచికర మైందికాదు. దాన్ని నేను నిర్వహించవలసివుంది. అయితే ఆ నిర్వహించడంలో నేను తమ పట్ల ఏవిధమైన కాఠిన్యం ప్రదర్శింపదలచుకోలేదు. తమ పదవికితగిన గౌరవమర్యాదలన్నీ

చెల్లిస్తాను. ఇప్పుడు తమరు తమ విశ్రాంతికక్ష్యకు దయచేయగోరుతాను. నేను తిరిగి తమరిని దర్శిస్తాను' అన్నాడు.

రాజు ఏమీ చెప్పలేదు. ఫ్రేసరు ఆయన్ను పిలుచుకొనిపోయి వరండాలోకి వెళ్ళాడు. అక్కడవున్న కొంతమందిమనుషులు రాజుకు నమస్కరించారు. మిగతావాళ్ళు మెదలకుండా వుండిపోయారు. ఫ్రేసరు రాజువెంట విశ్రాంతికక్ష్య గుమ్మందాకాపోయి, అతన్ని లోపలికి పంపించి ఓ ఆంగ్లదళవాయిని అక్కడ పారా ఇవ్వడానికి నియమించి, వెనక్కు తిరిగి వచ్చాడు. బోపణ్ణతో, ఆయన తోటిమంత్రులతో ఒకటి రెండుమాటలు మాటలాడి 'ఈరోజు సభాకార్యక్రమం ముగిసింది, ఫలితం రేపు ప్రకటిస్తాం' అని ప్రకటించాడు.

తర్వాత మంత్రులతో 'మీ భగవతి అనే ఆమె మా విజయానికి చాలావరకు కారణం. ఆమెకు వాటిల్లినదుఃఖానికి మనం సానుతాపం చూపించాలి. తమరూ దయచేస్తే అవశ్యం మావెంట వుండాలి' అన్నాడు. పెద్దలూ, మంత్రులూ, అందరూ ఆయనవెంట నడిచారు. ఆయన భగవతిదగ్గిరకు వచ్చాడు. వస్తూ దళవాయి జాక్‌సన్‌నుంచి బసవన్న మృతివివరాలు తెలుసుకొన్నాడు

# 168

సభ ముగిసినప్పటికీ అందరూ వెళ్ళిపోలేదు. భగవతి దుఃఖాన్ని చూస్తూ అనేకమంది నిలబడి పోయారు. వీళ్ళల్లో చాలామంది ఆడవాళ్ళు. ఏమీ ఎరుగని పసిపిల్లమొదలు, అన్ని అక్కరలూతీరి అవసానదశ ప్రాప్తిస్తున్న ముసలవ్వవరకూ, చినిగిన చింపిరిగుడ్డలు కట్టుకొని వాడిపోయిన మొగంతోవున్న బిచ్చగత్తెమొదలు నగలూ, చీరెలూ సింగారించుకొన్న ధనవంతుల ఇల్లాండ్రవరకూ, పలు వయస్సులలోని, పలు అంతస్తులకుచెందిన ఆడపిల్లలు అక్కడచేరి తోటి ఆడుదానిదుఃఖానికి తామూ జాలిపడ కరగిపోయి దుఃఖించినవాళ్లే; కంట తడిపెట్టిన వాళ్లే!

ఫ్రేసరు పల్లకీదగ్గిరకువచ్చి తన టోపీనితీసి కళేబరందగ్గిర వంగి స్పృశించి నిలబడి మర్యాద చూపించాడు. భగవతితో 'అమ్మా! తమకు సంభవించివున్న ఈ దుఃఖాన్ని మేమూ పంచుకొంటున్నాం. తమదుఃఖాన్ని ఆపడానికి మాకు ఏమార్గమూ కనబడదు. అయినా, ఈ మీ కుమారునికి తగినరీతిని సంస్కారం జరగాలి, ఆటే ఆలస్యంచేయకుండా ఈవిషయం చూడండి' అన్నాడు.

భగవతి: 'మీరు ఈయన్ను ఇదివరకు కనిపెట్టివుంది చాలు. ఇంకా కావసిందేముంది? మంటిలో పూడ్చిపెట్టడమే కదా? శవాన్ని కుక్కలకు వడవేయండి అనకుండా పూడ్చి పెట్టండి అని ఆజ్ఞాపిస్తే చాలా మేలుచేసినట్లే; నేను ఆవిషయం చూసుకోగలను' అంది.

'చనిపోయిన వారి తల్లిగారు అవడంచేతనే మాకు మీ మాట మన్నింపవగింది. పై పెచ్చు మీరు మా విజయానికి కారణభూతులు. అందుచేత మీరు మా గౌరవానికి మరింత పాత్రలు. తమకుమారుడు మృతినందినమాట నిజం. అయితే మా అధికారి చెబుతున్నారు, ఇది మాచేతినిమించిన పని అయింది. ఈసందర్భంలో మమ్మల్ని మీరు పైరణతో చూడాలి.'

'పైరణ లేకచూస్తాం, మీకు కాబోయే కష్టనష్టా లేమున్నాయి గనక. తమరింక దయ చేయండి. శవం మా వశం చేయండి. అంతే చాలు.'

'అభ్యంతరం లేకపోతే సంస్కారానికి మేము తమతోబాటు వస్తాం.'

'ఈ శవసంస్కారాన్ని మేము ఇక్కడచేయం. మా మందిరందగ్గిర చేస్తాం. తమరు అక్కడికి రావాల్సినపని లేదు.'

'సరేనమ్మా. మీ దుఃఖసమయంలో మిమ్మల్ని అతిక్రమించి అడుగువేయడం తగదు.'

ఫ్రేసరు తన చేతిక్రింద పనిచేసే కాప్టన్ లేహార్డికి 'వెంట పదిమంది మనుష్యుల్ని ఉంచుకో. వీళ్ళకు కావలసినసాయం చెయ్యి' అని ఆజ్ఞాపించాడు. టోపీ ముందుకు పారించి తలవంచి మర్యాద చూపించాడు. కూడావున్న పెద్దలను 'ఇహ మేము వెళ్ళవచ్చుకదూ?' అని అడిగాడు. వారందరూ సరేనన్నారు. ఆయనతోబాటు కైయిదేరి వాళ్లూ వెళ్లిపోయారు. దీక్షితులు ఒక్కడే నిలబడివున్నాడు.

# 169

భగవతి అతనికాళ్ళమీదపడి దొర్లింది. అతని మోకాళ్ళను కౌగిలించుకొని 'ఇదేమిటి నాయనా! ఇట్లా అయిపోయింది? పదవి వచ్చేదశలో శవమైపోయావు?' అని విలపిల్లింది.

దీక్షితులు కన్నీరు కార్చాడు. 'ఓసి తల్లీ! లే. నువ్వు తెలియని ఆడుదానివా? భగవతిని ఉపాసించిన కూతురికి నేను చెప్పాల్సింది వుంటుందా? లే; ముందుసంగతి చూడు' అన్నాడు. వంగి కూతురి బుజాలుపట్టుకొని ఆమెను లేపి నిలబెట్టాడు.

భగవతి లేచి నిలబడ్డది. 'ఇదేమిటి ఇట్లా అయింది' అని ప్రశ్నించింది.

'భగవదిచ్ఛ అంతే.'

'శాస్త్రం అబద్ధమేనా?'

'ఆ సంగతులన్నీ తరువాత విచారిద్దాం. ఇప్పుడు ఈ సంస్కారం నడవనీ.'

'అయ్యో! సంస్కారమే. నేను దీన్ని ఎట్లాచేయడం? ఇక్కడచేస్తే నేను బ్రతికి ప్రాణాలతో వుండలేను. ఆశ్రమం వెనకతట్టు కొండఎక్కి శిఖరంనుంచిపడి చచ్చిపోతాను.'

'సరైన ఆలోచన. నీకు పట్టినగతిచూసి ఆపైన నేనూ కొండశిఖరంనుంచి చచ్చిపోవాలి సిందేనా? ఇద్దరి ఉపాసనలూ సార్థకమవుతాయి.'

భగవతి నివ్వెఱపడి దీక్షితులవైపు చూసింది.

'కొడుకు పోనేపోయాడు. ఇహ ఈ అప్పవుంది ఏం చెయ్యాలి అనుకుంటే కొండ కొమ్ము ఎక్కు, పడు, చచ్చిపో. అప్ప వుండాలిఅంటే పనిముగించి రా, ముఖం చూపించు.'

భగవతి ఈ వాత్సల్యనిర్బంధానికి లొంగిపోయింది. ఏదోవిధంగా చెప్పటానికి వీలుకాని రీతిలో ఆమెదుఃఖాన్ని ఎట్లాగో నిలువరించుకొంది. ఆమె 'సరేనన్నయ్యా! ఆమాట విడిచేయి' అంది.

దీక్షితులు: 'సరి బైలుదేరు. ఎంత పొద్దుపోయినా వచ్చి నాకు కనబడు. ఆలయమండపంలో వుంటాను.'

భగవతి పిల్లవానిశవాన్ని మోయించుకొని నిష్క్రమించింది. దీక్షితులు ఇంటికివచ్చారు. ఇంటిలో పిల్లలందరూ స్నానంచేయండి అని చెప్పారు. తాను ఆలయంముందున్న పుష్కరిణిలో స్నానంచేశాడు. ఆలయంపూజ లన్నింటినీ యథావిధిగానడిపి భగవతిరాకను ప్రతీక్షిస్తూ మండపంలో కూచునివున్నాడు.

ఆరాత్రి వూరంతా బహుశః మెలకువగానే వుండివుంది. కొడగుచరిత్రలో ఓ ముఖ్యమైన సంధిసమయం అది. అర్ధరాత్రి అయిపోయినా, మెలకువతోవున్న పట్టణంమధ్యలో ఓంకారమందిరంలో ఆ అర్ధరాత్రి నిశీథసమయంలో లోకంలో వేరెవరికీ విలువలేకుండాపోయిన ఓ ఆడుదానిప్రాణాలు నిలబెట్టాలనే తహతహతో దీక్షితులు మినుకుమినుకులాడుతూ వున్న దీపంవెలుతురులో ఎదురుతెన్నులుచూస్తూ కూచునివున్నాడు.

రాత్రి రెండుజాముల గంట కొట్టింది. ఈమె ఎందుకు రాలేదు అని దీక్షితులు ఒకటి రెండుసార్లు ఆశంకించాడు. చాల పొద్దుపోయినతరువాత భగవతి వచ్చింది.

'వచ్చాను అణ్ణయ్యా!' అంది. దీక్షితులు ఆమెను దగ్గిరకు రమ్మనమని పిలిచాడు.

'నిద్రపో పాపా! ఓంకారేశ్వరుని స్మరించుకో. ఆయన నామజపంతో దుఃఖం మఱపుకు వస్తుంది' అన్నాడు.

భగవతి మండపంలోని గోడ అరుగుమీద పడుకుంది. 'మీరు పడుకోరా! అణ్ణయ్యా!' అంది. దీక్షితులు: 'పడుంటాను పాపా, జపం కొంచెం మిగిలిపోయింది. దాన్ని పూర్తిచేసుకొంటాను' అన్నాడు.

# 170

సగం వరాయివాళ్ళ మోసంచేత, సగం కావలి అజాగ్రత్తవల్ల శత్రువుకు చెఱలో చిక్కవడ్డ రాజు బసవన్నను చంపినతర్వాత మాదప్ప తను చేయవలసినవని ఏమీ లేదని గ్రహించాడు. 'మీకు అధీనమై నడుచుకొంటాను' అని గెలిచినవారికి మాటఇచ్చి, రాజభవనంలోని పరిచారకబృందాన్నికూడా పిలుచుకొని సాయుధంగా గెలిచిన దండుతోబాటు మడకేరికి వచ్చాడు. రాజభవనం ఆవరణ ముట్టడించివున్న ముద్దప్ప అనుమతినిపొంది, జరిగినసంఘటనలన్నీ నివేదించడానికిగాను రాణి విశ్రాంతికక్ష్యకు వెళ్ళాడు.

రాజు వెఱవడి, వస్తున్నవార్త తెలుసుకొని, రాణి మేడ గవాక్షందగ్గిర నుంచొని విజయవంతమైనసేనలు రావడం చూసింది. రాజు పల్లకీనుండి దిగడం, మొదలైనవి. ఆయనరాక వివరంచూసి ఆయన్ను ఇంటికి పిలుచుకొనిరావడానికిగా క్రిందికి దిగివచ్చింది. భగవతి దుఃఖావేగంతో రోదించడం ఆమెకూ తెలుసు. ఓ పరివారకుణ్ణిపంపించి ఆమె దానికి కారణం తెలుసుకొన్నది. భగవతి తన మామగారి ప్రియురాలు, బసవయ్య రాజకుటుంబంలోనివాడు, అన్న సంగతులు తెలుసుకొని ఆమె విస్తుపోయింది.

ప్రొఫెసరు రాజును పిలిపించి విశ్రాంతికక్ష్యలోకి విడిచిపెట్టి వెనక్కు తిరగగానే రాణి తనకూతురితోకూడా రాజువద్దకు వెళ్ళింది. రాజు తనగదిలో ప్రక్కవఱుపుమీద పరుండి వున్నాడు. రాణి కూతుర్ని పొరప్రక్కమీద కూచోబెట్టి తాను కాళ్ళదగ్గిర కూచుంది.

చెలికత్తె ఒకత్తెవచ్చి 'గురికాడు మాదప్ప చూడాలనుకొంటున్నాడు' అని ఆమెకు విన్నపం చేసింది. రాణి విశ్రామకక్ష్యలోకి వచ్చింది.

మాదప్ప నాల్కనాడు రాజభవనంలోజరిగిన వృత్తాంతమంతా విన్నవించాడు. ఆయన మాటలవల్ల రాణికి బసవన్నను రాజు తానే చంపివుండడం తెలిసింది. 'ఇదేం విధివిలాసమో' అని ఆమెప్రాణం తల్లడిల్లిపోయింది.

దొడ్డవ్వ వచ్చివుండడం తెలుసుకొని రాణి మాదప్పను రాజువద్దనిలిపి తన విశ్రాంతి కక్ష్యకు వచ్చింది. దొడ్డవ్వను స్వాగతించి మొదట రాజు దేహస్థితి కొంచెం బాగానేవుందని అడిగి తెలిసికొంది. ఆపైన 'భగవతి ఎవరు అనుకుంటున్నావు. బసవయ్య ఆమె కొడుకుట, నీకు తెలియదా దొడ్డవ్వా! ఈరహస్యం చెప్పకుండా మాటుపెట్టి నువ్వు మమ్మల్ని ఏమార్చావుకదూ!' అంది.

దొడ్డవ్వ: 'నాతప్పులు వేలాదిగా ఉన్నాయి. అమ్మాజీ! అవన్నీ మీరు పేటక్రిందికినెట్టేసి నా భారం వహించాలి. అన్నీ నాకు తెలిసినసంగతులే. అయితే నోరు విప్పడానికిలేకుండా పోయింది.'

'ఎందుకని?'

'ఒట్టు పెట్టించుకొన్నారు తల్లీ! పెద్దరాజుగారు, ఆరోజే అప్పటికింకా రాజే కారు వారు. ఈ నా చెల్లి, కూతుర్ని కనేనాటికి వీళ్ళిద్దరూ [1]చిలకా గోరింకల్లాగ వుండేవాళ్లు. కుమారు డంటే తండ్రికి ముద్దే. రాణి ఈ కొడుకునికన్నది, దాంతో ఈ పెద్దపిల్లడంటే పడిందికాదు. నా చెల్లెలు దెబ్బలాడింది. పిల్లవాణ్ణితీసుకొని, ఆమెను, పిల్లవానితల్లినీ పొలిమేరలు అవతలికి తరిమేశారు. ఆ పసికూననుతెచ్చి నా చేతికిచ్చారు. 'ఓసేయి దొడ్డవ్వా! తీసికో నీ చెల్లెలి మనుమణ్ణి! చక్కగా సాకు. పిల్లవాడు ఎవరివాడు అని ఎవరన్నా అడిగితే ఎవరికన్నా చెప్పేవు జాగ్రత్త! తనంతటతాను బైటపడి, ఔనా అని అడిగితే నీ నోరు తెరు; వద్దని చెప్ప లేదు. నీకు నువ్వుగా చెప్పడానికి పెదవికూడా కదలించవద్దు. ఒట్టు పెట్టుకో' అన్నారు. పెట్టు కున్నా. ఒక్కటికాదు, మూడు ఒట్లు పెట్టించారు. ఒట్లు చెప్పటానికికూడా సిగ్గవుతుంది. 'ఎగుడుదిగుడు అయిందా, నువ్వూ లేవు, నీ మనమడూ వుండడు' అన్నారు. 'నేను అట్లా కాదంటే పోయిందేమిటి? ఈ దిక్కులేనిబిడ్డను నేను ఎందుకు చంపించాలి అని నోటికి తాళం వేశాను. పెదవులకు దారం కుట్టుకొన్నాను. నా అదృష్టం ఇంచక్కగా వుంది.'

దొడ్డవ్వకళ్ళల్లో అశ్రుబిందువులు. రాణికీ కళ్లు చెమ్మగిల్లాయి.

'నీ ఒట్టు అట్లాగేవుండనీ. దొరపిల్లవాడు నలభైఏళ్లు మంగళాకుగా పెరిగాడు.'

'పెంటకుప్పమీది మిణుగురుపుర్వు. రెక్కలు మెఱుస్తూవుంటాయి. ఎంతమెఱిస్తేనేమి దానిఇల్లు పెంటకుప్పేకదూ! ఎవరిబొనటివ్రాత వాళ్లవి. అనుభవించాలి. ఎవరిమాటైనా అంతేనమ్మా.'

ఓ నిమిషం నిశ్శబ్దంగావుండి రాణి 'ఇదిగో చూడవ్వా! ఆ ఒక్కప్రాణిపోవడంతో రాజుగారికి స్నేహితుడు, సేవకుడు, మంత్రి, ఎవ్వరూలేకుండా పోయినట్లైంది. చేతులూ, కాళ్లూ విరిగినట్లైంది. ఇవ్వాళ మావప్ప దగ్గిరవుంటాడు. రేపు ఎక్కడో ఏదో; మేమే చూసుకోవాల్సివుంటుంది. నువ్వు వాకిలిదగ్గిర వుండు. కనుగలిగి వుండు' అంది.

దొడ్డవ్వ: 'అజ్ఞ అమ్మాజీ!' అని చేతులుముకుళించి నిష్క్రమించింది.

రాణి: 'అట్లాగైతే మనుమడివాళ్ళు నయంగావుండేరీతి కొంచెం కనిపెట్టివుండు' అంది. దొడ్డవ్వ నిలబడి 'చిత్తం అమ్మా' అనిచెప్పి బైటికి వెళ్లిపోయింది.

---

1 చీమబెల్లంలాగా వుండేవాళ్లని మూలం.

# 171

మరునాడు ఉదయం ఫ్రేసరు మంత్రులతో మాట్లాడి రాజగృహానికి ఒంటరిగావచ్చారు. రాజును చూసి అప్పటికి నిర్ణయించుకున్న అన్నివిషయాలు ఆయనకు తెలియజెప్పారు.

వీరరాజు తానే ఇహముందుకూడా రాజుగావుండాలనీ, తాను అన్నివిషయల్లోనూ అంగ్లేయులకు వశవర్తినై వుంటాననీ చెప్పారు. ఫ్రేసరు 'ఇది సాధ్యంకాదు. మహా అయితే రాజుకూతురు భవిష్యత్తులో రాజ్యాధికారానికి రావచ్చు: అదీ గవర్నరు జనరల్‌గారి ఇష్టంపై ఆధారపడివుంటుంది. ప్రస్తుతం రాజు వేలూరికిపోయి అక్కడ ఇంతకుపూర్వం టిప్పు సుల్తాను పిల్లలు వుంటూవచ్చిన ఇంట్లో వుండాల్సివుంటుంది; ఆయన రాణి కూతురు, ఆయన కిష్టమైన ఓ కొద్దిపాటి పరివారం, ఆయనవెంట వేలూరికి వస్తారు. రాజుకు నెలకు ఆరువేల రూపాయలు రాజవేతనం లభిస్తుంది' అని తెలిపాడు.

ఈమాటలను వేటినీ వీరరాజు నిరాకరించేధోరణిలో లేడు.

'తమరు ఈ చోటునుంచి ఎంతశీఘ్రంగా బైలుదేరివెళ్లితే అన్నివిధాలా అంతసౌకర్యంగా వుంటుంది. తమరు ఎప్పుడు బైలుదేరుతారు ?'

'రాజు కానప్పుడు మే మిక్కడ ఓ గడియసేపైనా ఎందుకువుండాలి ? ఇప్పుడే బైలుదేరిపోతాం, పంపించండి.'

'సరే మంచిది. ఈసంగతి రాణీగారికి కబురుచేస్తున్నాను. ఇక్కడినుంచి తాము తీసుకొని పోదలచుకొన్న ధనకనకవస్తు వాహనాదికం, ఏదైనాసరే తాము తీసుకొనిపోవచ్చు. వెంట తీసుకొనిపోయేదాన్ని తీసుకపోతే, మిగిలిందాన్ని వెనకనుంచి పంపిస్తాం.'

'ఈమాటలేవీ మాకు తెలియవు. బసవన్నకు. .'

రాజుకు వాకుకచొప్పున బసవన్నపేరు నాలుకమీదికి వచ్చింది. ఆయన వాక్యాన్ని ముగించనేలేదు. 'ముండమోపిని చంపిపారేశానుగా' అని మనస్సులో వ్యాకులపడి మౌనం వహించాడు. ఈలోపల, ఆయనకు బసవన్న తన్ను పట్టించలేదనీ, బొరంగంమాట భగవతి చెప్పిందనీ, తనకుగాని, బసవన్నకుగాని ఏవిధమైన అపాయం జరగకుండా ఇద్దరినీ పిలిపించి తెప్పించాలిసింది అని తెల్లదొరను వేడుకొన్నదనీ తెలిసింది.

ఫ్రేసరు: 'నిజం. ఈ వివరాలన్నీ ఇతరులు చూసుకుంటారనీ, ఏర్పాట్లన్నీ అయినాక నేను తమకు చెబుతానని ఓమాటచెప్పి రాజు అనుమతిపొంది బైటికి వచ్చేశాడు.

రాజు, రాణి, రాజకుమారి ఊరినుంచి వెళ్లిపోయేసందర్భంలో చేయవలసిన కార్యకలాపాలన్నీ చేయడానికి, బోపణ్ణ సలహామీద లక్ష్మీనారాయణయ్యను వినియోగించారు.

లక్ష్మినారాయణయ్య: నేను ఏమొగంతోపోయి రాణిని చూడగలను? ఇంతకీ ఇందులో నేను చేయాలిసిందిమాత్ర మేముంది? మూడుపాళ్ళు రాణివాసంమాట అయివుంటుందని అను కొని ఇంటికివచ్చి అమ్మతో చెప్పాడు. ఏర్పాటు వివరాలు రాణికి వివరించిచెప్పి, ప్రయాణ సన్నాహంమీద వుండవలసిందని తెలియజేయడానికి మువలవ్వను పంపించాడు.

సావిత్రమ్మ: 'అనిష్టానికి శనీశ్వరం అన్నట్లు, ఈ అపరకర్మకు బోడిముండే పరి యప్పా' అంది. రాజభవనానికివచ్చి గోలపెడుతూ అన్నివిషయాలూ చెప్పింది రాణికి.

గౌరమ్మాజి ఆమె చెప్పినమాటలన్నీ ధైర్యంగా వింది. పరిచారకుల్నిపిలిపించి తన స్వంత వస్త్రాభరణాలనూ, రాజభవనం భండారంలోని వస్త్రాభరణాదికాన్ని స్వతఃపర్యవే క్షించి వదిపెట్టెల్లో నింపించింది. బంగారం కడ్డీలను, నాణ్యాలను నాల్గుపెట్టెలకు సరిపోయే టట్లు సర్దింది. బీదకు బిక్కీకీ, ఇవ్వడానికి వీలుగా కొన్నిబట్టలనూ, సొమ్ములనూ, దేవునికి సమర్పించడానికిగా ఐదురత్నాల్ని, వేయి హొన్నుల్నీ తీసిపెట్టింది.

'మేము సరే బయలుదేరివెళ్లిపోతాం. మా రాజభవనం పరిచారకబృందంమాట ఏమిటి? ఆ వివరంతెలిపితే సంతృప్తిగా ప్రయాణం చేయవచ్చు' అని ఆమె లక్ష్మినారాయణయ్యకు కబురుపెట్టింది. ఆయన ఫ్రేసరు దొరగార్నిచూసి ఈవిషయం మాట్లాడి రాజభవనానికి వచ్చాడు. 'క్రమబద్ధంగా రాజభవనంసేవలో వున్నవాళ్ళను ఎవరినీ మేము విడిచిపెట్టం. వయస్సు మీరిపోయినవారికి ఉపకారవేతనం ఇస్తాం. వయస్సులో వున్నవాళ్ళకు పనులు చూపిస్తాం. లేదా భూములిస్తాం. రాజుగారి ఆశ్రయంలో పెరుగుతూవున్న మహిళావాటికను మాత్రం మేము కనిపెట్టివుండలేము' అనిచెప్పిన ఆయనమాటలను రాణికి విన్నవించాడు.

రాణి పరిచారకులకందరికీ ఈ సంగతి చెప్పింది. దొడ్డవ్వనుపిలిచి 'పరిచారికలలో ఎవ రైనా వెంట రావలసినవా రున్నారేమో రాజుగారిని అడిగి రా' అంది.

దొడ్డవ్వవచ్చి రాజును ప్రశ్నించింది. ఆయన రాజ్యం ధారవోసుకొన్నా, ఈమాటకు ఔదాసీన్యం చూపించలేదు. వేరువేరు అవసరాలకుగా, తనకు పసందైన నలుగురు యువతు లను తమతోబాటు రావి అని ఆయన ఎన్నిక చేశాడు.

దొడ్డవ్వవచ్చి ఈసంగతి రాణికి విన్నవించింది. గౌరమ్మాజి ఏమాత్రం అసంతోషాన్ని వెలిబుచ్చకుండా 'ఈ పిల్లల్ని వెంటరానీ, మిగిలినవాళ్లు ఎంతమంది ఉన్నారో చూసిచెప్పు' అంది. తనకని తెచ్చివుంచుకొన్న చీరెలను ప్రక్కకు వుంచమనిచెప్పి 'ఈ పెట్టెల్ని చిక్కణ్ణ శెట్టిగారిఇంటికి తీసికొనిపొండి. ఆయన వీటికి ఏం వెలకట్టుతారో అన్నిహొన్నులు తెండి' అంది.

రాణిగారిఉద్దేశం తెలిసి చిక్కణ్ణశెట్టి తానే పరుగెత్తుకుంటూ వచ్చాడు. 'అమ్మాజీ తమ స్వంత వస్త్రాభరణాలు, హొన్ను, బంగారం, ఒక్కపిసరైనా వదిలిపెట్టి పోకూడదు.

మహిళావాటికలోని ఆడపిల్లలు దిక్కు దివాణం లేకుండాపోతే నేను కనిపెట్టివుంటాను. ఆ పిల్లలనందర్నీ నా పిల్లలుగా భావిస్తాను' అని రాణిని ప్రార్థించాడు.

రాణి: 'మీరు చాలా గొప్పవారు శెట్టిగారూ! ఇది అబద్ధంకాదు. అనుకొన్నప్పటికీ రాజభవనంచేరిన ఆడపిల్లల అన్నంవసతి చూడడం రాజభవనం బాధ్యత. ఆ బాధ్యత రాజ వంశం ఇంకోరినెత్తిమీద పెట్టరాదు. ఇహముందు ఈ వస్త్రాభరణాలన్నీ మాకు ఏంనికి? రాజకుమారికి కావలసినవాటిని తీసుకొన్నాం. ఈ పిల్లలు మీవాళ్లుఅని అంటున్నారు. వాళ్ళు మావాళ్ళుకూడా. మేము చేసినంతమట్టుకు చేస్తాం. మిగతాదాన్ని మీరూ చేయండి. మహిళా వాటికలోవున్న పడుచుపిల్లలు వీధుల్లో తిరుగాడకూడదు. ఇందులో కొంత పుణ్యం మాకూ రానివ్వండి.'

చిక్కణ్ణశెట్టి వేరేమార్గంతోచక ఈమాటకు ఒప్పుకొన్నాడు. రాణి ఇచ్చిన పెట్టెల్ని పట్టించుకొని వెళ్ళాడు.

ఈ ఏర్పాట్లకన్నింటికీ చాలా ఆలస్యం పట్టేటట్లుగావుందని చూసి పిందరాజు తాను ఆ సాయంకాలమే బైలుదేరివెళ్ళేటట్లూ, రాణీ, కూతురు వెనకనుంచి మరుదినం బైలుదేర వచ్చునని కట్టుచేశాడు. రాణి వెనకనుంచి బైలుదేరివెళ్ళడానికి ఒప్పుకోలేదు. 'ఇంకా చేయాల్సిన పెద్దఏర్పాట్లు ఏమిఉన్నాయి గనక? మేమూ సాయంకాలమే బైలుదేరుతాం' అని జవాబు చెప్పిపంపించింది. ఓంకారేశ్వరుని ప్రత్యేకపూజలు చేయండి అని దీక్షితులకు చెప్పం పించింది. 'సాయంకాలం తమప్రయాణం సాగుతుందనీ, బైలుదేరేవేళకు ఎవరూ గుంపు లుగా గుమికూడరాదని దగ్గిరనున్న మనుషులకు చెప్పివుంచింది.

రాజభవనం సౌఖర్లు, పరిచారకులూ అందరూవచ్చారు. రాణి చరణాలపై వాలారు. ఇటు వంటిపరిస్థితి వచ్చిందే అని విలపిల్లారు. రాణి, కూతుర్ని ప్రక్కన కూచోబెట్టుకొని, ఆమెను కౌగిలించుకొని చక్కగా కూచొని అందరికీ మంచిమాటలుచెప్పి సమాధానపఱచి 'దొర కూతురు ఈమె రాణి అయిరావాలి అని ఈశ్వరుని ప్రార్థించండి' అంది. అందరికీ కూతురి చేతిమీదుగా నాలుగేసి హొన్నులు ఇప్పించింది.

దొడ్డవ్వదగ్గిరకువచ్చి 'మహిళావాటిక బిడ్డలు, తమకీ, రాజాగారికి సాష్టాంగనమస్కా రాలు చెయ్యాలంటున్నారు' అంది.

గౌరమ్మాజి. 'ఎందుకు రాకూడదు? రమ్మనమను దొడ్డవ్వా?' అంది.

వంతులుగా ఆడపిల్లలు వచ్చారు. రాణికి రాజకుమారికి చరణవందనం చేసారు.

రాణినిఉద్దేశించి 'మా నేరాలు వేలాదిన్నీ మఱచిపోండి' అన్నారు. గౌరమ్మాజి: 'రాజా గారికి సేవలుచేసిన మీరంతా మాకు కావలసినవాళ్ళే. మీరేమీ తప్పుచేయలేదు. రాజాగారికి, ఆయనపుత్రికకూ, శుభమగుగాక అని ఆశీర్వదించిపొండి' అంది. కూతురిచేతిమీదుగా వాళ్లకీ నాలుగేసిహొన్నులు ఇప్పించింది.

దొడ్డవ్వ వాళ్లవందరినీ రాజుగారిగదిలోకి పిలుచుకొనిపోయింది. వాళ్లందరూ ఒక్కొక్కరుగా రాజుకు నమస్కరించి గదిబైటికి వచ్చేశారు. రాజు మాట్లాడలేదు. నమస్కరించిన ఒక్కొక్కపిల్లనుచూస్తూ మూకీభావం వహించాడు. ఒకళ్ళిద్దరువచ్చినప్పుడు ఆయననేత్రాలు చెమ్మగిల్లాయి. అందరూ పాదాభివందనంచేసి బైటకు వచ్చేసమయానికి కన్నీరు చెంపమీద ధారగా ప్రవహిస్తూవుంది.

వాళ్ళందరూ రోధిస్తూవున్నారు. దొడ్డవ్వకూడా ఏడ్వకుండా వుండలేకపోయింది. ఆమె వాళ్లతో 'ఇహ వదండి, నేనూ వస్తున్నా' అనిచెప్పి వాళ్లను పంపించివేసింది. రాజువద్దకు వచ్చి 'అమ్మాజీ వీళ్ళకందరికీ తగినఏర్పాట్లు చేశారు. ప్రభువులు చింతించాల్సినపనిలేదు' అంది. వీరరాజు ఆ సంగతి తెలుసునని సైగగా తల త్రిప్పాడు.

'ఆజ్ఞ అయితే నేను ఇక్కడే వుంటాను. గుడి, ప్రాంగణం ఊడుస్తూ రోజులు గడుపుతాను. ముసిలిదాన్ని అయినాను.'

వీరరాజు దానికీ సమ్మతించాడు, దొడ్డవ్వ బైలుదేరి వచ్చేసింది.

దీక్షితులు ఈశ్వరప్రసాదం మధ్యాహ్నవేళది తెచ్చిఇచ్చాడు. గౌరమ్మాజీ దాన్ని తీసికొని మొట్టమొదట రాజుకు, ఆపైన కూతురికిఇచ్చి చివరికి తానూ స్వీకరించింది.

అదేసాయంకాలం మూడుపల్లకీలలో కూచొని, వీరరాజు, గౌరమ్మాజీ, రాజకుమారి మడకేరివిడిచి వేలూరికేసి ప్రయాణమై వెళ్ళారు.

# 172

వీరరాజు మడకేరినుంచి బైలుదేరినవెంటనే ప్రేసరు ఓ ప్రకటన ప్రకటించి కన్నడంలో దాని భావాన్ని డప్పులతో చాటించి చెప్పేటట్లు ఏర్పాట్లు చేసాడు.

'కొడగుదేశీయులు ఇహమీదట వీరరాజేంద్రులవారు తమకు ప్రభువులుగా వుండరాదనీ, తూర్పు ఇండియా కంపెనీవారి ఆంగ్లప్రభుత్వమే ఈ ప్రాంతాన్ని చూసికోవలసివుంటుందనీ, ఏకకంఠంతో వాంఛించడంమూలాన, ఆ రాజుగారు లోగడ పాలిస్తూవున్న ఈ భూభాగాన్ని ఇండియాదేశం గవర్నర్ జనరల్ దొరవారు సంతోషంతో ఘనతకెక్కిన కంపెనీ సర్కారువారి పాలనక్రిందికి తీసుకొన్నారు.

దేశాన్ని ఈ రాజుగారి శాసనంక్రిందికి తిరిగి అప్పగించమనిన్నీ, దేశస్థుల ఆచార వ్యవహారాల్లోగానీ, ధార్మికవిషయాల్లోగానీ, స్వైజోక్యం కలిగించుకోక, అన్నింటినీ గౌరవంతో

చూస్తామనిన్నీ, ప్రజలయోగక్షేమాల్ని అభివృద్ధిపఱచడం తమ కర్తవ్యమనీ, ఈ కర్తవ్యాన్ని ఎల్లప్పుడూ నెరవేరుస్తామనిన్నీ, ఘనతకెక్కిన కంపెనీ సర్కారువారు ఇందుమూలకంగా హామీ ఇస్తున్నారు.

మడకేరి,
7-5-1834.

జె. యస్. ఫ్రేసరు,
లెఫ్టినెంట్ కర్నలు మరియు రాజప్రతినిధి.

ఈ ప్రకటనలోని వాక్యవిన్యాసాన్నిగురించే కర్నలుదొరకూ, కొడగు మంత్రులకూ మధ్య కొంచెం చర్చలు జరిగాయి. భవిష్యత్తులో రాజకుమారికి రాజ్యాన్ని ఇస్తారనిగానీ, ఇవ్వవచ్చుననిగానీ ఓ సూచకవాక్యం ఇందులోవుంటే బావుంటుందని మంత్రుల ఊహ. ఫ్రేసరు 'మీరంతా అపేక్షిస్తే దీనికేమి అభ్యంతరం? ఆమె పెద్దఅయినతర్వాత ఏకమతంగా వాంఛిస్తే దానంతట అదే జరుగుతుంది' అన్నాడు.

లక్ష్మీనారాయణయ్య: 'ఈమాట వ్రాసిపెట్టడం మంచిదికదూ? బోపణ్ణ?' అని అడిగాడు. బోపణ్ణ: 'మనమంతా కావాలంటే వద్దంటానికి వీళ్ళెవరు? ఆ విషయమై చింతించకండి' అని ధైర్యం చెప్పాడు.

కొడగు నూత్నపరిపాలనకై మైసూరుసంస్థానం చీఫ్ కమిషనరే, దీనికీ చీఫ్ కమిషనరు అనీ, తాను ఆయనతర్వాత ప్రత్యేకఅధికారాలు కలిగివున్న కమిషనరుననీ, నేరుగా పరిపాలన సాగించడానికి ఒక సూపరింటెండెంటు అధికారివుంటాడనీ, ఫ్రేసరు తెలియజేశాడు. లెహార్డీ అనే ఆంగ్లదళవాయి, ఇతనితోపాటు వచ్చినవాడు మొదటి సూపరింటెండెంటుగా నియుక్తుడయ్యాడు.

మేగ్‌లింగ్ పాద్రీ సూచనప్రకారం, రాజకుమారికి గౌరమ్మాజికి ఆంగ్లభాషనూ, ఆంగ్ల జీవనక్రమం నేర్పడానికిగాను, ఆమె ఇష్టపడేటట్లైతే క్రైస్తవధర్మం ఔన్నత్యంగురించి బోధపఱచడానికీ, ఒక అధ్యాపకురాలు వెంటవుండడం మంచిదని భావింపబడ్డది. వీరరాజు సమ్మతిపొంది, మద్రాసు గవర్నరుగారి అనుమతిపై లూసి హాకర్ కుమారిని అవనికై నియోగించారు.

వీరరాజుగారి చెల్లెలు దేవమ్మాజికి, ఆమె పుట్టింటివారి హరణంక్రింద వచ్చివున్న ఇల్లూ, భూములూగాక నెలకు రెండువందలయాభై రూపాయలు రాజవేతనం చెల్లుతూ వుండేటట్లు ఏర్పాటు చేయడమైంది. రాజుగారివైన నాల్గు రాజభవనాల్లో, ఓదానిలో ఆయన వుండటానికి ఏర్పాటుచేశారు. చెన్నబసవన్న తాను చేసినసేవకు ఈ ప్రతిఫలం చాలా తక్కువైందని కర్నలుదొరను నిందించాడు. వేతనం మరి అంతైనా వుండాలనీ, రాజభవనాన్ని తనకు ఇచ్చివేయాలనీ అపేక్షించాడు. ఆయనకోరిక సఫలం కాలేదు. దేవమ్మాజి బిడ్డకై

ప్రాణాలు బలి ఇచ్చారని, పోమన్న పెండ్లాముకు ఏటా నాలుగుహొన్నులు వేతనంక్రింద ఇచ్చారు.

ఓంకారేశ్వరుని మందిరం, తలకావేరి, భాగమండలము, లక్ష్మణతీర్థ నదీమూలం. అక్కడి మందిరాలు, అట్టివే ఇతర ధర్మసంస్థలూ - ఈ అన్నింటికీ, అప్పటివరకూ జరుగుతూవస్తున్న సేవలు, కానుకలూ, ఇహమీదటకూడా జరిగేటట్లు కమిషనరు దొరవారు ఓ ప్రత్యేక అజ్ఞాపత్రాన్ని ప్రకటించారు.

భగవతి చేసివున్న సహాయం నెపంగా, కమిషనరు ఆమెకు ఓ పారితోషికం ఇస్తానని చెప్పారు. ఆమె అటువంటిదేమీ తనకు అక్కర్లేదని చెప్పేసింది.

కొన్ని నెలల్లో, కమిషనరు, రైతులు సర్కారుకు ధాన్యం చెల్లించేఏర్పాటు తగినంత అనుకూలంగా లేనందున, వాళ్ళు చెల్లించవలసిన ధాన్యానికివచ్చే హెచ్చువెలను డబ్బుగా చెల్లించడం వీలు అని ఆజ్ఞాపించారు,

కొడగుదేశంలో పశువుల్ని చంపడం నిషిద్ధం అని తెలిసి, ఆయన దానిపై ఓ ప్రకటన వెలువరించారు. కొడగుసీమల్లో, ఆంగ్లేయులేకానీ, లేక ఇతరులేకానీ, ఆహారంనిమిత్తంగా ఆవుల్ని, ఎద్దుల్ని, దూడల్ని చంపరాదు అని ప్రార్థించారు.

# VI

# కథాశేషం

## 173

నాలుగునెలలు గడిచాయి. ఉత్తయ్యతక్క ఓరోజు బోవణ్ణదగ్గిరకువచ్చి 'అంతా కొంచెం దారికి రానీ, ఆపైన మాట ఎత్తుదాం అని ఆగాను తక్కరూ! ఇప్పుడు మీతో ఆ సంగతి చెబుదాం అని వచ్చాను' అన్నాడు.

'చెప్పండి తక్కరూ!'

'రాజుగారు పెద్దవారైనప్పటికీ నా స్నేహితునిబిడ్డ. గద్దె వీడినా ఆయన ఇక్కడనేవుంటే బావుంటుంది. ఆయన ఇక్కడనే వుండాలి అని మీరు అన్నారు. తెల్లవార ఆమాట పట్టించుకోలేదు. మీమాట సరే అన్నాడు; నవ్వాడు; మృదువుగా మాట్లాడాడు. తన ఇష్టానుసారం సాగించాడు. మన మనిషిపోయి వనవాసం చేయడమైంది.'

'ఆమాటకు నాకేమీ బాధలేదు తక్కరూ! గద్దెదిగిన రాజుగారు ఇక్కడనేవుంటే కావలసినవాళ్లు ఏమైనా కుతంత్రం చేయవచ్చు. గిట్టనివాళ్ళు ఆయనమీద చేయిచేసుకోవచ్చు. ఈ అవస్థంతా ఎందుకు? దూరంగా వుండిపోనీ; భోంచేస్తూ వేళకు, సుఖంగా వుంటాడు. కూటికీ గుడ్డకూ కావలసింది ఇచ్చాం.'

'ఇంటిముందుప్రక్క కూచుంటే లింగరాజుగారు ఎక్కడనుంచో, నువ్వు నా స్నేహితుడవు, నాబిడ్డను కాస్త కాపాడలేవా అని అడిగినట్లు అనిపిస్తోంది. నేను ఏం చెయ్యాలి. ప్రజ ఆయన్ను ఒప్పిందికాదు అంటివి. ధ్వని రాణికూతుర్ని జనం ఒప్పుకుందిగా' అని మళ్ళీ వినిపించింది.

'ఏం చేస్తాం తక్కరూ! సగం కుళ్ళినపండు. కుళ్ళినసగం తీసి పారేశాం. మంచిసగం ఉండనీ అన్నాం. నేనుంటే అదీ వుండాలి, అదిపోతే నేనూ పోవాలి అని కూచుంది ఈ మంచిసగం. ఇది వుండాలని కుళ్ళినదాన్నికూడా వుండనీ అనవచ్చా?'

'మాట చక్కగా అల్లావు తక్కరూ! మనస్సుకు తృప్తిగాలేదు. అమ్మాజి కొడగుల కూతురు, కూతురు కొడగుల మనుమరాలు. మారుచెప్పు, వెయ్యిచెప్పు, వాళ్ల ఇక్కడ వుండవలసినవాళ్ళు.'

'ఒప్పుకున్నాను తక్కరూ! ఏం చేద్దాం చెప్పండి.'

'చేస్తాను అని మాట ఇయ్యి. చెబుతాను.'

'దారితప్పి నడవమన్నా నడుస్తా; ఏమిటి మీ ఆలోచన చెప్పండి ?'

'మీ అల్లుడు 'ఉత్త' తమకూతుర్ని పెళ్లాడితే బావుంటుందని రాణిగారి కోరిక. మీరు ఒప్పుకోకనే పోతిరి.'

'వంశం మంచిదికాదు తక్కయ్యా ; అంచేత ఒప్పుకోలేదు.

'వంశం తండ్రినిబట్టేకాదు చూడాల్సింది తక్కయ్యా ; అమ్మనుబట్టికూడాను. తల్లిదాలు బిడ్డకు అంటారు. అందులో ఆడపిల్లవిషయంలో తండ్రికంటె తల్లి ఎక్కువ ముఖ్యం.'

'సరే పోనీ; ఉత్త పిల్లను పెళ్లాడుతానంటే ఆడనీ; చేయించు. నా అడ్డు ఏమీలేదు.'

ఉత్తయ్యతక్క ఈమాటకు చాలా సంతోషపడ్డాడు. బోపణ్ణను నోటినిండా ప్రశం సించాడు. ఈ ఆలోచనకు చిన్న ఉత్తయ్యతక్క సమ్మతిసిపొందడానికి బైలుదేరివెళ్ళాడు.

యువకునికి రాజకుమారిని పెండ్లాడటం ఇష్టమే. కాని మామ వద్దనిచెప్పినపిల్ల; ఇప్పుడు ఈ తాత బలవంతంమీద సరేనని తల తిప్పితే ; తాను వద్దనిచెప్పాలని మామ ఉద్దేశమేమో అని ఆలోచనలో పడ్డాడు. రోజంతా ఆలోచించగా ఆలోచించగా మామవేసే అడ్డుపుల్లకంటె, పిల్ల చక్కందనం అతన్ని మురిపించింది. ఆయన 'బోపణ్ణమామ సరేనంటే నేమా సరే నంటా తాతా' అన్నాడు.

ఈ వ్యవహారం రహస్యంగాచేయాలని వాళ్ల ఉద్దేశంకాదు. బోపణ్ణ తమ ఉద్దేశాన్ని స్థానికాధికారికి తెలిపాడు. ఆయన కమిషనరుకు ఎవేదించాడు. కమిషనరు, 'పరిస్థితిలో ఇటువంటి ముఖ్యమైనమార్పుకు ఇంకా కొంతకాలం వేచివుంటే బాగుంటుంది' అనిమాత్రం చెప్పి, ఉత్తయ్యతక్క, చిన్న ఉత్తయ్య వేలూరికిపోయి ఈవిషయం ప్రస్తావించడానికి అనుమ తించాడు. తోడ్తో ఈ విషయాన్ని మదరాసు గవర్నరుకు, వీరరాజుకూ తెలిపాడు. అప్పుడే లూసీకి ఓ ఉత్తరంవ్రాసి దానిలో 'రాజకుమారి ప్రస్తుతం ఆరంభించివున్న పాఠ్యక్రమం పూర్తిచేసింతర్వాత పెళ్ళిచేసికొంటే ఆమె భవిష్యత్తుకు అనుకూలంగావుంటుందని నా అభి ప్రాయం. ఇట్లాగని రాజుగారితో విన్నవించండి. నా స్వంతఅభిప్రాయం వారినిర్ణయానికి అడ్డు రాగూడదు. అయినప్పటికీ నా అభిప్రాయం వారికితెలిస్తే మంచిదని ఈవిధంగా సూచించడ మైంది' అని తెలియజేసాడు.

# 174

తక్క, యువకుడూ, ఇద్దరూ పోవడమా, తక్క ఒక్కడే వెళ్లడమా, యువకుడు ఒక్కడే వెళ్లడమా అని చర్చించుకొని చివరికి ఇద్దరూ బైలుదేరారు. సకాలంలో వేలూరికి చేరుకొన్నారు. రాణి గౌరమ్మాజిని కలుసుకొన్నారు.

రాణి కన్నీరు కార్చింది. కమిషనరునుండి మొదటే వచ్చివున్నకాగితం రాజునోటివెంట అనరాని మాటలన్నింటినీ అనిపించింది. రాజు తన దురదృష్టానికంతటికీ, బోపణ్ణే కారణమని నిశ్చయించుకొన్నాడు. ఈ పశువు అల్లుడు నా కూతుర్ని పెళ్ళాడుతాడా? అప్పైని, లూసి కమిషనరుగారి స్వంత అభిప్రాయాన్ని రాజుకు నివేదించింది. రాణికీ చెప్పింది; ఏమైనా పుట్టమ్మాజి ఓ రాజపుత్రిక. భారతదేశంలో ఏ గొప్పరాజుగారిఇంటికైనా వెళ్ళదగిన హోదా ఆమెకు ఉంది. ఆమె కొడగు రాజ్యసింహాసనం అధిష్ఠిస్తే ఆమెభర్త ఓ రాజకుమారుడై వుండటం ఎంతో గౌరవప్రతిష్ఠల కనుకూలంగా వుంటుంది. కొడగులోపుట్టి, కొడగులో పెరిగిన ఒక సాధారణయువకుని కివ్వడం ఏమంత మహా ఘనకార్యం చేసినట్లు?

పైపెచ్చు లూసి మేగ్‌లింగ్ పాదిరీ ప్రేరణతో వేరే ఓ ప్రయత్నంలో సహాయకురాలుగా వుంటోంది. రాజకుమారి క్రైస్తవమతం పుచ్చుకుంటె, మొత్తం కొడగుదేశం క్రైస్తవమతాన్ని అవలంబిస్తుంది. ప్రస్తుతం ఈ మనుష్యులు స్వీకరించివున్న వన్యమతాన్ని విడిచిపుచ్చడం శ్రేయస్కరం. 'సింహాసనం తిరిగి ఇస్తాం. క్రైస్తవధర్మం స్వీకరించండి' అని చెప్పడం తప్పుకాదు. ఈ ఆడపిల్లను, ఈమె ప్రజలను, నరకజ్వాలలనుండి ఉద్ధరించి సంరక్షించడం ఈశ్వరునికి ప్రియంకరమైన సేవ. ఈమె ఇప్పుడే పెళ్ళిచేసుకొని కొడగుకు వెళ్లిపోతే, ఈమె క్రైస్తవమతాన్ని అవలంబించే అవకాశాలు తక్కువైపోతాయి.

లూసి హాకర్ మనస్సులో ఇంకో ఊహకూడ గంతులువేస్తోంది. క్యాప్టన్ దొర రాజకుమారిని వివాహమాడితే కొడగు రాజభవనంలోని అనర్ఘ రత్నరాశి తమకు వస్తుంది. క్యాప్టన్ ప్రస్తుతం బదలాయింపబడి ఉత్తర ఇండియాకు వెళ్ళివున్నాడు. అయినప్పటికీ కొడగును స్మరిస్తూ ఒకటి రెండుత్తరాలు వ్రాసివున్నారు.

ఈ అన్నికారణాల సామూహికఫలితంగా ఉత్తయతక్క ప్రయత్నం నిష్ఫలమైంది. వీరరాజు వాళ్ళను చూడను అని చెప్పేశాడు. 'మా కూతురినివచ్చి అడగడానికి ఎంత ధైర్యం ఈ ముష్టిముండాకొడుకులకు? ఇక్కడ అడుగు పెట్టకూడదు. పొమ్మనిచెప్పు' అని పెద్దగా కేకలువేశాడు. రాజకుమారికి ఉత్తయ్యను పెళ్లిచేసుకోవడం ఇష్టమే. కాని తండ్రినికాదని పెండ్లిచేసుకోడం కూడదనిపించింది. గౌరమ్మాజికి ఓ సమస్య ఎదురైంది. కూతురు ఉత్తయ్యను పెండ్లాడితే, ఇహముందు రాణి అయ్యేమాట మఱచిపోవాలి. ప్రభుత్వం తిరిగి

పొందాలిఅంటే ఈ తెల్లవాళ్ళు చెప్పినట్లు నడచుకోవాలి; ఓ సామాన్యసంసారి పత్నిగా జీవించడమా? కొడగు రాణిగా జీవిద్దాం అని ఎదురుచూడడమా? కూతురికి ఈ రెండింట్లో ఏది శ్రేయస్కరం? గౌరమ్మాజీ మనస్సు ఏమీ నిర్ధరించలేకపోయింది. ఏమీ ఇదమిత్థమని చెప్పడానికి వీలుగాని సందర్భంలో, తండ్రిమాట మంచిదని నచ్చచెప్పాలి అనే ఆలోచనలో స్థిరపడిపోయింది ఆమె మనస్సు. ఎట్లాగూ ఆయనమాటమీరి నడచుకోవడం సులభంగాదు.

ఉత్తయ్యతక్క హతాశుడయ్యాడు.

'వచ్చినదారికి నన్ను గట్టక్కర్లేదు రా తమ్ముడూ! పోదాం' అని యువకుని పిలుచుకొని మడకేరికి తిరుగుమొగం పట్టాడు.

# 175

ఉత్తయ్యతక్క, చిన్న ఉత్తయ్య వేలూరికి వచ్చివెళ్లడంచేత కొడగు చీఫ్ కమిషనరూ మదరాసు గవర్నరూ ఒకటి ఆలోచించాల్సివచ్చింది. రాజు మడకేరిలోవుంటే కొత్తఏర్పాట్లను విరోధించేవాళ్ళు ఆయన్ను ఉపయోగించుకొని ఏమైనా గందరగోళం లేవదీయవచ్చుననే శంకతో వాళ్లు ఆయన్ను మడకేరినుంచి వైదొలగించి వేలూరికి తెచ్చారు.

ఈ ముసలాడు, ఈ యువకుడు ఓ విషయం మాట్లాడటానికి ఇక్కడికివచ్చి వెళ్ళారు అని తెలిసింతర్వాత వేలూరు మడకేరినుంచి తగినంతదూరంలో లేదని తేలిపోయింది.

మద్రాసు గవర్నరు రాజుకు 'ఒకేచోటవుండటం తమకు విసగటగా వుండొచ్చు. ఉత్తర దేశాన్ని చూసినట్లౌతుంది. కాశీలో కొంతకాలం ఉండగూడదా?' అని కబురుచేశాడు. అదే సమయంలో గౌరమ్మాజీకి 'కాశీ తమ పుణ్యక్షేత్రం. అక్కడికిపోతే మనస్సుకు మరింత శాంతిగా వుండవచ్చు' అని లూసీద్వారా సలహా చెప్పించాడు.

వీరరాజా గౌరమ్మాజీ ఇద్దరూ ఇందుకు సమ్మతించారు. వేలూరులో ఓ సంవత్సరం వుండి వాళ్లు కాశీకి ప్రయాణమయ్యారు. బైలుదేరేముందు రాణి 'ఎట్లాగూ పుణ్యక్షేత్రానికి వెళ్తున్నాం. రాజకుటుంబపరంగా విశ్వేశ్వరునికి సేవలన్నీ చేయించడానికి దక్షిణదేశ సంప్రదాయం అనుసరించి వాటిని నడపడానికి మన పురోహితులుగారుంటే బావుంటుంది' అని కబురుపెట్టి దీక్షితులుగారిని రప్పించుకొన్నది. మిగతా కుటుంబంతోపాటు ఆయనా కాశీకి వెళ్ళారు.

వాళ్లు కాశీకిపోయిన ఒకటి రెండు నెలల్లో మేగ్‌లింగ్ పాద్రి సలహానుసరించి ఉత్తర హిందూస్థానం క్రైస్తవధర్మ ప్రసారమండలికిచెందిన ప్రముఖులు రాజకుమారికి ఆంగ్లేయుల ఉన్నతసమాజంలోని ఆచారవ్యవహారాలను, రీతినీతుల్ని, క్రైస్తవమతంలోని ప్రత్యేకమైన తత్త్వవిశేషాల్ని బోధించడానికి క్యాప్టన్ దొర అక్క శ్రీమతి లోఘన్ అనే ఆమె నియామకమయ్యేటట్లుగా ఏర్పాటు చేశారు.

రాణి దీక్షితులద్వారా విశ్వేశ్వరసేవను నైరంతర్యంగా జరిపిస్తుంటే, మరోవైపు విదేశీయులు రాజకుమారిమనస్సును క్రైస్తవమతోన్ముఖంగా ఆకర్షిస్తూవచ్చారు.

కొన్నినెలలకు వాళ్ళల్లో ఎవరో రాజుతో 'మీ అమ్మాయి క్రైస్తవధర్మం స్వీకరిస్తే ఆమెగారికి రాజ్యం లభించడం సులభమౌతుంది. రాణిగా వచ్చినామె ప్రజలను బాగా కాపాడుతుందనే విశ్వాసం కంపెనీ సర్కారుకు కలగాలి. కుమారి క్రైస్తవరాలైతే ఈ విశ్వాసం, వేరే కల్పించాలిసిన అవసరం తప్పుతుంది' అని సలహా ఇచ్చారు. రాజు 'ఎందుకు కారాదు. ఈ మతంలోవుండి వొరిగిందేమిటి? ఆ మతం పుచ్చుకుంటే వచ్చే దెబ్బఆ ఏమిటి? ప్రభుత్వం ఆమెకు ఇవ్వనీ క్రైస్తవమతస్థురా లౌతుంది' అన్నాడు.

ఈ సంగతంతా రాణికి తెలిసింది. రాజుకు ఎన్నడూ మతంపై శ్రద్ధలేదు. కాని కూతురి మనస్సు మరోమార్గం పట్టుతోంది అని తెలుసుకొని రాణి చాలా ఖేదపడింది. దీక్షితునితో ఓరోజు 'నాకు ప్రాణం విసిగిపోతోంది అయ్యావారూ! ఇంక వుండకూడదనిపిస్తోంది. విశ్వేశ్వరస్వామి నన్ను తన చరణాలకు జేర్చికొంటే వుండొచ్చు' అంది.

దీక్షితులు ఆమె విసగటకు కారణం ఎరుగు. ఆమెనుగూర్చి ఆయన చాలా దుఃఖించాడు.

'అమ్మాజీ! నేను పెద్దగా తెలిసినవాణ్ణి కాను. కాని పెద్దలవల్ల విన్నవి కొన్నివిషయాలు నాకు తెలుసు. ఏడుజన్మల సుఖంచేతగాని, మూడుజన్మల దుఃఖంచేతగాని జీవుని ఉద్ధారం జరుగుతుందని పెద్దలు అంటారు. కష్టాలు అనుభవించినజీవి త్వరగా ఉద్ధరింపబడతాడు. ఈశ్వరనామం స్మరించుకొంటూ, కష్టాలను ఓర్చుకోవాలి' అన్నాడు సానుతాపంగా.

'కష్టాలపాలుచేసే దేవుణ్ణి పెంచరాదే విఱగడైపోనీ నన్ను అని ప్రార్థిస్తున్నాను అయ్యవారూ!'

దీక్షితులు ఏమీ జవాబు చెప్పలేకపోయాడు. ఆర్తిగూరిన ఆ మాటలకు. ఎటువంటి ఉత్తమజీవి ఎటువంటి ముప్పుల్లో చిక్కువడిపోయింది అని ఆ యజమానురాలికిగా కవితరంతో కరిగి నీరైపోయాడు.

# 176

వర్షాకాలం వెనకపట్టింది. కాశీకిపోయిన రెండో శ్రావణంలో రాణి ఓ మండలంపాటు వ్రత మొకదాన్ని ఆరంభించింది. దినమూ మూడుసార్లు గంగాస్నానం; సంతర్పణ; అన్నదానం; విశ్వేశ్వరునికి అభిషేకం; ఈవిధంగా చాలా కఠినమైన దీక్షబూని సేవలుచేయడం ఆరంభించింది. రాజుకు కూతురికి శుభం కలగజేయి స్వామి అని విశ్వేశ్వరుని నిరంతరం, నిరంతరాయంగా ప్రార్థించింది.

గంగాజలం పవిత్రమైంది. అయినా శ్రావణమాసం ప్రవాహంలో అందులో మునిగిన వారికి ఒక్కొక్క తొందర కలగజేస్తూవుంటుంది. మండలంరోజులు స్నానం చేయడంతో రాణికి ఒంట్లో సుస్తీ ఏర్పడింది. మూడోనాటికి జ్వరం పెట్టేసుకొనివచ్చింది.

దీక్షితులు 'జ్వరంలో వ్రతం చేయాల్సినపనిలేదు. జ్వరం నిలిచిపోనీండి. తిరిగి వ్రతం పట్టవచ్చు' అని రాణిని ప్రార్థించాడు. రాణి ఒప్పుకోలేదు. 'శరీరం అన్నతర్వాత వంటికి ఉష్ణం, తలకు నొప్పి రాకుండావుంటాయా? ఈమాత్రానికి వ్రతం నిలిపేయడమా? ఇహ చేయవలసిందైనా అట్టేలేదు. ఈ కాస్తా ముగించేస్తాను' అంది.

గౌరమ్మాజి మృతిని ఆహ్వానిస్తోందా? ఏమో! అది ఆవిడ అంతర్యానికే తెలియాలి. వేరేవాళ్లు ఏమిచెబుతారు? జ్వరం విషమించింది; వ్రతం ముగిసేనాటికి తీవ్రంగా ప్రకోపించింది. రాణి ఇంక ఈ దేహాన్ని వదిలేసెయ్యాలి అని తెలుసుకొన్నది.

ఆ సాయంకాలం ఆమె కూతుర్ని దగ్గిరకుపిలిచి 'పుట్టవ్వా! నేను నిన్ను విడిచిపోతానేమో అనిపిస్తోంది. నువ్వు ధైర్యంగా వుండాలిసుమా! నువ్వు నావల్ల ఎప్పుడూ చక్కగా నడచుకొన్నావు. అప్పాజిగారికికూడ సంతోషం కలిగేటట్లు నడుచుకోవాలి నాతల్లీ! మంచిదానివి అని నలుగురిచేతా అనిపించుకోవాలి. చక్కగా సుఖంగా జీవించు' అని చెప్పింది. తర్వాత దీక్షితులతో 'నాకేమీ మనస్సులో భయంలేదు అయ్యవారూ! ఈశ్వరుని స్మరిస్తూవున్నాను. ఇక్కడ పని పూర్తిఅయింతర్వాత మీరు ఊరికివెళ్ళండి. ఓంకారమందిరానికని పంచీనిండా హొన్నులు పెట్టివుంచాను. నా మెడలోవున్న కంఠి మీచేతి కప్పగిస్తున్నాను. దీన్ని తీసుకొనిపోయి అక్కడిపూజలు చేస్తూవుండండి. నా అదృష్టంకొద్దీ, ఈశ్వరుడు మిమ్మల్ని ఎల్లప్పుడూ నావద్ద వుంచాడు' అంది.

'ఈ మాటలన్నీ ఎందుకు తల్లీ! తమకు నయమయిపోతుంది. తాము తిరిగీ ఈశ్వరునికి పూజాపురస్కారాలు చేయిస్తారు. తిరిగీ ఓంకారేశ్వరుని దర్శనం చేసుకొంటారు.' అని దీక్షితులు తనకూ నిజంగా లేనిధైర్యం తెచ్చుకొని ఆమెను ఊఱడించాడు.

రాణి ఏమీ మాటాడలేదు. 'ఈ కంఠిమాట ఈ పంచీ హొన్నులమాట రెండో కంటివానికి తెలియనీయకండి. గురికాని పిలవండి' అంది. దీక్షితులు గురికాని రమ్మనమని చెప్పింది,

రాణికి ఆయాసంగావుందని తెలిసి, రాజకుమారి, అధ్యాపకురాలు ఇద్దరూ దగ్గరకు వచ్చారు. రాణి కంఠిమాటా, హొన్నుమాటా లూసీకి చెప్పింది. లూసి చిత్తం అమ్మాజి అనిచెప్పి, మనస్సుకు ఎదో ఆలోచనతట్టి, 'రాజుగారిని ఇక్కడకు రమ్మనమని పిలిచేదా' అని అడిగింది.

'వద్దు నా తల్లీ! వారికి అంతశ్రమ ఇవ్వకూడదు' అంది. నిస్త్రాణతో మెదలకుండా కళ్లు మూసుకొంది.

రాజవైద్యుడు వచ్చాడు. నాడి పట్టుకుని పరీక్షించాడు. దీక్షితునికి చెవిలో 'దేవునిదగ్గిర దీపం వెలిగించండి' అన్నాడు.

ఓ గడియపొద్దుపోయింది. రాణి ప్రాణం మెల్లిమెల్లిగా ఉత్క్రమణం సాగించింది. చాలా సేపు కళ్ళు మూసికొనివున్న ఆమెకళ్ళు తెఱచింది; తలదగ్గిరకూచున్న కూతుర్ని చూసింది. మెల్లని కంఠస్వరంతో 'విశ్వేశ్వరా! ఓంకారా! నన్ను కాపాడు' అంది. మరి మాటాడలేదు.

కళ్లు తెరచివుండగానే ప్రాణం పోయింది. దీక్షితులు రాజకుమారికిచెప్పి రెప్పలు మూయించాడు జ్వరంవేడికి ముఖంమీద వచ్చిన వాడు చివరి ఉసురుతోబాటు మాయమై పోయింది. గౌరమ్మాజి చివరి ముఖముద్ర ఆమె జీవితానికి ప్రతీకంగా ప్రశాంతగంభీరంగా వుంది. మృతిచే ముఖకాంతి తఱిగిపోలేదు. అనన్యాదృశమైన ప్రకృతిభావంతో వైలక్షణ్యంతో కూడిన వినూత్న తేజఃపుంజంతో ఆమె మొగం తేజరిల్లింది.

# 177

విశ్వారాధ్య గురుపీఠానికిచెందిన జంగమవాడిలోని పెద్దలసహాయంతో దీక్షితులు గౌరమ్మాజి ఉత్తరక్రియలన్నీ యథావిధిగా నడిపించి ముగించాడు. స్థానికుడైన తెల్లదొర దగ్గిరకుపోయి రాణి ఆత్మశాంతికోసం తాను వదిక్షేత్రాలకువెళ్ళి దైవసన్నిధిలో పూజలు చేయించాలిసి వుంది. ఇందుకుగాను సాయం చేయాలిసింది అని విన్నవించి, వారినుండి ఓ సహాయపత్రాన్ని పొందాడు. రాణి ఈశ్వరునికని నివేదించివున్న హొన్ను నగలూ, మడకేరి అధికారికి అందేటట్లు చేయాలిసిందని ఆయనకు అప్పగించాడు. ఇంక తాను వెనక్కు వెళ్ళిపోతున్నానని వీరరాజుకుచెప్పి రాజకుమారి ఆజ్ఞపొంది కాశిమంచి బైలుదేరాడు.

దీక్షితులకు రాణి గౌరమ్మాజి అంటే అపారమైనగౌరవం. ఈ పుణ్యాత్మురాలు ఏ యోగ బలంచేత అంతటిసిద్ధిని పొందిందో! అంత్యకాలంలో ఇంతశాంతంగా దైవాన్ని స్మరిస్తూ

స్వేచ్ఛగా ప్రాణాలు వదలాలంటే ఎంత తపస్సు చేసివుండాలి, ఏవిధంగా దైవాన్ని సంతోష పెట్టివుండాలి : ఇటువంటి ఆత్మకు కల్యాణం చేకూరడం చేతిలోపని : దాన్ని ఇవ్వవలసింది అని ఈశ్వరుని కోరాల్సినపని లేదు. అయినప్పటికీ ఈ పవిత్రజీవితాన్ని స్మరిస్తూ, పదిక్షేత్రాలకు వెళ్లి సేవించడం తనకే శుభావహమైనవిషయం. గంగాతీర్థాన్ని వెళ్ళినచోట్ల కన్నింటికి తీసుకొనివెళ్ళి పది సన్నిధుల్లోనూ, రాణిపేరుమీదుగా, వదేసిమంది మనుష్యులకు అన్నదానంచేయడం, ఈ యజమానురాలి స్మృత్యర్థం తాను చేయదగిన చివరిసేవ.

కాశీనుంచి బైలుదేరిన దీక్షితులు ప్రయాగక్షేత్రానికివచ్చి, జాబాలక్షేత్రానికి పయనమై, ఆగ్నేయంగా పూరీ జగన్నాథంచేరి, సింహాచలం, కాళహస్తి, తిరుపతిమార్గంగా కంచికి, అక్కడినుంచి శ్రీరంగం, మధుర తర్వాత రామేశ్వరం, కన్యాకుమారి అక్కడినుంచి తిరువనంతపురం చేరుకున్నాడు. ఈవిధంగా ప్రదక్షిణంగా ప్రయాణంచేసి మలయాళదేశం దాటి వైనాడుచేరి, కొండలెక్కి వీరరాజుపేటమార్గంగా మడకేరికి చేరాడు. ఆయన చేసిన ఈ ప్రయాణం సంవత్సరం ఆరునెలలు పట్టింది.

కాశిలో రాణి చనిపోయినసంగతి మడకేరికి సంవత్సరంక్రిందటనే తెలిసింది. ఆమె దేవునికి సమర్పించివున్న హొన్ను బంగారాన్ని మందిరానికి ఇవ్వవలసిందనీ, కంఠెని సమర్పించాలిసిందనీ కాశీలోని అధికారి మడకేరి అధికారికి కంఠెతోబాటు ఒక ఉత్తరాన్ని పంపించాడు. అదీ అప్పుడే చేరింది. దీక్షితులు, ఊరుచేరగానే ఆయన కుమారుడు ఆయనకు ఈసంగతి చెప్పాడు,

మూడుసంవత్సరాలపాటు దూరంగా నిలిచి, స్మృతిలోమాత్రం సాన్నిధ్యాన్ని ప్రసాదించిన ఓంకారేశ్వరుడు తిరిగి తనచేత పూజాపురస్కారాలు పొందడానికిగా, నిలబడివుండే సరికి దీక్షితులకు ఒక అపూర్వమైన ఆనందానుభూతి కలిగింది. ఆ అనుభూతిలో ఒకటే కొరత.

ఈ సాన్నిధ్యాన్ని అసాధారణమైన భక్తిశ్రద్ధలతో అర్చించే గౌరమ్మాజీ ఇహమీద పూజాపురస్కారాలు జరిగించడమంటూ లేదు. ఓవేళ జరిగిస్తూనేవుందేమో : దేహబంధం నుంచి ముక్తిపొందిన ఆమె పవిత్రాత్మ ఇప్పటివరకూ, ఇక్కడ సంవత్సరంపాటు దైవ సన్నిధిలో అర్చించివుండవచ్చు; అనుభవించివుండవచ్చు.

ఈవిధంగా దీక్షితులు రాణినిగూర్చి స్మరిస్తూ దైవపూజ తిరిగి ఆరంభించాడు. రాణి పేరుమీదుగా సేవలుచేసి సంతర్పణ చేయించాడు. పేదలకు అన్నదానం చేయించాడు.

ఆపైని, రాణి సమర్పించిన నిధినీ, కంఠెనీ, ఇప్పించండి అని అడగడానికి అప్పాజీ లోవణ్ణదగ్గిరకు వెళ్ళాడు.

# 178

ఆ రెండురోజులమధ్య, నారాయణ ఆయనకు అప్పటిదాకా కొడగులో నడిచినవృత్తాంతం అంతా తెలియజేసాడు.

దేశం, మొత్తంమీద రాజుగారిహయాములోకంటె సుఖంగా బ్రదుకుతోంది. ఒకటే కొరత ఏమిటంటే భూస్వాములు భూమిశిస్తు ధాన్యంగాకాక డబ్బుగా చెల్లించాలి అని చేసిన ఆజ్ఞ. నంపాజెనాడులోని గౌడులకు ఇది సరిపోక వాళ్లు క్రొత్తప్రభుత్వాన్ని ప్రతిఘటించి విద్రోహం లేవదీశారు. ఈ సందర్భంచూసి లక్ష్మీనారాయణయ్య తమ్ముడు సూరప్ప, అప్పాజి కొడుకు వీరప్పాజి కొడగుకు రాజుకావలసివుంది అనే ఉద్యమం లేవదీసి మరింతమంది ప్రజలను కూడగట్టుకొని శాసనాన్ని ధిక్కరించాడు.

క్రొత్తప్రభుత్వం కొడగులసాయాన్నిపొంది, ఈ విద్రోహాన్ని అణచివేసింది. వీరప్పాజి అనే ఆయిన అపరంపరస్వామి అనే సన్యాసేనని తెలుసుకొని ఆంగ్లకమిషనరు ఓ విచారణ నడిపించినట్లు నాటకమాడి, సూరప్పను దేశంలోంచి నిష్కాసితుని జేశాడు. వీరప్పాజీని బెంగుళూరు కారాగారంలో పడేశాడు.

లక్ష్మీనారాయణయ్య తన తమ్ముడు సూరప్పకు సాయపడుతున్నాడనే అనుమానంపై కమిషనరు దొరవారు ఆయన్ను బెంగుళూరికి రప్పించి 'మీరింక మడకేరికి వెళ్ళగూడదు. ఇక్కడనే మా ఎదురుగ్గా వుండాలి' అని ఆజ్ఞాపించాడు. 'ఇది అన్యాయం' అని బోపణ్ణ కమిషనరుగారికి చెప్పాడు. కమిషనరు లక్ష్మీనారాయణయ్యను, నిర్బంధంనుంచి విడుదల చేసేవాడేమోకాని లక్ష్మీనారాయణయ్య విడుదల కోరలేదు. 'పోనీ, బోపణ్ణ! మడకేరి ఏమిటి? బెంగుళూరు ఏమిటి? రెండూ ఒకటే. ఇప్పుడు నా మనస్సుకు మడకేరి సుఖంగా లేదు. బెంగుళూరులోనే కాలక్షేపం చేస్తాను' అన్నాడు.

ఆయన తమ్ముడుకుమారుడు మడకేరిలోనే వుండిపోయాడు. శాసనం దానికి అడ్డు చెప్ప లేదు. సావిత్రమ్మ 'పుట్టినవూరు, పెరిగినవూరు; ఇహ మిగిలిన నాలుగురోజులకోసం నేను వేరే ఎక్కడికి రావాలి' అని కొడుకుకుచెప్పి మనుమడితోబాటు మడకేరిలోనే వుండి పోయింది.

భగవతి సంవత్సరంపాటు తన మందిరంలోనే గడిపేసింది. అప్పుడప్పుడూ, అడపా దడపా మడకేరికివచ్చి దొడ్డవ్వకు సాయంచేసేది. దేవాలయంలో పూజా పురస్కారాలు చేయించేది. దీక్షితునికుటుంబంలో వాళ్ళను పలకరించి తిరిగి వెళ్ళిపోతూవుండేది. సంవత్సరం తర్వాత ఆమె తిరిగి ఎప్పుడూ రాలేదు. ఎక్కడికి వెళ్ళిందో, ఏమిటో ఎవరికీ తెలియదు.

# 179

దీక్షితులు బోపణ్ణ దగ్గిరకువచ్చి యోగక్షేమాన్ని విచారించి తాను చేయదగ్గ విన్నపం చేశాడు. బోపణ్ణ: 'సరే అయ్యవారూ! దీనికేం కష్టం?' అన్నాడు. కాశీలోని సంగతులన్నీ అడిగి తెలిసికొన్నాడు. రాణి అంతవేగంగా చనిపోయినందుకు బోపణ్ణకు చాలా కష్టంవేసింది, కాని కొడుకును రాజు పిడికిటినుంచి విడిపించడం, తనజన్మకు సార్థకమైనపని అని ఆయన పూర్తిగా విశ్వసించాడు. విదేశీయులు పరిపాలిస్తున్నారని కదూ? అంచేత వచ్చిన చెడ్డఏమిటి? రాజ్యం ఏలేవాడుకూడా ఒక సేవకుడే. ప్రజలు అతన్ని సరిగా నడుచుకొనేటట్లు చూడాలి. తాను ఉన్నన్నాళ్లు ఆవిషయం సరిగ్గా తాను కనిపెట్టివుంటాడు. ముందుసంగతి ముందుతరం వాళ్లు చూసుకోవాలి. దీక్షితులు: 'ఏ ప్రభుత్వమైనా ఒకేరీతిగా ధర్మబద్ధంగా సాగదు. నాలుగు రోజులు సరిగ్గా నడుస్తుంది. ఇంకా నాలుగురోజులకు పంథా చెడుతుంది. మరికొంతకాలానికి ప్రజలు ఏకమై పోరాడి ప్రభుత్వాన్ని ఊడబీకేస్తారు. ఇదంతా ఈశ్వరసంకల్పం గీతలోని 'యదా యదాహి' అనేశ్లోకం చెప్పేసారమే ఇది.

బోపణ్ణ 'ఇదంతా మీకు చాలా నమ్మకమేకదూ? అయ్యవారూ?'

'ఔను మంత్రిగారూ!'

'ఇప్పుడు నేను మంత్రినిగాను అయ్యవారూ! మిగతా తక్కరులతోబాటు నేనూ ఓ 'తక్క'ను. అది అట్లావుండనివ్వండి. ఈ క్రొత్తవాళ్లూ అన్యాయం చేస్తారు. దెబ్బతింటారు అనికదూ మీ రనేది?'

'అవును.'

'వీళ్ళరాజ్యం ఎన్నాళ్లు? అయ్యవారూ? లెక్కవేసి చెబుతారా?'

'అప్పుడే లెక్కకట్టాను. అయితే మీకు దానిలో నమ్మకం లేదుకదూ!'

'నమ్మకం లేదనడంలేదు అయ్యవారూ! తెలిసిచేసేది ఏమీలేదుకదా అని. అంతే. చూడండి, మీరు చెబుతూనేవున్నారు. రాజు మేనల్లుణ్ణి చంపేస్తాడని. అందరమూ అనుకొం టూనే వున్నాం చంపుతాడు, చంపుతాడు అని. మనం అనుకొన్నట్లు ఆయన చంపనే చంపే శాడు. తెలిసిందానివల్ల ఏం చేయగలిగాం చెప్పండి.'

'నిజం తక్కరూ! అయినప్పటికీ, ఓ నిశ్చయానికి వచ్చినదేవుడు మనం ప్రార్థించి కాళ్ల మీదబడితే, తన నిర్ణయాన్ని మార్చుకొంటాడేమోనని మన ఆశ. వేరే చేయడానికేముంది. అనుభవించాల్సిందే. అవశ్యమేవ భోక్తవ్యం... '

'అది సరే ననుకోండి. మనం గుర్రం ఎక్కకూచున్నాం. అది లగాముతో అంకెకు వచ్చి పరుగెత్తుతూవుంటుంది. లగాం వంటిలో పట్టుకొంటే [illegible]

గుర్రం ఇష్టానికి వదిలేయాల్సిందే. అది ఎటుపోతే మనం అటు పోవాల్సివుంటుంది. అప్పుడు రౌతుకు తోచేదల్లా, పడకుండా దాని వెన్నంటుకొని వుండిపోవడమే.'

'మంచిమాట తక్కరూ! అదృష్టమనే లగాం వంటితో పట్టుకొంటే అందరిపాటూ అంతే.'

'కొడగు ఇప్పటి అదృష్టం ఎన్నాళ్లు సాగుతుందంటారు?'

'రెండు విందుసంవత్సరాలు ఈ ప్రభుత్వం నడుస్తుంది. మధ్యలో వాళ్ళే వదిలేయ వచ్చు. మీరు తలచుకుంటే విడిపించవచ్చు. ఏమీ జరక్కుండావుంటే ఓ నూరుసంవత్సరాలు ఢోకా లేదు.'

'అప్పటికైనా ఈ ప్రభుత్వం ఎందుకు పోవాలి?'

'ఏది పోవడానికి ఒక్కటే కారణం. 'నేను' ముందు, అతను 'నాశనం', స్వార్థం పెరుగుతుంది. స్వస్వరూపజ్ఞానం నశిస్తుంది. కార్యం చెడిపోతుంది.'

'సరేనయ్యవారూ! ఇంకా ఏమిటి చెప్పండి.'

వ్యవహారంమాటలు ఒకటిరెండు మాట్లాడి దీక్షితులు బైటికి వచ్చేశాడు.

# 180

పది సంవత్సరాలుపైగా కాలగర్భంలో విలీనమైపోయాయి. కొడగుప్రజలకు తమ మొదటి ప్రభువు వీరరాజు కూతురితోకలిసి ఇంగ్లండుకు వెళ్ళాడనేసమాచారం తెలిసింది. కూతురికి రాజ్యం సంపాదించి ఇచ్చేకోరికతో వీరరాజు విక్టోరియారాణికి విన్నపంచేసి, ఆమెను క్రైస్తవమతంలో చేర్చడానికి పలయు పన్నాహాలు చేశాడు. ఆ రాణి ఆయనప్రార్థన అంగీకరించింది. రాజకుమారి క్రైస్తవమతాన్ని స్వీకరించింది. ఆమెవార్త లేవీ కొడగుకు అప్పట్లో చేరలేదు. మేగ్‌లింగ్ ఆమెకు ప్రభుత్వం ఇప్పించడానికి ప్రయత్నించాడు. ఆయనమాట సాగలేదు. ఒకటి రెండేళ్ళతరువాత రాజకుమారి క్యాప్టన్ దొరను పెళ్ళిచేసికొన్నది. కొన్ని సంవత్సరాలలో ఆమెకు ఓ బిడ్డ జన్మించింది. పిల్లపుట్టిన మూడేళ్ళకు వీరరాజు పరమపదించాడు. ఆతర్వాత రెండేళ్ళలోపుగా రాజకుమారి దివంగతురాలైంది. కొడగు రాజకుటుంబం ఆంగ్లజీవితానికి గుర్తుగా ఎడిత్‌సాతు విక్టోరియా గౌరి క్యాంబెల్ అనే పసికందు తన తండ్రి క్యాప్టన్‌చేతుల్లో ఇంగ్లండులో వుండిపోయింది.

అప్పటికి కొడగు ఆంగ్లేయులచేతిక్రింద ముప్పైఏళ్ళు వృద్ధిపొందింది. కొడగుప్రజల కీ సంఘటన లేవీ పట్టలేదు.

# VII

# ఉపసంహారం

# 181

ఇంకా అరవైసంవత్సరాలు కాలప్రవాహంలో కలిసిపోయినాయి. భారతదేశం ఆంగ్లేయుల పిడికిలిలో బిగిసిపోవడం ప్రారంభించింది. మిత్రుడైన ఉత్తయ్యగారి ఆహ్వానం స్వీకరించి కొందరు మైసూరుమిత్రులు సోదరప్రాంతమైన కొడగు చూసిరావడానికి పోయారు; దాని అందానికి మురిసిపోయినారు. మైసూరులో మనకంటే బుద్ధిలేకుండా పోయింది; కొడగు ప్రజలు తామే దీన్ని తెల్లవాళ్ళచేతికి అరటిపండు ఒలిచి ఇచ్చినట్లు ఎందుకిచ్చారా అని ఆశ్చర్య పోయారు. చెలికాడు ఉత్తయ్యగారు చిక్క వీరరాజులచరిత్ర వినిపించాడు. తమ తాత పడ వాలు ఉత్తయ్య ఆ రాజుకూతురిని పెండ్లాడాలనుకొన్నాడుట. రాజ్యాన్ని తిరిగి తీసుకోవచ్చనే ఆశతో వీరరాజు ఆ పెండ్లితప్పించి, కూతురికి క్రైస్తవమతం ఇప్పించాడుట అని చెప్పాడు. ఆ సందర్భంలో ఆ రాజునుగురించిన అనేక కథలు ప్రజల్లో ప్రచారం పొందినవి వినవచ్చాయి. చిక్క వీరరాజు కథ మనప్రజలకు కవికరం పుట్టించేదిగా వుంది అని వారికి తోచింది. కథ కులు దాన్ని వ్రాయాలని ఆలోచించారు.

మరి నాలుగుసంవత్సరాలు చక్రంలా తిరిగిపోయినాయి. భరతవర్షం స్వాతంత్ర్యచరిత్ర మరోఘట్టం ముందుకుపోయి, ఇంగ్లండులో రౌండుటేబిలు సమావేశం జరిగింది. ఆ సంద ర్భంలో ఈ స్నేహితుల్లో ఒకరు ఇంగ్లండుకు పోయారు.

మనుష్యుడు కథను రచించేటట్లే జీవితంకూడా కథను చిత్రిస్తుంది. బహుశః జీవితం కథను రచిస్తుందికనకనే మనుష్యునిలో కథ రచించేప్రవృత్తి కానవస్తుందేమో. ఇంగ్లండుకు పోయిన కొద్దిరోజుల్లో మిత్రులకీ విషయం అనుభవానికి వచ్చింది. తమ ఈ మిత్రులు కొడగు కథలు వ్రాయదలచివుండటం ఈ పెద్దలకు తెలుసు. అంచేత రాయలు తమ అనుభవాన్ని గురించి అతనికి ఓ ఉత్తరం వ్రాశారు.

'మిత్రుడైన ఉత్తయ్యగారికి:—మనం కొడగుచరిత్రగురించి మాటలాడడం, మీరు కొడగుచరిత్ర ఆధారంచేసికొని ఓ కథ వ్రాయాలని ఉద్దేశించడం, ఇక్కడ ఈ మూడురోజుల్లో నడచిన సంగతులసందర్భంగా తిరిగి మనస్సులో జాగృతమైనాయి. సంగతి ఏమిటి? అని తెలుసుకొంటే మీకు విచిత్రమనిపించవచ్చు. ఈసంగతి మీ కథగా రూపొందితే నేను వద్దని చెప్పజాలను.'

'మూడురోజులక్రిందట ప్రస్తుతం ఈ సమావేశానికి వచ్చివున్న మనం నలుగురం సభా మందిరంనుంచి కొంచెం దూరంలోవున్న ఉపాహారభవనంలో మధ్యాహ్నభోజనానికిగా చేరాం. భోజనంచేస్తూ సభలో నడిచినచర్చను ఆధారంచేసికొని మన మన అభిప్రాయాలు కొంచెం గట్టిగా చెప్పుకొన్నాం. ప్రక్కన ఒకబల్లపై కూచునివున్న ఒక ఆంగ్లమహిళ మనం భోజనం ముగించినసమయంచూసికొని మావద్దకు వచ్చారు. ఆమెధోరణిలో నమస్కరించి 'క్షమించండి' అప్రయత్నంగా మీ మాటలనువిని మీరు మైసూరునుంచి వచ్చినవారని గ్రహించాను. మీతో మాట్లాడాలని కుతూహలంకలిగి వచ్చాను' అన్నారు ఆమెగారు.

'మనమందరమూ నిలబడి ఓ ఆసనంచూపించి కూచుండచేశాం. 'మీకు మైసూరుపై ఆదరాభిమానాలు కలగడానికి కారణం వుండివుండాలి, ఏమో తెలుసుకోవచ్చా' అన్నాం.

'నేను మైసూరునుగురించి కుతూహలపడటానికి కారణం అది కొడగుప్రక్క సంస్థానమని. నాకు సంబంధం కొడగు సంస్థానంతోనే.'

'చాలా సంతోషం. తమకు అక్కడ కాఫీతోటలు మొదలైనవి వుండివుండాలి.'

లేదు. కాని దైవేచ్ఛవుంటే కొడగే మాదై వుండేది.'

'అంటే? దయచేసి వివరించండి.'

'కొడగు చిట్టచివరిరాజు వీరరాజేంద్రులు. ఈ దేశానికివచ్చి దివంగతులైనారు. మీరు ఆ సంగతి ఎరుగుదురుకదూ? ఆమెకూతురు విక్టోరియా గౌరమ్మకూడ ఇక్కడే పరమపదించారు. ఆమె కాప్టెన్ కాంబెల్ అనేవారిని పెండ్లాడారు. ఆమెకు ఒక్కత్తే కూతురు. ఆ కూతురు నేనే. నాపేరు ఎడిత్‌సాతు.'

మాకందరికీ గగుర్పొడిచినట్లైంది. చాలా సంతోషంతో 'మీ దర్శనం మాకో అదృష్టంగా భావిస్తున్నాం' అన్నాం.

'మేం తిరిగి సభకు పోవాల్సివుంది. ఆమెకూ వేరే పనివుంది. అంచేత ఆమె తన నివాసవివరాలున్న తన పరిచయపత్రాన్ని ఇచ్చి, 'విశ్రాంతి దొరికినప్పుడు దయచేసి మా ఇంటికివచ్చి తేనీరు పుచ్చుకోండి, నాకు సంతోషంగావుంటుంది' అన్నారు.

'విశ్రాంతి దొరకడానికి ఇంకా కొన్నాళ్ళు పట్టుతుంది. అంతవరకూ ఇది తెలపకుండా వుండడానికి మనస్సొప్పిందికాదు. అంచేత ఈ ఉత్తరం వ్రాస్తున్నా. ఆమెను కలుసుకొన్న తర్వాత మళ్ళీ ఇంకో కథ.

# 182

పదిహేనురోజులు గడిచినమీదట మరో ఉత్తరం. కథ ముందుకు సాగింది.

ఉత్తరం

ఈరోజు నేనూ రాయరూ శ్రీమతి ఎడిత్ సాతూ గౌరమ్మగారిఇంటికి పోయివున్నాం. ఓ గంట కూర్చొని వీలైనంత సంభాషించి తేనీరుత్రాగి వచ్చేశాం. ఆ సమావేశవివరం ఈ క్రింద ఇస్తున్నా.

రా. రా: 'మీరు మీ తాతగారిని చూడలేకపోయారు.

ఆమె: 'నిజం మా తల్లిగారిని చూసినసంగతైనా మసకమసకగానే వుంది స్మృతిలో. మా తండ్రిగారు కళ్ళుమూశారు అనేసంగతి మీరు పత్రికల్లో చదివి తెలిసికొనివుంటారు. ఆయనగారు పోయేటప్పటికి నాకు సుమారు ఏడేళ్ళు. నాకు నిజంగా జ్ఞాపకమున్నది వారొక్కరి ముఖమే.'

'నిజంగా వారు ఏమైనారు అనేసంగతి ఆ తర్వాతనైనా తెలిసిందా? మీ ఆస్తికై మీ తల్లి రాజకుమారి గౌరమ్మాజగారు పెట్టివుంచిన వస్త్రాభరణాదికం, రత్నాలనీ తీసికొని ఓ ఉదయం బైలుదేరివెళ్ళి నాయన ఏమయ్యారో ఎవరికీ తెలియదు అని పుస్తకాల్లో వ్రాయబడింది.'

'ఔను. మా తండ్రి ఎదోపనిమీద ఫ్రాన్సుకు వెళ్ళవలసివచ్చారు. చాలా అమూల్యములైన నగలూ, నాణ్యాలు ఇక్కడ పెట్టిపోవడం మంచిదికాదని బ్యాంకులో పెట్టాలనుకున్నారు. ఆ ఉదయం అవన్నీతీసుకొని బ్యాంకుకనిచెప్పి వెళ్లారుట. వారు బ్యాంకుకు చేరుకోలేదు. ఆవిషయం మాకు తెలిసేటప్పటికి సాయంత్రమైపోయింది. ఆపైని పోలీసువారికి ఫిర్యాదు చేశాం. పోలీసులు ఏమేమో ప్రయత్నించారు. మా తండ్రిగారు ఎట్లా మాయమైపోయారో నిర్ణయించడానికి వీలులేకుండాపోయింది. మా తండ్రిగారు అమూల్యమైన ఈ వస్తువుల్ని దొంగిలించి పారిపోయారనడం సాధ్యంకాదని వాళ్ళల్లో కొందరు ఊహించారు. మరి కొందరు అంతే అయివుంటుందనుకొన్నారు. నిజానికి అది అసంభవమనిపిస్తుంది.'

'మీ తండ్రిగారు మిమ్మల్ని మోసగించివెళ్ళినవారు కారంటారు మీరు?'

'అవును. వారు అనర్ఘరత్నాలను, బ్యాంకుకు తీసుకొనిపెళ్ళేసంగతి మా సేవకుల్లో ఎవరికో తెలిసి, వారు మా తండ్రిగారిని ఉపాయంగా తనవెంట తీసికొనిపోయి ఏదోచేసి ఆయన్ను ముగించేసివుంటారు అని మా అత్తయ్య ఊహించింది. అప్పటికి నేను చాలా చిన్నదాన్ని. ఇటువంటి సంగతివిగురించి ఆలోచించేజ్ఞానం నాకు లేదు. కాని ప్రస్తుతం ఆలోచిస్తుంటే మా అత్తగారి ఆలోచనే సరైంది అని మాటిమాటికి తోస్తూవుంది.'

సు. రా: 'మీ అత్తగారు అంటే శ్రీమతి లోఫున్.'

ఆమె: 'ఔను.'

రా. రా: 'ఇటువంటివిషయాల్లో మీ ఊహే ముఖ్యం. దొంగిలించారు, కాజేశారు అని చెప్పి మీ తండ్రిగారిని అపకీర్తిపాలుచేయడానికి ఎవరికేమి హక్కు?'

ఆమె: 'సరైనమాట. ఇందుకై నేను మీకు వందనాలు సమర్పిస్తున్నాను.'

సు. రా: 'ఈ ఆస్తిపోవడంతో మీకేమీ ఇబ్బందులు కలగలేదుకదా?'

ఆమె: 'అదేమీ కలగలేదనుకోండి. పోగొట్టుకొన్నది అపారమైన సంపద. అయినప్పటికీ, మా తల్లిగారిపేరుతోవుంది, నాపేరుకు వచ్చిన నిధి, మా తండ్రిగారు మిగిల్చిపోయిన ధనం, తగినంత ఉన్నాయి. అత్త లోఫున్ నన్ను సుఖంగా ఏకష్టమూ లేకుండాపెంచి పెద్దదాన్ని చేసింది.'

సు. రా: 'మీమాటకు అడ్డువచ్చానని అనుకోకుండావుంటే, తమ ప్రస్తుతపరిస్థితి ఏమిటో తెలుసుకోవాలని మా కుతూహలం.'

ఆమె: 'అభ్యంతరమేమిటి? చెబుతాను వినండి. నేను ఇరవైఏళ్ళకు పెళ్ళిచేసికొని నాలుగుఏళ్ళల్లో ఓ బిడ్డను కన్నాను. పంధొమ్మిదివందలపదిలో నా పెనిమిటి దివంగతులైనారు. కార్ల్ యార్డ్లీ వారిపేరు. అంతకుమునుపే నా కుమారునికి మా సైన్యంలో ఓ కమిషన్‌రేంకు దొరికింది. పిల్లవాడు పంధొమ్మిదివందల పదకొండులో, యుద్ధకాలంలో ఆస్ట్రేలియాకు వెళ్ళాడు. అక్కడ ఈమధ్యనే చనిపోయాడు. నేను ఒక్కత్తెనే రోజులు వెళ్ళబుచ్చుతున్నా. దైవేచ్ఛ వచ్చేదాకా కాచుకొనివుంటాను.'

రా. రా: 'దైవేచ్ఛ మెల్లిగా రానీ. మీదగ్గిర మీ తల్లి, మీ అవ్వ, మీ తాతగార్లకు సబంధించిన కాగితాలు వుండాలి కదూ?'

ఆమె: 'కొన్నేమో కాగితాలున్నాయి అని వినివున్నాం. వాటిల్లో కొన్ని నష్టమైపోయినాయి. మిగతావాటిని ప్రభుత్వగ్రంథాలయానికి ఇవ్వడమైంది. అని మా అత్తయ్య చెప్పింది. ఇప్పుడు మా దగ్గిరవున్నదల్లా ఒక్క ఛాయాచిత్రంమాత్రమే. అందులో మా అమ్మ నన్ను ఎత్తికొనివుంది. మా నాయన, మా తాతకూడా అందులో వున్నారు; మా అమ్మ తానే రంగులతో గీచిన మా అమ్మమ్మ చిత్రమొకటి వుంది. వీటిని చూపిస్తాను.'

శ్రీమతి లోపలిగదిలోకివెళ్ళి ఓ ఫొటో, నాలుగుచిత్రాల ఓ సంగ్రహం తెచ్చింది.

ఫొటోలోఉన్న రూపాలు చూశాం. వీరరాజుముఖం తగినంత తేజస్కరంగానూ గంభీరంగానూ వుంది. కూతురు రోగిష్ఠిగావున్నట్లు కనబడింది, అల్లుడు అటూ, ఇటూ గాకుండా మధ్యస్థంగా సాధారణమైన ఆకృతితో వున్నాడు.

దీన్ని చూసినతర్వాత శ్రీమతి మాచేతికి ఓ ఫ్రేము కట్టించినపటాన్ని అందించి 'ఈమె మా అమ్మమ్మ' అంది.

మేము దాన్ని చూశాం. మాకు ఆశ్చర్యం వేసింది. అది ప్రఖ్యాత నటి, ఎలెన్ టెరీ చిత్రం!

మేము ఏమీ మాట్లాడకముందే శ్రీమతి మా ముఖవైఖరినిబట్టి, అది తన అమ్మమ్మ చిత్రం కాదని తెలుసుకొని 'ఎందుకు? నేను మళ్ళీ పొరబాటు పడ్డట్టువున్నా. ఈవిధంగా ప్రతిసారీ, ఎలెన్ టెరీచిత్రాన్ని ఇచ్చి, వెనకనుంచి సరిదిద్దుకొంటూవుంటాను. ఎలెన్ నా గురువుగారి భార్య. చాలా ప్రసిద్ధికెక్కినవ్యక్తి. నాకు ఈ చిత్రాన్ని ఇచ్చింది. మా అమ్మమ్మ చిత్రం ఇది' అనిచెప్పి వేరే ఇంకోచిత్రాన్ని ఇచ్చింది ఆమెగారు.

ఆహా! ఏమి మొగమందము? అవును. ఇది కొడగురాణి ముఖమే.

నేనూ స్నేహితులూ తటాలున లేచాం. పటంలోనిమూర్తికి చేతులుజోడించి నమస్కరించాం. తిరిగికూర్చుని చాలాసేపు దాన్నిచూశాం. ఎంతచూసినా, ఇంకా చూడాలనే అనిపించింది. చాలు అనిపించలేదు,

శ్రీమతి: 'చిత్రం మీకు ఇంత బాగావుండడం, మీ మెచ్చికోలుకురావడం, నాకు చాలా సంతోషం. మా అమ్మమ్మ స్వభావంచేత రాణి అనేది ఆ చిత్రంలో కనబడుతోంది.'

రా. రా: 'అవును తల్లీ! సందేహంలేదు. తన తల్లిచిత్రాన్ని ఇంచక్కగా చిత్రించాలంటే మీ అమ్మగారు చిత్రకళలో ఎంత ప్రవీణురాలై వుండాలి.'

ఆమె: 'ఔను. నైపుణ్యంకంటె ఆమెలో కళనిష ఎక్కువట. ఆ నిష్ఠవల్లనే ఆమెలో కళ వికసించింది అంటారు. మా అత్త అభిప్రాయం అదే.'

సు. రా: 'మీ అత్త తమ్మునిభార్యను చక్కగా చూసుకొనేది అని దీన్నిబట్టి అర్థమౌతోంది.'

ఆమె: 'తమరిఊహ సరైనదే. మా అమ్మగారి జీవితంలో మా అత్తయ్యచూపిన నిశ్చల ప్రేమ, అన్నింటినీమించిన ఆనందకారణంగా పరిణమించింది.

రా. రా: 'దీన్ని మరింత విశదంగా చెప్పాలి.'

ఆమె: 'చెబుతాను వినండి. దీనిలో మాయామర్మం ఏమీలేదు. చివరిరోజుల్లో మా తండ్రికీ, తల్లికీ మధ్య కొంచెం మనస్సులో పొరపు ఏర్పడింది.'

రా. రా: 'ఈసంగతి నేను చదివితెలుసుకున్నా.'

ఆమె: 'ఔను. మా తల్లి చిన్నతనంలో ఉత్తయ్య అనే కొడగయువకున్ని చూసిందట. అయన్ను పెండ్లాడే ప్రస్తావనకూడా వచ్చిందిట. మా తండ్రిగారు అప్పట్లో ఇండియాలో వున్నారు. ఈసంగతి వినివున్నారు. మాతల్లి గర్భిణిగావున్నప్పుడు చాలా కాయిలాపడింది. ప్రసవించేరోజు, ఓవేళ ప్రసవించి తాను చచ్చిపోయి, బిడ్డ బ్రతికితే, మగపిల్లవాడైతే 'ఉత్త' అని ఆడపిల్లయితే 'సాతు' అని పేరుతోబాటు చేర్చండి అని వేడిందట, భార్య వెనకటి తనప్రియుని స్మరిస్తోందని మా తండ్రి కోపగించుకున్నాడుట. మా అత్త అయన్ను నవ్వు మంచి ఒథెల్లోవే అని ఈసడించుకొందిట,

సు. రా: 'మగవాడే ఒథెలో.'

ఆమె: 'దీంతో మా అమ్మ మనస్సులో ఎంతో నొచ్చుకుంది. నేను ఆడపిల్లనై పుట్టడం మంచిపనే అయిందని అనుకొన్నారు. వీటికితోడు ఆమెకు మరో కించకూడా ఉంది.'

మేము ఏమీ మాట్లాడలేదు. ఆమె ఓ క్షణంపోనిచ్చి చెప్పారు.

'తండ్రి కోరడంచేత తానేమో క్రైస్తవమతం పుచ్చుకొన్నది. కాని తనతల్లి భక్తితో ఆరాధించే ఓంకారేశ్వరునికి ఆమెపేరిమీద ఓ వజ్రాన్ని సమర్పించాలని ఆమె కోరిక. ఆమె ఆ వజ్రాన్ని వేరే తీసిపుంచారు. ఇండియాదేశానికి పంపించడం పడలేదు. నేను పంపించకుండా ఆలస్యం చేశాను. మీరైనా పంపించండి అని కళ్ళుమూసేముందు మా తండ్రిగారికి చెప్పారుట.'

రా. రా: 'ఆ వజ్రం ఇంతకీ దేవుడికి ముట్టలేదా?'

ఆమె: 'లేదు. మా తండ్రిగారూ వెనకాముందు చూశారు. తటపటాయించారు. తండ్రిగారు కంటికి మరుగైపోయినరోజు మిగతా సొమ్ములతోబాటు, అదీ చేయిదాటిపోయింది.'

సు. రా: 'దానికిబదులుగా తమరేమైనా పంపించేవుంటారు?'

ఆమె: 'పదహారువేల పౌనుల వెలగలవజ్రం. దానికి దీటుగా నేనేమి ఇవ్వగలను?'

మరో నాలుగుమాటలు లోకాభిరామాయణంగా మాట్లాడి మేము సెలవుదీసికొని వచ్చేశాం.

సంగతీ సమాచారమూ బాగుంది కాదూ? వీరరాజు కూతుర్ని తమ తాతయ్య ఉత్తయ్య అనే పడవాలు పెండ్లాడే అవకాశం ఏర్పడిందట. వీరరాజు వేలూరికి వెళ్ళింతర్వాత ఆ అవకాశం తప్పిపోయింది. తాత ఉత్తయ్య ఆపైని, ఉత్తయ్యతక్క అనే పెద్దమనిషి మనమరాలిని పెళ్ళి చేసుకొన్నాడుట, అని మిత్రుడైన ఉత్తయ్య మనకు చెపుతూవచ్చినమాటలకు ఇక్కడ ప్రమాణం దొరికినట్లైంది.

మీరు కథను ఇప్పుడప్పుడే వ్రాసేటట్లు కనబడడంలేదు. వీలైనంత వేగంగా వ్రాయండి. నేను ఇప్పుడు తెలిసివున్న విశేషాంశాలూ, వివరాలూ అందులో వినియోగపడాలి. మీబుద్ధికి తోచినట్లు దీన్ని వాడుకోండి. కథను మీరు ఎంతవేగంగా వ్రాస్తే అంత తొందరగా దాన్ని నేనుచదివి ఆనందిస్తాను.

*

ఉత్తరం సమాప్తమైంది. పెద్దలఉత్తరంలో గమనించిన అన్నివివరాలూ ఈ కథలో వినియోగానికి వచ్చాయి. ఆ ఉత్తరాన్ని కథలో వాడుకోవడమేకాదు, దానిలోని వాక్యాలతో కథను సమాప్తంచేయడం ఎంతో అందంగా వుంది. పెద్దలవాక్కు వేదవాక్కు అన్నారు అబ్బ! రాయల ఉత్తరం కథకు భరతవాక్యం.